రాధాస్వామీ దయాల్ కీ దయా
రాధాస్వామీ సహాయ్

పరమగురు మహారాజసాహబ్,
పరమగురు సర్కార్ సాహబ్,

మరియు

పరమగురు సాహబ్జీ మహారాజ్

వార్ల

# వచనములు

## ప్రథమ భాగము

రాధాస్వామీ సత్సంగ సభవారి యనుజ్ఞచే హిందీ మూలమునుండి
తెనుగు భాషలోనికి తర్జుమా చేయబడినది.



ప్రకాశకులు

రాధాస్వామీ సత్సంగసభ
దయాల్బాగ్, ఆగ్రా-5

మొదటికూర్పు] 1975 [1000 ప్రతులు

# తొలిపలుకు

పరమగురు మహారాజసాహబ్ వారు, పరమగురు సర్కార్ సాహబ్ వారు, పరమగురుహుజూర్ సాహబ్జీ మహారాజువారును సత్సంగములో సెలవిచ్చుచుండినమహావచనములలో చాలవచనములను కొందఱు సత్సంగులు తమనోటుబుక్కులలోను డయరీలలోను స్వంతమాటలతో వ్రాసుకొనియుండిరి. ఆనోటుబుక్కులు, డయరీలలోనున్న వచనములను తీసి, దయాల్బాగు రాధాస్వామీసత్సంగసభవారు 1966 సంవత్సరము సెప్టెంబరు నెలలో ఉర్దూ భాషలో గ్రంధరూపమున ప్రచురించిరి. ఆవచనములు మొదటలో సత్సంగులచే ఉర్దూ భాషలోనే వ్రాసికొనబడినందున, గ్రంధముకూడ ఉర్దూ భాషలోనే ప్రకటించబడినది. తరువాత, 1969 సం॥రము సెప్టెంబరు నెలలో అధికసంఖ్యాకులైన సత్సంగ సోదరీసోదరుల లాభార్థమై ఆమహావచనములను తిరిగి హిందీభాషలో ప్రచురించిరి.

కొంతకాలముక్రితము రాధాస్వామీ సత్సంగసభవారు ఆంధ్రసోదరీసోదరుల లాభార్థమై యీమహావచనములను తెనుగున తర్జుమాచేసి అచ్చువేయించుట కనుమతించిరి. ఇదివరలో స్మృతిచిహ్నమును తెనిగించిన శ్రీ వు. సత్యనారాయణగారిచే ప్రస్తుతమీ మహావచనములు తెనిగించబడి, తెనుగుభాషలో అచ్చువేయబడుచున్నవి. ఆంధ్రసోదరీసోదరులు వీనివలన సంపూర్ణలాభము నొందగలరని యాశించుచున్నాము.

ఈవచనములు సత్సంగులచే తమస్వంత మాటలతో వ్రాసికొనబడియున్నందున, రాధాస్వామీ సత్సంగ సభవారు వానివిషయములో పూచీ వహించజాలరు.

దయాల్బాగు (ఆగ్రా—5)
1-5-1975

జి. యస్. సహగల్,
ప్రెసిడెంట్
రాధాస్వామీ సత్సంగ సభ



రాధాస్వామీ దయాల్‌కీ దయా
రాధాస్వామీ సహాయ్

# పరమగురు మహరాజ్ సాహబ్‌వారి మహావచనములు

## 1

## తాగుబోతులకు, పరమార్థులకును పోలికలు.

27 ఆగష్టు 1905 :— శరీరమునుండియు, మనస్సునుండియు నెంతయో కొంతదూరమైనప్పుడే ముముక్షుతాభావము గలుగుట ప్రారంభించును. శరీర మనస్సులయందు సంపూర్ణముగా బంధనమున్నంతకాలము చేసిన స్మరణ, ధ్యానములన్నియు శుభకర్మలక్రిందమాత్రమే లెక్కకువచ్చును. వచనముల నెంతకావలెనన్న నంతయెక్కువగా చెప్పుచునే యుండవచ్చునని సెలవిచ్చిరి. ఒక్క కలకత్తా పరిస్థితిని మాత్రమే వర్ణించవలెనన్నను, లేక మఱొక పట్టణము మున్నగువానిని దేనినిగుఱించియైనను సంపూర్ణవివరములు చెప్పవలెనన్నను పుస్తకములమీద పుస్తకములు వ్రాయుచునేపోవచ్చును. ఇక సంతుమహాత్ముల దృష్టికికనుపడెడి ఉత్తమలోక సృష్టినిగుఱించి యన్ననో కొద్దిగనే చెప్ప దలచినను దానికి అంతుపొంతు లేయుండవు. అయినను సంతులు తమ సాధకులకు వారి ప్రవర్తనను సరిగనుంచుకొనుట కుపయుక్తమైన మహావచనములను మాత్రమే సెలవిచ్చుచుందురు.

తాగుబోతులు, పరమార్థులు నొకేవిధముగా ప్రవర్తించుచుందురు. కవులును ఫకీర్లు నందువలననే సత్సంగమును మద్యశాలతో పోల్చి వర్ణించుచుందురు. పదిపండ్రెండుగురు తాగుబోతులు కలిసియున్నపుడు ఒకడొకప్రక్కనపడి దొర్లుచుండును, మఱొక డింకొకప్రక్కన దొర్లుచుండును కదా! సత్సంగములో కూడ పరమార్థు లదేవిధముగా ఊగిసలాడుచుందురు. కొందఱు త్రాగుబోతులు మద్యము కొద్దిగా నోటికి తగిలినంతమాత్రముననే అనేకవిధములుగా ప్రేలుచు, వేషములువేయ నారంభింతురు. ఇదేవిధముగా కొందఱు సత్సంగులు, కొద్దిగా ఆంతర్యాకర్షణ కల్గినంతనే అనేకవిధముల తేలిపోవుచుందురు మఱికొందఱెంత గాఢపరవశత్వములో పడిపోయినను పైకికనుపడనివ్వరు. చాలయెక్కువగా ఆఱితేరిన తాగుబోతులకు తలలుపగిలిపోవులాగున పెద్దపెద్దకజ్జాలు దెబ్బలాటలు జరుగనంతవరకు నెట్లుతృప్తిగలుగదో గాఢపరమార్థులకుకూడ నట్లే విపరీత పరిస్థితులుగల్గి మనస్సునకు పూర్తిగా శృంగభంగమై లోకులందఱు తమ్ముగుఱించి దుర్భాషలాడనంతవరకును సంతుష్టిగలుగదు.

## 2

**సత్సంగులకు మరణాత్పూర్వావస్థలో సాంసారిక వాసనలు ప్రకటమగుటవలన వారి అభ్యాసము విఫలమైనట్లు అనుకొనరాదు—మనస్సుయొక్క పరిశీలన — దాని దోషములు కనిపెట్టుచుండుట — మితభాషిత్వము — పారమార్థిక భావోద్రేకమును లోలోపల నిమిడ్చుకొనుట.**

కొందరు సత్సంగులకు అవసానసమయములోగలిగెడి బాహ్యావస్థనుబట్టి చూడగా వారికి అంతర్యమున దయ లేకుండపోయినట్లు తోచవచ్చును. ఎట్లనగా వారు మాటిమాటికి ప్రాపంచికసంబంధముగల మనుష్యులనెవరినో తల్చుకొనుటయో, లేదా, తమ పూర్వదైవములగు శ్రీరామకృష్ణాదుల నామమును స్మరించుటయో చేయుచుండవచ్చును. కాని ఆవిషయములను లెక్కచెయ్యనక్కఱలేదు. అసలువిషయమేమనగా, మానవుని కాంతర్యమునైపునకు సహజమైన మళ్లింపు ప్రారంభమైనపుడతనియంతఃకరణపైన ముద్రితమై యుండిన ప్రప్రథమ సంస్కారములు ముందు ప్రకటమగుచుండును. స్వప్నావస్థలో బహుస్వల్పముగా ఊర్ధ్వమునకు మళ్లింపగలిగినపుడే గొప్పగొప్పఅభ్యాసులకుకూడా స్వప్నములలో బహుసామాన్యవిషయములే అనగా అట్టివిషయములయొక్క ఛాయలే ప్రకటమగుచుండునుకదా. అట్లుండగా మరణసమయములోగలుగు మళ్లింపునందు కూడా ముందు అంతఃకరణస్థానములో పడియున్నఛాయలే కదా ప్రకటము కావలసినది. జీవుడింకనెక్కువగ లోనికిఆకర్షితుడై ఉత్తమస్థానములపై కెక్కినపుడే ఉత్తమసంస్కారములు ప్రకటమై సత్సంగాభ్యాసములఫలితము నతడు అనుభవించగలడు. నిమ్నతర సంస్కారములు ప్రకటమైనపుడు బాహ్యముగ నందుకుసరియైన ప్రవర్తనయే అతనిశరీరము ప్రకటించును. పూర్వపు ఇష్టదైవముల నామస్మరణ అట్టిసమయములలోచేయుటకు కారణమేమనగా సామాన్యముగా శ్రీరామనారాయణాది నామములను ఆశ్చర్యసూచకముగా తఱుచు ఉచ్చరించుటకు అలవాటుపడి యుండుటచే బాధ లేక వ్యాకులత గల్గినసమయములో పూర్వపుఅలవాటు (association) మూలమున అట్లు ఉచ్చరించుట జరుగును. గొప్పగొప్ప అభ్యాసిపురుషులకుగూడ స్వప్నములలో ఆత్మీయాకర్షణకును ఆధ్యాత్మికానందమునకును సంబంధించిన విషయములు చాలతక్కువగాను. సామాన్యవ్యావహారిక విషయములే యెక్కువ తఱుచుగను కానవచ్చుచుండును కాని, అందుచే, వారిఅభ్యాసము విఫలమైపోయినదని తలంచకూడదు.

మనోఘట్టము దాటి జీవుడు పైకివెళ్లినపుడే తనమనస్సును పరిశీలన చేసికొనగలడు. పరిశీలనయొక్క అర్థమే జడ్జి (Judge) వలె పైనుండి ఒక వస్తువును జాగ్రత్తగా కనిపెట్టి చూచుటకదా. ఆవిధముగా పరిశీలనచేసినపుడే మనస్సుయొక్క దోషములు ప్రకటముకాగలవు. అభ్యాసముచేయగా ఆత్మ అంతఃకరణస్థానముదాటి పైకి కొంతవరకు వెళ్లినపుడే పైనచెప్పినప్రకారము పరిశీలించుట సాధ్యమగును. మనస్సుయొక్క స్థానములోనే యుండినపుడు ఈపని సాధ్యముకాదు. అభ్యాసముద్వారాకూడా స్వభావములో మార్పు నెమ్మదిగ గల్గును. శరీరముయొక్క ఆకారములోను ముఖవైఖరిలోను మార్పు లెట్లు నెమ్మదిమీదనే కలుగుచుండునో, అట్లే స్వభావములోకూడా మార్పు నెమ్మది మీదనే గలుగును.

మితభాషిత్వము మంచిదే. కాని, కేవలము నోటిమాటయొక్కటే తగ్గించిన చాలదు. మనస్సులోకూడ మితభాషిత్వము కావలెను. ఎక్కువగా మాటలుపెంచుటవలన ప్రయోజనము లేదు. పారమార్థికభావోద్రేకము గల్గినపుడు, దానిని జీర్ణించుకొనవలెను. చైతన్యసముద్రమైన పరమపురుషుడు కూడా కొంతవఱకు గుప్తముగా దాగియే యున్నాడుకదా! కావున భగవంతుని రూపాంతరమైన ప్రేమకూడా యెప్పుడును గుప్తముగనే యుండును.

## 3

సత్సంగికి రాధాస్వామీదయాళుని విడిచి యితర ప్రాపంచిక సహాయములకొఱకై తడవులాడుట చాలదూష్యము.

సంతసద్గురువు సత్సంగిపైన కోపము ప్రకటించుట అతని ఆధ్యాత్మికాభివృద్ధికి చాలసహాయకరము. నిజరూపమునకుకూడ అప్రసన్నత కల్గినట్లు సూచన గల్గినచో నింక నెక్కువలాభకరము.

29 ఆగస్టు 1905 :- సత్సంగికి రాధాస్వామీదయాళుని సహాయమును విడిచిపెట్టి ఇతర ప్రాపంచిక సహాయములకొఱకై తడవులాడుట మహాదూష్యము. స్త్రీ యెవరైనను భర్తకు తనపైన కోపము వచ్చినపుడు మఱొక పురుషునివెంట పోవుట యెట్లుండునో ఈపనికూడ నట్టిదే. హిందూదేశములో వేలాదిస్త్రీలు తమ భర్తలచేత వాస్తవముగా దెబ్బలుతినుచుండినను కూడా వారికి తమ భర్తలయెడలగల భక్తిప్రేమలు కొంచెముకూడ మార్పుచెందుట లేదు. ఈవిధముగనే రాధాస్వామీదయాళునియందు ఆధారపడియుండి,

తనకు తెలియకుండగనే తనమనస్సున నితర ప్రాపంచికాశ్రయము లేవైన దాగుకొని యుండిపోయినయెడల వానినన్నిటినిగూడ తొలగించుమని భగవంతునికి ప్రార్థన చేయువాడే యథార్థమైన భక్తుడు. రాధాస్వామీదయాళునిపైన భావము భర్తపైనున్నంత యెక్కువగాలేనిచో, అధమము ఇతర బంధువుల మీదనున్నంతయైన నుండితీరవలయును.

సత్సంగికి కర్మలభార మంతయెక్కువగా లేనప్పుడు, అతడు ఇతరసహాయములకొఱకై తడవులాడినను ఎక్కువప్రమాదములేదు. ఏలననగా, ఆపరిస్థితిలో వానిమూలమున నతనికి సహాయముగల్గులాగున దివ్యేచ్ఛ యుండనేరదు. అందువలన నతడు మఱెన్నడు నట్టిసహాయములవైపునకు తిరిగిచూడడు. కర్మభార మెక్కువగనున్న పరిస్థితిలోనైతే అట్టిసహాయములమీద ఆధారపడనిత్తురు, ఏలననగా మొదటకార్యము కొంతజయప్రదముగా సాగినను, పిమ్మట దెబ్బలు తగులును. కావున నాదెబ్బలే దానికిమందు. ఉదాహరణార్థము ఒక మనిషి శారీరకసౌఖ్యముపొందగోరి పెండ్లి చేసుకొనెననుకొనుడు కాని అటు పిమ్మట భార్యాభర్తలలో కల్లలు గలుగగా భర్తకు తానైనను చనిపోవలయును లేదా తన భార్యయైనను చనిపోవలయునని కోరునంత మహాబాధ గలుగును. ఈవిధమైన దెబ్బలు తగులుచుండుట భగవంతునియొక్క ప్రేమయే అని చెప్పబడును.

“తాడ్ ఔర్ మార్ కరే సోఇ ప్యార్”.

సత్సంగి యేదైన తప్పు చేసినపుడు సద్గురువు అతనిమీద కోపము ప్రకటించుటయే అతనికి శీఘ్రముగ పారమార్థికాభివృద్ధి కలిగించుటకు చాల శ్రేష్ఠమైన విధానము. ఎవరైన నొకతప్పుచేసిన పిమ్మట సద్గురునియెదుట పడినపుడు అతనికి సద్గురువు అప్రసన్నులైనట్లు ప్రకటపర్చినచో నతనిమనస్సున నపుడు కల్గెడి పశ్చాత్తాపము అతనిపైన చాలయుత్కృష్టమైన ప్రభావము కలిగించును. ఆంతర్యమున నిజరూపమునకే అతనిపైన అప్రసన్నత ప్రకటించు దివ్యేచ్ఛ గల్గినచో అతనికి లోలోపలనే భయముగల్గి అతడు చాలత్వరగా సవ్యమార్గములోపడి అతని విశ్వాసముకూడ దృఢపడును. సద్గురువెప్పుడైనను తన బాహ్యరూపముద్వారాను. నిజరూపముద్వారానుకూడా అప్రసన్నతను ప్రకటించినయెడల సద్గురువును గుర్తుపట్టుటకును, వారియందు పూర్ణవిశ్వాసము గల్గుటకును అదియే బహూత్తమ పద్ధతి. ఆ విధముగా కొద్దికాలమైనపిమ్మట నతనిపైన మహాదయ గలుగగలదు.

## 4

**జంతువులలో ఆత్మ యున్నది — ఈమతములో చేరుట కెట్టివానికి సాధ్యమగును.**

క్రిస్టియన్ కాలేజీలో ఒక కెమిస్ట్రి (Chemistry) ప్రొఫెసరుగారును, అక్కడి హెడ్‌మాస్టరుగారును ఒక బి. ఎ. క్లాసు విద్యార్థియును వచ్చిరి. వారిలతో, "ఇంతకుముందు రెండుఉపన్యాసము లిచ్చినప్పుడుకూడా వీరారు వచ్చియుండిరి. ఇప్పు డేదైన ప్రశ్నించదలచినచో ప్రశ్నించవచ్చు"నని సెల విచ్చిరి. మోక్షమనగా జడపదార్థములైన శరీరమనస్సులనుండి వేరైపోవుటయే అని క్లుప్తముగా చెప్పవచ్చును. వానినుండి అట్లు వేఱుపడుట వానికి దెబ్బ తగిలినపుడే సంభవించును. కాని ఆదెబ్బను సహించుట అందఱికిని శక్యముకాదు. ప్రపంచములో పేరుప్రతిష్ఠలను తృణప్రాయముగా విడిచిపెట్టినవాడే రాధా స్వామీమతములోచేరి ఈయభ్యాసము చేయగలడు. తోటివారి నిందాపరి హాసములను సహించవలెను. మద్యమాంసములను పూర్తిగా విడిచిపెట్టవలెను.

జంతువుల కాత్మయున్న దెవరును అంగీకరించకపోవుట చాలఆశ్చర్య కరమైన విషయము. పైగా దానిని సమర్థించుటకై జంతువులకు బుద్ధి లేదు కదా అని చెప్పుదురు. పాశ్చాత్యదేశములలో నొకకుక్క ఒకపోలీసుసార్జెంటు వెంటపడి అదేపనిగా మొఱుగుచు గంతులువేయుచుండెనట. చివరకు ఆపోలీసు సార్జెంటు దానితోకూడా వెళ్ళగా, అది అతని నొక చోరుని యింటిలోనికి తీసికొనిపోయెను. అక్కడ దొంగిలించినసామాను దొరికెను. ఇదేతీరున నొక రామచిలుకను గుఱించికూడా ఒకసంఘటన చెప్పుదురు. ఆచిలుకయొక్క యజ మానుని యింట్లో సామాన్లు లాంగ్మెన్ (Longman) అనుపేరుగలవాడొకడు దొంగిలించుకొనిపోయెను. ఆచిలుకకు ఆదొంగపేరు లాంగ్మెను (Longman) అని తెలుసును. ఆ యజమాని ఇంటికి రాగానే చిలుక లాంగ్మెన్ పేరును ఆయజమానికి తన భావము బోధపడెనువఱకు నదేపనిగా పలుకుచునేయుండెను. యజమాని కపుడు దానిఅర్థము బోధపడి వెంటనే అతడు లాంగ్మెన్‌ను గదిమి బెదిరించగా నతడు సామానులంతయు పట్టుకొనివచ్చి యిచ్చివేసెను. దీనినిబట్టి మానవునికిని జంతువులకును బుద్ధిలో హెచ్చుతగ్గులున్నవికాని మఱొక వ్యత్యా సములేదని తేటపడుచున్నది. అట్టిజ్ఞానముగల పశువులను కేవలము పదార్థ ములుగనే యెంచుట యెంత క్రూరవిషయము !

మద్యము, గంజాయి, భంగు, చరస్ మున్నగు మత్తుపదార్థములన్నియు దూష్యములు కావున వానినన్నింటిని విసర్జించవలెను. మత్తువస్తువులు త్రాగెడివాని కెన్నడు అభ్యాసము సాగదు. మనస్సును హతమార్చుటకు పూర్తిగా పూనుకొన్నవారికే తప్ప మఱెవరికిని రాధాస్వామీ మతములో చేరుటకు సంపూర్ణాధికారము లేదు. ఈమతానుయాయులసంఖ్య నెట్లైనను పెంచవలెనని మా కాసక్తి లేదు. ఈమతములో నెవరైనను చేరవలెనని కోరినపుడు వారి యాసక్తి సరియైనదగునో కాదో తెలిసికొను నిమిత్తమే సంతులు, ఫకీర్లును వారినుండి కొంతవఱకు తప్పించుకొనుచుందురు. ఈ మతస్థులసంఖ్య యెక్కువ పెరిగిపోవునని రాధాస్వామీ మతవిషయములో నితర మతస్థులు బాధపడవలసిన యవసరము లేదు. ఏలననగా తన మనస్సునకు నిప్పంటించుకొనుటకై సిద్ధముగనున్నవారే ఈ మతములో చేరగలరు. ఇతర మతములలోవలె ఈ మతములో చేరినవారికి పెండ్లి చేయుటయు, ఉద్యోగమిప్పించుటయు, పేరుప్రఖ్యాతులను, ధనమును సంపాదించుటయు, మున్నగు ఆశలేమియు కల్పింపబడవు సరికదా, ఈమతములో నట్టివారివద్దనుండి ధనము లాగుకొనబడును. నిశ్చయముగా నిజమైన అధికారియైనవాడు తన కాలమును, ధనమునుకూడ నిందునిమిత్తమై వెచ్చించుట కెంతమాత్రము వెనుదీయడు. ఇందులో చేరువారిసంఖ్య తక్కువగనుండుటకు మఱొక కారణమేమనగా, ఈమతస్థులకు రాజకీయాందోళనలలోను, సంఘసంస్కరణ ప్రచారములలోను పాల్గొనుట కడునిషిద్ధము. పరమార్థి అధికపరిశ్రమ చేయుటవలనను కఠిననియమముల నవలంబించుటవలననే అతనికి పరమార్థమునఁ క్వారత అభివృద్ధి యగునని యీ మతములో నమ్ముదురు.

## 5

గురుస్వరూపము, శబ్దస్వరూపము, ఆత్మస్వరూపము, ఈమూడునొక్కటే. సంతుల సన్నిధానముననున్న ప్రతిపదార్థము శబ్దముతో నిండియుండుటకు కారణము — క్లిష్టపరిస్థితి వచ్చినపుడు సరియైన సలహాలు, పవిత్ర గ్రంథముల నుండికాని, తోటి సత్సంగులనుండికాని, వచ్చుచుండును — సత్సంగులు ఆసలహాలను అనుసరించరు — దానివలన తరువాత బాధపడి బుద్ధి తెచ్చుకొందురు. లోకములోని పద్ధతులకును, పరమార్థుల పద్ధతులకును పూర్తివైషమ్యము.

1. సెప్టెంబరు 1905 :— గురుస్వరూపము, శబ్దస్వరూపము, ఆత్మస్వరూపములం మూడు నొక్కటేయని సామాన్యముగా చెప్పుచుందురు. ఎక్కడ శక్తి

పనిచేయునో అక్కడ శబ్దముకూడ ప్రకటమగుననియు బోధింపబడుచున్నది. ఇదేతీరున, ఆత్మధార యెక్కడవ్యాపించియున్న నక్కడ శబ్దము ప్రకటమగును. కాని సామాన్యజీవుడు అంతఃకరణస్థానములో నుండుచుండును కావున నతడు తన ఆత్మధారయొక్క ఆంతర్యాకర్షణను, తనకు మహావిశేషదుఃఖము, లేక మహావిశేషానందముకాని కలిగినపుడుమాత్రమే కొంతవఱకైనను తెలిసికొన గల్గుచున్నాడు. అట్టిసమయములలో అతని ఆత్మ అంతఃకరణ స్థానము పైపునకు ఎక్కువగా ఉన్ముఖమై ప్రవహించును కావున నతనికి ప్రత్యంగములోను ఒక ఝుంకారధ్వనియు ఒకవిధమైన ముకుళీభావమును ఆంతర్యాకర్షణమును గోచర మగును. కాని ఝుంకారధ్వనిని దాటి ఇంకొక మెట్టు పైకివెళ్లినపుడే శబ్దము ప్రకటముకాగలదు. అప్పుడు తనలోని ప్రత్యంగమునుండియు, ప్రతినాడి నుండియు శబ్దము వెలువడుచున్నట్లనుభవము గలుగును. పిమ్మట నీ స్థూలశరీ రమంతయు శబ్దరూపమైపోవును. శరీరము పృథివీరూపము కావున నా ధ్వని వలన నది యెప్పుడు కంపించిపోవుచుండును. ఆ ధ్వనియే ప్రేమస్వరూపము, శబ్దస్వరూపము, ఆత్మస్వరూపమును. "జిగర్ ఫటా దిల్ టుకడే టుకడే" (అనగా గుండె పగిలి ముక్కలుముక్కలుగా విడిపోయినది) అని సార్‌బచన్ లోని ప్రమాణవచనము నిచ్చట అనువదించిరి. కత్తితో కోతమున్నగు అను భవములన్నియు నీవిధముగనే గలుగును. ఈ శబ్దము ఇంకనెక్కువ తీవ్రరూప ములో ప్రకటమైనపుడు, అది శరీరమునకు బయటనున్న ఆకాశమునుకూడా శబ్దరూపముగా మార్చివేయును. సంతులవద్దనున్న ప్రతిపదార్థమును శబ్దముతో నిండియుండుటకు కారణమిదియే.

స్వామీజీమహారాజువా రెక్కడ విరాజమానమై యుండెడివారో, అక్కడ కూర్చుండి భజనాభ్యాసము చేసినపుడు శబ్దము చాలయెక్కువగా ప్రకటమయ్యెడిది. అయినను బహుమలీమసాత్మలు గలవారికిని, అంతఃకరణ మున్నగు ఘట్టములు చాలస్థూలముగ నున్నవారికిని, అచ్చటకూడా శబ్దము వినబడెడిదికాదు. ఆత్మస్థానమువద్దకు చేరుకొన్నప్పుడే ఇట్టిపరిస్థితి కలుగుచున్న పుడు, ఏ మహాపురుషుని రోమరోమములలో ఉత్తమోత్తమ మండలముల శబ్దము, ఎట్టి ఆటంకములు మధ్యనలేకుండా ప్రవహించుచున్నదో, అట్టి సంత్ సద్గురుని మహిమనుగుఱించి ఇక చెప్పవలసినదేమున్నది.

ఏదైననొక విషమపరిస్థితి మీఁదికివచ్చిపడినపుడు, జీవుడు తన ప్రాపం చిక జ్ఞానానుభవములనుబట్టి, అందుకు ప్రతీకార మేమిచేయవలయునో నిశ్చ

యించుకొనును. ఆ కార్యక్రమము అయుక్తమైనచో, భగవంతునిదివ్యేచ్ఛ, తఱుచుగా అట్టిసమయములలో, ఆపని భక్తిరీతికి విరుద్ధమని తన లోలోపలనే తోచునట్లు చేయును. లేదా, అదేసమయములో పవిత్రగ్రంధమునుండి అవిధముగా బోధించు వచనమేదైనను రావచ్చును, లేదా యెవరైననొక సత్సంగి చేత రాధాస్వామీదయాళురు స్పష్టముగా తెలియునట్లు చెప్పింతురు. అప్పటి కప్పుడతడు కొంత ముందువెనుక లాలోచించికొని ఆందోళనపడును. కాని తిరిగి యీ బోధలన్నింటిని ప్రక్కనబెట్టి తన ప్రాపంచిక బుద్ధినిబట్టి తాను ముందేర్పఱచుకున్న కార్యక్రమమునే చివర కవలంబించును. అతని మనస్సును, ప్రాపంచికబుద్ధియు అప్పటిమట్టు కతని ఆత్మను త్రొక్కి వేయును. కాని, ఆత్మ పూర్తిగ నెట్లు పరాజితమగును? అతని మనస్సైతే కార్యమును తన ఇష్టము వచ్చినట్లు చేసికొనును, కాని ఆత్మ తిర్గితర్వాత కొంతకాలమునకు లోనుండి లేచివచ్చి మనస్సుపైన అధికారము చలాయించును. అప్పుడు కొంతబాధ పశ్చాత్తాపము బయల్దేరును. అప్పుడు అతడు ఏడ్చిఏడ్చి బాధపడును. అయ్యో తనకు ముందు భగవంతుని వద్దనుండి వచ్చిన సూచనలను పాలించియుండినచో స్వార్థదృష్ట్యాకూడా తనకు చాలాబాగుండిపోవునుగదా అని విచారించును. అయితే ఇంకచేయున దేమున్నది! "సహో అబ్ పడే జైసీ ఆయ్" అని సారబచన్‌లో చెప్పినట్లు "మీదకువచ్చిపడిన పిమ్మట నదెట్లున్నను సహించ వలసినదే".

ఇట్టిపరిస్థితులు కొన్నివందలసార్లు వచ్చుచుండును. ఐనను ఆసమయమునకు ప్రాపంచికబుద్ధియే గెలుపొందుచుండును. అతడు నికృష్టాధికారియైనచో ఇతరులబోధలమాట నట్లుంచి, సంతసద్గురువే స్వయముగా సెలవిచ్చిననుగూడా వినడు. తనకన్న తక్కువతరహాగలవారి మాటలయితే అసలే లెక్కచేయడు. భగవంతు డెప్పుడును అట్టివారిద్వారానే చెప్పించుచుండును. ఏదైన మంచి మాట నెంత హీనాతిహీనులు చెప్పినను దానిని హీనదృష్టితో చూడకూడదు.

తినకా కబహూఁ న నిందియే,
పాఁవ్ తలే జో హోయ్ ।
కబహూఁ ఉడి ఆంఖి పడే,
పీర ఘనేరీ హోయ్ ।

అర్థము:- కాలిక్రింద పడియున్న తృణమునుకూడా నెన్నడు దూషించ కుము. అది యెగిరి కంట్లోపడినయెడల, చాలబాధ కలుగచేయును సుమీ.

లోకములోని పద్ధతులన్నియు తల్లక్రిందులుగనుండును. లౌకికమైన అభివృద్ధిని కలుగజేయునట్టియు, మనస్సును స్థూలముగను ప్రౌఢముగను చేయునట్టియు సావకాశములు, ఉపాయములు చిక్కినపుడు, నిజమునకు వానివలన భయపడవలసియున్నను, లోకము అందులకై ఆనందించి ధన్యవాదము లర్పించును. నిజమైనభక్తు లట్టిసమయములలో, తమ పరమార్థమున కా ఐహికసంపత్తు వలన నష్టము కలుగునేమోయని వ్యాకులపడుచు, అట్లు కాకుండ చేయవలయునని భగవంతుని ప్రార్థింతురు కాని మనస్సునకు భోగసౌఖ్యములు గలిగించుడని యెన్నడు ప్రార్థించరు.

సాఁఈఁ ఏతీ మాఁగహూఁ, రూఖీ రోటీదేయ్ ।
చుపడే మాంగతమైఁ డరూఁ మతరూఖీ ఛినలేయ్ ॥

అర్థము :—ఓ ప్రభో, నాకు ఎండురొట్టెమాత్రము ఇచ్చిన చాలును. నేతి రొట్టె అడుగుట నాకు భయమే. ఎండురొట్టెమాత్రము లేకుండగ చేయకుడు.

ఇటులనే యేదైన కష్టము, కఠినదశ వచ్చినపుడును, మనస్సునకు జగత్తు నుండి విముఖత కల్గినపుడును ప్రాపంచికజీవులు, అట్టిసమయము నొక ప్రత్యేక దయాకటాక్షముగ భావించుకొని సంతోషించుటకు బదులుగా, వ్యాకులపడి అట్లెందుకు రావలెనని ఫిర్యాదు చేయుచుందురు. అట్టి పరిస్థితి గల్గినందుకు భగవంతునికి కృతజ్ఞతాధన్యవాదములు తెల్పుకొనవలసి యున్నది.

“తాడ్ ఔర్ మార కరే సోఇ ప్యార్”

అర్థము :—భగవంతుడు లేక సద్గురువు కష్టములు, బాధలు కల్గించినచో నది నిజమైన ప్రేమయే.

కాని ఈ అబద్ధపు ప్రపంచములో అన్నివిషయములు శుద్ధాసత్యముగను తారుమారుగనే యుండును.

## 6

మనస్సున సుఖదుఃఖములు వ్యాపించకుండ చేయుటకు అభ్యాసము అవసరము. మానవునియొక్క సంస్కారములు బాల్యమునుండియు తమ ప్రభావమును ప్రకటపర్చుచుండును.

2 సెప్టెంబరు 1905 :— మానవుడు మెలకువగ నున్నపుడు అతని చక్షుశ్రోత్రజిహ్వాఘ్రాణాదీంద్రియములు ఎంతోకొంత పనిచేయకుండ నుండుట

యించుకొనును. ఆ కార్యక్రమము అయుక్తమైనచో, భగవంతునిదివ్యేచ్ఛ, తఱుచుగా అట్టిసమయములలో, ఆపని భక్తిరీతికి విరుద్ధమని తన లోలోపలనే తోచునట్లు చేయును. లేదా, అదేసమయములో పవిత్రగ్రంథమునుండి ఆవిధముగా బోధించు వచనమేదైనను రావచ్చును, లేదా యెవరైననొక సత్సంగి చేత రాధాస్వామీదయాళురు స్పష్టముగా తెలియునట్లు చెప్పింతురు. అప్పటి కప్పుడతడు కొంత ముందువెనుక లాలోచించికొని ఆందోళనపడును. కాని తిరిగి యీ బోధలన్నింటిని ప్రక్కనబెట్టి తన ప్రాపంచిక బుద్ధినిబట్టి తాను ముందేర్పఱచుకున్న కార్యక్రమమునే చివరకవలంబించును. అతని మనస్సును, ప్రాపంచికబుద్ధియు అప్పటిమట్టు కతని ఆత్మను త్రొక్కి వేయును. కాని, ఆత్మ పూర్తిగ నెట్లు పరాజితమగును? అతని మనస్సైతే కార్యమును తన ఇష్టము వచ్చినట్లు చేసికొనును, కాని ఆత్మ తిర్గితర్వాత కొంతకాలమునకు లోనుండి లేచివచ్చి మనస్సుపైన అధికారము చలాయించును. అప్పుడు కొంతబాధ పశ్చాత్తాపము బయల్దేరును. అప్పుడు అతడు ఏడ్చిఏడ్చి బాధపడును. అయ్యో తనకు ముందు భగవంతుని వద్దనుండి వచ్చిన సూచనలను పాలించియుండినచో స్వార్థదృష్ట్యాకూడా తనకు చాలాబాగుండిపోవునుగదా అని విచారించును. అయితే ఇంకచేయునదేమున్నది! "సహో అబ్ పడే జైసీ ఆయ్" అని సారబచన్‌లో చెప్పినట్లు "మీాదకువచ్చిపడిన పిమ్మట నదెట్లున్నను సహించవలసినదే".

ఇట్టిపరిస్థితులు కొన్నివందలసార్లు వచ్చుచుండును. ఐనను ఆసమయము నకు ప్రాపంచికబుద్ధియే గెలుపొందుచుండును. అతడు నికృష్టాధికారియైనచో ఇతరులబోధలమాట నట్లుంచి, సంతసద్గురువే స్వయముగా సెలవిచ్చిననుకూడా వినడు. తనకన్న తక్కువతరహాగలవారి మాటలయితే అసలే లెక్కచేయడు. భగవంతు డెప్పుడును అట్టివారిద్వారానే చెప్పించుచుండును. ఏదైన మంచి మాట నెంత హీనాతిహీనులు చెప్పినను దానిని హీనదృష్టితో చూడకూడదు.

తినకా కబహూఁ న నిందియే,
పాఁవ్ తలే జో హోయ్ ।
కబహూఁ ఉడి ఆంఖీ పడే,
పీర ఘనేరీ హోయ్ ।

అర్థము:- కాలిక్రింద పడియున్న తృణమునుకూడా నెన్నడు దూషించకుము. అది యెగిరి కంట్లోపడినయెడల, చాలబాధ కలుగచేయును సుమీా.

లోకములోని పద్ధతులన్నియు తల్లక్రిందులుగనుండును. లౌకికమైన అభివృద్ధిని కలుగజేయునట్టియు, మనస్సును స్థూలముగను ప్రౌఢముగను చేయునట్టియు సావకాశములు, ఉపాయములు చిక్కినపుడు, నిజమునకు వానివలన భయపడవలసియున్నను, లోకము అందులకై ఆనందించి ధన్యవాదము లర్పించును. నిజమైనభక్తు లట్టిసమయములలో, తమ పరమార్థమునకా ఐహికసంపత్తు వలన నష్టము కలుగునేమోయని వ్యాకులపడుచు, అట్లు కాకుండచేయవలయునని భగవంతుని ప్రార్థింతురు కాని మనస్సునకు భోగసౌఖ్యములు గలిగించుడని యెన్నడు ప్రార్థించరు.

సాఁఈఁ ఏతీ మాఁగహూ, రూఖీ రోటీదేయ్ ।
చుపడే మాఁగతమైఁ డరూఁ మతరూఖీ ఛినలేయ్ ॥

అర్థము :—ఓ ప్రభో, నాకు ఎండురొట్టెమాత్రము ఇచ్చిన చాలును. నేతి రొట్టె అడుగుట నాకు భయమే. ఎండురొట్టెమాత్రము లేకుండగ చేయకుడు.

ఇటులనే యేదైన కష్టము, కఠినదశ వచ్చినపుడును, మనస్సునకు జగత్తునుండి విముఖత కల్గినపుడును ప్రాపంచికజీవులు, అట్టిసమయము నొక ప్రత్యేక దయాకటాక్షముగ భావించుకొని సంతోషించుటకు బదులుగా, వ్యాకులపడి అల్లెందుకు రావలెనని ఫిర్యాదు చేయుచుందురు. అట్టి పరిస్థితి గల్గినందుకు భగవంతునికి కృతజ్ఞతాధన్యవాదములు తెల్పుకొనవలసి యున్నది.

"తాడ్ ఔర్ మార కరేఁ సోఇ ప్యార్"

అర్థము :—భగవంతుడు లేక సద్గురువు కష్టములు, బాధలు కల్గించినచో నది నిజమైన ప్రేమయే.

కాని ఈ అబద్ధపు ప్రపంచములో అన్నివిషయములు శుద్ధాసత్యముగను తారుమారుగనే యుండును.

## 6

మనస్సున సుఖదుఃఖములు వ్యాపించకుండ చేయుటకు అభ్యాసము అవసరము. మానవునియొక్క సంస్కారములు బాల్యమునుండియు తమ ప్రభావమును ప్రకటపర్చుచుండును.

2 సెప్టెంబరు 1905 :— మానవుడు మెలకువగ నున్నపుడు అతని చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణాదీంద్రియములు ఎంతోకొంత పనిచేయకుండ నుండుట

అసంభవము. పట్టుపట్టి తన శ్రద్ధాధారను వానినుండి తప్పించదల్చుకొన్నను, అది అంతగా సాధ్యముకాదు. ఎవరైనను, ఒకపెద్దచప్పుడైనపుడు, అదివినకుండ నుండవలెననియు, స్పష్టముగా కండ్లకెదురుగ నొకవస్తువునుంచి అది తన కగు పడకూడదనియును, సువాసన దుర్వాసనలు వచ్చుచుండగా అవి తనకు వాసన కొట్టకుండ నుండవలయుననియును కోరినచో జాగ్రదవస్థలో నున్నంతకాలము అది అంతగా సాధ్యమైనపనికాదు. జాగ్రదవస్థలోనుంచి స్వప్నాద్యవస్థలలోనికి మాఱిపోయినపుడే అది సాధ్యమగును. అప్పుడు శ్రోత్రేంద్రియము బాగుగనే ఉండి, పైన ధ్వనికూడా అగుచున్నను యేమాత్రము వినపడదు. అదేవిధముగా నెవరైనను మనోఘట్టములోనే ఉండుచు, వైరాగ్యబోధ చేసికొని సుఖదుఃఖ ములనుండి తాను ఉపరామచిత్తుడై యుండగోరినచో అది సాధ్యముకాదు. ఎవనికైనను రు. 5000/-లు ఒక్కసారిగా లభించినచో నతడు సంతోషించ కుండనుండుట అసాధ్యము. ఆ సంతోషము పైకి కనపర్చకపోవుట మఱొక విష యము. సుఖదుఃఖములు ఆంతర్యములో వ్యాపించకుండ నుండవలెనన్నయెడల, అభ్యాసముచేసి, ఆంతర్యపరిస్థితిని మార్చుకొన్నపిమ్మటనే అది సాధ్యమగును.

ఎవనిలోనైన నొక తీవ్రమైన సంస్కారము ఉన్నయెడల దాని లక్షణ ములు మొదటినుండియు కన్పించుచునే యుండును. మాకు బంధువుడైన చిన్న శివారి అనుపేరుగల ప్లీడరుగారి తమ్ముడు వారణాశిలో మాతో కూడనుండిన రోజులలో అతడు తనకు షాహుకార్ల వద్దనుండి పెద్ద పెద్ద మూటలపాళముగా సరకుల నెత్తుకొనిపోవలెనని యున్నదని చెప్పుచుండెడివాడు. దానికి పర్యవసాన ముగా చివరకి, అతడొక కర్నలుగారివద్ద నెలకి నూరురూపాయిల జీతముమీద పనిచేయుచు, ఆ కర్నల్ గారికి తనమీద పరిపూర్ణవిశ్వాసముకూడా సంపాదించు కొని, ఆయన దస్కతు ఫోర్జరీచేయుట నేర్చుకొని, ఆయనసొమ్ము కొన్నిలక్షల రూపాయిలు తినివేసెను. ఆ ఫోర్జరీదస్కతు ఎంతచక్కగా చేసెననగా, కర్నల్ గారికి ఆదస్కత్తులు చూపించి ప్రశ్నించగా ఆయన అవన్నియు నిజముగా తనవే అని ప్రమాణము చెయ్యగల్గునంత సరిగ నున్నవని యొప్పుకొనెను. చివరకు అతనికి ద్వీపాంతరవాసశిక్ష విధింపబడెను. అక్కడినుంచి, తన తెలివితేట లుప యోగించి, ఏదో దేశోత్సవసందర్భములో తిర్గి స్వదేశమునకు రాగలిగెను. కాని అతని ముగ్గురు కుమారులును నవయౌవనములోనుండగనే చనిపోయిరి. అందువలన అతడు ద్రోహముచేసి సంపాదించిన ధనమును తీసికొని అనుభవించు వారే లేకపోయిరి.

## 7

<u>పరిపూర్ణవిశ్వాస మనగా నేమి : అది కలుగజేయునిమిత్తము భగవంతుడు చేసెడి యేర్పాట్లు.</u>

3 సెప్టెంబరు 1905 :–రాధాస్వామీదయాళు రెల్లప్పుడు తనకు సహాయభూతులై యుండుచున్నారనెడి పరిపూర్ణవిశ్వాసము జీవుని కుండనేరదు పూర్ణవిశ్వాసమనగా, స్వానుభవముమీద కలిగిన విశ్వాసము. కేవలము బోధవలన గల్గిన విశ్వాసము నమ్మదగినదికాదు. పూర్ణవిశ్వాసముగలవారిని భగవంతుడు అనేకవిధములైన క్లిష్టావస్థలలో పడవేయుచుండును. లేనిచో ఈజీవు డెల్లప్పుడును తన మనోబుద్ధుల బలముమీదనే ఆధారపడుచు నుండిపోవును. కావున, వారి మనోబుద్ధుల ప్రోత్సాహముచే జరిగించు కార్యక్రమమునకు భంగములు కలిగించగా ఆజీవుల అహమిక పూర్తిగా భగ్నమైపోవును. రాధాస్వామీదయాళు రే స్వయముగ తమ దివ్యేచ్ఛచేత తమ అవసరములన్నియు తీర్చుచున్నారని వారికి అనుభవరూపముగాకూడా బోధపడును; ఆ యనుభవములమూలమున వారి కప్పుడు సంపూర్ణవిశ్వాసము స్థిరపడును. ఏరోజున నతడు తన నిర్బలత్వమును తెలిసికొని దివ్యేచ్ఛ యొక్క-దాని పైననే ఆధారపడ నారంభించునో, ఆనాటినుండియు భగవంతుడు అతని పారమార్థిక, స్వార్థికృత్యముల నన్నిటిని ఒక యెస్టేటు (Estate) కోర్టు ఆఫ్ వార్డ్స్ (Court of Wards) కి స్వాధీనమైపోయినపిమ్మట దాని యావత్తు ఋణములను కలెక్టరు పూర్తిగ తీర్చివేసి దానిని కొలదికాలములోనే తిర్గి సంపన్నదశలోనికి తప్పక తీసికొనివచ్చునట్లుగనే చక్కగ నెఱవేర్చి పెట్టును. అతని పరిస్థితి ఆసమయమున రాధాస్వామీదయాళు రతనితో, నీకేమియు చేసికొనవలసినదిలేదు మేమే స్వయముగ నీబదులు సమస్తము చేసిపెట్టుదుమని సెలవిచ్చుచున్నట్లుండును. ఈ జీవుడు పాపము! రాధాస్వామీదయాళురు చేసిపెట్టినవిధముగ నేమి చేసికొనగల్గును! వారి దయాకటాక్షములను జీవు డేమి తెలుసుకొనగలడు! దయ అతని కెల్లప్పుడు తోడుగనే యున్నదని అతనికి తెలియనే తెలియజాలదు. సద్గురువు అతనికి ఒకటి రెండు కబళములను స్వహస్తముతో నిచ్చుటయో, అతనితో తనివితీరునట్లు మాట్లాడుటయో, ఇట్టి దయనేదైన చూపిననే దానిని దయ అని జీవుడు అనుకొనుచుండును. గురువుగారు పాఠము మళ్లి మళ్లి చదివి చెప్పుచుండినను విద్యార్థిమాత్ర మేమియు చదువుకొనకుండ నుండిపోయిన నెట్లుండునో పరిస్థితి ఇంచుమిం చట్లేయున్నది.

# 8

**ఆధ్యాత్మికసాధనచేయువారు, తమ కందువలన నేమిలాభము కల్గినదో అప్పుడప్పుడు పరిశీలించుకొనుచుండవలెను. శ్రీకృష్ణుడు ఉద్ధవులయొక్క వృత్తాంతము.**

(కరాచీ) క్లిఫ్టన్‌లో సత్సంగము 1906 :—ప్రపంచములో జీవులు పారమార్థిక కార్యములు చేయుచు, నేదో పూర్వపునమ్మకము పెట్టుకొనియున్నారు. కాని ఆ కార్యక్రమమువలన నేదైన ఫలితము తమకు చేకూరుచున్నదో లేదో పారమార్థికాదర్శము సిద్ధించుచున్నదో లేదో అనువిషయము తెలిసికొనుటకు వారికి నిదర్శనమేమియు నుండుటలేదు. పరమార్థముయొక్క ముఖ్యోద్దేశ్యమును ఆదర్శము నేమనగా, ముక్తి లభించి, యీ బంధనములు, దుఃఖములతో నిండిన అవస్థలోనికి తిరిగిరాకుండగ నుండిపోవుటయే. ఆ యుద్దేశ్యము వీరు చేసెడి కార్యములవలన నెన్నటికిని నెఱవేరజాలదు. వారల పరమార్థము, విద్యాజ్ఞానమును వారు స్వప్నావస్థ, గాఢనిద్రావస్థ, స్మృతివిహీనావస్థలలోనున్నపు డెక్కడికి పోయినవి? ఈ సామాన్యావస్థలలోనే, వీరి కేలాభముకాని సంరక్షణగాని కలుగనిచో నింతకన్న నెక్కువగా అంతర్యాకర్షణ గల్గిన మరణావస్థలో సంరక్షణ వీరి కెక్కడనుండి వచ్చును? దుఃఖ మనునది యెవనికి కల్గుచున్నది? కంకరరాయికి దుఃఖమెప్పుడు నుండదుకదా? జడచైతన్యముల కలయికమూలముననే దుఃఖ ముత్పన్నమగుచున్నది. పరమార్థమనగా జడచైతన్యముల కలయిక తొలగిపోయి, ఏదేశమున మాయకు నామరూపములు కూడ లేకుండా సర్వత్ర కేవలము చైతన్యసారము, ఆనందము మాత్రమే నిండియుండునో అట్టిదేశమున నివాసము పొందుటయే. పారమార్థికాభ్యాసమనగా ఆగతి తనకు సిద్ధించుచున్నట్లు బ్రతికియుండగనే నిదర్శనము లభించెడివిధముగ నుండవలెను. లోకములో జను లేకార్యమునైన చేయుటచే తమకోరిక యీడేర గలదను నమ్మకము లేనపుడు ఆపనిని చేయనేచేయరు. లేదా కొంతవఱకు చేసినను విడిచిపెట్టివేయుదురు. ఒకడాక్టరుగారి మందు పనిచేయలేదని తోచినపుడా డాక్టరును రోగి విడిచిపెట్టివేయును. పరమార్థవిషయములోగూడ నావిధముగా చూచుకొనవక్కఱలేదా? ఏ యభ్యాసమునైనను ఇఱువది, ఇఱువదియైదుసంవత్సరములు చేసినపుడు దానివలన తమ కేమైన లాభముగలిగెనా, బంధనము లేమైనను తగ్గినవా, ఆ పరమార్థసాధన స్వప్నావస్థలోను, గాఢనిద్రా

వస్థలోను, స్మృతిహీనావస్థలోను, దుఃఖావస్థలోను తమ కెంతవఱ కుపయోగపడినది, అను విషయముల నొకప్పుడైన నాలోచించుకొనవలయునుకదా. ఏదో యొక ఆశ్రయమును పెట్టుకొని దానివలన తమ కేమి లాభనష్టములు గల్గుచున్నవో పరిశీలించుకొనకుండగ మూఢప్రాయముగ పట్టుకొనియుండిపోయినచో నది పరమార్థమని యనిపించుకొనదు. హిందువులు శ్రీరాముని, శ్రీకృష్ణుని నమ్ముకొనియు, క్రైస్తవులు యేసుక్రీస్తుని నమ్ముకొనియు, ఒకరినొకరు మూర్ఖులని చెప్పుచున్నారు. కాని వీరిలో నొక్కరునుగూడ పరమార్థమును సంపాదించుకొన్నట్లు కనపడదు. ఏ సాధనవలన జీవునికి తన యుద్ధారమునుగుఱించి తన జీవితకాలములోనే నిదర్శనము లభించునో అదే సరియైన పరమార్థసాధన.

భక్తిని నాల్గురకములుగా చెప్పుదురు-సాలోక్య, సామీప్య, సారూప్య సాయుజ్యములు. భగవంతుని లోకములో నివాసము పొందినచో సాలోక్యము, ఆయన సాన్నిధ్యము లభించినచో సామీప్యము, వారి రూపము ధరించగల్గినచో సారూప్యము, వారి నిజరూపముతో ఏకమైపోయినచో సాయుజ్యభక్తి యనియు చెప్పుదురు. మీరు అందులో ఏరకముభక్తి చేయుచున్నారు ? దాని స్వారస్య మెట్టిది ? దానివలన మీకు లాభ మేమికన్పట్టుచున్నది ? శ్రీకృష్ణుడు స్పష్టముగా "నాహం వసామి వైకుంఠే..."అనగా "నేను వైకుంఠములోలేను, ఆకాశములోలేను, నా భక్తుల హృదయములలో నివసించుదును" అని సెలవిచ్చెను. ఇవన్నియు పౌరాణికవిషయములే, ఇవన్నియు తమయిండ్లలో వ్రాయబడియున్నను, వానిపైన నెట్టిశ్రద్ధయు వహించకుండ నుండువారు హిందువులా లేక నాస్తికులా? ఈ భక్తిచేసెడివారందఱిని, వారి కెప్పుడైన శ్రీరాముని లేక శ్రీకృష్ణుని దర్శనము లభించెనా అనియు, ఆ రామకృష్ణుల లోకము లెక్కడ నున్నవో వారి కేమైనను తెలియునా అనియు ప్రశ్నించి చూడుడు. శ్రీకృష్ణుడు బ్రహ్మయొక్క షోడశకళాపూర్ణమైన అవతారము. ఉద్ధవుడు వారికి అనుక్షణము సేవచేయుచు పూజ చేయుచుండెడి భక్తుడు. అయినను కూడా శ్రీకృష్ణుడవతారము చాలించి వెళ్ళిపోవునపుడు, ఉద్ధవుడు తననుకూడా తీసికొనిపొమ్మని ప్రార్థించగా, శ్రీకృష్ణు డతనికి "నీవు మాలోకమునకు వెళ్ళెడి మార్గమును తెలిసికొని యోగాభ్యాసము చేసికొనుము, అప్పుడే నీవు అక్కడ చేరుకొనగల" వని చెప్పెను. అప్పుడు ఉద్ధవుడు విదురుని ఆశ్రమమునకు వెళ్ళి అభ్యాసము చేయసాగెను. కావున కేవలము అంధవిశ్వాసముతో ప్రవర్తించుచు ధనసంతానములకొఱకై వాంఛలతో నిండియున్న ప్రస్తుతకాలపు వాచకజ్ఞానులు, భక్త

లును శ్రీరామకృష్ణుల లోకముల నెట్లు చేరుకొనగలరు ?

## 9

### నిజమైన వైరాగ్యము, పరమార్థమును.

లోకములో నన్నిజంతువులలోను మానవుడు సర్వోత్తమమైన చేతన స్వరూపము, తిర్గి మానవునిలో పాణిపాదములు, గుండె, మెదడు మున్నగు వేర్వేఱు అంగములు గలవు. ఆయంగములలో చైతన్య మొకదానిలో తక్కువ గను, మఱొకదానిలో నెక్కువగను ఉండుచున్నది. ఇప్పుడు గమనించవలసిన దేమనగా, జీవచైతన్యము ఆచేతనస్వరూపుడైన భగవంతుని యంశమాత్రమే. ఆ యంశయొక్క ధారలలో నొక్క ధారమాత్రమే శ్రోత్రేంద్రియములలోనికి వచ్చుచున్నది, కాని ఆధారద్వారాగానమును విన్నపుడు మైమఱచిపోవునంతటి ఆనందము కలుగుచున్నది. అట్లే ఒకధార నేత్రములలోనికివచ్చి ఒక్కొక్క రూపము చూచినపుడు మనిషి పరవశమైపోవుచున్నాడు. ఈధారలు రెండును వేర్వేరైనవి. ఏలననగా, మనిషికి కన్నుతీసివేసినచో నతనికి చెముడురాదు. ఒక్కధారలోనే ఇంత ఆనందమగ్నత గల్గించగల రసము, ఆనందమును ఉన్న పుడు, ఈధారలన్నిటికి కేంద్రమైనట్టిబిందువు (అనగా, సురత్ అంశ)లో నెంత అధికముగా రసము, ఆనందము నుండవలయును ? అయితే ఆత్మశక్తికి కేంద్ర ముగ నెంచబడునట్టి కేంద్రీయబిందువు (అనగా సురత్ అంశ) ఎక్కడనున్నది ? ఈమాత్రముకూడా తెలియనిమనిషి పారమార్థికాభ్యాస మేమిచేయగలడు ? ఆయానందమగ్నతాస్థానమునకు గొనిపోవు మార్గమెద్ది, ఆత్రోవను నడిపించు సాధనమెద్ది ? పరమార్థము కావలెనన్న నీవిషయములను తెలిసికొనవలసిన అవసరములేదా ? ఆ ఆనందము లభించినవానికి లౌకికానందములు యావత్తు తుచ్ఛములుగ కన్పట్టును. జీవునికి సామాన్యమైనమగ్నత గల్గినపుడే అతడు అన్నివిషయములను మఱచిపోయి, ఆనందపరవశుడై పోవుచుండును. స్వప్నా వస్థలో శరీరదుఃఖములు కనపడవు. క్లోరోఫారము (chloroform) అను మత్తు మందిచ్చినపుడు, శరీరము కత్తులతో కోసివేసినను యేమియుబాధ కనిపించదు.

ఆంతర్యమగ్నతయొక్క మాధుర్యమునకు హద్దుమేఱయు లేదు. అది కల్గినవారికి ప్రాపంచికపదార్థములలెక్క యేముండును? దానినే వైరాగ్య మందురు. లోకములో నెక్కువగా పొగడబడుచున్న సన్యాసము, పైనచెప్పిన విధమైన వైరాగ్యమునెదుట నేమియు గణనకు రాదు. అపక్వముగా సన్యా

సము స్వీకరించినవారికి (అంతర్యమున మగ్నతానందములులేకుండగనే సన్యసించినవార్కి) ఋష్యశృంగునికి, పరాశరునికి, బ్రహ్మకును గల్గినగతియే గల్గును. బ్రహ్మను ఎందుకు పూజచేయరో పండితులనడిగి తెలుసుకొనుడు. బ్రహ్మయొక్కవాక్యముల కెక్కువ ప్రామాణ్యమా, శ్రీకృష్ణునివాక్యముల కెక్కువ ప్రామాణ్యమా ? ఇవన్నియు పురాణములలో చెప్పినవిషయములే అయినను, వీరేమియు వానిని తెలిసికొనుటలేదు. చూడుడు, శ్రీశుకుడు గొప్పసన్యాసి. ఆయనకున్నది ఒక్కలంగోటి. జనకచక్రవర్తి రాజ్యము నేలుచుండెను. శ్రీశుకుడు జనకచక్రవర్తివద్దకువెళ్లి తనత్యాగమునుగురించి విశేషముగా చెప్పకొనగా, జనకుడు ఆయనను చాలా గౌరవించి తనరాజగృహమునకు తీసికొనివెళ్ళి అచ్చట ఆయనతో సంభాషణచేయుచుండెను. ఇంతలో జనకచక్రవర్తి తనయాంతర్యమున గుప్తప్రేరణ చేసినందున రాజగృహ మంటుకున్నట్లుగా అయిపోయెను. అప్పుడు శ్రీశుకుడు తనలంగోటీ తెచ్చుకొనుటకై పరుగెత్తెను. అప్పుడు జనకుడు "మారాజగృహము అంటుకొనిపోవుచున్నను మేము కదలకుండా తమాషా చూచుచున్నామే ! మీరు ఒక్కలంగోటికొఱకై ఇంతపరుగులు పెట్టుచున్నారేమి ? మీసన్యాసము ధిక్కరించతగినది" అని సెలవిచ్చెను. అట్టిసన్యాసమువలన లాభ మేముండును ?

జీవుడు అంతర్యమున ప్రవేశించి చైతన్యభండారముతో కలిసిపోయినపుడే, శరీరమనస్సులబంధనములు తెగిపోవును. ప్రాపంచికసామగ్రిసంపత్తులు దానియెదుట నేమియు గణనకురావు. అసలైన పరమార్థ మదియే. బ్రతికియుండగనే తనకు ముక్తి గల్గుచున్నట్లు నిదర్శనము లివ్వగల్గినట్టి యోగసాధనను, అభ్యాసమును చేయవలెను. ఇట్టి గుప్తవిషయములను బోధించి, సరియైన మార్గమున నడిపించుచు నాంతర్యసహాయ మొనరించగలపురుషుడే, పారమార్థికకార్యక్రమము జరిపించువాడు. ప్రాతగ్రంథములను, జ్ఞానవాక్యములను చదివివినిపించువారు ఆ విషయములకు ప్రమాణమును జీవితకాలములో లభింపచేయలేనిచో పరమార్థమునుండి అపమార్గములోనికి గొనిపోవుచున్నారు. అట్టివారు స్వయముగా నాస్తికులగుటయేగాక ఇతరులనుగూడ నాస్తికులుగ చేయుచున్నారు.

"రోబరూ ఏ ఆమిలా" బాతిన్ ఫహమ్,
ఆలియానే ఇల్మ జాహిరీ జాహిల్ అంద్."

అర్థము :—అంతర్యరహస్యముల నెఱింగిన సిద్ధపురుషులయెదుట బాహ్యవిద్యాజ్ఞానముగల విద్వాంసులు కేవలము అజ్ఞానులే.

కావున ప్రతి మానవుడును, సాంసారికకార్యముల నెట్లు తీక్ష్ణముగా విమర్శించి, బాగుగ పరిశీలనచేసి అందలి లాభనష్టముల నాలోచించుకొన్నపిదపనే యేపనినైన చేయునో, పరమార్థవిషయములోకూడ నట్లే ప్రవర్తించవలసియున్నది. పరమార్థవిషయములో నంతనిర్లక్ష్యమేల ? వీరు వారుచెప్పిన పైపై మాటలమీద ఆధారపడి తృప్తిపొందకూడదు. ఇక్కడకురండు 1, 2, 10 రోజులు, లేదా 2 మాసములకాలము ఇచ్చటనున్నవారి ప్రవర్తనను నిరంతరము కనిపెట్టిచూడుడు. అపుడు ఆలోచించుకొనుడు పిమ్మట మీకేవిధముగ తోచిన నాప్రకారమే చేయుడు.

"పానీ పీజే ఛానకర్, గురూ కీజే జాన కర్."

అనగా :-నీరును వడియగట్టి త్రాగుడు. ఏపురుషుని గురువుగా స్వీకరించినను, ముందు ఆయననుగురించి అన్నివిషయములును తెలిసికొన్నపిదప స్వీకరించుడు.

మామూలువిషయములలోనే ఇంతశ్రద్ధ వహించి విచారణ జరిగించుచుండినపుడు, పరమార్థవిషయములోకూడా అన్వేషణ విచక్షణలు తప్పక జరిగించవలసినదే. ఈయభ్యాసమువలన జీవుడు జాగ్రదవస్థలోనుండి స్వప్నావస్థలోనికివెళ్లి, స్వప్నావస్థనుకూడా దాటివెళ్లి, కొంతకాలమునకు పూర్తిగా బంధవిముక్తుడై, మహానందమయావస్థలో ప్రవేశించగలడు. ఈసుఖ, దుఃఖావస్థలలోనికి తిర్గి రానేరడు. ఇదంతయు పరమార్థము సంపాదించుకొనుటకై యేమిచేయవలెననువిషయమునుగురించి ఒక భూమికారూపమున వివరించితిమి. సృష్టి యెందుకు చేయబడెను ? యేవిధముగ చేయబడెను ? పరమదయాళువని ప్రసిద్ధుడైన భగవంతుడు జీవుల కింత సుఖదుఃఖములుగల అవస్థ నేలకల్పించెను ? సత్యపరమార్థమార్గమున్నస్థలములో నీపై విషయములన్నిటికిని విపులమైన సమాధానములు తెల్పబడును.

## 10

### పారమార్థికమత మెట్టిది ? సుఖ, దుఃఖముల నిరూపణము.

ఈ ప్రపంచములో పరమార్థమనుపేరుతో జరిపించబడుచున్న కార్యక్రమములన్నియు పూర్తిగా తుచ్ఛములును, ఆధారశూన్యములును. ఏమతస్థులైనను తమమతముయొక్క లక్ష్యమునుకాని, ఉద్దేశ్యమునుకాని, పొందినట్లే కనపడదు. ఒకరిని అడిగినచో భగవంతుడొకడు ఉండును, నామమును ఉపదేశ

ము తీసికొనుము, సత్కార్యములు చేయుము, ప్రవర్తన ధారాళముగ నుంచు కొనుము. ఇదియే తనమతమని చెప్పను. భగవంతునిరూపమెట్లుండునో, ఆయన ధామ మెక్కడున్నదో అనువిషయము లతనికెంతమాత్రము తెలియవు. ఇది మతమేనా ? మఱొకరిని అడిగినచో భగవంతుడు ఈ శరీరమను విగ్రహమును చేసెననియు, అందులోనికి ఆత్మనుఊది మనిషిని చేసెననియు, కాని ఆ చేసిన మనిషికి విచక్షణాశక్తి లేకపోయెననియు, తిరిగి ఏకపుత్రజనన మయ్యెననియు కాని ఆపుత్రుడు భగవంతుని మన్నించలేదనియు, అందుచేత నతనిని శాశ్వతముగా నరకములో పారవేసెననియు, ఇదియే తనవమ్మకమని చెప్పెను. ఇది మతమా ? లేక మూర్ఖత్వమా ? ఇట్టి భగవంతుడు స్వయముగా తానే నరకములో త్రోయ బడవలసినవాడగును. తమదేవుని అంగీకరించనివారిని చంపివేయుమనుటయే మఱి కొందరిమతమైయున్నది. మఱొకరిమతము గంగాస్నానముచేయుటతో ఆఖరు. విచక్షణాశక్తిగల బుద్ధిమంతులు, ఈ పైనచెప్పిన విషయము లేవైనను, ఆధ్యా త్మిక కార్యక్రమములోనికి లెక్కవచ్చునేమో ఆలోచించుకొనవచ్చును.

న్యూటన్ (Newton) దొర యెంతటి విద్వాంసుడో చూడుడు. అత డొక పండు క్రిందపడగాచూచి, అది యెట్లు క్రిందకేలపడెను, పైకెందుకుపోలేదు అని ప్రశ్నించుకొనెను. అతనిని అందుచేతనే బుద్ధిశాలి అనిరి. ఈలోకములో విద్యుచ్ఛక్తి (electricity) చుంబకశక్తి (magnetism) ఇత్యాదిశక్తు లెన్ని పనిచేయుచున్నవో, వాని వాని స్వభావపద్ధతులను తెలిసికొని లోకములో నెంతటి ఆశ్చర్యకరమైన యంత్రములను తయారుచేయుచున్నారో, వాని వాని రహస్యములను, కార్యక్రమపద్ధతులను ననుసరించి యెంతటి లాభములను పొందుచున్నారో చూడుడు. ఈశక్తులేగాక ఆధ్యాత్మికశక్తికూడ ఈలోకములో నున్నది. దాని కార్యక్రమముకూడ నలునైపులను జరుగుచున్నది. అది జంతు వుల శరీరములనెడి యంత్రములను ఏవిధముగ తయారుచేయుచున్నదో ఆవిధ ముగ మఱేశక్తియైనను, మఱేయంత్రకారుడైనను తయారుచేయగలడా ? దాని రహస్యవిషయములను దాని నైజస్వభావమును యథార్థవిషయమును తెలిసి కొనుట అవసరముకాదా ? ఇంతకు పర్యవసానమేమనగా, ప్రస్తుత మీప్రపంచ ములో ప్రచలితములైయున్న ఏమతములవలననుకూడ ఆధ్యాత్మికాదర్శ మెంతమాత్రము సిద్ధించుటలేదని తేటపడుచున్నది.

ఆధ్యాత్మికాదర్శ మనగానేమి ? ఈ సృష్టిలోనున్నజంతువులు జరిగించెడి కార్యక్రమమంతకును ఉద్దేశ్యము రెండురకములుగ కన్పట్టుచున్నది. ఒకటి

దుఃఖనివృత్తి, రెండవది సుఖ ప్రాప్తి. అనుకూలత లేక సామరస్యమున్నచోట అనురాగములేక ప్రవృత్తియు. అనుకూలత లేనిచోట ద్వేషములేక నివృత్తియు జరుగుచున్నది. ఉదాహరణకై వర్షము కురిసినపుడు ఆనీటిని, ఆ ఆనందమును స్వీకరించునిమిత్తము చెట్ల ఆకులలో నొకవిధమైన నూతనశక్తి పుట్టుచున్నది, ఆశక్తియే ఎండకాచినపుడు లోనికి ముకుళించుకొనిపోవుచున్నది. జంతువులలోకూడ నిదేవిధముగా అనుకూలత యున్నచోట ప్రవృత్తి అనగా అనురాగమును. విరోధమున్నచోట నివృత్తియు (అనగా ఏవగింపును) కనపడుచున్నవి. ఈ సహజస్వాభావికమైన ప్రవర్తన సర్వత్ర కనబడుచున్నది. ఎక్కడ చూచినను దుఃఖమునుండి తప్పించుకొనవలెననియు, సుఖమును పొందవలెననియే అందఱి ప్రయత్నములలోని యుద్దేశ్యమై యున్నది. ఆసుఖము కల్పితము కావచ్చును, లేదా స్వల్పకాలముమాత్రమే యుండునది కావచ్చును, మఱెట్టిదైన కావచ్చును. లోకమందంతటను ఇదేపని జరుగుచున్నది. మతము యొక్క ఉద్దేశ్యముకూడా ఇదియే, అనగా శాశ్వతమైన సుఖమునుపొంది, శాశ్వతముగా దుఃఖములనుండి నివృత్తి పొందవలయుననియే. ఎంత యెక్కువ సుఖము లభించిన, అంతకన్న నింకనెక్కువ సుఖము కావలెననియే ప్రతివ్యక్తియు కోరుచుండును. ఎట్లనగా, ధన మెవనికైన లభించినచో, నతడింకను ధనము కోరుచుండును. మహారాజుల కెంతెంత సుఖభోగములసామగ్రియు సంపత్తులు నున్నవో చూడుడు. అయినను కూడ వారి కింకను సుఖభోగములకొఱకైన కోరిక వృద్ధియగుచునే యుండును. ఏ యవస్థలోను, ఏ స్థానములోను సుఖము అనంతముగనుండి దానినిమించిన సుఖము మఱేదియును లేకుండునో, ఆత్మ అట్టి స్థానమును, అవస్థను పొందినపుడే పరిపూర్ణసుఖప్రాప్తి గలుగును. కావున అదియే పారమార్థిక మతాభ్యాసములద్వారా పొందవలసిన యుద్దేశ్యమును పరిణామమును అయియుండవలెను. మరియు ఆ యుద్దేశ్యప్రాప్తికి నిదర్శనములు జీవించియుండగనే లభించవలయును. పైన చెప్పిన మతములవారి కట్టినిదర్శనములు లభించుటలేదు.

సుఖదుఃఖములనగ నేమి ? ఆత్మయొక్క చైతన్యధారయే మనశరీరమును చైతన్యవంతముగ చేయుననియు, ఈధార యేదేని ఇంద్రియముపైకి ప్రవహించినపుడు బాహ్యవిషయముల ప్రభావము ఆధారమూలముననే జీవునికి కలుగుచున్నదనియు, శ్రద్ధగా విమర్శించినచో బోధపడగలదు. ఈధార రెండువిధము

లుగా పనిచేయుచుండును. ఒకవిధము ఏదైననొక ఎలక్ట్రిక్ తీగవంటి సంచాలక (conductor) మైనతీగ ద్వారాను, రెండవది అట్టితీగ యేమియు లేకనే వైర్లెస్ టెలిగ్రఫీ మాదిరిగను (wireless telegraphy). శరీరములో పంచ జ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు కలవు. త్వక్ చక్షు శ్రోత్ర జిహ్వా ఘ్రాణేంద్రియములు అయిదును జ్ఞానేంద్రియములు. పాణి పాద పాయూపస్థలు నోరును అయిదు కర్మేంద్రియములు. చైతన్యధార ఇందులో ఏ ఇంద్రియము మీదికి వచ్చునో ఆ ఇంద్రియము పనిచేయనారంభించి జీవునకు దానిద్వారా తత్సంబంధమైన జ్ఞానము కలుగును. ఇది శక్తి తీగద్వారా పనిచేయు కార్యక్రమము. ఇదికాక జీవునికి బాహ్యముగా ఎక్కడ (అనగా ఏపదార్థముమీద కాని ప్రాణిమీదకాని) ప్రేమయుండునో అక్కడకూడా ఈధారద్వారానే కార్యక్రమము జరుగుచుండును. మంచిమధురగానము ఎక్కడైనను జరుగుచుండె ననుకొనుడు. అందఱు నక్కడ ఆగానమును ప్రేమతో వినుచుందురు. హఠాత్తుగ నెవరికుమారుడైన చనిపోయినవార్త వచ్చినచో ఆపాట మాధుర్యమంతయు మాయమైపోవును. అప్పుడు జరిగిన దేమిటి ? ఆధార (ఆపాటమీదనుండి) వెనుకకు మఱలిపోయినది. ఈవిధముగా శరీరమందును, బాహ్యవిషయములందును ప్రవేశించి వానియొక్క జ్ఞానము లేక ప్రభావమును కలిగించు సాధనమైన యీధారను శ్రద్ధయని అందురు. ఇప్పుడు ఈప్రపంచమున జరిగెడి పనులన్నియు నీధారమూలముననే జరుగుచున్నవనియు, సుఖదుఃఖముల అనుభవము లన్నియు నీధారమూలముననే గలుగుచున్నవనియు తెలిసికొనదగును. ఈధార నొక స్థానమునుండి బలవంతముగా త్రిప్పి వేసినపుడు అట్టి అనుభవముయొక్క ప్రభావమునే దుఃఖమని యందురు. ఉదాహరణార్థము శరీరమందెచ్చటనైన నొకదెబ్బ తగిలినచో అచ్చటికి నిరంతరము వచ్చుచు పోవుచున్న యీధార అచ్చటనుండి బలవంతముగా మఱల్చబడిపోవును. కావుననే దుఃఖానుభవము గలుగును. అటులనే, తాను ప్రేమించినవాడొకడు చనిపోయినపుడు దుఃఖము గలుగును ఏలనన యేశ్రద్ధాధార అచ్చటికి పోవుచుండెనో అది అచ్చటినుండి బలవంతముగ తప్పించబడినది. కావున దుఃఖమనగా నేమి ? శ్రద్ధారూపమైనట్టి చైతన్యధార నొక స్థానమునుండి బలవంతముగా తప్పించినపుడు, యే జ్ఞానానుభవము గలుగునో దానికే దుఃఖ మనిపేరు. ఈ శ్రద్ధారూపమైన ధారయొక్క ఏకాగ్రతనే సుఖమని చెప్పుదురు. ఒక రంగుమీద లేక ఒక ఆకారమునందు ఈ ధార ఏకాగ్రత చెందినపుడు దానిలో నొక ఆనందము గలుగును. ఆ యేకాగ్ర

తకు భంగముకలిగినపు డేమియు ఆనందము గలుగనేరదు. ఇప్పుడు మేము సంభాషించుచుంటిమికదా. మీశ్రద్ధ అంతయు మావైపునకు తిరిగియున్నది, మీరు మా మాటలను బోధపఱచుకొనుచున్నారు. ఈ దృష్టిలోనుండగా, ఎవరైనను మీ వెనుకప్రక్కన ఒకఘంట వాయించినను మీకేమియు దాని జ్ఞానము ఉండదు.

ఎవరైనను తమ బంధువులయొక్క మరణవార్త విన్నపుడు అతనికి చుట్టు ప్రక్కల ఆటపాటలు, తమాషాలు జరుగుచుండినను అందులో సరదా అంతయు నశించిపోవును. పూర్తిగా నిరుపయోగమైన పదార్థములలోకూడా శ్రద్ధ నేకాగ్రము చేసినపుడు చాల ఆనందము గలుగును. చదరంగ మాడునపు డేమగుచున్నదో చూడుడు. కొన్ని కొయ్యముక్కలకు కల్పితమైన పేర్లుపెట్టి, ఒక పిచ్చివాడొకప్రక్కను, మఱొకపిచ్చివాడింకొకప్రక్కను కూర్చుండి ఆట ఆడుచుందురు. ఇంకొక ముగ్గురు నలుగురు పిచ్చివాండ్రు ప్రక్కన కూర్చుండి ఆయాట చూచుచుందురు. వారల కెంత యానందముగ నుండును! అదంతయు దృష్టి నేకాగ్రముచేయుటయేగాక మరేమైయున్నది ?

ఆనందమును అనుభవించుటకు ఇంద్రియములు సాధనములైనట్లే అంతఃకరణకూడ ఒక సాధనమైయున్నది. అంతఃకరణ అనగ నేమి ? అంతఃకరణకు నాల్గుభాగములు గలవు—మనస్సు, చిత్తము, బుద్ధి, అహంకారమును. సంకల్ప వికల్పములు ఎచ్చటపుట్టునో అది మనస్సు. ఏస్థానమునుండి ధార ఒక చెరువులో నుండి తరంగమువలె నుత్పన్నమై పై విషయములవైపునకు వెళ్ళి కలిసికొనునో ఆమనోభాగమును చిత్తమందురు. దాని లాభనష్టములు తేల్చుకొన్నపిమ్మట నేది ఆలోచనచేయునో అది బుద్ధి. "ఈపని చేసినది నేను" అను ఆలోచన ప్రుట్టెడి స్థానమును అహంకారమందురు. ఈ నాలుగును అంతఃకరణయొక్క భాగములు. వీని కార్యకలాపముయొక్క ఆనందమాధుర్యములు ఆయంతఃకరణ లోనికి వచ్చెడి ధారను ఏకాగ్రము చేయుటచే గల్గును. ఏ కేంద్రీయబిందువు నుండి యీ ధారలు, ఇంద్రియములలోనికిని అంతఃకరణలోనికిని వచ్చుచున్నవో ఆ బిందుస్థానమును దాని రహస్యమును తెలిసికొని అచ్చట నేకాగ్రముచేసినచో నందువలన గలిగెడి మాధుర్యమును, ఆనందమును వర్ణనాతీతమైనవి. ఈ విద్య, జ్ఞానము, ఈ ఆనందమాధుర్యములును అంతఃకరణస్థానమునకు పైనున్న ఆ కేంద్రీయబిందువునకే సంబంధించి యున్నవి. ఈ కేంద్రీయ బిందువువద్ద ఏకాగ్రతను

అభ్యాసము చేసి వానివద్దకు లోకములోని సమస్త పండితులును విద్వాంసు లును (వీరందఱి విద్యాజ్ఞానము నోక్కొక్క ధారకు మాత్రమే సంబంధించి యుండును.) వెళ్ళి ఉపదేశముపొంది కేంద్రీయబిందువుయొక్క స్థానమును, దాని రహస్యమును తెలిసికొని దాని ఆనందమును పొందవచ్చును. ఎవని కట్టి అనుభవజ్ఞానము కలదో అతడే నిజమైన విద్వాంసుడని పేర్కొనబడును.

## 11

### దుఃఖము పోవుటెట్లు, సుఖము కలుగుటెట్లు ?

ఈ లోకములో దుఃఖము పోగొట్టుకొనునిమిత్తముకాని, సుఖమును పొందు నిమిత్తమైగాని జనులు మామూలుగా జరిగించు కార్యకలాపమునకై కొంతకష్టము పరిశ్రమయు చేయవలసియున్నది. అయిననుగూడ దానిఫలితము నశ్వరమేకాని చిరస్థాయిగ నుండుటలేదు. ఈధారను నీయిష్టానుసారము వెనుకకు మరలించుకొనగల్గినచో దానికి బంధనములున్న స్థలములనుండి దానిని ఈ పద్ధతిగా తప్పించినందువలన దుఃఖము కలుగదు. చూడుడు, ఇచ్చట కలుగు దుఃఖము అంతయు జాగ్రదవస్థకు సంబంధించి యున్నది. దాని ప్రభావము స్వప్నావస్థలో కనుపించదు. క్లోరోఫారమ్ ఇచ్చినపుడు మత్తు పరిస్థితి కలిగినచో శరీరమును కత్తితో కోసినను బాధ అనిపించదు. గాఢనిద్రావస్థలో స్వప్నావస్థవఱకు వ్యాపించగల దుఃఖములన్నియు మాయమైపోవును. కావున నీవిషయములనుబట్టి, ఈధార బహిర్ముఖముగ నెచ్చటెచ్చట బంధింపబడియున్నదో, దాని నచ్చటనుండి యోగాభ్యాసముద్వారా అంతర్ముఖావస్థలలోనికి గొనిపోయినచో దుఃఖము దూరమైపోగలదనియు, దానిని ఈ అభ్యాసముమూలముననే కేంద్రీయబిందువువద్ద నేకాగ్రము చేసినచో ఆనందముకూడ అధికాధికముగ లభించగలదనియు తేటపడుచున్నది.

ఇదంతయు ఆత్మయొక్క విషయము. ఇప్పుడు ఆ యాత్మయొక్క భండారము పరిస్థితి చెప్పెద వినుడు. ఈప్రపంచములో అనంతసంఖ్యాకముగా ఆత్మలు గలవు. ఒక్కొక్క నీటిబిందువులో నెన్నియో ఆత్మలున్నవి. ఈ ఆత్మలన్నిటికిని యెచ్చటనుండి శక్తివచ్చుచున్నది ? తిరిగి భూమిమీదను, సూర్యలోకములోను, నక్షత్రములలోను యెన్నో లెక్కలేనన్ని ఆత్మలున్నవి. వీనికన్నిటికి నెచ్చటనుండి శక్తి వచ్చుచున్నది ? ఇవన్నియు నెవరి నాధారముచేసికొని నిల

బడుచున్నవి ? అట్టి ఆత్మల భండార మెక్కడనున్నది ? ఇచ్చటనున్న శక్తులలో నేదియు నొక భండారములేకుండగ లేదు, తనకన్న ఘనతరమైన మఱొక శక్తి పైన నాధారపడకుండగను లేదు. మనకంద్లు వెల్తురుపైన నాధారపడియున్నవి. భూమి సూర్యలోకమున కధీనమైయున్నది. అటులనే నిస్సంశయముగా, ఈ ఆత్మయొక్క శక్తియు, ఆత్మలన్నియును ఒక భండారమునుండియే శక్తిసామర్థ్యములను పొందుచున్నవి. ఆ భండారమే పరమపురుషుని ధామము.

ఈమానవశరీరము యాదృచ్ఛికముగా తయారైనదికాదు. ఒకనియమమును, సిద్ధాంతమును అనుసరించియే అది అట్లుచేయబడినది. చూడుడు, సూర్యలోకమునుండివచ్చునట్టిధార ఒకచిన్న సూర్యబింబమును తయారుచేయుచున్నది. సరిగనట్లే పైనుండివచ్చినధారకూడ నీ నియమానుసారముగనే మానవశరీరమును నిర్మించినది. అనగా విశ్వసృష్టి (Macrocosm) యొక్క నిర్మాణము ననుసరించియే (మానవశరీరమనెడి) సూక్ష్మసృష్టియొక్క (Microcosm) నిర్మాణముకూడ జరిగినది. ఎందఱు సంతుమహాత్ములు వచ్చిరో వారందఱు తెలియజేసిన గుప్తరహస్యములు, భక్తిరీతి, ఆధ్యాత్మికమార్గము అభ్యాసములును అన్నియు నొకేపద్ధతి ననుసరించి యున్నవి. మన్సూర్, సరమద్, చిశ్తీ, మౌలానారూమ్, హాఫిజ్, కబీర్‌సాహెబ్, గురునానక్, పలటూ, దాదూ మున్నగువారి మహావచనములలోను గద్యలలోను చెప్పిన భక్తివిషయములును ఆధ్యాత్మికగుప్తవిషయములును అన్నియు నొకేతీరున నున్నవి. ఆ పరమపురుషుని మహిమలను, అచ్చటి ఆనందమాధుర్యములను సామాన్యమానవుల యెదుట వర్ణించుట, మర్కటమునకు అల్లమును చవిచూపించినట్లే యుండును. కోతి, పాపము ! దానిరుచి నేమి తెలిసికొనగలదు ? అదికాక, ఇది ఒక్కరోజులో తెలిసికొనగల విషయము కాదు. సంతుమతముయొక్క మహిమను గుఱించి ఇఱువది ముప్పది యుపన్యాసములిచ్చినయెడల కొద్దిగమాత్రము అవగాహన కాగలదు.

## 12

సంతుమహాత్ముల పవిత్రగ్రంథములను బాగుగ అర్థముచేసికొని చదువుకొనుచుండవలయును.

ఖురాను మున్నగు ఆధ్యాత్మికగ్రంథములను ఎంత భక్తిశ్రద్ధలతో చదువుచున్నారో చూడుడు. ముసల్మానులు ఖురాను నెంత శ్రద్ధాభక్తులతో

చదువుచున్నారో, పంచకాలములందు దైవప్రార్థన (నమాజ్) యెంతచక్కగా అవగాహనపూర్వకముగా చేయుచున్నారో చూడుడు. అదేప్రకారముగా మౌల్వీలు, ఖురానును బాగుగా చదివి తెలిసికొని వారు చేసెడి ఆధ్యాత్మిక చర్చలలోను, ఇతర సంభాషణలలోను దానిలోనుండి ప్రమాణములను అనువదించుచున్నారు. బ్రాహ్మణులు వేదములను మహాశ్రద్ధగా చదివి, వేదమంత్రములను స్వచ్ఛముగ నుచ్చరించుచుందురు. కాని అంతి కట్టుబాటుగను, అర్థము తెలుసుకొనుచును సంతుమతగ్రంథములనుమాత్రము జను లెవరును చదువను చదువరు, వినను వినరు. కావుననే సారబచన్‌లో స్వామీజీ మహరాజ్‌వారు సెలవిచ్చిన 263 వ వచనమును జీవులు పూర్తిగ ఆచరణలో పెట్టుటలేదు. సంతులు గుప్తమైనపుడు, తమస్థానే మఱొక గురుముఖుని ప్రపంచములోనుంచి వెళ్లుదురని వారు వ్రాసిన విషయమునుకూడ నెవరును విశ్వసించుటయులేదు, అట్టి పురుషునికొఱకై అన్వేషించుటయులేదు.

హుజూర్ మహారాజువారు తమ పవిత్రగ్రంథములలోను, మహావచనములలోను, ప్రేమపత్రిలోనుకూడా సత్సంగము లభించనపుడు, పవిత్రగ్రంథములను శ్రద్ధగా పాఠము శ్రవణము చేయవలసినదని చాలగట్టిగ నొక్కి బోధించిరి. అట్లు చేసినందునకూడా, కార్యము సఫలముకాగలదు, చిత్తశుద్ధి లభించగలదు. ఆడవాండ్రు కాశీవచ్చి నాలుగేసి నెలలుండి యెన్నియో రకములైన వ్రతములు చేయుచుందురు. కొందరు మధురపదార్థములను విడిచిపెట్టుదురు. మరికొందరు బంగారము వగైరాలను విడిచిపెట్టుదురు. కాని తమవ్రతమును మాత్రి మెవ్వరును విడిచిపెట్టరు. నిర్వ్యాజము నిర్మలమునైనట్టి భక్తి సంపాదించవలెనన్నచో ప్రపంచికాలోచనలను విడిచిపెట్టి సంతుల పవిత్రగ్రంథములను పూర్ణశ్రద్ధతో చదువుకొనుచు, ఆ ప్రకార మాచరణలో పెట్టుచునున్నపుడే అది సాధ్యమగును.

## 13

మనస్సు నణచివేయుచుండవలెను. పరమార్థమునకై ఆపత్కష్టపరిస్థితుల యావశ్యకత. వానిలో నంతర్గతముగ రాధాస్వామీదయాళుని దయయున్నది.

9 మే 1907 :—ఈ మనస్సేమేమి ఆటలాడుచుండునో పరిశీలన చేసి

కొనుచుండవలయును. కొద్దిగ ప్రశంసావచనములు పలికినపు డెంతయు సంతోష పూరితమగును అందుకు ప్రతికూలముగ జరిగినపు డెంతయు నుదాసీనమై పోవునుకదా. మనస్సుయొక్క ఈ వృత్తిని కనిపెట్టుచు శక్యమైనంతవఱకు దాని అహంభావలక్షణము నణచివేయుచుండవలెను. అప్పుడే నైర్మల్యము చిత్త శుద్ధియు గలిగి పరమపురుషుని చరణములతో సంబంధ మేర్పడుట ప్రారంభ మగును. ఎవనినైనను "నీ వెంత మూర్ఖుడవు" అని అన్నచో నతని కెంతకష్ట ముగ నుండును! అదే, "నీ వెంతచాకచక్యము గలవాడవు" అని అన్నచో అత డెంత సంతోషించును! అతడు నిజముగ నెట్టివాడో అట్లేయుండును కాని, మన మతనిని మఱొకలాగున నన్నందువలన అట్లుకాకుండ మాఱిపో వునా! కాని మనస్సుయొక్క నడత యెట్టిదనగా అదియేమాటలైనను విన్న తోడనే చటుక్కున పట్టుకొని దానికి తగినట్లుగ భావములను మార్చుకొను చుండును. కావున చాల జాగరూకతతో దీనిని పరిశీలించుచు, దీని స్వాభిమాన లక్షణమును అణచివేయుచుండవలెను.

జీవునికి విపరీతమైన కష్టపరిస్థితు లేమివచ్చినను అవిఅన్నియు రాధా స్వామిదయాళుని దయయే. భక్తిమార్గమున ప్రవర్తించువారికి అట్టి పరిస్థి తులు గలుగుట అత్యావసరము. అవి నిజముగ భక్తియొక్క అంగములే. ఏల ననగా, వానిద్వారా ఇతనిని పరీక్షించనియెడల ఇతని మనస్సులో నెన్నటికిని మార్పురానేరదు. ఇట్టి పరిస్థితులను సహించుకొనుచు, వానితో అనుకూలించు కొనుచు నీక్రింది పద్యములో చెప్పినట్లు భక్తి చేసికొనవలెను.

టోటే మేం భక్తీ కరే తాకా నామ సపూత్ ।
మాయా ధారీ మసఖరే, కేతే హీ గయే ఊత్ ॥

అనగా మానముకాని అవమానముకాని యేదివచ్చినను, అన్నిపరిస్థితులలోను భక్తిచేసినవాడే సుపుత్రుడనిపించుకొనును. మాయకు లొంగిపోయినవారైతే మునిగియే పోవుచున్నారు.

రాధాస్వామిదయాళురు జీవునికి సర్వవిధముల కాపుదలచేయు చున్నారు. అతనికి గలిగెడి ఆపత్తులు కష్టములన్నియు వారిదయవలనను దివ్యే చ్ఛవలననే కలుగుచున్నవి. అందుచేత వారి దివ్యేచ్ఛ ననుసరించి ప్రవర్తించ వలెను. తేనెయిచ్చిన నిచ్చుగాక, లేదా విషమిచ్చిన నిచ్చుగాక, యేమిచ్చినను కూడా, సర్వవిధముల దివ్యేచ్ఛకు సంతోషించుచునే యుండవలెను. క్రింది చర ణములో చెప్పినట్లు,

"జిల్లత్ ఇజ్జత్ జో కుఛ హోవే, సున ప్యారే తూ కరభక్తీ।
అర్థము :—నాముద్దు బిడ్డా, వినుము. అగౌరవము కలుగుగాక, లేదా గౌరవము కలుగుగాక, ఎట్లైననుకూడా, నీవు భక్తి చేయుచునే యుండుము.

అంతియకాని, గౌరవముచేసినప్పుడు, శ్లాఘావచనములు పలికినప్పుడును సంతోషమగ్నుడై వారి దివ్యేచ్ఛను మెచ్చుకొనుటయు, అవమానముచేసినపుడు విముఖుడైపోయి విడిచిపెట్టిపోవచూచుటయు సరికాదు. మనస్సు అనేక విధములుగ గాబరాపెట్టుచుండును, బిగ్గరగ అఱుపులు పెట్టుచు యేడ్పులేడ్చుచుండును, వదరుబోతుతనముగ ప్రేలుచుండును. రాధాస్వామిదయాళునివద్దనుండి విముఖమైపోవునట్లుగూడ చేయును. కాని అది చేయునట్టి యీ పనులను తెలివితేటలతో గ్రహించుకొని, దానిని పరిశీలించుకొనుచు భక్తి చేసుకొనుచుడవలెను. అంతియకాని నీ ఆత్మను దానితోకూడ కొట్టుకుపోనీయకూడదు. చూడుడు, వైద్యుడు మంచిమందిచ్చినప్పుడు ఆమందు అప్పటిలో చాలా అరుచిగను, కష్టదాయకముగనే కన్పట్టును. కాని దానిఫలితముమాత్రము లాభదాయకముగ నుండును. తెలివితక్కువ పిల్లలు డాక్టరు వారికి శస్త్రవైద్యము (operation) వగైరాలు చేయుచున్నపుడు ఎంతకష్టపడుదురు. వారికి ఆ డాక్టరు యెంత దుఃఖదాయకునివలె కన్పట్టును! కాని ఆయన అవన్నియు వారలకు తర్వాత లాభము కల్గించునిమిత్తమే చేయుచున్నారుకదా! అదేవిధముగా రాధాస్వామిదయాళురుకూడా జీవులమీదికి ఆపత్కష్టముల పరిస్థితులు వచ్చులాగున చేయుదురు. అవి వారి ప్రత్యేకదయక్రింద భావించుకొనవలెను కాని, వారియందు ఆకారణముచే అసంతుష్టి కనపర్చకూడదు.

జీవునికి బాధలు, కష్టములు కల్గించి అతనిని నిర్మలముగను పవిత్రముగనుచేసి, నిజమైనభక్తునిగ మార్చుట సంతుమతముయొక్క మహామహిమను తెలియజేయును. ఇతరమతములలో నట్లుగాక జీవునిపై మఱింతభారము వేయుటచే నతడు, ఇంక నెక్కువ మలిన మైపోవుచున్నాడు. యోగీశ్వరజ్ఞానులనుకూడ మ్రింగివేసినట్టి అహంకారమును రాధాస్వామిదయాళు రెంతసులువుగను, సంపూర్ణముగను నాశనము చేయుచున్నారు! ఇంతకు అభిప్రాయ మేమనగా, రాధాస్వామిదయాళునియెడల కోపగించకూడదని తెలిసికొనవలెను. ఎల్ల పరిస్థితులలోనుగూడ రాధాస్వామిదయాళురు జరిపించు కార్యక్రమముతో అనుకూలించి ప్రవర్తించుచు మనస్సుయొక్క లక్షణములతో ఆత్మను ఏకీభావము

పొందకుండ వేలుచేసి భగవచ్చరణములందు చేర్చవలెను. ఆత్మ ఆంతర్యమున కాకర్షించబడినపుడు, దశేంద్రియములు, పిండీ మనస్సు మొదలగునవన్నియు క్రిందనుండి పోవును. ఆత్మ వాని ఆవరణలోనుండి దాటిపోయి దయాళుదేశము వైపునకువెళ్ళి యథార్థసుఖస్థానమును చేరుకొని, అజరామరమైనగతిని పొంది రాధాస్వామిదయాళుని దర్శనానందమును పొందగలదు. అందువలన నేమియు గాబరాపడవలసినపనిలేదు. సావధానముగా మనస్సుతో పోరాటము చేయుచు అభ్యాసమును నిర్మలముగను నేర్పుతోను జరిగించుకొనుచుండవలెను. అప్పుడు పరిశుద్ధి నిర్మలతయు లభించి జీవోద్ధారము సహజముగ నైపోవును.

## 14

### సేవ యొక్క వర్ణన

సేవ మూడురకములు, మొదటిది, సంతసద్గురునకుగాని, సాధువునకుగాని చేయుసేవ; రెండవది, సత్సంగముయొక్క సేవ; మూడవది, భక్తజనులు, ప్రేమీ జనులయొక్క సేవ. పైన చెప్పిన రెండవసేవ ఒక ప్రత్యేకవ్యక్తి కెవరికిని చేయునదికాదు. సంతసద్గురువు విరాజమానులై యున్నపుడు వారిసేవయు, లేనపుడు సంతసద్గురువునకు కూడా తండ్రియైన రాధాస్వామిదయాళునియొక్క సేవయు మొదటితరగతిసేవ. మూడవతరగతిసేవ తన కుటుంబస్థులకు కులీనులకును చేయు సేవవంటిది. అనగా ఇంటికెవరైనను మిత్రులు, బంధువులు వచ్చినపుడు, వారికి ఆహారపానీయముల నందించుట, వారితో కలసిమెలసి తిరుగుట, కబుర్లుచెప్పుట, వారిని సంతోషపెట్టుటయు జరిగించుచు అనేకవిధములసేవ నెట్లుచేయుదురో, అనగా, వారికి అనేకవిధములుగా ఆతిథ్యసత్కారము లెట్లుచేయుదురో అట్టిదే. ఈ మూడురకముల సేవలు నాకేతరహాకు చెందవు. మొదటి రెండురకముల సేవలు నొకటే, అనగా సమానమే. మూడవరకము సేవలో కొద్దిగా తేడా యున్నది. అయిన నీమూడురకములసేవలే పరమార్థప్రధానమైన సేవలుగ పరిగణించబడును. ఎవరైనను ఈమూడురకముల సేవలును నిష్కామముగా చేసిన యెడల వారికి మహోత్కృష్టఫలితము లభించును. అందుకు బదులుగా రాధాస్వామిదయాళురు ఆసేవకునకు ప్రేమసంపత్తును దయచేయుదురు. అప్పుడు రాధాస్వామిదయాళుని చరణములందు ప్రీతిఉత్పన్నమై జీవకళ్యాణ కార్యము నెఱవేరనారంభించును.

---

1. పిండీ మనస్సు అనగా పిండదేశపు వాసనలతోకూడిన నీచమనస్సు.

ఏవ్యక్తి ఈప్రపంచముయొక్క నశ్వరత్వము తెలిసికొని, దీనినుండి భయభీతుడగునో, ఎవనికి ఇచ్చటి బాధలను కష్టములను చూచినందువలన ఇచ్చటి భోగములనుండియు, ప్రాపంచిక వాంఛలనుండియు విముఖతగలుగునో, ఎవనికి తన కుటుంబీకులు, ధనము వగైరా బాహ్యాబంధనములనేగాక తన శరీరమనెడి బంధనమునుకూడా వదల్చుకొని పోవలెననెడి చింతగలిగి "ఓ భగవంతుడా, అనేకవిధ వాసనల ననుసరించి నేను ధరించవలసివచ్చిన యీ శరీరమనెడి కఠిన బంధనమునుండి నన్నెపుడు ఎవ్విధముగ విడిపించెద" వని హృదయమునుండి ప్రార్థనబయల్వెడలునో అట్టివ్యక్తికి సద్గురువులభించినతోడనే చిత్తము శాంతించును. పిమ్మట సద్గురువు తన దివ్యేచ్ఛమూలమున నతనియందు దయాకటాక్షములు చూపి ఆధ్యాత్మిక మార్గము యొక్కయు, సిద్ధాంతస్థానము యొక్కయు రహస్యములను అతనికిచెప్పినయెడల నతడు మహోత్సాహముతో పారమార్థికాభ్యాసము చేసికొనును. ఈ విధముగ నతడు తన చిత్తమును అభ్యాసములో పూర్తిగాలగ్నముచేసికొన్నపు డతనికి చెప్పనలవికాని ప్రేమ యుత్పన్నమగును. ఒక పురుషుడు తన భార్యకొఱకుగాని, ఒక కాముకుడు తను కామించిన స్త్రీ కొఱకుగాని వస్త్రములు కొనిపెట్టుచున్నపుడును లేదా మరొక పని పాటలు సాగించునపుడును ఆక్రయవిక్రయముల నిమిత్తమై వెచ్చించిన సమయమంతయు నతడు తన స్త్రీని గురించియే తలచుకొనుచుండును. ఆ సరకు వగైరాలు ఆమెకు నచ్చవలయుననియు, నామె నెట్లైన సంతోష పెట్టవలెననియు నతడు ఆలోచించుచుండును. ఆపని కొనసాగుపఱకు నతని ధ్యానము మరొకవైపునకు పోనేపోదు. అటులనేప్రేమీభక్తుడు ఎన్నిపనులు చేయుచుండినను, భగవంతుని ధ్యానములోనే లీనమైయుండును. ఇదేఅసలైన మొదటి రకము సేవ. ఇదియే సంతసద్గురువు యొక్కయు రాధాస్వామిదయాళునియొక్కయు సేవ. అన్నిటి కన్న గొప్పదగ్గా ఈసేవకే చెందును. ఇవియే స్మరణ, ధ్యానభజనాభ్యాసములు.

మూడవ రకము సేవనేయెప్పుడు చేయుచుండనవసరము లేదు. అందులో ఫలితము అంతయెక్కువ త్వరగా చేకూరదు. మూడు రకముల సేవయు చేయుచుండవలెను. అప్పుడే జీవుడు ఉద్ధారమార్గమందు సహజముగా ముందుకు పోగలుగును. ఇంక ప్రథమశ్రేణి సేవమాత్రము ముఖ్యముగా నియమముగా ప్రతి దినము 4 సార్లు లేక రెండుసార్లైనను కొంచెము కొంచెము సేవ ఉత్సాహపూర్వకముగా చేయవలెను.

సంస్కారీ జీవుల సంగతి వేరు. అట్టివారు భగవంతుని భండారము నుండియే వత్తురు, వారు చిన్నతనములోనే భక్తి చేయ దొడగుదురు. హుజూర్ రాధాస్వామీ దయాళు రే స్వయముగా ఈలోకమునకు దయచేసి 6 సం॥ల ప్రాయములోనే జీవులకు పరమార్ధ దానము సేయుట ప్రారంభించిరి. ఇటులనే ముందు కూడా తిరిగి అప్పుడప్పుడు దయచేయగలరు. అయినను సంస్కారము లేర్పడునిమిత్తమై అవలంబించవలసిన విధానము నిరంతరము సేవాభావముతోను భక్తిభావముతోను ప్రవర్తించుటయు దివ్యేచ్ఛతో అనుకూలించి నడచుకొను టయునే. ఈవిధముగ నుద్ధారమార్గమున ప్రయాణము సాగించుకొనుచుండ వలయును.

ఈప్రపంచములో మాయకు, కాలునికిని అత్యాధికప్రభావము గలదు. వా రిద్దఱును తమ అడ్డంకుల నన్నిప్రక్కల పఱచుకొని తయారుగనున్నారు.

"గురు తాడేఀ సత్సంగీ ఝింకేఀ కాల లగాఈ ఐసీ లీకేఀ"

అర్థము :—గురువు కొంచెము శిక్షించినచో సత్సంగి దుఃఖించును. ఇట్టి అడ్డు లేక విఘ్నములనే కాలుడు పన్నినాడు.

అయినను రాధాస్వామీదయాళునిదయ నూతగాచేసికొని కాలుని జాలములను, బంధనములను త్రెంచుకొని దాటుకొనిపోవలెను. వారిచరణ ములయందు జేరుకొనవలయునను ఆసక్తిని దృఢముగ నుంచుకొనవలెను.

బంధనము కల్పించునట్టి సేవ చేసినందువలన ప్రయోజనములేదు. ఎట్లనగా ఒక సత్సంగ సేవయే యెవనికైనను లభించినచో నతడు అది తీసివేసినపుడు మన స్సులో బాధపడును. నిజముగ నేపురుషునిసేవ చేయబడుచున్నదో ఆ పురుషుని యందు ప్రేమభావము నుంచుకొనవలెను కాని చేసెడిసేవమీద నుండకూడదు. ఈ సంగతిమీరు బాగుగ అమలులో పెట్టుకొనవలెను.

## 15

### మానవుడు పశుసమానముగ ప్రవర్తించకూడదు.

11 మే 1907 :—ప్రస్తుతమున్న పరిస్థితితో సంతోషించుచు అంత టితోనే ఆనందమగ్నుడై తృప్తినొందుచు, ముందువెనుకలు ఆలోచించకుండ నుండిపోవుట పశులక్షణము. ఒక బలిసినయెద్దును చూడుడు. దానికి కడుపు

నిండుగ తినుటతప్ప వేఱు చింతకాని, ముందు వెనుకల యాలోచనకాని యుం డవు. ఈ విధముగనే యుండినచో మానవునకును పశువునకును భేద మేము న్నది ? ఇది కేవలము పశుత్వము, నిర్లక్ష్యమును. వర్తకులు ఒక్కొక్కపైస, ఒక్కొక్క గవ్వంతలాభముకొఱకుగూడ నెట్లు పట్టుదల వహించుచుందురో చూడుడు. ఒక్కొక్కపైసనుకూడ వారు చేతితో ప్రయోగించి చూచుకొందురు, ఒకగవ్వంత తేడా వచ్చినను వారు తలలు బ్రద్దలుచేసికొనుటకు సిద్ధపడుచుం దురు. అట్టిజీవులు హితబోధలకు వినువారు కారు. వారి కేదైన నొక మహా పత్తుకాని, దుఃఖములు బాధలుకాని కలిగినపుడే వారు దేవీదేవతలను, భూత ప్రేతములు మున్నగువానినన్నిటిని, ఆశ్రయించుట మొదలిడుదురు. వారివారి స్థలములలో ఆచరణలోనున్న పారమార్థిక కార్యక్రమమంతయు చేయుచుం దురు. గణేశునియెదుట సాష్టాంగపడి, "ఓప్రభో, మమ్ములను రక్షించుడు, మాకు సహాయము చేయుడు" అని మొక్కిపెట్టుకొని పిమ్మట పూజాపురస్కార ములర్పింతురు. దారిద్ర్యము వచ్చినట్లయితే, "ఓ ప్రభో మా కీమాత్రము ఐశ్వ ర్యము గలిగినచో మీ కందులోనుండి ఇంతవఱకు అర్పించుదుము" అని ప్రార్థిం తురు. ఱాతివిగ్రహమైన గణేశుడుమాత్రము మాటలాడడు, వినడు. "ఓ ప్రభో, మా కాంతర్యమున దర్శనమిండు. ఆ దర్శనానందమును పొందగోరు చున్నాము" అని మాత్రము ప్రార్థన చేయనేరరు. ఇది పరమార్థమా, లేక దోపిడి వ్యాపారమా ? ఇక దైవయోగముచే వారికోరిక నెఱవేరినచో. మఱి సంతోషము పట్టలేకుండ పరవశమైపోయి అదియు పారమార్థికాభ్యాసమనెడి దురభిమానములో పడిపోవుదురు. ఇట్టివారు సంతుమహాత్ముల గ్రంథములను వచనములను శ్రద్ధగా నెట్లు చదివి అవగాహన చేసికొనగలరు ? ఇట్టిజీవులు శుద్ధ మూర్ఖులు, కేవలము పశువులు. అట్టివారికి బోధలుచేయ నవసరములేదు. "సరే ఈవిధముగ నేడ్చి మొత్తుకొనగ నైహికవాంఛలైతే తీరిపోయినవే అను కొనుడు. కాని దేహపతనసమయములో చిట్టచివర గలిగెడి మహాదుఃఖసంతా పము విషయములో నేమి జాగ్రత్తపడితి"రని సంతుమహాత్ములు వారిని రెట్టించి ప్రశ్నించినచో వారు "ఆ దుఃఖ మందఱును సహించవలసినదేకదా ! ఆ సమయ మువచ్చినపు డదికూడ సహించెదము" అనియే సమాధానము చెప్పుదురు. చింతలేని యెద్దుకూడా, ఈవిధముగనే దుఃఖమును సహించును. అట్టిచో, ఈ నరశరీరమును ధరించినందువలన మీ కేమి లాభము కలిగినది ? సాధారణ మానవు లందరేకాదు, పండితులు మున్నగువారుకూడ నిటులనే ఉన్నారు.

## 16

### పరమార్థి లోకములో నిందావమానములను సహించవలసి యుండును.

16 మే 1907 :—"లాజ తజ బదనామ హో జగసే జుదా"

ప్రేమవాణి మూడవభాగము 19వ వచనములో 4వ గజల్ లోనుండి పై చరణముగల శబ్దమును చదివిరి. దానిపైన నీక్రింది వచనమును సెలవిచ్చిరి. ఎవరైనను ప్రపంచమునుండి వేరై పోయినపుడు తప్పకుండ అతడు అపనిందల పాలగును, అనగా అపనిందలుపొందియే అట్లు చేయవలసివచ్చును. ఎవరైన సన్యాసాశ్రమమును తీసికొని ఇల్లు వాకిలి విడిచిపెట్టి పరమార్థమార్గములో ప్రవేశించినచో లోకులతని నెంతదూషించెదరు ? ఎవరైనను సారాయిత్రాగుట ప్రారంభించి మైమఱచిపోవునట్లుగా త్రాగుచు ప్రపంచముతో సంబంధమును ప్రాపంచికవిషయములను వదలిపెట్టినచో నతని కెంత అపఖ్యాతివచ్చును ? అనగా అపఖ్యాతి అతనివెంట నంటియే యుండును. అటులనే సాధుసంతు మహాత్ములందఱును అపనిందల పాలైపోయిరి. మీరాబాయి కెంతఅపఖ్యాతివచ్చెను? అంతదూర మెందుకు ? హుజూర్ మహారాజువారు పరమార్థములో ప్రవేశించి నపుడు వారి నెంత అపనిందచేసిరి ! వారిని సంఘబహిష్కారముకూడా చేసిరి. అయినను భక్తు లిందుకు లెక్కసేయరు. పురాణములలోకూడా ప్రహ్లాదుని చూడుడు, అతడెంత అపనిందలపాలైపోయెనో ! విభీషణుడు, నలమహారాజు, భరతుడు మున్నగువా రెన్ని అపనిందలను పొందిరి ! పర్యవసానమేమనగా హృదయపూర్వకముగ నెవరైన పరమార్థమార్గ మాశ్రయించినచో, నత డెట్టి తరగతి పరమార్థియైననౌగాక తప్పకుండా అపనిందలపాలు కావలసినదే. కావున జగత్సంబంధమైన మానావమానములను విడిచిపెట్టియే పరమార్థమును సంపాదించుకొనవలెను

## 17

### స్తుతినిందలను గుఱించి.

గురు కీ తాడ్ ఔర్ మార్ సహ ధర్ కర్ పియార్
మూరఖోం కీ అస్తుతీ పర్ ఖాక డార్ ॥

(ప్రేమబానీ ౩వ భాగము, వచన్ 19, గజల్ 4).

అర్థము :—గురువుగారు నిన్ను శిక్షించినచో, ఆ శిక్షను ప్రేమభావ

ముతో స్వీకరించి సహించుకొనుము. మూర్ఖమానవులు నిన్ను స్తుతించినచో, ఆ స్తుతులను బూడిదపాలు చేయుము.

దీనిపైన హుజూరువారీక్రిందివచనము సెలవిచ్చిరి :— మనస్సు గొప్ప బలిష్ఠమైనది. కొద్దిగ మానావమానములు గలిగినపుడు అది యెన్నివిధముల ఆలోచనలను పుట్టించును! బహు త్వరితముగ పరమార్థమునుండి విముఖమై పోవును. సద్గురువెప్పుడైనను నీపైన కోపముచేసి నిన్ను దండించినచో, ఒకబాధ పడుచున్నరోగికి వైద్యము చేయుచున్నపుడు వైద్యుడతనిని కత్తితో కోసిగాని మఱింకేవిధముగాగాని యెంత కష్టపెట్టినను కూడా అతడు ఆకష్టము నెట్లు మహాసంతోషముతో సహించుకొని వైద్యునికి కృతజ్ఞతగనుండి ధన్యవాదము లెట్లు చెప్పుకొనునో, అట్లే నీవుకూడ నా దండనను ప్రేమతో సహించుకొన వలయునని సద్గురుని ఆజ్ఞ. ఒక గాడిదయే పొగిడినను గూడ, నీమనస్సు పట్టలే నంత యధికముగ సంతోషపడుచుండును. తమ విషయమే తాము తెలిసికొన లేకుండగ నుండి ఇతరుల విషయము అంతకన్న నేమియు తెలియకుండగనుండి కూడ స్తుతిచేయుచుండెడివారు మూర్ఖులు. అయిన నీమనస్సు అట్టివారితోనే యుండవలెనని కోరుచుండును. అందువలన మూర్ఖుల స్తుతివాక్యములను పెంట పాలు చేయవలసినదని సద్గురువుయొక్క ఆజ్ఞ.

## 18

### చైతన్యము లోనికి లాగికొనిపోవుట—అందును గుఱించిన వివరణము.

18 మే 1907 :—ఆత్మచైతన్యము ముకుళితమైపోవుట, లోనికి లాగుకొని పోవుటకు సంబంధించిన యొక అద్భుతఘటననుగురించి వినుడు. బెంగాలు దేశ ములో నొకస్త్రీ జబ్బుపడెను. ఆమెకు చైతన్యము వెనుకకు లాగుట ప్రారంభిం చెను. ఇంట్లో అందఱు ఆమె చనిపోవుచున్నదనియే తలంచిరి. దైవవశాత్తు అచ్చటకు వచ్చిన ఒక మనిషి ఆమెను వెంటనే ఒకవైద్యునకు చూపించుడని సలహా యివ్వగా, ఒకవైద్యుని పిలిచిరి. ఆ వైద్యుడువచ్చి, యీామె చనిపోయిన మాట వాస్తవమే, కాని నన్నుకూడా ఒకచికిత్స చేయనిండు, ఈమెకు ఆయు ర్దాయమున్నచో బ్రతుకవచ్చునని చెప్పెను. ఆ ప్రకార మతడు ఆ యాడమని షిని తాళ్ళతోకట్టి ఆమె మెడనాడులమీాదను, జిహ్వమీాదను, సర్పముయొక్క గరళమును బాగుగారాసి, నేనిక వెళ్ళిపోవుదునని చెప్పి వెడలిపోయెను. అతడు 10, 12 అడుగులు వేసెడిలోపుననే అతనివెంట మనుష్యులు పరుగెత్తుకొని వెళ్ళి

"ఆమె భూతమైపోయినది, మంచినీళ్లు కావలెననుచున్నది. ఇంటిలోనివారందఱు కూడా పాఱిపోవుచున్నారు, మీరు వెళ్ళి సరిచేయవలయు"నని ఆయనతో చెప్పిరి. అతడప్పుడు తప్పనిసరియై వెనుకకు వెళ్ళి, ఆమెను విషయమేమని యడుగగా, ఆమె అంతులేని దాహము వేయుచున్నదని చెప్పినమీదట, ఆమెకు చాల నీరు త్రాగించి, ఆమె నెత్తిమీదకూడా నీరుపోసిరి. అప్పుడామెకు మెల్ల మెల్లగా తెలివివచ్చినది. ఇదంతయు జరిగి ఏడుసంవత్సరము లయినది. ఆ స్త్రీ ఇప్పటికిని జీవించియున్నది. అటుపిమ్మట ఆజబ్బు ఏమిటని డాక్టర్లను సలహా చేసిరి. కాని డాక్టర్లకు, వైద్యులకు నేమి తెలుసును? వైద్యుడు విషమును పైనతాఁసినవిషయము నట్లుండనిండు, అదివేఱు. పిండమునకు మృత్యువు కలుగుట ప్రారంభించినపుడు, పంచప్రాణములును, చైతన్యాభాసయు మూలాధారమునుండి మొదలిడి వెనుకకు లాగివేయుచు కంఠచక్రమువఱకు వెళ్ళినపుడు, ఈతత్త్వములు పంచప్రాణములు చైతన్యాభాసయు నచ్చట ప్రోగైపోవును అప్పుడే యీ పరిస్థితి, అనగా కంఠములో గుడగుడ ధ్వనియగుట ఇత్యాది లక్షణములు బయల్దేరును. అచ్చటి కవి చేరుకున్నంతమాత్రముననే మృత్యువు పూర్తిఅయిపోదు. ఆ స్త్రీయొక్క ఆత్మచైతన్యము ఆ స్థానమువఱకుమాత్రమే లోనికి లాగివేసెను. అందుచే ఆమె నిజముగ మరణించలేదు. చైతన్యాభాసయు మిగిలినవన్నియుగూడ ఆఱవచక్రముదాఁటి పైకి పోయినపుడే మృత్యువు సంభవించి, జీవుడు పిండమునుండి పూర్తిగా వేఱైపోవును. అట్లుకాని పరిస్థితిలో మరణము సంభవించనేరదు

## 19

జీవుడు తన నిర్బలత్వము తెలిసికొని దీనుడు కావలెను. స్మరణధ్యానములు, భజనాభ్యాసము పట్టుపట్టి చేయవలెను. మొట్టమొదట కొంతకాలము నామస్మరణ చేసినచో ప్రేమపుట్టును. అపుడు శబ్దము ప్రకటమగును. అట్లుగాక శబ్దాభ్యాసమునే మొదటినుండి చేయువారికి అహంకారము పెరుగును కాని పారమార్థికలాభ ముండదు.

జీవుడు యెప్పుడు తన బలపౌరుషములను విడిచిపెట్టునో, మరియు తన్ను చేతకానివానిగా తెలిసికొనునో అప్పుడు, "ఓ ప్రభూ, నాకేమియు శక్తి లేదు, మీరు నాకు సహాయమిచ్చుచుంటిచో, నేనొక అడుగుకూడ ముందుకు వేయలేను" అని ప్రార్థించును. అతడు దీనుడైనపుడే, అతని హృదయమునుండి యీ విధ

మైన మొఱ్ఱ వచ్చును. సముద్రములో మునిఁగిపోవుచున్నవా డెట్లు మొఱపెట్టు కొనునో, అటులనే యితడుకూడా సహాయముకొఱకై మొఱపెట్టుకొనును. ఈక్రింది చరణములో హాఫిజ్‌గారు చెప్పినట్లు, అభ్యాసికివచ్చెడి కష్టము లతని కొక్కనికితప్ప నితరుల కేమియు బోధపడవు.

శబే తారీక్–ఓ–బీమే మౌజ్–ఓ–గిర్దాబే చునీఁ హాయల్ ।
కుజా దానంద్ హాలే మా సబుకసారానే సాహిల్ హా ॥

అనగా :—రాత్రి గాఢాంధకార మొకప్రక్కన, కెరటములభయ మింకొక ప్రక్కన, పైగా సుడిగుండము లెటుచూచినను. ఒడ్డునకూర్చుండి, ఇట్టిఆపత్తుల నెన్నడు నెఱుఁగనివారికి మా యీ పరిస్థితి యేమిబోధపడును ? ప్రాపంచికజీవుల కీకష్టమనగ నెట్టిదో అసలే తెలియదు. సత్సంగులలోగూడ చాలమందికి ఆత్మ నారోహింపచేయుటలోగలకష్టమెట్టిదో తెలియదు.

మనస్సు చాల దుష్టస్వభావముగలది. కావున నది అభ్యాసమునకు కూర్చుండనివ్వదు. భజనాభ్యాసము చేయునపుడు, ఒక్కొకపుడు దురద వేయును, లేదా దోమలు కుట్టుచుండును, లేదా మఱొక పనియేదైనను జ్ఞాపకము వచ్చును. అభ్యాసి అప్పుడు మనస్సును చాల గట్టిగానొక్కి లోఁగదీసికొనవల యును. ఏరోజున మనస్సు యెక్కువ దుష్టత్వము చూపునో, ఆరోజున అరగం టకుబదులు రెండుగంటలసేపు అభ్యాసములో పట్టుపట్టి కూర్చుండవలెను, లేదా ఊరకనే కండ్లుమూసికొని అట్లే కూర్చుండిపోయినను మంచిదే, కాని నిద్రపో కూడదు. అట్లుచేసిననుకూడా మనస్సు ముక్కలుముక్కలై పోవును. ధ్యానా భ్యాసము మూలమున శీతలత, నిర్మలత, నిర్బంధత, గలుగును ప్రేమభావము మేల్కాంచును. ఈఘటముయొక్క తాళముకప్పను తెఱచివేయుటకు సద్గురు స్వరూపమే తాళముచెవి.

చరణములు :—

గురు కుఁజీ జోబిసరే నాహీఁ ఘట తాలా ఛినమేఁ ఖుల జాఈ,
తా తే శబ్ద కివాడ్, ఖోలో గురు కుంజీ పకడ్
కహేఁ కబీర్ నిర్భయ హో హంసా, కుంజీ బతా దూఁ తాలా ఖులనకీ ॥

అర్థము :—సద్గురువనెడి తాళముచెవిని మఱచిపోకుండ నున్నయెడల నీ ఘటముయొక్క తాళముకప్పను ఒక్కక్షణములో తెఱవవచ్చును. అందుచే

గురునెడి తాళముచెవి పట్టుకొని శబ్దద్వారము తెఱచుకొనుము. ఓహంసా నీవు నిర్భయముగనుండుము. తాళముకప్ప తెఱచుకొనుటకై తాళము చెవిని నేను చూపించెదను. అని కబీరుసాహెబ్ వారు సెలవిచ్చుచున్నారు.

ప్రీతిలేనిదే ధ్యానముచేయుట సాధ్యముకాదు. కావున నామస్మరణ చేయవలసినదని గట్టిగ బోధించబడుచున్నది. ఆనామముచే ప్రతిపాదితుడైన పురుషుడు నామముతోకూడ నుండును. నామముద్వారా ఆనామముగలపురుషుని పొందవచ్చునని యీ క్రింది శబ్దములో చెప్పబడినది. శబ్దముయొక్క ప్రథమచరణము ఈక్రింద వ్రాయబడినది.

జబ్ దేఖా తేజ మైంనే జో మాలిక్ కే నామ కా
దిల్ ఔర్ జాన భేంట హుఏ గురుకే నామకా।

దాని ఆఖరిచరణము యీక్రింద వ్రాయబడినది.

సుమిరన్ సే నామ గురు కే తూ గమగీంన హో కభీ,
మాలిక్ కా ప్యార్ ఆవే జో హో ప్యార నామ కా।

(ప్రేమబానీ 3వ భాగము వచన్ 19 గజల్ 5 చరణములు 114 ల 121 వఱకు).

భక్తజనులు నిరంతరము నామమును తమ శ్వాసలలో కలుపుకొని ఆరాధన చేయుచుండవలెను, అనగా నామజపము చేయవలెను. నామస్మరణ పరిపక్వమైనపుడు ధ్యానాభ్యాసము మంచి బాగుగా సాగును. అప్పుడు భక్తుడు తనఇష్టప్రకారము, కావలెనన్నచో స్మరణఒక్కటే చేసికొనవచ్చును, లేదా స్మరణ ధ్యానములు రెండునుకలిపి చేసికొనవచ్చును. సద్గురువు శబ్దస్వరూపులు. గురుస్వరూపము ధ్యానముచేయుటవలన శబ్దముకూడా వెనువెంటనున్నట్లే అయిపోవును. ఊర్ధ్వస్థానములలో ప్రతిస్థానములోను నామము, రూపము, శబ్దమును, యీమూడు నేకమైపోవుచుండును. ఈక్రింది చరణములలో నీవిషయము స్పష్టముగా చెప్పబడినది.

గురు కీ మూరత బసీ హియే మేం, ఆఠ్ పహర్ గురు సంగ రహాయే।
అస గురు భక్తి కరీ జిన పూరీ తే తే నామ సమాయే।
స్వాంతి బూంద జస రటత పపీహా, అస ధున నామ లగాయే॥

అనగా మొదట నామస్మరణ చేయవలయును. అప్పుడు గురుచరణములయందు ప్రేమపుట్టును. తరువాత శబ్దము ప్రకటమగును. తఱుచు జనులు స్మరణ చేయనేచేయరు. మొదటనే శబ్దాభ్యాసము చేయవలెనను పట్టుదలతో నుందురు. అట్లు చేసినయెడల వారు అహంకారపూరితులై పోవుదురు. అట్టివారు తాము స్వయముగ గురువే అయిపోయినట్లు ప్రకటించుకొందురు. లేదా ప్రేమ భావము నశించి సత్సంగమును వదిలిపెట్టి వెళ్ళిపోవుదురు. ఇంతకు పర్యవసానమేమనగా, జీవుని స్వప్రయత్నమువలన నేమియు నేకూరదు. శబ్దముకూడా గురుకటాక్షమువలననే ప్రకటము కావలయును. గురుముఖత్వము కలుగువఱకు, ఆత్మయొక్క ఆరోహణ మెంతమాత్రము సాగదు.

గురు భక్తి బిన శబ్ద మేం పచతే
సో భీ మానుష మూరఖ జాన్ ॥

శబ్ద ఖులేగా గురూ మెహర్ సే, ఖైంచే సురత గురూ బలవాన్ ।
గురుముఖతా బిన సురత్ న చఢతీ, పూాట గగన న పావే నామ్॥
గురుముఖతా హై మూల సబన కీ ఔర్ సాధనసబ్ శాఖా జాన్ ॥

అర్థము :—గురువునకు భక్తి చేయకుండా శబ్దము నభ్యాసముచేయు పురుషులు మూర్ఖులని తెలిసికొనుము. సద్గురువు బలవంతులు. వారే యీ ఆత్మను ఊర్ధ్వముగా తీసికొనిపోవలెను. గురుకటాక్షమువలననే శబ్దము ప్రకటమగును. గురుముఖత్వము సంపాదించుకొననిదే ఆత్మ పైకారోహించలేదు, ఆకాశము తెఱచుకొనదు, నామము లభించదు. అన్నిటికిని మూలము గురుముఖత్వము. మిగిలిన సాధనలన్నియు దానినినుండి బయల్వెడలునట్టి శాఖలుమాత్రమే.

## 20

<u>ప్రపంచమును త్వరగ విడచిపోవలయునను కోరిక యుండుట పరమార్థ విషయములో గొప్పలాభకరము. ప్రపంచములో రివాజుగనున్న కపటప్రవర్తన.</u>

స్మరణ, ధ్యాన, భజనలు, పవిత్రగ్రంథపాఠమును చేయు సత్సంగులు చాలమందే యున్నారు కాని ప్రాపంచిక గందరగోళములనుండి త్వరగా తప్పించుకొని పోవలయునని హృదయపూర్వకముగ గోరువారు, అనగా శరీరమును వదిలిపెట్టి భగవచ్చరణములను చేరుకొనవలయునని కోరువారుమాత్రము చాల

తక్కువ. ఈవిధమైన హార్దికవాంఛ ఉండుట గొప్పవిషయము. ఎప్పుడైన నొక గొప్పకష్టమువచ్చి మీదపడినచో, అప్పటికప్పుడు చావవలెనని కోరుకొనుట వేఱు. కాని ప్రాపంచికసుఖములన్నియు గల్గియుండిననుకూడ హృదయమున నీసంసారమందు విరక్తియు, భగవచ్చరణములందనురాగము నెప్పుడు పెంపొందునో, అప్పుడే యెవనికైనను ప్రేమ యుదయించిన ట్లెంచవలయును. చెప్పుడు మాటలనుబట్టి ఎవరైనను చనిపోవగోరుట వఱొకవిషయము. కాని సామాన్యముగా చావుమాటరాగానే పరిపరివిధములైన ఆలోచనలు బయల్దేరును. తన భార్య యెట్లు కాలక్షేపము చేయుననియు, తన అయిదుగురుపిల్లలను యెవరు పాలించెదరనియు మున్నగునవి. నిజమైనపరమార్థికి పరమపదమును పొందవలెననుకోరిక తప్పకుండ నెల్లవుడు నుండుచునేయుండును. అతని హృదయమున నిర్మలపరమార్థ మెంతయెక్కువ నాటుకొనునో అంతయెక్కువ నిర్మలముగ నభ్యాస మతనికి సాగుచుండును. ఈవిధమైన వాస్తవభక్తులను భగవంతుడు స్వయముగ నాకర్షించుచుండును.

"కావలెనన్నచో ప్రపంచములో నీవు కపటముగ ప్రవర్తించవచ్చును, కాని సద్గురువుతో మాత్రము నిష్కపటముగనే ప్రవర్తించవలసియున్నది." అని సారబచన్ గద్యభాగములో నున్నది, దీనికి ప్రపంచములో దగా మోసము చేయుచుండుమని అర్థముకాదు. కపటప్రవర్తన అనగా, ఎవరైననొకరు చనిపోయిన బంధువువిషయములో విచారము తనకు లోలోపల లేకపోయినను అట్లున్నట్లు తెలియజేయుటకై ఒక నల్లబట్టను తన కుడిచేతిమీద ధరించవచ్చును. ఒకడు తన పై అధికారి యెంతచెడ్డవాడు చేతకానివాడైననుకూడ నతనికి పైపైన సలాములు కొట్టుచుండవచ్చును. ఈవిధమైన ప్రవర్తన కపట ప్రవర్తన. అయితే లోకములో నిట్టిప్రవర్తన రివాజుగ నున్నదే.

## 21

<u>శూరులు చేయు యుద్ధమునకు, సాధువుల జీవితమునకు పోలికలు, వ్యత్యాసములు.</u>

**30 మే 1907 :—** ఈరోజువచనములో శూరులుజరిపెడి యుద్ధమునకును, సాధువులు చేయుచునుండవలసిన యుద్ధమునకును సాదృశ్యము తెలియబఱచిరి. సైనికులు రణక్షేత్రములో అన్నపానాదులులేకుండా ఇఱువదినాల్గు, ఇఱువది

ఐదేసిగంటలసేపు అట్లె యుండిపోవలసి వచ్చుచుండును. ఒక్కొకప్పుడు మట్టమధ్యాహ్నము వేళ మండిపోవుచున్న ఇసుకలో గంటలకొలది బోరగిలి పరుండవలసివచ్చును. సైనికులకు ముందుకువెళ్ళి కత్తులు కఠారులతో యుద్ధము చేసినచో బాగుండుననిపించును కాని, పై అధికారి అట్టిఆజ్ఞ నివ్వడు. ఒక్కొకపుడు తనక్షేమము కోరువాడేలేడు, తనకష్టముల నడిగెడివాడేలేడని అనిపించును. అయినను యుద్ధములో జయమునిమిత్తమై సేనానికి అవసరమనితోచిన పనులనన్నిటిని చేయుచునే యుండవలెను. ఒకనంద రెండువందలమంది చనిపోయినను సరే, లేదా సైన్యమున కేదైన పెద్దప్రమాదము వచ్చిననుసరే ఆజ్ఞప్రకారము తప్పక ప్రవర్తించవలసినదే. ప్రజలు యుద్ధము చేయనక్కఱలేదు కాని ప్రజల సంరక్షణకొఱకై సైనికులుమాత్రము పోరాడవలయును. సైన్యములోని ఖండములన్నియుకూడ యుద్ధము చేయనవసరముండదు. పూర్వకాలములో బాణవిద్య మున్నగువానిలో ప్రవీణులైనవా రొకరిద్దఱుమాత్రమే యుద్ధముచేసెడివారు. సమస్తసైన్యముయొక్క జయాపజయములు ఆ యొకరిద్దఱి శస్త్రవిద్యానైపుణ్యముమీదనే ఆధారపడియుండెడివి.

సాధువుగనుండుటగూడ వేళాకోళము వెక్కిరింతవంటి సులువైనపని కాదు. ఒకరోజు జ్వరము వచ్చుసరికి జనులు తల్లక్రిందులైపోవుచుందురుకదా ! నెలలకొలది యుండెడి జ్వరమును నెత్తిని సంతోషముగా తెచ్చిపెట్టుకొనుట సులువుకాదు. ఆజ్వరముకూడా కాలునిదే కాని మఱొకటికాదు. సాధువుల పరిస్థితి నెలలతరబడి సహించవలసిన జ్వరమును, సంతాపమును, సంతోషముగా కోరి నెత్తిని పెట్టుకొన్నట్లుండును. సాధుసంతులు తమ పవిత్రగ్రంథములలో సాధువును శూరులతోపోల్చి వ్రాసినవిషయములు కేవలము సాదృశ్యము. కొఱకును, కవిత్వముకొఱకును వ్రాయలేదు. వారి పవిత్రగ్రంథములు అనుభవరూపమని చెప్పబడును. వెల్తురువచ్చినపు డేదైనపదార్థ మెట్లు సరిగకనిపించునో అట్లే యేవిషయమునుగుఱించియైనను యథార్థస్థితి ప్రకటించి వ్రాసినపుడు దానిని అనుభవరూపమైన గ్రంథమని యందురు. అగ్ని, పవన, జలముల భండారములలోనుండి వెళ్ళవలసి వచ్చునని పవిత్రగ్రంథములలో వ్రాయబడినది.

"సంసార అగ్ని భండార్"

అగ్నిహోత్రభండారము మధ్యనుండి వెళ్లునపుడు గలిగెడి తపనబాధను సహించుట ఆటకాదు.

ఘుర ఫూఁకా హమ అపనా, లూకాలీనా హాథ్
వాహూ కా ఘుర్ ఫూఁకదూఁ జో చలే హమారే సాథ్ ।

అర్థము :— మేము మాయిల్లు కాల్చివేసికొన్నాము. చేతిలో నిప్పుకాగడా పట్టుకొనియున్నాము. మాతోకూడ వచ్చువారి యిల్లుకూడా కాల్చెదము.

శూరులుకూడ యుద్ధసమయములలో అన్నపానాదులు లేకుండ నుండి పోవలసివచ్చినపుడు, కొంతదెప్పుళ్లు, ఫిర్యాదులు నొకొక్కప్పుడు చేయుచుందురు. కాని యుద్ధము ఆఖరై పోయి సంధి జరిగినపిదప పట్టణములలో నుండు నపుడు, వారికి వెక్కసమైపోయి తిర్గి యుద్ధముచేయవలెనని కోరిక బయల్దేరుచుండును. భక్తుల పరిస్థితికూడ నిట్టిదే. క్రొత్తగా భర్తీచేసిన సైనికులను పహారాపనిలో పెట్టుదురుకాని, యుద్ధములోని కెట్లుపంపరో, అపక్వమైన క్రొత్త సత్సంగులపైనకూడ నట్లే మొదటలో కాఠిన్యము చూపబడదు. లేక, ఒకవేళ అతని కట్టి క్లిష్టపరిస్థితి కల్పించబడినను అతడు దానిని భరించలేక గాబరాపడిపోయిన సందర్భములో, నప్పటిమట్టుకు దానిని తప్పించివేయుదురు. కాని మరల కొంతశక్తి చేకూరినపిదప నతడు తిర్గి యుద్ధరంగములోనికి తీసికొనిరాబడును.

## 22

సత్సంగి అనేకదయానుగ్రహముల యనుభవములను పొందుచుండును. కాని మఱచిపోవుచుండును.

31 మే 1907 :—ప్రతిసత్సంగికి సద్గురువు దయాకటాక్షములు చూపించిన అనుభవములు వందలకొలఁది బాహ్యముగను, ఆంతరంగికముగను కలుగుచునే యుండును కాని అతడు మఱచిపోవుచుండును. అతనికెపుడైన నొకపెద్దదెబ్బ ఒక్కటే తగిలిననుకూడ దానినిమాత్రము జీవితమంతయు జ్ఞాపకముంచుకొని దానిని గుఱించి చెప్పుకొనుచునే యుండును. ఏదైన దయానుభవము గలిగినచో ఆవేళమట్టుకు కృతజ్ఞతతో ధన్యవాదములను చెప్పుకొనుచు శాంతిగ నుండును కాని, మరల మఱచిపోవుచుండును. దీనికంతకు కారణమేమనగా ఇక్కడ కాలుని ప్రభావ మధికముగనున్నది. కాలుడు దయానుభవములను జ్ఞాపకముండనీయడు, పైగా విరుద్ధవిషయములను కష్టములను బాగుగా జ్ఞాపకముచేయుచుండును. లోకములో నొకపెద్దఅధికారి యెవనియందైన దయచూపి అతనికి లాభము కలుగచేసినను, లేదా అట్టి ఉపకారము చేయులాగున ఆశ

పుట్టించినను ఆయధికారి ఒకప్పుడు క్రోధముతో నతని నెంత యధికముగా కొట్టి తిట్టినను కూడ వానినన్నిటిని ప్రాపంచికజీవు డైతే సంతోషముగనే సహించు కొనుచు, పైగా "ఆయన మాకు మహోపకారము చేయువారు" అని చెప్పు కొనుచుండును. కాని పరమార్థము విషయములో నట్టి యాలోచన యుండదు.

## 23

మహారాజ్ సాహబ్ వారు రాజకీయాందోళనలలో పాల్గొనువారిని మఱి కొందరిని సత్సంగములోనికి రాకూడదని ఆజ్ఞ చేసిరి.

1 జూన్ 1907 :—ఒక సత్సంగి భేంటు అర్పించబోయెను. అప్పుడు మహారాజసాహబ్ వారు బాబూప్రేమప్రసాదుగారిని పిలిచి, "ఇతని భేంటు తీసికొనకుము, ఇతనిని సత్సంగమునకు రానివ్వకుము. అతనికి తెలియజెప్పుము", అని ఆంగ్లమున సెలవిచ్చిరి.

అందుపైన బాబూప్రేమప్రసాదుగారు అతనిని దూరముగా తీసికొని వెళ్ళి విషయమంతయు బోధపఱచి చెప్పిరి. తరువాత మఱికొందఱి సత్సంగులను గుఱించికూడా అడిగి తెలిసికొని ఫలానాసత్సంగి మఱొక వ్యక్తిని కొట్టినందు వలన కారాగృహశిక్ష ననుభవించెనుకదా, ఇపుడతడువచ్చి సత్సంగములో కూర్చుండెనాయని ప్రశ్నించిరి. "ఔనుప్రభో" అని ఎవరో సమాధానము చెప్పగా, "ఎవరి యనుమతితో కూర్చొనుచున్నారు ? అట్లు రానివ్వకు" మని ఆజ్ఞాపించిరి. మఱొకసత్సంగినిగుఱించి, "అతని వెంట సి. ఐ. డి. పోలీసువారు తిరుగుచున్నారుకదా" అని ప్రశ్నించిరి. ఇంక నెందఱో సత్సంగులనుగుఱించి కూడా వారిని సత్సంగములోనికి రానివ్వవద్దని మున్షీగారితో సెలవిచ్చిరి. బాబూ ప్రేమప్రసాదుగారిని యీ విషయములో మోమోట మేమి చూపవద్దని హెచ్చరించిరి. "వీరందఱును స్వయముగా మహామలినులై యుండి, సంఘమునకుగూడ మాలిన్యమును అపఖ్యాతిని కలుగజేయుదురు. నా కాచట్టములు శాసనములు తెలియవుకాని, ఇట్టివారిని సత్సంగములోనికి నేను రానీయను." అని చెప్పి తిరిగి యిట్లనిరి. "సత్సంగులలో నెవ్వరైనను స్వదేశీయ ఆందోళన, రాజకీయ ఆందోళనలలోను పాల్గొనుట నాకెంతమాత్రి మిష్టములేదు. ఇది నేనీ రోజున నందఱియెదుట చెప్పెదను. సత్సంగు లీగడబిడలలో కలుగజేసికొనకుండా తమ పరమార్థసంబంధమైన అభ్యాసమొక్కటే చేసుకొనుచుండవలెను. ఇందులో తమాషా యేమనగా అనుభవములేని చిన్నపిల్లలే అందరికన్న ముందీ

యాందోళనలలో దిగుచున్నారు. వీరికి హానిలాభములు తెలిసికొనగల అనుభవజ్ఞాన మెక్కడ? మనమందఱ మిట్లు నిర్భయముగాకూర్చుండి సత్సంగము చేసికొనుటకు సావకాశమిచ్చుచున్న యీ పరిపాలన మెంత శ్లాఘనీయమైనది. మిగత రాజ్యములలో నెచ్చటైన నీవిధముగా కూర్చుండనిత్తురా?

## 24

సద్గురువునందు ప్రీతియుండవలెను. రాధాస్వామీనామమే భగవంతుని నిజనామము. ఆనామమును జపించినచో భగవంతునితో నైక్యములభించును.

2 జూన్ 1907 :—పరమార్థము సంపాదించుకొనునిమిత్తము సద్గురువు లభించుట అత్యావశ్యకము. సద్గురువునందు ప్రీతిగలుగువఱకు ప్రేమ యుత్పన్నముకానేరదు. సద్గురువునందు ప్రీతి యుదయించినపుడు ముఖ్యముగా సద్గురుస్వరూపధ్యానమును, రాధాస్వామీనామస్మరణను చేయవలెను. ఆత్మ ఆనామమునుపొంది దానిలోనైక్యమగుచున్నకొలది, శబ్దము తనంతటతానే ప్రకటము కాదొడఁగును. కాని చాతకపక్షి స్వాతివర్షపుబిందువుకొఱకు పరితపించినవిధముగ పరితాపముకూడ కొద్దిగా ఉండవలయును. అన్నివిషయములును సారబచన్‌లో వరుసగా వ్రాసియున్నవి. కాని కొద్దిగా శ్రద్ధపెట్టి చూచుకొనవలెను. అప్పుడే భక్తిభావములో సంపూర్ణముగా ప్రవర్తించుట శక్యమగును.

రాధాస్వామీనామము పరమపురుషునినామము, కాని మఱొకరుపెట్టుకొన్న పేరుకాదు. సాక్షాత్పరమపురుషుడే స్వయముగా నరరూపముధరించివచ్చి ఈనామమును ప్రకటపఱచిరి పరమపురుషునియొక్క అసలైననిజనామ మిదియే. ఈనామధ్వని శరీరములో నూర్ధ్వభాగమున ననుక్షణము అగుచునేయున్నది. దీనిసహాయముమీదనే ఈసమస్తరచనయు నిలబడియున్నది. ఇదియే మహాప్రభావముగలనామము. ఈనామముయొక్క యథార్థతను విద్యాశాలురకును, బుద్ధిచతురతగలవారికిని, ఋజువుచేయుటకై అనేకసహేతుకవాదములను చెప్పవచ్చును. కాని భక్తులకును, ప్రేమీజనులకును ఇదే ఆపరమసర్వేశ్వరునినామమనియు, దీనినే జపించినయెడల పరమపురుషుని పొందవచ్చుననియు చెప్పుట మాత్రమే సరిపోవును.

2 జూన్ 1907 :— సద్గురువునందు భక్తివిశ్వాసములుపుట్టి నామస్మరణము పక్వమగువఱకును శబ్దము ప్రకటముకానేరదు. సద్గురువు సాక్షాత్తురాధా

స్వామీదయాళుని స్వరూపమే. వారిరూపమును ధ్యానముచేసినచో ఆనిజరూపముతో కలిసిపోయినట్లే. రాధాస్వామీనామ మెంతవాస్తవమైననిజనామమనగా, అంతర్యమున దానిస్మరణ పక్వమయినచో నిజనామముతో నైక్యము లభించగలదు. ఈనామము నొకక్రొత్తగాకల్పించిన బూటకపుపేరని ఆక్షేపించువారికి దవడపళ్లురాలునట్లుచేయుటకై వందలకొలఁది ఉత్తమప్రమాణసహితమైనసమాధానములు గలవు కాని సత్సంగులుమాత్రము మామాటలనే ప్రమాణముగా తీసికొనవలయును. హేతువాదములన్నిటికన్న నదియే యుత్తమము. సద్గురుదయాళునియందు భక్తునికి, చకోరపక్షికి చంద్రునియందును, చాతకపక్షికి స్వాతివర్షపుబిందువునందును ఉన్నంత తీవ్రప్రేమ యుండవలయును. అప్పుడే అంతర్యమార్గము తెలిసికొని గుప్తరహస్యములు ప్రత్యక్షముగ కనపడగలవు. ఇరువదినాల్గుగంటలును వారిపైపునకే ధ్యానము ఉండవలెను.

## 25

4 జూన్ 1907 :—రాధాస్వామీమతసందేశ్ లో 128 వ పేరగ్రాఫులో నున్న విషయముపైన వచనము.

కొద్దిగ నెవరినైన నవమానపఱచినయెడల వారు పైకి ఎంతకప్పెట్టినను లోలోపల తప్పకుండ నది వారికి అప్రియముగనేయుండును. మానాహంకారములలక్షణ మిదియే. భగవంతునికి మిగతవికారములన్న నంతగాలెక్కలేదు, కాని ఈలక్షణముమాత్రము చాల అసహ్యముగనుండును. క్రోధియైనచో క్రోధము చూపినపిమ్మట తప్పకుండ నతఁడు పశ్చాత్తాపపడి విచారించును. మఱొకవికారలక్షణము లెవ్వియున్నను కూడ నట్టివాడు తర్వాతపశ్చాత్తాపపడి క్షమార్పణకోరును. కాని అహంభావమున్నవానికి పశ్చాత్తాపపడుటకాని దిద్దుకొనుటకాని యెంతమాత్రముండదు. ఇదియే భగవంతుని కప్రియమైనది. భగవంతుని మహాసభలో ప్రవేశించుట కనుమతి దీనికిలేదు. భగవంతుని మహాసభలోనుండి త్రోసిపాఱవేసినవస్తువెద్దియనగా అహంభావమే. ఈఅహంభావము శిథిలమై ముక్కలైపోయినవానికి హంసపదవిగల్గును. హంసజీవులు భగవంతుని రాజసభలో ప్రేమరసముయొక్కయు భగవద్దర్శనముయొక్కయు మహావిలాసను అనుభవించుచుందురు.

## 26

### అహంభావమును గురించి

5 జూన్ 1907 :— మానవుడు మహాత్కపనులెన్నైనను చేయగలడు, కాని స్వాభిమానమును, అహంకారమును భగ్నముచేసికొనుట అన్నిటికన్న నెక్కువకష్టము. అతని నెవరైన హీనునిగ నెంచినచో సహించలేడు. పైకెట్లగు పడినను స్వాభిమానమునకు దెబ్బతగిలినపుడు లోలోపల బాధలేకుండనుండుట చాలకష్టము. ఈ యహంభావముతోనే భగవంతునికి ప్రత్యేకముగా శత్రుత్వము. దీనినే భగవంతుడు దండించును. లోకత్రయమునకు అధిపతిఅయిన బ్రహ్మదేవుడు అహంకారముమూలముననే రాజసభనుండి తరిమివేయబడెను. అహంకారమును, స్వాభిమానము నెవరికినశించి ప్రేమరూపములోనికిమారిపో వునో అతడే భక్తుడనిపించుకొనును. ఇతరవికారములు, దోషములన్నిటికిని తప్పుచేసినపిమ్మట పశ్చాత్తాపముగల్గును. ఎట్లనగా కోపమువచ్చినను, లేదా మహాక చెడుప్రవర్తనలోప్రవర్తించినను ఆతరువాత తప్పకుండా పశ్చాత్తాపము గల్గును. కాని అహంకారముతో ప్రవర్తించినపిమ్మటమాత్రము పశ్చాత్తాప మనునది యుండనేరదు.

## 27

### మృత్యుమార్గము – అభ్యాసులపైన సద్గురునిదయ.

10 జూన్ 1907 :— మృత్యువుయొక్కమార్గము, తలవెంట్రుకకన్నను సూక్ష్మమైనదనియు, ఆమార్గములో జీవులు ముక్కలుముక్కలుగా తెగి పడి పోవుచుందురనియు సారబచన్‌లో వ్రాసిరి. దీని కర్థమేమనగా ఆత్మ తృతీయ నేత్రములోనుండి పైకిఆకర్షించబడి వెళ్ళిపోవునపుడు దానికి బంధనము లేర్పడి యున్నట్టి గుణత్రియము, పంచతత్త్వములసామగ్రిఅంతయు క్రిందికిరాలిపోవునని విశదపఱచిరి. ఆత్మ ముక్కలుముక్కలుగా తెగిపడిపోవుటయనగా ఇదే అర్థము. నోటితో మాటలుచెప్పటయు, ఊహలు ఊహించుకొనుటయు వేఱుమాట, కాని అసలువిషయము సమయమువచ్చినప్పుడే తెలియును. ప్రేమప్యారీకన్న నెక్కువగాబాధలకోర్చుకొనుమనిషిని నేను చూడలేను. మరణమున కొక క్షణముముందువఱకును ఆమెకు తెలివి బాగుగనున్నది. ఆమె ఆఖరుసమయ ములో మరణమన్న నొకపరిహాసవిషయముకాదని యన్నది. సర్వాంగత్వేన

అంతరాకర్షణ నిజముగవచ్చినపుడే సంగతి తెలియగలదు. ఒక్క సంతులుదప్ప మత్తెవ్వరికి నాబాధ లేకుండగ నుండదు.

భగవంతుడు మహాదయతో సత్సంగులను మరమ్మతుచేయుచున్నాడు. అందుచే వారికి స్థూలలక్షణములు కొంతవఱకు ముందుగనే ముక్కలుముక్కలై తెగిపోవుచున్నవి. కాని ఇందుకు కృతజ్ఞతగనుండుటకుబదులు సత్సంగి "ఇక్కడ నెప్పుడు దెబ్బలమీదదెబ్బలు తగులుచునేయుండును. ఆదెబ్బలు కొంతవరకు సహించుకొన్నపుడు అంతర్ద్వారములేవైనను తెఱచుకొనుటకూడ జరుగుటలే" దని నెపములెన్నుచు, తఱచుగా అప్రతీతిభావములోపడి, సత్సంగమును వదలి వెళ్ళిపోవుటకుకూడ సిద్ధమగుచుండును. ఈమనస్సెప్పుడును సంతానము పది మందిఉండినచో 15నుగురు కావలెననియు, పదునెనిమిదిపౌత్రులు కావలెననియు, తనకుమారులు పౌత్రులలో నెవ్వరికిని జబ్బుచేయకూడదనియు కోరుచుండును, ప్రాపంచికసుఖములు, బంధనములు ఇంక నెక్కువగ పెరిగిపోవలయుననియే కోరుచుండును. ఎప్పుడైనను బంధనములు తెగిపోయి వానినుండి ఆత్మ వేరై పోవు సందర్భము తటస్థించినపుడు, నిజమునకు జీవుడు, తన యభీష్టముమీదను తన కోరికమీదనే అంతయు విడిచిపెట్టబడి యుండిపోయినయెడల తనమనస్సు ఆబంధనముల నింక నెక్కువగా బలపర్చుకొనగోరియే యుండెడిది కావున నట్లు జరుగనందుకు సంతసించి భగవంతునికి ధన్యవాదములే అర్పించవలయును. భగ వంతుడు తన యిష్టమువచ్చినట్లే సాగించి బంధనములను తెగగొట్టివేయుట ఆయనకటాక్షమే.

## 28

సారవచనము 227 వ పేరాలోని విషయముపైన వచనము.

మరణావస్థలోనున్నపు డెవరినైన బాగుగ కనిపెట్టిచూచినచో ఆసమయ ములోగలుగు బాధలెట్లుండునో బోధపడును. అయితే ఆచూచుట అభ్యాసియైనవాడు చూడవలెను, సామాన్యజీవుడైతే, యేడ్చుట మొత్తుకొను టయు తప్ప మత్తేమియు తెలిసికొనజాలడు. అంతవఱకు నేపంచతత్త్వములలో పడి జీవుడు పచనమైపోవుచుండెనో, ఆతత్త్వములు ఆసమయములో ముడుచుకొనిపోవుట మొదలుపెట్టును. అవిస్థూలమగుటచే, తలవెంట్రుకకన్న సూక్ష్మతరమైన యీద్వారములోనుండి పోవునపు డవి ముక్కలుముక్కలుగ

తెగి క్రిందపడిపోవలసివచ్చును. భగవదంశమైనఆత్మనుండి అవి వేఱై పోవక తప్పదుకావున ముక్కలుముక్కలుగా తెగి పడిపోవలయును. అందుమూలమున జీవునికి కొంత బాధకలుగును. ఇటులనే పంచప్రాణములు వెనుకకులాగుకొని పోవుచుండినందునగూడ జీవునికి దుఃఖముకలుగును. ఇంతియగాక, ఇతనివాంఛల ఛాయలు, ఇతనిమనోఆకాశముపైన ముద్రితమైయుండునుకావున, వానిమూల మునగూడ గొప్పతంటాలుబడవలసివచ్చును. ఇంతకు చెప్పనదేమనగా, మరణసమ యము జీవునకు మహాకష్టక్లేశములతోకూడిన సమయము. ఆధ్యాత్మికాభ్యా సముచేయించుటలో నుద్దేశ్యము. మరణాత్పూర్వమే యీభారమును చాల వఱకు తగ్గించవలయుననియే. హుజూర్ రాధాస్వామీదయాళునిశరణ్యము పొంది, రాధాస్వామీమతములో నుపదేశముపొందినవారు, నియమముగా, భక్తిశ్రద్ధలతో అభ్యాసము చేసినచో, ఆఖరుసమయములో వారికి రాధా స్వామీదయాళును స్వయముగావచ్చి ఉపకారముచేయుదురు. అయినను మరణ బాధ కొంతవఱకు తప్పకుండాసహించవలసియే యుండును. ఈ విషయమే క్రిందిచరణములో చెప్పబడినది.

సుర నర ముని ఔర్ దేవతా సాత్ దీప నౌ ఖండ।
కహా కబీర్ సబ్ భోగియా దేహా ధరే కా దండ్ ॥

అర్థము :—నరులు, మునులు, సురులు, దేవతలును, సప్తద్వీపములలోను నవఖండములలోను ఉండువారందరునుగూడా శరీరమునుధరించినందుకు శిక్షను (అనగా శరీరత్యాగసమయములోగల్గు బాధను) అనుభవించిరి అని కబీరువారు సెలవిచ్చుచున్నారు.

ఈశిక్ష నెవ్వరును తప్పించుకొనలేరు. అయితే సంతులుమాత్రము తప్పించుకొనగలరు. బాగుగా ఆలోచించినచో, జీవుల కేయేవిషయములవలన ఆఖరుసమయములో బాధవాటిల్లునో, వానినే అతడు జీవితకాలములో వృద్ధి కావలెనని కోరుచుండుననియు, స్థూలప్రపంచమునకు సంబంధించిన అభివృద్ధి యెంతగలుగునో, అంతకంతయు నదియే దుఃఖమునకు కారణభూత మగుచున్న దనియు తేటపడును. ఎట్లనగా, ఒకనికి ధనము కావలెనని కోరికయుండును. అత నికి ధనములభించి అభివృద్ధియగుచున్నంత కాలము, అతడు దానిలోపడి కొట్టు కొనుచుండును కాని చివరసమయమువచ్చినపుడు దానిని తప్పక విడిచిపెట్టియే పోవలసియున్నది. మామూలుగా జ్వరమువచ్చినపుడు, చూడుడు, ఎంతఅశక్త

తగలుగునో, మనిషి యెట్టిపరిస్థితిలో నుండునో. జీవితకాలములో నెవనికి భగవంతునిదయచే కొంతదుఃఖములు బాధలును గలుగుచునుండునో, అట్టివాడే మరణసమయమునగలిగెడి దుఃఖమును తెలిసికొని, జీవితకాలములోనే మనస్సున భయము తెచ్చుకొని, స్థూలసామగ్రిని తగ్గించుకొనుటకు పూర్తియైన ప్రయత్నము చేయును. అట్టివాడే మహాదృష్టవంతుడైన జీవుడు. బ్రహ్మ పురుషు డవతారమెత్తినపుడు, ఆయనకుకూడా, తనకు దుఃఖములు, రోగములతోను బాధపడువారే నిజమైనప్రియులని చెప్పిరి. ఇచ్చట నేవ్యక్తికి సంతానముండునో, అతడే తనకింకను సంతానమెక్కువ కావలెననియు, తనపిల్లలెవరును చనిపోకూడదనియు, జబ్బుపడకూడదనియు, నెట్టిబాధలు, దుఃఖములు కలుగకూడదనియు కోరుచుండును. కాని హుజూర్ రాధాస్వామిదయాళురు మహాదయచూపుచుందురు. వారెవని కుద్ధారమిాయతలంతురో వానికి జీవితకాలములోనే కర్తిరింపుజరిగించుచుందురు. అందువలన అట్టివాని కీప్రపంచమునందాసక్తి హరించిపోయి, మరణసమయములో దుఃఖముండ నేరదు.

## 29

సాధుసంతులు చేతనధారను అనుసరించుచుందురు. మామూలుజీవులు మనోధారనుపట్టి ప్రవర్తించుచుందురు.

11 జూన్ 1907 :—ఆకాశమునందెట్లు మేఘములు ఒకసారి హఠాత్తుగా నెక్కువగా క్రమ్ముకొనిపోయి, మఱొకప్పుడు అసలే లేకుండగ నిర్మలముగానుండిపోవుచుండునో, అటులనే హృదయాకాశములోకూడ ఒకప్పుడొకవిధమైన తరంగములును, మఱొకప్పుడు మఱొకరకముతలంపులును పుట్టుచుండును. ఒకప్పుడు పారమార్థికతరంగములు పుట్టినచో మానవునికి తనప్రవర్తనను పరమార్థమునకనుకూలమైనట్లు ఉంచుకొనవలయునని కోరికలు గల్గుచుండును మఱొకప్పుడు ఇంకొకవిధమైనతరంగముబయల్దేరినచో, అప్పుడతడు దానితో ఏకమైపోవును. అందువలననే మనస్సుయొక్క పరిస్థితినిగూర్చి యీక్రిందివిధముగా చెప్పిరి.

"జేతీ లహర్ సముద్ర కీ తేతీ మన కీ దౌడ్"

అర్థము :—సముద్రములో తరంగముల కెట్లు అంతులేదో, అట్లే మనస్సుయొక్క పరుగులకుకూడా అంతులేదు, అనగా సంకల్పవికల్పముల కంతులేదు.

మన కో మిరతక దేఖ కే, మత మానో విశ్వాస్,
సాధ జహాఁ తై భయకరే, జబ్ లగ్ పింజరస్వాఁస్."

అర్థము :—మనస్సు చచ్చిపడినట్లు కనిపించినను, దానిని చచ్చినదని నమ్మవద్దు. శరీరములో శ్వాస ఆడుచున్నంతకాలము సాధువు మనస్సువిషయములో భయపడుచునే యుండును.

మనస్సుయొక్క పరిస్థితి, తల క్రిందుగపెట్టి కాళ్లు పైకిపెట్టిన నటునియొక్క పరిస్థితివంటిది. ఇది యొక మహాపిశాచము. పైనుంచి దివ్యేచ్ఛ యెట్లువచ్చిన పూర్తిగన దేవిధముగా మఱొకకోరిక లేకుండా ప్రవర్తించుట ఒక్క సంతుమహాత్ములకే చెందును. వారలకు స్వాతంత్ర్య మేమియు లేదు; యెప్పుడు దివ్యేచ్ఛ యేవిధముగ నుండునో, ఆప్రకారమే ప్రవర్తించుచుందురు దానినే నిరహంకారభక్తి అందురు. వారికికూడ పరిస్థితి యెల్లప్పుడు నొకేతీరుగ నుండదు, పరమార్థులకుకూడ నొకేతీరున నుండనీయరు. పరిస్థితులు పైకి క్రిందికిని మారుచునే యుండును. వారికి దేనియందును బంధనముండకుండ చేయుటకై అట్లుజరిగించబడును. మామూలు ప్రాపంచికజీవులు కావలెనన్న నొకేపరిస్థితిలో చాలకాలముండవచ్చును, కాని పరమార్థికి మాత్రము పరిస్థితిలోమార్పులు వచ్చుచునే యుండును. ఆఖరికి కాలపురుషునుకూడా దయాళుదేశమునుండియే కదా వచ్చెను. అతడును ఆదేశమునకే నకలు తయారుచేసెను. చైతన్యస్వరూపులైన సాధుసంతు లెట్లు దివ్యేచ్ఛను అనగా చైతన్యధారను ఆధారముచేసుకొని ప్రవర్తింతురో అటులనే, మామూలుజీవులు మనస్సుయొక్క ధారనుపట్టుకొని ప్రవర్తించుచుందురు. సంతుల ప్రవర్తన ఊర్ధ్వముఖముగనుండును, ప్రాపంచిక జీవుల ప్రవర్తన అధోముఖముగను బహిర్ముఖముగను ఉండును. ఇదియే వీరిరువురిలో వ్యత్యాసము.

## 30

ప్రపంచములోని మామూలుజీవులకును, సత్సంగులకును దూష్యకృత్యములవిషయములో భిన్నప్రమాణములు.

12 జూన్ 1907 :—బ్రాహ్మణులలో నెవరైనను పరమార్థబాధకమైన కృత్యము అణుమాత్రముచేసినను అతడు పెద్దప్రాయశ్చిత్తము చేసికొనవలసి యున్నది. బ్రహ్మ నెవరు తెలిసికొనెనో అతడే బ్రాహ్మణుడు. కొన్నిపనులు

మామూలుమానవులు చేసినపుడు ప్రాయశ్చిత్తము అవసరము లేకపోయినను, ఆపనులనే బ్రాహ్మణుడుచేసినయెడల అతనికి ప్రాయశ్చిత్తమువిధించబడినది. అటులనే ఎన్నియోపనులు ప్రాపంచికజీవులకు నిషిద్ధముకాకపోయినను, అవే పనులు పరమార్థిచేసినచో దండనకర్హుడగుచున్నాడు. మురికికాల్వలోనిపురుగు మురికిలోనే యుండి మురికితినుచుండును. దాని కది మామూలువిషయమే. అయితే మానవుడట్లుతిన్నయెడల దండనపాత్రుడగును. అందువలననే పరమార్థులు కొద్దిగాఅయుక్తకార్యమెద్దియైన చేసినచో, వారిని వెంటనే అడ్డైనను పెట్టుదురు లేదా తత్క్షణమేదండించుదురు. మామూలుజీవుల కృత్యములవిషయములో నియమములు మఱొకవిధముగనుండును. వారేపాపముచేసినను చేయవచ్చును. కాని ఆపాపములభారము పెరిగిపోయినపుడు దానిఫలితమనుభవింతురు. తల్లి తనబిడ్డ పడిపోకుండ జాగ్రత్తపడుచు నతడు తప్పుచేసినచో వానిని వెంటనే ఎట్లుదండించునో అట్లే రాధాస్వామిదయాళురుకూడా తమపిల్లలను పతితులుగాకుండకాపాడునిమిత్తమై యవసరమైనపరిస్థితుల నేర్పాటుచేయుచుందురు. సత్సంగి ఇతరులకు దుఃఖముకలుగజేయుపనులను, ఇతరులకష్టార్జితమపహరించుకృత్యమునుమాత్రమేగాక, ఆత్మకు చైతన్యనష్టముకలిగించుకార్యములనన్నిటినిగూడ పాపకృత్యములక్రిందనే పరిగణించుకొనవలయును. అట్టిపనులు చేయుటలో సామాన్యముగ సంతోషముగనేయుండును. కాని పరమార్థి ఆపైపై సంతోషము అనుభవించినపిదప క్లేశముగలుగుట తప్పదని తెలుసుకొని, అట్టిపనులను చేయుట కెప్పుడు భయపడుచుండునే కాని యెన్నడు హర్షమును, సంతోషమును పొందజాలడు.

## 31

**మనోఘట్టముమీదనుండి ఆలోచించినప్పుడు సద్గురువుచేయు మహాకార్యములలో దోషములే కనపడుచుండును.**

13 జూన్ 1907 :—ఈప్రపంచములో సాధారణముగా జీవులు బాహ్యసామగ్రిమీదనే యెక్కువఆధారపడుచుందురు, బాహ్యసామగ్రికే యెక్కువ ప్రభావముకూడా. ఎందుచేతననగా బాహ్యపరిస్థితియే జీవున కగుపడుచుండును. మూలస్థానములో నేమిజరుగుచున్నదో, ఈబాహ్యపరిస్థితులు ఏదివ్యేచ్ఛవలననట్లు జరుగుచున్నవో వారికి తెలియనేతెలియదు. వారికి ఆదివ్యేచ్ఛ తెలిసిన

యెడల లేదా, సద్గురువు ఒకవేళ తెలియచేసినచో వారిలో చాలమంది అవిశ్వాసులై పోయి సత్సంగమునే బహుశః విడిచిపెట్టిపోవుదురు. ఈమనస్సు సద్గురువు చేయుకృత్యములను బుద్ధిస్థానమునుండి చూచినపుడు వానిలో దోషములనే పట్టుచుండును. ఈమూర్ఖమనస్సునకు రాధాస్వామిదయాళునిదివ్యేచ్ఛను గురించి యేమితెలుసును! వ్రాతకోతలురాని అమాయికస్త్రీలు చాలమంది ఈవిషయములో గ్రాడ్యుయేట్లకన్న (graduates) నెక్కువప్రశంసనీయులు. ఎందుకనగా అట్టిస్త్రీలు భక్తిమార్గములో గ్రాడ్యుయేట్లకన్న (graduates) నెక్కువనిజాయితీగా ప్రవర్తింతురు, సందేహములకు లోనుగారు. కొద్దిగనేదైనఆలస్యమైనచో (సద్గురువు) చాలకాఠిన్యముచూపించుచుండిరని తలంపనారంభించినచో, అది యెంతతప్పు! వారి కెంతఅమర్యాద చేసినట్లుఅగును! ఆనందదేవివిషయములో నావద్ద కెందఱో యెన్నోసిఫారసులు చేయుచున్నారు. కాని ఆమె నాయెదుటకువచ్చినపుడెల్ల కాలునిరూపమే కనబడుచున్నది. మామూలుకలెక్టరు లేక కమీషనరుగారిదర్బారులో నెంతభయగౌరవములతో ప్రవర్తింతురు. రాధాస్వామిదయాళునిదర్బారుతో పోల్చిచూచినచో కమీషనరుకాదుగదా, యీత్రిలోకినాధునిదర్బారుకుకూడా లెక్కయేమున్నది. కనుక వారియెడల భయభక్తులులేనిచో నెంతనష్టము గలుగును! రాధాస్వామిదయాళు రెల్లపుడు క్షమించుచునేయుందురనుట నిజమే. అయినప్పటికిని, భక్తిమార్గములో అడుగులువిచక్షణచేసికొనియే వేయవలెను. భగవదిచ్ఛతో సహకరించుటకు యత్నించుచుండవలెను. సందేహపూరితమైనట్టియు, మర్యాదరహితమైనట్టియుతలంపులను అంతర్యమున రానిచ్చుటకును, బాహ్యముగప్రకటించుటకును వ్యత్యాస మెక్కువలేదు సరికదా అట్టిఅయుక్తాలోచనలను మాటిమాటికిరానిచ్చుటకన్న నొకటిరెండుసార్లు ఆతప్పుపనులనుచేసినను శ్రేష్ఠమే అని పెద్దలు చెప్పగురు.

సంత న పరఖేఁ బోల్ ఔర్ చాల్, వహ పరఖేఁ అంతర కా హాల్ ।
జో సతగురు సే చాహేఁ దయా కీ నజర్
సురత్ ఔర్ మన్ ఔర్ మత భేంట కర్ ॥

అర్థము:—సంతులు నీఆంతర్యపరిస్థితినే గమనించుదురు కాని నీవేషభాషను పై పై నడతలను చూడరు. సద్గురువుయొక్క దయాదృష్టి నీకుకావలసినయెడల నీవు నీ ఆత్మను, నీమనస్సును, నీబుద్ధిని వారి కర్పణచేయుము.

## 33

బలవర్ధకౌషధములను, వెన్న మొదలగు పుష్టికరపదార్థములను ఎక్కువగా వాడినచో సత్సంగులకు అభ్యాసము సాగదు.

13 జూన్ 1907 :—నిన్నను మున్షీ హర్ గోవిందదయాళుగారికి నీళ్లవిరేచనములు, వాంతులు నెక్కువగనయ్యెను. కలరాలక్షణములు కనపడెను. ఆవిషయము హుజూరువారు అడిగి తెలిసికొనినపిమ్మట "ఆయన రోజునకు ఒక అర్ధపావు వెన్న తినివేయునట నిజమేనా", అనిఅడిగిరి. అందుమీదట, బాబూ ప్రేమ ప్రసాదుగారు, "ఒకఛటాకు వెన్నతినుచున్నానని ఆయనయే ఒప్పుకున్నాడు. అర్ధపావు వెన్న తిన్నరోజుననే ఆయన కీఅవస్థ వచ్చినది." అని చెప్పిరి. మహారాజ సాహబ్ వారు, "ఇదంతయు హకీమ్‌శంకర్‌లాల్ గారి పనివాడితనమై యుండవలెను. ఆయనకు లోహభస్మమును వెన్నను అందఱిచే తినిపించవలయునను ఆసక్తి మెండు. మున్షీగారి చేతకూడా లోహభస్మము తినిపించె నని విన్నాను. "శంకర్లాలూ, నీవు ఏమిచెప్పెదవు ?" అని ప్రశ్నించిరి. దానిమీదశంకర్లాలుగారు నిలబడి "ప్రభో, తినిపించినమాట నిజమే. కాని యిదంతయు నిజముగా నాఅహంభావముచంపుటకే ఇట్లయినది," అని మనవిచేసుకొనెను. అంతట హుజూరువారు "ఊరుకొనుము, కూర్చుండుము. ఈయన యెందఱికో ఇట్లే చంపినంతపని చేసిరి. ఇటువంటిప్రమాదకరమైనమందులనే ఈయన యిచ్చుచుందురు. భిన్కూను (ఒకమనిషిపేరు) కూడా చంపివేసెను." అని సెలవిచ్చి, తిర్గి యిటు చెప్పిరి, "మున్షీజీవంటి విద్యావంతులుకూడ నింత తెలివితక్కువపనులు చేయుచున్నారే ! నిజముగా సత్సంగులు ఈవిధముగా లోహభస్మములు వెన్నయు తినుట చాల లజ్జాస్పదవిషయము. బంగారుభస్మముచేసికొని ఒకసారి, మఱొకటిమఱొకసారి బలమెక్కువకావలెనవి తినుటయా ! ఇంతశక్తి దేనికొఱకై కావలెను ? నలుగురేసి స్త్రీలను పెట్టుకొనుటకా", మున్షీగారికి శంకర్లాలు వైద్యులు అర్ధసేరుపాలు ఒకఛటాకునెయ్యితో కలిపియిచ్చి త్రాగించిరని చాచా దౌలత్రాముగారు చెప్పి. తిర్గి, "అంతకుముందెన్నడు తనకు పాలుఅరిగెడివికావు కాని, ఇప్పుడు శంకర్లాలుగారు అవిఅరిగిపోవునట్లుచేయుచున్నారని మున్షీగారు శంకర్లాలుగారిని బహుశ్లాఘించుచున్నా"రనికూడ చెప్పెను. అంతట, "నా అనుభవప్రకారమైతే, నిజమైనసత్సంగి, పాలు, వెన్న, నేతులను, శక్తివర్ధక పదార్థములను, ఎక్కువరుచిగలపదార్థములను చాలతక్కువగనే ఉపయోగించ

వలయును. ఎవరైతే నెయ్యి, పాలు ఇత్యాదిఆహారముల నెక్కువగ సేవించు చుందురో వారికి అభ్యాస మెన్నటికిని సాగదు. అభ్యాసవిషయమే వేఱు; నోటిరుచులు ఇతరేంద్రియములఆనందములవిషయమే వేఱు. శరీరపుష్టికొఱకైన ఆసక్తియు వేఱే. ఇవన్నియుతిననివారు బ్రతుకుటలేదేమో అడిగికనుగొనుము. మాఇంట్లో ఆహారమెట్లుండునో తెలియునా? మాధవప్రసాదుగారు మాఇంట్లో రెండుమాసములు తిన్నారు". ఆయన అంతట "రొట్టికి నెయ్యి యుండదు, పప్పులో నెయ్యియుండదు, చాలాసామాన్యమైనఆహార"మని చెప్పిరి. హుజూరువారుతిరిగి ఇట్లు సెలవిచ్చిరి. "హుజూర్ మహారాజువారిచరణముల నాశ్రయించినరోజు మొదలుకొనిపాలు పూర్తిగా వదిలిపెట్టితిని. తేనీరులో మాత్రము పాలు చాలతక్కువగా కలుపుకొందును. ఇప్పుడు చాలాసుస్తీగా ఉండుటచే కొద్దికొద్దిగాపాలు వాడుచున్నాను. హుజూర్ మహారాజువారింట్లో నేతిరొట్టె తిన్నను, అది తప్పుకాదు. అదిప్రసాదము. కాని మాకు మొదటినుండియు నెయ్యితాగుటయే యెన్నడు తెలియదు" అని కూడ సెలవిచ్చిరి. అంతట బాబూప్రేమప్రసాదుగారు "మున్షీగారికి వైద్యముచేయించుకొనుటకై ఆసక్తి చాలయెక్కువ. సత్సంగములోనికి డాక్టర్లు, హకీములు, వైద్యులు ఎవరువచ్చినను వారందరిదగ్గరకు నాయన పోవుచుందురు. అయితే వైద్యముమాత్రము పట్టిచ్చులాగున దివ్యేచ్ఛలేకుండెను. మందిచ్చినపుడెల్ల పరిస్థితి తారుమారుగ నైపోవుచుండును. రు. 250 లు ఖర్చుపెట్టి ఒకపటకా (Belt) తెప్పించుకొన్నారు. అది పెట్టుకొనినరోజుననే చర్మము మీద బొబ్బలెక్కినవి. మందు పనిచేయుట అట్లుండగా క్రొత్తజబ్బు వచ్చిపడుచున్నద"ని చెప్పెను పటకా ఖరీదు రు. 250-లు అని చెప్పగనే మహారాజ సాహబ్ వారంతసొమ్మెందునిమిత్తమై వెచ్చించెనాయని మిక్కిలి యచ్చెరవు పడిరి. మున్షీజీగారికి ఆడపిల్లలువగైరాబాధ్యత లుండుటచే నాయన యీ మాత్రము సొమ్ము చాలకష్టమువిూద నిల్వచేయగల్గిరని బాబూప్రేమప్రసాదు గారు చెప్పిరి. అప్పుడు మహారాజసాహబ్ వారు "ఎప్పుడైన చాలబలహీనముగ నున్నపుడు ఎవరైన వైద్యముక్రింద కొద్దిగా పాలుమున్నగునవి వాడినను నష్టములేదు కాని ఒక్కొక్కఘటాకు నెయ్యి పాలలో వేసికొని త్రాగి జీర్ణముచేసికొనుట అభ్యాసులపనియా లేక కుస్తీపట్టెడివారిదా? మున్షీగారు తమశరీరమును చూచుకొనియే యుందురు. ఒక చిన్న పక్షి ఆకారముగానున్నది. ఇంత వెన్న తిన్నపుడు అదిశరీరములోనుండి బహిష్కరింపబడకుండగ నుండిపోయిన యెడల నేమగును? నేను ఒకసారి ఆయనను తప్పకుండా గదిమెదను. ఆయన నాకుస్నేహితుడే"అని సెలవిచ్చిరి.

వివిధసమయములలో మహారాజసాహబ్ వారు సెలవిచ్చిన మహోపదేశములు.

# 34

నిజమైనపరమార్థి తనఅవగుణముల నెప్పుడు పరిశీలించుకొనుచుండును. తన్ను పొగడి గౌరవముచేయుచోట్లనుండి తప్పించుకొనుచుండును.

నిజమైనపరమార్థి ఏదైనతప్పుచేసినపుడు చాలపశ్చాత్తాపపడి విచారించును, ముందెప్పుడు అట్టిపనిచేయకూడదని నిశ్చయించుకొనును. తనతప్పుల నతడెప్పుడు నొప్పుకొనుచుండును ఏలననగా, అట్లుఒప్పుకొననియెడల తన అహంకారము ప్రకటితమగును. తప్పుచేసినపుడు అది తెలిసికొనుట మొదటిమెట్టు. దానికి పశ్చాత్తాపపడుట రెండవమెట్టు. తనతప్పు ఒప్పుకొనకుండా దానినేకవిధముల కప్పెట్టుకొనెడివారిప్రకృతి చాలనీచమైనది.

ఉన కో నహిం ఉపదేశ హమారా
ఉన కో జగత కామనా మారా।

అర్థము :— అట్టివారికి మేముచెప్పిన ఉపయోగములేదు. ఏలనన వారు ప్రాపంచికవాంఛలకు లోబడియున్నారు.

తనలోలేనితప్పులనే యెవరైన పట్టుకొన్ననుగూడ పరమార్థి ఆతప్పులను అబద్ధమనిచెప్పకుండా నిజమనియే యొప్పుకొనును ఏలననగా, అతనికి ఆతప్పులు తనలోగుప్తముగనుండియుండుననియు, భగవంతుడీవిధముగా వానిని తనకు బయలుపఱచెననియే అనిపించును. సత్సంగియొక్క ప్రవర్తన ఆవిధముగనుండవలెను. నిజమైనపరమార్థి యెప్పుడు నితరులతప్పులను కప్పిపుచ్చుచుండును. ఒకవేళ నెవరిలోనైనను దోషములున్నట్లు కనిపించినను వారిలో నాదోషములు నిజముగ లేవనియు, తానుపొరపాటుపడియుండుననియు పరమార్థి భావించుకొనుచుండును. నిజమైనపరమార్థి తనస్వాభిమానమును పెంపొందించుచోటినుండి సంబంధము వెంటనే త్రెంచికొనును. స్వాభిమానమునకుచిహ్న తనపొగడ్తను విన్నపుడు సంతోషించుటయే. నిజమైనపరమార్థి తనకు సుగుణములెన్నియున్నను వానిని ఒకఅణుమాత్రముగకూడ నెంచడు, రవ్వంతఅవగుణమున్నను దానిని గంపంతగా భావించుకొనును. నిజమైనపరమార్థికి అతనిదోషముల నెన్నువారే చాలప్రియముగ నుందురు. అట్టివారితో నతడు కలసిమెలసియుండును.

మేరీ ప్యారీ సహేలీ హో, మేరీ కసర జతా దో రీ।

అర్థము :—ఓ నాప్రియసఖీ, నాతప్పులు నాకు తెలియజేయుము.

నిజమైనపరమార్థి యెప్పుడు తనమనస్సునుపరిశీలించుకొనుచునే యుండునుకాబట్టి, అతనికి మఱొకరిదోషములను లోపములను చూచుటకే సమయముచిక్కదు. తనకాశక్తి ఎచ్చటనుండి చేఱుచున్నదో, ఆస్థానమునకును తనకును మధ్యనున్న మాయికకోశముల ఆటంకముమూలమున దానిని తెలిసికొనలేక, ఆశక్తి తన లోపలినుండియే అంతయు బయల్వెడలుచున్నదని యెంచుకొనుటకే అహంకారమనిపేరు. అందుచే మాయ ఆవరించియున్నంతవఱకు అహంకారముకూడ నుండును.

## 35

కష్టములు నలుప్రక్కలనావరించుట భగవంతుని నిజదయాచిహ్నము. లోకుల కిది అర్థముకాక, అదిభగవంతునికోపముగా తలంతురు.

నలువైపులనుండియు నిరాశాజనకమైనట్టిపరిస్థితు లెవరిని ఆవరించునో, అతనిపైననే భగవంతునిదయ నిజముగనున్నదని తెలిసికొనవలయును. ఏప్రక్క చూచిన నాప్రక్కనే నిరాశాపరిస్థితు లుండవలయును. ఎప్పుడు నేదోయొక బెంగ, విచారము, చికాకు లేక రోగమో పీడించుచు ప్రపంచములో అన్నివిధముల నష్టమే కల్గుచుండవలెను. అట్టిపరిస్థితిగలిగినపుడు, ఒక్కభగవంతుడు తప్ప మఱొకదిక్కు కానరాదు; ఇట్టిపరిస్థితి సహించుకొనగలశక్తి మనకు లేదు కావున నెప్పుడైన నిట్టిపరిస్థితి కలిగినచో నాదయను వెనుకకు త్రిప్పివేయుడని భగవంతునికి మనము ప్రార్థనచేయుదుము. అయితే భగవంతుడు అప్పుడు చల్లగనూరకుండును. కాని ఆకష్టమునకు ప్రత్యామ్నాయముగా, లక్షరెట్లెక్కువదయ ఆతర్వాత గలుగును. అట్టిపరిస్థితికలిగి అదిదాటినపిమ్మట జీవునికి చేకూరెడి ఆధ్యాత్మికప్రేమ చాలగాఢముగనుండును. లేనిచో నదిమిశ్రమపరిస్థితిలోనే ఉండిపోవును. అనగా ఒకప్పుడు ఆనందముగను మఱొకప్పుడు విసుగుదలగను మాఱుచునుండును. ఆపత్సమయములో జీవుడెంతశ్రద్ధాభక్తులతో పరమార్థసాధనచేయునో సుఖశాంతులున్నసమయములో నెన్నడు నంతచేయడు. ప్రాపంచికజీవులు ఈకటాక్షమును భగవంతునికోపముగా తలంచుచుందురు.

## 36

పరితిసత్సంగికి నుద్ధారముగలుగుట నిస్సంశయము. విశ్వాసము దృఢముగ నుండవలెను.

భగవంతునిమూలధామమునుండి ఆజ్ఞవచ్చువఱకు నేజీవునికిని రాధాస్వామీమతములో జేరుటకుసాధ్యముకాదు. ఒకసారిచేరినచో నతనిపైన ముద్రపడిపోయినట్లే తెలిసికొనుడు. అతని కుద్ధార మెప్పటికైనను లభించవలసినదే. అత డెట్లుండిననుడుండుగాక, అతనిజీవకళ్యాణమునకు భంగముకలుగ నేరదు. ప్రప్రథమములో భగవత్కృపచేతనే జీవుడు ఈమతములోనికి లాగికొనబడును. పిమ్మట నతనికి ప్రేరణకలుగజేసి అతనిచే నభ్యాసముచేయించబడును. అత డట్లభ్యాసముచేసినపుడు అతనిపైన మఱింతదయాకటాక్షములు గలుగుచుండును.

మెహర్ దయా కరనీ కరవాఈ, కరనీ కర బహు మెహర్ బఢాఈ ।
కరనీ మెహర్ సంగ దౌడ చలతే, తబ్ ఫల పూరా చఢ చఢ లేతే ॥

అర్థము :—భగవంతుడు దయాకటాక్షములుచూపి జీవునిచే నభ్యాసముచేయించును. అభ్యాసముచేయుటచే దయాకటాక్షములు మఱింత అధికమగుచుండును. ఇట్లు అభ్యాసము భగవత్కృపయు పరస్పరముకలిసియే వృద్ధియగుచుండును. అప్పుడే జీవుడు పైపైకి ఆరోహించుచు సంపూర్ణఫలితము నొందగలడు.

చూడుడు, జీవులు ఈజగత్తుయొక్క ప్రవాహములోపడి కొట్టుకొనిపోవుచున్నారు. భగవంతుడు వారిమీద కృపచేసి, వారిని చేపట్టి కాపాడెను. ఏప్రభువు ఆపరిస్థితినుండి కాపాడెనో ఆప్రభువు వారిని తిరిగియెట్లు విడచిపెట్టుదురు ? అసలులోపము జీవునిలో ప్రేమ తక్కువ. జీవునిలో మార్పువచ్చిననాడు అతనిలో ప్రేమ మేల్కాంచును. అప్పు డతడు రాధాస్వామీదయాళుని మహిమ తెలిసికొని తన కెంతభాగ్యముపట్టెనాలని ఆనందించుచు, రాధాస్వామీదయాళునికి తా నేముఖముతో కృతజ్ఞత తెల్పుకొనగలనని సిగ్గుచెందుచుండును. ఎటుచూచినను, ఆవశ్యకముగనుండవలసినది దృఢప్రతీతి. ప్రతీతి దృఢమైనది లేనిచో అభ్యాసములో నెప్పుడైనను ఆనందముకలిగినపుడు తనమీద

భగవద్దయయున్నట్లును, అట్లుమాధుర్యముతగలనిసమయములలో తనమీాద దయపోయినట్లును వివిధరకములుగా మనస్సు మాటిపోవుచుండును.

## 37

ప్రశ్న—సంతుమతములో సద్గురువునకు అత్యంతప్రాముఖ్యము నిచ్చుటకు కారణ మేమి ?

సమాధానము—ఏదైన నొక్క ఇంద్రియభోగముయొక్క ఆనందమైనను జీవుని దానినుండి యెంతవిడదీసిననుగూడ నతడు దానిని విడువలేకుండునంతటి మహాకర్షణ గల్గియుండుచున్నది. ఈఇంద్రియానందములన్నిటినికలిపి ఒకేబిందువునందు ప్రోగుచేసిన నెట్లుండునో, ఆయానందమునుబట్టి కొద్దిగమాత్రమే ఆత్మానందము నూహించుకొనసాధ్యమగును ఇక నాపైనున్న ఒక్కొక్కమండలము లేక చక్రముయొక్క కాని ఆంతర్యానందమన్ననో, అసలే ఊహించుకొనుటకు శక్యముకాదు, కావున జీవుడేదేనియూర్ధ్వస్థానమును చేరుకొన్నపుడు, అతడది దాటి పైస్థానమునకు వెళ్లుటకు అశక్తుడైపోవును. సంతసద్గురుని చేతనతి దయాళుదేశమునకు చెందినదికావున, వారిస్వరూపముయొక్క ఆకర్షణ ప్రభావమును ఆనందమును త్రివలోనున్న ప్రతిలోకాధిపతిస్వరూపముయొక్క ఆనందమును ఆకర్షణను మించియుండును. అందుచే వారు జీవుని తమవిశేష శక్తిచే ప్రతిమండలమునుండియు పైకి తీసికొనిపోగలరు. జీవుడు ఒక్క శబ్ద ప్రభావముచేతనే మార్గముచివరవరకు వెళ్ళిపోలేడు. నిజముచెప్పవలెనంటే, శబ్దముకూడా ఆంతర్యమున సంత్ సద్గురుస్వరూపము ప్రకటమైనపిమ్మటనే, ప్రకటముకాగలదు. అందువలన సంతసద్గురుస్వరూపమునకే సకలవిధములుగ మహత్త్వము చెప్పబడినది.

## 38

<u>నిజమైనశబ్దము ప్రకటమగుట అనగనేమి. వాసనలు లోన దాగియుండినందున నష్టము-ఒకదృష్టాంతము.</u>

సురత్ శబ్దాభ్యాసము యథావిధిగ జరిగించినయెడల దానికి చాలప్రభావము గలదు. ఇపుడింక నీయభ్యాసము ప్రారంభమే కాలేదు. ఇది యేరోజున ప్రారంభమగునో, ఆనాడే అది జీవుని పిండమునుండి పైకిలాగుకొనిపోవును, అతని అహమంతయుగూడ నశించిపోవును

జో తూ శబ్ద కా రసియా హోతా, తో మాన ప్రతిష్ఠా ఖోతా
తేరీ దశా ఔర్ హీ హోతీ, తేరీ సురత న కబ హీ బహాతీ ॥

అర్థము—నీవు శబ్దముయొక్క ఆనందము ననుభవించియుండినయెడల, నీకు స్వాభిమానముకాని, నీగౌరవప్రతిష్ఠలనుగుఱించి ఆలోచనలుకాని యుండనే యుండవు. నీపరిస్థితిఅంతయు పూర్తిగామాఱిపోవును. అప్పుడిక నీఆత్మ శబ్దమునువిడిచి మఱెక్కడికిని పోనేరదు.

మరియు సత్సంగులు, టన్ టన్ ఘన్ ఘన్ అనెడి శబ్దములు వినిపించి, ఎప్పుడైన వినిపించుట మానివేసినయెడల తమకు శబ్దము కట్టడిపోయినదని తలంచుచుందురు. కాని వారికి అసలు శబ్దము వినబడినదెప్పుడు? అసలైనశబ్దము ఆత్మను చుంబకశక్తి లాగినట్లుగ నాకర్షించివేయును. రాధాస్వామిదయాళురీ టన్ టన్ శబ్దమును ముందుకట్టివేసినపుడే, అసలుశబ్దము ప్రకటమగును. ఆత్మచైతన్యమొక పసిపిల్లవానిశరీరములో నెంత నెమ్మదినెమ్మదిగ వ్యాపించునో చూడుడు. అతడీ ప్రపంచముతాలూకు ఆహారపదార్థములనే భుజించుచు, ప్రాపంచికజీవుల సాంగత్యమే నిరంతరముచేయుచు, తానిచ్చటజన్మించుటకు హేతుభూతమైన సాంసారికవాసన తనహృదయమున గాఢముగనాటుకొనియేయుండిననుకూడ నతనిఆత్మయొక్కచైతన్యము అతని శరీరమందు చాలనెమ్మదిగనేవ్యాపించుచుండును. చటుక్కున నొక్కసారిగా తమఆత్మ వెనుకకుమఱలిపోవలెనన్నచో నది యెట్లుసాధ్యముకాగలదు? 25, 26 సంవత్సరము లీ జీవుడు అభ్యాసముచేసినచో, గాధాస్వామిదయాళు రితనికి ఆంతర్యమున చైతన్యాహారముప్రసాదించుచు, నితడుకూడ మానకుండగ సత్సంగముచేసుకొనుచు నుండినయెడలనే నాల్గుజన్మలలో నుద్ధారమయితేకావచ్చును. కావున తొందరపడినందువలన ప్రయోజనము లేదు. అసలువిషయమేమనగా నైర్మల్యములేకపోయిననుగూడ జీవుని నూర్ధ్వముగ నాకర్షించుట యసాధ్యముకాదు. ఏలననగా, సంతులు సర్వసమర్థులు కావున నాంతర్యశుద్ధి లేకపోయినను వారు జీవుని పైకిలాగివేయగలరు. కాని దానివలన నేమియు ప్రయోజనములేదు. ఏలననగా ఆంతర్యమున వాసనలట్లేయుండిపోవుటచే, ఎప్పుడో ఒకప్పుడు వానిప్రభావము నవి తిరిగి చూపించును.

దృష్టాంతము—ఒకయోగి ఒకరాజుగారివద్దకు వెళ్ళి తన కౌశల్యము నిచ్చినయెడల, తా నొకతమాషా చేసి చూపించెదననెను. ఆప్రకారము అతడు తనప్రాణములను లోనికిలాగుకొని తనను భూమిలో పాతిపెట్టుమని చెప్పెను.

ఆప్రకారమే అతనిని పాతిపెట్టిరి. కొంతకాలమైనపిమ్మట, ఆరాజుగారుకూడా చనిపోయినపిమ్మట, అచ్చట నేలను త్రవ్వించుటతటస్థించినపుడు అందుండి ఆ యోగిలేచి పైకివచ్చెను. పైకివచ్చినతోడనే ఆయోగి గుజ్జము నిమ్మని అడిగెను.

## 39

సత్సంగి కర్మచేయుచు నిష్కర్మిగా నుండుటెట్లు.

ఎవరు దశేంద్రియములతాలూకుభోగముల ననుభవించుచుండగనే, తన ఆత్మ సాంతర్యమున కాకర్షించుకొని యీపిండమునుండి అతీతమైపోగలడో యెవరు తిండితినుచున్నపుడు, తనజీవచైతన్యమును లోనికిలాగుకొని ఆంతర్యమున నేకత్రితముచేసికొని ఆతిండిరుచియే తనకు తెలియకుండగనుండగలరో, అట్లే, యెవరు తనఆత్మ నెప్పుడుకావలెనన్న నప్పుడు, చూచుచుండగనే లోనికి, నిద్రవచ్చినపుడు లోని కాకర్షించబడినట్లుగ, ముకుళించుకొనగల్గునో, అట్టిభక్తజనుడే తనమనస్సును ఇంద్రియములను వశములోనికితెచ్చుకొనెననియు మనస్సును తనఅరచేతిలోపెట్టుకొనెననియు చెప్పదగినవాడు. అట్టివాని పరిస్థితి యీక్రిందచెప్పినట్లుండును.

కాజ కరే కర్తా నహీం. దాస కహావే సోయ్ ॥

అర్థము :— ఏపురుషుడు అన్నిపనులు చేయుచునేయుండినను తాను అందుకుకర్తకాకుండనుండునో అట్టివానినే దాసుడని చెప్పతగును.

అట్టివాడు తినుచుకూడ తినకుండనుండును. అన్నియువినుచు, చూచుచున్నను, వినుటలేదు, చూచుటలేదని చెప్పవచ్చును. ఇట్టిభక్తుడు కర్మచేయుచు నిష్కర్ముడుగనుండును. ఇది గొప్ప ఉత్తమగతి. ఇంతటిగతి యెవరికుండునో, అతడు నిజమైనభక్తుడు, గురుముఖుడును. మనస్సు నతడు పిండి గుండచేసి గురుచరణములందు లీనముచేసెను. అట్టిభక్తునిమూలమున ననేకజీవుల కుపకారము గల్గును. సత్సంగులు ఎప్పుడు నిట్టిగతికొఱకై ప్రార్థనచేయుచుండవలెను. తనకుచేతనైతే, తనకన్నదీనులు, పేదలునైన సత్సంగులకు తప్పకుండా సహాయముచేయుచుండవలెను. అట్లుచేసినందువలన సద్గురువు చాలప్రసన్నులగుదురు. అట్టివానికార్యములు వానంతటననియే చక్క పడిపోవుచుండును.

## 40

### పరమార్థికి చైతన్యాహారము అవసరము.

ఈపిండము (అనగా స్థూలశరీరము) యొక్క ద్వారముల కార్యకలాపమంతయు, అనగా మలమూత్రములవిసర్జనమువగైరాకృత్యము లెట్లుసహజనియమముల ననుసరించియే జరుగుచుండునో దశమద్వారము కార్యక్రమముగూడ నట్లే నియమానుసారముగనే జరుగును. ఆవశ్యకత లేనప్పుడు మలమును బలవంతముగవిసర్జించగోరినను, అట్లుచేయుట సాధ్యముకాదుగదా. ఊర్ధ్వకాయ ద్వారములగు కండ్లు, ముక్కు, చెవులును జాగ్రదవస్థలోనున్నపుడే చూచుటకాని, ఆఘ్రాణించుటకాని వినుటకాని జరిగించగలవు కాని నిద్రాసమయములో వానికార్యకలాప మెట్లుకట్టడిపోవునో, అట్లే ఆత్మ దశమద్వారమువైపున కారోహించుటకూడ పద్ధతిలేకుండ నొక్కపెట్టున కావలెనన్న నట్లుసాగదు. ఆత్మచైతన్యమంతయు నంతరంగమునకు ఆకర్షించబడి తృతీయనేత్రమువద్ద ఏకత్రితము అయినపిదపనే కాని, ఆత్మ పై కారోహించుటసాధ్యముకాదు. ఆంత్రములలో మలమంతయు నొకచోటకు వచ్చి ప్రోగవకుండగ మలవిసర్జన మెట్లు కాదో, అట్లే ఆత్మయొక్కచైతన్యము బాహ్యాపదార్థములలో ప్రవేశించి అచ్చటబంధింపబడియున్నందున, అది అచ్చటినుండి అనగా అన్నివైపులనుండియు లోనికి, ముడుచుకొని ఒకచోట (అనగా తృతీయనేత్రమువద్ద) ప్రోగైనపుడే ఆత్మ దశమద్వారమువైపున కారోహించుట శక్యమగును. ఇది సత్యమైన మాట. క్రిందిశరీరద్వారముల కార్యకలాపముకన్న నూర్ధ్వకాయద్వారముల కార్యకలాప మెట్లెక్కువకాలము స్థిరముగనుండునో, అట్లే మహాపవిత్రము, మహాశుచియునైన దశమద్వార మొక్కసారి ప్రఫుల్లితమైనచో దానికార్యకలాపము నిరంతరము జరిగిపోవుచుండును. ఆహారముతినుచు, పానీయము త్రాగుచునుండినందువలన, మలమూత్రములపదార్థ మెట్లు ఒకచోటికిచేరుకొని, తద్విసర్జనార్థమైన ఆవశ్యకతగల్గునో, అటులనే ఆత్మనొకచోటికి చేర్చునిమిత్తమైకూడ ఆహారమవసరము. తిరిగితిరిగి సత్సంగముచేసికొనుటయు, పారమార్థికచింతనము, సద్గురుదర్శనముచేసికొనుటయునే పారమార్థికాహారము. అప్పుడే ఆత్మ ఏకత్రితమయి, దశమద్వారమువైపున కారోహించును.

## 41

సత్సంగము, అభ్యాసములమూలమున పరిశీలనశక్తి మేల్కొంచును. నలువదిసంవత్సరములవయస్సుతరువాత ఆత్మశక్తి మేల్కొంచుట ప్రారంభించును.

పరిశీలనశక్తి మేల్కొంచిననేగాని, అనుభవసిద్ధముగా కార్యములు నెర వేర్పుట జరుగదు. ఆత్మ అంతరంగమునకు ఆకర్షించబడి ఆజ్ఞాచక్రము అనగా తృతీయనేత్రమువద్ద ఏకత్రితమైనపుడు అనుభవసిద్ధమైనపరిశీలనశక్తి మేల్కొనును. గాబరాకాని తొందరపాటుకాని యెంతమాత్రమునుండ నేరదు. పిల్లవాడు పుట్టగనే అతనిచైతన్యశక్తి మొదట కాళ్లుచేతులలోను మేల్కొని పిమ్మటనే పై ద్వారములశక్తులు, అనగా వినుట, చూచుట, ఆఘ్రాణించుట మున్నగు శక్తులు మేల్కొంచును. అటుపిమ్మట మనోబుద్ధులశక్తులు మేల్కొనును. ఆ తరువాత నలువదిసంవత్సరములవయస్సువచ్చువఱకు బుద్ధివివేచనాశక్తులు మేల్కొనుచుండును. నలువదివర్షములఅనంతరము ఆధ్యాత్మికశక్తి మేల్కొన మొదలిడును. బాల్యావస్థలో ఇంద్రియములలోశక్తి మేల్కొనును. వయస్సు మళ్ళినతరువాత ఆధ్యాత్మికశక్తి మేల్కొనప్రారంభించును. భగవంతు డేర్పా టుచేసిన ప్రకృతినియమములప్రకారమే పనులన్నియు జరుగుచుండును. ఎవరైనను తొందరపడి, గాబరాపడిపోయినయెడల తమకుతామే నష్టముకలుగజేసి కొందురు. ఎవరు పరిశీలనచేసికొనుచు ప్రవర్తించెదరో వారికి సుఖము లాభ మును గలుగుచుండును.

వైద్యుడు విరేచనబద్ధమునకు మందెట్లిచ్చునో చూడుడు. మొదట "ముంజిజ్"అనబడుమందును (అనగా మలమును మెత్తనచేయునట్టి ఔషధము) ఇచ్చును. అందుచే సుఖముగా మలవిసర్జనము కాగలదు. కొంతమందికి మలము పిట్టముకట్టి యుండును. అట్టివారికి విరేచనకారియైన మందులిచ్చినను విరోచ నముకాదు. వారికి ముందుగా 10, 15 రోజులవఱకు మలమును మెత్తనచేయు మందు లివ్వవలెను. ఆతరువాత విరోచనకారి మందుల నిచ్చినచో సులువుగా విరోచనమైపోవును. అదేవిధముగా కొందఱి కర్మలప్రభావముచే వారివజ్రకవా టములు చాలగట్టిగ బిగించుకొనిపోయియుండును. వారి ఆధ్యాత్మికశక్తి త్వరగా మేల్కొనజాలక ఆత్మ యూర్ధ్వముగ నారోహించనేరదు. అట్టివారు సత్సంగము మాటిమాటికి చేసికొనుచు, స్మరణధ్యానాభ్యాసములు సేవయు చాలకాలము చేసికొనవలెను. అప్పుడే వారిఆత్మ ఆరోహించును

రాధాస్వామిదయాళు రన్నివిషయములను ప్రకృతినియమముల ననుస రించియే ఏర్పాటుచేసిరి కావున నెవరు పరిశీలనశక్తి నుపయోగించుకొనుచు, భగవదిచ్ఛను అనుసరించి పోవుచుందురో, వారికి పరమార్థభాగ్యము సునాయా సముగా లభించును. శ్రద్ధగా పరిశీలించినచో సకలకార్యములు నేదోయొక

ప్రకృతినియమమునననుసరించియే జరుగుచుండును. వివేకవంతుల కిది ప్రతివిషయ ములోను పైకే కనపడుచుండును, లేదా వారు పరిశీలనచేసియైనను తెలిసికొనగలరు. అట్టిపరమార్థి ప్రకృతినియమముల ననుసరించియే అన్నిపనులను నెరవేర్చుకొనుచుండును. ఏపరమార్థి పరిశీలనశక్తి నుపయోగించి ప్రకృతినియమములనన్నిటిని పాటించునో, అట్టివాడు తనఆధ్యాత్మికకర్తవ్యములను చాలసులువుగను, సహజముగను నిర్వర్తించుకొనగలుగును. అట్టివాడు ప్రతివిషయములోను దివ్యేచ్ఛననుసరించియే పోవుచు పరమార్థముయొక్క సంపూర్ణలాభమును పొందగలడు. ఈవిధమైన వివేచనాశక్తియు, పరిశీలనాశక్తియు, సత్సంగమును, అభ్యాసమునుచేయుచుండినచో లభ్యమగును. ఎవనికి సత్సంగమును అభ్యాసమును లభించునో అతడు మహాఅదృష్టశాలి.

## 42

### సద్గురుసాంగత్యమువలననే భగవత్ప్రేమవిరహములు కలుగగలవు.

అడవిలో నొకచెట్టు అంటుకొన్నచో, చుట్టుప్రక్కలనున్న చెట్లన్నియు నెట్లు అంటుకొనునో, అట్లే ఒకభక్తజనునిహృదయమున భగవద్విరహాగ్ని ప్రజ్వరిల్లినచో ఆయనతో కలిసిమెలిసి సత్సంగముచేయుచున్న ప్రతిసత్సంగి హృదయములోగూడ విరహాగ్ని ప్రజ్వరిల్ల నారంభించును. సద్గురుని సత్సంగము నిజమైనభక్తిగలసత్సంగికి అవసరమేమున్నదని యనుకొనుట పొరపాటు. నిజభక్తుడైనసత్సంగియైనను, సద్గురునిసత్సంగము చేసుకొనకుండ తనయింటనే కూర్చుండి, తనంతటతాను విరహమునుపుట్టించుకొనగలనని యనుకొన్నచో, నది యసంభవము. సద్గురుసాంగత్యమువలననే అతనిహృదయమందు విరహాగ్నికణము ప్రజ్వరిల్లును లేదా, నిజభక్తుడైనగురుముఖునిసాంగత్యమువలనకూడా విరహభావము లభించగలదు. అందువలననే, సద్గురుసాంగత్యమునకును, సాధుసాంగత్యమునకును, భక్తజనులసాంగత్యమునకును, గొప్పమహత్త్వము చెప్పబడినది. ప్రతిసత్సంగిసోదరుడును సద్గురుని సత్సంగముచేసికొని అందుమూలమున విరహప్రేమలను తప్పకుండ మేల్కొల్పుకొని అంతర్యమున తనప్రియతముని దర్శనమునుపొంది ఆవిధముగా అజరామరమైనగతిని సంపాదించుకొనవలయును. సద్గురువు సత్యలోకములోనివాసమును తప్పక ప్రసాదించెదరు. కావున జీవుడు ఈవిషయములో పూర్ణవిశ్వాసము పెట్టుకొనియుండి అవశ్యము విరహమును పుట్టించుకొనవలెను.

## 43

వాచకజ్ఞానులు తాము బ్రహ్మస్వరూపులని చెప్పుకొనుట కేవలము భ్రమయే

వాచకజ్ఞానులు తాము బ్రహ్మస్వరూపులనియు, మనస్సు, ఇంద్రియములు మున్నగునవి భ్రమాత్మకములనియు వక్కాణించుచుందురు. వారి వాదమునకు సమాధానముగా మీరు బ్రహ్మస్వరూపులమని చెప్పుకొనునది మీ నోటితోను, మనస్సుద్వారానేకదా; మనస్సు, ఇంద్రియములు, శరీరము భ్రమాత్మకమైనవి కావున వానిద్వారా చెప్పెడివిషయములుకూడ భ్రమలే కావలసియున్నదని చెప్పవలెను. ప్రాచీనయోగులగువ్యాసవశిష్ఠాదులు మొదట ప్రాణాయామము నభ్యాసముచేసి బ్రహ్మలోకమునుపొంది, పిమ్మట నే ఇంద్రియములును, అంతఃకరణయును ఈప్రపంచమును భ్రమాత్మకమని సెలవిచ్చిరి. మీరైతే బ్రహ్మదేశముపొందలేదు. మీకింకను తిష్ఠ ఇంద్రియములు అంతఃకరణస్థానములోనే యుండియున్నది. కనుక మీరు భ్రమలని చెప్పుటయే భ్రమయగును. ఏలననగా, ఇంద్రియములలోను. అంతఃకరణములలోనుగల సమస్తశక్తియు వానికన్న సూక్ష్మతరమైన స్వప్నదేశమునకు వెళ్ళినపుడు నాశనమైపోవును. సుషుప్త్యవస్థలోనికి వెళ్ళినపుడు సూక్ష్మేంద్రియములు నంతఃకరణయు నాశనమైపోవును. ఈ మూడుస్థానములకు నతీతమైనది బ్రహ్మలోకము. మీరు స్వప్నసుషుప్తులలోనే లయమైపోవుచున్నపుడు బ్రహ్మయొక్కస్వరూపజ్ఞానము మీకెట్లుకలిగినది. బి. ఎ., ఎమ్. ఏ. లు చదువుకొన్నవారు ఆంగ్లేయభాషలో నిరాటంకముగామాట్లాడగలరుకాని, ఆంగ్లభాష బొత్తిగా తెలియనివానికి ఆంగ్లభాషవిషయ మెట్లు తెలియగలదు ? అటులనే బ్రహ్మలోకము చేరుకొన్నవానికి బ్రహ్మస్వరూపజ్ఞానముండును కాని పిండములోనే తిష్ఠగలవానికి బ్రహ్మస్వరూప మెట్లు తెలియగలదు ? బ్రహ్మలోకముపొందిన నిజమైనగురు వెవనికైనను లభించి, అట్టి సద్గురువు ఆస్థానములయొక్కరహస్యములను సాధనావిధానమును అతనికిచెప్పి, అతనిచే అభ్యాసముచేయించనియెడల, నెవనికిని బ్రహ్మలోకమునుపొందుట సాధ్యముకాదు, బ్రహ్మయొక్కజ్ఞానము నుండజాలదు. పిండివంటలనుగురించి సంభాషణచేసినందువలననే యెవనికిని కడుపునిండిపోదు.

## 44

చంద్రునియందు చకోరమునకును జలమునందు మీనమునకును గల ప్రేమను సద్గురు చరణములందు దయచేయుడని ప్రార్థనచేయుచుండవలెను.

చంద్రునికొఱకు చకోరమునకును, వీణాధ్వనివినుటయందు హరిణమునకును, జలమునందు మీనమునకును, ఎట్టిప్రీతిగలదో సద్గురుచరణములందట్టిప్రీతిగలవాడే నిజమైనభక్తుడు. అట్టివాడెప్పుడు స్వరతుడై, ఆనందమగ్నుడై యుండి దయాళురైనసద్గురువునకు శరీరమనోధనము లర్పించుచుండును. వారెట్లుంచిన నట్లే సంతోషముగ నుండును. అట్టిభక్తునికి సంతులు స్వయముగనే అర్పణయగుదురు, భక్తియొక్క భండారమంతయు తెఱచియే యుండును. అతనికి ధ్యానసమయములో తనశరీరమనోధనములస్మృతియే యుండదు. అట్టివానికి జీవితకాలములోనే భగవంతుని అంతర్దర్శనము లభించును. అట్టివాడెల్లప్పుడు శరీరమనస్సుల నతిక్రమించి యెల్లప్పుడు సద్గురుచరణములసన్నిధినుండి లీలల ననుభవించుచుండును. విషముకూడ నతనికి అమృతప్రాయముగ నైపోవును. సద్గురుప్రేమయొక్క మహిమ అత్యద్భుతము. అదియ సుఖభండారము. రాధాస్వామీదయాళుని చరణముల నాశ్రయించినవారందఱు నిట్టిప్రేమప్రీతులను తమకు అనుగ్రహించవలయునని ప్రార్థనచేయుచుండవలెను.

## 45

సత్సంగులకు దుఃఖములు బాధలు కల్గినపుడు, అవి సద్గురునిదయయే అని గ్రహించుకొనవలెను.

రాధాస్వామీదయాళునిచరణములను శరణుజొచ్చి సమకాలికసద్గురువువలన నుపదేశముపొందినసత్సంగులందఱు తాము సద్గురువుచే ఆత్మీయులుగచేసికొనబడితిమనియు, తప్పకుండ తమపరమపితధామమున కొకనాడు చేర్పించబడగలమనియు, ఇంక తమపైన నెట్టికర్మలభారమును పెరగనీయబడదనియు తెలిసికొనవలయును. వారిపూర్వపుకర్మలుగూడ భగవదిచ్ఛమూలమున బహునేర్పుగను సునాయాసముగను నాశనముచేయబడును.

సత్సంగు లేదైనబాధవచ్చినపుడు గాబరాపడిపోకూడదు, సుఖసంపత్తులు గలిగినవుడు పొంగిపోవనుకూడదు. పైగా ఏవైనదుఃఖపరిస్థితులు రోగములు వచ్చినచో. వానిని సద్గురువుయొక్క మహాదయఅనియు, కేవలము వారిసంరక్షణనిమిత్తమే, ఆక్లేశపరిస్థితి పంపించబడినదనియు తెలిసికొనవలయును. జీవుడు అతిదుర్బలుడు, అశక్తుడు నేపనియుచేయలేనివాడును. ఆకారణముచే, రాధాస్వామీదయాళురే స్వయముగా శరీరముధరించి తమబాలురను స్వధామమందు జేర్పించునిమిత్తమై యీలోకమున నవతరించిరి. జీవుడు వారిచరణములందు కొద్దిగాప్రేమచేయుచు, దృఢవిశ్వాసముధరించి, రాధాస్వామీనామ

మును నిజనామమనినమ్మి వారిచరణములనే పూర్తిగనమ్ముకొని వారిబాహ్యా సత్సంగమును, దర్శనమును వీలయినపుడెల్ల నప్పుడప్పుడు మెలకువతో చేసికొనుచుండినయెడల నంతమాత్రముననే వారతనిని ఆత్మీయునిగా చేసికొని, తమధామమునందు చేర్పించుదురు. ఈవిషయములో జీవుని కెంతమాత్రము సందేహాముండనక్కఱలేదు.

## 46

తానన్నివిధముల నిర్బలుడై పోయెనని యనిపించుపరిస్థితి గల్గుట మహాదయ, భగవచ్చరణముల ధ్యానము సాగుటకును, వారి చరణములు పొందు నిమిత్తమును, విరహము బెంగలు ఎల్లప్పుడు నుండులాగునను ప్రార్థన చేయుచుండవలెను.

ఏవిధమైన బలము లేకుండనుండునట్టి పరిస్థితి అనగా తన కేపనియు చేసికొనగల శక్తి యెంతమాత్రము లేదనియు, జరిగెడి పనులన్నియు నా భగవంతుని మహిమచేతను దివ్యేచ్ఛచేతనే సాగించబడుచున్నవనియు దృఢ విశ్వాసముగల పరిస్థితి యెవనికైన గలిగినచో, భగవంతుడతనిపైన మహాదయ చూపుచున్నట్లు తెలిసికొనవలెను.

మనకు భగవద్దర్శనము కాకుండాచేయుచున్నది మన "అహమే". మాయ యెంతవరకు వ్యాపించియున్నదో అంతవరకు "అహం" వ్యాపించియున్నది. అయినను మాయయొక్క కోశములలోగూడ తరహాలు గలవు. జీవునిపై నుండి ఈ కోశములు, లేక తెరలు తొలగిపోవుచున్నకొలది భగవంతునితో సంబంధ మెక్కువ అగుచుండును. మానవునికి మనోఘట్టము మాఱిపోవువఱకు భగవంతుడు సమస్త సృష్టికి కర్తయని తెలిసికొనజాలడు. "అహం" అనునది నశించిపోయినపుడు మానవుడు తన కేమియు శక్తి లేనట్లు తెలుసుకొనును. అది నిజమునకు మహాదయయే. మానవునిపైన "నేను" "నీవు" భావములకోశము కప్పివేసి యెంతవరకుండునో అంతకాలము నతనికి భగవంతుడు కనపడకుండగనే యుండిపోవును. అంతకాలమునుగూడ కపటభావ మతనిలో నుండిపోవును. ప్రపంచములోగల సంబంధమంతయు కపటమైనదే (అనగా, కృత్రిమమైనది), అనగా కోశముల సంబంధమే. ఒకనికి మఱొకనియందు ప్రేమ ప్రీతు లతిగాఢముగ నుండినయెడల వారిరువురి మనస్సులు కలిసిపోవును. ఒకరి మనస్సున నెట్టిభావములు పుట్టునో రెండవవాని మనస్సునగూడ నట్టిభావములే

పుట్టుచుండును; కాని ఒకరి ప్రాణము రెండవవాని ప్రాణముతో నేకము కాలేదు. ప్రాణము వెళ్ళి ప్రాణప్రియునితో కలిసి యేకమైపోవలెను. లోకములో చాల ప్రేమగల ఇరువురు స్నేహితులు కలిసికొన్నప్పు డెంతసంతోషముగ నుందురు ? అయినను, ఈ కలయిక కపటమైనదే అనగా ఇది కాలుని కడుపులోనుండి కలియుటయే. ఏలననగా పైనుండి చేతులు కలుపుకొనుటయేకాని, శేషమంతయు తెరలోనే పడియుండును. భగవంతునితో కలిసినపుడు అది నిరావరణమైయుండును. ఆత్మ తన ప్రాణభూతమైన శబ్దముతో కలసిపోవుటకు దానికి భగవంతునితో అసలైన సమ్మేళనము కలుగదు. కేవల కపటసమ్మేళనమువలననే యింత మహానందము గలుగుచున్నపుడు, ఆత్మకు శబ్దముతో నైక్యముగల్గినప్పు డెంత యఖండమైన ఆనందసంతోషములు గలుగునో యూహించుకొనుడు, ఆయానందమగ్నతా పరిస్థితికి స్థూలరూపముగ నొక సాదృశ్యము చెప్పవలెనన్నయెడల, నొక మానవుడుకాని జంతువుకాని, అతిమధురసంగీతము వినుచున్నపుడు, దానిలో లీనమై మైమరచియుండు పరిస్థితితో పోల్చవచ్చును.

జీవులు అనేక స్థలములలో ప్రేమను పెట్టుకొనుచుందురు. ఈ బంధనములన్నియు దుఃఖదాయకములు. భగవంతునియందు ప్రేమ సదాస్థాయిగనుండి శాశ్వతానందమునిచ్చును. ప్రాపంచిక ప్రేమనాశమానమును దుఃఖదాయకమును. ఎవనికైనను మఱొకరియెడల గాఢమైన ప్రేమాభిమానములు ఉంఉండిన చో నతడు, వారిని కలిసికొనుచుండవలెనుకాని వారివైపునకు తిరగకుండగనైన ఉండిపోయినయెడల వారెట్లు సంతోషింతురు ? అటులనే భక్తుడు భగవంతుని ప్రేమించియు, వారిని కలుసుకొను నిమిత్తమై అభ్యాసములో కూర్చుండక ప్రాపంచిక భావములు, ఆలోచనలతో నిండియుండిపోయినయెడల భగవంతుడు అతనియెడల నెట్లు ప్రసన్నుడు కాగలడు? భగవంతుడైతే జీవుడు తనతో కలిసికొనవలయునని యెల్లప్పుడు కోరుచు జీవుని యాంతర్యములో నట్లు రమ్మని కేకకూడ పెట్టుచున్నాడు. కాని జీవుడు మాత్రము ప్రపంచము వైపునకే పూర్తిగా తిరిగిపోవుచున్నాడు. ప్రేమ యెప్పుడుదయించునో అప్పుడే పని నెరవేరగలదు, ఆంతర్యమున పరిశుద్ధికూడగలిగి మాలిన్యమంతయు తొలగిపోవును. ప్రేమ భగవంతుడివ్వవలసిన మహావరదానము. ఆ వరదాన మెవరికి లభించునో వారే మహాభాగ్యశాలురు. నూరు సంవత్సరములు ఆధ్యాత్మికాభ్యాసములు చేయుటకన్న నొకచిన్న ప్రేమకణమునకే యెక్కువ మహిమగలదు. కొద్దిగా గానాంగములో భగవచ్చరణధ్యానమును, వారి దర్శనముకొఱకు కొద్ది విరహబాధయు నెల్లపుడు నుండవలయును. ఇట్టిభావముకొఱకును, ఇట్టివిరహతాపము

కొఱకును ప్రార్థన చేయుచుండవలెను. యుక్తసమయము వచ్చినపుడు వారే తమ దివ్యేచ్ఛచే ఆవరదానము ననుగ్రహించెదరు. ప్రపంచములోని రాజ్యములు, సంపత్తులన్నియుకూడ ప్రేమయనెడిదుర్లభమహాసంపత్తితో పోల్చినచో కేవలము తుచ్ఛములు, పనికిమాలినవియును. కావున క్రమక్రమముగ లోలోపల నెట్టికోరికలు బంధనములులేకుండ నశించిపోయినపిమ్మట ప్రేమ ప్రజ్వలించగలదు. కాని ఈవిషయములో తొందరపడకూడదు. ఆభగవంతుడు చూపించునట్టి తమాషాలనన్నిటిని చూచుకొనుచునే పోవలయును.

## 47

సత్సంగులకు అభ్యాసములోజయము వారిప్రయత్నముకన్న వారివారి సంస్కారములపైన నాధారపడియుండును. రాధాస్వామిదయాళునిఉపదేశము పొందినవారి కందఱికిని తప్పకుండా భక్తిదానము ఇయ్యబడును. అనుజ్ఞలేనిదే యెవరు నుపదేశమివ్వకూడదు. నాల్గుజన్మలలో ఉద్ధారము తప్పక ఇయ్యబడును. అందుకెంతమాత్రము సందేహములేదు.

భగవదిచ్ఛ నెవరు నవగాహనచేసుకొనలేరు. ప్రపంచములో ననేకమైన అత్యాశ్చర్యకరమైనవిషయములు దివ్యేచ్ఛచే జరుగుచుండును. వానిని కొంచెమైనను గుర్తుపట్టుటకుగాని, అవగాహనచేసికొనుటకుగాని యెవరికిని శక్యముకాదు. కొందఱుసత్సంగు లెన్నైననుప్రయత్నములుచేయుచుందురు, చాలశ్రమపడి స్మరణ, ధ్యాన, భజనాభ్యాసములుచేయుచుందురు, పరితాపపడుచుందురు, విలపించుచుందురు, పశ్చాత్తాపపడుచుందురు, మొత్తుకొని బాదుకొనుచుందురు, యెన్నోప్రయత్నములుచేయుచుందురు, తిరిగితిరిగి ప్రార్థనచేయుచుందురు; అయిననుకూడ, వారి కాంతర్యమున కాకర్షణ కొంచెముగూడ గలుగదు, ఆంతర్యములో నేమియు దర్శనములభించదు, ఆనందమును దొరకదు. మఱొకసత్సంగికి అతడెన్నడు పట్టుపట్టిస్మరణ, ధ్యాన, భజనాభ్యాసములు చేయకపోయినను. కొద్దిగ నాంతర్యమున నేకాగ్రతచేసినంత నే ఆంతర్యదర్శనము లభించును, భక్తిభావముయొక్క లక్షణములన్నియు ప్రకటమైపోవుచుండును. ఉత్తమసంస్కారములుగల అదృష్టవంతులకు మనస్సు, ఆత్మయు నిర్మలముగనుండును కావున ఉపదేశముతీసికొన్నక్షణమునుండియు వారిలో నొక మహాపరిణామము జరుగనారంభించును. అట్టిసత్సంగి తప్పులు, పాపములుచేసినను చేయుగాక, అవికూడా క్షమించబడుచు అతనిమీద దయ ఆంతర్యమున వృద్ధియగుచునే పోవుచుండును. తనపిల్లవాని లోపాలోపములు తల్లి దండ్రి లెట్లుచూడరో, పైగా

అందుకు సంతసించుచుందురో, అటులనే పరమార్థవిషయములో భాగ్యశాలు రకుకూడ వారేమియు అడుగనక్కఱలేకుండగనే దయాస్వరూపులైనసద్గురువు కేవలము తమ దయాకటాక్షములమూలముననే పారమార్థికసంపత్తునంతను వర దానముగ ననుగ్రహింతురు. ఎట్లనగా ఒకమహారాజునికి శిశువుపుట్టినచో నతనిసౌఖ్యమునకు కావలసిన ఆవశ్యకపదార్థములన్నిటిని ఆమహారాజే యెట్లు సిద్ధముచేయునో చూడుడు. సద్గురువు అంతర్యామి. కొందఱికి భజనాభ్యాస ములో ఆనందము చేకూరకపోవుటకు కారణమేమనగా, మొదటివిషయము వారికి చాలనికృష్టమైనపాపకర్మలుండియుండును వారు ఆకర్మలఫలితమును ముం దనుభవించవలసియుండగా, అట్లనుభవించకుండగనే వారి నూర్ధ్వముగ నాంత ర్యారోహణము చేయించుటెట్లు? రెండవది వారికి భక్తిభాగ్యము ఉండకపోవ చ్చును. ఆభాగ్యములేనిచో నేమియు లభించదు. ఇదిభగవంతునిదర్బారులో నున్ననియమము.

చరణము :—

భాగ బినా క్యా కరే బిచారీ, యహ భీ భాగ్ గురూ సే పారీ।
రాధాస్వామీ కహే జగత యహ సారీ, ఉన్కే చరన సే ప్రేమ లగారీ॥

అర్థము :—అదృష్టములేనిదే యెవరేమి చేయగలరు? ఆభాగ్యలోపము గూడ సద్గురువే తీర్చవలయును. రాధాస్వామీదయాళు లే ఈశ్రేష్ఠమైనయుక్తిని చెప్పిరి. నాకు వారిచరణములందు ప్రేమ లగ్నమైనది.

రాధాస్వామీమతములో నెవరెవరు చేరిరో వారందఱికి భక్తిసంపత్తును దయచేయునిమిత్తమై అందరిపేర్లు వ్రాసి ఒకజాబితా తయారుచేయబడినది. వారివారిపేర్లనంబర్లు వరుసగ వచ్చినపుడు ఆదాతయే స్వయముగ వారిని పిలి పించి ప్రేమదానమును దయచేయుదురు. చక్రవర్తియొక్కదర్బారులో, హోదా లను ఇచ్చుటకై ఒకజాబితాను తయారుచేసి ఆజాబితాప్రకారము వరుసగా పిలిపించి, యెవరినంబరువచ్చినపుడు అతనికి చక్రవర్తి స్వయముగపిలిచి ఆహోదా నెట్లిచ్చుచుండునో, అట్లే ఇచ్చటను జరిగించబడును. రాధాస్వామీదయాళురు చక్రవర్తులందఱకు చక్రవర్తి వారికార్యాలయము మహావిశాలము. మహామహా చక్రవర్తులకార్యాలయములలో వందలు వేలకొలదిఖాళీలు ఉండిపోవును. లిస్టులో నెవరిపేర్లెక్కించబడినవో వారికే ఆహోదాలివ్వబడుచుండునుకదా. అట్లే రాధాస్వామీదయాళుని కార్యాలయము అన్నిటికన్న మహావిశాలమైనది.

ఏయేభక్తుల పేర్లందువ్రాయబడినవో, అట్టి కేలాదిభక్తజనుల కొక్కపెట్టున భక్తిప్రేమలహోదాలు మహావరప్రసాదముగ నీయబడును.

ప్రశ్న :—ఒకసాధువు మఱొకసత్సంగిసాధువువద్ద నుపదేశముతీసికొనెను. అతనికి సద్గురుదర్శనము కాలేదు. అట్టివానిపేరుకూడా రాధాస్వామీదయాళుని కార్యాలయములో నెక్కించబడునా ?

సమాధానము :—అనుమతి లేనిదే యెవరు నుపదేశమిచ్చుటకు వీలులేదు.

ప్రశ్న :—ఉద్ధార మెన్నిజన్మలలో గలుగును ?

సమాధానము :—తప్పకుండా నాల్గుజన్మలలో ఉద్ధారమైపోవును. తీవ్రమైనఆసక్తియు, ప్రబలమైనభక్తియుగలవానికి, ఒకేజన్మలో నాల్గుజన్మలు పూర్తియై అతడు మూలధామమునుపొందగలడు. ఏజన్మలో భక్తి ప్రారంభమైనదో అది లగాయతు నాలుగుజన్మలలో నుద్ధారమైపోవును. అతడు ఎంత మలినజీవుడైనను సరేగాక. ఒకజన్మలో బీజము నాటబడినపుడు ఆజన్మలో నతడు భక్తిప్రారంభించనియెడల , నతని కుద్ధారము గలుగుటకు అయిదుజన్మలు పట్టును.

ప్రశ్న :—నాల్గుజన్మలలో నుద్ధారము కాగలదనుటకు ప్రమాణ మేమి ?

సమాధానము :—ఏజీవునిలో సంతులు బీజమునాటిరో అతనియుద్ధారము అగుటకు సందేహ మేమియు లేదు. ఆబీజము సత్యలోకమునకు చెందిన చైతన్య బీజము. ఆబీజ మెట్టిపరిస్థితిలోను ఇచ్చట చాలకాలమువఱకు నుండనేరదు. ఆబీజమునకు సృష్టియెడల ప్రకృతిసిద్ధమైన యేవగింపు ఉండును. జీవుని అభ్యాస ప్రభావమువలన నెంతమాత్రము నుద్ధారముకాజాలదు. అభ్యాసము జన్మానుజన్మలుచేసిననుగూడ సత్యలోకమును ఏజీవుడును చేరుకొనలేడు. సంతులు నాటినబీజములోనే, జీవుని కుద్ధారమిచ్చుశక్తి యున్నది. ఆబీజ మీలోకములో నెన్నటికిని స్థిరముగ నుండిపోజాలదు. నీటిబిందువు ఇచ్చటినుండి ఆవిరిరూపముగా ఆకాశమునకువెళ్ళి వర్షముకురియునపుడు నీటిరూపముగావచ్చి సముద్రములోనెట్లుచేరుకొనునో, అట్లే సత్యలోకబీజము తిన్నగా సత్యలోకమునకేవెళ్ళి నిల్చును. నీటిబిందువు ఒక్కసముద్రమునుతప్పించి మఱెక్కడను ఆగజాలదు. అటులనే సత్యలోకముయొక్కబీజము సత్యలోకమునకువెళ్ళియే ఆగును. ఆబీజమునుండి మొక్క దానంతటనదియే లేచును. దానితో భక్తిలక్షణములన్నియు వానంతటనవియే ప్రకటమవసాగును. మనోముఖలక్షణములన్నియు నశించును.

సద్గురుదయాళు రే స్వయముగా సహాయముచేసి సత్యలోకములోనికి తీసికొని పోవుదురు.

## 48

సంతులశరణు పొందినజీవుడెన్నడు సహస్రదళకమలమునకు క్రిందుగ నుండిపోజాలడు.

రాధాస్వామిదయాళురు వారిచరణముల నాశ్రయించి తనచేతనైనంతగా భక్తిచేయుచున్నవానిని, అతడెంత మలినాతిమలినుడైననుకూడ, సహస్రదళకమలమునకు చేర్పించుదురు. మరణసమయమందు రాధాస్వామిదయాళురు దర్శనమిచ్చి, చరణములందు జేర్చుకొని సహస్రదళకమలములో నతనికి నివాసమిచ్చెదరు. ఈవచనమును పూర్తిగా విశ్వసించవలయును. సంతులశరణు జొచ్చినజీవు డెంతమహామలినజీవుడైననుకూడ, సహస్రదళకమలమునకుక్రిందుగ నెట్టిపరిస్థితిలోను నిలచిపోజాలడు.

## 49

దివ్యేచ్ఛవిధించినపరిస్థితులలో జీవుడు సంతృప్తిచెందుచుండవలెను. అట్లు చేయుటవలన మనస్సు శుద్ధమైపోవును.

పరమపురుషరాధాస్వామిదయాళురు జీవులకుద్ధారముకలుగజేయునిమిత్తమై యీజగమున నరశరీరము ధరించి ప్రకటమైరి అందఱును వారియందు శరణ్యాభావమును దృఢముచేసికొనవలెను. ఈజీవున కేవిధముగ నభివృద్ధి గలుగచేయబడునో తెలియనే తెలియదు. ఆపరమపురుషుని అనంతశక్తిసామర్థ్యములను, దివ్యేచ్ఛావిలాసమును తెలిసికొనగలవారెవరున్నారు? అందుచే నందరును వారి దివ్యేచ్ఛతో తప్పకుండా సంతృప్తిపొందుచునే యుండవలెను. కష్టములు వచ్చినవు డెంతమాత్రము గాబరా చెందకూడదు, పైగా భగవత్కృపనుతల్చుకొని ధన్యవాదము లర్పించుచుండవలయును. సంతు లేదోయొకవిచారమునో రోగమునో కుటుంబములో నెల్లప్పుడు నుండులాగున చేయుచుందురు. మఱియు పకృతినియమములకు విరుద్ధముగ నెట్టి విచిత్రములను చేయరు. స్వామీజీమహారాజువారి దగ్గఱబంధువులలో నొకటిన్నరయేండ్ల ప్రాయముగల పిల్లవానికి జబ్బుచేసెను. అతని తల్లిదండ్రులు స్వామీజీమహారాజువారి నెన్నియోవిధముల ప్రార్థించి రాధాజీవారిచేతకూడ ప్రార్థన చేయించిరి పిల్లవాని నెట్లైన బ్రతికింపుడని వారి నెక్కువగా నిర్బంధించినపుడు, స్వామీజీమహారాజు

వారు తమ ఆయుర్దాయమునుతీసి ఆపిల్లవాని కివ్వగలమని సెలవిచ్చిరి. అప్పు డందఱును చకితులై అట్టిదివ్యేచ్ఛ చేయవలదని పార్థించిరి. అప్పుడు స్వామిజీ మహారాజ్ వారు, భగవంతుని దివ్యేచ్ఛకు సంతులెన్నడు నడ్డువెళ్లరని సెల విచ్చిరి. ఈపిల్లవాని ఆయుస్సు అయిపోయినదని చెప్పిరి. సంతులెప్పుడును ప్రకృ తినియమములను పాలించుచుందురు. చాలతక్కువతరగతిలోని అభ్యాసిపురుషులే అద్భుతకృత్యములను చేయుచుందురు. ఒకరికిజబ్బుతగ్గించియు, ఇంకొకరికి మఖో కద్దమ్మ తీర్చియు, తమవాక్సిద్ధిని ప్రచురించుకొనియు, ఈవిధముగా తమఅభ్యాస ఫలితమునంతను ఇచ్చటనే నాశనముచేసుకొని అధోగతిపాలై పోవుచుందురు. దయాస్వరూపులైనసంతులు కావలెనన్నచో నేమైనను చేయగలరు. తమసత్సం గులకు, కుటుంబీకులకును ప్రకృతినియమములనుల్లంఘించి ఉపకారముచేసినచో, నీరచనలోని యితరజీవులందఱుమాత్రము తమవారు కాకపోయిరా, వారందఱి కొఱకుకూడ ప్రకృతినియమముల నుల్లంఘించవలెనా లేదా ? అందుచే సంతు లెన్నడు ప్రకృతినియమములకు విరుద్ధముగా ప్రవర్తించరు. అందఱును భగవ దిచ్ఛ కలుగజేసినపరిస్థితిలో నెల్లప్పుడు సంతోషముగా నుండుట యుక్తము. అట్లుచేసినందువలన మనస్సు తనంతటతానే శుద్ధమైపోవును; ఆంతర్యమున భగ వంతునిదయానుభవము గలుగును; ఆత్మమనస్సులురెండును ఆనందరసమునొంది తన్మయమైపోవుచుండును.

## 50

### మాయాసమ్మిళితచైతన్యధార, ఆత్మసంబంధమైన శుద్ధచైతన్యధారయు.

పిండములో రెండుధారలు పనిచేయుచున్నవి. ఒకటి మాయాసమ్మిళిత మైనచైతన్యధార అది శరీరమునుపోషించి రక్షణచేయుచుండును. రెండవది, ఆత్మయొక్కశుద్ధచైతన్యధార, ఈధార ఆకర్షణశక్తిరూపమై, లోనికి వార్తలు తీసికొనిపోవుచుండును. ఇదియే శ్రద్ధారూపముగమాఱి సమస్తకార్యక్రమము జరిగించుచుండును. ఈఆత్మయొక్క ఈధారయే భగవదంశ. అయితే ఈరెండు ధారలలోను వ్యత్యాసము కలదు. ఆత్మయొక్కధార వెల్తురునుపుట్టించును. రెండవది మనస్సుతోసమ్మిళితమైయున్నది. ఆత్మయొక్కధారను సెన్సరీ (sensory) అనియు, రెండవదానిని మోటార్ (Motor) అనియు చెప్పుదురు. ఈమాయయొక్కరచన ఉన్నంతమేర, నీరెండుధారలునున్నవి. దయాళుదేశ ములో ఆకర్షణచేయుస్వభావముగలఆత్మధారఒక్కటే యున్నది. అక్కడ మోటార్ (Motor) ధార లేదు. ఎట్లనగా ఘంటానాదము మాయాధార,

శంఖనాదము ఆత్మధారయును. మృదంగధ్వని మాయాధార, మేఘగర్జనము ఆత్మధారయును. కింగరీధ్వని మాయాధార, సారంగీధ్వని ఆత్మధారయును. వీనిపైన నున్నదయాళుదేశములో ఆత్మధార ఒక్కటే పనిచేయుచున్నది. చూడుడు, ఎవరైనను మాటలాడుచున్నపుడు శ్రోతయొక్క శ్రద్ధ మఱొకవైపు నకు తిరిగిపోయినచో ఆమాట లతనికి వినబడవు. అటులనే శ్రద్ధారూపమైన ధార నిద్రపోవుసమయములో లోనికి ముడుచుకొనిపోవును. అప్పుడు పనుల న్నియు కట్టువడిపోవును. అప్పుడు శరీరపోషకమైన రెండవధార యుండుచునే యున్నది. కాని అది పనులు చేయుటలేదు. ఆత్మధారయే అన్ని విషయములను విమర్శచేయగల్గినదియు, చేతనరూపము, శ్రద్ధారూపమునైనదియును. వెల్తురు పోయినపుడు వేడికూడ నెట్లుపోవునో అట్లే ఆత్మధార యెక్కువగా లోనికి ముడుచుకొనిపోయినచో ఇతరధారలుకూడా దానితోపాటే ముకుళితమైపోయి ఆధారలకార్యకలాపముగూడా కట్టడిపోవును.

## 51

దుఃఖము గల్గినపుడు భగవంతునికి ధన్యవాదము లర్పించవలెను. నిజమైనలాభమనగనేమి ?

మూర్ఖుడనగా తనలాభనష్టములు తెలుసుకొనలేనివాడు. వాస్తవమైన లాభమనగనెట్టిది, నష్టమునగనెట్టిది ? ఆత్మ అంతర్యామున కాకర్షింపబడి, యూర్ధ్వముగ నారోహించి, పరమపురుషునికి దగ్గఱగపోవుచు, సమస్తబంధనములనుండి తప్పించుకొనిపోయినచో నదియే యథార్థమైనలాభము. మహానష్టమనగా, ఆత్మ మాటిమాటికి నింద్రియమనస్సులద్వారా బాహ్యముగ భోగములనిమిత్తమై పరుగిడుచుండుటయు, శరీరమనోధనములకును, కుటుంబమునకును సంబంధించిన దుఃఖములు, వ్యాకులతలలోను చిక్కుకొనిపోవుటయు, భగవంతునికి తనయందప్రసన్నతాభావమున్నట్లెంచుకొని బాధపడుటయు, ప్రాపంచికవిషయలోలుడై పోవుటయునే. వాస్తవలాభము సంపాదించుటకై పట్టుదల వహించనివాడే మూర్ఖుడు. ప్రపంచములోనిజీవులుయావత్తు మూర్ఖతారోగములో పడియుండి, తిరిగితిరిగి చచ్చుచు, పుట్టుచున్నారు. జీవునికి సద్గురుసాంగత్యము చేసికొనకుండ నున్నంతకాలము ఈ మూర్ఖతారోగము నశించదు. సత్సంగమును, అభ్యాసమును చేసికొన్నందువలననే మనస్సు నిర్మలమై దానిమూర్ఖత్వము నశించును, కేవలము అభ్యాసమువలననే మనస్సు సరికానేరదు. సత్సంగమునుగూడ ఆంతర్యమునను, బాహ్యమునను చేసికొన్నపుడే మనస్సు సరియగును. ప్రాపంచిక

జీవులు ఇట్టిమూఢత్వములో మునిగిపోయియున్నారు. వారలకు చెప్పునదేమున్నది. సత్సంగులకే ఈయుపదేశము చెప్పుచున్నాము. కాని మనస్సు చాలమోసకారియు టక్కులాడియును. ఆత్మనాంతర్యమున కొంతవఱకూర్వముగ నాకర్షించుకొన్నసత్సంగులనుకూడ అది తనమోసములో పడవేసుకొనుచుండును. సత్సంగులుకూడ దిక్స్వేచ్ఛవలన దుఃఖములువచ్చినప్పుడు దుఃఖించుచు, సుఖములుగల్గినపుడు సంతసించుచు నున్నారు. భగవంతుడు దయాకటాక్షములు చేయదలచినపుడే దుఃఖపరిస్థితి గల్గును. ఏలననగా, దుఃఖముమూలమున బంధనములు తెగిపోవును. భగవంతుడు జనసామాన్యమందఱిమీదను దయచూపదల్చినపుడు, క్షామములు, కలరా, ప్లేగురోగములు, యుద్ధము మున్నగు వివిధ రకములైన దుఃఖ పరిస్థితులను కలుగజేయును. ఆ దుఃఖముల మూలమున జీవులకు కర్మలు నశించి, పరిశుద్ధి గలుగును. అటుపిమ్మటనే వారికి పరమార్థదానము అనుగ్రహించబడును. జీవులకు దుఃఖము గల్గులాగున భగవంతుడు ఏర్పఱిచిన చట్టములో దయ అంతర్గర్భితమైయున్నది. అట్టియేర్పాటు లేనిచో పరిశుద్ధి కలుగజేయుటకు మార్గమే లేదు. లోకములో బుద్ధిమంతులు, అపరాధులకు బుద్ధిచెప్పి వారిని సన్మార్గమునబెట్టు నిమిత్తమును, ఇతరులకు సుఖశాంతులు గల్గునిమిత్తమును, శిక్షలువిధించుచట్టముల నెట్లేర్పాటుచేసిరో, భగవంతుడు కూడా పరిశుద్ధిగలుగచేయుటకును, సుఖశాంతులు కలిగించునిమిత్తమును, దుఃఖపరిస్థితులను దయచేయుచుండును. అందువలన ఆయనకు అత్యధికముగనే ధన్యవాదములర్పించవలసియున్నది. నిజమైనభక్తులు భగవంతునిశరణ్యామును, దాదూసాహబ్ వారు ఈక్రింద సెలవిచ్చినట్లుగా దృఢపఱచుకొందురు.

తూ స్వామీ మైం సేవక తేరా,
భావే సిర దే సూలీ మేరా ॥

అర్థము :—మీరు నాకు స్వామి. నేను మీ కింకరుడను. కావలెనన్నచో నాశిరమును శూలముపెట్టి పొడిపించుడు.

అట్టిమహాకష్టములకు దుఃఖములకునుకూడ నిజమైనభక్తు డెంతమాత్రము లెక్కచేయడు. మరణమునకుకూడా సంతోషముతో సిద్ధమగును. సత్యవస్తువుయొక్కధారతో సంయోగముకలిగినవాడే సత్సంగికాని ఇతరులు కానేరరు. సత్సంగముచేయునిమిత్తమై భగవంతుడు సత్సంగములో ఒకపేర్లజాబితాను వ్రాయించిరి. పరిపూర్ణసత్సంగికి ఉండు శరణ్యాభావము పరిపక్వముగనుండును.

తన ధరతీ అబ్ హమ్ త్యాగీ, చఢ పహుంచీ గగనా।
అబ్ లాజ్ తుమ్హేం రాధాస్వామీ, మైహోగఈ సరనా ॥

అర్థము :— మేము శరీరమనెడిభూమిని విడిచిపెట్టి, ఆకాశముపై కెక్కితిమి. ఓ రాధాస్వామీ నేను మిమ్ములనే శరణుజొచ్చితిని. నా భారమంతయు తమదే.

## 52

మనస్సుయొక్క రోగమును కుదుర్చుటకు శబ్దాభ్యాసముకన్న గురుభక్తి యెక్కువముఖ్యము.

పాలమీగడ, రబడీ, హల్వా మున్నగునవి జబ్బుగనున్న శరీరమున కెట్లు హానిచేయునో, అట్లే జబ్బుగనున్న మనస్సునకు అంతశ్శబ్దముయొక్క శీతలధార లాభకరము గాదు. జబ్బుగనున్న మనస్సునకు ఆంతర్యానందము గల్గుటచే నష్టము వాటిల్లును, మదమానాహంకారములు మున్నగునవి పెరిగిపోవును. అన్నిటికన్న ముందు మనస్సుయొక్క రోగమును కుదుర్చుటకై వైద్యము చేయించవలెను. గురుభక్తి అనెడి మందువలననే ఈరోగము పోగలదు. అప్పుడు శబ్దధారయొక్క ఆనందమును గల్గును, అంతర్దర్శనమును లభించును. కార్య మప్పుడే పూర్తిగా సఫలమగును.

## 53

భగవత్ప్రేమవిరహములకొఱకెల్లపుడు ప్రార్థించుచుండవలయును.

ఒక్క దయాళువైన సద్గురువును తప్పించి, మఱొకవ్యక్తియందుకాని, పదార్థమునందుకాని మనస్సును లగ్నముకానీయకూడదు. సత్సంగమునందు హార్దికప్రేమ పెట్టుకొని, ఇతరవిషయములందు అవసరమైనంతవరకే ప్రేమపెట్టుకొనవలెను. అన్నిటనిమించినప్రేమ సద్గురువునందు చేయవలెను. అట్లు చేయనిచో భజనాభ్యాసమునందు ఆనందము లభించదు, దర్శనమును లభించదు. అన్నిటికన్న నెక్కువప్రేమ సద్గురువునం దెవరికి లేదో వారు తిరిగి తిరిగి యీ విధముగా ప్రార్థనచేయవలెను. "ఓసద్గురూ, దయాళో. నాకు 'తమచరణములందు భక్తివిశ్వాసముల ననుగ్రహించుడు." ఎల్లపుడును విరహతాపమును లోలోపల పుట్టించుకొనవలెను. అట్లయినచో ప్రేమదానము తప్పకుండ ననుగ్రహింపబడును. ఈవచనమును జ్ఞాపక ముంచుకొనవలెను.

## 54

ప్రాపంచికజీవులు విమర్శ లేకుండా ప్రవర్తించుచుందురు.

సామాన్యముగ ప్రాపంచికజీవులందఱును ఒక్కొక పైసకొఱకై తలలు బ్రద్దలుకొట్టుకొనుచుందురు. బహుస్వల్పలాభముకొఱకును, అత్యల్పనష్టము

నుండి తప్పించుకొనునిమిత్తమును వారు అనేక దేవీదేవతలను పూజచేయు చున్నారు. కాని దేహపతనసమయములో గలిగెడి దుఃఖసంతాపములవిషయ ములో వారేమియు జాగ్రత్తపడుటలేదు. శాస్త్రాధ్యయనముచేసినపండితులు ఒకరకమైన కర్మకాండ ననుష్ఠించుచున్నారు. కాని వారుకూడా భగవత్ప్రేమ నేరూపముననూ చేయుటలేదు. ఏవైపునకు జీవుడు ప్రయాణముచేయవలసి యున్నదో ఏస్థానము చేరుకొనవలయునో ఆవిషయమునుగురించి కొంచెము కూడ విమర్శించుకొనుటలేదు. వీరందఱును మాయయొక్క కోశములలోపడి అజ్ఞానావస్థలోనున్నారు. జీవుని బాధలన్నియు నెచ్చోట తొలగించబడగలవో, భగవచ్చరణములయందు ప్రేమను, దీనత్వమును సంపాదించుకొనుమార్గ మెచ్చోట బోధించబడునో, అట్టి శుద్ధపరమార్థవిషయము వేఱు. భగవద్గీత లోను, తులసీదాస్ రామాయణములోనుకూడా భగవంతునియందు ప్రేమ భక్తులు లేనట్టియు, భగవత్పూజచేయనట్టియు మానవులు పశుతుల్యులని చెప్పబడినది. కాబట్టి భగవంతునియందు ప్రేమచెయ్యవలెను. మానవుడు ఒక ఆడుది తనచెవిలో రహస్యముగాచెప్పినమాట నెంత ఆసక్తితోను శ్రద్ధతోను విని ఆప్రకారము ఆచరించుచుండునో చూడుడు. ఒకమానవుడు ఒక వేశ్యను పట్టుకొని తిరుగుచుండు ననుకొనుడు; అప్పుడతని బంధువులు, కుటుంబీకులు నతని నెంతనిరసనచేసి బహిష్కరింతురో చూడుడు! (అదంతయు నతడు సహించు కొనును కాని ఆవేశ్యను విడువడు) నరసింహదాసుని గులామ్‌హైదర్‌గా మార్చి వేయుచున్నారు. అనగా, మతమునుకూడా (స్త్రీసహవాసముకొఱకై) మార్పించివేయుచున్నారు. నిజమైనపరమార్థికి, భగవంతునియందును, తనఇష్ట దైవమునందును ప్రేమప్రీతులు ఆవిధముగా నుండవలెను. అప్పుడే ఉద్ధార మార్గములో ప్రయాణముసాగును. కావున నందఱును, ప్రస్తుతపరిస్థితినుండి వెడలిపోవలసివచ్చునని తెలిసికొని, ముందువిషయమునుగురించి చక్కగ నాలో చించుకొనవలయును.

## 55

భగవంతుడు విషమపరిస్థితులను కలుగజేసినపుడు నిరాశయు, గాబ రాయు పడకూడదు. భగవంతుడు జీవుని వికారలక్షణముల నావిధముగనే తొలగించి, చంద్రచకోరప్రీతిని పుట్టించును.

సాంసారికభావములతో కూడినట్టియు, స్వార్థముతో కలసియున్నట్టియు ప్రీతి పరమార్థమునకు విఘ్నకారకము. స్వార్థముకాని, సాంసారికభావములు

కాని లవలేశముకూడ లేనట్టి నిర్మలప్రీతి పారమార్థికాభివృద్ధి నతిశీఘ్రముగ కలుగజేయును. కాబట్టి స్వార్థభావములను పరిశీలనచేసి తెలిసికొనుచు, వానిని మనస్సునుండి తొలగించుకొనుటకై యెల్లప్పుడు ప్రయత్నించుచుండవలెను. మనస్సున కహమిక యేయేభావములు, పదార్థములలో నుండునో, అవి స్వార్థ భావములు, సాంసారికాంగములు నని చెప్పబడును. ఉదాహరణకు తన గొప్ప, గోటుమున్నగువానికొఱకు కోరికలు, బాహ్యమునను౦డునట్టి స్థూలసామగ్రి సాంసారికాంగములని చెప్పబడును. స్వార్థభావములకన్న నివి నీచశ్రేణికి చెందినవి. ముందు సాంసారికాంగములను స్వార్థభావములను గుర్తుపట్టుకొనవలయును. అప్పుడే వానికి చికిత్సచేయుట వీలగును. కావున వానినిగుఱించి జ్ఞానము కల్గినచో నదియు భగవంతుని ప్రత్యేకదయయే. కాని భగవంతునితో కలిసికొను నిమిత్తమై నిర్మలభక్తి చేయుచుండినచో నివికూడా నెమ్మదినెమ్మదిగా అణఁగి పోవుచుండును. భగవంతుడు భక్తిబీజమును నాటివేయును. ఆబీజము అంకురించి అభివృద్ధినొందుచుండును. మనస్సు, మాయయు తమప్రభావమును చూపుచునేయుండినను కూడ ఈభక్తివృక్షము వృద్ధిపొందుచునేయుండును.

జీవులు భగవంతునికి భక్తిచేయదల్చుకొని వచ్చినపుడు మొట్టమొదట స్వార్థభావములు, సాంసారికాంగములతోనే వత్తురు. తరువాత నెమ్మదిమీద కొంతకాలమునకు భగవంతుడు జీవునియొక్క వికారలక్షణములను అనగా మనస్సుయొక్క, మాయయొక్కయు కోశములను తొలగించునిమిత్తమై జీవుని క్లిష్టపరిస్థితులలో పెట్టి, ఆవిధముగా వానిని నిర్మూలించ మొదలిడును. కావున నట్టిపరిస్థితులుగల్గినపుడు పరమార్థి నిరాశగాని, గాబరాగాని పడకూడదు. వికారలక్షణములు తగ్గిపోవుచున్నకొలఁది, అంతకంత నధికముగ నిర్మలప్రేమ మేల్కొనును; రానురాను చంద్రునియందు చకోరపక్షికిని, దీపముమీద పతంగమునకును ఎట్టిప్రేమగలదో అట్టిప్రేమ బయల్దేరును. అప్పుడు రాధాస్వామీ దయాళురు జీవున కుద్ధారమును అనుగ్రహింతురు.

## 56

ప్రాపంచికకృత్యములనిమిత్తమై పారమార్థికకృత్యములను విడిచిపెట్టకూడదు.

ప్రాపంచికకార్యకలాపము నిర్వర్తించుకొనుటకై పారమార్థికకార్యకలాపమును పూర్తిగాముగించుటకాని (అనగా ముందెప్పుడు చేయకుండులాగునవిడిచిపెట్టుటకాని) లేక అశ్రద్ధచేయుటకాని సరికాదు. ఏదైన నొకముఖ్య

కారణముచే, ఉదాహరణకు ఒకజబ్బుచేసినందువలన, సత్సంగమునకు రాలేకపోయినచో అదేమియు నంతహానికరముకాదు, సరికదా అది లాభదాయకమే అనవచ్చును. ఏలననగా, సత్సంగి అట్టిసమయములలో. తనకది కర్మచక్రము యొక్క ప్రభావమని తెలిసికొని, పశ్చాత్తాపపడుచు, సిగ్గుపడుచు, భగవంతుని మఱింత ప్రార్థన చేయుచుండును. ఆలాగుననే కూర్చుండియో, లేక ప్రక్కమీద పరుండియో, సాధ్యమైనంతవఱకు స్మరణ, ధ్యానములు, శబ్దపాఠమును చేసికొనుచుండును. కాబట్టి దానిని పారమార్థికకృత్యములను ముగించివేసినట్లు చెప్పకూడదు. ఆరుగ్ణత సత్సంగికి యథార్థమైనదీనత్వము, విధేయతయు, పవిత్రతయు గలుగజేయునిమిత్తమును, అతనివివేకమభివృద్ధియగునిమిత్తమును భగవదిచ్ఛచేతనే ప్రసాదించబడెనని తెలుసుకొనవలెను. కాని పరమార్థముకన్న సాంసారికకృత్యములకు ప్రాముఖ్యము కలుగజేయునట్టి ఇతరమైన కాలదూతలు గూడ నున్నారు. బహుచాతుర్యముతో నాదూతలనుండి తప్పించుకొనవలెను. పవిత్రగ్రంథములో నిట్లు సెలవియ్యబడినది :

> జబ్ సచ్చా హైృ్వా చలే డగర గురు, తబ హీ చౌంకే రోకే ఆయ్
> ఊంచ నీచ కహేం బచన తోఖ కే, మన కో తేరే దేం భరమాయ్
> ఉన సే రహనా సమఝు బూఝు కర్, హైం యహ బైరీ హిత దిఖలాయ్
> తేరీ హాని లాభ నహీం సోచే; అపనీ స్వారథ రహే లిపటాయ్ ॥
> తూ భీ చతురా గురు కా ప్యారా, ఇన సంగ రహు గురు చరన సమాయ్.

అర్థము :—నీవు హృదయపూర్వకముగా గురువుగారిత్రోవను వెళ్లుచున్నపుడు, వీరందఱును వచ్చి నిన్ను బెదరించి నీకు అడ్డుతగులుదురు. నిన్ను అనేకవిధముల దూషించియు, భూషించియు నెన్నియోమాటలుచెప్పి నీమనస్సును తప్పుత్రోవను బెట్టుదురు. వీరందఱు నిజముగ నీకు శత్రువులై యుండియు, పైపైకి నీహితవుకోరెడి మిత్రులవలెనే వేషమువేయుచుందురు. వారలస్వార్థమే వారు చూచుకొందురుకాని నీహానిలాభములనుగుఱించి యెంతమాత్ర మాలోచించరు. కావున నీవు సద్గురువునకు ప్రియశిష్యుడవుకావున వీరిని చాతుర్యముగ వదల్చుకొని సద్గురునిచరణములందు చేరుకొనుము.

జీవుడుపరమార్థములోచేరినపుడు ఆదూతలు మామూలుకన్న నెక్కువ ప్రభావముచూపి, ఇతనిని పరమార్థమునుండి పడిపోవునట్లు చూతురు. కాని, స్వార్థకార్యములకన్న పారమార్థికకృత్యములకే అతడెక్కువప్రాధాన్యమిచ్చి, యేమైననుకూడ పరమార్థము సంపాదించుకొనకమాననని దృఢనిశ్చయముతో

ప్రవర్తించినయెడల నవన్నియు సరియైపోవును. భక్తజనులకుకూడ ననేకవిధము లైన సాంసారికకృత్యము లుండుచుండును. కాని పారమార్థికాభ్యాససమయము వచ్చినపుడు భక్తజనులు వానినన్నిటిని దూరముగనుంచి తమఅభ్యాసమును చేసికొనుచుందురు. పరమార్థవిషయములో నిట్టి ఆసక్తిగలుగనంతవఱకు అస లైనపారమార్థికలాభము చేకుఱనేరదు. భక్తజనులకు స్వార్థకార్యములు పార మార్థికకార్యములు రెండింటిలోనుకూడ రాధాస్వామిదయాళురు స్వయముగ సహాయకులుగనుండి కనిపెట్టుచుందురు. స్వార్థకార్యములలోకూడా, సామాన్య జీవులకన్న నుత్తమరూపమైనజయము ననుగ్రహించుచుందురు.

> అన ధన ఔర్ సంతాన భోగ రస, జగత భోగ ఔర్ మిలా జోగ రస
>
> పర కిరపా సతగురు అస రహాఈ, మోహా న బ్యాపి జగ న హి ఫంసఈ ॥

అర్థము :—అన్నధనసంతానాదిప్రాపంచికభోగములును, యోగాభ్యాస మువెుక్క-ఆనందమునుకూడ మాకు లభించునట్లు సద్గురు వనుగ్రహించిరి. అయినను సద్గురువు మమ్ము ప్రాపంచికవ్యామోహములోపడి జగత్తులో చిక్కు-కొనిపోకుండులాగున మహాదయచూపి రక్షించిరి.

10, 12 సంవత్సరములతర్వాత నొకబంధువు మీయింటికి వచ్చెరను. కొనుడు. అతని కప్పుడు ఆతిథ్యసత్కారములు చేయుట అవసరమే. కాని అందునిమిత్తమై మీరు పరమార్థమును పూర్తిగా వదిలిపెట్టనవసరములేదు అట్టివానికొఱకై పారమార్థికాభ్యాసము నష్టపోయినచో పశ్చాత్తాపపడి, మఱింతదీనత్వముతో భగవంతుని క్షమార్పణకోరవలయును.

## 57

గుప్తమైనసంత్ సద్గురువునకును, తరువాతప్రకటమైనసద్గురువునకును సం బంధించిన ప్రశ్నలు.

"సమకాలికసద్గురువు గుప్తమైనపుడు, వారు తమస్థానే తమగురుముఖ శిష్యుని నియమించి వారిలో స్వయముగా ప్రవేశింతురు." (సారబచన్ గద్య భాగము-లో 250 నంబరువచనము).

ప్రశ్న :—ప్రస్తుతసద్గురువు గుప్తమైనపుడు వారిఆత్మ సత్యలోకమునకు తిరిగి వెళ్ళిపోవునుగదా, ఆపిమ్మటప్రకటమైన సంతుమహాత్మునికికూడ నొకఆత్మ వేఱుగనుండునుకదా. అయితే మొదటిసద్గురునిఆత్మకూడా ఆశరీరములోనికి వచ్చినయెడల, ఒకేశరీరములో రెండాత్మ లెట్లుండగలవు ?

జవాబు :— మొదటిఆత్మ తిరిగి వెళ్ళి కలిసిపోయినది చైతన్యసముద్రములో. రెండవఆత్మ లేక తరంగము వచ్చినదికూడ నదేమహాసముద్రమునుంచియే. సముద్రములోనుండి ఒకతరంగమువచ్చి వెనుకకు వెళ్ళిపోగా, మఱొకతరంగమువచ్చి నచో నిదియు నాసముద్రమునుండియే వచ్చినది కావున నా రెండు తరంగములు నొక్కటే యగును. లేదా మొట్టమొదటివారు భగవంతునిధారయు, రెండవ వారు ఆ అంశియొక్క అంశ, లేక తునుకయు ననికూడ చెప్పవచ్చును.

ఒకసంతసద్గురువు గుప్తమైనపిదప నేభక్తునికైనను తరువాతిసమకాలిక సద్గురువునందు భావముకలుగనిచో నందుకేదైన నొకకారణము తప్పకుండగ నుండితీరును. అత డేచిహ్నములనుబట్టి ముందుసద్గురువును గుర్తుపట్టెనో ఆ చిహ్నలు ప్రస్తుతగురువునందుకూడ నున్నవా లేదాయని అతడు మొదట చూచు కొనవలెను. భక్తుడు వారిసన్ముఖమునకువెళ్ళి వారియందు దృష్టినిలిపిచూచి నపుడు అతని మనస్సు ఆత్మయు రెండును ఏకాగ్రతచెంది, వారిమహావాక్యములు వినుచున్నపుడు మనస్సున ఆకర్షణగలుగుచున్నయెడల దానినిమించి మఱొకచిహ్న యేముండగలదు ? అట్లైనను నీకు వారియందు భావముపుట్టనిచో, మఱొకగురువు నన్వేషించుకొనుచు, భజనాభ్యాసముమాత్రమే చేయుచు నుండ వలయును. పిమ్మట మఱొకజన్మ ధరించవలసివచ్చును. ఎప్పుడుచేసినను, తిరిగి ఇదేపని చేయవలసియుండును. అనగా సమకాలికసద్గురువునందు భక్తిభావము తెచ్చుకొనవలయును. అప్పుడే నీకార్యము సఫలము కాగలదు.

ఈవచనము మేము చాలశ్రద్ధగా చదివితిమి. ఎంతయద్భుతవచనమును స్వామీజీమహరాజువారు వ్రాసితిరాయని మాకనిపించుచున్నది. దీనిలో నేమియు వాదమునకుగాని మోసపడుటకుగాని పావకాశములేదు. సంతుమత మైత్రివేయుదివ్యేచ్ఛ గలిగినపుడు వెనుకకువెళ్లిపోవుదుమని చెప్పనేచెప్పిరి. ఒకత్రిలోకి తిన్నగ సత్యలోకమున కెదురుగ వచ్చినపుడు నిస్సంశయముగ సత్య లోకమునుండిధార తిన్నగ దానిలోనికి దిగివచ్చును. అందుచే మొదటిసద్గురువు నకును రెండవసద్గురువునకును వ్యత్యాసమేమియు నుండనేరదు.

## 58

**పూర్వకాలపుయోగులు పడినశ్రమలు. సద్గురునివలన లభించునట్టి అభయదానము.**

ప్రాచీనకాలపుపద్ధతులప్రకారము ప్రాణాయామము మున్నగుసాధనలను చేయునిమిత్తమై ఆకాలములోయోగులు, యోగీశ్వరులును పడినపాట్లు, శ్రమ

యును ఊహాతీతము. కళాధారిజీవులుదప్ప మఱెవ్వరు నట్టికష్టములను బాధలను సహించుకొనలేరు. కళయనగా అంశ. ఒకఉత్తమలోకాధిపతియొక్క అంశ లేక కళ యైనవానికేదప్ప మఱొకనికి ఆసాధనలను జయప్రదముగజేసి ఆలోకమునుపొందుట సాధ్యముకాదు. జీవుడు ఆఱవచక్రముదాటి వెళ్ళిపోవునపుడు, అతనికి కాలునివలన చాలభయముగల్గును. కాని సద్గురునియొడిలో నున్నవానికెంతమాత్రము భయముండదు. ఆలాగున భయము కలుగుచుండగనే సహాయము లభించును.

## 59

పురాణసత్సంగులకు, క్రొత్తగాచేరినసత్సంగులకన్న పారమార్థిక బాధ్యత యెక్కువగనుండును. సద్గురువుకూడ వారియందు బాహ్యముగ దయాచిహ్నముల సంతగా ప్రకటించరు.

జనులకు తెలివితేట లెక్కువయగుచున్నకొలది, వారిపూచీలు, కర్తవ్యములుకూడ లౌకికముగా హెచ్చుగనైపోవుట మనము ప్రాపంచికవిషయము లన్నిటిలో చూచుచునేయున్నాము. ఒకకూలివాని తెలివితేటలు, వానికర్తవ్యములు పూచీపేచీలను గమనించుడు, ఒకమంత్రియొక్క బుద్ధికుశలత, ఆయన కర్తవ్యములు, బాధ్యతలను గమనించుడు. పరమార్థములోకూడ నదేవిధముగా సత్సంగియొక్క వివేకానుభవములు పెరుగుచున్నకొలది, అతనిపారమార్థికబాధ్యతలుకూడా పెరిగిపోవును. ఈవిధముగా తమప్రవర్తనను మార్చుకొని బాగుచేసికొననివారు తెలివితక్కువవారు.

ఎదిగినయువకునియొక్క కర్తవ్యతాబాధ్యతలవంటిబాధ్యతలు పసిపిల్లలకుండనేరవు. చంటిపిల్లలకు చూపునట్టిముద్దులు, ముచ్చటలును పెరిగినపిల్లలకెవరును చూపరు. అదేప్రకారము రాధాస్వామీదయాళురుకూడా, సత్సంగములో క్రొత్తగాచేరినవారి తప్పిదములు లోపములవిషయములో చాలయెక్కువమార్దవము చూపుదురు. కాని పురాణసత్సంగుల కంతమృదువైనచికిత్స కధికారములేదు. పురాణసత్సంగులు తమతప్పిదములులోపములకును సిగ్గుచెందుచు పశ్చాత్తాపపడవలసియున్నది. అట్లుగాక వారు తమపైన ప్రప్రథమములో వారు చేరినపుడు చూపించిన దయాకటాక్షములనే ఇప్పుడుకూడ చూపించవలెనని కోరుచు, నట్టిదయచూపకుండినచో పరమార్థమువిషయములో చలచిత్తులయిపోవుచుండినచో వారు చాల అపాత్రులును, మహానీచులును, అతిమలినజీవులునని చెప్పవలయును. వారి కిపు డట్టి దయ యెట్లు లభ్యమగును ?

మీరు సత్సంగములో చేరి చాలకాలమయినదికావునను, ఇప్పుడు మీకు కొంతవివేచనాశక్తికూడ పెరిగియుండవలెను కావునను ప్రాపంచికవాంఛలనుండి కొంతవిరక్తి మీకు గలిగియుండవలయును. ప్రియతమునిదర్శనముకొఱకై విరహబాధ మీలో దినదినాభివృద్ధి నొందుచు తఱుచు భగవచ్చరణములందు ప్రేమభావ మోలలాడుచుండవలయును. బుద్ధిపూర్వకముగ తప్పులుచేయువారు శిక్షార్హులేయగుదురు. మన్సూర్‌ను శిబలీ పువ్వులతో కొట్టినందుకు ఆమెయెంత శిక్ష ననుభవించెనో చూడుడు. మీఅదృష్టమువలన సంపూర్ణగురువు మీకు లభించినచో, వారిమహిమాతిశయమును, శోభను గుర్తుపట్టుకొనుచు, హృదయమున భయభక్తులు గల్గియుండి, వారి ఆజ్ఞానుసారము ప్రవర్తించుచుండవలెను. పరమార్థకార్యములవిషయములో నెంతమాత్రము తప్పిదములను లోపములను చేయకూడదు. అనగా ప్రవర్తనలోనిలోపములను చాలమెలకువతో పరిశీలనచేసికొనుచు, మంచి నడవడికనుండి, సత్సంగము చేసికొనుచుండవలెను. ఇంతకు పర్యవసానమేమనగా, మీరు సత్సంగముచేసికొనుచువెళ్ళినకొలది మీ పారమార్థికబాధ్యతలుగూడ పెరుగుచుండును. మీరు అది తెలిసికొని మీప్రవర్తన మార్చుకొనుచుండవలెను.

"సత్సంగ కరత బహుత దిన బీతే,
అబ్ తో ఛోడ్ పురానీ బాన్".

అర్థము :—సత్సంగము చేసికొనుచు చాలకాలము గడిపితివి. ఇప్పటికైనను నీపూర్వపు చెడుఅలవాట్లను విడిచిపెట్టుము.

## 60

## పరమపురుషుని లక్ష్యజ్ఞానము ప్రారంభమైనపుడుగల్గు మార్పులు.

పరమపురుషునిగుఱించి కొద్దిగొప్ప లక్ష్యజ్ఞానముగలిగి విశ్వాసముపుట్టునంతవఱకు నీప్రాపంచికక్లేశములు సుఖదుఃఖములును గలుగుచునేయుండును. అభ్యాససమయములో కొద్దిగ ఆత్మయొక్క అంతరాకర్షణయు, ఏకాగ్రతయు గల్గుచుండుట, కొంచెము ఆనందానుభవముగూడగల్గుటయు నివి పరమపురుషుని లక్ష్యజ్ఞానచిహ్నములుగావు. అభ్యాసికి పరమపురుషుని లక్ష్యజ్ఞానముగల్గుట ప్రారంభించగనే, అతని కీప్రాపంచికసుఖములు కార్యములు నన్నియు తుచ్ఛములు, నీచములుగ కన్పించి, వానివైపునకు అతడు తిరిగిచూచుటకే యిష్టపడడు. అంతరాకర్షణమూలమున గలిగెడి ఆనందానుభవముగూడ తుచ్ఛముగ

కన్పించుచుండును. దుఃఖపరిస్థితు లతనికి మొదటిలోవలె నప్రియమైయుండుటకు బదులు, ఇప్పుడు చాలప్రియముగ కన్పట్టుచు, వానిమూలమున నతని కెంతమాత్రము నిరాశగలుగ నేరదు.

జీవుని వివేచనాశక్తి కేవలము తృణప్రాయము. ఆపరమపురుషుడు అపారఅగాధమహాసముద్రము. అందుచే నితడు ఈతృణప్రాయపుబుద్ధిస్థానము ననే యున్నంతికాల మితనికి ప్రపంచసంబంధమైన విషమపరిస్థితులు సుఖ, దుఃఖములును గల్గుచునేయుండును. వానినిగుఱించి యితడు భగవంతునికి మొఱ్ఱ పెట్టుకొనుటయు, తప్పించుకొనుటకు ప్రయత్నములుచేయుటయుకూడ సహజము, సవ్యమునుకూడ. కాని యీ తృణప్రాయపుపరిస్థితిగల ఘట్టమున నున్నంత వఱకు, సామాన్యముగ లక్ష్యజ్ఞానము ప్రారంభముకానేరదు. ఇట్టి అభ్యాసి యీక్రింద చెప్పినరీతిగ నుండును,

అప్నీ మతి లేకరూఁ పుకారా, మాజ్ తుమ్హారీ మైఁ నహీఁ జామ్ ॥

అర్థము :—నాబుద్ధి ననుసరించి నేను మొఱ్ఱపెట్టుకొనుచున్నాను. మీది స్వేచ్ఛయేమో నాకెంతమాత్రము తెలియదు.

ఈపరిస్థితిలో నిజమనస్సుతోను, బ్రహ్మాండీమనస్సుతోను, కాలునితోను మాయతోను పోరాటముసల్పుచునుండవలసియున్నది. కాని భగవంతునిలక్ష్యజ్ఞానము కొంతయైననుగల్గిన అభ్యాసికిమాత్రము, ఇవన్నియు నతనితోపోరాడు నిమిత్తమైవచ్చినను, ఇతనిని దూరమునుండియే చూచుచు భయపడిపాఱిపోవును.

## 61

పరమార్థికిన చ్చెడి ఆపత్తులు, దుఃఖములలోను మహాదయకలిసియుండును. వానిద్వారా అతనికి లక్ష్యజ్ఞానముత్పన్నమై బంధనములువిడిపోయి పరమపదములో ప్రవేశించగల అర్హత గలుగును.

సుఖదుఃఖములు మనస్సుయొక్క అంగములుకావున మనము వానితో కలిసిపోయి తద్రూపమైపోకూడదు. పసిపిల్లవాడు ఏదైనపని తనయిష్టమువచ్చినట్లు జరిగినచో సంతోషపరవశుడైపోవును, వ్యతిరేకమైనచో మహాదుఃఖితుడై కోపగించి బిగ్గరగా అరుపులు కేకలుపెట్టుచు చాలసేపటివఱకు నదేపనిగ నేడ్చుచుండును, కాని ఎంతచెప్పిన నూరుకొనడు. అతనికిగల్గిన కష్టము చాలచిన్నదే కాని, దాని నతడు తనంతటతానే పెద్దదిగా చేసికొని ఆవిధముగా దానితో

తద్రూపమైపోవుచున్నాడు. ఆవిధముగ మనస్సుతో నెన్నడు తద్రూపముగాకూడదు. సాంసారికులుగూడ భగవంతునిపిల్లలేకదా. వారెంతెంతదుఃఖములు సహించుచున్నారో చూడుడు. పరమార్థములోకూడా సుఖదుఃఖములు గల్గుచునేయుండును. అయితే పరమార్థికి వానిలో మహోదయ యిమిడియున్నది. అట్టిపరిస్థితులలో నతడెంతమాత్రము నిరాశపడకూడదు.

దుఖీ చిత సే న హో దుఖలార్, సుఖీ హోనా నహీం సుఖ జార్ ॥

అర్థము :—దుఃఖము వచ్చినపుడు నీమనస్సును దానితో కలిసితద్రూపమైపోనీయకుము. అట్లే సుఖముగల్గినపుడు గూడ దానిలోపడి తన్మయముగాకుము.

అభ్యాసముచేసికొనుచు, యత్నముచేయుచునుండినచో, నెమ్మదిమీాద నీపరిస్థితులన్నిటికిని నీపైన ప్రభావము తగ్గిపోవుచుండును. ఈవిధమైన వివేచనాశక్తియు, అనుభవజ్ఞానమును గలిగినవానికే పరమపురుషుని సభలో ప్రవేశించ గలఅర్హత లభించును. ఆపరమపురుషుని లక్ష్యజ్ఞానముగూడ గలుగనారంభించును. అట్టిఅభ్యాసి యీలోకమునుండి స్వతహాగా నిర్భయముగనుండి యెల్లపుడు భగవంతునిప్రేమతో పూరితుడై ఆనందమగ్నుడైయుండును. అట్టివానికి ఆంతర్యబంధనములు, బాహ్యబంధనములుకూడ నశించిపోవును. ఆమోక్షదాతయగు పరమపురుషు డట్టిదీనాధీనుడైయున్న భక్తుని కుద్ధారము సునాయాసముగ గలుగజేయును. అట్టిఅభ్యాసి ప్రపంచమునుండి సహజవైరాగ్యముగల్గియుండును.

## 62

జాగ్రత్ స్వప్నసుషుప్త్యవస్థలు, వానిపైనున్న అవస్థయు, వానిపోలికలు తారతమ్యములు.

అప్పుడప్పుడు స్వప్నావస్థలోనుండగా జీవునికి కష్టపరిస్థితులుకాని, ఉత్తమ పరిస్థితులుగాని వచ్చుచున్నట్లగుపడుచుండును. జాగ్రదవస్థలోనికి తిరిగివచ్చినపుడవి అతనికి బాగుగ జ్ఞాపకముండును. కొన్నాళ్లైనపిమ్మట వానిని మఱచిపోయినతర్వాత ఆపరిస్థితియే తిరిగి జాగ్రదవస్థలో జరుగుట తటస్థించినపుడు తన కింతకుముందే యీావిషయము స్వప్నములో సూచితమయ్యెనని జ్ఞాపకము వచ్చును.

స్వప్నజాగ్రదవస్థలఘట్టములు కలిసియున్నవి. సామాన్యముగా మెలకువగనున్నపుడు తనమనస్సులోపడిన ఛాయల మాఱురూపములే స్వప్నావస్థలో

వచ్చుచుండును. కాని అప్పుడప్పుడు జీవు డీతాటుమాటుచ్ఛాయలనుండి వేరగు చుండును. అప్పుడు జీవుడు స్వప్నావస్థలోకమునుగూడ చూచును. అచ్చటి విషయము లీజాగ్రదవస్థలో తప్పక ప్రకటమగును. ఏలననగా, ఈరెండుఘట్టము లకును స్వాభావికమైన పరస్పరసంబంధము కలదు. అయినను ఈరెండిటిలో గొప్పవ్యత్యాసమును గలదు. అనగా, స్వప్నావస్థయొక్క ప్రభావము అంతయు ఉన్నదున్నట్లు జాగ్రదవస్థపైకి ప్రసరించ నేరదు.

ఈ జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలను దాటి యేఅభ్యాసియైనను పైకి సంపూర్ణస్మృతితో వెళ్ళినచో నపుడు గల్గెడియవస్థ ఇంతకన్న నెక్కువయున్నత మైనది. ఆయున్నతావస్థకును, ఈజాగ్రదవస్థాస్థానమునకును సంబంధమే లేదు. కావున నాస్థానములో అభ్యాసికి దర్శనమయ్యెడి సృష్టివిచిత్రములప్రభావ మీస్థానములో నెన్నడును పడ నేరదు. సమాధ్యవస్థను గమనించుడు. ఈజాగ్రదవస్థాస్థానములోనుండగా ఆయవస్థవిషయ మేమియు తెలియనే తెలియదు. అంతియ గాదు, ఈయవస్థకును సమాధ్యవస్థకును మధ్యనున్నయవస్థవిషయముకూడ నేమియు తెలియదు. ఆస్థానములోని కభ్యాసివెళ్ళినపు డతనిపరిస్థితి, యీ క్రింది చరణములో చెప్పినట్లుగ నుండును.

> జాన్ బూఝ జడ హో రహే, బలతజ నిర్బలహోయ్ ।
> కహేఁ కబీర దాస కో గంజ న సక్కే కోయ్ ॥

అర్థము :—బుద్ధిపూర్వకముగ నెవ్వరు జడావస్థలోనికి పోవుచుండునో, యెవరు తనబలమునువిడిచిపెట్టి బలహీనునివలె నైపోవునో, అట్టిదాసుని ప్రపంచములో నెవరును గెల్వలేరు.

అట్టివానికే ఆస్థానముయొక్క లీలలన్నియు తెలియగలవు; అత్యుత్తమ శక్తులుగూడ లభించును. కాని వానిని అత డీజాగ్రదవస్థగలస్థానములో నెంత మాత్రము కనపర్చడు. ఈవిధమగు ప్రవర్తనగల యభ్యాసియే వాస్తవమైన దాసుడు.

## 63

### పరమార్థి స్వలాభముకొఱకై ఇతరుల నెన్నడు శ్రమపెట్టనొల్లడు.

చిన్నచిన్నవిషయములలోనే జాగరూకత చూపలేనివాడు, పెద్దపెద్దవిషయములలోమాత్ర మేమి జాగ్రత్త కనుపర్చగలడు ? ఉత్తమకులములకుచెంది, విద్యావంతులుకూడనైనట్టి ప్రాపంచికజీవులే చిన్నవిషయములలోకూడా జాగ

రూకతతోనే ప్రవర్తించుచున్నారు. ఉదాహరణకు, ఒకస్నేహితు డింకొక మిత్రునివలన నుపకారముపొందినపుడు, అతడు తనమూలమున నామిత్రునకు శ్రమకలుగకుండులాగున చూచుకొనుటయేగాక, అందుకు తగిన ప్రత్యుప కారము నేదైన తానుకూడ నతనికి చేయప్రూనుకొనుచుండును. ఈవిధమైన ఆలోచనలులేనిపరమార్థి, సంసారులకంటెకూడ పతితుడే. ఉదాహరణకు ఎవ రింటనైన నొక బట్టలుకుట్టెడిమిషన్ ఉందనుకొనుడు. మఱొకరు ఒకసారి వా రింటికి బట్టలుపంపి కుట్టించుకొని, ఆతరువాత నెప్పుడును బట్టలు చింపిపంపుచు అప్పుడపుడు చింపుటకూడా చెయ్యకుండగనే పంపుచుందురు. దారము, బొత్తా ములఖర్చుకూడా మిషన్‌గలవారిమీాదనే పెట్టివేయుచుందురు. అట్లుచేయుట న్యాయమో కాదో వారు ఆలోచించుటకూడ లేదు, సరికదా పైగ మనమంద రము సోదరులముగదా, కొంత ఆసరా పొందినచో తప్పేమున్నదని యనుకొ నుచు తృప్తినొందుచున్నారు. పరమార్థియైనవాడు తనకొఱకై యితరులకు శ్రమ గలుగజేయనొల్లడు. అకస్మికముగ నెవరియింటికైన వెళ్ళినచో, నచ్చట తేనీరు మున్నగునవి తీసుకొనుటలో తప్పులేదు. కాని తేనీరును, మఱొకశ్రేష్ఠ భోజ్యపదార్థములను తినవలెననియే మఱొకరింటికి వెళ్లుట సరికాదు. అవతలి వారు నోటితో అనలేకపోయినను, వారిమనస్సునందు దానిప్రభావము తప్పక కలుగును. దానివలన ప్రేమభావములో తగ్గుదల పారంభమగును. సత్సంగీ సోదరులు సామాన్యముగ నీయాలోచనలు పెట్టుకొనుచునే యుందురు కాని సత్సంగీస్త్రీలు హెచ్చుమంది ఈవిషయములో సంసారులకంటెకూడ చాలహీన ముగ ప్రవర్తించుచున్నారు. బహుస్వల్పవిషయములలోకూడా స్వలాభము నే ప్రధానముగ చూచుకొనుచున్నారు. ఇది కడుశోచనీయము.

## 64

### అనుభవపూర్వకమైన వైరాగ్యప్రేమలకే మహిమ.

మృత్యువన్న భయములేదు, యముడన్ననే భయము. చూచి అనుకరిం చుభయ మొకటి, వినికిడివలన గలుగు భయమొకటియును, మూడవది ప్రపంచ ములో నేదైననొక ఆఘాతము వచ్చినమీాదట గలిగెడిభయము. చివరిరకము భయము దుర్లభలాభకరము. దానివలన ప్రపంచము అస్థిరమనియెడి అనుభవ జ్ఞానముగల్గి జీవుడు పరమార్థములో ప్రవేశించును. పరమార్థమునకు అంగ మైన వైరాగ్యమనునది ఇదియ. ఇదిగలవాడు మహాదృష్టవంతుడు. వైరా గ్యములేనిదే జీవునికి పారమార్థికబుద్ధి కలుగనేరదు. ఆధ్యాత్మికమార్గములో

నడచుకొనలేదు. ఇట్లే ప్రేమకూడా మూడు రకములు. ఒకటి వినికిడిప్రేమ, రెండు అనుకరణప్రేమ, మూడు ప్రాపంచికాఘాతములు తగిలినందువలన గల్గునది. ఆఘాతములు తగిలినందువలన గల్గుప్రేమ అన్నిటికన్న శ్రేష్ఠతమము. దానిమూలమున జీవుడు "ఓ భగవంతుడా నన్నీజంజాటమునుండి త్వరలో విడుదలచేయుము." అని యెలుగెత్తి మొఱ్ఱపెట్టుము, సద్గురుచరణములందు అర్పణమై, "నేను మునిగిపోవుచున్నాను, కాపాడుడు", అని అఱచును. భగవద్దర్శనము పొందుట కప్పుడే సాధ్యమగును.

## 65

## సూక్ష్మబంధనములవిచ్ఛిత్తి సద్గురువులేనిచో సాధ్యముకాదు.

కష్టములు బాధలు గలుగకుండ బంధనములను శిథిలముచేసి విచ్ఛిత్తి చేయుట సాధ్యముకాదు. నోటిరుచిచాపల్యముగలవాడు అనేకసార్లు అపథ్యము చేసి మాటిమాటికి జబ్బుపడగా బహుదుఃఖితుడై వ్యాకులచిత్తుడగును. పిదపనే అతని కాచాపల్యము నశించును. అటులనే కామక్రోధలోభమోహాదిబంధనములుకూడా ఆదుర్లక్షణములవలన తిర్గి తిర్గి దుఃఖములు బాధలు గల్గినపిదపనే నశించిపోవును. కాని సూక్ష్మబంధనములు అనగా విద్యాభిమానము, అహంకారము, బుద్ధి మున్నగుబంధనములను తెంచుకొనుటలో నెక్కుడుబాధలను, కష్టములను సహించవలసియుండును. సంస్కారీజీవులకు వారిఅదృష్టవశమున పరిపూర్ణసద్గురువు లభించినచో, వారిసత్సంగమువలన నీసూక్ష్మబంధనములు తెగిపోగలవు. ఆబంధనములయొక్క మోసము, ప్రమాదములునుకూడ బాగుగ నవగాహనయగును. వారికి ఈబంధనములమూలమున నొక్కొక్కప్పుడు పెద్దపెద్ద దెబ్బలాటలుజరిగి, కొన్ని దెబ్బలుకూడా తగిలినమీదటనే, ఈబంధనములు శిథిలీభూతమగును. స్థూలబంధనములు స్వప్రయత్నమువలన తెంచుకొన్నను తెంచుకొనవచ్చును. కాని సూక్ష్మబంధనములను గుర్తుపట్టుటయు, తెంచుకొనుటయు మాత్రము పరిపూర్ణసద్గురువులేనిదే సాధ్యముకాదు.

మోటీ మాయా సబ్ తజే । ఝీనీ తజీ న జాయ్ ।
పీర్ పైగంబర్ ఔలియా ఝీనీ సబ్ కో ఖాయ్ ॥

అర్థము :—స్థూలమాయ నందఱును వదలగలరు. సూక్ష్మమాయను విడిపించుకొనుట సాధ్యముకాదు. పీర్లు, పైగంబర్లు, ఔలియాలను అందఱిని సూక్ష్మమాయ మ్రింగివేసెను.

కావున నేదైన వికారలక్షణములవలన తప్పుడుప్రవర్తనచేసినపుడు దుఃఖములు బాధలు గల్గినచో నది రాధాస్వామీదయాళుని ప్రత్యేకదయగా తెలిసికొనవలెను.

## 66

### దుఃఖపరిస్థితులుగల్గుట భగవంతునిప్రత్యేకదయ.

ఈలోకములో సుఖదుఃఖములు సమ్మిళితమైయున్నవి. అందఱును సుఖమునే కోరుచుందురు. కాని దుఃఖముగల్గుట భగవంతునిప్రత్యేకదయ. ఏలననగా దుఃఖమువలన జీవునికి మెలకువ గలుగును. ఈసమయములో సద్గురువు గుప్తమైయుండగా, బాహ్యవిషయములందెక్కువప్రీతిగల పరమార్థులమనస్సున ఉదాసీనత వ్యాపించుటయు, వాస్తవపరమార్థులహృదయములలో, మహాలాభదాయకమైన విరహావ్యాకులత క్రమ్మివేయుటయు భగవంతునిప్రత్యేకదయ. నిజమైన పరమార్థమనగా జీవునిపైన కప్పియున్నట్టి మాయాకోశములను చించివేయుటయే. కావున విరహతాపము, వ్యాకులత్వము ఒక్కక్షణమేయున్నను 100 సంII రములు భజనాభ్యాసముకన్న నవియే మేలు. ఏలననగా విరహసంతాపవ్యాకులత్వములవలన కోశములు త్వరలోచినిగిపోవును. ప్రపంచములోగూడ యుద్ధములు, క్షామములు, మహామారిజాడ్యములుమున్నగునవి అచ్చటచ్చట వ్యాపించియున్నవి. సమస్తప్రపంచమునకు నివ్విధముగా పరమార్థలాభము గల్గుటయు, అట్లుజరిగించుటకు భగవంతుడంగీకరించుటయు నీసమయములో భగవంతుడు చూపించుచున్న మహాదయయని చెప్పవలెను. ఈవిధమైన దుఃఖములకై పరమపురుషునిచరణములందు వేనవేలుకృతజ్ఞతాధన్యవాదము లర్పించవలసియున్నది. నిజమైనపరమార్థులు తమమనస్సు దుఃఖాక్రాంతమైయుండిననే అది భగవంతుని కలిసికొనునిమిత్తమై ప్రయత్నములుసేయగలదను తలంపుతో కొద్దియోగొప్పయో దుఃఖపరిస్థితి యుండవలెననియే యెప్పుడు ప్రార్థించుచుందురు. సంసారులుగూడ లోకములో వివిధవిధములైనదుఃఖపరిస్థితులనుజూచి గాబరా చెందినపుడే పునఃపునఃదుఃఖములననుభవించనక్కఱలేకుండగ శాశ్వతానందములభించునట్టిస్థాన మెద్దియైన నున్నదాయని అన్వేషణ చేయుచుందురు.

## 67

### సత్సంగులలో మూడుతరగతులు.

ప్రశ్న :—హుజూర్ మహరాజ్ వారు గుప్తమైనపిదప కొందఱుసత్సంగులకు విరహబాధగాని, వ్యాకులతగాని యెక్కువలేకుండగ మామూలుగ నేయుండి

నిజరూపదర్శనముపొందవలెననెడిఆసక్తి అప్పుడుగాని ఇప్పుడుగాని లేకుండగనే యుండిపోయిరి. దీనికి కారణ మేమి ?

సమాధానము :—పరమార్థులు మూడుతరగతులుగ నున్నారు. మొదటి నెంబరుపరమార్థులు, హుజూర్ మహారాజ్ వారు గుప్తమైనపిమ్మట నెక్కువవిరహము, మనోవైకల్యముతో బాధపడుచు తమకుబాహ్యముగా దర్శనము అనుగ్రహించుదివ్యేచ్ఛలేనిచో నాంతర్యమునన్నైన దయాసహాయము అనుగ్రహింపుడని ప్రార్థనచేయుచుండువారు. అట్టివారికి దయతో సహాయము లభించుచున్నది. వారిజీవకళ్యాణకార్యముకూడా కొనసాగిపోవుచున్నది. రెండవతరగతి వారు హృదయపూర్వకముగనే వారిని శరణుపొంది హుజూర్ మహారాజ్ వారు శబ్దస్వరూపములో నందఱికితోడుగనే యున్నారనియు, వారెన్నడు గుప్తము కానేరరనియు అభిప్రాయపడుచున్నారు. వారికికూడా మనశ్శాంతి లభించినది. అందుచే వారికి హుజూర్ మహారాజువారిదర్శనముకొఱకు విరహబాధమనోవైకల్యమును లేవు. మూడవరకమువారు నికృష్టపరమార్థులు. వీరికి హుజూర్ మహారాజువారికాలములోను, ఇప్పుడుకూడ నెట్టివిరహవైకల్యములును లేవు. వారికి నెమ్మదిమీద నుద్ధారమీయబడునుకాని కొంత ఆలస్యమగును.

## 68

సత్సంగములోచేరి ప్రాపంచికజీవులవలె ప్రవర్తించువారికి దండన తప్పక కలుగును.

రాధాస్వామీమతముయొక్కయుద్దేశ్యము, ఆత్మను మనస్సును ఊర్ధ్వముగ నిజమైనముక్తిస్థానమున కారోహింపచేయుటయే. కావున నీమతములోచేరినవారు తమజీవితము శాంతముగనుండునట్లుగను తమకా యుత్తమలాభము చేకూరులాగునను ప్రవర్తించవలెను. అట్లుప్రవర్తించనిచో వారి కట్టిలాభ మెన్నటికిని లభించనేరదు. మఱియు, వారికిని సంసారులకును వ్యత్యాసమేమున్నది ? పరమార్థులు భోగములయం దాస విడిచిపెట్టి వానిని తలంపుకూడ చేయకూడదు. అత్యాసక్తిశ్రద్ధలతో భగవంతునితో నాంతర్యమున కలిసికొనుటకు ప్రయత్నించవలెను. ప్రాపంచికజీవులకట్లుగాక, ప్రాపంచికభోగాసక్తి యెక్కువగనుండును. వారు ప్రపంచవ్యవహారములలో చిక్కువడియుండి, పరమార్థమునుగుఱించి తలపెట్టుటకే వారికి తీరికయుండదు. సత్సంగములోచేరి ప్రాపంచికజీవులవలెనే ప్రవర్తించువాడు నిజమునకు సత్సంగికానేకాడు. పరమార్థము

యొక్క అసలులాభ మతని కెట్లుచిక్కును ? అయితే అతనిలో పరమార్థబీజము పడినమాట నిస్సంశయమే. దివ్యేచ్ఛచే నట్టివానికార్యముకూడా సంతులుకొంత విలంబమైనను సాగించెదరు. కాని అతడు దండన సహించవలసియుండును. సత్సంగములోచేరి సరియైనత్రోవను నడచుకొనకుండా, ప్రాపంచికజీవులవలె ప్రవర్తించువారికి శిక్ష తప్పకుండా గలుగును. అనగా వారికి ఆంతర్యమున దయయు ఆనందమును లభించకుండపోవును. అదియే వారికివ్వబడు పారమార్థిక శిక్ష. అదికూడ రాధాస్వామీదయాళురు స్వయముగ నేమియు శిక్షించరు. ఆజీవుడే స్వయముగ నట్లు కలుగజేసికొనును. ఏలననగా, పైనుండి వర్షించు చున్న దయాధార వారిప్రవర్తనమూలమున వ్యర్థమైనభోగములు, పనులలోని కిని కారిపోవుచుండును. కాని వెల్తురు నొక తెర వేసి కప్పిపెట్టినట్లుగా వారిపైన తమదుష్కర్మలయొక్క కోశ మొకటి తయారగును. ఈవిధముగ నతడు తనకు తానే శిక్షను తెచ్చిపెట్టుకొని సహించుచు పరమార్థముయొక్క లాభమును, ఆదర్శమును పొందలేకుండ నుండిపోవును.

పరమార్థి గౌరవప్రతిష్ఠలకొఱకై ఆశించుటయు, ఇతరులవలన పూజా సత్కారములను పొందుచుండుటయు చాలదూష్యము కొందఱుసాధువులు అట్లుసత్కారములను పొంది, అందుమూలమున భగవంతునిదయను పోగొట్టు కొనుచున్నారు. కొందఱుసాధువులుకూడా సత్ప్రవర్తనగనుండుచున్నారు. వారు దయనుపొందుచున్నారు. మరణసమయములో వారి కుత్తమగతికూడ గల్గును.

## 69

నిజమైన పరమార్థియొక్క లక్షణములు.

నిజమైనపరమార్థి యేదైన తప్పిదము చేసినపుడు చాలపశ్చాత్తాపపడి అట్టితప్పు ఇక నెన్నడు చేయకూడదని మనసార నిశ్చయించుకొనును. అతడు తన శ్రేయోలాభమునిమిత్తమై అనగా ఆత్మయొక్కలాభముకొఱకై మఱొక నష్టమేమివచ్చినను లెక్కచేయడు. అత డితరుల అవగుణముల నెన్నడు నెంచడు. పైగా తనలోపములనే యెప్పుడు చూచుకొనుచుండును. తనమానఅహంకార ముల కెచ్చట పెంపుగల్గునో, అట్టిస్థలములతో సంబంధమును వెంటనే త్రెంచి వేసుకొనును. మానాహంకారములకు చిహ్న తన్నెవరైనను శ్లాఘించినపుడు విని అమితముగ సంతోషించుట. తానుచేసినదంతయు పూర్తిగ మంచిపని

యనియు, మఱొకరుచేసినదతయు తప్పనియు నెంచుకొనుటకూడా మనస్సు యొక్క స్వాభావికలక్షణము.

## 70

దోషములెన్నియున్నను, అనన్యశరణ్యమునొందినవాడు భగవత్ప్రియుడు. ఆధ్యాత్మికముగ జీవుడుచేయు పరిశ్రమయొక్కటే భగవంతుడు చూచుచుండును కాని, అతని బాహ్యవేషభాషలు ప్రవర్తనను యెన్నడు చూడడు.

పతివ్రితా మైలీ భలీ కాలీ కుచల కురూప్,
పతివ్రితా కే రూప పర్ వారూఁ కోటి సరూప్.

అర్థము :—పతివ్రిత మలినురాలై నల్లగనుండి, వంకరటింకరగనడచునట్టిదై, కురూపిగనున్నను కూడ శ్రేష్ఠురాలే. పతివ్రితయొక్కరూపము నెదుట కోటిసౌందర్యములుగూడ ధిక్కారము నే పొందదగియుండును. అనగా భగవంతునిదప్ప మఱొకదిక్కును నమ్ముకొనకుండనున్నవాడు, అతినిలో నెన్నిదోషములున్ననుగూడ భగవంతునికి ప్రియుడే అనిభావము.

## 71

భగవంతునినిమిత్తమై త్యాగముచేయుటవలన భగవద్దయ గల్గును. కష్టపరిస్థితివచ్చినపుడు మరణముకొఱకై ప్రార్థించుట చాలతప్పు. భగవంతుని శరణు పొందినవానిని భగవంతుడు తల్లిదండ్రులవలెనే కాపాడుచుండును.

ప్రపంచములో నెవరైనను మఱొకరినిమిత్తమేదైనపని చేసిపెట్టినపుడు, ఆరెండవవాడు వివేకవంతుడైనయెడల తిర్గి ప్రత్యుపకారముచేయవలెనని యెప్పుడు చింతించుచుండును. అంశరూపమైన జీవునకే యిట్లున్నపుడు, ఆత్మలన్నిటికిని సముద్రరూపుడైన ఆపరమపురుషుని కెట్లుండునో ఆలోచించుకొనుడు. కావున భగవంతునినిమిత్తమై ఏరూపములో నేపనిచేసినను దానికి ప్రతిఫలమతనికి తప్పకుండా లభించును. భగవంతుని ప్రసన్నత సంపాదించునిమిత్తమె యెవరైనను తనసుఖశాంతులయొక్కయు, ఐహికభోగములయొక్కయు వాంఛను విసర్జించినచో, నతనిపై వర్షించెడి దయకు అంతుపొంతులే యుండవు.

కష్టపరిస్థితిలో కొందఱు అప్పుడప్పుడు తమశరీరము పోవలెనని ప్రార్థించుచుందురు. అది చాలపొరపాటు. ఈనరశరీరము బహుకష్టముమీద లభించినది. దీనిలో నుండగనే యుద్ధారము కావలసియున్నది. ఏలననగా సమస్తసృష్టికిని

ఇది చిన్నపరిమాణములో నొకనమూనా అయియున్నది. సృష్టిలోనిచక్రము లన్నియు నీశరీరములోనే గలవు. పైలోకములకు కారోహణము ఈశరీరములోనే చేయుటకు సాధ్యమగును.

తల్లిదండ్రులు పసిపిల్లలయొక్క సంరక్షణనుగురించి యెట్లు ఆతురతతో నుందురో, అటులనే భగవంతుడుకూడా తన్ను శరణజొచ్చినవారి యోగక్షేమములను కనిపెట్టుచుండును.

## 72

సద్గురువుయొక్క మహిమ.

ఇచ్చట మన కానందము కేవలము ధారమూలమున నే లభించుచున్నది. మనమెవరినైన కలిసికొన్నపుడు, ఒకధార మఱొకధారతో కలిసికొనుచున్నది కాని, ఆత్మతో ఆత్మ కలిసికొనుటలేదు. అటులనే భగవంతునితోకలయికగూడ, వారియొక్క ఈప్రపంచములోనున్నధారద్వారానే సాధ్యముకాగలదు. భగవంతుని కలిసికొనుటకు రెండువిషయములు అత్యావశ్యకమైనవి. ఒకటి ఆపరమ పురుషునిధామమునుండి వచ్చుచుండిన చైతన్యధారయు, రెండవది ఆధారప్రకటమైయున్నస్వరూపమును. అందఱును రాధాస్వామీదయాళుని నిష్టదైవముగ చేసికొని, అభ్యాసముచేయుచు, సమకాలికసద్గురువు లభించవలెనని హృదయపూర్వకముగ ప్రార్థించుచుండవలెను. కాని సద్గురువును తెలియజేసెడిచిహ్నలు దొరకనిదే గురువుగ నెవరిని స్వీకరించకూడదు. ఎప్పటికైనను మహిమఅంతయు సద్గురునిలోనే యున్నది. కాని సంత్ సద్గురువు ఉపయోగించినపదార్థములు గూడ నట్టి ఆదరగౌరవములకు తగినవే.

## 73

జీవుడు స్వయముగ సంతులను తెలిసికొనలేడు.

ప్రశ్న :— మేము స్వయముగా సంతులను గుర్తుపట్టగలమా ?

సమాధానము :— ఎంతమాత్రము కాదు. వారే తమ్ము తెలిసికొనునట్లు అనుగ్రహించవలసినదే.

## 74

భగవద్దర్శనమనగ నేమి ?

భగవంతునితో నేలోకములోనైన కలుసుకొనవలెనన్నయెడల, ఒక్క సద్గురుస్వరూపముద్వారానే అట్లుసాధ్యమగును. అనగా గురుస్వరూపము

యొక్క-దర్శనమే భగవద్దర్శనము. ఏమండలాధిపతియొక్క-దర్శనముకూడ భగవద్దర్శనము కానేరదు.

## 75

### ప్రశ్నోత్తరములు

ప్రశ్న :–అహంకారమని దేనినందురు ?

సమాధానము :–ఏస్థానమునుండి బయల్దేరి శక్తివచ్చుచున్నదో, ఆస్థానమునుగుఱించి, మధ్యనకోశములున్న హేతువుచే, తెలిసికొనలేక ఇది తయు మనకపువులోనుంచియే వచ్చుచున్నదని తలంచుటయే అహంకారము. ఆమధ్యకోశములను చీల్చి వేయనిదే అహంకారము నశించదు.

## 76

### భగవద్ధారతోసంబంధము, కర్మనాశనము.

ఏహృదయములోనికి భగవంతునిధార వచ్చుచుండునో, ఆహృదయముతో మనకు సంబంధమేర్పడినచో, భగవంతునిధారతో మనకు సంబంధమేర్పడిన ట్లెంచుకొనవచ్చును. ఏదైన నొకభోగ్యపదార్థము బయటనున్నపుడేకాని ఆభోగము ననుభవించునట్టి ఇంద్రియముమీదికి లోనుంచి ఆభోగపుధార రానేరదు. అట్లే, కర్మలను నశింపుచేయుసామగ్రి బయటలేనిచో, కర్మలు నశింపు చేయబడనేరవు

## 77

### నిజమైనపరమార్థి తనతప్పుల నెప్పుడు ఒప్పుకొనుచుండును.

నిజమైనపరమార్థి యెప్పుడు తనతప్పుల నొప్పుకొనుచునే యుండును. ఏలననగా, అట్లుచేయనిచో నతనికి అహంకారము పెరుగును. ఇకనిజమైనపరమార్థిలో నెవరైనను లేనితప్పులనే యెన్నిననుగూడ నతడు ఆదోషారోపణ కాదనడు సరికదా పైగా ఆదోషములు తనకున్నట్లే ఒప్పుకొనును. సత్సంగిప్రవర్తన ఆవిధముగ నుండవలెను. ఏలననగా, అందువలన నతనికి తనమనస్సులో నింకను అవగుణములున్నవనువిషయము జ్ఞాపకముండును.

## 78

### ఈర్ష్యా క్రోధ విరోధములు.

క్రోధము, ఈర్ష్య, విరోధము ఇవన్నియు నిజముగ నొక్కటే. ఇవి అహంకారముయొక్క అంగములు. వీని అన్నిటివెనుక నహంకారము దాగు కొనియుండి, కనుపడకుండగనే దెబ్బకొట్టుచుండును. నిప్పు భగ్గుమన్నట్లుగ మండిపోయినచో, నది క్రోధమనబడును. లోలోపల రవులుకొనుచు నున్న పుడు, దానినే విరోధమందురు. ఇంకను వట్టిపొగమాత్రమే వచ్చుచున్నపుడు, దానిని ఈర్ష్య అందురు.

## 79

### నిరాదరము, నిందారోపణలును, భగవంతుని దయాసూచకములు.

నిజమైనపరమార్థి యెప్పుడు నితరులదోషములను కప్పిపుచ్చుచుండును. ఎవరిలోనైన దోషములు తనకగుపడిననుగూడ అది తనతప్పుటభిప్రాయమువలన నట్లగుపడుచున్నదని యెంచుకొనును. నిజమైనపరమార్థి, తనమనస్సునే యెల్ల పుడు పరిశీలించుకొనుచుండును. కావున నతనికి ఇతరులదోషముల నెంచుటకు సావకాశమే చిక్కదు. నిజమైన పరమార్థి ప్రతికార్యములోను దివ్యేచ్ఛననుస రించి నడచుకొనుచుండును. సత్యాగికి ప్రపంచములో నిరాదరముగల్గుటయు, బంధువర్గము కులస్థులవలన నిందలుపడుటయు, భగవంతుని కతనిమీద నిజదయ యున్నట్లు సూచించును.

## 80

### అసలైన భక్తుడు.

ఏమనుజునిహృదయమున లోకములో గొప్పగనెంచబడు విషయము లన్నిటియెడల (అనగా, విద్య, కళాకుశలత, బుద్ధికుశలత వగైరాలు) ప్రాశస్త్య భావము నశించునో, ఏమానవుడు ఒక్కపరమపురుషునిధ్యానమునందే యెప్పుడు లీనమైయుండునో, అతడే నిజమైన భక్తుడు.

## 81

### సత్సంగము అత్యావశ్యకము.

రెండుసార్లు అభ్యాసముచేసికొనుచును, కొద్దిగా పవిత్రగ్రంథపాఠము చేయుచు నుండిపోయినచో, అదొక్కటియు నెంతమాత్రము సరిపోదు. సత్సం

గముకూడ చేయుట అత్యావశ్యకము. ఏలననగా మనస్సును సరిచేయుట సత్సంగములోనే సాధ్యమైనపని. దానికి శుద్ధిఅయిననేకాని అంతరారోహణము సాగనేరదు; రాధాస్వామీమతముయొక్క ముఖ్యోద్దేశ్యము, అనగా యీపిండము నుండి విడిపోవుట యనుకార్యము నెరవేరదు. మనస్సు నెల్లపుడు పరిశీలించుకొనుచుండుట అత్యావసరము. కేవలము ప్రసాదము, చరణామృతములనే పరమార్థముగ నెంచుకొనెడివారికి రాధాస్వామీమత మవగాహనయే కాలేదు. అట్టివారింకను సత్సంగముచేసికొనుట అవసరము. రాధాస్వామీమత మనగా జీవించియుండగనే మరణించుట. ఒకప్పుడు వినపడుచుచు, మఱొకప్పుడు వినపడకను ఉండునట్టి టన్ టన్ శబ్దమును రాధాస్వామిదయాళు లెపుడు గుప్తము చేయుదురో, అప్పుడే అసలు శబ్దము ప్రకటముకాగలదు.

## 82

### ద్విజుడనగ నెవరు ?

### చైతన్యము నభివృద్ధిచేసికొనుట యెట్లు ?

ప్రశ్న:- ద్విజుడనగ నెవరు ?

సమాధానము:- అభ్యాసముచేసి తన రక్తమును అమృతధారతో పూర్తిగ సమ్మిళితముచేసికొని, శరీరము నంతను ఆవిధముగ నెవరు తయారు చేసుకొనునో అతనికి ద్వితీయజన్మ గలిగినట్లు చెప్పవలెను. జందెము వేసికొన్నంతనే ద్విజుడు కానేరడు. మనయొక్క ధార యేవస్తువులో ప్రవహించుచుండునో ఆవస్తువు మన స్వంతమైనట్లు. అదేవిధముగా, భగవంతునిధార యేవ్యక్తిలో ప్రవహించుచుండునో, అతడే భగవంతునిచే తనవాడుగ చేసికొనబడినట్లు. అట్టివానిమనస్సున నెల్లపుడు భగవద్దర్శనార్థమై వ్యాకులత యుండుచుండును.

విద్యుచ్ఛక్తిధార భూమిలోకలిసిపోయినట్లుగనే, మానవునిలోని చైతన్యధార భోగవిలాసములలోను కామక్రోధాదివికారములలోను నష్టమైపోవుచుండును. చైతన్యము అభివృద్ధిగావలెనని కోరినయెడల, ఉత్తమలోకములలోని చైతన్యముతో సమ్మేళనము చేసికొనవలెను.

## 83

### సంతుల స్వరూపము.

భగవంతునిధార యేలోకములోనైన నివాసముచేసినపుడు అది అచ్చటి శ్రేష్ఠతమపదార్థము నాకర్షించి యే రూపమును చేసుకొనునో అదియే ఆలోకములో భగవత్స్వరూపము. అది యేమండలమైననేగాక, ఆస్వరూపమున కెదురుగ వచ్చినవారందఱికిని తిన్నగా సత్యలోకముతో సూత్రబంధ మేర్పడిపోవును. ఆస్వరూపమునెదుటికి రానివారికిగూడా రెండవశ్రేణిలో ఉద్ధారమైపోవును. ఈ త్రిలోకి సంతులయొక్క దేహము కానేరదు. అట్లైనచో త్రిలోకిలో నెట్టి మార్పులు నుండకూడదు.

## 84

### పరమార్థులు అందఱియెడలను ప్రేమాదరములను చూపుదురు.

ఎవనిమనస్సులో పరమార్థమందు ఆసక్తిగౌరవము లుండునో, అతడు పరమార్థవిషయములో తనకు సహకరించువారందఱితో నెక్కువ కలిసిమెలిసి తిరుగుచుండును. అట్టిపరమార్థి క్రొత్తగ నెవరైన సత్సంగములోచేరినప్పుడు తనయింట నొకకుమారుడు పుట్టినట్లుగా సంతోషించును. అంతకన్న నెక్కువ శ్రేష్ఠులైనభక్తులు జీవులందఱినికూడ భగవదంశలుగనే మన్నించి, వారల యెడల ప్రేమాదరములతో ప్రవర్తింతురు. పరమార్థులు ప్రాపంచికజీవుల నసహ్యించుకొనరు సరికదా, పైగా వారిదురవస్థచూచి వారియెడల దయాభావముతో నుందురు.

## 85

### పరమార్థికి దేహపరిశ్రమకూడా అవసరము.

సత్సంగులు తమకాలుచేతులతో పరిశ్రమచేయుట ఆవశ్యకము. కొందఱుసత్సంగులు తమకు, పారమార్థికకృత్యములను చేసికొనుటకు తీరికలేకుండు నంత అధికముగా తమతమ కార్యాలయములలో పనియుండుచున్నదని ఫిర్యాదు చేయుచుందురు. కాని అందులోకూడ నొకలాభమున్నది. మానవుడు తిని

త్రాగెడి ఆహారపానీయములసారము మనో ఆకాశమునకు చేరుకొనును. అక్కడ చేరుకొన్నపిదప, నక్కడినుంచి, మంచుగడ్డలుకరిగి నీరై, తర్వాతమేఘములుగా మారి వర్షించి, తిర్గి నీరై మరలమంచుగడ్డగ మారిపోయినట్లే, తిరిగి ఆసారము దిగిపోవనారంభించును. ఈశరీరములోని మురికికాలువలు కొన్ని విశాలముగను, కొన్ని చాలసన్నముగ, నీటిబుగ్గలమాదిరిగను ఉన్నవి. ఈసారము క్రిందికి కారి పోవునపుడు దానితో కొంతచైతన్యముకూడా దిగిపోవుచుండును. కావున నా సారము విశాలనాళములద్వారా కారినచో, చైతన్యముకూడా నష్టమై పోవును, వికారములుకూడా పుట్టవచ్చును. అందుచే నభ్యాసి కాలుచేతులతో పనిచేయవలెను. అట్లుచేయుటచే నాసారము సూక్ష్మనాళములద్వారా పోవును. అప్పుడు చైతన్యముకూడా సన్ననివస్త్రములో వడబోసినపుడు పోయినట్లుగా పోవును కాబట్టి చైతన్యక్షయము తక్కువగనుండును. ఇంతియగాక, పరిశ్రమచేసినపిమ్మట జరిగించునట్టి పారమార్థికాభ్యాసములో మనస్సెక్కువగ నేకాగ్రమగును, దీనత్వముకూడ గలుగును.

## 86

### ఎట్టిపనులలో బంధన గలుగును.

ప్రశ్న :—ప్రాపంచికకార్యము లెంతయెక్కువచేసిన నంతయధికముగ బంధనలు గలుగునా ?

సమాధానము :—జీవుని కేపనిలో సంతోషమెక్కువగ నుండునో, ఆపనిలో బంధనము గలుగును. కాని యేపనినైన ఒకకర్తవ్యపాలనరూపముగ చేయుచు నది పూర్తియైనతోడనే ఆపనితో సంబంధములేకుండ పోవలయునని కోరిక యున్నచో దానిలో బంధన గలుగదు. అందుచే పరమార్థి ప్రాపంచిక కార్యములను కర్తవ్యభావముతో శ్రమతీసికొని నెఱవేర్చుట ఆతని కర్తవ్యమై యున్నది. అట్లు చేయుటలో నష్టమేమియు నుండదు. పైగా కాలుచేతులతో పాటుపడుట అందఱకు నవసరమే. అయితే అభ్యాసము నెక్కువశ్రమపడి చేయువారికి అభ్యాసముద్వారా నిర్మలత్వము లభించును. కాని అట్టివిధమైన అభ్యాసము చాలకష్టము.

## 87

పరమార్థికి కోమలహృదయము, క్షమాదీనతలును అలంకారములు.

ఒకస్త్రీ తనభర్తను సంతోషపఱచునిమిత్తమై యెట్లలంకరించుకొనునో, అట్లే భగవంతుని సంతోషపఱచుటకై పరమార్థి అలంకరించుకొనవలెను. అయితే, పరమార్థికి అలంకారములు, కోమలహృదయము, క్షమాదీనతలును. అందఱియెడల దీనభావముతోను, కోమలత్వముతోను ప్రవర్తించవలెను. ఎప్పుడైన దెబ్బలాటలు, జగడములువచ్చిననుకూడ దీనభావమును, కోమల స్వభావమును విడువకూడదు. నీవు అందఱితో ఆదరప్రేమభావములతో ప్రవర్తించినయెడల, నీలోనుండి ప్రేమతుంపరలు బయల్వెడలి యెదుటివానినికూడా చల్లపఱచును. మనమందఱము రాధాస్వామిదయాళునిపిల్లలమే కాని, మాలిన్యముతో నిండియున్నాము. ఇప్పుడు మనప్రియమైనతండ్రి మనమీద నీరు పోసిరి. అనగా, మనపైన ప్రథమములోదయ వర్షించిరి. అందువలన మనపై నున్న మాలిన్యము ఉబికినది. కొంతసేపు అయినపిదప మురికిపోవులాగున రుద్ది తిరిగి దయాజలమును మీదపోసిరి. అప్పుడు మనము నిర్మలమైతిమి. ఇప్పు డొక్కొక్కరినే తుడిచి బట్టలుకట్టి, తలకు నూనెరాసి అలంకారముచేసి, కిరీటము ధరింపజేసి, తమయొడిలో కూర్చుండబెట్టుకొనిరి.

బెత్తము ఎటువైపుకావలెనన్న నటువైపున కెట్లు వంగిపోవునో, అట్టి దీనత జీవునికుండవలెను. శుభ్రముచేసి యేకించిన దూదిలో ఒక్కప్రత్తిగింజ కాని ఒక్కసలకగాని యుండకుండునట్లే జీవునిలో నెట్టి అహంభావముకాని పెంకితనముకాని యుండకూడదు.

## 88

మనస్సును వశముచేసికొనుట.

చాలతీవ్రముగా ఉరుములు మెఱపులు వచ్చినపుడుకాని లేక ఒకక్రూర మృగమేదైన నెదురుగవచ్చినపుడుకాని లేదా ఏదైననొకమహావిపత్తు లేక ప్రమాదము గల్గినప్పుడుకాని మనస్సు భయముతో నెంత వణికిపోవును! అట్టి పరిస్థితులలో మనస్సుపైన నెట్టిప్రభావము కలుగకుండనుండినమానవుడే మనస్సును జయించినవాడని చెప్పవచ్చును. ఇట్టిమనస్థితి యెవనికుండునో, అతడు

శరీరత్యాగముగల్గుసమయములోగూడ వైకల్యమునొందడు. మనస్సును జయించుట పరిహాసముకాదు. ఆత్మ మృత్యుద్వారముదాటి పైకివెళ్ళినపుడే మనస్సు వశములోనికివచ్చును. అప్పుడే యెవరైనను నిజమైన జితమనస్కుడు కాగలడు. చాలమంది తమమనస్సు ఒక్కపెట్టున వెంటనే తమవశములోనికి రావలెనని కోరుచుందురు. కాని వారికింకను మనస్సును వశముచేసికొనుటయనగ నేమిటో తెలియదు. అది తెలిసినచో, నట్లుచేయుట యెంతకఠినకృత్యమో బోధపడును. మనస్సునుజయించుట అనగా, మనస్సు కొద్దిగొప్ప నిశ్చలమగుట కాదు. అట్లే అయినచో, నిద్రపోయినపు డట్లగుచునే యున్నది. కాని దానివలన ప్రయోజన మేమున్నది? మనస్సుపైన నెట్టివిషమపరిస్థితిగల్గినను, కొంచెముకూడ నెట్టి ప్రభావము గలుగకుండినపుడే మనస్సుపైన విజయముపొందినట్లు చెప్పవచ్చును. అట్టిపరిస్థితిగల్గినపుడు హృదయమున అత్యుత్తమశీతలత్వముకూడా వ్యాపించి యుండును. దీనికి ఇంకొకప్రమాణమేమనగా, ఆత్మ మనస్సుయొక్కకోశములో నుండి దాటి ఊర్ధ్వముగ నెక్కిపోయినట్లయితే, అప్పుడు మనస్సు వశమైపోయి నదని తెలిసికొనవచ్చును. అనగా, ఆత్మ మనఃకోశమును పూర్తిగా విడిచి పోవలెను. అట్లెపుడగునో, అపుడే మనస్సు చనిపోయినట్లు చెప్పవలెను. మనస్సు నొకనీటితొట్టి అనుకొనుడు. దానిలో నిండియున్ననీళ్ళు బయటకుపోవుట కెన్నియో నాళములున్నవి. ఇచ్చట నీరు అనగ నీప్రపంచసంబంధమైనకోరిక లనియు, నాళములనగా ఇంద్రియములనియు తెలిసికొనుము. ఆనీటితొట్టిలో నీరు హరించిపోవువఱకు నీనాళములద్వారా నీరు కారిపోవుచునే యుండును. ఆ తొట్టిలోనుండి నీరును హరించుటకుపాయము, దానిని ఆవిరిరూపముగా పైకి పోగొట్టుటయే. ఏలననగా, ఇతరమతములలో సామాన్యముగా చేయుచున్నట్లు, అందులో ముఖ్యముగా హఠయోగులుచేయుచున్నట్లు, ఆనాళములను కట్టిపెట్టి నందువలన ప్రయోజనమేమియు నుండదు; ఎందుచేతననగా నాళములుకట్టినందు వలన తొట్టిలో నీరు అట్లే యుండిపోవునుకదా. దానివలన లాభమేముండును? ఆనీరును ఆవిరిగా మార్చుటకు నిప్పుపెట్టవలెను. పరమార్థములో నిప్పు రెండు విధములుగా నుండును. మొదటిది, అనేకవిధములైనరోగములు కష్టములు దుఃఖములవలన గల్గు తాపాగ్ని; రెండవది, భగవంతుని దర్శనముకొఱకు విర హవ్యాకులత్వముల తాపాగ్ని. అయితే, విరహతాపమనెడినిప్పు అందఱికి లభించుట కష్టము. సామాన్యుల కది అలభ్యము. కాని మొదటిరకపుఅగ్ని అనగా దుఃఖములు కష్టములయొక్కతాపాగ్ని, భగవంతుడందఱికి నిచ్చుచున్నాడు. ఈ

నిప్పుతో నీరు హారించిపోవును. మనస్సుకూడా నిర్మల మైపోయి, వశములోనికి వచ్చును. కొంచెము నీరు వచ్చుచున్నను అంతయెక్కువ నష్టములేదు. కాని నీరు అసలేలేకుండగనుండినయెడల తొట్టిలోనికి వాయువు, విద్యుచ్ఛక్తియు ప్రవేశించి అవికూడా దానినాళములద్వారా ప్రవహించుట మొదలుపెట్టును. వాయువు అనగా త్రికుటివఱకువ్యాపించిన చైతన్యశక్తియును, విద్యుచ్ఛక్తి అనగా సున్నలోకము, దానిపై లోకములలో వ్యాపించిన చైతన్యధారయును అని తెలిసికొనుడు. విద్యుచ్ఛక్తిధార వచ్చుటమొదలిడినచో, నిఁక చెప్పుట కేము న్నది. ఈదృష్టాంతమును బాగుగ నవగాహనచేసికొనుడు. అనగా, మనస్సు ఒకనీటితొట్టివంటిది. ఆనీటితొట్టిలో నీరు నిండుగనున్నదన్నమాట. సంతులు తఱుచు మనస్సునకు నీరు నుపమానముగ చెప్పుచుందురు. జీవులందఱిమనస్సు లోనికి వచ్చిచేరుకొన్నట్టి నీచచైతన్యధార నీటితోసమానము. ఊర్ధ్వమండల ములచైతన్యము, సంతులహృదయములలోనికి ప్రవహించునది విద్యుచ్ఛక్తి వంటిది.

## 89

ధ్యానమును గుఱించి.

ప్రశ్న :—భగవంతుఁడు సర్వవ్యాపకుఁడును, అరూపియును కావున ఆయ నను ధ్యానముచేయుట కష్టసాధ్యము. స్వరూపములేకుండగనే ధ్యానముచే యుట అసంభవముకదా. కావున భగవంతుఁడు రూపరహితుఁడైనచో ధ్యాన మెట్లుచేయుట. సర్వవ్యాపకుని నొక్కప్రత్యేకస్వరూపములోనే బంధించియుంచు టెట్లు ?

సమాధానము :—జీవులలో నూర్ధ్వలోకములద్వారములన్నియు మూసి కొనియున్నవి. ఒక్కచాలసూక్ష్మమైనధారమాత్రమే పైనుంచి చుక్కలు చుక్కలుగా నదిలోనినీరును పడియకట్టినప్పుడు కొద్దికొద్దిగా కారినట్లు క్రిందికి పడుచున్నది. అభ్యాసముచేసి యీద్వారముల నన్నిటిని తెఱుచుకొని అనగా, తనమెదడులో నిద్రాణమైయున్నశక్తులను మేల్కొల్పుకొని, నిర్మలచైతన్యభండా రమువఱకు చేరుకొన్నట్టిపురుషుఁడును, మఱియు ఆభండారమునుండి ఒకధార, స్వతస్సంతురూపమున నీలోకమునకువచ్చినచో (అట్టిపురుషునిలో నాంతర్య ద్వారములన్నియు తెఱుచుకొనియేయుండును) అట్టిమహాపురుషుఁడును, వీరిరు

వురే భగవంతునిఅవతారపురుషులు. ధ్యానమనగా నిరంతరసంబంధ మేర్పాటు చేసికొనుటయే. కావున నంతరంగమున మాఱుమ్రోగుచున్న శబ్దమును వినుచుండుట, "అరూపీధ్యానము" (అనగా నిర్గుణధ్యానము) అగును. అది వినుచుండుటవలన భగవంతునితో సంబంధము స్థాపితమగును. భగవంతుడు అవతరించి ధరించిన సంత్ సద్గురుస్వరూపమును ధ్యానముచేయుట, "సరూపీధ్యానము" (అనగా సగుణధ్యానము) అగును. మెస్మెరిజమ్‌చేయబడుచున్నమనిషికి, అన్యవ్యక్తియొక్కగోరునుకాని, లేక ఆ అన్యవ్యక్తి ఉపయోగించిన యేవస్తువునైనను తగిల్చినచో, నామనిషి ఆ అన్యవ్యక్తినిగుఱించినవిషయముల నెట్లుచెప్పగల్గునో అట్లే దయాళులైన సంత్ సద్గురునిద్వారా పరమపురుషునితో సంబంధము స్థాపితమగును. వారిశరీరమందలిపదార్థమంతియు మహాసూక్ష్మము, మహాపవిత్రమునైయుండి, వారు ఉపయోగించిన ప్రతిపదార్థమును మహాపవిత్రమైపోవుచుండును. అందువలననే ఆప్రసాదవస్తువు లభించుట మహాభాగ్యము అబ్బుటకు హేతువగును. అందువలననే సద్గురువుయొక్కచిత్తరువును బహుగౌరవప్రపత్తులతో చూడవలెను. ఇదికేవలము మీభక్తిగౌరవములను సూచించుటకేగాని అందువలన మీకుముక్తిగలుగుననుఆశ పెట్టుకొనగూడదు. ఉదాహరణకు, లార్డురాబర్ట్సన్‌గారి కీమధ్యన నొకయుద్ధములో విజయముగలిగెనని కలకత్తాలో వారిచిత్తరువునకు వేనవేలపుష్పహారములు వేసిరి. అదంతయు జనులఆదరప్రేమలను సూచించును. అటులనే సద్గురునిచిత్తరువునకు దండవేసినచో నది వారియెడల గౌరవప్రేమాదరభావములను ప్రకటించినట్లు. సంత్ సద్గురువు ప్రకటమైనప్పుడు వారిస్వరూపమును ధ్యానించుట భగవంతునిస్వరూపధ్యానము, అనగా సగుణధ్యానమగును. అంతరంగమున శబ్దమును వినుట భగవంతుని "అరూపి" ధ్యానము, అనగా నిర్గుణధ్యానము అగును.

## 90

### జీవుని స్వరూపము.

ప్రశ్న :—జీవునికిని, ఆత్మకును వ్యత్యాసమేమి ?

సమాధానము :—ఆత్మమనోఘట్టమునకు దిగినపుడు జీవుడనబడును.

## 91

హృదయమున భగవచ్చరణములందు ప్రేమస్థాపితమగుటయే ఆధ్యాత్మిక సాధనలన్నిటికి పరమావధి.

పరమార్థులు చేసెడిసత్సంగము, భజనమున్నగు సాధనములన్నిటికిని పర్యవసానమును పరమావధియు హృదయమున భగవచ్చరణములయందు ప్రేమనుత్పన్నముచేసికొనుటయైయుండవలెను. వారిచరణములను ఒక్కక్షణముకూడ విడువకూడదు. అందుచే భగవంతునినెప్పుడు నీక్రిందివిధముగా ప్రార్థనచేయుచుండవలయును. "హేభగవన్, గొప్పబుద్ధివికాసము కావలెనని నేనుకోరుట లేదు. నాకేదైనలోకఉన్నతమండలమున నివాసముకావలెనని కోరుటలేదు. సృష్టిరహస్యములజ్ఞానముగూడ నాకు అక్కఱలేదు. నన్నుదయయుంచి తమ చరణములం దుంచుకొనుడు. నన్నెన్నడు తమచరణములనుండి వేఱుచేయకుడు".

చరన న భూలేఁ దేహ భులానీ. వాహ మేరే ప్యారే రాధాస్వామీ ।
ఛిన న బిఛడూఁ చరన సరన సే, యహీ దాస కో బఖ్శిశ హోయ్ ॥

అర్థము :—ఆహా! ఓప్రియమైనరాధాస్వామీ, నేను నాశరీరమునైన మఱచిపోవుదును, కాని నీచరణముల నెన్నడు మఱువజాలను. ఒక్కక్షణమాత్రముకూడ మీచరణముల శరణు లేకుండ నుండజాలను. ఈదాసుని కిదియ వరదానము ననుగ్రహింపుడు.

ఎవరైన సంపూర్ణభావముతో నీబిచ్చము నడిగినచో నిస్సంశయముగ నతనికి ప్రేమకణము దానమీయబడును. ఇప్పుడింకను మనహృదయములు భగవంతుని మహాతేజఃప్రకాశము ప్రతిఫలించుటకు తగినంతపరిశుద్ధముగ లేవు. మనహృదయములు వారధిష్ఠించుటకుతగినవిగను, మనకండ్లు వారిదర్శనము చేసికొనుటకు తగినవిగను, అయినప్పుడు ఇదియ ఫలితముగలుగును. గులాబీమొక్క పాతినపిమ్మట దానికి ఆకులుకొమ్మలు బయల్దేరును. పిమ్మట పుష్పములు వచ్చును. ఆపుష్పములనుండి రసముతీసి అత్తరువు తయారుచేయుదురు, అత్తరువు తీసినతరువాత నిఁక ఆకులుకొమ్మలతో నేమియుపనిలేదు; అదంతయు సారముతీసివేసినపిప్పి కావున దానిని పారవేయుదురు; సరిగనల్లే, పరమార్థము

లోకూడా, భగవంతునిచరణములం దనురాగముకలిగి ఆచరణములస్పర్శ లభించినపిమ్మట, నట్టివానికి సత్సంగము, పవిత్రగ్రంథములపారాయణ మున్నగు పారమార్థికకార్యములతో నేమియుపనిలేదు. అది రెండవమెట్టు.

## 92

ప్రళయము.

ప్రశ్న :—ప్రళయ మనగ నేమి ?

జవాబు :—మాయకు స్థూలపరిస్థితినుండి పరమాణువులరూపములోనికి మార్పుకలిగినపుడు దానిని ప్రళయమందురు.

## 93

జీవునికి మొదటినుండి చివరవఱకు సమస్తకార్యమును సద్గురువే నెరవేర్తురు.

సంస్కారములు వృక్షబీజములవంటివి. ఆబీజము నీరుతోను మట్టితోను కలిసినచో నది పగిలి అందుండి మొక్కవచ్చును. దానికి అపుడు పాలనపోషణలనుజరుపుట కొకతోటమాలి కావలసియుండును. అతడే దానిని తగినవిధముగా నీరుపెట్టి, పశువు లామొక్కను తినివేయకుండా కాపాడి, చుట్టుప్రక్కలనున్న పెంటమొక్కలను తీసివేసి, దానికక్కఱలేనికొమ్మలను కత్తిరించి, కనిపెట్టగలడు. సరిగనట్లే సంత్ సద్గురువు సంస్కారిజీవులను సత్సంగములనెడి పాలములో పెట్టియుంచి, వారి నన్నివిధముల కనిపెట్టుచు సంరక్షణచేయుదురు. అనగా కాలకర్మలయొక్క ఆపత్తునుండి కాపాడుచు, వారిలో నున్న వికారలక్షణములను తొలగించి నిర్మలముచేయుదురు. మఱియు నప్పుడప్పుడు రోగములు కష్టములు మున్నగువానినిగూడ కలుగజేసి వారిగుప్తవికారములను తప్పించివేయుదురు. సంస్కారరూపములైన బీజములనుకూడా, సంతులే జీవులహృదయములో నాటుచుందురు. కావున మొదటినుండి చివరవఱకును వారే జీవులకు అన్నివిధముల పాలకులు, పోషకులును. అనగా జీవులను సంస్కారవంతులుగను వారే చేయుదురు, అవసరమైనభక్తి, అభ్యాసమున్నగునవికూడ వారే చేయించి చివరకు వారే ఆమూలధామమున చేర్పింతురు. పైపైకి, జీవుడే

స్వయముగ ఆపనిఅంతయు నెఱవేర్చుకొనుచున్నట్లు కనపడుచుండునుకాని జరిగెడిదంతయు వారి ఆజ్ఞవలనను దివ్యేచ్ఛవలననే. ఎట్లనగా ఉదాహరణకు వృక్షబీజములో, స్వతహాగా మొక్కక్రింద బయల్దేరి వృక్షముకాగలశక్తిసామర్థ్యములున్ననుకూడ, నది తోటమాలియొక్క రక్షణపోషణలు లేనిచో వృద్ధి పొందలేనట్లేయుండును.

## 34

జీవునికి సద్గురుసౌభాగ్య మెట్టిసంస్కారమువలన లభించును. అహంకారముసశించి నిజమైనదీనత్వముగల్గువఱకు అంతశ్శబ్దము వినపడదు, భగవద్దర్శనము కానేరదు.

ప్రశ్న :—సంత్ సద్గురునియెదుటకువచ్చుటకై జీవున కెట్టిసంస్కారముండవలెను ?

జవాబు :—అట్టిసంస్కారము ఆజీవుని ఆదికర్మవలననే లభించును. ఏయేజీవులలో ఆత్మలక్షణ (సురత్ అంగ్) మెక్కువగనుండునో అట్టిజీవులే సంత్ సద్గురువునెదుటకు రాగలుగుదురు. అప్పుడు వారిలో భక్తిబీజము నాటబడును.

దీనత్వము ఆత్మలక్షణము. అహంకారము మనస్సుస్వభావము. ఏలననగా, ఆత్మ శబ్దముతో లోలోపల కలిసియేయుండి దానివైపుననే ఒఱిగియున్నది, మనస్సు అట్లుగాక తనలక్ష్యమైనట్టి బిందువుచుట్టునే తిరుగుచు బయటవైపునకు తిరిగియున్నది. ఇచ్చట లక్ష్యబిందువనగా మనస్సున కేవస్తువునందు అభిరుచియుండునో, అనగా ఎక్కువఆసక్తి ప్రేమయు నుండునో అదియే. అట్టి వస్తువుచుట్టునే అది తిరుగుచుండును. దాని కావస్తువువిషయములో నహంకారముండును. ఆత్మమనస్సులు రెండింటికిని నైజస్వభావములు అవ్విధముగ నుండుటచే వానికి పరస్పరవిరోధమున్నది. ఏమనిషియైనను, అహంకారిగను, గర్విష్ఠిగనుఉండి, పొగరుగా ప్రవర్తించినను, లేదా బడాయికొఱకేదైనపనిచేసినను లోకులు అసహ్యించుకొందురు. చూచువారికి అతని అహంకారము నెత్తైన నణచివేయవలెనని సహజముగ ననిపించును. ఆత్మాంశకీభావము విరుద్ధము కాబట్టి, ఆత్మలన్నిటికిని అంశియైన అనగా సముద్రమైనట్టి పరమాత్మకుకూడ

నీలక్షణము అప్రియముగ నేయుండును. ఏలననగా, భగవంతునికికూడా దీన త్వమే ప్రియము.

ఈమనస్సుయొక్క అహమిక నెమ్మైనను నాశనముచేయవలసియున్నది. అందువలన, నెల్లప్పుడు మనస్సునకు బాధలు, దెబ్బలు తగులుచు, నిరంతరము అంపపుకోత జరుగుచునేయుండును. ఏలనన, నీమనస్సుయొక్క అహమిక నశిం చువఱకు దీనత్వము కలుగదు, ఆత్మకు శబ్దముతో నైక్యమును కలుగదు. భగ వంతునిదర్శనమును లభించనేరదు. ఈకార్యక్రమమంతయు భగవంతుని ప్రత్యేక దయమూలమునసే జరుగును. కాని జీవులకిది అప్రియముగ నుండును. పైనుండి క్రిందికి అనేకమైన అరలుగల పంజర మొకటి యున్నదనుకొనుడు. పైకివెడలిన కొలది ఆఅరలలో నొక్కొక్కఅరయే దానిక్రిందిఅరకన్న నెక్కువ శ్రేష్ఠముగను సుఖప్రదముగను ఉన్నదనుకొనుడు, అన్నిటికన్న క్రిందిఅరలో నొకపక్షి యున్న దనుకొనుడు. ఆపక్షిని అన్నిటికన్న నెత్తుగనున్న బహుసుఖప్రదమైనఅరలోనికి గొనిపోవలెనన్నయెడల ఆపింజరపుటరలను కోసి త్రోవచేయవలసియుండును కదా. అటులనే శరీరములో మూడుతరగతు లున్నవి. ఆత్మను పై కెక్కించ వలెనన్న మధ్యనున్న మనస్సును కోతకోయవలసియున్నది.

దీనత్వము పుట్టించుట కిదికాక మఱొకపద్ధతికూడ గలదు. అదేమనగా భగవచ్చరణములందు ప్రేమోత్పాదనము. ప్రేమ యెప్పుడు జనించునో, అప్పుడు జీవుడు తనంతటతానుగనే పరవశుడైపోవును అతని అహంభావమం తయు నశించిపోవును. ప్రేమయొక్కతుంపర ఒక్కటి వచ్చిమీదపడినను, లేదా భగవద్దర్శనమునిమిత్తమై విరహము యెంతకొద్దిగనైన జనించినను మహాలాభ దాయకమగును. దానివలన సకలకార్యములు సతిత్వరితముగ పూర్తియైపోవును. ఒక పసిపిల్లవానిని చూడుడు. వానిలో నెట్టి అహంకారము గొప్ప గోటు ఉండదు. ప్రతిమనుజుడు నతనిని బుజమున నెత్తుకొనుచుందురు. ఆబాలుని ఆత్మ ఇంకను కొంతవఱకు దానిసహజావస్థలో మగ్నమైయే యుండును. అందుచే నతడు మనస్సుయొక్కలక్షణములైన పోట్లాటలను, విరోధములను ఎరుగడు. ఆత్మ దీనతాస్వరూపము, శబ్దస్వరూపము, ప్రేమస్వరూపము, ఆనందస్వరూప మును. ఆత్మ తనలోతానే తన్మయమైయుండును. అదే భగవంతునిస్వరూ పము. మనస్సుఅనెడి తొడుగు తొలగిపోయినచో నిజమైన దీనత్వము ప్రకట

మగును. ఇచ్చట పిండీమనస్సు (అనగా పిండదేశమునకు చెందిన మనస్సు యొక్క కోశము దీనిని కప్పివేసినది. దీనితర్వాత నిజమనస్సు (అనగా బ్రహ్మాండీమనస్సు) యొక్క కోశము ఉన్నది. దానికి తర్వాత మహాకాలుడున్నాడు అహంశబ్దమక్కడినుండియె మొదట బయల్వెడలెను. అందుచే, ఆత్మ బ్రహ్మాండదేశమునుదాటి పైకిపోవువఱకు దాని కేదోయొక రూపములో అహంకారము తప్పకుండ నుండుచునేయుండును, దెబ్బలును తగులుచునే యుండును.

ప్రశ్న :—ఆత్మయు దీనతాస్వరూపమే, భగవంతుడును దీనతాస్వరూపుడే అయినయెడల భగవంతుడు తనవద్దలేనివస్తువును తీసికొని తనదగ్గఱకు రమ్మని సెలవిచ్చినట్లుగను, ఆవస్తువు దీనత్వమనియు నొకమహాత్ముని వచనమున్నదికదా దాని అర్థమేమి ?

సమాధానము :—ఈదీనత్వమున కర్థము కార్యార్థిత్వమును, భగవంతుని విషయములో దీనత్వమనగా స్వాత్మయందురతమైపోయియుండుటయును. రెండింటికిని చివర కొకటే ఫలితము.

## 95

### సేవ

ప్రశ్న :—సేవ అనగా నేమి ?

సమాధానము :— భగవంతునినిమిత్తమై చేసినపనులన్నియు, అనగా సత్సంగమున్నగుపనులన్నియు సేవక్రింద లెక్కకువచ్చును.

## 96

అభ్యాసములోనొక్కొకప్పుడు ఆనందము కనపడకపోవుటకు కారణము, సంతులేర్పాటుచేసినఫకీరీపాఠశాల.

ప్రశ్న :—నాకు ప్రథమాభ్యాసము చేయునపుడు ఒకప్పుడు కొంతఆనందముకల్గి మఱొకప్పుడు ఆనందముకట్టువడి పోవుచుండుటకు కారణమేమి ?

సమాధానము :—ఒకవైపున పనిచేయుచున్నచో, రెండవవైపున పని కట్టును. అటులనే ఒకఘట్టమునుండి మఱొకఘట్టమునకు ఎూ ఎ కలిగి పుడు,

మొదటిఘట్టముయొక్క కార్యకలాపములో మార్పుగలుగును. అప్పుడుకలిగెడి ఆనందము రెండవఘట్టముమీదగలిగెడి అనుభవము. ఈమధ్యలో నైర్మల్యము, శరణ్యాభావమును పెరుగుచుండును. లోకములో ప్రజలు దీనిని తాఱుమాఱుగ నర్థముచేసుకొనుచుందురు. ఎలక్ట్రిసిటీయంత్రముమీద నెవరైనను కూర్చుండి నపుడు అతనిలో ఎలక్ట్రిసిటీ ప్రవహించుచున్నట్లు అతనికి స్వయముగ తెలియదు. రాత్రివేళ ఇతరులకు అతని తలవెంట్రుకలు మెఱయుచున్నట్లు కనపడును. అతనికి దగ్గఱగా వ్రేలుచూపిన అగ్నిస్ఫులింగములుకూడా బయల్వెడలును. అటులనే ఆధ్యాత్మికాభ్యాసము చేయువారికి మహాలాభము కలుగుచునే యుండును, భగవంతునిదయ చేకూరుచునేయుండును కాని, అతని కది తెలియదు. కాని యెప్పుడైన నతనిపైన దయ మహాప్రబలముగ కల్గినప్పు డాతనికాంతర్యమున శబ్దము ప్రతిధ్వనించును, స్వరూపదర్శనముకూడ నగును. ఇట్టి అనుభవములు తఱుచుగా అతనిచిత్తమేకాగ్రమైనపుడు కలుగుచుండును. ఎలక్ట్రిక్ యంత్రమును నిలబెట్టి పట్టుకొనువానిని నాలుగుగాజుకోళ్లుగల ఒకస్టూలుపైన నెట్లు నిలబెట్టుదురో, అటులనే అభ్యాసికూడ రెండుకండ్లు, రెండుచెవులు అనెడి నాల్గుకాళ్లుగల స్టూలుమీద కూర్చుండపెట్టబడును. అనగా, అన్నిబంధింపబడినపుడు అతనికి దయయొక్కశబ్దము వినిపించును. చెప్పునదేమనగా అభ్యాసమువలన నెప్పుడు లాభము చేకూరుచునే యుండును. భగవద్దయాకటాక్షములు నిరంతరము గల్గుచునేయుండును. అయితే ఈవిషయ మభ్యాసికి అప్పుడపుడు తెలియకుండగ నుండిపోవును.

ఈకాలములో చదువుచెప్పుటకు పాఠశాలలుపెట్టుచున్నట్లే, సంతులుకూడ నొకఫకీరీపాఠశాలను తెఱచి నడిపించుచున్నారు. అసలైనఫకీర్ల మహిమయెట్టిదనగా, వారిదృష్టి యెవనిమీదపడినను, వానికి జీవకళ్యాణమైపోవునని చెప్పుచుందురు. కాని ఫకీర్ల కింతమహిమ యెట్లుచేకూరె ననువిషయముమాత్రము లోకులకు తెలియదు. సంతుమతముప్రకారము ఆత్మకు ఈమహిమ చైతన్యాభ్యాసమునుచేయుటచే సంప్రాప్తమగుచున్నది. విద్యకూడా చాలసంవత్సరములు చదివించినమీదటనే కొద్దికొద్దిగా వచ్చుచున్నది. అందుచే ఉన్నతోన్నతమైనశక్తి అయినట్టియు, పొందుటకు సులభసాధ్యము కానట్టియు ఆత్మశక్తి, ఎన్నియోసంవత్సరములుమాత్రమేగాక, నెన్నియోజన్మలైనమీదటనే సంపూర్ణముగా మేల్కొనగలదు.

## 97

**అధికవిరహావేదన, భగవద్దర్శనము, సంతుల ప్రత్యేకదయను గుఱించియు.**

ప్రశ్న :-కొన్నిసమయములలో నత్యధికవిరహావేదనగల్గి ఏవిధముననైన భగవద్దర్శనము వెంటనే లభించవలయుననెడి తీవ్రసంవేగము కలుగుచుండును.

సమాధానము :- అట్టివిరహావేదనగలవాని హృదయములో నొకహాట్ హౌస్ (Hot House) కూడా నిర్మించబడియుండును, అనగా ఒకప్రత్యేకమైన కాలములోనేగాని పండని పండ్లను పండించుటకై వానిని హాట్‌హౌస్ (Hot House) లో పెట్టి దానిలో కృత్రిమతాపము నెక్కువగపుట్టించి, చాలజాగ్రత్తగ కనిపెట్టిచూచుచు నెట్లుపండించుదురో ఆవిధముగా చేయబడును. గారడీవాడు విత్తనమును పాతినవెంటనే ఒక్కపెట్టున చెట్టు నెట్లుమొలిపించునో, అటులనే సంతులుకూడా ఒక్కొక్కరివిషయములో కార్యము వెంటనే చక్కబెట్టుదురు. కాని ఇట్టిపని కొందఱుప్రత్యేకమైనజీవులవిషయములోనే జరిగింతురుకాని, సామాన్యముగ నందఱికిని నియమప్రకారము నాల్గుజన్మలలోనే కార్యము నెఱవేర్చబడుచుండును.

## 98

**హుజూర్ మహారాజ్ వారి కాలమునాటి కొందఱు సత్సంగులను గుఱించి.**

ప్రశ్న :-హుజూర్ మహారాజ్ వారి కాలములో చరణామృతము ప్రసాదమును తినుచుండుటమూలముగనే పరమార్థసంపాదన చేసికొనుచుండినసత్సంగులుండెడివారు. వారిని హుజూరువారుకూడా చంటిపిల్లలనుకనిపెట్టినట్లు కనిపెట్టి చూచుచుండెడివారు. అట్టిసత్సంగులు హుజూర్ మహారాజ్ వారు గుప్తమైన పిదప నిపుడు ఆంతర్యసహాయమేమియు లేకుండగనైపోయిరి. వారేమిచేయవలెను ?

సమాధానము :- వారిప్పటికిని పసిపిల్లలవలెనే బాహ్యసహాయమేకావలయునను అభిప్రాయములో నున్నారు. అట్లుగాక వారు ఆంతర్యమున సహాయముకొఱకై ప్రయత్నించవలయును.

## 99

**ఆత్మనూర్ధ్వలోకముల కొక్కపెట్టున ఆరోహింపచేయుట శ్రేష్ఠముకాదు.**

సంతుమతములో ఆత్మ నూర్ధ్వముగ నొకపెట్టున నారోహింపచేయుట

శ్రేష్ఠముగ నెంచబడదు. ఏలననగా, అట్లుచేయుటచే స్మృతితప్పిపోవచ్చును లేదా మఱొకప్రమాదము రావచ్చును. మెల్లమెల్లగా ఆరోహణజరిగినందు వలన నతడు ఆతన్మయత్వము నిముడ్చుకొనగల్గును, మార్గములోని సృష్టివిచిత్రములను చూచి ఆనందించగలడు. ఇందువలన మహాలాభమున్నది. కావున ఆత్మారోహణవిషయములో తొందరపడుట పొరపాటు. ఆత్మయొక్క ఆరోహణము హఠాత్తుగ నొక్కపెట్టున జరిగినయెడల ఆత్మ కీలోకముతో సంబంధము పూర్తిగ తెగిపోవును. ఈరెండుపనులును కలిసి ప్రక్కప్రక్కన జరుగుచునుండిననే ఉత్తమము, అనగా ఉన్నతోన్నతలోకములో ప్రవేశించిననుగూడ జీవునకొకసూక్ష్మసూత్రముతో అధోలోకముతో సంబంధమట్లే కలిసియుండి, అతడెప్పుడు కావలెనన్నప్పుడు ఆసూత్రముద్వారా క్రిందికి దిగగల్గియుండవలెను. ఈవిధముగా మేల్కొంచినఆత్మయే "కర్తార్"గతిని పొందగలదు. ఏలననగా, అప్పుడే దాని కార్యకలాపము క్రిందిసృష్టిలోకూడ జరుగుచుండును.

"రాధాస్వామీ ఉధర్ ఇధర్ రాధాస్వామీ" వగైరా

హఠాత్తుగ నొకేసారిగా లోని కాకర్షింపబడి, క్రిందిలోకముతో సంబంధమేమియు లేకుండునట్లు తెగిపోయినఆత్మఅయితే ఊర్ధ్వలోకమునుపొంది హంసయైపోవును. కాని అది "కర్తార్" కానేరదు. ఏలననగా దానికి క్రిందిసృష్టితో పూర్తిగా సంబంధము తెగిపోవును. లోకములో జనులుసామాన్యముగా ఫలానావానిఆత్మ ఒకేపెట్టున అంతరాకర్షితమైపోయినదని పొగుడుచుందురు కాని, సంతమతములో నట్టిఆత్మలకు గొప్పలేదు. అందుచే, రాధాస్వామీ దయాళురు తమశరణ్యములోనికివచ్చిన తమబాలురను, మెల్లమెల్లగనే ఆరోహింపజేయుచు, వారికి జీర్ణించుకొనగలశక్తి వృద్ధియగుచున్నకొలంది అంతకంతె యెక్కువఆనందము నిచ్చుచుందురు. తండ్రి తనపిల్లవాని కొక్కసారిగా రూపాయిలను, బంగరుపెద్దకాసులను ఇచ్చివేసినయెడల, నతడు అదంతయు గాలిపడగలు కొనుగొని యెగురవేయుటలో ఖర్చుపెట్టివేయును కావున రూపాయీలు, బంగరుపెద్దకాసులు వగైరాల విలువనుగుఱించియు వానిసద్వినియోగమునుగుఱించియు పిల్లవానికి తెలిసికొనగలశక్తి వచ్చువఱకు నట్టివిలువైన వస్తువులను తండ్రి అతని కందనివ్వడు.

అందుచేత నీవిషయములో నెవరును తొందరపడుటయు వ్యాకులపడుటయును యుక్తముకాదు. పరమార్థికి ఆంతర్యమున నేపరమార్థలాభము చేకు

ఉనో, దానిమూలమున నేసుఖమును ఆనందమును గలుగుచుండునో అవియే అసలుఘనవిషయము. ఉదాహరణకై, యెవనైన నొకశాస్త్రజ్ఞానము సంపాదించుకొన్నయెడల నాశాస్త్రజ్ఞానము ఘనవిషయముకాదు; దానిమూలమున గలిగెడి సంతుష్టియే అసలు ఘనవిషయము. అటులనే పరమార్థములోకూడా, ఏదైననొక అంతర్యస్థానము తెలుసుకొనుటకాని, అంతర్యచిత్రములదర్శనముకాని ఒకమహాఘనవిషయముకాదు. ఆ యంతరాకర్షణ లేక అంతరారోహణవలన గలిగెడి ఆనందతన్మయత్వమే ఘనవిషయము. ఆయాంతర్యానందమగ్నతలభించుచున్నయెడల, నదియే పారమార్థికాభ్యాసముయొక్క నిజమైనఫలితము. పరమార్థి దానితోనే సంతోషపడవలయును. ఇంతియగాక, భగవంతునిస్వరూపమెట్లుండుననువిషయముకూడ ఆలోచించుకొనవలయును. భగవంతుడు కేవలము ఆనందస్వరూపుడై తనలోతాను తన్మయమొందియుండును. కావున, అభ్యాసియొక్కస్థితికూడ నట్లేయుండవలెను. అతడుచేయవలసినప్రయత్నము నెన్నడు మానకుండగచేయుచు, పరమార్థముయొక్క ఉద్దిష్టలాభము తనకు సంప్రాప్తమగుచున్నదనియే సంతృప్తిపడుచు నుండవలెను. ఒకేపెట్టున ఫలితము లభించకపోవకుండుటకూడ నొకమహాదయయే. ఏలననగా, అట్లుకానిచో, అభ్యాసి దానిని సహించలేక పతితుడై పోగలడు.

## 100

### భగవత్ప్రేరణ మనఃప్రేరణలలో వ్యత్యాసము.

ప్రశ్న :—ఏది భగవంతునిదివ్యేచ్ఛవలనగలిగెడి ప్రేరణయో, ఏది మనస్సుయొక్క ప్రేరణయో తెలిసికొనుట యెట్లు?

జవాబు :—సత్యపురుషునిధారనుండి బయల్వెడలిన తరంగమే పరమపురుషుని దివ్యేచ్ఛ యని తెలిసికొనవలెను. భోగవిలాసములను అనుభవించునిమిత్తమై కాలపురుషునినుండి యుద్భవించినధార మనస్సుయొక్కప్రేరణ యగును. దివ్యేచ్ఛచే గల్గిన ప్రేరణలో నెప్పుడు పారమార్థికలాభ ముండుచుండును.

## 101

### సత్సంగ మహిమ.

ఒక అనాగరికునికి విద్వాంసులసహవాసములోనుండినచో చాలవిషయ-

ములు బోధపడినట్లే, ప్రాపంచికజీవునికి భక్తులసాంగత్యములోనుండుటచే ఆధ్యాత్మికశిక్షణ లభించగలదు. అనాగరికునికి చక్రవర్తియొక్కసభలో ప్రవేశించుట కర్హత యెట్లుండదో అట్లే యీజీవునికిగూడ, మనస్సునెడిమూర్ఖుడు లోనున్నంతకాలము, తగినసంస్కరణము జరుగువఱకు భగవంతునిదర్బారులో ప్రవేశము పొందుటకధికారము గలుగనేరదు. జీవుల కట్టిసంస్కరణము సత్సంగములో గలుగును. కేవలము తనఅభ్యాసముమీదనే ఆధారపడియుండుట సరికాదు. ఉదాహరణ మెట్లనగా, పాఠశాలలో చదువుకొన్నంతమాత్రమున రాజదర్బారులోనిపద్ధతులు, మర్యాదలును తెలియనేరవుకదా. సత్సంగములో మనస్సునకు శిక్షణసంస్కరణములు లభించును కావునను, భక్తులప్రవర్తనయొక్కపద్ధతులు నేర్పబడును కావునను, అభ్యాసముకన్న సత్సంగమే యెక్కువ ఆవశ్యకము. సత్సంగము చాలకాలము చేసికొనవలయును. జన్మఅంతయు సత్సంగము చేయుచు నుండిపోయిననుగూడ నష్టమేమియులేదు. ఒక అనాగరికుని యనాగరికతాలక్షణము లెంత కనపడకుండకప్పెట్టినను, అవి అప్పుడప్పుడెట్లు బయల్పడలుచుండునో, అట్లే యీజీవునిమనస్సునందు కొన్నిస్వభావములు, బంధనములును, మహాగాఢముగ నాటుకొనిపోయియుండుటచే వానిని తొలగించుటకు మహాప్రయాసపడవలసివచ్చును.

## 102

అన్నియు కోరినట్లు జరుగుచు, పరమార్థలాభముకూడ పొందవలెనన్నచో, నది యసంభవము.

తన కన్నిసుఖములును యథాప్రకార ముండిపోవలయుననియు, పైగా పరమార్థలాభముగూడ గలుగవలెననియు మనస్సు కోరుచుండును. అట్లే అయినచో సాంసారికబంధనములు, ఆటంకములును తొలగుట యసంభవము. ఏలననగా, సుఖముగనేయుండుచుండినచో నతని ఆశలు వాసనలును తొలగనేరవు. జన్మ ఆకారణమువలననే గలుగుచున్నది. ఈప్రకార మెల్లకాలము జన్మలెత్తుచు నుండవలసినదే. అందుచే రాధాస్వామిదయాళురు ఈజీవునియొక్క బంధనములను, అహంకారమును యుక్తమైనవిధమున ఖండించివేయుచుందురు.

## 103

జన్మించిన వెంటనే చనిపోవువారిని గురించి.

ప్రశ్న :—పుట్టిన వెంటనే పిల్లవాడు చనిపోయినచో, నతడు నరజన్మ మెత్తిన ఫలితమేమి ?

జవాబు :—ఆజీవుని ప్రారబ్ధకర్మ అతని కొంకొద్దికాలమే నరశరీరముండ గల్గునట్లు ఉండును, అట్లు జరుగుట ఆజీవుని భాగ్యమే కావచ్చును లేదా అది అతని అభాగ్యతమైనను కావచ్చును. ఆజీవుడేదైన ఒక ఉన్నతలోకమునకు చెందిన ఆత్మయైయుండి, యేదైననొక ప్రత్యేకప్రారబ్ధకర్మవలన నీమాత్రము కాలము ఈశరీరదండన సహించవలసియుండినట్లైతే, తదనంతర మతడు ఊర్ధ్వమండలమునకు తిరిగి వెడలిపోవును. ఆపరిస్థితిలో నతనికి లాభమున్నది. ఆ జీవు డెవరైననొక పాపిష్టిఆత్మఅయినయెడల, ఈరవ్వంతకాలమే నరదేహలాభము నొంది, తిర్గి నీచయోనులలోనికి పోవలసియుండును. అసలులో, జీవునికి తన ప్రారబ్ధకర్మననుసరించియే నరదేహము లభించుచుండును. తల్లిదండ్రులకుకూడా కొంతఋణము తీర్చుకొనవలసియుండును.

## 104

సంతులు, వారిమహిమ.

జీవదశలో ఆత్మ ఆజ్ఞచక్రమునందుండును. అచ్చటనుండి మనస్సు యొక్కస్థానమునకుదిగి ఇంద్రియములద్వారా ఈదేశపు కార్యకలాపమును జరిగించుచుండును. ఆపరిస్థితిలోనున్న జీవులకు పైలోకద్వారములన్నియు బంధించబడియుండి, మనస్సుస్థానమునుండియే ధార బయల్వెడలుచుండును. కాని యే పురుషునికి ఊర్ధ్వలోకద్వారములన్నియు తెఱచియుండి దయాళుదేశమునుండి ధార తిన్నగ క్రిందికివచ్చుచుండునో, అట్టిపురుషుని సంతుఅవతార మనియందురు. ఎవనిలో ధార తిన్నగ బ్రహ్మాండమునుండి వచ్చుచుండునో, అతనిని బ్రహ్మ యొక్కఅవతారమని యందురు.

సముద్రమునుండి ఒకతరంగము బయల్దేరి భూమిమీద కొన్నికోసుల దూరమువఱకు వెళ్లును. అయినను, సముద్రములోనిపనులన్నియు అంతకు

ముందువలెనే యేమాత్రమును తేడాలేకుండ జరిగిపోవుచుండును. ఆతరంగము కూడా సముద్రముతో సంబంధము తెగిపోకుండగ, సముద్రముయొక్క స్వభావ లక్షణములన్నియు కలిగియే యుండును. అటులనే, సంతులు పరమపురుషుని అవతారస్వరూపులు. వారిదర్శనముకూడ సాక్షాత్పరమపురుషునిదర్శనమే. ఏ అవతారపురుషుడైనను తన కే యూర్ధ్వలోకమువఱకు ద్వారములు తెఱచుకొని యున్నవో, అంతవఱకే ఇతరజీవులనుకూడ పైకి తీసికొనిపోగల్గును.

## 105

<u>ప్రాణాయామము, ముద్రాసాధనలు ఇత్యాదులకన్న ప్రేమమార్గము శ్రేష్ఠము. ప్రేమాగ్నికణమును వరదాన మివ్వగల మహాపురుషు డొక్కసంత్ సద్గురువే.</u>

ప్రాణాయామము ముద్రాసాధనలవలన మనస్సున కొద్దిగమాత్రమే నిర్మలత్వము చేకూరవచ్చును. కాని, ఆ అభ్యాసములనుచేయువారికి తాము చేరుకొనవలసినస్థాన మెద్దియోకూడ తెలియదు. వారిపరిస్థితి యెట్లుండుననగా గుఱ్ఱముపై స్వారిచేయుచున్నరౌతు ఆగుఱ్ఱమును కొరడాతో అదేపనిగా దెబ్బలుకొట్టుచుండి, అది తన నేప్రక్కకు తీసికొనుపోవుననువిషయము దాని యిష్టమునకే విడిచిపెట్టినట్లే యుండును. అజరామరదేశ మెక్కడున్నది, అక్కడ కేవిధముగ చేరుకొనగలము అనువిషయములను మొట్టమొదట తెలిసికొనవలయును. పిమ్మటనే అభ్యాసమును ప్రారంభించవలయును.

సృష్టిఆరంభించబడుటయు, స్థాపితమగుటయు సమస్తము ప్రేమవలననే జరిగించబడెను. సూర్యచంద్రాదులలో వెలుగుచున్న ప్రకాశమంతయు ప్రేమయొక్కచేతనతయే. ఈసూర్యచంద్రాదులు పిండదేశమునకు సంబంధించినవారు. దీనిపైన బ్రహ్మాండములో నెంతప్రకాశము తేజస్సు నున్నవో చూడుడు. ప్రేమయొక్కప్రకాశ మెంతయెక్కువగనుండునో మాయయొక్కఅంధకారము అంతతక్కువగ నైపోవుచుండును. ఈసూర్యచంద్రులచుట్టుప్రక్కలదేశములో కొంతవఱకుసూక్ష్మమాయ యున్నది. అటుపైన బ్రహ్మాండములో అత్యంతము మహాసూక్ష్మమైనమాయ యుండును. ఏలననగా, యెచ్చటప్రేమయుండదో అక్కడ మాయయొక్కప్రభావ మెక్కువగనుండును. ఎక్కడప్రేమకాంతులు

దేదీప్యమానముగనుండునో అక్కడ మాయాంధకారము అసలు ఉండనేలేదు. ఇక దీనిపైన సత్యలోకములో ప్రేమయొక్క మహాసముద్ర మున్నది: అక్కడనైతే మాయ మహాస్వల్పముగ నున్నది. కాని, అదికూడా అసత్యలోకప్రభావముమూలమున సత్యస్వరూపమై మహాదేదీప్యమానముగ నైపోయెను. ఇక ప్రేమయొక్క భండార మున్నచోటగల మహాతేజస్సునైతే ఊహించుటకు శక్యమెట్లు. అంధకారమునకు అచ్చట నామరూపములుకూడ లేవు.

ఎవని అంతరంగమున ప్రేమ ప్రకాశమానమగునో అతనిమహిమ వర్ణించ శక్యముగాదు. ప్రేమ యెప్పుడు ప్రకటమగునో, అప్పుడు అంధకారము నశించి పోవును. పవిత్రగ్రంథములలో హంసలశరీరములప్రకాశము ఒక్కొక్కటి ఎనిమిదేసి సూర్యుల తేజఃప్రకాశమునకు సమానముగ నుండుననియు, హంసినీలశరీరములు నాలుగేసిసూర్యులతో సమానమైన ప్రకాశముగలవనియు, తెల్పియుండిరి. ప్రేమ సర్వత్ర వ్యాప్తమైయున్నది. అందఱిజీవులలోను ప్రేమయొక్క ప్రకాశ మున్నది. అయితే, యీమాత్రము తేడాకూడా కలదు, అనగా, ఒక చోట నది ఒకబిందుమాత్రముగను, మఱొకచోట తరంగసమానముగను, ఇంకొకస్థలములో సింధురూపముగనుండి, ఒకప్రత్యేకస్థలములోమాత్రము దాని భండారమేయున్నది. పాలలో ఘృతమున్నట్లుగను, కట్టెపుల్లలలో నిప్పుదాగి యున్నట్లుగనే, ప్రతివ్యక్తిలోను ప్రేమ అంతర్గతమునగనున్నది. పాలనుండి నేతిని తీయుటకొఱకై, పాలను మథించవలయును. కట్టెలోనుండిన అగ్నిని పైకి ప్రకటముచేయుటకై, అంతకుముందే అగ్ని ప్రకటమైయున్న మఱొకవస్తువుప్రక్కన దానిని పెట్టవలెను. అట్లే జీవునిలో ప్రేమాగ్నికణమును సంత్ సద్గురువే పెట్టెదరు. లోకములో నిప్పును ప్రజ్వాలింపచేయుటకై విసరుట మున్నగుపనులు చేసినట్లే, జీవునిలోవేసిన అగ్నికణమును ప్రజ్వాలింపచేయుట కెప్పుడేమవసరమో ఆప్రయత్నములన్నియు సంతసద్గురువే చేయుదురు. ఒకకట్టెను ప్రకాశమానముగ చేయగోరినపుడు, దానిని మండుచున్న మఱొకకట్టెప్రక్కననే యుంచుదురు. మండుచున్నకట్టె దొరకనపుడు, నిప్పుకణమున్న కట్టెపుల్లలను చాల ప్రోగుచేసినచో కొద్దిసేపటికి అది పెద్దమంటగానై పోగలదు.

## 106

## సృష్టిక్రమముయొక్క వర్ణన.

సృష్టినిగుఱించి వివరించుటకుముందుగ నింకొకవిషయమును చెప్పుట

యావశ్యకము. ఇచ్చటజరిగెడి విషయములను తెలిసికొనుటకు మనకుగల జ్ఞాన గ్రహణసాధనములు మనఇంద్రియములు మున్నగునవియే. బాహ్యపదార్థములు ఇంద్రియములమీాద గల్గించెడి ప్రభావమును పరస్పరము సంబంధము గల్గినపుడు మనము తెలిసికొనగల్గుచున్నాము. కాని సృష్టియొక్క ప్రారంభ విషయములను తెలిసికొనవలెనన్న యెడల, నావిషయములు మనఇంద్రియములకును మనస్సునకును అతీతమైనవి కావున, మన అనుభవజ్ఞానము వికసించుట యవసరము. ఈవిషయమునుగుఱించి తెలిసికొనుటకై మనముచేయునట్టి ఆలోచనలన్నియు ఇచ్చటిశక్తుల ప్రభావమునుబట్టియు, నిచ్చటి నియమములు పద్ధతుల ననుసరించియే యుండగలవు; ఇచ్చట జరిగెడి విషయములనుబట్టియే మనమేపర్యవసానమునైన తెల్పుకొనగల్గుదుము. ఇప్పుడు ఈలోకములో మనము చక్కగ నాలోచించిచూచినయెడల, జీవులేపనిచేసినను, సుఖమును పొందవలెనను నుద్దేశ్యముతో చేయుట వారికి సహజస్వభావమైనట్లు తెలియగలదు. చైతన్యమధికప్రబలముగను, బుద్ధివివేకములెక్కువగనుగల జీవులకు ఇతరుల శ్రేయస్సుఖములనుగుఱించికూడా ఆలోచన యుండుచున్నది. ఇచ్చటజరిగించబడు పనులు, యేర్పాట్లును, శాసించబడు శాసనములు నియమములును, అన్నియుకూడ స్వకీయమైనట్టియు పరకీయమైనట్టియు సుఖశాంతులనే ప్రధానముగ చేసికొని జరిగించబడుచున్నవి. అక్కడక్కడ ఒక్కొక్కనికి దీనివలన దుఃఖమును గలుగవచ్చును. ఉదాహరణ కెట్లనగా, ఒకదుర్మార్గునికి కారాగృహశిక్ష విధించబడవచ్చును. అయితే అందలి యుద్దేశ్యము ప్రజలకు సుఖశాంతులు గలుగవలెననియు, ఆశిక్షితుడుగూడ శిక్ష ననుభవించి వచ్చినతర్వాత దుర్మార్గమును విడిచిపెట్టుననియే. కావున దీనినిబట్టి, ఆచైతన్యభండారమున కివ్విధమైన సృష్టిచేయుటలో, నొకమహాశ్రేయస్కరమహోద్దేశ్యము నిస్సంశయముగనుండి తీరవలయునని విస్పష్టముగ పర్యవసానము తేలుచున్నది. ఆయుద్దేశ్యము. జీవులీసంసారము సేవగించుకొని, ఈసంసారచక్రమునుండి తప్పించుకొని, నైర్మల్యమునొంది, శాశ్వతానందము నొందవలయు ననియే. కావున నిదియే "ఈరచన యెందునిమిత్తమై చేయబడెను. జీవుల నీదుఃఖములలో నెందుకు పడవేసిరి", అనెడి ప్రశ్నలకు సరియైనసమాధానము. కాని చైతన్యమెట్లయ్యెను అనికూడ ప్రశ్నించినను ప్రశ్నించవచ్చును. అయితే, "ఎట్లు, ఎట్లు" అనుచు నివ్విధముగా ప్రశ్నలను లెక్కలేకుండా పెంచివేయవచ్చును. అసలు తెలిసికొనవలసినప్రశ్న

లెవ్వియనగా నివి: "నే నెవరను ? నా స్వరూప మేమిటి ? నాలో నేశక్తి పని చేయుచున్నది ? ఎందునిమిత్తమై పనిచేయుచున్నది ? నే నిచ్చటినుండి యెక్కడికి పోవుదును ?" ఈప్రశ్నలను విడిచిపెట్టి, ఈసూర్యచంద్రతారకములు, భూమిని గుఱించియైనను ప్రశ్నించకుండా, అన్నిటికన్న మొట్టమొదట సృష్టిలో జరిగినవిషయములను గుఱించి అవియెందునిమిత్తమయ్యెను, యెట్లాయెను, అని విమర్శ ప్రారంభించుట సత్యవిచారణశైలియొక్క పద్ధతులకు పూర్తిగా విరుద్ధము. అయినను ఈప్రశ్నలకు మేము సమాధానము చెప్పెదము.

ఈలోకములో తాపము, విద్యుత్తు, చుంబకశక్తి, మధ్యాకర్షణశక్తి ఇత్యాదులెన్నియోశక్తులు పనిచేయుచున్నట్లు మనకు తెలియును, వాని వానిక్రియాశీలతా ప్రభావములుకూడా మనకు తెలుసును. కాని, వీని అన్నిటి కన్న శ్రేష్ఠతమమైనట్టియు, వీనిఅన్నిటిపైన అధికారము చలాయించుచు వీని వలన లాభమును తీసికొనుచున్నట్టియు వీనికన్నిటికి తాను తెలియకుండగనే యుండి తానుమాత్రము వీనినన్నిటిని తెలిసికొనుచుండునట్టియు మఱొకశక్తి కలదు. దానినే చైతన్యశక్తిఅనియు, ఆత్మఅనియు, "సురత్" అనియు చెప్పుదురు. ఈ శక్తులలో ప్రతిశక్తికి నొక్కొక్క భండారమున్నట్లుకూడా మనకు తెలుసును. అందుచే నీ ఆత్మశక్తికికూడ భండారమొకటి యెచ్చటనోయుండి తీరవలయును. జ్ఞానమనగ నేమి ? జ్ఞానమనగా, న్యూనచైతన్యమునకు విశేష చైతన్యముతో సంబంధము గల్గినపుడు విశేషచైతన్యముమీాద గలిగెడి ప్రభావమే. ఉదాహరణకుచూడుడు. త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములు అయిదింటి మీాదను పంచవిధములుగా ప్రభావము కలుగుచున్నది. అత్యంత న్యూన చైతన్యమువలనస్పర్శజ్ఞానము స్థూలమైనత్వగింద్రియముపైనను, అంతకన్న సూక్ష్మమైన చైతన్యమువలన రుచిజ్ఞానము జిహ్వపైనను, అంతకన్న నెక్కువసూక్ష్మమైన చైతన్యమువలన సుగంధజ్ఞానము ఘ్రాణేంద్రియముపైనను, అంతకన్న సూక్ష్మతరమైన చైతన్యమువలన శబ్దజ్ఞానము శ్రవణేంద్రియముపైనను, అన్నిటికన్న సూక్ష్మతమచైతన్యమువలన రూపజ్ఞానము కంటిపైనను కలుగుచున్నది. లేక, ఇట్లుకూడ చెప్పవచ్చును. నిమ్నచైతన్యములో ఆధిక్యన్యూనతలనుబట్టి యేర్పడిన వేలువేలు తరహాల మూలమున విశేషచైతన్యముపైన పంచజ్ఞానేంద్రియములద్వారా గలిగెడి ప్రభావము జ్ఞానమని చెప్పబడుచున్నది. అనగా నిమ్న చైతన్యము విశేషచైతన్యముపైన గలుగజేయు ప్రభావమే జ్ఞానము. అయితే

ఆతరగతులలోను వ్యత్యాసమున్నది. చైతన్యము మహాస్వల్పముగ నున్నదానిని మాయ అని చెప్పుదురు. మాయకు ఘనద్రవవాయవ్యములనెడి మూడు అవస్థలున్నవి. ఆకర్షణశక్తికి మాయతో కలయిక గల్గుటవలన రూపమేర్పడును. ఆకర్షణశక్తిని లేకుండ చేసినయెడల నీసృష్టిఅంతయు పరమాణువులుగ మారిపోవును. సృష్టి యేమియు లేని సమయములో ఆ అపారానందస్వరూపుడైన అనామీపురుషునిలో నొకకోణము ధూళితో నిండియుండెనని సంతుమతములో చెప్పబడినది. ఇదంతయు నచ్చట చేతనశక్తియొక్క ఆకర్షణ ప్రభావమువలననే చేరుకొనియుండెను. ఈధూళి యెందువలన వచ్చెను, ఆధూళి తరువాత నేమయ్యెననెడి విషయములకు సమాధాన మిపుడు చెప్పబోయెదము. ఆ యపారానంతి చేతనపురుషుడు తనలోతాను తన్మయుడై యుండెను. ఆయనయొక్క ముఖము అనగా శ్రద్ధ తనలోనికే తిరిగియుండెను. అనగా ఆయన తనయాంతర్యమువైపునకే ఆకర్షితుడై యుండెను. కాని ఒకవైపున విశేషచైతన్యమును, రెండవ ప్రక్కన న్యూనచైతన్యమును ఉండెను. విశేషచైతన్యమునకు న్యూనచైతన్యముయొక్క జ్ఞానము కల్గినపుడు దానికి ధూళియనునామము వచ్చెను. ఆయాకర్షణ ప్రభావమువలననే ఇది అచ్చట నిలచియుండెను. దాని కాకర్షణ అనామీపురుషునివైపునకు అనగా విశేషచైతన్యముయొక్క మహాప్రకాశమాన స్వరూపమువైపున కుండెను. ఆనిర్మలచైతన్యములో అనగా, అనామీపురుషునిలో "మౌజ్" (అనగా దివ్యేచ్ఛ) యని పేర్కొనబడు ధారయొకటి, సమస్తచైతన్యము నొకేవిధముగ నుండునట్లు చేయునుద్దేశ్యముతోను ఆధూళినుండి చైతన్యమును పైకి విడదీసి ప్రకాశవంతముగ చేయునుద్దేశ్యముతోను, బయల్వెడలి, ఆమహాప్రకాశమాన విశేషచైతన్యభాగమునుండి యీధూళియున్నవైపునకు వచ్చెను. అట్లువచ్చి యీధూళియున్న భాగమునకు డీకొని తిరిగి వెనుకకు మఱలిపోయెను. ఈప్రకారము ధూళిభాగము దానిలోని చైతన్యముతో సహితముగ నొకమెట్టు క్రిందికి త్రోసివేయబడి ఆధూళిభాగములోనున్న చైతన్యములో కొంతభాగము నిర్మలమైపోయెను. ఈమౌజ్ యొక్క ధార క్రిందకు దిగి యొక లోకమును రచించెను. అనంతసంఖ్యాకమైన ఆత్మలు ఆధూళినుండియే నిర్గతమై ఆధారతో కలిసివచ్చి ఆలోకములో స్థాపితమైనవి. దానిపేరు అగమలోకము. అక్కడనుండి తిరిగి ఈధార క్రిందకువెళ్ళినందున, ఆధూళి యింకను క్రిందికి దిగిపోయెను. ఆధార క్రిందికివచ్చి పైనచేసినట్లే మఱొకలోకమును రచించెను.

దానిపేరు అలఖలోకము. పైనుండివచ్చినధారనుండియు. పైధూళిలోని చైతన్యమునుండియు వచ్చిన అనంతసంఖ్యాకమైన ఆత్మలు ఆలోకములో స్థాపితమైరి. ఈవిధముగనే మఱొకలోకము, సత్యలోకమనుపేరుతో నేర్పడెను. ఇంతవఱకును, పైనుండివచ్చిన ధారయే పనిచేయుచు, నీవిధముగ ధూళిలోని చైతన్యమునుండి ఒక్కొక్కభాగమును వేరుచేసి, తనసహాయమునిచ్చి, అగమ, అలఖ సత్యలోకము లనుపేరుగల మూడులోకములను రచించెను. అప్పుడది శేషించిన ధూళితోకలిసి క్రిందికివచ్చి, బ్రహ్మాండదేశములో లోకములను సృజించెను. దయాళుదేశమునుండి క్రిందివఱకును ఈవిధమున నే సృష్టిచేయబడెను.

## 107

### మతముయొక్క ఆవశ్యకత.

ప్రశ్న:—మతమువలన ప్రయోజనమేమి? ఆప్రయోజన మెట్లు సిద్ధించగలదు ?

జవాబు:—ప్రతిజీవుడు నిచ్చట తన సుఖముకొఱకై పాటుపడుచున్నాడు. అదికాక నీలోకములో మన కనేకవిధదుఃఖములు అనేక సమయములలో వచ్చుచున్నవి. కొన్నిసమయములలో సుఖములునుగలుగుచున్నవి. ఆసుఖదుఃఖములు ఈదేశములో స్పష్టముగ కనపడుచున్నవి. ఇవన్నియు చైతన్యధారకు, అనగా ఆత్మకు బాహ్యవిషయములతో, స్థూలమైన జాగ్రదవస్థలో నున్నపుడు స్థూలేంద్రియములద్వారాను, స్వప్నసుషుప్త్యాది సూక్ష్మావస్థలలో నున్నపుడు సూక్ష్మేంద్రియములద్వారాను, సంయోగము గల్గినందువలనచేకురుచున్నవి. ఈఇంద్రియములును, ఇచ్చటపదార్థములు, పరిస్థితులును, అన్నియు నాశమానములు కావున, సుఖములుకూడా నాశమానములే. సుఖమనునది ఈపదార్థములలోగాని, ఇంద్రియములలోగాని లేదు. ఏలననగ, నొకొక్కప్పుడు కండ్లు తెఱచియేయున్నను, ఉదాహరణకు, కండ్లు తెఱచి నిద్రపోవునపుడు, లేదా మఱొక విషయముపైన పూర్తిగా ఆలోచనపెట్టుకొనియున్న సమయములలోను, ఏమియు కనపడకనపడదు. ఏదైననొక ముఖ్యవిషయము నాలోచించుచునందులోనే మనశ్శ్రద్ధఅంతయు లగ్నమైయున్నపుడు ఘంటలు కొట్టుచున్నను, లేదా మఱొకచప్పుళ్లు అగుచున్ననుకూడ మనకు ఆ ధ్వని వినపడనే వినపడదు. కావున నీసుఖానుభవము, జ్ఞానముగల్గుటయును ఆత్మయొక్క చైతన్యధారలోనేయున్నట్లు స్పష్టము. ఈధారాప్రవాహమునకు భంగముకలిగి

నపుడు దుఃఖము గల్గుచున్నది. ఏయేపదార్థములలో (అనగా, ఇంద్రియములు, మనస్సు, బంధువులు లేక మనకు సంబంధించిన మఱొకపదార్థములలో) ఆత్మ యొక్కధార ప్రవహించుచుండునో, ఆపదార్థములకు ఏదేనిభంగము లేక నష్ట మువచ్చినపుడు ఈధారప్రవాహములోకూడా భంగము గలుగుచుండును. కావున నే అప్పుడు దుఃఖము కలుగుచుండును. ఆత్మధారకు పదార్థములతో సంబంధము కలుగుటవలననే సుఖముకాని తద్వస్తుజ్ఞానముకాని కలుగుచున్నది. అందుచే సుఖము ఆత్మయొక్కధారలోనే యున్నదని స్పష్టపడుచున్నది.

మఱొకవిషయముకూడా మనము అనుభవములో చూచుచున్నాము. ఎచ్చటనైనను చైతన్యమెంతయధికముగ ప్రోగగునో, అనగా మనఆత్మధార (దానినే శ్రద్ధ అని కూడా చెప్పవచ్చును) యెంతయెక్కువతీవ్రముగ ప్రవహించుచుండునో అంతకంతయెక్కువగా ఆస్థానములో సుఖముకాని వస్తుజ్ఞానముకాని కలుగుచుండును. మఱియు జీవుడు ఒక్కొక్కఅవస్థలోనుండినపుడు ఒక్కొక్కరకమైన దుఃఖమును అనుభవించకుండ తప్పించుకొనగల్గుచున్నాడు. ఎట్లనగా స్వప్నావస్థలోనున్నపుడు శరీరమునకుసంబంధించిన బాహ్యదుఃఖములనుండి నివృత్తి కలుగును. మఱియు జీవుడు సమాధిఅవస్థలోనున్నపుడు అతడు దూరముగనున్నవిషయములను తెలిసికొనగల్గుచున్నాడు. కావున దీనినిబట్టి జీవునికి కొన్నిప్రత్యేకావస్థలలో నున్నపుడు ఒకప్రత్యేకవిధమైనజ్ఞానము, సుఖమును కల్గుచుండుననికూడ స్పష్టపడుచున్నది.

ఇదిగాక, నిచ్చట చైతన్యములో వేలువేలుతరహా లున్నట్లుకూడ తెలియుచున్నది. వెల్తురులో వేలువేలు తరహాలుగలవు, గాలిలో వేలువేలు తరహాలున్నవి. అటులనే, మానవునిశరీరములోనే తలలోనున్న చైతన్యసాంద్రతకు, కాళ్ళలోనిచైతన్యసాంద్రతకును వ్యత్యాసములు ఉండుచున్నవి. శిరస్సును కోసివేసినను, మఱొకముఖ్యస్థానమునకు దెబ్బతగిలినను మానవుడు చనిపోవునుకాని, కాలుకొట్టివేసినందువలన చావడు. ఇదే తీరున నీసృష్టిలో చేతనత వేలువేలు తరహాలుగా ఉండుచున్నట్లు స్పష్టముగా తెలియుచున్నది.

ఇంకొకవిషయ మేమనగా, కాంతి, తాపము, విద్యుత్తువగైరాశక్తు లెన్నిగలవో అవన్నియు ధారలరూపముగ నున్నవనియు ఒక్కొక్కదానికే ఒక్కొక్కభండారమున్నట్లునుకూడ తెలియుచున్నది. ఉదాహరణకు తాపమున

కును, వెల్తురుకును సూర్యుడొక భండారము. అదేవిధముగా శుద్ధచైతన్య మొక్కటి దప్ప మఱెద్దియు లేనట్టి భండార మొకటి ఆత్మకు లేక చైతన్యమునకుకూడ నుండ వలయును. గుదాచక్రము మొదలు తృతీయ నేత్రమువఱకును మానవశరీరములో నెట్లు ఆఱుచక్రములుగలవో, అట్లే బ్రహ్మాండములోగూడ నాఱుచక్రము లున్నవి. దయాళుదేశములోగూడ నట్లే యున్నవి. ఈచక్రములవరుసలు ఒక వరుస కింకొకవరుస ప్రతిబింబముగ నేర్పడియున్నవి. పిండదేశములోను, నిర్మల చైతన్యదేశములోను సృష్టికూడ నిట్లేయున్నది. పిండదేశములో మనసూర్య మండల మున్నది. దానిపైన బ్రహ్మాండదేశమును దానికంటెనుపైన నిర్మల చైతన్యదేశమును గలవు.

ఈఇంద్రియములకు పిండదేశముతో సంబంధమెట్లున్నదో అట్లే తృతీయ నేత్రమునకు బ్రహ్మాండదేశముతో సంబంధమున్నది. ఇచ్చట అనుభవము కలుగుచున్నకొలది పిండదేశమునుగుఱించినజ్ఞాన మెట్లభివృద్ధియగుచున్నదో అట్లే బ్రహ్మాండదేశపు అనుభవము గల్గుచున్నకొల ది అచ్చటిసృష్టినిగుఱించిన జ్ఞానముగల్గుచుండును. కాని ఆజ్ఞానమును సంపాదించుటకు ఆదేశముతో సంబంధముగల తృతీయనేత్రము వికసించి, అచ్చటిఅనుభవములనుపొందుట యావశ్యకము.

ఇదిగాక నీశరీరములో మూడుధారలు, అనగా స్థూలదేహధార, మనోధార, ఆత్మధారయు పనిచేయుచున్నవి. దేహధార పిండదేశము లేక మాయాదేశమునుండి బయల్దేరుచున్నది. మనోధార బ్రహ్మాండమునుండియు, ఆత్మధార నిర్మలచైతన్యధామమైన దయాళుదేశమునుండియు బయల్వెడలివచ్చుచున్నవి. దయాళుదేశములో మాయకు నామరూపములుకూడ లేవు. అదియే ఆత్మ యొక్క భండారము.

మనశరీరాకారము ఆకస్మికముగ తయారైనదికాదనియు, నది యొక సిద్ధాంతముననుసరించి తయారైనదనియుకూడ మనకు తెలియుచున్నది. సూర్యకిరణము లేపదార్థమునందైనను తమఛాయను ప్రసరింపజేసినపుడు, అవి యెట్లు సూర్యప్రతిబింబమునే తయారుచేయుచున్నవో, అట్లే దయాళుదేశము నుండి ఆత్మధార బ్రహ్మాండముమీదుగాను, పిండదేశముమీదుగను క్రిందికిదిగి

వచ్చునపుడు ఆయా దేశములలో తాను తయారుచేసెడి ఛాయలన్నియు, తన భండారముయొక్క రూపములే.

ఇప్పుడు జీవుడు మహాఘనసిష్టకోశములలోపడి కప్పడిపోయెననియు, నందుచే నతడు తనభండారమును తననిజరూపమును పూర్తిగమఱచిపోయె ననియు సంతులు సెలవిచ్చుచున్నారు. అతనిని ఇచ్చటికోశములలోనుంచి పైకి తీసి, మాయారహితమైనట్టియు, పరమజ్ఞానానందప్రకాశప్రేమలకు మూలభండారమైనట్టియు, సదాస్థాయియైన పరిపూర్ణసుఖస్థానమగు దయాళుదేశమునకు అనగా నిర్మలచైతన్యదేశమునకు చేర్పించవలసియున్నది. వివేకవంతుడైన సత్యాన్వేషి యెవరునుగూడ, తనపరిస్థితి మాఱిపోవుచు, తనకుద్ధారముగల్గు చున్నట్లును, దినదినము నానందసుఖము లభివృద్ధియగుచున్నట్లును, తనకండ్లార తెలిసికొనువఱకు, నెంతమాత్రము శాంతినొందనేఱడు. ఒక్కసురతశబ్దయోగ మనెడి అభ్యాసముదప్ప, అనగా జీవుడు ఆయున్నతోన్నతదేశమునుండి బయ ల్దేరివచ్చుచున్న చైతన్యధారాశబ్దమును ఆంతర్యమున నేకాగ్రతనొంది వినుచు నాత్మనారోహణచేయించునట్టి అభ్యాసముదప్ప ఆధామమునందు జేరుకొనుటకు మఱొకవిధానమెద్దియులేదు. కేవలవాగ్వాదములు వ్యాఖ్యానములతోనే సం తోషించినయెడల మీరు ఉత్తవాచకజ్ఞానులుగనే యుండిపోవుదురు. ఏలననగా మనవిద్యాజ్ఞానము వాదవిషయములన్నియుగూడ మనకు నిద్రకాని స్వప్నా వస్థకాని గల్గినపుడే పూర్తిగ మఱచిపోబడుచున్నవనువిషయమునుబట్టి మనము బాగుగ నాలోచించినయెడల మనచదువులు, కబుర్లు నెంతనిరుపయోగమైనవో వెంటనే బోధపడగలదు. ఇచ్చటిసుఖములు, పరిస్థితులన్నియునుగూడ మనవశ ములో లేవు. వీనినన్నిటిని మనము వశములోనికి తెచ్చుకొనుటకు ప్రయత్నించ వలెను. సత్యాన్వేషికి ప్రస్తుతపరిస్థితిలో నెంతమాత్రము సంతృప్తి కలుగ నేరదు. ఈమతముయొక్కసారము అభ్యాసముచేయువానికే లభించునుగాని వ్యాఖ్యానములవలన పొందశక్యముకాదు. అభ్యాసముచేయుటవలననే ఈమత విషయములకు అసలైనప్రమాణము లభించగలదు, కాని వేదాంతవిచారణ వలన నేమియులభించదు. కావున నిపుడు శాశ్వతసుఖమునుపొందుటయే మతము యొక్కప్రయోజనమనియు, ఆయుద్దేశ్యము నిర్మలచైతన్యధామమందు ప్రవే శించినపుడే సిద్ధించగలదనియు అచ్చట ప్రవేశముగల్గించుసాధన, ఆధామమును చేరుకొనియున్న పరిపూర్ణగురువువలననే లభ్యముకాగలదనియు తేటపడినది.

అచ్చటచేరుకొనుటకుమార్గ మాంతర్యమున నున్నదికాని బాహ్యమున లేదు. ఏలననగా, బాహ్యమున 7, 8 మైళ్ళకన్న పైకివెళ్లుట కెవరికిని శక్యముకాదు. మన మెదడులోని శ్వేతవర్ణముగలభాగము సత్యలోకముతో సంబంధించి యున్నది, ధూమ్రవర్ణముగలభాగము బ్రహ్మాండముతో సంబంధించి యున్నది.

## 108

ఉన్నతఘట్టములను చేరుకొన్న సిద్ధపురుషులు, ఇచ్చటి సుఖదుఃఖములను పైకి అనుభవించుచున్నట్లగుపడినను, నిజముగా నవి వారిపైన నెట్టిప్రభావ మును కనుపర్చలేవు.

జీవు డేఘట్టముపైన నుండునో, ఆఘట్టమునందే అతడు కర్మలఫలితమును అనుభవించుచుండును. అతడాఘట్టమును దాటిపోయినచో నాకర్మలఫలిత మతని కేమియు లభించదు. ఎట్లనగా, మన దీనాశరీరముతో నేదైనకర్మచేసి నచో దానిఫలితమును ఆశరీరఘట్టముపైన ననుభవించగల్గుదుము. మన ఆత్మ అంతర్ముఖమైపోయి సూక్ష్మావస్థలలోనికి దిగిపోయినచో, నాకర్మలఫలితమునకు మనపైన నెట్టిప్రభావము నుండ నేరదు. ఏమానవునికైనను, తాను కోరినపు డెల్ల సూక్ష్మస్థితిలోనికిపోగలశక్తి చేకూరినయెడల, నతడు కర్మయొక్కఘట్టము నుండి దాటి వేరైపోయి ఆకర్మఫలము ననుభవించకుండ తప్పించుకొనగలడు. ఏమానవుడు తన ఆత్మచైతన్యమునంతను పోగుచేసికొని ఊర్ధ్వస్థానమునకు కొని పోగలడో అట్టివాడు సమస్తదుఃఖములు, రోగములనుండియు సురక్షితముగ నుండగలడు. అట్టివాడు పైకి జబ్బుగనున్నట్లును, బాధపడుచున్నట్లును, పనిపా టలు చేసికొనుచున్నట్లును, అగుపించినను నిజమున కత డతీతుడుగనే యుం డును. నిద్రలో నడిచెడి రుగ్మతగల మనిషి ఆయవస్థలో నేదైనపనిచేసినను అతని కావిషయముకాని, దానివలనగలుగు కష్టసుఖములుకాని తెలియకుండగ నెట్లుం డునో అట్లే ఉన్నతఘట్టములకువెళ్ళినఆత్మ పనిపాటలన్నియు చక్కగ చేసికొను చున్నను వానికష్టసుఖములఅనుభవ మతనికుండదు. అతడు కర్తయైనను అక ర్తగనేయుండును, సుఖదుఃఖములకుభోక్తగ నగుపడినను నిజమున కతడు అభోక్తయే.

## 109

సంతసద్గురు రాధాస్వామీ దయాళురు పరమదయా సముద్రులు సర్వ సమర్థులును. ప్రతిసత్సంగియు రాధాస్వామీ దయాళుని సహాయ కటాక్షముల వలన ఆమూలధామమును తప్పక జేరుకొందునని దృఢవిశ్వాసముతో నుండ వలెను.

సంతులే సర్వవిధముల దయచూపగల సమర్థులు. మఱెవ్వరు నేమియు చేయజాలరు. సంతులు స్వయముగ నామూలధామమునుండి దిగివచ్చి నరశరీర మును ధరించి, సమస్త సృష్టియొక్క రహస్యములను తెలియజేసి మహాదయతో జీవుల కుపదేశమిచ్చి, భక్తిమార్గమును నేర్పిరి. మఱియు వారే స్వయముగా సహాయముచేసి భక్తిచేయగల నేర్పును జీవులకు అనుగ్రహించిరి. అనేక విషమ పరిస్థితులనుగూడ జీవులకు దయతో గలుగజేసి వారిచే భక్తి చేయించుకొని. భక్తి స్వారస్యమును సహించుకొనగలశక్తినికూడ వారే మహాదయతో నను గ్రహించిరి. రాధాస్వామీ దయాళులే స్వయముగా జీవుల ఆత్మలనుపట్టి పైకి లాగి ఊర్ధ్వముగ నారోహింపజేసి, మహానుగ్రహముచూపి జీవుల కామూల ధామమునువరదానముగనిచ్చి, వారేస్వయముగజీవకళ్యాణమును సంపూర్ణముగ నెఱవేర్చిరి. ఈజీవుడేమి చేయగలడు? ఇతనికి ధైర్యసాహసము లించుకగూడ లేవు. సంతులే సర్వవిధముల అంతర్యాములు. ఏయేలోకమునుండి యే యే ఆత్మలు వచ్చినవో ఆవిషయమంతయు వారికే తెలుసును. వారే మననందఱను లాగుకొని తమ చరణములందు లగ్నము చేసికొని మనకు పరమార్థభాగ్యమును వరదానమిచ్చిరి. జీవుడేమియు నెంతమాత్రము చేయలేడు. వారే అనేకవిధము లైన విషమపరిస్థితులను కల్పించి సమస్తకార్యమును నెరవేర్చుచున్నారు. సకల విధముల మనకు నిర్మలత్వమును వారే కలుగజేయుచున్నారు. దయాళురైన సద్గురుని అపారానంతమైన మహిమ నెవరు వర్ణించగలరు? ఏయేజీవులను రాధా స్వామీ దయాళురు తమచరణములందు లగ్నముచేసికొనిరో, వారందఱును మహాభాగ్యశాలురైన ఆత్మలు, వారందఱిని వారు మూలధామమునకుచేర్పించి, అమృతాహారమునిచ్చి, అజరామరులనుజేసి, వారికి శాశ్వతానందభాగ్యము కలుగజేసిరి. రాధాస్వామీ దయాళు రిక్కాలమున నితర మతముల వారి పైనను వర్షింపసలవికాని మహాదయను వర్షించుచున్నారు. ఆదయయొక్కలాభ

మును పొంది దానిని జీర్ణించుకొనగలఅర్హత జీవులకు లేకున్నది. ప్రతిసత్సంగియు అనుక్షణము, రాధాస్వామిదయాళునికి ధన్యవాదములర్పించుచు, ఇతర సమస్తమతములవారికన్న తానెక్కువమహాభాగ్యశాలినని తెలిసికొనవలయును. అట్లా, ప్రతిసత్సంగియు తాను రాధాస్వామిదయాళుని మహాదయాసహాయములవలన నెప్పటికైన నామూలధామమును తప్పక చేరుకొనగలవాడనని హృదయమున సంపూర్ణ విశ్వాసము గల్గియుండవలయును. ఒక్కరాధాస్వామిదయాళుడుదప్ప నిట్టిమహాదయను మఱెవరు అనుగ్రహింపగలరు? ఈమూర్ఖ జీవునికి కర్మలభారమును తొలగించి మూలధామమున జేర్చగల్గినవారు మఱెవరు గలరు? సంపూర్ణ దీనత్వభావముతోను, నిరుపేదభావముతోను హుజూర్ రాధాస్వామిదయాళుని నెవరు శరణుజొచ్చిరో వారే భవసాగరమును దాటిపోగలరు.

## 110

ఎట్టివిషమపరిస్థితి గల్గినను సత్సంగి నిరాశపడనవసరములేదు. ప్రతిసత్సంగిమీద రాధాస్వామిదయాళురు కురిపించుచున్న మహాదయ ఊహించుకొనశక్యముకాదు.

రాధాస్వామిమతముయొక్క మహిమ అద్భుతము. ఇదిగంభీరమును, ఉత్తమోత్తమము నైనట్టి యథార్థమతము. దీనిమహిమ అపారము, అనంతమును. ఈమతము నవగాహనచేసికొనగలవారుకాని విమర్శించగలవారు కాని యెవరునులేరు. దీనిలో నెవరైన నుపదేశముపొంది, అభ్యాసము యథావిధిగా చేయుట మొదలుపెట్టినచో అట్టివానికి అంతర్యమున అతిసహజముగ నాకర్షణ గలుగును. దానిమాధుర్యము కొంచెముకొంచెము పొందుచు, కొంతవఱకాంతర్యమున ప్రవేశము లభించినప్పు డితనికి ఆంతర్యదయయొక్క అనుభవము గల్గును. అప్పుడు ఊర్ధ్వముగ నారోహించుట ప్రారంభమగును. ఇక నతడు క్షణక్షణము నడుగడుగునకు దయతోడుగనుండిన ట్లనుభవములను పొందుచు మహాగాఢమైన ఆనందము నొందసాగును. విషమపరిస్థితులుగల్గినపుడు దివ్యేచ్ఛచే కల్గునట్టి సంరక్షణవిషయముగూడ నతనికి తెలియుచుండును. అప్పు డతనికి రాధాస్వామిదయాళుని మహిమనుగుఱించియు, సద్గురుని మహత్త్వమును గుఱించియు విశ్వాసము బయల్దేరి, పరిపూర్ణ సద్గురు వెట్టిమహోన్నతలోకము

వఱకు సిద్ధిపొందిరో గోచరమై సద్గురుని అపారానంతగతినిగుఱించి బోధపడును. పిమ్మట నతడు రాధాస్వామీమతముయొక్క సనాతనమహత్త్వమును, దాని అపారానంతగతిని తెలిసికొనసాగును. అపు డతనిచిత్తమున రాధాస్వామీ మతముయొక్క ఘనత నాటుకొని, రాధాస్వామీమతములోచేరినవారందఱు మహాదృష్టవంతులనియు, వారిని తరింపజేయుటకై నావ వచ్చి సిద్ధముగ ఒడ్డున నున్నదనియు, వారు నిర్మలచైతన్యదేశమునకువెళ్ళి ఆపరమపురుషునిదర్శనమును తప్పకపొందెదరనియు, వారికింకను ఆంతర్యమున నేమియు తెలియుకొనకపోయి ననుకూడ వారు మహాదృష్టవంతులనియు, సత్యలోకమును పొందబోవువార నియు, నతనికి బోధపడును. అందుచేత ఆప్రేమీభక్తుడు సత్సంగులనుచూచి సంతోషించుచు, వారియెడల ప్రేమాదరభావములను చూపును, సద్గురువునకు శరీరమనోధనముల నర్పింపసాగును. అట్టి ప్రేమీభక్తుడు తనమహాదృష్టమును తెలిసికొని బ్రహ్మానందభరితుడగును.

రాధాస్వామీదయాళునిమహిమ మహాద్భుతము. వారే అందఱి యొక్క శరీరమనస్సులబంధనములను త్రెంచివేసి ప్రపంచవిషయములయొక్క సమస్తబంధనములనుండి విడిపించి, అందఱికార్యము సాంతముగా నెఱవేర్చు చున్నారు. సంతు లెన్నడు తమనిమిత్తమై యేమియు, నెవనివద్దనుండియు తీసి కొనరు. వారికి భేంటుగా అర్పణచేయబడుధనమును వారితరుల కుపకారార్థమై వెచ్చించుదురు. జీవునిబంధనములను శిథిలముచేయునిమిత్తమై, అతనిచే శరీర మనోధనములచే సేవచేయింతురు. వారు స్వతః అన్నిటికి నతీతులు. ఎవరివద్ద నుండి యేమియు నాశించరు. హుజూర్ రాధాస్వామీదయాళునిమహిమను వర్ణించుట యెట్లు ? మన మొకఱాయివలెనే అచేతనావస్థలో నుంటిమి. వారు మహాదయచూపి మనలను చైతన్యదశలోనికి తీసికొనివచ్చి కాలు, చేతులు, కన్ను చెవి మున్నగు నింద్రియములన్నిటియొక్కసుఖములను దయచేసిరి. (పేదల నత్రములలో చూడుడు ఒకరికి కాలుండదు, మఱొకరికి చేతులు ఉండవు) కావున పరమపురుషుడు మనమీద చూపిన మహాదయకు మన మాపరమపురు షునికి కృతజ్ఞతతో ధన్యవాదము లర్పించవలసియున్నది. ఏలననగా, ఆపరమ పురుషుడు జడరూపమైయున్న మనఆత్మలను చైతన్యవంతముగ చేసిరి. మొదట పరమహంసలసృష్టినిచేసి, పిమ్మటహంససృష్టిచేసి, అటుపిమ్మట బ్రహ్మాదేశమును సృష్టించి, ఆతరువాత బ్రహ్మసృష్టినిరచించి, పిమ్మట దేవలోకము ఇత్యాదుల

సృష్టినిచేసిరి. మఱియు చౌరాసీలోని (అనగా జన్మమరణచక్రములోని) జీవులను ఇంకను ఇతరసమస్తఆత్మలనుగూడ చైతన్యవంతముచేసి సృష్టిని రచించి యథాక్రమముగ నందఱకును వారివారి తరహాలకు తగినట్లు శాంతిసుఖములను, ఆనందమును దయచేసిరి. ఒక్కరినికూడా విడిచిపెట్టలేదు. ఇంతియగాక సత్యలోకమును జేరుకొనుటకై ఒకమార్గమునుకూడ స్థాపించిరి. అందఱికిని సంత్సద్గురువునుపొంది సత్యలోకమును చేరుకొను నట్లేర్పాటుచేసి సమస్తజీవుల యెడలగూడ నొకమహాదయ జూపిరి.

కావున రాధాస్వామీమతములోచేరిన జీవులందఱికిని మహాద్భుత భాగ్యము లభించినది. ఈమతములో నుపదేశముపొందినవారికి పారమార్థిక భాగ్యము ఉపదేశమైననాటినుండియు నభివృద్ధినొందుచుండును. అభ్యాసము చేయకుండగ నుండిపోయిననుకూడ రాధాస్వామీదయాళురు సత్సంగియొక్క కార్యమును నెఱవేర్చివేయుచున్నారు, మనమీద, మనమెన్నటికి నూహించుకొనశక్యముకానంత మహాదయను చూపుచున్నారు. అందఱిని సత్సంగములో చేర్పించి, ఆనందమును దయచేయుచుందురు. అందఱికార్యమును నెరవేర్చుచున్నారు, ఇకముందుకూడ నట్లే నెరవేర్చుచుందురు. కావున నెవరు నెట్టి చింతావిచారములను పెట్టుకొననవసరములేదు. లోకములో నెవనికైన నొక మహాబుద్ధిశాలియైన మిత్రుడు ఉండినచో నతడు ఇతని కార్యమును నెఱవేర్చుచుండునుగదా. రాధాస్వామీ దయాళురు అట్టి బుద్ధిశాలురైన మిత్రులు. జీవుడు తానేమియు చేయలేకపోయితినని యనుకొనుచుండును; అతనికి తన మనస్సుయొక్క పరిస్థితి చూచుకొనగకూడ నట్లే బోధపడును. కాని, అసలులో వారు జీవుని కార్యమును నెఱవేర్చుచునేయుందురు.

పైన చెప్పినదానికంతకు సారాంశమేమనగా, సత్సంగి తన పారమార్థిక కార్యక్రమమును ధైర్యముతోను ఉత్సాహయుక్తముగను- చాల తక్కువగనే చేసిననుగూడ-కొంతవఱకు చేసికొనుచుండవలయుననియే. దీక్షపట్టి నిరంతరము చేయుచుండవలయును. సమస్తజీవుల కార్యమును నెఱవేర్చుచున్నవారు స్వయముగా రాధాస్వామీ దయాళురే. ఎంతటి తాఱుమాఱుపరిస్థితి గలిగినను నిరాశ యెన్నడు పడనవసరములేదు. మీమనస్సు సందేహ పరవశమైపోయినను కూడ ప్రమాదములేదు. మీమీద పారమార్థికదయను రాధాస్వామీదయాళురు అనుగ్రహించుచునేయుందురు.

# 111

## మనస్సుయొక్క మోసములు, గురుని ఆజ్ఞాపాలనముయొక్క మహిమ.

పరమార్థము లభించుట బహుకష్టసాధ్యము. ఏలననగా, మనస్సెప్పు డేమిచేయునో యెవరికిని తెలియదు. మనస్సనగ నేమి? దానిరూప మెట్టిది? దాని నివాస మెక్కడ? అనువిషయము లెవరికిని తెలియవు. ఈమనస్సు మహాశత్రువు. అంధకారములోనుండి బాణములు మీాదికివేయును. బాణము లగుపించునుగాని మనస్సగుపించదు. శత్రువునిరూపమే కనపడనపుడు, దానితో పోరాడు టెట్లు? మనస్సు మహామాయావి. అది చేసెడిఘాతల నెవరును తెలిసికొనలేరు, ఊహించుకొనలేరు. మనోరథములు, వాంఛలును మనస్సుయొక్క బాణములు. అది అభ్యాసుల నెక్కువగా బాధించును. అభ్యాసమునందు లగ్నము కానివ్వదు. అప్పు డభ్యాసి తనకేమియు సాగుటలేదనియు, తనమీాద దయలేనేలేదనియు, నెంచుకొనసాగును. ఒకప్పు డది బాణములువేయకుండ నుండిపోవును. అప్పు డభ్యాసి తనమనస్సు చచ్చిపోయినదని యనుకొనును. తిరిగి మనస్సు బాణములనువేయుట మొదలుపెట్టును. ఈవిధముగ మనస్సుయొక్క మోసములకు హద్దులేదు.

సాక్షాత్పరమపురుషునిధామముగాక మరేస్థానమునకైన జేరుకొని, అచ్చటనే శాంతియుతముగ తన్మయత్వమునొంది స్థాయిగనుండిపోవుటయే అహంకారమని చెప్పబడును. అట్టిమోసములన్నిటిని మనస్సు చేయుచుండును. ఈ మనస్సు నివసించెడికోటను భగ్నముచేసిననేకాని, దానిని చంపుట సాధ్యము కాదు; అంతవఱకు నిర్మలభజనాభ్యాసముయొక్క మాధుర్యమును లభించదు. మాయయొక్క తరగతు లెంతదూరమువరకు వ్యాపించియున్నవో ఆస్థానము లన్నియు దాటిపోవువఱకును ఈమనస్సుయొక్క మోసములు అడ్డువచ్చుచునే యుండును. సర్వసమర్థులైన సద్గురుదయాళుని రక్షకహస్తము శిరమునుండి క్షణక్షణము, నిమిషనిమిషము రక్షించుచుండినపుడే యెవనికైన నీమనస్సుయొక్క మోసపునడవడినుండి తప్పించుకొనుటకు సాధ్యమగును.

గురు ఆజ్ఞా సే జో శిష కరఈ।<br>
సో కరతూత భక్తి ఫల దేఈ॥

అర్థము :—గుర్వాజ్ఞ ననుసరించి శిష్యు డేపనులు చేయునో, ఆపనులే భక్తిఫలము నిచ్చును.

సద్గురునిఆజ్ఞ పాలించుటలో గొప్ప మహిమ యున్నది. ఎవరైనను గుర్వాజ్ఞ నెప్పుడు పాలింతురో, ఆక్షణమునుండియే, వారికి పరమార్థసంపత్తు చేకూరసాగును. గురువుయొక్కయు, భగవంతునియొక్కయు దివ్యేచ్ఛవలన నేమిజరుగుచుండునో, అట్టికార్యక్రమముతో అనుకూలించి ప్రవర్తించుట కూడా గుర్వాజ్ఞాపాలనమే యగును. దాదూజీ వారీక్రింద చెప్పినట్లుగా

తూ స్వామీ మైఁ సేవక తేరా।
భావే సిర దే సూలీ మేరా॥

భగవంతుని దివ్యేచ్ఛచే శిష్యునికి మరణదండన వచ్చినచో దానిని సద్గురుని మహాకృపక్రిందనే భావించుకొని ఆమరణదండనను సంతోషముతో స్వీకరించుటకు సిద్ధముగనుండవలెను. మఱియు నీవిధముగ ప్రార్థనకూడ చేయవలయును. "ఓప్రభో, నేను మీవాడను, నన్ను అగ్నిగుండములో పడవేసినను సరే, ఒకమహాపర్వతశిఖరమునుండి క్రిందికి త్రోసివేసినను సరే, లేదా సముద్రములో పారవేసినను సరే, మీయిష్ట మెట్లున్న నట్లుచేయుడు. నేను అన్నిటికిని సంతోషముతో సిద్ధముగనున్నాను." ఈప్రకారముగ సద్గురునిఆజ్ఞల నెవరు పాలించుదురో అట్టిభక్తునిమీదనే నిజకటాక్షము గలుగును. అట్టిభక్తునికే సద్గురువు సంపూర్ణభక్తిని వరదానముగ నిత్తురు. గుర్వాజ్ఞల నీవిధముగా పాటించుట సద్గురువుయొక్కయు, భగవంతునియొక్కయు లక్ష్యజ్ఞానము ఆంతర్యమునగలుగునంతవఱ కెవరికిని సాధ్యముకాదు. సద్గురువుకూడ నాకారణము వలననే సత్సంగికి విధిరూపముగ నేపనిని చేయవలసినదిగ సెలవివ్వరు. ఏలననగా, సద్గురునిఆజ్ఞలను పూర్తిగాపాలించుట యెవనికిని సాధ్యముకాదు. సద్గురువునకు జీవులందఱియొక్కపరిస్థితియు తెలుసును. అందుచే వారేదైనవిషయము మనకు శ్రేయస్కరమనియు లేదా అశ్రేయస్కరమనియు మాత్రమే తెలియజెప్పుదురుకాని, మన మాప్రకారము నడుచుకొన్నను, నడచుకొనకపోయినను వారు లెక్కచేయరు. వారు స్వయముగ నేదియు విధిరూపముగ ఆజ్ఞాపించరు. ఏలననగా జీవుల కాయాజ్ఞలను పాలించుతాహతు లేదు. ఆజ్ఞల నుల్లంఘించినందువలన శిక్షాపాత్రులుగూడ కావచ్చును. మంచిచెడ్డలను

చక్కగ గ్రహించగల్గినట్టి వివేకవంతులైన సత్సంగులు ఒక్కరే, వారివారితరహాల ననుసరించి భక్తిచేయగల్గుదురు. మంచిచెడ్డలను తెలిసికొనలేనివారు చాల నీచశ్రేణిలోనివారు. వారుండెడిఘట్టమే అసభ్యమాత్మకమై యుండును. వారి ప్రవర్తనఅంతయు మనస్సులోని స్థూలరూపమైన నిమ్నతరభాగముయొక్క ప్రేరణలననుసరించి యుండును. వారిమనస్సు తనయిష్టమువచ్చినట్లు వారిని ఆటలాడించుచుండును. వారికెంతయుత్సాహముండునో దానికి తగినట్లుగ భక్తి చేయుట వారికి సాధ్యముకాదు. సద్గురుని రక్షకహస్తము శిరమునలేకుండినచో నెవరును మనస్సుయొక్కజాలమునుండి తప్పించుకొనలేరు. మనస్సు సద్గురుని అనుగ్రహముచే నెప్పుడు నిర్మలమగునో ఆంతర్యప్రయాణము అప్పుడే సాగుట మొదలిడును. అప్పుడే సత్సంగి నిజమనస్సుగలస్థానమును చేరుకొనగలడు. నిజ మనస్సుకూడ నొక అడ్డుతెరయే.

అతనిహృదయములో ప్రకాశముగల్గినపుడు సత్యధారతో సంబంధ మేర్పడును. అప్పుడతడు దివ్యేచ్ఛప్రకారము ప్రవర్తించును; అతని కన్నిదుఃఖములు నపుడు నశించును. అతని కప్పుడొక్కభగవంతుడుతప్ప మఱొకకోరిక యుండ నేరదు. సద్గురుమహిమను తెలిసికొన్నవానికి సమస్తము సంప్రాప్తమయ్యె నన్నమాటే సద్గురువును గుర్తుపట్టినవాడు భగవంతుని గుర్తుపట్టినట్లే. సద్గురువు భగవంతుడు నొక్కరే. ఈసమస్తసృష్టియొక్క కార్యకలాపమును దానిసంరక్షణయు ఆసత్యధారమూలముననే జరుగుచున్నవి. ఆసత్యధార నెవరు తెలిసికొని, దానితో సంబంధమేర్పఱచుకొనిరో వారికే గురువుయొక్కమహత్వజ్ఞానము కల్గినదని చెప్పవలయును. ఆసత్యధారయే భగవంతునిస్వరూపము, సద్గురుస్వరూపమునుకూడా. ఆసత్యధారను తెలుసుకొనువఱకు, నెవనికైనను సద్గురునిమహత్వము బోధపడనేరదు, వారియెడల సంపూర్ణగౌరవము, భక్తి భావమును కలుగనేరవు. ఆసత్యధార నెవరు అంతరంగమున పట్టుకొనిరో, వారే సద్గురువునందు భక్తిశ్రద్ధలు గౌరవభావమును గలిగి ప్రవర్తించుదురు. అట్టి వానిమీదనే సద్గురుని సంపూర్ణకృప యుండును.

జా కేహృదయ గురుపరతీతీ, కాల కరమ వాసే నహీం జీతీ.

సద్గురుకృప యెవనిపైన గలదో, అతనిదరికి కాలకర్మలు వెళ్ళనేలేవు సమస్తసృష్టియు వారి అధికారమునకు లోబడియేయున్నది. వారికెన్నడు నెట్టి చింతయు, విచారము నుండనేరవు. సత్యధారయే దివ్యేచ్ఛయొక్కధార. అట్టి

భక్తుని స్వార్థపరమార్థకార్యములన్నియు, దివ్యేచ్ఛచేతనే జరిగిపోవుచుండును. వారిమనస్సులో నెట్టికోరికయు నుండనేరదు. ఇంక వారిని కాలకర్మము లెట్లు బాధపెట్టగలవు ? ఏపురుషుని కార్యకలాపమంతయు భగవదిచ్ఛప్రకారమే జరుగుచుండునో, అట్టివానిని జూచి కాలకర్మములే స్వయముగ భయపడి వణికిపోవుచుండును. అట్టిభక్తుని సద్గురువే స్వయముగ క్షణక్షణము కాపాడుచుండును. అతడుకూడా ఎనిమిదిజాములు సద్గురునిప్రేమలో తన్మయమైపోవుచు ప్రేమపూరితుడై యుండును. రాధాస్వామీదయాళుని చరణములను పొందినవారందఱును మహోత్కృష్టభాగ్యశాలురు. వారికందఱికి నీమహాభాగ్య మొకానొక రోజున లభించగలదు. రాధాస్వామీదయాళురు అందఱికిని తమ్ము తెలిసికొను భాగ్యము ననుగ్రహింతురు.

## 112

అదృష్టముండిననేకాని స్వార్థముకాని పరమార్థముకాని సిద్ధించనేరదు, ఆఅదృష్టము సద్గురుశరణ్యము ప్రాప్తించినచో ఫలించనారంభించును. భగవత్కృప సంపూర్ణముగగలుగుటకు సద్గురువునందు పరిపూర్ణవిశ్వాసము, పరిపూర్ణకైంకర్యభావము నుండవలెను.

స్వార్థపరమార్థములు రెండిటిలోను అదృష్టము ప్రధానము. అదృష్టమున్నచో అంతయు లభించును. అదృష్టము లేనిచో, స్వార్థములోను, పరమార్థములోనుగూడ నేమియు లభించనేరదు. అదృష్టములేనపుడు, మిగిలిన సామగ్రి అంతయు నుండిననుగూడ నేమియు లాభములేదు. ఏసామగ్రియు లేకపోయినను, అదృష్టమొక్కటి యుండినచో నట్టివానికి సమస్తము నున్నట్లే. లోకములో నెందఱోమహాధనికులపిల్లలు, అన్నిసంపత్తులుండియుగూడ, కటికదరిద్రులుగ నైపోవుటయు, నెందఱోగర్భదరిద్రులు మహాధనికులుగ నైపోవుటయు మనము చూచుచునేయున్నాము. అటులనే సంతులసంప్రదాయములోని జీవులుగూడ, వారికి భక్తిచేయుట కవసరమైన సామగ్రిఅంతయు నుండిగూడ, సద్గురుకృపగూడ లభ్యమైయుండియు, ప్రేమసంపత్తు లేకుండనుండిపోవుచుండిరి. ఆ అదృష్టము వారికి లేకుండుటయే దానికికారణము. అయినను, సద్గురునికృపాకటాక్షము వారియందు పడుటయు, సత్సంగము లభించుటయు తటస్థించినచో, వారికి రాబోవుజన్మలో ప్రేమసంపత్తు లభించగలదు. కాని ఆఅదృష్ట మిపుడు

లేనందున వారిజన్మలో రిక్తహస్తులుగనే యుండిపోవుదురు. అదృష్టమే అన్నిటికిని ప్రధానము.

> భాగ బినా క్యా కరే బిచారీ।
> యహా భీ భాగ గురూ సే పారీ॥

అర్థము :—అదృష్టములేనిదే యెవరేమిచేయగలరు ? అయిన నీఅదృష్టము గూడ సద్గురువువద్దనుండియే పొందవలయును.

సద్గురుచరణములనుపొందినజీవులకు ఆఅదృష్టము నిర్మాణమగుచుండును. అట్టివారికి పరమపురుషునిదర్శన మొకానొకరోజున తప్పకలభించును; ప్రేమసంపత్తు తప్పక ప్రసాదించబడును. రాధాస్వామీదయాళునిచరణములను పట్టుకొన్నవారందఱికిని ఆ అదృష్టము వరదానముగ నానాడే ప్రసాదించబడిపోయినది. అనగా, వారినిచరణములమీదికి తీసికొన్ననాడే వారిలో నామబీజము నాటబడినది. సంతులరోమరోమములనుండియు నమృతధారలు బయల్వెడలుచుండును. వారిదర్శనముచేసికొన్నందువలన నాయమృతధారల ప్రభావలాభము జీవునికి గల్గుచుండును. సంతులు సెలవిచ్చుమహావచనములవలన మనస్సుపైన ప్రభావము కల్గుచుండును. సంతుల మహావచనములకు మహాగాఢ ప్రభావము గలదు. సంతులు ప్రేమస్వరూపులు, చేతనస్వరూపులును. బీజము నాటుటయనగా జీవునిలో వారి దర్శనముయొక్కయు, వచనములయొక్కయు గాఢ సంస్కారములు పడుటయే. భాగ్యము అబ్బుటయనగా నిదియ. భాగ్యవరదానమనగగూడ నిదియ. సంత్ సద్గురుచరణములందు చేరుకొని, వారివలన నుపదేశము పొందినవారందఱికిని మహాభాగ్యము లభించెను. సద్గురువునందు ప్రీతిగల్గి, వారినే సమస్తమునకును కర్తగను, పోషకునిగను తెలిసికొనుచు, వారేవి చేసినదానితోనే సంతోషించుచు, నెట్టివిషమాతివిషమపరిస్థితులు వాటిల్లినను ధన్యవాదముల నర్పించుచు, నెట్టికోరికయులేకుండ నెవరుందురో, అట్టివారికి భారమంతయు శిరమునుండి తొలగిపోవును. సద్గురు వేది చేసినను తమ్మునేవరిస్థితిలో నుంచినను, అందులోనే అట్టివారు తన్మయత్వమునొంది యుండిపోవుదురు. ఇదియకాదు. భగవంతుడు తాముచేసెడి మానసికభక్తికి ప్రతిఫలముగ తమమీద దయచూపవలెననిగూడ వారికి కోరిక ఉండదు. అట్టివారికి ప్రేమభక్తులు మహాగాఢముగ నుండును. అట్టివారికొక్క భగవంతునికొఱకును సద్గు

రునికొఱకును దప్ప మఱొకవిషయమై కోరిక యుండనేరదు. అట్టివారొక్క పరమపురుషునియందే ప్రేమభావము గల్గియుందురు. ఆపరమపురుషు డేమిచేసిన నదియే, ఆయన తమ్ము నెట్టిపరిస్థితిలోనుంచిన నదియే వారికి సంతోషము. శ్వాసశ్వాసకు వారు తమ ప్రియతమునికి భక్తిప్రేమలు చేయుటలోనే లగ్నమై యుందురు. ఇట్టిపరిస్థితి యెవనికుండునో, అతనియందే భగవంతుని నిజదయ యుండును. ఇది మహోత్తమ సంస్కారుల పరిస్థితి. ఒక్కసారి సద్గురువునకు సమ్ముఖముగ వచ్చినంతనే జీవునిపరిస్థితిఅంతయు ఒక్కపెట్టున మాఱిపోవును. కోకిల కూతకూసినపుడు, కాకులగూళ్ళలోనున్న కోకిలపిల్లలుగూడ, కాకిఅఱపులు మాని కోకిలారవముల నెట్లు చేయ మొదలుపెట్టునో, సంస్కారులైన సత్సంగులు కూడ నట్లే మాఱిపోవుచుందురు. సద్గురునియెదుట పడినతోడనే, వారు తమ పూర్వస్వభావముల నొక్కపెట్టున విడిచిపెట్టి తత్క్షణమే భక్తిలక్షణములలో వర్తింపదొడగుదురు. ఇట్టిభక్తులు భగవంతునియొడిలో నాటలాడుకొనుచుందురు. ఎట్టిపరిస్థితిలోను, వారు సదా ప్రేమరంగులో రంగైపోయియుండుచు, ఆభగవంతునితో విలాసలు జరుపుకొనుచుందురు. అట్టి మహోత్కృష్టభాగ్యశాలురను స్వార్థపరమార్థముల రెండింటి విషయములోను పరమపురుషుడు స్వయముగ సంరక్షణచేయుచుండును.

## 113

పరమార్థాసక్తి యుండినపుడే పరమార్థ సంపాదన జరుగును. భగవంతుని దర్శనముకొఱ కాసక్తియు, ఈమలినదేశమునుండి తప్పించుకొనిపోవలయునను తీవ్రసంవేగమును పుట్టించుకొనుటకు సంత్సంగుల సాంగత్యము సాధుసంతుల సత్సంగమును అవసరము.

పరమార్థముకొఱకై ఆశక్తిలేనిచో పరమార్థ మెన్నడును లభించదు లోకములో నేదేని యుద్యోగముకొఱకై వాంఛపుట్టినపుడు జీవుడదిసాధించుకొనుటకొఱకై యెట్లు రాత్రింబవళ్ళు పాటుపడి తద్రూపమైపోవుచుండునో చూడుడు. మిగిలిన పనులన్నియు కట్టిపెట్టి యీఒక్కపని సాధించునిమిత్తమై యెన్నియో ప్రయత్నములు చేయుచు కాలమంతయు నందుకొఱకే వెచ్చించుచుండును. ఎవనివలన తనకార్యము నెఱవేఱుననితోచిన నతనితో స్నేహము చేయుచు, నాపనిపూర్తిచేయునిమిత్తమై యెన్నియో పాట్లు పడుచుండును.

ఆపని నెర వేరినప్పుడు అత్యానందపరవశుడై పోవును. అటులనే పరమార్థమునం దెవని కాసక్తియున్నదో, అతడు దయామయులైన సద్గురువువలన నుపదేశము తీసికొని మనస్సును వంచి, అభ్యాసముచేసికొనుచు తద్విఘ్నకారకములైన కామక్రోధాది వికారముల నన్నిటిని విడిచిపెట్టవలయును. సద్గురువున కెదురుగ కూర్చుండి మహోల్లాసముతో దర్శనముచేసికొనవలయును. శరీరమనోధనములను పూర్తిగా అర్పణచేయుట కెంతమాత్రము వెనుదీయకూడదు. భక్తిభావము యొక్క అంగములైనకార్యములన్నిటిలోను మహాసంతోషముతో పాల్గొను చుండవలెను. భగవద్దర్శన మెప్పుడు పొందుదును, ఎప్పు డీమాయాజాలమునుండి తప్పించుకొని బయటపడగలను, ఈమాయాదేశమునుండి దాటి పై కెప్పుడు పోగల ననెడికోరికలు మనస్సున పొంగిపొరలుచుండవలెను. ఎవనికైన నిట్టిమన స్తరంగములు బయల్వెడలుచున్నయెడల, నందువలన నతనికి మహాలాభము గలుగును. ఇట్టిపారమార్థికమైన తీవ్రసంవేగ మెవనికైన నున్నయెడల నది నిరర్గళముగ వృద్ధిపొందుచుండును. అట్టివాడు నడుచుచున్నను, తినుచున్నను, త్రాగుచున్నను, మఱొకపనిపాటలేమిచేయుచున్ననుగూడ ననుక్షణము సద్గురువునే ధ్యానముచేయుచుండును. అప్పుడే సద్గురు వతనిని మఱచిపోకుండ నుందురు. అతనిలో శ్వాసశ్వాసకు తనప్రియతములైనసద్గురువునుగుఱించి భావతరంగము లుప్పొంగుచు హృదయములో వేదనగల్గ నారంభించును. శాంతి యుండనేఉండదు. ఇట్టితీవ్రవాంఛమూలమున అనురాగము జనించును. అనురాగమువలన భాగ్యము వృద్ధియగును. అప్పు డతడు గురుముఖుడై పోగలడు. ఇట్టి ఆసక్త్యనురాగము లెవని కుండునో, భగవంతు డతనికి నిస్సంశయముగ పరమార్థసంపత్తును అనుగ్రహించును. పరమార్థముకొఱకు ఇట్టితీవ్రసంవేగము లేనిచో పరమార్థ మెట్లుసాగగలదు ?

అన్నిటికన్నముందుగా భగవద్దర్శనముకొఱకును, జన్మమరణదుఃఖము నుండి నివృత్తికొఱకును కోరిక గలుగవలెను. ఆకోరిక మొదటస్వల్పముగనే యున్నను దానిఅంతటనదియే సహజముగ వృద్ధిపొందును. లౌకికవాంఛ లెట్లు ప్రాపంచికజీవులసహవాసమువలనను ప్రాపంచికకృత్యములఫలితములను, పర్యవసానములను ప్రత్యక్షముగ చూచుచున్నందువలనను పుట్టుచున్నవో, అటులనే ప్రేమిభక్తులసహవాసము, సాధుగురువుయొక్కసత్సంగము చేసికొనుచున్నందు వలనను, ప్రేమిభక్తులప్రవర్తనను చూచుచుండుటవలనను, సాధుగురునివచన

మాటలనువినుచు, వారిసాంగత్యములో ననుభవములనుపొందుటవలనను భగవత్ప్రేమ ఉదయించును. రాధాస్వామిదయాళురు వెవ్వేఱుస్థలములలో సత్సంగములు జరిపించుచున్నారు. అందువలన నందఱకు లాభముకలుగుచున్నది. జీవులలో పారమార్థికాసక్తి యుదయించి చాలమంది భక్తిమార్గమునకు వచ్చుచున్నారు. సత్సంగములసంఖ్య ఇంకను పెరిగిపోయి, ఇంకనెన్నియోస్థలములకు వ్యాపించి, సమస్తజీవులకును పారమార్థికలాభము చేకూరగలదు. క్రొత్తవిధమగు భక్తిరీతి బయలుదేరుచున్నది. లోకములో చూడుడు, పల్లెటూళ్ళలోని జనులకేమిలభించిన దానితోనే వారు కాలక్షేపముచేయుచున్నారు. కాని పట్టణములలోనివారు క్రొత్తక్రొత్త తినుబండారములను తినుచు, క్రొత్తక్రొత్త రకముల దుస్తులను ధరించుచు, నెన్నియోవిధములైన శృంగారాలంకారములను, సుఖములను సంపాదించుకొనుచు నభివృద్ధినొందుచున్నారు. అటులనే పరమార్థములోగూడ నభివృద్ధికలుగుచున్నది. అనేకస్థలములలో సత్సంగములు క్రొత్తవి బయల్దేరిపోయినవి; ప్రేమీభక్తులసంఖ్య పెరుగుచున్నది, భక్తికూడా అభివృద్ధిచెందుచున్నది.

హుజూర్ రాధాస్వామిదయాళురు జీవులపైన మహాదయ చూపుచున్నారు. వివేకవంతులకైతే, ఈసృష్టియొక్క పరిస్థితి పరిశీలించినందువలననే పారమార్థికాభిలాష బయల్దేరిపోవుచున్నది. జీవులు పుట్టుచున్నారు, చనిపోవుచున్నారు. ఇదంతయు చూచుచున్నాము. పుట్టినదెందుకు ? బాల్య, యౌవన వార్ధక్యావస్థల దుఃఖముల ననుభవించి తిరిగి చనిపోవుచున్నారు. మాటిమాటికి జన్మించుటయు, మరణించుటయు ననెడి మహాదుఃఖ మెట్లు సహించును ? ఈలోకములోని దుఃఖములనుండి తప్పించుకొనుటెట్లు ? భగవంతునిదర్శన మెట్లు లభించగలదు ? నాశరహితమైన ఆనంద మెట్లు లభించును ? ఎవరికి ఇట్టిపరమార్థాభిలాష, ఇచ్చటిపరిస్థితులు చూచినందువలననే కలుగునో వారే మహాదృష్టవంతులగు జీవులు. అట్టివారికి సద్గురువు లభించినచో వారు సద్గురువునకు ప్రాణముల నర్పించి భక్తి చేయదొడగుదురు. అట్టివారిమీద దయ శీఘ్రాతిశీఘ్రముగ గలుగును. అట్టివారు భక్తిచేసికొని తమకార్యమును త్వరగా పూర్తిచేసికొందురు. చెప్పవచ్చినదేమనగా, భగవద్దర్శనాభిలాష కలుగవలెను, జీవులందఱును తమకు చేతనైనంతవఱకు తమజీవకళ్యాణకార్యము సాధించుకొనునిమిత్తమును, భగవద్దర్శనముపొందునిమిత్తమును భక్తిమార్గమున పాటుపడుచుండవలయును.

# 114

## భగవంతునియందు ప్రేమలేనివాని జన్మ వ్యర్థము.

ఆకలి లేనపుడు భోజనము రుచిహీనముగను, అహితవుగను ఎట్లుండునో, గ్రుడ్డివానికి ఈప్రపంచములో నానందమేమియు లేకుండగనుండి, ఈలోకములో నుండిసను. ఉండకపోయిననుగూడ నొకటిగ నెట్లుండునో, అటులనే భగవంతుని చరణములయందు ప్రేమ యేమానవుని హృదయమున నుండదో, అతనిజన్మ వ్యర్థము. అతడు నరశరీరము ధరించినను, ధరించకపోయినను ఒకటే. లోకములో నతనికి అన్నిసుఖములు లభించవచ్చును, కాని భగవత్ప్రేమలేనిచో నదంతయు వ్యర్థమే. ఏహృదయములో భగవంతునియందు ప్రేమ మేల్కొన లేదో ఆహృదయము గ్రుడ్డిదే. ఒకరాజభవనములో సమస్తపదార్థములునుండి, చక్రవర్తికూడకూర్చుండియున్నను అచ్చట దీపములేకుండినయెడల నా సామానులు, చక్రవర్తియుకూడ నెట్లు కానరాకుండునో, అట్లే యేహృదయమునందు తమోగుణము క్రమ్మియుండునో ఆహృదయము గ్రుడ్డిదే. అట్టివానికి భగవద్దర్శనమును లభించదు, సమస్తసృష్టిలోనిసామగ్రియు కానరాదు.

ఎవనిహృదయమున భగవంతునియందు ప్రేమ రవ్వల్కొని మహాదేదీప్యమానముగ దీపమువలె వెలుగుచుండునో, అట్టిప్రేమిభక్తునిసహవాసము వలన, నితరులహృదయములలోకూడ ప్రేమదీపములు వెలుగొందగలవు. ఒక్కదీప మెచ్చటనైన వెలుగుచుండినయెడల నచ్చట ననేకదీపములను జనులు వెలిగించుకొందురు. అట్లే ఒక్కప్రేమిభక్తునిసహవాసమువలన ననేకులు ప్రేమిభక్తులుగ నైపోగల్గుదురు. ఎవనిహృదయముననైన నొక్కప్రేమాగ్నికణమున్నచో, నది అతని సమస్తకర్మలను దహించి, హృదయమును నిర్మలము చేయును. ఒక్కనిప్పుకణము గడ్డిమేటినంతి నొక్కక్షణకాలములో నెట్లు దగ్ధముచేయునో, అట్లే యేహృదయములోనైన ప్రేమ ప్రకటమైనచో ఆహృదయమునుండి సమస్తకర్మలు, భ్రమలు, కామక్రోధాదివికారములును విడిచిపెట్టి వెడలిపోవును. ప్రేమదీపము హృదయమున జాజ్వల్యమానమగుచున్న జీవులు మహాదృష్టశాలులు. దీపపుప్రమిద యుండి, వత్తియుండి, నూనెకూడా యుండినను వెలుగుచునున్న దీపము లభించిననేగాని దీపము నెట్లు వెలిగించుట సాధ్యముకాదో-దీపపుబుడ్డి, నూనె, వత్తియుకూడ నక్కడే యుండినప్పటికిని — అట్లే

యేభక్తునిహృదయములో ప్రేమప్రకాశించుచుండునో అతడే ప్రేమిభక్తుడు, అతడేసాధువు, అతడేమహాత్ముడును. అట్టివానిసాంగత్యము లభించినవారంద ఱును మహాభాగ్యశాలురు.

## 115

**ఆహారపానీయములను తక్కువగ తీసికొనుచు, మాటలాడుటను తగ్గించి నపుడే సత్సంగమువలన లాభమునొందగల్గుదురు.**

సత్సంగి మహాజాగరూకతతో నుండవలెను. తిండి తగ్గించి, పానీయము లను తగ్గించి, సంభాషణ తగ్గించవలెను. అప్పుడే పరమార్థములో నభివృద్ధి గలుగును. ఈవిషయములలో నేసత్సంగియైనను జాగరూకతతో ప్రవర్తించని యెడల నతడు కేవలసంసారియే. అతనికి సంత్ సద్గురుని సాంగత్యమహిమ తెలియలేదు. ప్రతివ్యక్తియు నవశ్యము తనశక్తికొలఁది యీ మూఁడువిషయ ములను సహజరీతి నవలంబించవలయును, అప్పుడే సత్సంగములోనిభాగ్యము లభ్యముకాగలదు.

## 116

**ఏసత్సంగియైనను తనఆత్మ పిండదేశమునుదాఁటి బ్రహ్మాండదేశములో ప్రవేశించువఱకు, నితరులకు రాధాస్వామిమతబోధచేయుటకాని, ఉపదేశ మిచ్చుటకాని జరిగించుట చాల హానికరము.**

ఆత్మపిండదేశము నతిక్రమించి బ్రహ్మాండదేశములో ప్రవేశించువఱకు నేసత్సంగియు నితరజీవుల కుపదేశము లివ్వకూడదు, ఉపన్యాసములనిచ్చి జీవు లకు పరమార్థబోధచేయు తలంపుపెట్టుకొని తగాయిదాలలో నెంతమాత్రము పడకూడదు. లేనిచో చాలనష్టము వాటిల్లును. అట్టివారు కేవలము వాచక జ్ఞానులుగ తయారైపోవుదురు. ఏలననగా, వారి కాంతర్యపరిస్థితియేమియు తెలియదు. నోటితో మాటలాడినదంతయు వాచకజ్ఞానమనియే పేర్కొన బడును. సత్సంగి అన్నిటికన్న ముందుగా తనపరమార్థకార్యమును చక్కజేసి కొనవలయును. అటుపిమ్మట నత డితరులతో నీవిధమైనచర్చలు పెట్టుకొన్నను నష్టమెక్కువగ నుండనేరదు. సంత్ సద్గురువు స్వయముగ సర్వసమర్థులు. ఏ యేజీవుల కధికారముగలదో, వారిని వారే స్వయముగ లాగికొనగలరు.

చూడుము, పూర్వకాలములో యోగీశ్వరజ్ఞానులు, వారింకను పిండదేశమును అతిక్రమించకనేయుండినను బహుదూరప్రాంతములవార్తల నెట్లు చెప్పగల్గుచుండెడివారో, జనులందఱు నెట్లు వారిని వెంటబడి ఆశ్రయించుచుండెడివారో. అట్లుండగా పరమపురుషుని అవతారపురుషులు, సర్వసమర్థులునైన సంత్ సద్గురువునకు మఱొకరిద్వారా ఉపదేశమిప్పించవలసిన అవసర మేలగల్గును. వారే అందఱి హృదయములను ప్రేరణచేసి తమవద్దకు లాగుకొనగలరు. కావున నే వ్యక్తియు తాను ఫలానామనిషికి బోధచేసి జ్ఞానముపుట్టించవలసియున్నదని కాని, ఫలానామనిషిని మేల్కొల్పవలసియున్నదనికాని వ్యర్థాలోచనలను పెట్టుకొనకూడదు. మొదట మీపని చేసికొనుడు, తరువాత ఇతరులనుగుఱించి ఆలోచించుడు. దీని అభిప్రాయము సత్సంగులు ఒకరితోనొకరు పరమార్థవిషయములను గుఱించి చర్చించుకొనుట మానివేయుమనికాదు. ఈపై విషయమంతయు సాధారణముగా సత్సంగులు సత్సంగేతరులతో చేయుచర్చలనుగుఱించియే చెప్పితిమి. ఏలననగా, అట్టివారికి బోధపఱచుటలోను, వారితో వాదవివాదములు జరుపుటలోను కాలము వృథావ్యయము చేసికొనకూడదు. అయితే, యెవరైన తగిన అధికారియైయుండి, ఈమతవిషయములనుగుఱించి తెలిసికొనగోరినచో, అట్టివానికి, ఈమతముయొక్క మహత్త్వమును తెలియ చెప్పుటమాత్రమే చేయవచ్చును. కాని పరస్పరము వాదప్రతివాదములను చేసికొనుచు కాలక్షేపము చేయుట వృథాప్రయాస అగును.

## 117

సంతులవతరించుటకు హేతువులు, సంతులదర్శనముచేసికొన్నవారికి, చేసికొననివారికిని గల్గుఫలితములలో వ్యత్యాసము.

ప్రశ్న :—సంత్ సద్గురువు అవతరించినపుడు సమస్తత్రిలోకీలలోను ఒకేసారి వారు ప్రకటమగుచుందురా లేదా నేదోయొకత్రిలోకీలోనికివచ్చుచుందురా ? అట్లువచ్చినపుడు వరుసగా ఒకదానితర్వాత మఱొకత్రిలోకి లోనికి వచ్చుచుందురా లేక మఱేతీరున వచ్చుచుందురు ?

సమాధానము :—సంతులువచ్చినపుడు ఒకత్రిలోకితరువాత మఱొకత్రిలోకిచొప్పున వరుసగా నన్నిత్రిలోకీలలోనికి వత్తురు. ఏత్రిలోకికైనను సంతులవతరించుటకువంతు, అది సత్యలోకమునకు సరిగ నెదుటకువచ్చినపుడు వచ్చు

చుండును. ఈవిధముగ ననంతసంఖ్యగా త్రిలోకీలున్నవి. వాని అన్నింటికిని, ఇట్లు వంతువచ్చుటకు లెక్కలేనన్నిసంవత్సరములు పట్టును. ఏత్రిలోకికైనను నట్లువంతువచ్చినపుడు అది కొన్ని వేలాదిసంవత్సరములు సత్యలోకమున కెదురుగ నుండిపోవును. తిరిగి అది రాధాస్వామీధామమున కెదురుగవచ్చినపుడు, ఆత్రిలోకిలో రాధాస్వామీదయాళురు సంతురూపములో అవతరింతురు. సత్యలోకమున కెదురుగవచ్చినపుడు సంతులును, దశమద్వారమున కెదురుగవచ్చినపుడు యోగీశ్వరులును, త్రికుటికి సహస్రదళకమలమునకు నెదురుగవచ్చినపుడు యోగులు, జ్ఞానులును అవతరించుచుందురు. ప్రాచీనయుగములలో నీ త్రిలోకి దశమద్వారమునకు సమ్ముఖముగవచ్చినపుడు, ఇచ్చటికి రామ, కృష్ణ, వ్యాస, వశిష్ఠాది యోగీశ్వరులు జ్ఞానులును అవతరించిరి. అటులనే, ఇప్పుడు మనత్రిలోకి తిన్నగ రాధాస్వామీధామమున కెదురుగనున్నది, కావున రాధాస్వామీధామమునుండి పరమసంతులు ప్రకటమగుచున్నారు. మనత్రిలోకి కబీరువారి అవతారకాలము మొదలుకొని రాధాస్వామీధామమున కెదురుగ వచ్చెను. ఇప్పుడిక నీత్రిలోకికంతకును అనగా ఇందలి సకలజీవజంతుకోట్లకును ఉద్ధారమగువఱకు, సంతులు అప్పుడప్పుడు అవతరించుచునేయుందురు. ఈసమస్త సృష్టికిని ఉద్ధారమైపోయినపుడు ప్రళయమైపోగలదు. తిరిగితిరిగి సంతులవతరించుచుండినయెడల ప్రళయము రాబోవుచున్నదని తెలుసుకొనవలెను. ఏలననగా, త్రిలోకిలో నెవరును లేకుండా శూన్యమైపోయినపుడు, అనగా త్రిలోకిసమగ్రముగావెళ్ళి అజరదేశములో చేరిపోయినపుడు తప్పకుండ ప్రళయము కావలసియే యున్నది.

ఏయే జీవులు సంతులకెదురుగవచ్చి వారిదర్శనము చేసికొందురో వారికి సత్యలోకములోను, రాధాస్వామీధామములోను నివాసము లభించును. సంతుల దర్శనము పొందలేనివారికికూడ అజరామరగతి లభించును. అనగా, జననమరణములులేకుండ పోవును, కాని వారికొఱకై భంవరగుఫకుపైనను, సత్యలోకమునకు క్రిందుగను క్రొత్తగా ద్వీపములను రచించి, అందులో వారికి నివాసము యేర్పాటుచేయబడుచున్నది. అక్కడినుండి వారు క్రిందికి పంపబడరు. అనగా వారు మరల కాలుని ఆవరణలోనికి రానేరరు. ఏత్రిలోకియైన, నీసమయములో మనత్రిలోకివచ్చినట్లుగా, రాధాస్వామీధామమున కెదురుగవచ్చినప్పుడు దానికి సమగ్రముగ నుద్ధారము జరుగును. అట్లుకానిచో, త్రిలోకికి,

సమగ్రముగ నుద్ధారముకానేరదు. ప్రతిత్రిలోకిలోను పైకిపోవుటకు త్రోవల క్రింద కొన్ని గొట్టములు ఉన్నవి. ఏత్రిలోకిలోనైనను ఆగొట్టములన్నియు అనగా, త్రోవలన్నియు తిన్నగ రాధాస్వామీధామమువైపునకుగాని లేక సత్యలోకమువైపునకుగాని తిరిగిపోయియుండినచో, నపుడు ఆత్రిలోకి రాధాస్వామీధామమునకుగాని, లేక సత్యలోకమునకుగాని సమ్ముఖముగనున్నట్లు తెలిసికొనవలెను.

## 118

ప్రతిమానవుడు నెల్లపుడు పారమార్థికవాసనను తనమనమున పుట్టించుకొనుట అలవాటుచేసికొనవలెను. అట్టి యుత్తమవాసన గల్గియున్నచో నవశ్యముగ భగవంతుని సాన్నిధ్యము దర్శనభాగ్యమును లభించగలవు.

లోకములోనందఱును ఈప్రపంచములోనున్న పదార్థములన్నిటిలోను వారివారి వాసనానుసారముగా (కోరికలననుసరించి) చిక్కుకొనిపోవుచున్నట్లు మనము సామాన్యముగ చూచుచున్నాము. అనగా జీవులందఱును ఈవిషయములందు వ్యామోహముపెట్టుకొని వానిని అనుభవించుచున్నారు. ఎప్పుడే వాసన ప్రబలముగనుండునో, అప్పుడావాసనకు తగినట్లుగ ఉచ్చనీచఘట్టములలో పడి పొంగిపొరలుచుందురు. ఎందఱోజీవులు భూతపిశాచయోనులలోపడి తిరుగుచున్నారనియు, వారు అట్లుండిపోవుటకు కారణము వారికి ధనసంపత్తులకొఱకు గల ఆశయే అనియు, స్థిరపఱచుసంఘములు, మతములు నిక్కాలమున నెన్నియో కలవు. కావున దీనినిబట్టి, జీవునికి సాంసారికవాసనలమూలమున నిట్టియోనులలోపడి తిరగవలసివచ్చుచుండినచో ఈజీవునికిగలవాసన పరమార్థమునకే సంబంధించినదైనయెడల దానివలన నతనికి తప్పక మహోపకారము గలుగవలయునని విస్పష్టముగ తేలుచున్నది. కాబట్టి అందఱును తమమనస్సున నెల్లపుడు నెట్టిపరిస్థితిలోను పరమార్థముకొఱకై కోరికపుట్టించుకొనుట అలవాటు చేసికొనుచుండవలెను. అట్లు చేసినచో నాజీవులకు ఆవాసనప్రకారము పరమధామము లభించగలదు; వారు పరమసుఖమును పొందగలరు. ఏలననగా, సర్వసుఖములకును భండారము ఉన్నతస్థానములోనే యున్నది. ప్రపంచములోని జీవులు ఈప్రపంచమునందే వాసనగల్గియుండి, ప్రాపంచికసుఖములకొఱకే ఆశపడుచున్నారు. కావున యెవనికైన పారమార్థికవాసన యున్నయెడల నతనికి

తప్పకుండా భగవంతుని దర్శనము లభించి భగవత్సాన్నిధ్యము గలుగుచు నుండ వలెను. మఱొకవిషయమేమనగా, ప్రాపంచికజీవులు చాలయేండ్లు పాటుపడినను గూడ పొందజాలనట్టి మహాసుఖము పరమార్థులకు సాధారణముగనే లభించి పోవుచుండును. కావుననిట్టి అమూల్యమును, అపారమునైన నీమహాలాభము గలుగజేయునట్టి యీవాసనను మనస్సున స్థాపితముచేసికొనుట యెంతమహా వశ్యకమో !

## 119

<u>అభ్యాసము చేతనైనంతగా చేయుచు నుండుట ఆవశ్యకము. ఎన్నడు నిరాశ పడవలసినపనిలేదు. సకాలములో రాధాస్వామిదయాళురు తమశరణు జొచ్చినవారికందఱకు అంతర్యానందమును తప్పక ననుగ్రహింతురు.</u>

ప్రతిపరమార్థియు తనశరీరమును, ధనమును, కుటుంబమును ఇతరప్రాపంచికజీవుల శరీరధనకుటుంబములమాదిరిగనే చూచుకొనవలయును. ఆవిధముగ చూచుకొనుట యనగా, పరమార్థికి వానియందు అభిమానమెంతమాత్రము నుండకూడదని మాఅభిప్రాయము. అతనికి ఆవస్తువులయందభిమానము లేని యెడల, నతనిమనస్సు, నాత్మయు నంతర్ముఖముగ నాకర్షించబడి అతనికి అంతర్యానందము లభ్యమగును. వీనియం దభిమాన మున్నంతకాలము నిర్మలానందము లభ్యమగుట కష్టము. అయినను పరమార్థికి శరీరమనోధనములయెడలగల అభిమానము, సద్గురునిదయగలిగినపుడే తగ్గిపోగలదు. సంతులసత్సంగము మెలకువతో చేసికొన్నపుడే, సద్గురునిదయ గలుగగలదు. ఏలననగా, సత్సంగము చేయనిచో, ఈవివేచనాశక్తి మేల్కొనుట దుష్కరము. సంతుమతప్రకార మాంతర్యబాహ్యములలో పరమార్థి అవలంబించవలసిన సత్ప్రవర్తననియమములుగూడ నప్పుడే అవగాహనకాగలవు. అప్పుడే అతడు సంతులు ఉపదేశించినసాధనను యథావిధిగా శరీరమనస్సుల సౌఖ్యము నాలోచించుకొనకుండా అభ్యాసముచేయగలడు. కొందఱు సద్గురువే స్వయముగా దయాకటాక్షములు అనుగ్రహింతురుకదా, మనమెందుకు అభ్యాసము చేయవలెను అని అభిప్రాయపడుచుందురు. ఈమాట సరియైనచో, సంతులు అభ్యాసముచేయునిమిత్తమై సాధన నేర్పిన దెందుకు? అభ్యాసము చేయించకుండగ వారుద్ధారమివ్వనే లేరా? కావున దీనినిబట్టి, నియమప్రకార మందఱును ప్రతిదినము నభ్యాసము

చేయుట ఆవశ్యకమని స్పష్టపడుచున్నది. ఎందుకనగా పారమార్థికాభ్యాసము కొద్దికొద్దిగా జరుగుచుండినయెడల అదంతయు, సహస్రదళకమలములో జమ చేయబడి బాగుగ వృద్ధియైనపుడు, అభ్యాసికి దాని ప్రకటఫలితము ఆంతర్యమున కనబడగలదు. ఇసుకగడియారములో ఇసుక పైనుండికొద్దికొద్దిగ జారుచున్న పుడు అదిమొదటలో కంటికి కనుపడదు కాని, అది పెద్దపోగుగనైనపుడు ఎట్లు కంటికి అగుపడునో, అటులనే పారమార్థికఫలితముగూడ నెమ్మదిమీదనే కన పడగలదు. కాని మనకిక లాభముకలుగనేరదని యెన్నడు నీవిషయములో నిరాశపడకూడదు.

రాధాస్వామీదయాళు రందఱకును కొంచె మాలస్యముగనో లేక తొందరగనో ఒకానొకరోజున తప్పక ఆంతర్యానందము మహాదయతో నను గ్రహించుటకు పూనుకొనియున్నారు. మనకు దొరకునో దొరకదో అనెడి నిరాశాభావ మెవరికి కలుగునో, వారు సత్సంగమే యెన్నడు చేసికొని యుండి యుండరు. అది వారిలోపము. వారు సంతులసత్సంగము చేసికొనియుండినచో, వారికి అట్టినిరాశాభావ మెన్నడును కలిగియుండదు. ఏలననగా, మనసోదరు లలో అనేకులు రాధాస్వామీమతములో పారమార్థికముగ నభివృద్ధిపొందినవా రున్నారనెడివిషయముకూడ దీనికి ప్రమాణముగ కనపడుచున్నది. కావున, మనము హృదయపూర్వకముగా పారమార్థిక కార్యక్రమము జరిపించినచో వారి కెట్లు పారమార్థికాభివృద్ధి గలిగెనో, అటులనే, మన అందఱిపైననుగూడ హుజూరురాధాస్వామీదయాళురు, దయాకటాక్షములను అనుగ్రహించెదరని పై దానినిబట్టిఅయినను మనస్సునకు నచ్చచెప్పవలసియున్నది. కాని దయ ప్రక టరూపములో నగుపించుటకు కొంతవిలంబ మగును. ఇందులోకూడ నొకదయా భరితమైన దివ్యేచ్ఛ యున్నది.

ఇంతియగాక సంతులుకూడ భగవంతుడువిధించిన ప్రకృతినియమములను తాఱుమాఱు చేయనొల్లరు. ప్రతిపదార్థమును నెమ్మదిగనే, పెద్దదగుట భగ వంతుడేర్పఱచిన యొక సృష్టినియమము. అందుచే సంతులుకూడ మెల్ల మెల్ల గనే తమబిడ్డలను సంరక్షించుకొనుచు నీవరదానమును సకాలములో ననుగ్ర హింతురు. రెండేండ్ల పసిపిల్లవాడు తన కొకకుమారుడు పుట్టవలెనని కోరినచో అది యెన్నడు సాధ్యముకాదుకదా. ఏలనన అది భగవంతునినియమమునకు

విశుద్ధము. అటులనే, యీజీవునుకూడ పారమార్థికవిషయములలో పసిపిల్లతో సమానమే కావున ఇతనికి అంతతొందరగ గొప్పఫలితము లెట్లు లభ్యము కాగలవు? సంతులు నాలుగుజన్మలు హద్దు పెట్టిరి. అదికూడ త్వరితమనియే తెలుసుకొనవలెను. ఏలననగా, పూర్వకాలపుయోగులు, యోగీశ్వరులును, వేలకొలదియేండ్లు, పాట్లుపడుచు నేయుండినను, వారికి సంతులపదవి లభ్యము కాలేదు. అందుచే హుజూరురాధాస్వామీదయాళుని శరణుజొచ్చిన జీవులందఱును తమకు మహాఅదృష్టముపట్టినదని తెలిసికొని సంతోషించవలయును, అనుక్షణము తమప్రభువునకు కృతజ్ఞతతో ధన్యవాదము లర్పించుచుండవలయును.

## 120

## కాలుని దేశములోని ఆత్మలు, వానికి గలిగెడి గతియు.

ప్రశ్న :—కాలుని దేశములోని ఆత్మలు దయాళుని దేశమును పొందగలవా లేక ఆయాత్మలు తమదేశములోనేగాని లేదా మార్గమధ్యమందుగాని యుండి పోవునా?

సమాధానము :—సంతులసమ్ముఖమునకువచ్చిన ఆత్మలెవ్వియు నవి కాల దేశముయొక్క ఆత్మలే అయిననుగూడ, దయాళుదేశమునకు క్రిందుగ నెన్నడు నుండిపోనేరవు. ప్రేమపత్ర అను పవిత్రగ్రంథములో, సంతుల కెవరైన నొక వస్త్రము నర్పణచేసినచో ఆవస్త్రమునేసినవానిని, దానికై ఉపయోగించబడిన ప్రత్తిని పండించినవానిని, ఆప్రత్తిని మొలవేసి పండించుటలో సహాయముచేసిన వానిని, వీరినందఱినికూడ సంతులు మూలధామమునకు అవశ్యముగా చేర్పించ గలరని అనేకస్థలములలో వ్రాయబడియున్నది. అట్టిపరిస్థితిలో సంతులయెదుట పడిన జీవులేల క్రింద నుండిపోగలరు? సంతులయెదుటపడిన జీవులందఱును నిస్సందేహముగా దయాళదేశమునకు చేర్పించబడుదురు. సారబచన్ పద్యగ్రంథములో నీవిధముగా వ్రాసిరి.

“జా పర్ దృష్టి పడీ మేరే గురు కీ
సోయీ పార గఈ ॥”

అర్థము :—మా సద్గురునిదృష్టి యెవనిపైనపడునో అతడు భవసాగరమును దాటిపోవును.

వారి పరమవిధి యట్లుండగా జీవుడు మార్గమధ్యమందే యెట్లు ఆగిపో గలడు ? మఱొకవిధముగ అనుకొనుట పూర్తిగా పొరపాటే. ఎవరును మన స్సున నట్టిసంశయమే రానీయకూడదు.

## 121

ప్రతివ్యక్తియు తనఆత్మను పరిశుద్ధిచేసికొని అంతశ్శబ్దమును శ్రవణము చేయుటకై ప్రయత్నముచేయవలయును.

జీవునకు రూపములవలనను, ధ్వనులవలనను ఆనందపడుట సహజలక్ష ణము, అనగా సుందరరూపము చూచినందువలనను, మధురధ్వనిని విన్నప్పు డును ప్రతిజీవుడు నానందపడుచుండును. ఇప్పుడు మనోహరముగనున్న యీ శరీరరూపములో ఆత్మయొక్క ప్రతిబింబమే యున్నది. ఈపిండములోనుండి ఆత్మ వెడలిపోయినచో, నీశరీరము భయంకరముగ నైపోవును. కావున దీని పైన కప్పియున్నకోశము సన్నగిలిపోవుచున్నకొలది ఇది యెంతయెక్కువ మనోహరముగ నైపోవుచుండును ! ఇదేవిధముగా నీప్రపంచములోని ధ్వనుల వలననే జీవునకు తనయొడలు మఱచిపోవునంతయధికముగ నానందమగ్నత కలు గజేయునట్టి సుఖము గలిగినచో, జీవుడు ఊర్ధ్వలోకములలోనికి ఆరోహించి అచ్చటిశబ్దములను విన్నపు డింక నెంతయధికముగ నానందమగ్నుడై పోవును ! కావున ప్రతిమానవుడును తనఆత్మను పరిశుద్ధముచేసికొని అంతశ్శబ్దమును శ్రవణముచేసికొనుటకై ప్రయత్నముచేయవలయును. అందువలన నత డీప్రపం చములో తనను సంతోషపఱచుచు, ఆనందభరితునిగచేయునట్టి మనోహరరూప ములను, శబ్దములను విడిచిపెట్టి వాస్తవములైన ఆంతర్యరూపములను ఆంతర్య శబ్దములను చూచియు, వినియు, ఆనందమగ్నుడై పోవును. అపుడు ఇతనికి భగవద్దర్శనము అజరామరమైన ధామమును లభించగలవు.

## 122

సంతులసంతతివారు సంతులు కానక్కఱలేదు.

సంతులసంతానము, సంతులఇంటపుట్టినహేతువుచే సంతుగతినిగాని, సాధుగతినిగాని పొందినవారగుదురని కొందఱభిప్రాయపడుచుందురు. కాని ఇది పూర్తిగాపొరపాటు. ఏలనన సంతుద్వారమును వీర్యద్వారమును వేఱువేఱుగ నున్నవి. ఆత్మ వీర్యద్వారమునుండి ప్రవేశించనేరదు. వీర్యములో నొక్కశరీర

పదార్థముమాత్రమే యుండును. సంతులకు ఇచ్చటియాహారమును అనగా పిండదేశపుటాహారమును స్వీకరించవలసినయవసరము లేదు. కాని వారు ఈ శరీరమనెడికోశమును ధరించుటచే ఆకోశమునకుతగినట్టి యీలోకసంబంధమైన ఆహారమునుకూడా తీసుకొనుచుందురు. ఇచ్చటి ఆహారము నుపయోగించుటచే తత్సంబంధమైనపదార్థము వారిశరీరములోగూడ నితరజీవులశరీరములోవలెనే తయారగుచుండును. కాని ఆత్మకు ఆపదార్థముతో నెట్టిసంబంధము నుండదు. కావున వారీమాయికపదార్థమును బహిష్కరించినపుడు దానితో శరీరములు తయారగుచుండును. ఈపదార్థము ఇతరజీవులలోకన్న నెక్కుడు పవిత్రమై యుండును కాని సంతులసంతతి, సంతులైపోవుదురని యనుకొనుట పూర్తిగా పొరపాటు. ఏలననగా, ఆత్మధార సంతులధారనుండి నేతై వచ్చి శరీరధారణముచేసినపుడే కాని అదిసంతు కానేరదు. అయితే సంతులశరీరమునుండి బహిష్కరించబడిన పదార్థముతో తయారగుటచే సంతులప్రసాదముగా భావించి, ఆసంతానమునకు ఆదరగౌరవములుచూపుట ధర్మమే అయినను, వారిని సంతులుగ నెంచుట పూర్తిగాపొరపాటు. సంతులు తమఅంశను ప్రత్యేకముగ వేఱుచేసి ఈపిండములోనికి పంపినపుడే సంతుఆత్మ పుట్టును. లేనిచో నెవరును సంతులకుమార్తెకానిండు, కుమారుడుకానిండు సంతులుకానేరరు. దీనినిబట్టి సంతులసంతతివారు సంతులఇంట పుట్టిరనెడి హేతుమాత్రముచే సంతుగతి లేక సాధుగతిని పొందనేరరని స్పష్టముగా తెలుచున్నది.

## 123

### అసలైన ప్రేమీభక్తుని లక్షణములు, మహిమయును.

ఎవనికైనను మతొకనియందు గాఢమైనప్రేమ యున్నపుడు అతడు తన ప్రియమిత్రునిఆజ్ఞలను సంతోషముతో పాలించుచుండుటయేగాక తనప్రియమిత్రు డింకను పనులు తనకు చెప్పవలయుననుకోరికతో నుండును. అతదేపని చెప్పిన నది వెంటనే మహాసంతోషముతో నెరవేర్చుచుండును. అదేవిధముగా భగవంతుని ప్రేమించినవారు తమప్రియతముని ప్రేమలో తన్మయమైపోయి తమ ప్రభువు తమ్మెట్లుంచిన అట్లే సంతోషించుచు, ప్రతికార్యములోను భగవదిచ్ఛనే ప్రధానముగ నెంచుకొనుచుందురు. మంచిరానిమ్ము, చెడురానిమ్ము ఏమైననుకూడ, నెప్పుడు కృతజ్ఞతాభావముతోనే యుందురు, ధన్యవాదము

లనే అర్పించుచుందురు. పైగా అసలైన ప్రేమీభక్తులు భగవంతుని నివ్విధముగ ప్రార్థించుచుందురు. "ఓ పరమపురుషా, లోకులందఱు నెట్టిదుఃఖము గలిగినచో భయభీతులై హాహాకారములను చేయుదురో, అట్టిదుఃఖమునే నాకను గ్రహించుము. ఆదుఃఖమును నేను, ఇది నాప్రియునివరదానము, ఇది నాకు శ్రేయస్కరము అని చెప్పుకొనుచు మహాసంతోషముతో సహించెదను. అది నా ప్రియతముని దివ్యేచ్ఛయని తలచుకొనుచు. ఆమహాకష్టములోనే నేను నా ప్రియతమునిప్రేమలో మునిగి తన్మయమైపోవుచుందును."

అట్టిభక్తు లీవిధముగాకూడా భగవంతునికి మొఱపెట్టుకొందురు. "ఓపరమపురుషా, మేము ఇక భవదీయులమే అయిపోయితిమి, మమ్ము నగ్నిగుండములో పాఱవేసినను పారవేయుడు, లేదా పర్వతశిఖరమునుండి క్రిందకుత్రోసివేసినను త్రోసివేయుడు లేక నొకమహానదిలో పాఱవేసి కొట్టుకొనిపోవునట్లు చేయుడు. తమరు మమ్మెట్లుంచిన నట్లుండుటయే మాకు మహాసంతోషము. కాని తాముమాత్రము మమ్ము మఱువకూడదు, తమరు మఱచినచో మేము మరణించిపోవుదుము. తాము మమ్ము మఱచినచో మాజీవితము గర్హణీయము. మాకు ఆంతర్యమునను, బాహ్యమునను గూడ నెల్లపుడు తమదర్శనము అగుచుండునట్లు మామీద ప్రేమవర్షము కురిపించుడు." ఇట్టిప్రేమీభక్తుని భగవంతు డొక్కక్షణమైన విడనాడలేడు. అతనిపైన భగవంతుని కట్టిమహాదయ గలుగును.

తల్లి తన పసిపిల్లను దూరముగ విడనాడుట కెట్లిష్టపడదో, అటులనే పరమపురుషుడు తనప్రేమీభక్తులను శబ్దమనెడి తనయొడిలో ననుక్షణము నుంచుకొని కాపాడుచుండును. అట్టిప్రేమీజనునియొక్క రోమరోమములనుండియు, ప్రతినాడినుండియు శబ్దము, అమృతము, శీతలతాధారము ఝంకారము చేయుచుండును. అట్టిభక్తు డిరువదినాల్గుగంటలు, ఎల్లప్పుడును శాంతచిత్తుడై యుండును. అట్టిభక్తుడు తనసద్గురునిదప్ప మఱెద్దియు కోరడు, మఱెవ్వరి నాశ్రయించడు. అట్టి జీవులు మహాభాగ్యశాలురు. అట్టివారితో భగవంతుడు అనుక్షణము కేళిసలుపుచుండును.

అట్టిభక్తుల కీలోకములోగలమానవులు, పశుపక్ష్యాదిజీవులందఱిలోను, తమప్రియతముడైన రాధాస్వామీదయాళురే కనపడుచుందురు. నీరు నింపి

యున్న అనంతసంఖ్యాకమైన కుండలన్నిటిలోను సూర్యుడు తనప్రతిబింబము నెట్లు ప్రతిఫలింపచేయునో అట్లే హుజూరు రాధాస్వామీదయాళురుగూడ సకల జీవులయందును వ్యాపించియున్నారు, మహాభక్తులకు సమస్త జీవులలోను హుజూరు రాధాస్వామీదయాళురే కానవచ్చుచుందురు. సూర్యకాంతి నిర్మల మగుజలములో నెట్లు అధికప్రకాశముగ ప్రతిఫలించునో అట్లే అసలైన ప్రేమీ భక్తునకు ప్రేమీసత్సంగులలో రాధాస్వామీదయాళుని జాజ్వల్యమానప్రకాశము అధికముగ కన్పట్టుచుండును. కావున నతడట్టిపరమార్థులతో కలిసిమెలిసి తిరుగుచుండును, ఒక్క హుజూరు రాధాస్వామీదయాళురుదప్ప మఱెవ్వరును నతనిదృష్టికి గోచరింపరు. అట్టివానికి అంతర్యమునను, బహిర్గతముగనుగల ద్వారములన్నియు వికసించియుండును. ఇరువదినాలుగుగంటలు నతడు మహా శాంతముగను, మహాతన్మయత్వముగల్గియు నుండును.

అట్టిప్రేమీభక్తునిసాంగత్యము లభించినవారందఱునుగూడ మహాభాగ్యవంతులు. అట్టివానిశీతల తాప్రభావము అతనితోకూడనున్నవారిమీదగూడ నవశ్యము పడుచుండును. అందువలననే సాధుసాంగత్యమునకు అత్యద్భుతమహిమ చెప్పబడినది. కావున నిప్పుడు హుజూరు రాధాస్వామీదయాళుని మహాదయకేమైన అంతుదరియు గలవేమో ఆలోచించుకొనుడు. వారిచరణముల నాశ్రయించినవారందఱికి నెప్పటికైన సహజముగ ప్రేమదానము తప్పక ప్రసాదించబడితీరును. ఈవిషయములో మీరెన్నటికి నిరాశ చెందనవసరములేదు. మా మూలుప్రకారము ప్రేమపూర్వకముగ నభ్యాసము నియమముగ చేయుచు, నిట్లు లోలోపల ప్రార్థనకూడ చేయుచుండవలయును, "ఓ పరమపురుషా, నాకు తమఱొక్కరుదప్ప మఱెద్దియు ప్రియముగ నుండకుండగను, సమస్తమును మరచియుండునట్లును ఉండునంతటి యుత్తమప్రేమభావమును అనుగ్రహించుడు." ఇట్లుచేయుచు, మఱియు నాభగవంతుని దివ్యేచ్ఛతో శక్తికొలది అనుకూలించుచుండవలయును. అప్పుడు దయ నిస్సంశయముగగలుగును.

## 124

### రాధాస్వామీనామముయొక్క మహిమ.

ప్రశ్న :—రాధాస్వామీనామము నభ్యాసముచేయువలసినఅవసర మేము

న్నది ? అది కేవలము మనస్సు నేకాగ్రముచేయుటకే కదా ! కావున మఱే నామమునైన నెందుకు జపించకూడదు ?

జవాబు :—రాధాస్వామీనామ మీసమస్తసృష్టికిని ప్రభువగు పరమ పురుషుని నామము. మిగతనామములన్నియు దానిక్రిందనున్నలోకములకు చెందిన నామములు. రాధాస్వామీనామమునుతప్ప మఱేనామమునభ్యాసము చేసినను దానివలన నేమియు లాభముండదు. ఈమతమునకు నితరమతములకును పోలికయే లేదు.

రాధాస్వామీనామము సృష్టికర్తయగుపరమపురుషుని నామమయిన ట్లీవిధముగ రుజువుచేయవచ్చును. ఈలోకములోని పదార్థములయొక్క భండారములన్నిటికిని రెండుధారలు, ఒకటి ఆభండారమునుండి బయల్వెడలి క్రిందికి పోవునదియు, రెండవది క్రిందినుండిపైకి ఆభండారమునకు తిరిగివచ్చునదియును, ప్రవహించుచున్నవి. క్రిందికివచ్చునట్టి ధారయొక్కనామము "రాధా"యు, పైకిపోవునట్టిధారయొక్కనామము "స్వామీ"యు నైయున్నవి. ఈలోకములో నేపదార్థమును తీసికొన్నను ఈసాదృశ్యము అన్నిటికినున్నది. ఉదాహరణార్థము ! యీలోకమునగల వేడిఅంతయు సూర్యునిపైన ఆధారపడియున్నది. సూర్యునివేడి లేకుండినచో భూలోకమున వేడికాని కాంతికాని యెన్నడుగలుగ నేరదు. కావున "రాధా"యు "స్వామీ"యు లేకుండగ నీలోకమున నే కార్యక్రమము పూర్తికానేరదు. అనగా ఈకార్యకలాపమంతయు భండారముమీదను ధారమీదనే ఆధారపడిజరుగుచున్నది. రాధాస్వామీనామము ధ్వన్యాత్మకనామముకాని కృత్రిమనామముకాదు. ఏఅభ్యాసికైన నాంతర్యమున కొంతవఱకైన నూర్ధ్వగతి సంప్రాప్తించినచో అతడు ఆనామమును అంతర్గతముగా గుర్తుపట్టగలడు. ప్రతిస్థానమందును రాధాస్వామీధ్వని వినిపించగలదు. అందుచే రాధాస్వామీనామముయొక్క మహాత్మ్యముతో సమానమైన మహాత్మ్యము మఱియేనామమునకు నుండనేరదు.

## 125

### రాధాస్వామీమతముయొక్క మహాత్మ్యము వర్ణనాతీతము.

లోకములో ప్రచలితమైయున్న యితరమతములవలన జీవుల కేమియు

లాభము గలుగుటలేదు. అందుకు కారణమేమనగా, అమతిములలో నుపాస్య దైవములు, ఉదాహరణకు రామ, కృష్ణ, వ్యాస, వసిష్ఠ, శుకదేవులు, ఈకాలములో లేరు, అనగాగతించిరి. ఇప్పుడు వారిని ఉపాసనచేసినందువలన, నాయుపాసకులకు పూర్వకాలములోగల్గినవిధముగా సంరక్షణగలుగనేరదు. ఒకవేళ రక్షణగలిగినను ఆయుపాస్యదేవతలు, తామేలోకమువఱకు సిద్ధిపొందిరో అంతవఱకే తమఉపాసకులను చేర్పించగలరు, అప్పైనున్న దయాళుదేశమునకట్టి యుపాసకు లెన్నడు జేరుకొనలేరు. సంతుమతిముయొక్క మహాత్త్వమేమనగా, నీమతోపాసకుల కాంతర్యమున సంత్ సద్గురువే స్వయముగ సంరక్షణచేయుచు వారిచే నభ్యాసముచేయించి నెమ్మదిగా వారిని రాధాస్వామీధామమునకు తీసికొనిపోవుదురు. ఉద్ధారకార్యము జరిగించెడిధార ప్రస్తుతము రాధాస్వామీధామమునుండి వచ్చుచున్నది. అందుచే నీమతిముయొక్క మహత్త్వము వర్ణనాతీతము.

## 126

### తల్లికిని భగవంతునికిని పోలికలు.

తల్లి తనపిల్లవానినిచూచి యెప్పుడు నానందించుచుండును. అనగా ఆ పిల్లకు తిండిపెట్టి, పాలుపోసి, బట్టకట్టి యెప్పుడు నాపిల్లవానినిచూచి సంతోషించుచుండును. ఆపిల్లవానిని సుఖపెట్టుటకే యెప్పుడు ఆలోచించుచుండును. అదిగాక తల్లి పిల్లవాని సుఖశాంతులకొఱకే పాటుపడుచున్నను, ఆమె తనకు బాధకలుగచేయుచున్నదని పిల్లవాడు భావించుకొనునట్టిపరిస్థితు లనేకముగ వచ్చుచుండును. ఎట్లనగా, పిల్లవానికి వ్రణమువేసినపుడు తల్లి ఆవ్రణమును కోయించినచో పిల్లవాడు తనతల్లి తన్నుబాధపెట్టుచున్నట్లు తలంచుకొనును. కాని, తల్లి అతనికి బాధను పోగొట్టునిమిత్తమే ఆపని చేయించెను. అదిగాక ఆపిల్లవానికొఱకై యెన్నియోవిధములైన కష్టములనుగూడ నామె సహించుచుండును. అదేవిధముగా భగవంతుడు తనపిల్లవాని ఆటలుచూచి సంతోషించుచు తల్లివలె నెల్లపుడు నతనిని కాపాడుచుండును; అతనికి అన్నివిధముల సుఖమును కలుగజేయుచుండును. భగవంతుడు చేసినది మనకు కష్టముగ కన్పించినను కన్పించవచ్చును. కాని, అందులోకూడ తప్పక నేదోయొక మహాలాభ ముండుచుండును. తల్లిపడిన కష్టమునకు పసిపిల్లవాడెట్లు ఋణము

తీర్చుకొనలేడో, అటులనే ఆభగవంతుడు చూపెడిదయకుకూడా యీజీవుడు కృతజ్ఞత నెట్లు చూపగలడు? కావున ప్రతిజీవుడును భగవంతుడు చూపెడి యీవిధమైనదయకు ధన్యవాదము లెల్లప్పుడు నర్పించుచుండవలయును.

## 127

**జీవునిబంధనముల కాఠిన్యము—ఆబంధనములను త్రెంచుటలో రాధాస్వామిదయాళుని మహోదయము.**

ఎవరైనను కారాగృహమునుండి విడుదలై పోయినపిమ్మట, కారాగృహ కష్టములను అతడు మఱచిపోవును. మఱియు, తనను అచ్చటినుండి విడిపించిన మనిషి తనకుచేసినయుపకారమును తెలిసికొనలేడు. అటులనే యీజీవునికి తనకు పడియున్నబంధనములవిషయమై యేమియు జ్ఞానముండదు. ఆబంధనములనుగుఱించి జ్ఞానము లేనంతకాలము తనకు బంధవిమోచనము కలిగించువాని విలువనుగూడ జీవుడు తెలుసుకొనలేడు. బంధవిమోచకునివిలువ తెలియనంత కాలము జీవునకు ఆధ్యాత్మికలాభము సంపూర్ణముగా లభించనేరదు. అతనికి ఆబంధనములనుగుఱించి తెలిసినప్పుడే విషయముబోధపడును. ఎవనిధనమునకైన హానికల్గినను, లేదా ధనముపోయినను అతడెంతబాధపడునో చూడుడు. అన్నపానాదులనుకూడా తీసికొనుట మఱచిపోవును. ఈనష్టమువచ్చినప్పుడు కలిగెడి దుఃఖమే ధనముయొక్క బంధనము. ఇదిబంధనమే కానిచో అతనికెంతమాత్రము దుఃఖముకలుగకపోవుటయేగాక, నతడు ఆభగవదిచ్ఛకై సంతోషించుచుండును. ఇటులనే తనబంధువున కెవనికైన బాధవచ్చినపుడు దుఃఖముకలుగుచుండుటయే కుటుంబబంధనకు సూచన. తనకుటుంబపరివారమునందు బంధనమే లేనిచో నతనిచిత్తమున నెంతమాత్రము దుఃఖము కలుగకుండగ నుండిపోయెడిది. దీనిని బట్టి జీవున కీజగత్తుయొక్క బంధనములు పడియున్నట్లు స్పష్టముగ తేటపడు చున్నది. అన్నిటికన్న గొప్పబంధనము శరీరబంధనము. శరీరమునకు కొద్దిగ బాధ కలిగినంతనే జీవుడన్నియు మఱచిపోవును. ఆసమయములో నతనికేవిషయమును రుచించదు. ఈశరీరముతో బంధనమేలేకుండినచో నతని కట్టిపరిస్థితియే కలుగకపోవును. ఈమహాగాఢబంధనములు పడియున్నవిషయము జీవునకు గోచరముకానంతకాలము అతనికి ఆబంధనములు తెగిపోనేరవు, బంధవిమోచకుని విలువయు అవగాహనకానేరదు. ఆజీవునకు విముక్తియు కలుగనేరదు. అందువలననే జీవునికి సుఖములు, దుఃఖములు, కష్టములును కలుగుచుండును.

దయాళురయిన సద్గురువు ఈజీవునిబంధనములను తెగగొట్టుదురు. ఆత్మకు బంధనములు తెగి అది కొంతవఱకు ఆరోహణచేసినపిమ్మట తనఆత్మకెట్టి గొప్పబంధనములు పడియుండెనో వానిని తెగగొట్టుట కెంతకష్టమయ్యెనో జీవునకు బోధపడును. ఈబంధనములవిషయమై అతనికి బోధపడినపుడు, తనకు మోక్షమునిచ్చినవారు హుజూరురాధాస్వామీదయాళురని తెలిసి, వారి మహిమను వారినామముయొక్క మహిమను అతడు తెలిసికొని వారికి ధన్యవాదము లర్పించుచు పైగా తనప్రాణములనుగూడ నర్పణచేయుటకై సిద్ధపడును. తన ఆత్మభండారముయొక్క మహిమ అతనిచిత్తమున నాటుకొనినపుడు అభ్యాసముగూడ నతనికి బహుసునాయాసముగా జరిగిపోవనారంభించి కొంతకాలమునకు సంతుల దయాప్రతాపమువలన నతడు తననిజధామమునందు ప్రవేశించి, తన భాగ్యమునకు సంతోషించును, రాధాస్వామీదయాళునికి నిజమైన ప్రేమపాత్రుడగును. అప్పుడే అతనికి సంతసద్గురువుయొక్క మహిమ బోధపడును.

## 128

### సురతు, నిరతులను గుఱించి.

ప్రశ్న :—సురతునకు, నిరతునకు భేదమేమి ?

సమాధానము :—చైతన్యధార స్వస్వరూపములో కలిసిపోవుట అనగా, తనలోతానురతమైపోవుటయే సురత్ అనిచెప్పబడును. "నిరత్" అనగా రతమైపోయినపిమ్మట వేఱుగనుండుట. ఎట్లనగా శరీరము మత్తెక్కినపిమ్మట స్మృతి పూర్తిగా నశించిపోకుండ కొద్దివిచక్షణశక్తికలిగి యుండునట్టిపరిస్థితి.

## 129

### రాధాస్వామీదయాళురు బంధనములను తెగగొట్టు విధానముల వర్ణన.

బంధనములన్నియు తెగిపోయినపిమ్మట సంపూర్ణమైన ఆనందమగ్నతయు నిశ్చింతతయు చేకూరును. అయితే సకలవిధబంధనములును తెగిపోవలయును. ధనబంధనమనగా ధనసంబంధమైనసకలబంధనములు నందులో చేరియున్నవి. మనస్సుయొక్కబంధనమనగా, తనమనస్సుయొక్కయు, తనసన్నిహితులమనస్సుయొక్కయు బంధనములన్నియు నందులోచేరును. శరీరముయొక్కబంధనములో

తనశరీరమొక్కటేగాక తనబంధువులశరీరములుకూడా చేరియున్నవి. చెప్పవచ్చినదేమనగా, వశిష్ఠులవారు సెలవిచ్చినట్లు, గౌరవప్రతిష్ఠలుమున్నగు సకలవిధ బంధనములును తెగిపోవలయును. మామూలుగనున్నపుడు జీవు డొకొక్కక సమయములో తనకొకప్రత్యేకపదార్థముతోనో ప్రత్యేకవ్యక్తితోనోగల బంధనము నశించిపోయినదని అపోహపడవచ్చును. కాని ఆపదార్థమునకు గాని వ్యక్తికిగాని యేవైననష్టకష్టములు గలిగినపుడు తనకింక నెంతబంధనము వానితోపడియున్నదో బోధపడగలదు. ఆపదార్థమునకు లేక వ్యక్తికి నాశముగాని హానిలాభములు కాని గలిగినపుడు తనకెట్టిసుఖదుఃఖములును కలుగకుండినపుడే అతనికి ఆబంధనములు తెగిపోయినట్లెంచుకొనవలయును. అప్పుడే తన కాబంధనము నశించినదని నమ్మకొనవచ్చును. ఇతరజీవులకు సుఖదుఃఖములు కలిగినప్పు డితని కెట్లు సుఖదుఃఖము లెంతమాత్రము గలుగవో, తనకుసుఖదుఃఖ పరిస్థితులు కలిగినపుడుగూడ నట్లే ప్రవర్తించినయెడల నుత్తమముగనుండును.

కావున రాధాస్వామీదయాళు రీబంధనములన్నిటిని నెమ్మదినెమ్మదిగ ఒకొక్కకపుడు జగడములనుపుట్టించియు, నొకొక్కకప్పుడేదైనరోగములను కలుగజేసియు, తెగగొట్టివేయుదురు చెప్పవచ్చినదేమనగా, బంధనములు తెగగొట్టు నిమిత్తమై వారియొద్ద అనేకయుక్తులుగలవు. ఇటులనే మనస్సులోపడియున్న మోహబీజములనుకూడ దహించివేయుదురు. ఉదాహరణకై కుటుంబస్థులలో కొట్లాటలుబయలుదేరి, ఒకరిమీదనొకరికి మహావిరోధముపుట్టినచో వారందరికిని గల పరస్పరబంధనములు కొంతకాలమువఱకు తెగిపోవును. పిమ్మట వారు తిరిగి కలిసినను అంతనష్టములేదు. ఏలననగా బంధనముయొక్క మూలము తెగిపోయినది, అనగా, మోహబీజము నాశనమైపోయినది. శరీరబంధనము నిజముగ చాలకఠినమైనదే. ఏమానవునికైనను ఏయంగమునుండికావలెనన్న నాయంగమునుండి చైతన్యధారను నీళ్ళపంపులోనుండి నీటి నెట్లు కావలసినపుడు వదలుచు నక్కఱలేనపుడు వెనుకకు త్రిప్పివేయుచుందురో, ఆవిధముగా నెప్పుడు కావలెనన్నపుడు త్రిప్పివేయగలసమర్థత గలిగినపుడే యీబంధనము తెగిపోయినట్లు చెప్పవలెను. గాఢమైనఅభ్యాసము చేయనిదే యిట్టిసమర్థత గలుగనేరదు. ఇట్టిపరిస్థితి గలిగినపుడే అభ్యాసికి మహానందతన్మయత్వములు, వైరాగ్యమును లభ్యముకాగలవు. ఎట్టి భగవదిచ్ఛనైనను సహించుకొని సంతోష

ముగనుండుట కష్టమే అతనికి శక్తిగల్గును. అప్పు డతనికి, ఒక చీముపట్టిన పుండునకు శస్త్రముచేసి, ఆచీమునంతను తీసివేసినపిమ్మట నాబాధ అంతయు పోయి సుఖముగనున్నట్లే యుండును. ఈవిధముగ తనచిత్తవృత్తులను బాహ్యమునుండితప్పించి అంతశ్శబ్దమునందు లగ్నముచేసి దాని ఆనందమును పొందుటయే అభ్యాసమువలన గలిగెడి లాభము. దీనికే అభ్యాసమని పేరు. దీనివలననే బంధనములన్నియు తెగిపోవును.

## 130

ఒక ప్రశ్నయు, సమాధానము.

ప్రశ్న :—ఎవరైనను హుజూరుమహారాజువారిని సద్గురువుగను, భగవంతునిగను మన్నించినపుడు, ఆతరువాత మఱొకసద్గురువు నతడు ఆశ్రయించవలసిన యవసరమేమున్నది ?

సమాధానము :—హుజూరుమహారాజువారి నిజస్వరూపము అంతర్యామునెవనికి ప్రకటమగునో అట్టివానికి తిరిగి మఱొకస్వరూపమును ప్రకటముచేసికొనవలసినఆవశ్యకత యేలగల్గును ? తిరిగి హుజూరుమహారాజువారు మఱొక దేహస్వరూపములో ప్రకటమైనచో, మొదటిస్వరూపమునకు ఆరెండవస్వరూపమునకును భేదమేమియునుండదు. ఏలనన నారెండుస్వరూపములును శబ్దస్వరూపముతోకలిసి యేకమైపోయినవి. కావున నారెండును ఒకేస్వరూపముగ నెంచబడుచున్నవి.

## 131

దయాళుదేశమునకు ప్రయాణము అంతర్యాభ్యాసము చేసినందువలననే సాధ్యమగును.

సూర్యునివద్దనుండి ప్రకాశము వచ్చుచున్నది. దానిని రకరకముల అద్దపుపెంకులగుండా పోనిచ్చిన వివిధములైనరంగులు బయలువెడలుచుండును. ఎట్లనగా, ఒకటి ఎఱుపురంగు, అందులో తాపముండును ! రెండవది నలుపు రంగు, ఇది తమోగుణము ! మూడవది, తెలుపుకలిసిన లేపసుపురంగు. ఇది సత్వగుణము. ఇట్లే అనేకనక్షత్రములనుండివచ్చుచున్న కాంతికిరణములలో నీ

సత్వరజస్తమోగుణములరంగులు కలిసియున్నవి. దీనినిబట్టి యీ సూర్యునివద్ద నుండియు, నక్షత్రములనుండియు వచ్చెడి యీత్రిగుణములధారలకు వేఱువేఱు భండారములు ఈ సూర్యుడు తారలకంటెనుపైన వేఱుగా నుండవలెనని తేట పడుచున్నది. ఏలననగా భండారము ఎప్పుడును వేఱుగ పైననే ఉండును. కావున ఈత్రిగుణములయొక్క భండారములును తమధారల నీసూర్యనక్షత్రాదులద్వారా పంపుచు నవిమాత్రము వీనికిపైన బ్రహ్మాండములో నుండును.

ఈవిధముగానే బ్రహ్మాండదేశమున్నట్లుగా. ఈసృష్టినిచూచుటవలన, నమ్మకముకలుగగలదు. దానికిపైనున్న దయాళుదేశమునుగుఱించి విశ్వాసము మాత్రము మీవిధముగ గలుగనేరదు. అది అభ్యాసముమీదనే ఆధారపడి యున్నది. అందువలననే ప్రాచీనకాలపుసంతులు సృష్టియొక్కరహస్యము లేమియుచెప్పక, అభ్యాసముచేసి స్వయముగ చూచుకొనుడని సెలవిచ్చిరి. ఇప్పుడు రాధాస్వామీమతస్థులుగూడ ఉత్తసహేతుకవిమర్శలను బాహ్యముగ సేవయు సత్సంగమునుమాత్రము చేసుకొనుచుండినచాలునని తృప్తిపడినచో సంతుమతములోకూడ వాచకజ్ఞానమే ప్రధానమైపోగలదు. నిస్సంశయముగ బాహ్యమైనవిమర్శయు, భక్తికార్యక్రమమును, అత్యవసరమే. అందలిఫలితము గూడ గొప్పదే. అయినను ఆంతర్యాభ్యాసము చేయకుండనుండినచో నేమియు ప్రయోజనము లేదు. ఉత్తబోధలు, విమర్శలు నెందుకు పనికిరావు. మెలకువతో సత్సంగమును అభ్యాసమునుగూడ చేసికొనుట చాలయావశ్యకము. ఈపని ఒంటరిగ చేసికొనుటకన్న సత్సంగములోనుండినచో నెక్కువబాగుగా సాగును. కాని సత్సంగములోకూర్చుండి నిద్దురపోకూడదు. చేతనైనంతవఱకు మెలకువగ నుండవలయును. సంతసద్గురువు సమ్ముఖముగనున్నచో వారిదర్శనము భక్త్యుత్సాహములతో చేసుకొనవలయును. వారివచనములను విన్నందువలన హృదయమున ప్రేమకొఱకై ఆసక్తి పెంపొందును. అదియ సద్గురుని మహావరదానము.

## 132

## అసలైన ప్రేమయొక్క మహిమ, దానిని సంపాదించు ఉపాయము.

తన లోలోపలనున్న ఆత్మధార శబ్దధారతో తన్నుతాను పూర్తిగ

మఱచిపోవునంతగ నేకమైపోయి, ఇతరాలోచన లెవ్వియు లేకుండ నుండిపోవుటయే నిజమైనప్రేమయొక్కస్వరూపము ఇట్టిప్రేమ ఒక్కక్షణకాలమైనను మేల్కొన్నయెడల, నది అనేకసంవత్సరములయభ్యాసముకన్న శ్రేష్ఠతరము. అయిన నెవరును నిరాశపొందనక్కఱలేదు. ఈవరదానము సద్గురువు ఇచ్చునట్టిదే. సద్గురువు ప్రేమకణము నెవనికైన ప్రసాదించినపుడే ఇట్టిపరిస్థితిగల్గుట సాధ్యమగును. కావున మొట్టమొదట సద్గురుచరణములందు ప్రేమను పెంపొందించుకొనవలయును, పిమ్మట సత్సంగమును, అభ్యాసమును నియమముగ చేసుకొనుచుండవలయును. ప్రేమను సంపాదించుట కుపాయమిదియే. అటుపైన వారిదయపైన పూర్ణవిశ్వాసముకలిగియుండి, తనకార్యమంతయు సద్గురువే నెరవేర్చుచున్నారను వివేకము కలిగియుండవలయును. ఏవిషయమునందును తన అహమికను రానివ్వకూడదు. ఈక్రిందిద్విపదలో చెప్పినట్లుగా :—

"జబ్ హామ్ థే తబ్ గురు నహీం, అబ్ గురు హైం హామ్, నాహీం—
ప్రేమ గలీ అతి సాంకరీ, తామేం దోఉ న సమాహీం —

అర్థము :—నాలో అహం ఉన్నంతకాలము గురువు లేకుండెను, ఇప్పుడు నాలోనుండీ "నేను" పోయినది, గురువొక్కరే యున్నారు. అనగా, నేనుఅనెడి అహంభావము, సద్గురువునందు గురుభావము, ఈరెండును పరస్పరవిరుద్ధములని భావము. ప్రేమమార్గమతిసూక్ష్మము, ఆమార్గములో నొకేసమయమున. ఇరువురు నిలబడుటకు చోటులేదు. అనగా, అహంభావమున్నంతవఱకు గురుభక్తి సంపూర్ణముగా నుండనేరదనియు గురుభక్తిసంపూర్ణమయినపుడు అహంభావము పూర్తిగా నశించిపోవుననియు దీనిభావము.

## 133

### ఆత్మయొక్క స్వరూపము.

ప్రశ్న :—ఆత్మయొక్క స్వరూప మెట్లుండును ?

సమాధానము :— చిత్తము ఆత్మయొక్కస్వరూపము. ఎచ్చటనైనను మనోహరమైనపాట పాడుచున్నను, వాయిద్యము వాయించుచున్నను, లేదా అందమైనస్వరూపము కనపడినను, వానిని వినుటచూచుటయందును చిత్త మెంత ఆకర్షితమగుచున్నదో మనము చూచుచునేయున్నాము. నోటిపాటయు, నింకఅన్నిరకములవాయిద్యములునుకూడా అంతర్యశబ్దమునకు పోలికలే. అటు

లనే కంటికి మనోహరముగనగుపడునట్టి సుందరరూపము, కొన్నికోశముల వెనుక నుండి కంటికగుపడుచున్న ఆత్మస్వరూపమే. కావున ఆత్మ నిరావరణముగ నున్న స్థానములో దానిస్వరూప మెట్లుండునో, అచ్చటశబ్దముయొక్క రూపమెట్లుం డునో ఊహించుకొనుట యెట్లుసాధ్యమగును? ఇకనీయాత్మ ఏభండారము యొక్కఅంశయో, ఆపరమపురుషుని పరమసుఖావహస్వరూపమునుగురించి చెప్పుననేమున్నది.

## 134

### నిజమైన ప్రేమ.

ప్రశ్న :—నిజమైనప్రేమ యెట్లుండును?

జవాబు :—పసిపిల్లవాడు, తనతల్లి నెట్లు విడిచిపెట్టకుండ, తల్లికొట్టినను కూడ ఆమెనేకౌగలించుకొని మరెచ్చటికినెట్లుపోడో, సద్గురువునుకూడ నట్లే ప్రేమించవలయును. నిజమైనప్రేమయనగ నదియే. సద్గురువు తిట్టికొట్టినను కొట్టుగాక, కాలునిద్వారా ఎన్నికష్టములైనను కలుగుగాక, సద్గురువునుమాత్రి మెన్నడు విడువక వారిచరణములనే కౌగలించుకొనియుండవలయును. అట్టి భక్తజనునిప్రేమయే నిజమైనప్రేమ. అట్టిప్రేమకే ఫలితముగూడ లభించగలదు.

## 135

జీవుడు పిండములోజరిపించుచున్నట్టి కార్యక్రమమునకును, భగవంతుడు విశ్వసృష్టిలో జరిపించు కార్యక్రమమునకును పోలికలు. భగవంతుడు జీవుల విషయములో చూపుచున్న మహోదయయొక్క వర్ణన.

మనఆత్మధారలు ఇంద్రియములద్వారా పైకివచ్చి స్థూలపదార్థములతో కలిసినపుడు మనకు సుఖము ఆనందమును కలుగుచుండును. స్థూలపదార్థము లన్నిటిలోను కొద్దిగొప్పచైతన్య మున్నది. చైతన్యమెక్కువగనున్న పదార్థ ములోని కాత్మధార విశేషముగ ప్రవహించును, తక్కువచైతన్యమున్న పదార్థ ములోనికి తక్కువగా పోవును. విశేషధార వెళ్లుటవలన విశేషానందమును, అల్పధారపోవుటవలన తక్కువ ఆనందమును లభించుచుండును.

ఈపదార్థములస్వాదమును తీసికొనుటకై శరీరములోద్వారములున్నవి.

త్వగింద్రియము స్థూలపదార్థములస్వాదమును స్వీకరించును. అనగా యీచర్మ ద్వారముచే స్పృశించుటవలన వస్తువులు వస్త్రములు మున్నగు స్థూలపదార్థ ములజ్ఞానము కలుగును. ఇంతకన్న సూక్ష్మమైన ద్రవముయొక్క స్వాదము జిహ్వేంద్రియముద్వారా గలుగుచున్నది. స్థూలపదార్థములయొక్క సూక్ష్మాతి సూక్ష్మములై గాలిలోవ్యాపించునట్టి సుగంధరూపమైన పరమాణువులస్వాద మును నాసికేంద్రియముద్వారా పొందుచున్నాము. స్థూలపదార్థములయొక్క మహాసూక్ష్మరూపముయొక్క జ్ఞానమును నేత్రేంద్రియముద్వారా పొందు చున్నాము. సకలపదార్థములకు ప్రాణభూతమైన శబ్దముయొక్క జ్ఞానమును శ్రోత్రేంద్రియముద్వారా పొందుచున్నాము. పర్యవసానమేమనగా ఆత్మ ఇచ్చటనున్న సకలపదార్థములయొక్క జ్ఞానమును మనస్సుఇంద్రియములద్వారానే పొందుచు వానితో విలాసముచేయుచు నానందించుచున్నది. అట్లే భగవం తుడుకూడ నొకవిలాసరూపముగ నానందించునిమిత్తమే యీసృష్టిని రచించెను. పరమపురుషునిలో నొకభాగములో క్రిందుగనున్న చైతన్యము నిద్రావస్థలో కదలికలేకుండ ధూళిరూపమున పడియుండెను. పరమపురుషుడు ఆధూళిని జాడించి (అనగా అందులో కంపనముకలుగజేసి) తరగతులవారిగా సృష్టిని చేసెను. ఆధూళికూడ నొకచోట సూక్ష్మరూపముగను, ఒకచోట స్థూలరూప ముగను వేఱువేఱు తరగతులుగ నేర్పడియుండెను. అప్పుడు ముందు ద్రావము లను సృజించి, తరువాత హంసలసృష్టిని, అటుపిమ్మట బ్రహ్మసృష్టిని రచించెను. పిమ్మట దేవతలను, మానవులను, చతుర్యోనులను సృష్టిచేసెను. వీరందఱికిని చైతన్యమును, ఆనందమును ఒక్కొక్కరికి ఒక్కొక్కతరహాలో ప్రసాదించిరి. అసలు ఏమియునివ్వకుండ నెవరిని విడిచిపెట్టలేదు. కీటకములు, తుమ్మెదలనుం డియు నందఱకును, కొందఱకు అధికముగను, కొందఱకు అల్పముగను చైతన్య మును ప్రసాదించి. భగవంతుడు బహుశృంగారముగ సృష్టిచేసి స్వయముగ నానందించి విలాసముచేయుచు సమస్తజీవులకునుగూడ వారివారితరహాలకు తగి నట్లుగ నానందమును విలాసమును కలుగజేసెను.

ఈ ప్రపంచములోని జడపదార్థములలో విశేషచైతన్యముగలపదార్థము లందు జీవుడెట్లు ఎక్కువఅభిమానమునుచూపి, వారికే యెక్కువగనెట్లు సంర క్షణచేయుచుండునో, భగవంతుడుకూడ నట్లే హంసలతో నెక్కువగ విలాసము సల్పుచు హంసలసంరక్షణ యెక్కువగచేయుచుండును. అయితే నిజమునకు

భగవంతుడు అందఱితోను వారివారి తరహాలకు తగినట్లుగా విలాసములు చేయుచునేయున్నాడు. కాని, విశేషముగ చైతన్యమున్న చోటికి పరమపురుషుని చైతన్యధార యెక్కువగను, న్యూనముగ చైతన్యమున్న చోటికి తక్కువగను ప్రవహించుచుండును. ఆవిధముగనే భగవంతుడు జీవులందఱితోను వారివారి తరహాకు తగినట్లుగ విలాసములుసల్పి వారిని ఆనందపరచుచు తిరిగి అంతర్ముఖుడై తనలోతాను తన్మయత్వము నొందియుండును. ఆత్మకూడ నట్లే జడపదార్థములతో క్రీడావిలాసములు చేయుచు, మరల అంతర్ముఖమై ఆత్మస్థానమైన ఆజ్ఞచక్రములో – మనకావిషయము తెలియనిండు తెలియకపోనిండు – తనలో తాను తన్మయమొందియుండును. జీవుడు శ్రేష్ఠపదార్థములను ఆనందముతో అనుభవించుచు, క్రుళ్ళిచెడిపోయినట్టి తక్కువచైతన్యముగలపదార్థముల నెట్లు నోటిలోవేసికొన్న వెంటనే ఉమ్మివేయునో, భగవంతుడుకూడ అటులనే కామాంగము, కోరికలు, మాయాలక్షణములును, అధికముగనుండునట్టియు, అందువలన క్రుళ్ళిచెడిపోయినట్టియు ఆత్మలను అసహ్యించుకొనును. భగవంతుడు వారినికూడ రక్షించుచునేయుండును కాని వారిపైన అంతయెక్కువఅభిమానమును చూపడు. అట్లే ఆత్మను అంతర్యామున ఆరోహింపజేసికొన్నట్టియు, విశేష చైతన్యాంశగలిగినట్టియు అభ్యాసిపురుషులైన భక్తజనులయెడల భగవంతుడు ఎక్కువప్రేమ జూపుచు, హంసలతోచేయువిధముగా వారితో విలాసముచేయుచుండును. లోకములో జీవులు మంచి శ్రేష్ఠపదార్థముల నెట్లు జాగ్రత్తపెట్టుకొందురో చూడుడు. ఉదాహరణకు పట్టువస్త్రములను ఎండలో ఆరవేసుకొందురు; ముత్యములు, మాణిక్యములు వగైరా విలువగలపదార్థములను భద్రముగ కాపాడుకొనుచుందురు. అట్లు జాగ్రత్తపడుటలో శ్రమగలిగినను లెక్కచేయకుండ, ప్రతిశ్రేష్ఠపదార్థమును సంరక్షించుకొనుచునే యుందురు. భగవంతుడుకూడ నట్లే యీసృష్టినంతను కాపాడుకొనుచున్నాడు. కావున నేత్రిలోకిలోనైనను మాయాలక్షణము అధికముగ పెరిగిపోవుటచే నాత్రిలోకికి చెడుదశ గల్గినచో పరమపురుషుడు దానిని సత్యలోకమునకు సమ్ముఖముగా గొనివచ్చి ఆత్రిలోకిలో సంతురూపమున అవతరించి ఆత్రిలోకిలోని సృష్టిని కాపాడుకొనుచుండును. ఆత్రిలోకిలో నేయేజీవులకు వారి ఎట్టినుటకువచ్చు సౌభాగ్యము గల్గునో ఆజీవులభారమంతయు తామువహించుకొని వారలచే సత్సంగము చేయించి వారియందుదయదర్శించి వారిని కాలకర్మములబాధలనుండి కాపాడి తమచైతన్యధారయొక్కసహాయమునిచ్చి సత్యలోకమునకుతీసికొనిపోయి అచ్చట చేర్పింతురు. భగవంతుడు జీవులకందఱికి మహోపకారముచేయదలచివచ్చి

నప్పుడు మహాక్షామములు, మహామారి, మున్నగురోగములను, అనేకవిధకష్ట ములను కలుగజేసి ఆవిధముగ నందఱకును నైర్మల్యముకలుగజేసి విశేషానంద మును ప్రసాదింతురు.

ఇపుడు రాధాస్వామీదయాళురు మహాశ్రమతీసికొని స్వయముగ నిచ్చట అవతారముధరించి మహానుగ్రహముచూపుచున్నారు. కావున సమస్తజీవులును అడ్డులు, ఆటంకములు కలిగించువిషయములను పరిత్యజించి వచ్చి హుజూరు రాధాస్వామీదయాళుని శరణ్యమును దృఢముగ గ్రహించవలయును. రాధా స్వామీదయాళుకు నిద్రాణావస్థలోనున్న జీవులమైన మనలను మొదట మహా దయతో చైతన్యవంతముచేసి, ఇచ్చటి ఆనందవిలాసములను మనకనుగ్రహించిరి. పిమ్మట మననందఱను సత్యలోకమునకు జేర్పించుటకు ఒకమహావ్యవస్థ నేర్పాటు చేసి, అంతుపొంతులులేని అత్యద్భుతదయను వర్షించిరి.

ఆత్మయొక్కధార ఆంతర్యమున పైలోకములకు వెళ్ళినపుడు భగవంతుని విశేషధార బయల్వెడలును. ఆత్మధార ఆంతర్యమునకు ప్రవహించుటనే ప్రేమ అని చెప్పుదురు. ఆత్మయొక్కధార బాహ్యముగస్థూలపదార్థములపైకి ప్రవ హించినపుడు దానిని మోహమని చెప్పుదురు. చెప్పవచ్చిన దేమనగా, యీపిండ ములో ఆత్మయొక్క కార్యకలాపము ఏవిధమైనిజరుగుచున్నదో ఈఅఖండసృష్టిలో కూడ నట్లే భగవంతుడు కార్యక్రమముజరిపించుచున్నారు. కండ్లున్నవారందఱ కును నీవిషయము సృష్టిలోప్రత్యణువులోను కనపడుచుండును. ఈపిండములో ఆత్మజరిగించుచున్నకార్యక్రమము నెవరు విచక్షణగా తెలిసికొందురో వారి కీసృష్టిలో భగవంతునిచేజరిగించబడు కార్యక్రమముకూడా బోధపడగలదు. జీవుడు జడపదార్థములతో ననేకవిధములైన విలాసముసల్పుచు, నాపదార్థము లలోగలచైతన్యమును చవిచూచుచున్నపు డతని కెంతయానందముగల్గుచుం డును! ఆభగవంతుడుగూడ నట్లే సమస్తాత్మలతోను విలాసముసల్పుచు నానంద రసమును పొందుచుండును. అప్పుడాయాత్మలు ఆనందమాధుర్యముల నెట్లనుభ వించుచుండునో అట్లే జడపదార్థములలోనుండుచైతన్యముగూడ, అధికచైతన్య మునుపొంది విశేషానందముపొందుచుండును. భగవంతునిమహిమను వర్ణించు టెట్లు! జీవులను చైతన్యవంతముగజేసి, వారికి ఆనందమునను గ్రహించి, తాను గూడ ఆనందవిలాసములనుపొందుచున్నాడు. భగవంతుని యీఅపారదయకు కృతజ్ఞతాధన్యవాదములను చెప్పుకొనసాధ్యముకాదు. అనంతమును, అపా రమునైన ఆప్రభునిదయ మన కెట్లవగాహనకాగలదు. సమస్తజీవులపైనను వారు దయచూపుచున్నారు.

# పరమగురు సర్కార్ సాహబ్ వారి మహావచనములు

## సత్సంగములో

### 1

4 జూలై 1908 :—సత్సంగమును సుఖముగనిద్రపోవునట్టిస్థలముగ నెంచుకొనగూడదు. అక్కడపఠించు పవిత్రగ్రంధములలోని శబ్దములలో, ఒక్కొక్కసత్సంగికి మనస్సులోగలిగెడి సందేహములకు, అపభ్రమలకును సమాధానములువచ్చుచుండును. లేదా ఒక్కొక్కసత్సంగిప్రవర్తనలోని లోపములను గుఱించి హితోపదేశములు లభించుచుండును. సత్సంగములో నిద్దురపోయిన సత్సంగులకు ఆవిషయములను తెలుసుకొని లాభముపొందుట సాధ్యముకాదు.

తప్పుటలవాట్లు చాలా పెరిగిపోయినవి. ఎట్లనగా, తమ్ముతాము ముఖ్యులుగనెంచుకొనుచుండెడివారిలో కొందఱు మంగళాచరణము, బినతిశబ్దములను పఠించుట తమకొకన్యూనతగా భావించుకొనుచున్నారు. మంగళాచరణమనగా భగవంతునికి ఆవాహనము. భగవంతుని నారాధనచేయునిమిత్తమై వారివైపున కభిముఖమగుట మహాశ్రేయస్కరము.

ఇట్లే సత్సంగములో కండ్లుమూసుకొనికూర్చుండి, తమనిద్రను ధ్యానముగనే అందఱు నెంచుకొనవలయునని ఆశించుట గొప్పపొరపాటు. మహారాజసాహబ్ వారు సత్సంగమునకుధ్యానముచేయునిమిత్తమైవచ్చెడివారిని వెనుకవైపున కూర్చుండుడని సెలవిచ్చెడివారు. అట్లుచెప్పుటలో సద్గురువు విరాజమానులై యున్నపుడు వారియెదుటకూర్చుండి వారిబాహ్యస్వరూపమునుదర్శనముచేసుకొనుట ప్రధానమైనఅభ్యాసమనియే వారిఅభిప్రాయము. ధ్యానము కావలయుననిన సంతసద్గురువుయెదుటలేనప్పుడుకూడ చేసుకొనవచ్చును సంతసద్గురువులేనిస్థలమున కండ్లుమూసుకొనికూర్చుండుటలో తప్పులేదు. కాని (అట్లుకూర్చున్నను) పవిత్రగ్రంథములనుండి పఠించు శబ్దములమీదనే నిరంతరముధ్యానమునుంచుట అత్యావశ్యకము. అప్పుడపుడు సద్గురువుయెదుటనున్నపుడు సత్సంగికి కండ్లువానంతటనవి మూసుకొనిపోవునంత హెచ్చుగ ఆంతర్యాకర్షణగూడ కల్గుట జరుగుచుండును. కాని అందఱుసత్సంగులకు అన్నిసమయములలోను అట్లుజరుగనేరదు.

2

## సత్సంగములో మహామహులమని యనుకొనెడివారు చేయుపొరపాట్లు.

సర్కార్ సాహెబ్ వారు అలహాబాదునుంచివచ్చినసత్సంగినొకరిని, మహారాజుసాహెబ్ వారిప్యాంప్లెట్టు (pamphlet) అచ్చువేయుటవిషయ మేమైనదని ప్రశ్నించిరి. అందువిషయమై యెక్కువశ్రద్ధతీసుకొనుచున్నట్లు లేదని ఆసత్సంగి సమాధానముచెప్పెను. కాని ఖేమచందుఅనెడిసింధిసోదరుడు తనజ్ఞాపకార్థమై వ్రాసుకొన్నవచనములను అచ్చువేయించునిమిత్తమై యెక్కువతొందరపడు చుండెను. రాయశంకరలాల్ గారు, మహారాజ్ సాహెబ్ వారిగ్రంథముకొఱకై అందఱు నాతురతపడుచున్నారనియు, త్వరగాఅచ్చువేయించిన బాగుండు ననియు చెప్పిరి అంతట సర్కార్ సాహెబ్ వారు తాముకూడ బాబూజీసాహెబ్ తో, అనగా బాబూమాధవప్రసాద్ సింగ్ గారితో ప్రశంసించితిమనియు, వారుకూడ తమఅభిప్రాయముతో నేకీభవించి తప్పకత్వరలోఅచ్చుకావలసి యున్నదనిచెప్పిరనియు, కాని ఎందులకైజాప్యముకలుగుచున్నదో బోధపడుట లేదనియు సెలవిచ్చిరి.

పరమార్థవిషయములు చాలసునిశితమైన వని సెలవిచ్చిరి. ఉత్తమతరగతి పరమార్థుల మనుకొనెడివారుకూడ, భగవంతునిప్రత్యేకదయ లేనిచో గొప్ప గొప్పపొరపాట్లు చేయుచుందురు. లౌకికకార్యములలో ప్రతివ్యక్తియు తన తెలివితేటల నుపయోగించి తగినవిధముగ పనులుసాగించుచుండును. కాని పరమార్థములో మహామహులే సామాన్యులకుకూడ ఆశ్చర్యముకలిగించునంతటి గొప్పగొప్పపొరపాట్లను చేయుచుందురు. దీనినిబట్టి పరమార్థ మెంతసునిశిత విషయమో బోధపడుచున్నది. ఒకప్పుడు సత్సంగములో నెక్కువగఆనందము, దయను, సేవాసావకాశములనుపొందినపరమార్థులుకూడ మఱొకసమయములో తప్పుత్రోవనుపడిపోవుచుందురు. నిజమునకు అట్లుపథభ్రష్టమయిపోవుటకూడ వారికి చివరకు లాభమునే కలుగజేయవచ్చును; అనగా వారు మొదటపొందిన దయను జీర్ణించుకొనుటకు ఉపయోగపడును. ఏలననగా, ఒకసత్సంగి తప్పులు, పొరపాట్లుచేసి ఆతరువాత అందులకై పశ్చాత్తాపపడి, విచారపడినచో అతడు అంతకన్న నెక్కువదయను పొందుటకధికారియగును. కాని ఇప్పుడుమాత్రి మతడు అపమార్గములోను, పొరపాటులోనేయున్నట్లు చెప్పవలసియుండును.

## 3

పరమార్థములో వ్యాపారసరళిలోనిపద్ధతులు (Business Habits) చాలలాభదాయకములు. సంతసద్గురువు ఛేంట్లసొమ్ము తినస్వాంతమున కుపయోగించుకొనరు. గృహస్థాశ్రమము మనస్సుతో పోరాడుటకు తగిన రణక్షేత్రము. అసలైనవిరహాము నిజమైనదాసునిలక్షణమునుగుఱించియు.

5 జూలై 1908 :—జర్మని, ఇంగ్లాండువగైరాదేశములకన్న నెక్కువ యభివృద్ధిపొందినట్లుపేరుపడిన అమెరికాదేశీయులనుగుఱించి వార్తాపత్రికలలో ఒకసంఘటన వ్రాయబడినది. ఒకవార్తాపత్రికకార్యాలయమునకు ఒకయువకుడు ఉద్యోగముసంపాదించుకొనుటకై వెళ్లెను. అతనిని నీ వేమిపనిచేయఁగలవని యడుగగా నేను ఇల్లుతుడుచుట మొదలుకొని పత్రికాసంపాదకత్వమువఱకు నన్నిపనులు చేయగలనని ఆతఁడు సమాధానముచెప్పెను. అంతట నాపత్రికాధికారి ఆయువకునికి కార్యాలయముతుడుచుటపని యొప్పగించెను. రెండుమూడు రోజులలో నతఁడు ఆకార్యాలయమును మహాపరిశుభ్రముగను స్వచ్ఛముగను చేసినందున ఆయధికారి ఆపిల్లవానికి అంతకన్నపెద్దపనులను అప్పగించుచుండెను. ఇప్పుడు ఆయువకుడే ఆపత్రికకు సంపాదకుడయ్యెను.

"చొక్కాచేతులు పైకికట్టుకొని పనిలోదిగుడు", (Tuck up your sleeves and plunge into business) అని అమెరికాదేశీయుల ఆదర్శవాక్యము. అచ్చటిదేశీయులలో నధమాధముఁడుకూడ అమెరికాకు అధ్యక్షపదవికై ఆశించుచుండును. ఇటులనే ప్రస్తుతము పార్లమెంటుమెంబరై యున్నట్టియు కొద్దికాలములోనే ప్రధానమంత్రికూడ (Prime Minister) కాబోయెడి సూచనలుగల కేయర్ హార్డి (Keir Hardy) అనునాయన మొదటలో నొక కర్మాగారము (factory) లో కూలిపనిచేయుచు ఖాలీసమయములలో శ్రమపడి చదువుకొనుచుండెడివాడు. హిందూదేశములో బద్ధకము (Lethargy) చాలయెక్కువగనున్నది. దీనికి అవిభక్తకుటుంబపురివాజు యెక్కువప్రోద్బలము చేయుచున్నది. ఏవ్యక్తియయినను అభివృద్ధిచెందుచుండినచో అతనిని అతనిఅవిభక్తకుటుంబము అణగత్రొక్కివేయుచుండును. ఏమనిషియైనను న్యాయముగ పనిచేసికొనినచో నతఁడు తనపొట్టకుసరిపడునంత సంపాదించుకొనగలఁడు.

పరమార్థములోకూడ వ్యాపారసరళికి చెందినజలవాట్లు ( Business habits ) బహులాభకరముగానుండును. శారీరకశక్తియు, మానసికశక్తియు (Physical and mental energy) బాహ్యముగ ప్రవహించి (flow ) పోవుట ఆవశ్యకము. లేనిచో నవి ఆంతర్యమున చెఱుపుచేయును. గవర్నమెంటు ఉద్యోగమువలన (official life) పరమార్థమునకు చాలాసహాయకరమైన ప్రభావముగల్గును. సాధారణముగా పరమార్థులు బహుశ్రమపడి ధారాళముగ పనిచేయుచుందురు. అదికాక పైఅధికారులుకూడ వీరిపైన కాఠిన్యముతో అధికారము చలాయించి వీరిమనస్సును అణగత్రొక్కియుంచుచుందురు. అయినను సంతుమహాత్ములనుచూడుడు, వారందఱు పరిశ్రమచేసియే జీవికోపార్జన చేసుకొనెడివారు. ఉదాహరణకై కబీర్ సాహెబ్ వారును, మనమతములోని గురువులందఱునుకూడా నట్లేజీవించిరి.

సత్సంగములో భేంటురూపముగా వచ్చుద్రవ్యములో నొకపైసకూడా, స్వామిజీమహారాజువారుకాని, హుజూర్ మహారాజువారుకాని, మహారాజ్ సాహెబ్ వారుగాని తమకొఱకై యెన్నడు నుపయోగించుకొనలేదను విషయము సత్సంగేతరులలో చాలమందికి తెలియదు. వారికి ఈవిషయము తెలిసియుండినచో పరమాశ్చర్యకరముగ కనిపించును. యన్. యన్. ఘోష్ గారు (N. N. Ghosh) ఇచ్చటికివచ్చి మనఆదాయవ్యయములలెక్కలు చూచి నపుడు చాలఆశ్చర్యపడిరి. ఇతరమతములన్నిటిలోను అన్నిదేశములలోనుగూడ మతమనునెపముతో సామాన్యగృహస్థులుకూడ, నెన్నడు చేయజాలనట్టిచెడు పనులు జరిగిపోవుచున్నవి. మహంతులు, పీర్లు, ఫకీర్లసంప్రదాయములోనిపీఠాధిపతులు (ఉదాహరణకునానక్ పంథీలు) మున్నగువారు కొన్నిచోట్ల లక్షలకొలది రూప్యములతో వడ్డీవ్యాపారముచేయుచున్నారు, చూడుడు. తఱుచుగ మతమునుస్థాపించినట్టి ప్రథమాచార్యులుగనుండిన నిజమైనసాధుసంతుమహాత్ములు, వారు బ్రతికియున్నంతకాలము ఆయామతస్థులను సవ్యమైనపద్ధతులలోనుంచి అపమార్గములకుపోకుండ కాపాడెడివారు వారు అంతరించినవెంటనే వివిధములైనదుష్టాచారములు ప్రారంభమగుచుండెను.

మనస్సుతోపోరాడుటకై గృహస్థాశ్రమమునకుమించిన రణక్షేత్రము (Battle field of life) మఱొకటిలేదు. ఏలననగ నిందులో నన్నిరకములైన పేచీపూచీలు నుండుటచే వానిమూలముననే వారిమనస్సు అణగద్రొక్కబడి

పోయియుండును. అందువలననే గృహస్థులమీద దయావర్షము కురియుచుండును. ఈబాధలు కష్టములును గల్గినందువలన వారితోపాటే నిజమైనభక్తులకు దయాధారవర్షించి ఆనందానుభవముగూడ తెలుచుగనుండుటచే వారిరెండిటికిని పరస్పరసంబంధమును తెలిసికొని, ఆవిధమున తమపైన భగవత్కృపవర్షించవలయునను తలంపుతో తమకాబాధలు వచ్చుచునేయుండవలయునని కోరుకొనుచుందురు. మనదేశములో సాధువులని పేర్కొనబడువారు ఉత్తరఅడవిమృగములు. వారేపనియు చేయకుండ సోమరితనములో పడియుందురుకావున వారిలో అనేకదుర్గుణములు పుట్టుచున్నవి. అందులో ముఖ్యముగ అహంకారము తప్పకనుండుచుండును.

అసలువిషయమేమనగా పరమార్గమనునది బహుజటిలవిషయము ఎవరైన నొకసమర్థపురుషుడు పైనుండి జీవుని కాపాడుచుండకపోయినచో నతడు పతితమైపోవుటకు చాలాఅవకాశములుకలవు.

"సాఈం కా ఘర్ దూర్ హై,
జైసీ లంబీ ఖజూర్ ।
చఢే తో చాఖే ప్రేమ రస, గిరే తో చకనా చూర్ ॥

అర్థము :—స్వామివారిగృహము ఎత్తయిన ఖర్జూరపుచెట్టువలె యెక్కువదూరముగనున్నది. పైకెక్కినచో దానిపండ్లమాధుర్యము చవిచూడవచ్చును కాని, అదియెక్కుచు క్రిందపడినచో నెవరైన నెట్లుపిండిగుండయైపోవుదురో అట్లే యీమార్గమందుచివరివఱకు వెళ్ళగలిగినచో ప్రేమమాధుర్యముచవి చూడవచ్చునుగాని త్రోవలో పతితులైనచో భ్రష్టుపోవుదురు.

గురునానక్, కబీరుసాహేబ్ వార్ల సంప్రదాయముల కెట్టిపరిస్థితివచ్చెనో చూడుడు. అల్పకాలముమాత్రమేయుండెడి విచిత్రదర్శనములుమున్నగుబహుమానములకొఱకై సామాన్యముగ జనులు ప్రార్థనచేయుచుందురు. అట్టి ప్రార్థనలు దూష్యముకాకపోయినను. నిజమైనపరమార్థమునకును, ఆధ్యాత్మికాభివృద్ధికిని అసలైనచిహ్నమేమనగా ప్రపంచసంబంధమైనపనులన్నియు చేయుచున్నట్లే పైకికనపడుచున్నను ఆంతర్యమున పూర్తిగ నిర్లిప్తముగనుండవలయును.

కబీరుసాహెబ్ వారికిక్రింద సెలవిచ్చినట్లు :—

కాజ కరే కర్తా నహిఁ హోవే దాస కహావే సోయ్ ।
కబీర్ నిర్బంధ్ బంధ రహే బంధ నిర్బంధన హోయ్ ॥

అర్థము :—పనులన్నియు చేయుచుండియె తా నందుకు కర్తకాకుండ నెవరు ఉందురో అతడే దాసుడనిపించుకొనును. కబీరువారు చెప్పున దేమనగా బంధరహితుడై యుండియు, బద్ధునివలె నెవరుప్రవర్తించునో, మఱియు బంధనములో పెట్టబడినప్పటికిని, బంధరహితముగ నెవడుండగలడో అతడే నిజమైన దాసుడు.

కాని యీవిషయమునుసాధించుటకు దీర్ఘకాలముపట్టును. కొంతకాలము వఱకు క్రిందనుమీదను పడుచు పాట్లుపడగా స్వభావములోను ప్రవర్తనలోను మార్పుగలుగుట ప్రారంభమగును. అసలైనవిరహమయితే భగవచ్చరణముల యందు, ప్రేమకొఱకే యుండవలయును. కాని ఇది బహుకష్టసాధ్యము; అరుదుగ నూటికికోటికిని ఒకనికి లభించును. ఇచ్చటికష్టములు బాధలవలన ఈ ప్రపంచమునందు అసహ్యము గలుగుటయు, భగవంతునివైపునకు ఆకర్షణగలుగుటయు సామాన్యవిషయము. కాని ఇదికూడ నొకవిధమైన విరహమే.

## 4

రాధాస్వామీమతము జగదుద్ధారము పూర్తియగువఱకు జగత్తునకు పరమార్థలాభమును నిరంతరముచేకూర్చుచునే యుండును. రాధాస్వామీ నామము పరిపూర్ణనామమనుటకు రుజువులు.

బాబూభోలానాథ్‌గారు ప్రశ్నించినమీదట సర్కార్‌సాహబ్ వారిట్లు సెలవిచ్చిరి; మనకు హుజూరువారు సమస్తజగత్తునకు నుద్ధారముపూర్తిగనై పోవువఱకు పరమార్థవరదానము నిరంతరము నిచ్చుచునేయుందుమని వాగ్దానముచేసిరి. దీనిపైన పూర్వపుసంతులుకూడ నిట్టివాగ్దానమునే చేసియుండిరి కాని వారిమతములన్నియు నిపుడు పతితావస్థలోనున్నవికదా, యనియెవరైనను తలంచవచ్చును. మనమతమునకుకూడ నెప్పటికైన బహుశః అట్టిపరిస్థితియే రాగలదేమో అనికూడ వారికి సందేహముకలుగవచ్చును. హుజూరువారు దీనికిసమాధానము నిట్లుసెలవిచ్చిరి :— సృష్టిప్రారంభమునుండియు, అవతారములు బహునీచతరహాకళలతో మొదలుపెట్టి వచ్చుచుండెను. ఉదాహరణార్థము

కూర్మ, వరాహ, నృసింహావతారములు. కాలపురుషుని యీ అవతారములు గాక, సంతులుగూడ అవతరించిరి. పై వారందఱు ప్రకటించిననామము లెవ్వియు కూడ పరిపూర్ణ నామములు కావు. కాని మనమతములో ప్రకటితమైన రాధాస్వామీనామము పరిపూర్ణ నామము. అందుచే నీవాగ్దానముకూడ సంపూర్ణముగ నెరవేరవలసియున్నది. ఇచ్చటనున్న వారందఱము సత్సంగులము కాబట్టి మనమీవిషయములన్నిటిని ధార్మికసిద్ధాంతములుగనే (Dogmas) స్వీకరించుదుము. అయినను మనమతగ్రంథములలో చెప్పినవిషయములన్నియు నట్టివిశ్వాసముతోనిమిత్తము లేకుండా స్వతంత్రముగకూడ రుజువుచేయవచ్చును. కాని ఆవిషయము నెమ్మదిమీద (Step by step) సాధించవలసియున్నది. ప్రస్తుతములో సత్సంగులకుమాత్రము సద్గురుశాసనములను రుజువుచేయుటకై వేఱే ప్రమాణము లవసరములేదు. కాని పరిపూర్ణనామము రాధాస్వామీనామమే యని యవశ్యముగ తెలిసికొనవలసియున్నది.

నామముపరిపూర్ణమగుటకు సంక్షేపముగ చెప్పవలెనన్నచో నాలుగువిషయములు ముఖ్యముగనుండవలెను. మొదటిభాగమైన "రకారము" చే పూర్తిగ కృత్రిమము సమ్మిళితమునైనట్టి స్థూలపదార్థముయొక్క విక్షేపము (తోసివేయుట) సూచితమగుచున్నది. పిండదేశములో ఈవిధమైన పదార్థములకలగలుపు ఉన్నదికావున ఇచ్చటినుండి తప్పించుకొనిపోవుట కీవిధమైనతరంగము లేక చలనము ఆవశ్యకము మఱియు నీతరంగము లేక చలనము స్థాయిగనుండవలసియున్నదికావున, నావిషయము "రకారము"ను పొడిగించుటచే అనగా "రా" చేత సూచితమగుచున్నది. పిండదేశముకన్న సూక్ష్మతరమైన పదార్థముల సమ్మేళనము బ్రహ్మాండదేశములోనున్నది. కావున అచ్చటినుండి తప్పించుకొని పోవుక్రియ రెండవభాగమైన "ధా" చేత సూచింపబడుచున్నది. అచ్చటి సమ్మేళనము "రా" అను అక్షరముచేతసాధించబడదగినట్టి పిండదేశములోని సమ్మేళనమువంటిది కాదు. ఆత్మ బ్రహ్మాండదేశములోనుండి పోవునపుడు ఒకసొరంగముగుండా రైలుపోవునపుడు అయ్యెడి "ధధ" కారమువంటి ధ్వనియగును. "స్వా"నుగుఱించి మహారాజ్ సాహెబ్ వారుచేసినవివరణమును మీరందఱు విని యేయుందురు. ఆయక్షరముయొక్క గోళాకారధ్వని గోళాకారమండలముయొక్కరచనను సూచించును. "మీ"అను ధ్వనినిబట్టి పరిధినుండి (Circumference) కేంద్రమునకు (centre) అనగా దయాళుదేశకేంద్రమయిన

రాధాస్వామీధామము వైపునకు ప్రవహించుట సూచితమగుచున్నది. నామము సంపూర్ణమగుటకై యీనాలుగంగములు నుండకతప్పదు. కాని దీనికంతకు నాధారము (Base of action) ఎచ్చటనున్న దనువిషయము మాత్రము పరిశీలించగలశక్తి మనకులేదు. ఎల్లప్పుడును వారేస్వయముగ నీవిషయమును సెలవిచ్చుచుండిరి. ఇకముందుకూడ నట్లే యుక్తమైనవిధమున ప్రకటించుచుండగలరు.

## 5

పారమార్థికాభ్యాసము నియమప్రకారము చేసికొనుచుండుట అవసరము. సద్గురువు బాహ్యముగ లేనపుడు వారు తప్పకుండ అంతర్యమున సహాయము చేయుచుందురు. కావున పూర్ణవిశ్వాసముతో అభ్యాసము చేసికొనుచుండవలయును. అంతర్యాలోహణకన్న చిత్తశుద్ధి యెక్కుడుప్రధానము.

9 ఆగస్టు 1908-సత్సంగమైనపిమ్మట నిట్లు సెలవిచ్చిరి :-

"కాట్ తే ఔర్ ఖోద్ తే రస్తా రహో,
మర్ తె దమ్ తక్, ఏక్ దమ్ గాఫిల్ న హో"

అర్థము :-మార్గములో అడ్డుగనున్న చెట్లుకంపలువగైరా ఆటంకములను నరికివేయుచును, ఎత్తుపల్లములుగనున్న చోట్ల త్రవ్వి సరిచేసుకొనుచునే యెల్లపుడు నుండవలయును. ఆమరణాంతము నొక్కక్షణమైన నేమఱుపాటుగ నుండకూడదు.

ప్రతిసత్సంగియు తనఅభ్యాసము చేసికొనుట కొకపద్ధతి నేర్పాటు చేసికొని, నిరంతరము అభ్యాసము తప్పక చేసికొందు ననెడిదీక్షతో ఆధ్యాత్మికాభ్యాసములను చేసికొనవలయును. ప్రత్యక్షఫలితము కలుగుచుండవలెనని ఆశించుట న్యాయమేగాని త్వరితముగ నట్లు లభించనిచో నిరాశపడుచు అభ్యాసమును మానివేయుట సరికాదు. ఇప్పుడు మనలోనిమాలిన్యమును బయటికిత్రోసివేసి హృదయమును నిర్మలము చేసికొనవలసినసమయము. అట్లు నిర్మలము కాకుండగనే ఆత్మను పైలోకములకెక్కించినచో పైకి తనతోకలిసివచ్చినమాలిన్యమును తిరిగి ప్రబలవేగముతో జోరుగ క్రిందికిత్రోసివేయవలసినపరిస్థితి గల్గును. అప్పుడు అభ్యాసికి వెనుకటికాలములోనిఋషులకు, మునులకునుగలిగిన పతితా

వస్థవంటిఅవస్థ పట్టును. కావున మొట్టమొదట నైర్మల్యముసంపాదించుకొనుట ముఖ్యావసరము. కొద్దికాలమైన సత్సంగములోనుండినచో నేమనుష్యునకైనను బాహ్యముగను, ఆంతర్యముననుకూడ దయాసూచకమైనఅనుభవములు, ఘట నలును కలుగకుండకపోవుట అసంభవము. కావున వ్యాకులపడ నవసరములేదు. పరమార్థికి అట్టినిరర్థకమైన వ్యాకులత్వమెంతయెక్కువగ నుండిన అంతకంత పరమార్థవిషయములో నిజమైనఆసక్తి అతనికి లేదని చెప్పవలయును.

నిజమునకు రాధాస్వామీదయాళురు ప్రకటముకాకముందు నిజమైన నిర్మలపరమార్థముయొక్కఆనంద మనగనెట్టిదో యెవరికిని తెలియనే తెలియదు. వేసవికాలములో వర్షములుకురియుటకు సావకాశములేకపోవుటచే నప్పుడు వర్ష ములులేవని యెవ్వరునుబాధపడరు. అట్లే హుజూరురాధాస్వామీదయాళురు ప్రకటముకాకముం దెవరికిని పారమార్థికానందము లభించుటలేదని ఆలోచ నయే యుండెడిదికాదు. ఇప్పుడు రాధాస్వామీదయాళురు అవతరించినది మొదలుకొనియే వర్షకాలము వచ్చినది. వర్షకాలములోగూడ నప్పుడప్పుడు వర్షములు లేకుండగనుండును. ప్రజలు అట్టిసమయములలో వ్యాకులపడి బాధ పడుచుందురు. అట్లే ప్రస్తుతములో వర్షకాలములోనే వానలులేకుండ నైపో యినది. అయినను, కొంతఅనుభవశాలురైన వ్యవసాయదారులు వర్షములు లేనిసమయములోగూడ నేమాత్రముబద్ధకించి నిర్లక్ష్యముచేయకుండగ తమ భూములను, పొలములను దున్నుకొని వర్షించినపుడు దానిలాభమునుపొందు నిమిత్తమై సిద్ధముగనుందురు. అటులనే మెళుకువగలపారమార్థికకృషికులు గూడ నీకాలములో నెంతమాత్రము అశ్రద్ధగనుండకూడదు. లోలోపల వారి కెంతఆదుర్దాగనుండినను, తమహృదయక్షేత్రమును మఱింతయెక్కువమెళుకువ తోను, పట్టుదలతోను సరిచేసుకొనుచునే యుండవలయును.

ఈసమయములో ఆంతర్యసాధనలను అభ్యాసమును చేసికొనుచు మహా రాజ్ సాహబ్ వారిచరణములందు లోలోపల మొఱపెట్టుకొనుచుండుట ఆవశ్య కము. వారు బాహ్యముగ సహాయముచేయుటకు పైనలేనందున, తప్పకుండ ఆంతర్యమున ప్రత్యక్షదయాసహాయములను చేయుదురు. అయితే తొందరగ నట్టిసహాయములభ్యముకాకపోయినను, పరమార్థులు తమఅభ్యాసమును పూర్ణ విశ్వాసముతోను పూర్తిఅయినపట్టుదలతోను చేసికొనుచుండవలయును.

## 6

వచనములను గుఱించి

హుజూరువారు చర్చలు, సంభాషణలనుగుఱించి చెప్పుచు, భగవత్ప్రేర ణచే మాట్లాడినమాట యొక్కటియైనను గూడ గంటలతరబడివాగుడుకన్న నెక్కువలాభదాయకమని సెలవిచ్చిరి. నిజమైనపారమార్థికకార్యమును సాధించుట కెంతముఖ్యావసరమో, అంతమాత్రమే చెప్పుటయు, వినుటయు చాలును. లేనిచో తనివితీరకుండగ తియ్యనిమాటలను ప్రతిదినముమాట్లాడునట్టి ఉపన్యాస సభలు తయారై పోవునట్టి ప్రమాదముగలదు. సంత్ సద్గురుసిస్వరూప మిక్కాలమున గుప్తముగనున్నందున వచనములుగూడ కొంతకాలమువఱకు బహు స్వల్పముగనే యుండుట అత్యావశ్యకము.

వచనములుకూడ బహుసహాయకరముగ నుండవచ్చునుకాని, వానిని గూడ ఆపుజేయవలయునని దివ్యేచ్ఛయుండినచో, నట్లేయగుగాకయని ఒక సత్సంగి వాక్రుచ్చెను. హుజూరువా రంతట "ఎవరిని చనిపోనివ్వము లే. ఆధ్యాత్మికజీవితము నిలబెట్టుట కవసరమైనంతవరకుమాత్రము అప్పుడప్పుడు వచనములియ్యబడుచుండును. నేనుకూడ నింతకుముందు చాలయెక్కువసంభాషణ చేసెడివాడనుకాని ఇప్పుడు 2, 3 నెలలనుండి సంభాషణచేయుటకు మనస్సు ఇష్టపడుటలేదు" అనిసెలవిచ్చిరి.

హుజూరువారు, పారమార్థికవిషయములలో పరిహాసముచేయుట చాల నిషిద్ధమని సెలవిచ్చిరి.

## 7

దయ అనగానేమి.

మహారాజసాహబ్ వారు మహాగంభీరదయ గానైయున్నవని సెలవిచ్చుచుండెడివారు. ఆదయ యెవ్విధముగ నుండును? అనగా ప్రత్యక్షముగా అంతర్యదర్శనమగుట, శబ్దమువినబడుటమున్నగునను భవరూపములుగ నుండునా లేక మామనస్సులను శిక్షించి కట్టుదిట్టముగచేయువిధముగ నుండునా? అని ఒక సత్సంగి ప్రశ్నించెను. దయఅనగా భగవంతునిచరణములందు సాన్నిధ్యము లభించుటయే. శిక్ష అందుకొరకుఆవశ్యకమైనఅంగము. కావున దయఅనగా భగవం

తునిచరణసాన్నిధ్యమును అందుకవసరమైనశిక్షాదీక్షలునుకూడ, దయలో నిమిడియున్నవని తెలుసుకొనవలెను.

## 8

### గృహస్థాశ్రమము

ఇంటర్‌వ్యూ (Interview) సమయములో నొకసత్సంగి తనకు గృహస్థాశ్రమములో గలుగుచున్న చిక్కులు తంటాలనుగుఱించి చెప్పుకొన్నమీదట సర్కారుసాహెబ్‌వారు గృహస్థాశ్రమమునకు గొప్పమహత్త్వముగలదని సెలవిచ్చిరి. రోజంతయు పాటుపడినమీదట కొద్దిసేపైనను అభ్యాసముచేయుటలో ఆనంద మెక్కువగలుగును. రోజంతయు పనిలేకుండనుండినచో నేమియు ఆనందము గలుగనేరదు. ఇంద్రియములశక్తి పనిపాటలుచేయుచుండుటవలన బయటకు ప్రవహించిపోవుట చాలమంచిది.

## 9

### సత్ప్రవర్తన.

11 ఆగష్టు 1908 :—డాక్టర్లనుగుఱించి ఫలానాడాక్టరు పేరాశగలవాడనియు, మఱొకడాక్టరు చాలాసావధానముగాపనిచేయుననియు చెప్పుచు సంభాషణజరిగెను. ఆసందర్భములో సర్కారుసాహెబ్‌వారు పూజ్యులైనతమ తండ్రిగారినిగుఱించి అంతటిసత్ప్రవర్తనగలవారు ఎవరును తమయెరుకలో లేరని సెలవిచ్చిరి. మనము పేరునకు సత్సంగులమేకాని వారిసత్ప్రవర్తనలో నొక చిన్నభాగముకూడ మనప్రవర్తనలో లేదు. వారు మఱెవరివద్దను ఉచితముగ నెద్దియు తీసికొనలేదు. ఎవరైనను వారికి ఉపకారముచేసినచో మఱొకరూపములో దానికి ప్రత్యుపకారము పూర్తిగచేసెడివారు. ప్రతివ్యక్తితోను తమకెట్టిసంబంధమున్నదో అందుకుతగినట్లుగనే ప్రవర్తించెడివారు. వారిమూలముననే మాఅందఱిప్రవర్తనకూడ యోగ్యముగనున్నది. ఇంతవరకు వారిప్రవర్తన మొదటినుండియు నొకేరీతిగానున్నది. శారీరకసుఖము వారెఱుగనే యెఱుగరు. వారెప్పుడును పంకావేయించుకొననే లేదు. వారిది చాల సాదాజీవితము (simple living) ఇప్పటివఱకు కుటుంబభారమంతయు నాయనమీదనే పూర్తిగనున్నది. మేమైతే ఉత్తపేరునకుమాత్రమే యున్నాము. ప్రవర్తన

సవ్యముగ నుంచుకొనుట చాలఆవశ్యకము. కాని అందువిషయమై శ్రద్ధ చాలామంది సత్సంగులకు చాలాతక్కువగ నున్నది. కబీరుసాహబ్ వా రిట్లు సెలవిచ్చిరి :—

కరనీ కరే సో పుత్ర హమారా,
కథనీ కథే సో నాతీ।
రహనీ రహే సో గురూ హమారా,
హమ్ రహనీ కే సాథీ॥

అర్థము :—అభ్యాసముచేయువాడు మాకు పుత్రునితో సమానుడు. మాటలుచెప్పెడివాడు దౌహిత్రుని వంటి వాడు. సత్ప్రవర్తనగలవాడు మాకు గురుసమానుడు. మేమెప్పుడు సత్ప్రవర్తనగలవానితో ఉందుము. మంచిమాట అనగా అభ్యాసముచేయుటకు సహాయమొనగూర్చుమాటయే మంచిది. అట్టి వానిని దౌహిత్రునితో పోల్చుటకు కారణమదియే. విశ్వాసపాత్రతనుగురించి యీవిధముగ సెలవిచ్చిరి :—

జో తూ ఖానా ఖాయగా హక్ వ హలాల్
జీత్ లేగా మన్ కో ఐ సాహబ్ కమాల్।
ఖానా బే శుబహే కా తుఝు కో హై జరూర్,
తో భజన తుఝుసే బనేగా బేకసూర్॥

అర్థము :—ఓపురుషశ్రేష్ఠుడా, నీవు కష్టపడి న్యాయముగసంపాదించు కొన్నతిండి తిన్నట్లయితే, మనస్సును జయించుకొనగలవు. నీవు దోషములేని తిండి తినుట అత్యవసరము. నీకప్పుడే భజనాభ్యాసము నిర్మలముగ సాగగలదు.

## 10

### దయాళుదేశములో శ్రేణులులేవు.

ఒకసత్సంగి ఇట్లు ప్రశ్నించెను : కబీరుసాహబ్ వారు పరమసంతులుకదా అయినను వారి తరువాత నెందరోసాధువులు, సంతులు నని యిరువిధముల వారును ప్రకటమైరి. అట్లయినచో అవతారములు ఆరోహణక్రమములో అనగా రానురాను ఒకరికన్నొకరు ఉత్తమోత్తమశ్రేణిఅవతారమే, వచ్చు

చుందురను విషయ మెట్లుసరియగును? అందుపైన సర్కారుసాహబ్ వారు, దయాళుదేశములో శ్రేణీవిభాగమనునది లేనేలేదనియు, నచ్చట సృష్టియంతయు సద్రూపమనియు సెలవిచ్చిరి.

## 11

సంతులు నిత్యావతారము.

భగవంతునిధార యీలోకమున మూడురూపములుగ నున్నది. ఒకటి సామాన్యరూపము, అనగా వ్యాపకచైతన్యము: రెండవది సంతులనిత్యావతారము. మూడవది సంతసద్గురురూపమైన అవతారము. సంతులనిత్యావతారమనగ, నీలోకమునుండి దయాళుదేశము వెళ్ళెడిమార్గము. అనగా సంతు లేధారమీదుగ నీలోకమునకు దిగివచ్చుచుందురో, ఆధార లేకద్వార మెల్లప్పుడు తెఱచియేయున్నదని అర్థము. ఈమండలమొక్కదానికే సకలలోకములకును వెళ్ళగల ద్వారములున్నవి. బ్రహ్మాండదేశమునుండి దయాళుదేశమునకు తిన్నగ నెవరును వెళ్ళజాలరు. మొదట నరశరీరములోనికివచ్చి అటుపిమ్మటనే వెళ్ళవలెను. దీనినిగుఱించి రామాయణములోగూడా దేవతలుకూడ నీశరీరమును స్పర్థచేయుచుందురని చెప్పునట్టిపద్య మొకటి కలదు. నిత్యావతారమనగా అమూలధామమున కాకర్షించి తీసికొనిపోయెడి శక్తియొకటి యున్నదని అర్థముకాదు. అట్లయినచో మఱి సంతులు అవతారమెత్తవలసిన అవసరమే యుండదు. సంతులయొక్క నిత్యావతారము చేయుపని సృష్టియొక్కపాలన పోషణకార్యమే. ఈసృష్టిని సంహరించుట సంత్ సద్గురునికృత్యము.

## 12

రాధాస్వామీదయాళురు అవతారములన్నిటిలో ఆఖరుఅవతారము.

హాఫిజ్ వారు ఇట్లు సెలవిచ్చిరి.

దరీఁ దహారే కుహన్ రస్మే స్త దైరీఁ
కి బే తలఖీ న బాషద్ ఐశేశీరీఁ।

అనగా:—కటుత్వములేనిచో సుఖములోకూడ తీపిరుచి యుండదు. ఇది పూర్వకాలమునుండియు వచ్చుచున్నట్టి రివాజు. అనగా రత్నమునకు చాల కాలము ఒరిపిడి పెట్టినమీదటనే ఆతళుకుబెళుకులును, ప్రకాశమును పైకి ప్రకాశించు ననియభిప్రాయము. అటులనే స్వార్థపరమార్థములు రెండిటిలోను

గూడ కష్టములు, బాధలు సహించకుండగనే సాఫల్యము చేకూరదు. ఒరిపిడి పెట్టినపుడే స్థూలత్వలక్షణము తొలగిపోయి చైతన్యలక్షణములు ప్రకటమగును. ఈ యొరిపిడి దయాచిహ్నము.

రాధాస్వామిధామమునకు పైన మఱొకధామ మెద్దియు నుండ నేరదు. ఈవిషయముపైన నివ్విధముగ సెలవిచ్చిరి. ఏశక్తియైనను మఱొకదానిపైన ప్రభావము కనపరచునపుడు, అందఱికిని కనపడెడిబాహ్యప్రభావ మొకటియుండును, రెండవది, ఆప్రయోక్తృశక్తి (ఉదాహరణకు సూదంటుఱాయిలోని ఆకర్షణశక్తి) ప్రభావితపదార్థముమీదికి (ఉదాహరణకు ఇనుపముక్క) ఏధారమీదుగ ప్రవహించునో అట్టిగుప్తముగనుండునట్టి శక్తిధార. ఈవిధముగ ప్రయోక్తృశక్తికిని ప్రభావితపదార్థమునకును సంబంధముకలుగజేయుటలో మూడుశక్తులు ప్రకటమగుచున్నవి. అవెవ్వియనగా ఒకటి యేబిందువునుండి శక్తిబయలుదేరి వెడలుచున్నదో ఆబిందువు; రెండవది, యేధారమీదుగ నాశక్తి ప్రవహించుచున్నదో ఆధార; మూడవది, యేబిందువుమీద నాశక్తి ప్రభావమును చూపుచుండునో ఆబిందువు. (ఈవిషయము, లోహపుముక్క, అయస్కాంతముల దృష్టాంతముద్వారా చక్కగనవగాహనకాగలదు.) మఱియు నాశక్తి ఆవస్తువును తనవైపునకు (అనగా అయస్కాంతమువైపునకు) ఆకర్షించుకొనుటలో మఱిమూడుశక్తులు ప్రకటమగుచున్నవి. ఈప్రకృతినియమము ననుసరించియే ప్రతిమండలములోను ఆఱేసిశక్తులు ప్రకటమైనవి. అనగా ఆత్మభండారమైన దయాళుదేశములో ఆఱును, మనోభండారమైన బ్రహ్మాండదేశములో ఆఱును, స్థూలపదార్థముయొక్కభండారమయిన పిండదేశములో నాఱును. వీనిలో పైమూడుశక్తులును ప్రకటముగనుండి, క్రిందిమూడును వానికిఛాయలుగ నున్నవి. ఇపుడు శరీరము మనస్సు ఆత్మయు ననుమూడు వస్తువులునుగాక నాల్గవది మఱొకటిలేదు. పిండ, బ్రహ్మాండదయాళుదేశములు మూడును, ఈమూడింటికే భండారములు. కావున ఒక్కొక్కభండారములో ఆఱేసిభాగములుకన్న యెక్కువయుండుటకు అవకాశమే లేనందున మొత్తము ఖండములన్నియుగలిసి పదునెనిమిదికన్న నెక్కువయుండ నేరవని సిద్ధమగుచున్నది. ఈపదునెనిమిదిలోకములనుగుఱించిన రహస్యమునంతను రాధాస్వామిదయాళు రనుగ్రహించి మనకు తెలియజెప్పిరి. ఇంత యుచ్చతమరహస్యము ప్రకటించగలసామర్థ్యము మఱేయవతారమునకుగాని, దేవదూతకుగాని లేదు.

ఏలననగా ఏదైననొకక్రిందిలోకమువఱకే సిద్ధిపొందినవానికి, అంతకన్ననున్నత లోకములవిషయము తెలియనేరదు; కాని ఉన్నతలోకమువఱకు సిద్ధిపొందిన వానికి, దానిక్రిందిలోకములన్నిటివిషయములును ప్రకటమైపోవుచుండును. కావున అవతారపురుషులందఱిలో రాధాస్వామీదయాళుడు అంతిమావతార మని చెప్పుట యుక్తము. అటులనే రాధాస్వామీధామమునుమించిన మఱొక ధామమెద్దియు ప్రకటముకానేరదని సిద్ధమగుచున్నది. అందుచే నీమతము యొక్క మహిమనుగుఱించి నిస్సందేహముగ మనస్సున పరిపూర్ణవిశ్వాసము స్థిరపడుచున్నది. ఆధ్యాత్మికాభ్యాసమునకు అట్టివిశ్వాసము అత్యంతావశ్యకము.

## 13

### వివిధప్రశ్నలకు సమాధానములు.

సమకాలికసద్గురువునం దెవనికైనను భక్తిప్రేమ లుదయించినపు డతడేమి చేయవలయును? అని అలబేలీసరన్‌గారు ప్రశ్నించగా భగవంతునివిషయములో భక్తుడు ప్రవర్తించినవిధముగా ప్రవర్తించవలయును అని సెలవిచ్చిరి.

అపు డాయన మఱికొంతవివరముగ చెప్పవలసినదని ప్రార్థించగా, సంపూర్ణభక్తివిశ్వాసములతో సద్గురువునకు శరీరమనోధనములర్పించి సేవచేయవలయునని సెలవిచ్చిరి.

ఆత్మ (సురత్) యొక్క సేవలోనే నిజముగ నన్ని సేవలు నిమిడియున్నవి. ఏలననగా, ఈసేవలన్నియును ఆత్మసేవయొక్క అవశ్యకమైన అంగములే. ప్రధానవిషయమేమనగా యెల్లపుడు వారిచరణములయందే ఆశపెట్టుకొని యుండవలెను.

ప్రశ్న :—హుజూర్ మహారాజువారిభండారా నిమిత్తమై పంపెడి భేంటు సొమ్మును ఆగ్రాలోనే వెచ్చించవలసియుండినపుడు సత్సంగులు ఆ భేంటు సొమ్మును మహారాజ్ సాహబ్ వారివద్దకు అలహాబాదు ఎందుకుపంపెడివారు? దీనికికారణమేమి?

సమాధానము :—సద్గురునిదయ సంపాదించుకొనునిమిత్తమై అట్లుపంపెడి వారు.

అలబేలీసరన్‌గారు "సంత్ సద్గురువు ప్రకటమైనపుడు ఇదిజరుగగలదు, ఇదిజరుగగలదు అనుచు మహారాజ్ సాహబ్ వారు సెలవిచ్చుచుండెడివారు. ఈ

విధముగా సంతులు చెప్పుచు నేయుందురా ?" అని మనవి చేసుకొనెను.

అంతట సర్కార్ సాహబ్ వారు, "మహారాజ్ సాహబ్ వారి కాలములో శరీరమనోధనములతో సేవచేయు కార్యక్రమమెద్దియు కట్టిపెట్టబడలేదు. రాధా స్వామీదయాళు రెపుడైనను ప్రకటమైనచో నపుడు సత్సంగులకు తప్పకుండా పరీక్షావిమర్శలు తీవ్రవిధమున జరిగితీరును. ఏలననగా, ప్రత్యక్షమైనమహా దయకు ఎవరయినను కఠినమైన పరీక్షలో ఉత్తీర్ణులయినప్పుడే అర్హులుకా గలరు" అని సెలవిచ్చిరి.

ప్రహ్లాదుని నతనితండ్రి చాలకష్టములు పెట్టినతరువాత నతని నొక స్తంభ మునకు కట్టివేసి ప్రక్కన ఖడ్గమునుచేతపట్టుకొని నిలబడగా, ప్రహ్లాదునికి మన స్సులో గాబరా కలిగెననియు, కాని అతనికి ఆగాబరాపోగొట్టుటకై అక్కడ నొక చీమ కనబడెననియు దానివలన నతనికి ధైర్యమువచ్చెననియు పురాణ ములలో వ్రాయబడియున్నది. అదేవిధముగ ఇక్కడ రీపనముచేయువృక్షులలో కూడ మాకు ధైర్యము కలిగించునిమిత్తమై ఒకచీమనైన ప్రాకించరా, యని ఒకరు ప్రశ్నించిరి.

"ఆంతర్యసహాయము పొందుటకై ప్రయత్నించుడు. ఆంతర్యానుభవము లేని విశ్వాసము దృఢమైనది కానేరదు. అట్టివిశ్వాసము తొలగిపోయి దాని స్థానే యథార్థమైనవిశ్వాస మేమాత్రమున్నను మంచిదే." అనిసెలవిచ్చిరి.

ప్రశ్న :—కఠినమైనపరీక్ష చేసినచో సత్సంగులలో చాలమంది తగ్గిపోరా ?
సమాధానము :—దృఢవిశ్వాసములేనివారు కొంతకాలము దూరముగ నుండిపోవుదురు.

ప్రశ్న :—"చోరీ సే ఖావింద్ రీఝూ"

(చౌర్యమువలన స్వామి సంతసించును) అనువచనము కేవలము సత్సం గులకుమాత్రమే వర్తించునా, లేక మహామహులకుగూడ వర్తించునా యని బాబూభోలానాథ్ గారు ప్రశ్నించిరి.

జవాబు :—మనబోటిసత్సంగులందఱికి నది తప్పకుండవర్తించును. మహా మహులవిషయము మేమేమియు చెప్పజాలమని సెలవిచ్చిరి.

# 14

## సరియైనమతమునకును మిగతమతములకును వ్యత్యాసము.

12 ఆగష్టు 1908 :— అడవిలో ముండ్లమొక్కలువగైరా పనికిరాని మొక్కలు వాని నెవరును ప్రత్యేకముగ పెంచనక్కఱలేకుండగనే వానంతట నవి విరివిగ బయలుదేరి పెరిగిపోవుచుండును. కాని శ్రేష్ఠమైన ఫలవృక్షములు, సువాసనగలపూలమొక్కలు మొదలైనవి బహుకష్టముమీదకాని బయలు దేరవు. కొంచెము అశ్రద్ధచేసినచో చనిపోవునంత సున్నితముగనుండును. అటు లనే పరమార్థములోగూడ లోకములో అనేకవిధములైనమతములు, పరమార్థ సంఘములును, వానికెవరును సంరక్షణచేసెడివారు లేకపోయినను పెరిగిపోవు చునేయున్నవి. ఎవరునుకూడ తనఆధ్యాత్మికాభివృద్ధినిగుఱించి పరిశీలించు కొనుటలేదు. కాని మనసత్సంగులు తమపారమార్థికాభివృద్ధికొఱకై శక్తి కొలది పట్టుదలతో పాటుపడుచునేయుండి తమకభివృద్ధి యింకనుకలుగలేదని విచారపడి, పశ్చాత్తాపపడుచున్నారు. దీనినిబట్టి యిది వాస్తవమైనట్టియు లాభ దాయకమైనట్టియు మతమని తెలియుచున్నది. పరమార్థము నామమాత్రమైన లేనట్టిమతములవారు ఆయామతవిషయములనిమిత్తమై ప్రాణత్యాగముకూడ చేయుట కెంతయుసిద్ధముగనుండుటయు, రాధాస్వామీమతములో ప్రతివిషయ మునుగుఱించియు, చాలవిమర్శచేసి ఆలోచించుకొనుటయు చూడగా పైకి ఆశ్చర్యకరముగనే యుండును. కాని ఒక్కొక్కఅడుగు చాలవిచారవిమర్శలు సల్పినపిమ్మటనే ముందునకు వేయుట యథార్థమతముయొక్క లక్షణము. ఎవ రైనను ప్రతివిషయములోను తానేమైనతప్పుచేయుచుంటినాయని తనకుతాను విమర్శించుకొనుచుండుట భగవంతునిమహాదయ అతనిమీద నున్నట్లు సూచన. రాధాస్వామీమతస్థులు సర్వప్రభువగు రాధాస్వామీదయాళువారొక్కరి యందుతప్ప మరెవరియందును ఆశపెట్టుకొనకుండనుండుటలో అచంచలమనస్కు లైయుందురు. ఎంతవిముఖముగనున్ననుగూడ, తమవిశ్వాసములోమాత్ర మిట్టి లోపము గలుగకుండునట్లాగున ప్రయత్నించవలయును. మనస్సున కెట్లయిన నచ్చ చెప్పుకొని విశ్వాసము నెల్లప్పుడు దృఢపఱచుకొనుటకై ప్రయత్నించవలయును. లేనిచో స్వామీముగవారే క్షతనిని సంరక్షించుదురు, కాని అప్పుడుతనికి కొంత కష్టముగలుగును.

# 15

సర్కార్ సాహబ్ వారి మిశ్రితవచనములు.

"హంసనీ ఛానో దూధ్ ఔర్ పానీ"

ఓహంసా, పాలను నీటిని వేఱుచేసుకొనుము.

ఏసత్సంగిమైనను తనకెట్టిపరిస్థితిగల్గినను దానిలో తనవిశ్వాసము దృఢపఱచుటలో సహకరించునట్టివిషయములనే గ్రహించుకొనుచుండవలెను. క్షీరమును నీటిలోనుండి వేఱుచేసికొను ఁడనుటలో నిదికూడ చేరును. లౌకికవిషయములనుండి విముఖత కలుగుచుండుటయు, తిరిగి ఆవిముఖతకు విఘ్నములు వాటిల్లుచుండుటయు, ఆధ్యాత్మికాభివృద్ధికై చాలఆవశ్యకము.

నేనిప్పుడే పరమపురుషునిచరణములలో కలిసిపోయితిననియు, నేనెప్పుడును నియమప్రకార మాధ్యాత్మికసాధనలను చేసికొనితీరుదుననియు దృఢనిశ్చయముండినయెడల, దానివలన మహాలాభముండును. ఇట్టిదృఢనిశ్చయమును, దానియొక్క మహాఫలితమునుగుఱించి దృఢవిశ్వాసమును గలిగియుండినచో, నట్టినిశ్చయమును ఆవిశ్వాసమునుమాత్రమే మహాలాభదాయకముగ నుండును. అందుకు ప్రత్యక్షఫలితము అట్లునిశ్చయముచేసికొన్నసమయములోనే కొంతవఱకు లభ్యమగును.

ఇద్దఱుమానవులు, ఒకరుఒకరావిచెట్టుక్రిందను, మఱొకరుచింతచెట్టుక్రిందను కూర్చుండి తపస్సుచేసికొనుచుండిరి. నారదమహాముని ఆరావిచెట్టుక్రింద నున్నవానిచెంతకు జేరి ఆరావిచెట్టునకున్నఆకులెన్నిగలవో అన్నిసంవత్సరములు తపస్సుచేసినయెడల నతనికి భగవంతుడు దర్శనమిచ్చునని చెప్పెను. అంత నామనిషి అంతదీర్ఘకాలమా అని తలచుకొని విచారగ్రస్తుడయ్యెను. నారదముని రెండవవానివద్దకు వెడలి, చింతచెట్టుకుఎన్నిఆకులుగలవో అన్నిసంవత్సరములయినపిదప నతనికి భగవద్దర్శనముకాగలదని చెప్పెను. అతడు తనకు భగవద్దర్శన మెప్పటికైనలభించగలదని నారదమునిచేసినవాగ్దానముపైన నమ్మకముగలిగి ఆయానందములో నతనిప్రేమభక్తులు అపరిమితముగవృద్ధినొందినందున వెంటనే అతనిఆత్మ అంతర్ముఖముగఆరోహించుటచే నతనికి భగవద్దర్శనభాగ్యము అప్పుడే లభించెను. కావున యీవిధమైననిశ్చయములు, ఫలాభిలాషలు నుండుటయే బహులాభదాయకము.

పరమార్థమునిమిత్తమై ఒక్కగవ్వఖర్చుపెట్టినచో, దానికి నూరురెట్లు, వేయిరెట్లు, అంతకన్నకోటిరెట్లుకూడా ఫలితము చేకూరగలదని శాస్త్రములలో చెప్పబడినది. ఈవిషయము పైకీపరిహాసాస్పదముగనే కనబడవచ్చును, కాని అది పూర్తిగా సత్యమయినవిషయము. లోకము పూర్తిగా కర్మప్రధానమైనది. లౌకికకార్యములలో చూడుడు, ఎవరైన విత్తనములు చల్లినచో నతని కెన్నిరెట్లెక్కువఫలితము వచ్చుచున్నదో, మఱియు నట్లనేయితరకార్యములలోకూడ పడినపరిశ్రమకన్న ఫలిత మెన్నియోరెట్లెక్కువవచ్చుచున్నది. అయితే పరమార్థములోవృద్ధి అంతకన్నమిక్కిలిఎక్కువగ నుండును. లౌకికకృత్యములలో చైతన్యాంశ హీనముగనుండునుకావున ఆకృత్యములఫలితము నాయంశ అంత యెక్కువగా వృద్ధిచేయనేరదు. కాని పరమార్థములో ఆత్మ ఊర్ధ్వధారతో కలియుచుండునుకావున నది శక్తినిసంపాదించుకొనుచుండును. అందుచే పారమార్థికకృత్యములవలన గలిగెడిమహాలాభము ఊహించశక్యముగాదు. వైకుంఠములోనిసుఖముతో పోల్చగా సకలప్రపంచముయొక్కచక్రవర్తిపదవికూడ బహుతుచ్ఛమైనది. అట్టిస్థితిలో అల్పశ్రేణికిచెందిన పారమార్థికకృత్యములలో శరీరమనోధనముల నర్పణచేయుటచే వైకుంఠములభించునవినయెడల ఉత్తమతరగతిపారమార్థికకృత్యమైన ఆధ్యాత్మికాభ్యాసమువలన గల్గుమహాలాభమునకు హద్దేముండును ?

ఎంతస్వల్పాతిస్వల్పమైన పారమార్థికకృత్యమునుకాని లేదా, ఎవనికైన నొకసహాయమునుకాని చేసినపుడు ఫలితమేమియు నుండదని తలంచరాదు; దానికిగూడ గొప్పప్రభావముండును. అయితే, జనులు చేయునట్టి చాలగొప్ప పొరపాటు ఏమనగా అప్పటికప్పుడే దానిఫలితము బహుమానమును లభించవలయునని ఆశపడుచుందురు. ఏకృత్యమునకైనను ఫలితము సామాన్యముగ కొంతకాలమయినపిదపనే ప్రకటమగుచుండును. రాధాస్వామీమతములోని అభ్యాసఫలితము అప్పటికప్పుడు వెంటనే ప్రకటముకాదు. దర్శనములభించుటయు, ఆత్మయొక్కఅంతర్ముఖమైనఆకర్షణయు మొదలైనఫలితములు బాహ్యవిషయములు, ఉత్త పైపొట్టువంటివి. పైపొంగు ఎట్లు దిగజారిపోవునో, పైపొట్టు నెట్లుతీసిపారవేయుదురో, ఈఫలితములుగూడ నట్టివే. కావున, ఇవన్నియుగాక, మీకు ఇంతకన్నను అద్భుతదయ తప్పక కలుగగలదని విశ్వాసము పెట్టుకొనుడు. చైతన్యధారకెదురుపడినపుడు సంస్కారము లెట్లు బలవత్తరము

లగుచుండునో, అటులనే చైతన్యధారవలన పారమార్థికాభ్యాసముకూడ బల వత్తరమైనప్రభావమును పొంది వృద్ధియగును.

ఒకవ్యక్తి తనఆర్థికకష్టములను మనవిచేసుకొనగా హుజూరువారు, "ఇట్టివారిబాధలు, కష్టములును తొలగించగలందులకై, ధనము చాల యధిక ముగ లభించులాగున రాధాస్వామీదయాళురు మౌజ్ (దివ్యేచ్ఛ) వహించు దురుగాక. కాని అదంతయు భగవదిచ్ఛాధీనము. మనబీదసత్సంగులు ఒక్కొక్క బొట్టుచొప్పున, నిప్పుడిచ్చుచున్న ద్రవ్యమువలన, మనఆవశ్యకతలతటాకము నిండు టయే చాలకష్టముగనున్నది. సామాన్యముగ ప్రతిదినము అయ్యెడిఖర్చునకే అది చాలుటలేదు" అనిసెలవిచ్చిరి.

యహ కరనీ కా భేద హై నాహీం బుద్ధి బిచార్ ।
బుద్ధి ఛోడ కరనీ కరో, తబ్ పావే కుఛ్ సార్ ॥

అర్థము :—ఈరహస్యము అభ్యాసముచేసి తెలిసికొనవలసినదేకాని తర్క విచారమువలన తెలియునదికాదు. కావున నీబుద్ధిని, తెలివితేటలను అటుంచి, అభ్యాసముచేయుము. అప్పుడే దానిమహిమ కొద్దిగ నీకు తెలియగలదు.

అనగా రాధాస్వామీమతములోచేరినపిదప నెవరు నిక తమబుద్ధిని ఉప యోగించకూడదని భావముకాదు. రాధాస్వామీమతముయొక్క మహాత్వ మును మొదట నవగాహనచేసికొనవలెను. పిమ్మట అభ్యాసములో దిగవలెను. కాని యెల్లపుడు వాదవివాదములలోనే పడియుండకూడదు. మొదట దాని యథార్థవిషయమునుగుఱించి బాగుగబోధపరచుకొని, ఆతర్వాత నభ్యాసముచేసి కొనుచుండవలెను, అనగా ప్రయోగములోపెట్టుకొనుచుండవలెను. అయితే అభ్యాసముకన్న శ్రద్ధయెక్కువప్రధానము. ఎట్లనగా, ఒకమనిషి చీపురుతో తుడిచెడిసేవచేయుచున్నను, అతనిమనస్సెప్పుడును ప్రాపంచికాలోచనలలోనే పడియున్నదనుకొనుడు. మఱొకరు ఆసేవ తనకులభించినచో, చేయుదమనెడి కోరికతోనుండి, ఆసేవనుగుఱించియే యెప్పుడు నాలోచించుకొనుచు నుండినచో, నతడు మొదటివానికన్న మెఱుగే. అయితే, అతను అసలు ఎప్పటికిని సేవ చేయనేలేడని దీనిఅర్థముకాదు. నిజమైన ఆసక్తి యున్నచో సేవకుసావకాశము లభించకపోవుట అసంభవము. ఎవరైనను ఇరువదియేండ్లనుండి, సత్సంగములో నుండవలెనని కోరుకొనుచున్నను, ఆకోరిక పూర్తికాలేదని యన్నయెడల, అది

అతనిమనస్సు చేసెడిమోసమే. ఒకత్రాయినికాని మఱిదేనినికాని లాగవలె నన్నచో రెండుపద్ధతులున్నవి. దానికొకత్రాడుకట్టి, చనిపోయినకుక్కను లాగి నట్లుగా నేలమీద లాగికొనుచుపోవుట, యొకటి. అందులో లాగబడెడివస్తువు నకు నేలతాపిడి యుండును, లాగువానికికూడ భారముగల్గును. రెండవపద్ధతి, గుండ్రనిచక్రములపైన నొకబల్ల పెట్టి దానిమీదనావస్తువునుంచి లాగుట. అట్లు చేసినందువలన లాగువానికి శ్రమ తక్కువగనుండును, లాగబడెడివస్తువునకును దెబ్బతగలదు. ఇట్లే రాధాస్వామిదయాళురుకూడ చక్రములమీదనే జీవులను తీసికొనిపోవుచున్నారుకాని, క్రిందపెట్టియీడ్చుటలేదు, అనగా బలాత్కార మేమియు చేయుటలేదు. వచనములను సెలవిచ్చి బోధపరచుటమాత్రమే చేయు చున్నారు నెట్టుడుబండిచక్రముయొక్క భాగమేదైనను పైకివచ్చినపిమ్మట నది మెల్లగా తిరిగి క్రిందికికూడ నెట్లువచ్చుచుండునో, అదేవిధముగా మనస్సనెడి చక్రి మొకప్పుడు, సద్గురునివచనములనువిని సంపూర్ణానందభరితమయ్యును, అభ్యాసములో నానందము పొందియును, పైకెక్కిపోవుచుండును, అనగా తన కింతటిసత్యమైన యుత్తమమార్గము తనమహాదృష్టమువలన లభించినదని సంతో షించుచుండును, మఱొకప్పుడు, పనులు తాననుకొన్నట్లు సాగకపోయినను, ఆంతర్యానందము కలుగకపోయినను విముఖతనొంది తనకేమియు బోధపడుట లేదని విసుగుకొనుచుండును. అనగా, నీమనస్సనెడి చక్రము పైకిని క్రిందకును ఇవ్విధముగ తిరిగిపోవుచుండగా సత్సంగికి ఆధ్యాత్మికమార్గములో ప్రయాణము ముందుకు సాగిపోవుచుండును.

## 16

మహాదయాసమయము ముందు రానైయున్నది. అభ్యాసముచేయుటలో లోపమున్నను శరణ్యాభావము, విశ్వాసములోను లోటుండనీయకూడదు.

లక్నో, జనవరి 1911 :—పూర్వకాలములో హిందువులు రాజ్యముచేసి నపుడు, ఇంతవఱకు నెవరికితెలియనట్టి గొప్పగొప్ప ఆవిష్కారములు, అభివృ ద్ధులు జరిగినవని కొందఱు చెప్పుచుందురు.

అదంతయు శుద్ధపొరపాటని హుజూరువారు సెలవిచ్చిరి. ఆకాలములో కూడా యంత్రములువగైరాలు కనిపెట్టిరన్నమాట నిజమే. కాని ఆకాలపు జనులు కొద్దిగ నున్నతలో కారోహణచేసినందువలన నట్లుజరిగినవికాని, కావల

సినపద్ధతిగా కాలేదు. వానిని సరియైనవిధముగ నుపయోగములోనికి తెచ్చుకొననులేదు. ఈకాలములో మహావేగముతో కనిపెట్టబడుచున్న ఆవిష్కారములు, యంత్రములుమున్నగునవన్నియు భగవదిచ్ఛమూలముననే అట్లుకనిపెట్టబడుచున్నవి. ఏయేపదార్థములవలననేయేపర్యవసానములు తేల్చుకొనదగియున్నవో, ఆ యా పర్యవసానములను సకాలములో తేల్చుకొనుచునేయున్నారు. అటులనే పరమార్థమునగూడ, నింతకుముం దెన్నడుకలుగనట్టి విచిత్రానుభవములు భక్తజనులకు కలుగుచున్నవి. మహోదయ ముందుముందు రానైయున్నది. ఎట్టిసమయము రానైయున్నదనగా, దానినిగుఱించి యిప్పుడప్పుడే చెప్పుట చాలతొందరగ చెప్పినట్లగును. సమస్తప్రపంచమునను రాధాస్వామీదయాళునిరాజ్యము చలాయించుసమయము రాబోవుచున్నది. ముందుముందు ప్రాపంచికముగగూడ భక్తజనులు పెద్దపెద్దహోదాలలో నియమింపబడుచుండుటయు, నందుచే పారమార్థికవిషయములు, సాంసారికవిషయములుగూడ నత్యుత్తమవిధమున నెఱవేరుటయు జరుగగలదు. సాంసారికబంధనములుగూడ శూన్యమైపోవును. ఇప్పుడుజరిగెడి ఆవిష్కరణములుమున్నగునవన్నియు భవిష్యములో రానైయున్నసమయమునకై జరుగుచున్న యేర్పాట్లే. లోకమునకు మహోపకారకమును అనుభవప్రమాణమునైన (Practical) మతమేదైననొకటి బయల్దేరినచో దానివలన తాముకూడ లాభమునొందవచ్చుననెడి ఆతురతయు, నుత్సాహమును చాలమందికి లోలోపలనుండి బయల్దేరుచున్నవి. ఇంచుమించన్నిమతముల లోనివారు నాయామతములను పైపైకి మన్నించుచున్నను, హృదయపూర్వకముగ మన్నించుటలేదు. ఇదంతయు భగవత్ప్రేరణవలననే జరుగుచున్నది. రానురా నీమతములన్నియు పోయి సమస్తప్రపంచమునందు నొక్కరాధాస్వామీదయాళునిరాజ్యమే చలాయించును. ఆసమయములో నాత్మలుకూడా, ఉత్తమోత్తమమండలమునుండి దిగివత్తురు.

నడతనుగుఱించి చెప్పుచు, అభ్యాసములో లోపమున్న నుండనిండుకాని, శరణ్యాభావములోమాత్ర మెట్టిలోటు నుండకూడదని సెలవిచ్చిరి. ఇంకను (భగవచ్చరణముల పొందుటకొఱకై) ఆశ నెన్నడు విడనాడకూడదు. ఈభావముల మూలముననే జీవకళ్యాణకార్యమంతయు నెఱవేరును. ఆ ఆశవలననే విశ్వాసమును విశ్వాసమువలననే ఆంతర్యానుభవములును గలుగుచుండును. ఆయనుభవములవలన ప్రేమ జనించును; ప్రేమవలన సమస్తకార్యములు నెఱవేరును.

మఱియు ప్రతిదినము నభ్యాసము చేయుచు నుండవలెను. ఉదాహరణకై యెవరైన నొకమణుగుబరువు నెత్తగలశక్తిని పొందవలెనన్నచో, నతడు ఒక్కొక్కతులము చొప్పున రోజురోజు హెచ్చించుచు బరువునెత్తుచుండినచో నతనికి ఒకటిరెండుసంవత్సరములలో ఆభారమునంత నెత్తివేయగలశక్తి చేకూరును. అట్లుగాక నతడు బద్ధకించి యుండిపోయి, ఒక్కసారిగ నాబరువునంతను నెత్త బోయినచో నలిగి పిండిగుండ యైపోవును.

## 17

<u>ఇతరులపదార్థములను స్వీకరించుటవలనను, ఇతరులసహవాసమువలనను గలుగులాభనష్టములు, భక్తజనులప్రవర్తన యెట్లుండవలెను.</u>

4 జనవరి 1911 :—మహారాజసాహబ్ వా రొకకథ చెప్పెడివారని సెలవిచ్చిరి. ఒకపట్టణములో నొకముష్టివా డుండెడివాడు. అతడు ముష్టియెత్తి సంపాదించినరూప్యముల నొకబొంతలోపెట్టి కుటివేయుచుండెడివాడు. అవి మొత్తము 70, 80 రూప్యము లయ్యెను. ఇంతలో నాపట్టణములో కలరా వచ్చి అతడుకూడా కలరావల్ల చనిపోయెను. చనిపోవకముం దత డారూపాయిలబొంత నొకగొయ్యిత్రవ్వి అందులో కప్పెట్టెను. కొంతకాలమైనపిదప కొందఱు తుంటర్లు ఆప్రక్కనుండి వెళ్లుచు నాగోతిప్రక్క నొకపామును చూచిరి. అప్పుడు వారికి ఇక్కడ నొకఫకీరు నివసించుచుండెడివాడని జ్ఞాపకమువచ్చి బహుశః అతడచ్చట డబ్బు పాతిపెట్టియుండవచ్చునని యాలోచనగలిగి, ఆగొయ్యి త్రవ్వి డబ్బుతీసికొని తమసంతోషముతీరులాగున ఖర్చుపెట్టి తినిరి. కొద్దికాలముననే వారందఱు నొకరితరువాత నింకొకరికి కలరావచ్చి చాలబాధపడి చనిపోయిరి. ఇంకొకకథకూడ చెప్పెడివారు. అదేమన ఒకఅడవిలో ఒకభక్తుడైనసాధు వుండెడివాడు కొందఱుదొంగ లాప్రక్కనుండిపోవుచు నొకరాత్రి సాధువుతోనుండిరి. ప్రొద్దున వెడలిపోవునపు డాసాధువుయొక్కపాత్రను, త్రోవలో నీరుత్రాగుటకు పనికివచ్చునని యోచించి, పట్టుకొనిపోయిరి. కొంత దూరము వెళ్ళినపిమ్మట, ఆసాధువుయొక్కపాత్రను దొంగిలించితిమి, ఇది మంచి పనికాదు అని వారలకుబుద్ధిపుట్టి వెనుకకువచ్చి ఆపాత్రను సాధువునకు తిరిగియిచ్చివైచి మహాలజ్జతో క్షమార్పణ వేడుకొనిరి. ఈకథలు రెండింటికిని నీతి యేమనగా, ఒకవస్తు వెవ్విధముగా సంపాదించబడునో, ఆవస్తువును తీసికొన్నవాని

మీఁద నాసంపాదనవిధముయొక్క ప్రభావము పడునని తేలుచున్నది. ఇది యొక శాశ్వతనియమము. ఎవరును మఱియొకరివస్తువును తీసికొనకూడదు. ఏలననగా, ఆవస్తువుయొక్క సంపాదనవిధమునుబట్టి దానిప్రత్యణువునందు నట్టికర్మభారము పడియుండును. ఒకవిధముగ నది అతఃకర్మలతో పూటుగ నింపబడి యుండును. ఆవస్తువు నేమనిషి తీసికొన్నను ఆకర్మలభారము నతడు తనపైన వేసికొనును. ఇంతియగాక ఒకసత్సంగి మఱియొక సత్సంగిదేలయినను ద్రవ్యమును, ఆహారపానీయములనుగూడ తీసికొనకూడదు. ఎందుకనగా ఒక్కొక్కనికర్మలు ఒక్కొక్కవిధముగా నుండును. ఒకరి కెక్కువ కర్మలైతే, మఱొకరికి తక్కువగనుండును. తప్పనిసరిపరిస్థితిలో ఒకవేళ తీసికొన్నయెడల నతనికి దానికి తప్పక బదులుతీర్చవలెను. అతడట్లుతీసికొననియెడల ఆసొమ్ము పరమార్థవిషయములోనైన ఖర్చుపెట్టవలయును. భగవత్కృపచే యెవనివస్తువైనను సంతులుపయోగించుట తటస్థించినచో అందువలన అతనిపైన మహాదయగల్గును.

సహవాసమునుగుఱించికూడ చెప్పుచు, దానికి చాలగొప్పప్రభావముండునని సెలవిచ్చిరి. ప్రతిమానవునిలోనుండియు కామ, క్రోధ, లోభ, మోహాహంకారములనెడి పంచవికారములయొక్క ధారలు అనంతముగ బయల్వెడలి, ఒక్కొక్కధార ఒకవర్తులాకారముగ నతనిచుట్టు నావరించియుండును. ప్రాపంచికజీవునికి నిల్లై మాలిన్యము ఒకబుగ్గలోనుంచి నీరు పైకితన్నుచున్నట్లుగా పైకి బయల్వెడలుచుండును. కావున నతనితో సహవాసముచేయువానిపైన తప్పకుండ నామాలిన్యవలయముయొక్క ప్రభావము పడుచుండును. కాని మహాత్ములయొక్కయు సంతులయొక్కయు సహవాసమువలన మహాలాభమే గల్గును. ఏలననగా, వారిలోనుండి యెల్లపుడును దయాసాత్వికవృత్తులధారలుబయల్వెడలి వారిచుట్టు నొకతేజోవలయముగ నేర్పడి, మాలిన్యచక్రమును నశింపజేయును. ఎట్లనగ, నొకచిన్నదీపపుకాంతి కొద్దిదూరముమాత్రమే వ్యాపించును, కాని ఒకపెద్దదీపముయొక్క లేక ఒకల్యాంపు (lamp) యొక్క ప్రకాశము చాలదూరమువఱకు వ్యాపించునుకదా. సాధువులు సంతులయొక్కయు సాంగత్య మెవనికైనను అదృష్టవశాత్తు లభించినచో, నందువలన నతనికి మహాలాభము చేకూరును. ఏలననగా, వారు నిర్మలచైతన్యమునకు భండారము. వారివద్దనుండిబయల్వెడలుధారలు మహాతేజఃప్రకాశములుగలవై బహుదూరమువఱకు తమయుత్తమప్రభావమును వ్యాపింపచేయును.

కావున ప్రతిసత్సంగియు తనప్రవర్తనను పూర్తిగా సన్మార్గమున నుంచు కొనవలయును. తనస్వార్జితమైన ద్రవ్యమునే ఖర్చుపెట్టుకొనుచుండవలయును. మఱియొకరిద్రవ్యమును వాడుకొనకుడు, లేనిచో నందుకు రెండుమూడురెట్లెక్కువ నష్టమునుసంభవించును. తాను స్వంతముగా సంపాదించినద్రవ్యమునే వాడుకొనెడివానికిమహాసంతోషము చేకూరుచుండును. తమకు చాలడబ్బు దొరికినట్లైతే, పరమార్థము చాలయధికముగా చేసికొనగలమని యనుకొనెడివారు గొప్పపొరపాటు పడుచున్నారు. ఎప్పుడును వ్యాకులపరిస్థితిలోనుండువారే నిజముగా పరమార్థము చేసికొనగలరు. ఎప్పుడును నేదోయొక బాధతోను, ఏదోయొకకష్టముతోను, విచారగ్రస్తుడైయుండుటయే మేలు. భక్తుడెప్పుడు గంభీరహృదయుడై యుండవలయును. భగవంతుడతనికి సమస్తమునిచ్చివేసెనన్నట్లుగనే సంతృప్తితో నుండవలయును. ఇతరులమీద తనఅహంకారమును ప్రదర్శించకూడదు. ఎవరైన గొప్పవారివద్దకు వెళ్ళినపుడు చాలగౌరవమర్యాదలతో ప్రవర్తించవలెను. భక్తుడెప్పుడు సుశిక్షితుడుగా ప్రవర్తించవలెను. భక్తజనులు రాజసభకు దేనికైనను వెళ్లెడియవసరము గల్గినచో నచ్చటిమర్యాదలను అత్యుత్తమరీతిని పాలించుదురు.

## 18

### అనధికారిజీవులనుండి తప్పించుకొనుటకై సంతులుచేయు పరీక్షలు.

5 జనవరి 1911 :— ఈరోజున వాతావరణమంతయు చాలస్వచ్ఛముగ నుండెను. మామూలుసమయముననే సత్సంగము ప్రారంభమైనది. శబ్దపాఠమైనతోడనే హుజూరువారొకసాధారణవిషయముపైన నొకటిరెండునిముషములసేపు మాట్లాడెదమని సెలవిచ్చిరి. సంతుమహాత్ములు ఇంచుమించుగ నందఱు గృహస్థాశ్రమములోనే యుండిరి. బ్రహ్మాండమునుండివచ్చిన రామకృష్ణాద్యవతారపురుషులందఱునుగూడ గృహస్థులుగనే యుండిరి. నిర్మలచైతన్యదేశమునుండి అవతరించినసంతుమహాత్ములును, ఆదేశమునకుదగ్గఱనుంచి, అనగా నున్నలోకము దానిపైలోకములనుండియు వచ్చినయవతారపురుషులును గృహస్థులుగనేయుండిరి. కాని సామాన్యసంసారులందఱికిని మాత్రము జేగురుబట్టలుధరించునట్టి సన్యాసులే గురువుగ స్వీకరించతగినవారనెడి భ్రాంతి యుండిపోయెను. అట్టి వేషధారి యెవరైన నగుపడినచో, నతడెంతవిద్యావిహీనుడైనను, ఎంతపరమార్థజ్ఞానము లేనివాడైనను, అతడే పరిపూర్ణసాధువని వారు

తలంచుచుందురు. కాని ఇదికూడ భగవదిచ్ఛయే. ఏలననగా, పరమార్థమునే ప్రధానముగ కోరుచుండెడి సంస్కారిజీవులెట్లైనను సంతుమహాత్ముల సత్సంగములోనికి వచ్చివేయుదురు, కాని మిగిలిన వేలకొలది ప్రాపంచికజీవులు ఈ బాహ్యావేషము వేసికొన్న సన్యాసులయందే భక్తిపెట్టుకొని యుండిపోవుదురు. ఈ వేషధారు లోకవిధమైనవహారాదార్లుగ నున్నారు. లేనిచో, సంస్కారములు లేనివారు తండోపతండములుగా సంతులవద్దకు వచ్చివేయుదురు. అదిసంతుల కిష్టములేదు. ఏలననగా. వారికి కేవలము సంస్కారులొక్కరినే తమచరణము లందు చేర్చుకొనుట యిష్టము. సంతుమహాత్ములుకూడ, తమరూపము, వచనములు గ్రంథములమూలముగ భావముపుట్టించి, ఆవిధముగనే సంస్కారిజీవులను తమచరణములయందు లగ్నముచేసుకొందురు. సంసారిజీవులెవరైనవచ్చినచో, తమవచనములు, గ్రంథములమూలముననే వారిని దూరముగనుంచుదురు.

ఒకప్పుడు గురునానక్ వారికాలములో సత్సంగములో సమ్మర్దమెక్కువై పోగా, వారు “ఈరోజున మేము మాంసము తినెదము. మాంసము తీసికొని రండు” అని పరీక్షార్థమై సెలవిచ్చిరి. వచ్చినవారిలో సగముమంది యీమాట వినినతోడనే బయటికిపోయిరి. ఇంకను మిగిలినవారు నానకువారు ఊరకనే అట్లు అనుచున్నారుగాని నిజముగతినరని తలంచి అచ్చటనేకూర్చొనియుండిరి. కాని గురునానక్ వారు తప్పకపట్టుకొనిరండని తిరిగిచెప్పగా మాంసాహారము తయారై రాగనే మిగతవారిలో చాలమంది లేచివెళ్ళిపోయిరి. వారు నిజముగ తినుటకుద్యుక్తులైనప్పుడు ఒక్కగురుముఖశిష్యుడుతప్ప తక్కినవారందఱు వెడలిపోయిరి. ఆగురుముఖునికిగూడ వారు మాంసమీయగా నతడు మహోత్సాహముతో సద్గురుని మహోత్తమప్రసాదమని మెచ్చుకొనుచు తీసుకొనెను. ఆయన అది తినబోవుచుండగా, గురునానక్ వారు తామట్లు ఉత్తపరీక్షకొఱకై చేసితిమనిచెప్పుచు నాయనను తినకుండ నాపుజేసి, నీవే పరిపూర్ణగురుముఖుడవని మెచ్చుకొనుచు నాయనను కౌగలించుకొనిరి. సంతు లీవిధముగ నప్పుడప్పుడు పరీక్షకూడ చేయుచుందురు.

అసలువిషయమేమనగా సంతులదర్బారులో అల్పుడు, అధికుడుఅను విచక్షణ యెన్నడునుండదు. అచ్చట ఆదరసత్కారము లెవ్వరికినుండవు. సంతుల ధిక్కారములను, దెబ్బలను సహించువారే అచ్చట నిలబడగలరు. అప్పుడపుడు సంతులు పరమార్థులొక్కరేతప్ప మఱెవరును సహించలేనంతకఠినముగ మనస్సు

నకు లోలోపల దెబ్బకొట్టుదురు. సామాన్యజీవులు అట్టిమానసికపరిహారణకు తత్ క్షణమే వారిని విడిచి వెడలిపోవుదురు.

హిందూదేశములో నేగాక ఇతరదేశములలోగూడ ఏసుక్రీస్తు, మహమ్మదుసాహెబ్, వగైరా అవతారపురుషులు అవతరించిరి. వారుకూడ గృహస్థులే. బాహ్యముగ వేషము వేసికొనుటచే పరమార్థము లభించదు. అయినను ప్రాపంచికజీవులలోమాత్రము సాధువనగా అడవులలోను, కొండలమీదనుఉండుచు కాషాయవస్త్రములనుధరించినవారే యనెడిఅపభ్రమ నాటుకొనియున్నది. నిజము చెప్పవలెనన్నచో, అట్టివేషధారులు దరిజేరనీయదగ్గవారు కారు. వారి దృష్టియే చాలహానికరము. వారు మహాపాపకర్మభాయిష్టులగుటయేగాక గృహస్థులకన్న వేయిరెట్లు చెడిపోయియుందురు. సంసారబాధలు సహించుటకిష్టము లేక యేపేచీపూచీలు లేకుండతప్పించుకొని విచ్చలవిడిగా తిరుగగోరువారే తఱుచుగ కాషాయవేషము వేసికొందురు. సంతుమహాత్ము లవతరించినపుడెల్ల వారి ఉపదేశములను ఆదరముగమన్నించి తమపారమార్థికకార్యమును సాధించుకొను అదృష్టము ఫలింపచేసికొన్నవారు చాల అరుదుగ నేయుండెడివారు.

నిజమైన పరమార్థభావముతో శరణుజొచ్చినవారొక్కరే సంతులకు నచ్చుదురు. పరమార్థమునుండి పూర్తిగ విముఖులైనవారినిగుఱించి సంతులెంతమాత్రము తలపెట్టరు. అట్టివారికి జన్మమరణచక్రములోనికి పోవుటకై ద్వారము తెఱచియేయున్నది. ఈసంసార మొకయడవివంటిది. వేలాది అడవి మృగములు ఇచట దేశమంతటను తిరుగుచున్నవి. భక్తజను లిచ్చట అడుగడుగునకు ఈవృశ్చికములు, సర్పములనుండియు బెదురుచు ఒక్కొక్కడుగే బహుజాగ్రత్తగా చూచుకొని వేయుచు తమ్మునుతాము కాపాడుకొనుచుండవలయును. ఇదేవిధముగ చాలజాగరూకతతో రోజులు వెళ్ళబుచ్చుకొనుచు అడవిమృగములనుండి దూరముగ నుండవలయును.

## 19

### సంత్ సురత్ స్త్రీశరీరములో నెన్నడు నుండజాలదు.

6 జనవరి 1911 :— "ఈలోకములో స్త్రీలు పురుషులు నుండుటయెట్లు తటస్థించెను, అట్లుండుటకు కారణమేమి ?" ఈవిషయముమీద కొంత చర్చిం

చిరి. ఈలోకములోనున్న చెట్లు జంతువులు మున్నగుపదార్థములన్నియు బ్రహ్మాండములోనున్నవస్తువులకు ప్రతిబింబములే. బ్రహ్మాండములోకూడ వేలాది సూర్యచంద్రులు, ఫలములవలెనే చెట్లనుండి వ్రేలాడుచున్నవనియు, వానిమీద ఆత్మలు కలకలారావములు చేయుచునుండుననియు చెప్పబడినదికదా, కావున బ్రహ్మాండములోకూడ స్త్రీత్వము తప్పకనుండవలయును, కాని దానిపై నున్న దయాళుదేశములో ఈలక్షణములేదు. ఆ పై రచనఅంతయు పురుషు డొక్కడే చేసెను. కాని అక్షరపురుషునికన్న క్రిందిసృష్టియంతయు స్త్రీపురుషు లిద్దరిసహాయముతోను తయారగుచువచ్చెను. దశమద్వారములో కాలుడు ప్రకృతియు నున్నవై, త్రికుటిలోను సహస్రదళకమలములోను దానిక్రిందనున్న స్థానములలోను శివశక్తులు, సావిత్రీబ్రహ్మలు, లక్ష్మీవిష్ణువులును గలరు. అక్షరపురుషునకుపైన స్త్రీలకు తావేలేదు. దీనికికారణమేమనగా, మొట్టమొదట పరమపురుషుడు ఉన్మన్యవస్థలోనుండెను. ఆయనలో రచనార్థమై ప్రేరణ ప్రప్రథమములోగలిగినపుడు ఆఆదిశక్తినుండి అనగా పురుషునివద్దనుండి ఒక ధార బయలువెడలి మండలాకారముగ తయారయ్యెను. కేంద్రమునుండి శక్తి బయలుదేరినపుడు దానిప్రసరణము (Emanation) వర్తులాకారముగనుం డును. అదియే ఆశక్తియొక్క భండారము. దానిపేరు "స్వామీ", ఆధార యొక్కపేరు "రాధా", అనగా "రాధా, స్వామీ"లు రెండును వేర్వేరు కావు. రాధాస్వామీ ఒకేశక్తియొక్క ధర్మములు. దీనిని అనామీపురుషుని ప్రాణమని వర్ణించిరి. అనగా రాధాస్వామీధామమును సృజించినప్రభువు, మరెట్టి సహాయమును కోరనవసరములేకుండ, మహాపరిపూర్ణశక్తితో సాకల్యా ముగ తద్రూపమైనపురుషుడే అని చెప్పబడినది. దానిక్రిందనున్న అగమలోక ముయొక్కసృష్టిని అగమపురుషుడుచేసెను. అక్కడకూడ స్త్రీలక్షణమెంతమా త్రమును లేదు. దానికిక్రిందనున్న అలఖలోకము, అంతకన్నక్రిందనున్న అనా మీలోకము, సత్యలోకము, భంవరగుఫలోకములయొక్కసృష్టినికూడ పురుషుడే రచించెను. దానితోపాటే మహాసున్నలోని ఆయుస్థానములరచనకూడ నదేవిధ ముగ జరిగిపోయెను. ఈ ఆయుస్థానములును దయాళుదేశముయొక్క ఛాయలే, కాని అవిపూర్తిగా గుప్తముగ నుంచబడెను. వీనిలో నన్నిటికన్నక్రిందిస్థానము అక్షరపురుషునిది. ఆస్థానము దశమద్వారముకన్న పైనున్నది. పైనచెప్పిన యీసృష్టిఅంతయు జరిగినపిమ్మట కొంతకాలమువఱకు విశ్రాంతిగనుండుసమ

యము వచ్చెను. అటుపిమ్మట తిరిగి రచనాధార బయలుదేరెను. కాని ఇంత వఱకునది సృష్టిచేయుచు నుండిపోవుటచే దానిచైతన్యము చాలవఱకు క్షీణించి పోయెను. అందువలన దాని కింకను సృష్టిచేయుటకు శక్తిచాలనందున నది కంపాయమానమైపోయెను. దీనిపేరు కాలపురుషుడు. ఆయనకు సహాయము చేయునిమిత్తమై మఱొకధార ప్రకటమయ్యెను. ఈధార ఆత్మాంశ అనగా ఆత్మలయొక్క భండారమును తీసికొనితయారయ్యెను. ఈరెండునుకలిసి యీ సృష్టినంతను తయారుచేసెను.

పర్యవసానమేమనగా స్త్రీలక్షణమునకు ప్రారంభము దశమద్వారము నుండి అయ్యెను. కొందఱు గొప్పగొప్పపరమార్థులుగ నెంచబడువారికే సంత్ సురతు స్త్రీశరీరములోనున్నదనియును లేక ఇకముందు ఉండగలదనియును అపభ్రమయుండుటవలన నిదంతయు చెప్పవలసివచ్చెను. వారి అభిప్రాయము సంతులపవిత్రగ్రంథములనుబట్టి చూడగా బొత్తిగపొరపాటు. వారపభ్రమలో నున్నారు.

రాధాజీ మాతాసాహెబాగారికి సాటియైనభక్తురాలు ప్రస్తుతకాలములో స్త్రీలలో నెవరును లేరు. హుజూర్ మహారాజువారితో కలిసి నేను కూడా రాధాజీవారిని చూచుటకై ఒకటిరెండునాళ్లు వెళ్లుట తటస్థించెను. హుజూర్ మహారాజువారు రాధాజీవారి కెదురుగనుండి ఆరతిచేసెడివారు. కాని రాధాజీ తాము గురువుననిగాని, తమసత్సంగమునందఱినిచేసుకొనుడనిగాని యెన్నడు సెలవివ్వలేదు. ఆమె హుజూరుసాహబ్ వారిసత్సంగము చేసికొను డనియే యెల్లప్పుడు సెలవిచ్చుచుండెడిది. రాధాజీవారిదర్శనము చేసికొన్నపుడును, ఆమెమహావచనములను వినుచున్నపుడును. ప్రతివ్యక్తికిని తన కన్నతల్లి వద్దనే కూర్చుండినట్లు అనిపించుచుండెడిది. స్త్రీలలో పరమభక్తురాండ్రయిన మీరాబాయి వగైరాలుకూడకలరు. కాని స్త్రీఆచార్యపదవి నెన్నడు నలంకరించ లేదు. కావున, సంతసురత్ స్త్రీశరీరములోనున్నదని విశ్వసించువారందఱును చాలపెద్ద అపభ్రమలో పడియున్నారు. చూడుడు, శిబ్బోజీవంటి మహాభక్తు రాలుకూడ హుజూర్ సాహబ్ వారికాలములో ఒకపెద్దఅపభ్రమలో చిక్కుపడి పోయెను. ఆమెఆత్మ ఒకప్పుడు వ్యాపకచైతన్యములో ప్రవేశించగా ఆమెకు అంతయు సూర్యప్రకాశమే అయినట్లు కనపడినందున, నామె "ఇదంతయు వ్యాపకచైతన్యమే, రాధాస్వామీవారెక్కడనున్నారు?" అని కేకవేసెను. ఈవిధ

ముగ పెద్దపెద్దవారుకూడ భ్రమయొక్కచక్రములో చిక్కుపడిపోవుచుందురు. కాని కొంతకాలమైనతరువాత తిరిగి నిర్మలత్వము వచ్చుచుండును. త్రోవలోనున్న లోకాధిపతులందఱిశిరములమీదనుండియు పోవలసియున్నది. సంతసద్గురువుయొక్క సహాయములేనిదే అట్లుపోవుటకు సాధ్యముకాదు.

## 20

సంతులశరణు పొందినవారికి మరణానంతరము బ్రహ్మాండదేశమునందు నివాసము లభించును. సూక్ష్మకర్మలు, స్థూలకర్మలవివరణము. సూక్ష్మకర్మలను సంతులే నశింపచేయగలరు.

జీవుడు సంతులయెదుటికి వచ్చినపుడు సంతులు అతనిని బాగుగ పరిశీలించి అతనివిషయము పూర్తిగ తెలిసికొందురని స్వామీజీమహారాజువారు ఒక వచనములో సెలవిచ్చిరి.

ఏజీవుడైనను కాలునికి తీర్చవలసియున్న ఋణమునంతను ఈజన్మలోనే తీర్చివేయుటకు అవకాశమున్నయెడల సంతులతనిని తమచరణములందు తీసికొందురు. అట్లుగాక అతడింకను కాలునిసొత్తుగనే అయి యున్నచో వారతనిని తమచరణములయందు వెంటనే తీసికొనరు. వారతనిని భవిష్యత్తులో నట్లు తీసికొనునిమిత్తమై అభ్యర్థిగ (Candidate) జేర్చుకొందురు. ఈవచనమునుబట్టి వారిచరణములందు జేర్చుకొన్న ప్రతిజీవునికి నీజన్మఅనంతరము బ్రహ్మాండములో నివాసము తప్పక దొరుకునని, అనగా అతనిఉద్ధారకార్యక్రమము ఉపదేశము పొందిననాటినుండియు ప్రారంభమగునని తేటపడుచున్నది తిరిగి జన్మమరణచక్రములోనికి అతడెన్నడు వెళ్ళిపోనేరడు. దీని కొరక మిక్కిలివిపరీతమైన దృష్టాంతమును (extreme instance) చెప్పెదను.

ఎట్లనగా ఒకసత్సంగి బహుపాపకర్మలుచేయునట్టి మహాపాతకుడు ఉన్నాడనుకొనుడు. అతడెన్నడును పారమార్థికకృత్యమెద్దియు చేయనేలేదనుకొనుడు. కావున పైకిచూడగ నతడు తప్పక నరకమునకు పోవలసినవాడని చెప్పవచ్చును. అయినను అట్టివాడుకూడ ఈవచనప్రకారము జననమరణచక్రములోనికి యెన్నడు పడిపోనేరడు. ఏలననగా, సంతులవాక్య మెన్నటికి విఫలము కానేరదు. ఈవచనము మనకందఱి కొరక యథోచితగర్వకారణ మగుటయేగాక,

పైగా మహా ప్రమాణవచనమును ప్రభుని విధియాపమైనవాక్యమునుగూడ. సత్సంగి జననమరణచక్రములో పడిపోవుననుట శుద్ధమూర్ఖతయు, పూర్తిగ పొరబాటు నగుటయేగాక నాస్తికత్వమునుగూడ సూచించును. ఇచ్చట సత్సంగముచేసుకొనుచున్నట్టి మనమందఱముగూడ జననమరణచక్రములోనికి పోయెడివారమని మనని గుఱించి రెండవసంఘమువారు చెప్పుచున్నందున నిదంతయు వివరించవలసివచ్చినది. ఆహా! వారుచెప్పెడి యీవిషయ మెంతవరకు సరియైనదికాగలదు! వారి తెలివితేటలమీద ఏమి తెరపడియున్నదో తెలియదు.

హుజూరుమహారాజువారి కాలములో నొకప్పుడు శేర్ సింగ్ అను పేరుగల సింధుదేశపుసత్సంగి యుండెడివాడు. అతడు గొప్పభక్తుడు. కాని తరువాత నతడు తనకు గురుపదవి వచ్చినట్లు చెప్పుకొనుచు దాదాపు నూరు నూటయేబదిమంది శిష్యులనుకూడ చేరదీసెను. తరువాత నతడు మాంసముతినుటకూడ ప్రారంభించి, అనేక పాపకృత్యములలోనికి దిగిపోయెను. ఇతడు జన్మమరణచక్రములో పడిపోవునాయని అతనినిగుఱించి హుజూర్ మహారాజువారిని మఱొకరు ప్రశ్నించగా హుజూరువారు అట్లెన్నడుకానేరదని సెలవిచ్చిరి. స్వామీజీమహారాజ్ వారివచన మట్లుండగా హుజూరుమహారాజువారుకూడా నట్లే సెలవిచ్చినపుడు, మనము జననమరణచక్రములోనికెల పోగలము? రెండవసంఘమువారియభిప్రాయముతో మన మేకీభవించవలదని అట్లు పోవుదుముకాబోలు! పారమార్థికవిషయములను మానవకృత్యములకుసంబంధించిన ఏర్పాట్లతో కలగలుపుచేయుట సరికాదు. అందుచే నేసత్సంగినైనను మఱొకసత్సంగిని అతడు బాహ్యముగచేసెడి పాపకృత్యములమూలమున హీనదృష్టితో చూడరాదు. ఏలనన అందఱును భగవంతునికి ఆత్మీయులుగ చేసికొనబడినవారై యున్నారు. సాక్షాత్పరమపురుషుడే స్వయముగవచ్చి మనలను తమచరణములందు చేర్చుకొన్నపుడు మనమందఱము, సమానులము, మహాదృష్టవంతులము అయినాము. ఏలననగా, మనఅందఱికొఱకేగదా భగవంతుడు స్వయముగ నిచ్చటకు వచ్చినది. కావున మనకికనెవరిభయమును లేదు. ఎవరేమన్న ననుగాక, మనల నెవరును క్రిందికి లాగుకొనిపోలేరు.

కర్మలు రెండురకములు, ఒకటి స్థూలకర్మలు, రెండవది సూక్ష్మకర్మలును. సూక్ష్మకర్మలనుగుఱించి సంతసద్గురువునకుతప్ప మఱెవ్వరికిని తెలియదు. మనసూక్ష్మకర్మలగుఱించి మనకెట్లు తెలియదో అట్లే బ్రహ్మాండనివాసులకుగూడ

సూక్ష్మకర్మలనుగుఱించి తెలియదు. సంతులొక్కరికితప్ప మఱెవ్వరికి నీవిషయమునుగుఱించి తెలియజాలదు. సంతులు జీవుని పరిశీలించినపుడు అతనిసూక్ష్మకర్మలను చూచెదరు. అవి తక్కువగనున్నయెడలనే వారతనిని తమచరణములందు చేర్చుకొందురు. కర్మలు ఇంక నెక్కువగనున్నచో వారతనిని తమచరణములందు చేర్చుకొనరు. వారు స్థూలకర్మలవైపు దృష్టిపెట్టరు. వారికి అవి ఉత్త ఊకపొట్టు వంటివి, ఇంతేకాదు. ఉత్తబూడిదవంటివి. ఏలననగా, అవన్నియు వారిదయాప్రభావమువలననే భస్మమగును. సూక్ష్మకర్మలలో నట్లుగాక ప్రత్యణువును మహాబలవత్తరమై యుండును. ఒక్కఅణుమాత్రమే అనేకజన్మలు ధరింపజేయును. ఇప్పుడు మనమనుభవించుచున్నకర్మయంతయు స్థూలకర్మలఫలితము. కావుని దానినిగుఱించి ఆలోచించ నక్కఱలేదు. ఇదంతయు తుడిచివేయబడుచు లోపల నిండియున్న మాలిన్యము బయటపడుచున్నది. సత్సంగములో చేర్చుకొనబడినవారందఱికిని ఆంతర్యములోనున్న మురికికాల్వలలోనున్న కుళ్లునంతను బయటకుత్రోసివేసి అవన్నియు నిర్మలముచేయబడును, మరియు నటుపిమ్మట ఈజన్మాంతమునందే అధమాధమము బ్రహ్మాండమునందు నివాసమొసంగబడును. అనగా మార్గములో మూడవవంతు ప్రయాణము పూర్తికాగలదు.

## 21

పరమార్థముయొక్కసహజమార్గము. దానియందు నడచుటకు సద్గురుని ఆవశ్యకత. సర్వమతసమ్మేళనము అనునది అసంభవము.

9 జనవరి 1911 :—ఈరోజున శబ్దపాఠమైనతర్వాత సుందరసింగు అను పంజాబీసోదరుని పిలిచి శబ్దములు చదువుమని సెలవిచ్చిరి. రెండురోజులక్రితము కూడ నతడొకసారి శబ్దములనుచదివెను. అతనిగొంతుకయు స్వరమునుకూడ చాలబాగున్నవి. అతడు ప్రేమబానీలోనుండి రెండుశబ్దములను జదివెను. ఆ తర్వాత కబీర్ సాహబ్ వారి శబ్దములు రెండిటిని, పంజాబీలో బుల్లెషాహగారి శబ్దమొకదానిని పాడెను. బుల్లెషాహగారిశబ్దమునకు ప్రథమచరణ మిట్లుండెను

"భాగ ఉన్హాం దే చంగె జిన్హాం నూం యారమిలే"

అర్థము :—తమప్రియునితో కలిసినవారు చాల భాగ్యవంతులు.

అటుపిమ్మట నీక్రింది వచనమును సెలవిచ్చిరి :—

ఈ కాలములో జరుగుచున్న మతసంబంధమైనసభలన్నియు సదాచార విషయములకును, ప్రాపంచికవిషయములకును సంబంధించి యుండుచున్నవి. నిజమున కేమతములో నెవరును యథార్థమైన అనుయాయులే లేరు. ఉదాహరణకు, హిందువులను చూడుడు. హిందువులనెడిపదము మహమ్మదీయులకాలము నుండియే వాడుకలోనున్నది. బ్రాహ్మణులు అనగా బ్రహ్మవిద్య తెలిసికొన్నట్టి వారును, బ్రహ్మాండమువఱకును సిద్ధిపొందినట్టివారును. పూర్వకాలములో యోగీశ్వరులే అట్లు చెప్పదగ్గవారు కాని, ఈకాలములో అట్టివారెవ్వరు లేనే లేరు. మహమ్మదీయులమతముకూడ నట్లే. కురానులో సహస్రదళకమలమును గుఱించి వర్ణించబడియున్నది ఏసుక్రీస్తు చెప్పిన "సూలీ"స్థానము సహస్రదళకమలముకన్న కొద్దిగ పైన నున్నది. అన్నిమతములవారు నేకమైపోవలయుననియు, అన్నిమతములలోనున్న శ్రేష్ఠవిషయములను పైకితీయవలయుననియు, అనగా ఒక్కొక్కమతములోనున్నట్టి మంచిమంచివిషయములనన్నిటిని పైకితీసి జతచేయవలయుననియు ఆదర్శముతో కొన్నిసభలు జరుపబడుచున్నవి. కాని అందఱు నొకేమతమును మన్నించవలెననుట పొరపాటు. ఏలననగా, అన్నిమతములలోనివారు ఒకేతరహాకు చెందినవారు కారు. హిందువులమతము చాల ఉత్తమతరహాకు చెందినది. అన్నిమతములలో నొప్పుకొనబడుచున్నవిషయమైన ఆత్మవస్తువునే అందఱు ప్రధానముగ నెంచుకొన్నయెడలనే అన్నిమతములు నేకమగుటకు వీలుండును.

ఈదేశమును సంతులు కేవలము స్వప్నతుల్యముగా చెప్పిరి. ఎట్లనగా, ఒకమనిషి నిద్దురపోయెననుకొనుడు. మఱి ఈలోకమంతయు నతనికి మాయమైపోవునుకదా! అలాగుననే ముందుమార్గమెట్లున్నదో మానవునకేమియు తెలియదు. అయితే స్వప్న, సుషుప్తి, గాఢనిద్ర, సంపూర్ణవిస్మృతియవస్థ, మృత్యువు అనెడి యీ అవస్థలనన్నిటిని నెవరైన దాటిపోవలెనన్నచో, ఈమార్గమందు ఇతఃపూర్వమే ప్రయాణముచేసిన అనుభవజ్ఞానము గల పురుషుడెవరైనను తోడుగనున్నపుడే ఆప్రయాణము సాధ్యమగును. జీవు డీమార్గముననే ప్రయాణముసాగించవలసియున్నదని అందఱకును తెలుసును. ఇదే ప్రకృతిసిద్ధమైన మార్గము. జాగ్రదవస్థలోకూడ పనులన్నియు కన్నుచెవులనుపయోగించియే. అనగా కంటితోచూచియు, చెవితోవినియునే సాగించబడుచున్నవి. లోపల గూడ నిట్టివే రెండింద్రియము లున్నవి. అయితే లోపల చూచుట దేనిని, వినుట

దేనివి ? అంతర్యామునమాఱు| మోగుచున్న నిజనామమును నిజశబ్దమును విన వలెను. అంతర్యద్వారములు సమస్తమును తెలిచుకొనియున్నట్టియు, నీమార్గ మున ముందేప్రయాణముసాగించియున్నట్టియు గురువును ధ్యానముచేయువల యును. అప్పుడే యీమార్గమందు ప్రయాణముచేయుట సాగును. ఈయభ్యా సముచేయువఱకు కార్యము సఫలముకానేరదు. బాహ్యక్రియలవలన అనగా జాగ్రదవస్థకుసంబంధించినపనులవలన నేమియు ప్రయోజనము లేదు.

అలహాబాదులో నొకసర్వధర్మసమ్మేళనసభ (conference of religions) చేయబోవుచున్నారు. దానికి రాధాస్వామీమతమువా రెవరైనను రావలెనని పిలుపువచ్చెను. కావుననే యీపై చర్చ జరిగెను. అయితే హుజూ రువా రచ్చటి కెవరును పోనవసరము లేదనియు అయినను, బాబూమాధవప్రసా దుసింహగారు వెళ్ళి యేమైన నుపన్యాసమివ్వదలచుకొన్నచో నది సరియే ననియు సెలవిచ్చిరి.

## 22

సద్గురువుతోను, భగవంతునితోను తనతప్పిదములను దాచకుండ పూర్తి గా చెప్పుకొనవలయును.

10 జనవరి 1911 :– ఫార్సీభాషలో నొకద్విపదను ముందుగాచదివిరి. దానికి, భగవంతుడు పాపమునుపుట్టించినతోడనే దానిని ముద్దుపెట్టుకొనెనని, భావము.

ఇటులనే సంతులపవిత్రగ్రంథములలోగూడ నీక్రిందిద్విపద యున్నదని సెలవిచ్చిరి :–

నహీం బనతే ముఝసే జో పాప ఔర్ కసూర్,
దయా కీ తెరీ హోతీ ఫిర్ క్యా జరూర్ ।

అర్థము :–పాపములను చేయకుండగనే నేనుండినచో మఱి మీకు దయ చూపవలసినయవసర మెక్కడుండును ?

ఈద్విపద పరమార్థములో ఆఖరిమెట్టునకు చెందినదని సెలవిచ్చిరి. ఎవరైతే తమతప్పులను, లోపములను అన్నిటిని పూర్తిగా భగవంతునియెదుట

బాహాటముగా చెప్పుకొందురో భగవంతుని కట్టివారియం దెక్కుడు ప్రీతి. కాని యీజీవు డట్లుఒప్పుకొనడు. పైగా తనదోషములను చాలకప్పెట్టికప్పెట్టి యుంచుకొనును. జీవుడెవడును తప్పిదములు, పాపములు చేయకుండ నుండ జాలడు. అది మనస్సుయొక్క స్వభావము. మహామహాపవిత్రులమని భావించు కొనువారందఱును లోలోపల పాపములతో పూటుగ నిండియుందురు కాని వాని నితరులకు తెలియకుండ కప్పెట్టుకొని జనులను మోసగించుచున్నారు. ఇంకను ఫలానాఫలానామనోవికారములను జయించితిమని ప్రగల్భములను చెప్పుకొనెడివారు అతిత్వరలోనే పతితులైపోవుచుందురు. పూర్వకాలములో ఋషులు, మునులును మహాకష్టములుపడి మనస్సును కొంతగ అణచిపెట్టుకొని స్వాధీనముచేసికొనిరి. కాని వారికావిషయమై అహంకారముబయలుదేరినపుడు ఆదేవికారమువలన వారు కళంకమునుపొంది, పతితులైరి. దానివలన వారికి పెద్దహాని లేకుండ, తిరిగి వారు తమపదవికి వచ్చివేసిరి. అయినను, వారి అహం కారమును ఛిన్నభిన్నములు చేయుటకొఱకై అట్లు చేయవలసివచ్చెను. ఏల ననగా, బ్రహ్మాండదేశాధిపతికూడ అహంకారమును సహింపనేరడు. మన మెల్ల పుడు అణిగియేపడియుండి తనలోతా నెప్పుడు దోషములను చూచుకొనుచు నుండవలయును. అప్పుడే పనిఅంతయు సవ్యముగా సాగిపోవును.

మఱియు తనతప్పుల నెప్పుడు భగవంతునికి పూర్తిగా విన్నవించుకొను చుండవలెను. కాని యీమూర్ఖుడు భగవంతునికూడ మోసగించుచుండును. విన్నవించుకొన్ననుకూడ అందులో జిత్తులు, టక్కరులు చేయుచుండును. ఈ అలవాటు చాలచెడ్డది. మోసపుపని యెన్నడును చేయకుడు. ఎవరైనను తన తప్పిదములను ఈప్రపంచములోగూడ పూర్తిగాఒప్పుకొన్నయెడల, నతడు బంగారమైపోవును. ఏలననగా, అందఱు నతనిని హీనదృష్టితో చూచెదరు, అందుచే నతడు సిగ్గుపడి పశ్చాత్తాపమునకువచ్చి, దీనభావముతో భగవంతునికి అసలైనప్రార్థన చేసుకొనును. అప్పుడు తప్పకుండా భగవంతు డతనిపైన దయ చూపును. ఏలననగా, నతనికెప్పుడు దీనభావముగలుగునో, అప్పుడే భగవం తుడుకూడ అతనియెడల దయాభావము చూపును. దీనత్వమువలన నన్నిపను లును నెఱవేరును. భగవంతునితో నీమొఱ్ఱను నిర్భయముగ రెండేమాటలలో విన్నవించుకొనుము. మఱియు నీమనస్సు ఏదైనపాపకృత్యము చేయుట కుద్యు క్తమైనట్లు నీకు తెలిసినపుడు నీవు "ఇది ఈపాపపుపని చేయుటకు కోరుచున్నది.

దీనిని నేను దిద్ది సరిచేసిననుచేయవలయును లేదా దానికోరికతీర్చి అందువలన గలిగెడి నష్టమునైన సహించవలయును" అని పట్టుదలవహించి దానితో హోరాహోరిగ పోరాటముచేసి దానిదోషములను ప్రకటపఱచుకొనవలెను, కాని దాఁపరిక మెంతమాత్రము పనికిరాదు. అయితే, ఒకప్రక్కనుండి లజ్జ గలుగవచ్చును, దీనివలన చాలనష్టము గలుగగలదు. మనమందఱమును అభ్యాసమునకు ముందుకాని, తర్వాతకాని ఒకసమయములో భగవంతునికి మన అవగుణములను, తప్పిదములను మనస్సులోని దుష్టకోరికలను పూర్తిగా చెప్పుకొనుట అలవాటుచేసికొనవలెను. దీనిని సన్మార్గమునకుదెచ్చి మా యందుదయచూపుడని ప్రార్థించవలయును. సిగ్గుపడకూడదు. ఇప్పుడైతే లేక పోవచ్చును, కాని ముందెప్పుడైన మనఅదృష్టముపండి సంత్ సద్గురువుప్రకట మైనయెడల వారట్టిఅనుమతియిచ్చుసౌభాగ్యముగల్గినపుడు వారిసమక్షమందు మనబాధలు, దుర్గుణములు, పాపపుపనులువగైరాలన్నియు సిగ్గులేకుండా మొఱ పెట్టుకొనవలెను. అందువలన నాపత్తు తప్పిపోవును, శిరమునుండి పెద్దబరువు తొలఁగిపోవును. కాని అట్లుమొఱపెట్టుకొనుటకు సద్గురువు సావకాశము చాల అరుదుగ నిచ్చుచుందురు. మహారాజసాహెబ్ వారి నావిధముగా మొఱపెట్టు కొనునిమిత్తమై సత్సంగు లనేకసార్లు అనుజ్ఞ వేడుకొనిరి కాని, వారెన్నడు నట్టి సావకాశ మివ్వలేదు. కొందఱికి అట్లడుగుటకు ధైర్యసాహసములే యుండవు. ఎవరికైనను అట్టిసావకాశములభించి. వారు తమదోషములను, లోపములను వెనుదీయకుండా సంపూర్ణముగా చెప్పుకొన్నచో, వారు మహాదృష్టవంతులు. భగవంతునిశరణుజొచ్చినవాడు మనస్సుయొక్క యీలక్షణములకు లొంగిపో కూడదు. దానితో గట్టిగా దెబ్బలాడవలయును. తనదోషములు, లోపముల కును పశ్చాత్తాపపడి దుఃఖించవలయును.

కొంద ఱావిధమైనమనోలక్షణములకు భయపడి సత్సంగమునకే రాకుండ తప్పించుకొందురు. అది సరికాదు. సత్సంగమెప్పుడును న్యాయబుద్ధితో చేసి కొనవలెను. చిన్నచిన్నపసిపిల్ల లెప్పుడైనను కలిసి పాటలుపాడుచున్నచో, తండ్రికూడా వారిసంతోషముచూసి సంతసించి, తానుకూడ వారితోకలిసి పాడినట్లుగనే, అమాయకపుభక్తులు ఏవిధముగనైన సత్సంగముచేసికొన్నచో భగవంతుడు వారిపైన తప్పకుండ దయచూపును. మనస్సు బాధపడుచు నుదా సీనముగనున్నపుడే దయగల్గును. కావున నిపుడు సమయము అట్టిది. మనమం

దఱము భగవంతునిపసిపిల్లలము. చివర హుజూరువారు ఒక ఫార్సీద్విపద నుద హరించిరి. దానిఅర్థ మేమనగా, పాపమనెడిపక్షికి ఇంకను రెక్కలుకూడ రాక ముందే భగవదనుగ్రహమనెడి డేగ తటాలున దానిపైనపడి అణచివైచెను. కావున నివన్నియు ఉపయోగకరమైన అనుభవసిద్ధవిషయములు. వీనిని తప్పక ఆచరణాలో పెట్టుకొనవలయును. మనస్సు వేయిసార్లు చేయుదునని వాగ్దానము చేయుచుండునుకాని ఆవాగ్దానము పూర్తిచేయదు. పైగా దానిని భంగమే చేయుచుండును. అయినను, అంతటిలో ప్రమాదమేమియు లేదు. ఏలననగా, దానిస్వభావమే అది. కాని భగవంతునితో దగాప్రవర్తన పనికిరాదు, తన దోషమును కప్పెట్టుకొనకూడదు. లేనిచో శరణులో లోపము వాటిల్లును.

## 23

### పరమార్థమనగ నేమి ? దానిని సంపాదించుకొనుట యెట్లు ?

11 జనవరి 1911 :—లోకములో నేపనిచేయుటకైనను దానియుద్దేశ్యము నెట్లు ముందుగ తెలిసికొనవలయునో, అట్లే పరమార్థములోకూడ నావిష యము తేల్చుకొనుట ముఖ్యము. సంస్కృతములో పరమార్థమనగా ఉత్తను మైనయుద్దేశ్యముఅనియే వ్యుత్పత్త్యర్థము. అటుతరువాతనే ప్రయాణముచేయ వలసినమార్గము, ఆపిమ్మట అందుకవసరమైనసాధనమును తేల్చుకొనవలయును. లోకములోనున్నమతములన్నియు, నొకఆదర్శమెద్దియులేకుండ, పునాదిలేని ఇండ్లవలె నున్నవి. అందుచే నవి పరమార్థశూన్యమైనవి. ఉదాహరణకు ఆర్య సమాజము, బ్రహ్మసమాజమువగైరాలు చూడుడు. ఆర్యసమాజమును చూడుడు, దానిలో వడ్లగింజంతపరమార్థముకూడా లేదు. అయితే సామాజిక మైన (social) ఉపకారము చేయుచున్నారనుట నిజమే. అది మంచిదే. ఈ పని మండనాత్పూర్వమావశ్యకమైనట్టి ఒకరకమైనఖండనవంటిదని చెప్పవచ్చును. గడ్డి దుబ్బులు, ముళ్ళచెట్లును ఆవరించియున్నస్థలములో వానినన్నిటిని పీకివేసి శుభ్రముచేయనిదే పువ్వులమొక్కలునాటుట కెట్లు వీలుండదో అట్లే మనమన స్సులలో జన్మానుజన్మలయొక్క కర్మల సంస్కారములును, మతమునుగురించి యేర్పడిన వివిధవిధములైనసంస్కారములును నిండియుండినందున, వానినన్నిటిని ఖండనచేసి పీకిపారవేయకుండా సంతుమతము అవగాహనకువచ్చుట సాధ్యము కాదు. అందుచేత సంతుమతముయొక్క మండనమునిమిత్తమై మిగిలినమతముల ఖండన మావశ్యకము.

ఈ ప్రపంచములో మనముపొందవలసిన ఆదర్శమేమి ? సుఖమును పొందుటయు, దుఃఖమును నివృత్తి చేసికొనుటయునే, అనగా మన కీదుఃఖములుపోయి ఇంతకన్న నెక్కువసుఖము లభించవలయుననియే మనముకోరుచున్నది. ఇచ్చట నున్నసుఖమును వదలి ఇంతకన్న నెక్కువసుఖ మెచ్చటనుండునో దానిని పట్టుకొనవలయునని మనకోరిక. ఈతీరున శాశ్వతమైనపరమసుఖ మెచ్చటలభించునో అదియే మన "పరమ అర్థము" అని తెలుచున్నది. ఇప్పుడు సుఖముయొక్క నిర్వచనమేమి ? అని మనమాలోచించవలయును. అదేదియనగా, మనఅందఱిలో నున్నట్టిచైతన్యధార యెచ్చట, నేపరిస్థితిలో నెక్కువగ నేకాగ్రత చెందునో ఆపరిస్థితిలోను ఆస్థలములోనే మనకు సుఖానుభవము గలుగగలదని చెప్పవచ్చును. ఈధార యెచ్చటనుండి వెనుకకుమళ్ళించబడునో అచ్చట దుఃఖానుభవము గలుగును. ఎట్లనగా, మనచైతన్యధార మామూలు అవస్థలోనున్నపుడు మనకన్నిపదార్థములు బాగున్నట్లు తోచును. ఎచ్చటనుండి యైన నీధార వెనుకకుత్రిప్పబడిపోయినచో, నచ్చట బాధగలుగును, లేక దుఃఖమనిపించును. దీనిపేరే రుగ్మత ఏలననగా రుగ్మతగల్గినపుడు మనఇంద్రియములన్నియు నట్లేయున్నను, ధార కొంతవఱకు అచ్చటనుండి వెనుకకుపోయినందున, మన కన్నిపదార్థములును అప్రియముగ నుండును. ఆధార పూర్తిగా వెనుకకులాగుకొనిపోయినట్లైతే మరణముగలుగును.

మఱొకదృష్టాంతమును తీసికొనుడు. మనమొకపాట వినుచున్నామనుకొనుడు. అట్లుచేయుటకై మూడువస్తువు లవసరము. ఒకటి మనము. రెండవది పాట, మూడవది ఆపాటయందు మనచైతన్యధార ఏకాగ్రమగుట. మనధార ఆగానమందు ఏకాగ్రమైనచో నందుకుపర్యవసానముగా మన కానందము చేకూరును. ఆసమయములోనే పిల్లవాడు చనిపోయెనని కాని లేక అట్టిచెడువార్తమఱియేదైననుకాని వచ్చినచో నేమగును ? మన కపుడు అదేగానము అప్రియముగనుండి ఆపాటమాత్ర మదివఱలోవలెనే శ్రావ్యముగనున్ననుకూడా చెవికి బాధనే గల్గించును. ఇందులో జరిగినమార్పు ఏమనగా, మనచైతన్యధారకు ఆవార్తమూలమున నొకపెద్దపోటు తగిలి అది వెనుకకులాగికొనిపోయిన దనువిషయ మొక్కటే. అదేవిధముగ మోహ మనగ నేమి ? ఏదైన నొక వస్తువునందైనను లేక నేవ్యక్తియందైనను, ఉదాహరణకు తల్లిదండ్రులకు పిల్లవానియందుకాని, లేదా అట్టిశుద్ధప్రేమగల మఱొకవ్యక్తియందుకాని, చైతన్య

ధార ఏకాగ్రమైయుండుటయే. ఆవ్యక్తియొక్క సంభాషణ, ఆకారము వగైరా అన్నివిషయములును ప్రియముగనుండును. ఇందుకు ప్రతికూలముగా విరోధమున్నపుడు ఇట్లే ఎవనియందు విరోధముండునో అతని ప్రతిచేష్టయు నసహ్యముగనుండును. ఏలననగా, ఆధార ఆవ్యక్తిపైనుండి వెనుకకు మఱలిపోయినది. ఈవిమర్శవలన మనకుగలిగెడి సుఖమంతయు నీచైతన్యధారవలననే గలుగుచున్నదనియొక్కటేగాక, సుఖము అసలు ఉన్నదే ఆధారలోననికూడ పర్యవసానము తేలుచున్నది. మనశరీరములో నిట్టిధారలు అనంతసంఖ్యాకములు వ్యాపించియుండి ఈపనినే సాగించుచున్నవి. సకలేంద్రియములలో నీధారలే పనిచేయుచున్నవి. వీనిలో నేదేనిఒక్కధారవలననే గలిగెడిఆనందము, దానిస్వాదానుభవమునిమిత్తమై కొంతమంది తమజీవితమునంతను ధారపోయునంతఆకర్షణీయముగ నుండును. ఉదాహరణకు, ఖగోళశాస్త్రములో నాసక్తిగలవారుకొందఱు ఆకాశగోళమును దుర్భిణీయంత్రముతో చూచుచు, జీవితమంతయు నట్లే ఆనందించుచుందురు. అట్లే శ్రోత్రేంద్రియములో సంగీతశ్రవణముచేయగలశక్తి మేల్కొన్నవారు సంగీతములోనే యావజ్జీవితమును గడిపివేయుదురు. అనగా ఒక్కఇంద్రియశక్తి మేల్కొన్నంతమాత్రముననే జీవితమంతను నాయానందమునసనుభవించుటలో వెచ్చించునంత అధికానందము గలుగుచున్నది. ఐదుఇంద్రియములు నొకేసారి మేల్కొలుపుకొన్నవారికి అనగా పంచజ్ఞానేంద్రియశక్తులను గూడ నొకేసారి వికసింపజేసికొన్నవారికైతే మహోత్కృష్టసుఖమైనట్టి ఆత్మానందము చేకూరును. ఒక్కొక్కధారలో ఇంతఆనందము సుఖమునున్నయెడల ఈధారలు లేకకిరణములన్నియు నెచ్చటినుండిబయలుదేరుచున్నవో అట్టిసముద్రమును లేక అట్టికిరణభండారమగుసూర్యుని పొందినప్పుడు మఱెంతయెక్కువసుఖము గలుగవలయును. యథార్థముగా పరమసుఖమనగ నిదియే. అపరమపురుషునిభండారమును, నిజమైనపరమార్థమునుకూడా నిదియే.

ఆర్యసమాజమువారు "సత్కార్యములుచేయుచుండుడు, మీమీకర్తవ్యములను నెఱవేర్చుకొనుచుండుడు, అంతటితో భగవంతుడు మీమీదప్రసన్నుడై మీకు లభించిపోగలడు." అని చెప్పుదురు. ఇది పొరపాటు. నిజముగ మంచిపనులవలన లబ్ధి తప్పక కలుగగలదు. అవి విఫలము కానేరవు. స్వర్గలోకము, దేవలోకము మున్నగునవి లభించగలవు; లేదా రాజపదవి, మహారాజపదవి మున్నగునవి లభించవచ్చును. కాని భగవంతునిదర్శనము వానివలన లభ్యము

కాను. అందువలన భగవంతుడు లభించిపోవునని తలంచుకొన్నయెడల, మీ అంతటమీరే మోసపుచ్చుకొనుచున్నారు. భగవంతుడు యథార్థమైనఆధ్యాత్మికసాధన నభ్యాసముచేసినందువలననే లభ్యమగును. మతేపద్ధతి నవలంబించినను జననమరణచక్రములో పడి తిరుగుచు నుండిపోవలసినదే.

లోకములో 84 లక్షలయోనులు, లేక జీవరాసులు ఉన్నవని కొందఱి అభిప్రాయము. అదితప్పు. నిజమునకు ఇదంతయు పంచతత్త్వములు, త్రిగుణములు, ఇరువదిమైదుప్రకృతులయొక్కయు సమ్మేళనము. లోకములో నందఱికిని పరమసుఖము పొందవలెననియే ఆదర్శము. కాని నిజమైనపరమార్థమార్గము పట్టుకొననిచో నది లభించనేరదు. కావున నీజననమరణపరంపర పరమార్థమునుపొందువఱకు నట్లే జరిగిపోవుచుండవలసినదే. భగవంతుని అవతారపురుషుడైనట్టియు, నీమార్గమునందు ఇతఃపూర్వమే చివరివఱకు ప్రయాణముచేసినట్టియు సంత్ సద్గురువువద్దనుండి పారమార్థికసాధనను తెలిసికొని, యీ మార్గమున ప్రయాణముచేయుము; పశ్చిమమార్గమును విడిచి తూర్పువైపునకు అనగా ఊర్ధ్వముగా వెళ్లుము. ఇదంతయు చాల సంక్షిప్తముగా చెప్పితిమనియు నిజముగ నీమతమును పూర్తిగావివరణచేయవలయునన్నచో చాలకాలము పట్టుననియు సెలవిచ్చిరి.

## 24

ప్రేమయొక్క మహత్త్వము. స్థూలదేశములోని ఆకర్షణశక్తికిని ప్రేమకును పోలికలు.

12 జనవరి 1911 :—ఈరోజునకూడా నలుగురైదుగురు క్రొత్తమనుష్యులు వచ్చిరి. ఈక్రిందివచనమును సెలవిచ్చిరి.

సంతులు బోధించుమతము ప్రేమ భక్తులమార్గము. భక్తి అనగా చిత్తమును లేక శ్రద్ధాధారను, భగవచ్చరణములమీదికి ప్రసరింపజేయుట. దీనిని సహజయోగమనియు, సురత్ శబ్దయోగమనియుకూడా చెప్పుదురు. ఈలోకములో జరుగుపనులన్నియు శక్తులమూలముననే జరుగుచున్నవి. ఈశక్తులన్నిటిలోను విజ్ఞానశాస్త్రజ్ఞులు తెలుసుకొన్నంతమట్టుకు ప్రధానమైనది ఆకర్షణశక్తి. ఇదే యీప్రపంచమునకు ప్రాణము. ఈభూమి అండాకారముగ నున్నది.

దీనిలో గొప్పఆకర్షణశక్తియున్నట్లు అందఱకును తెలిసినవిషయమే. పైకెత్తైనపదార్థము నెగురవేసినచో నది వెంటనే క్రిందికిపడిపోవును. భూమియొక్క మధ్యకేంద్రభాగములో నొకపెద్దఅయస్కాంతపర్వతమున్నదని విజ్ఞానశాస్త్రజ్ఞులు చెప్పుచుందురు కాని అది అబద్ధము. ఈపిండదేశమంతకును కర్త సూర్యుడు. సూర్యునివలననే ఇచ్చటిప్రతివస్తువుయొక్క నిర్మాణము, పాలన పోషణలును జరుగుచున్నవి. ఒక రెండుగంటలసేపు సూర్యుడు లేకుండపోయి నట్లైతే ఇక్కడనున్నవస్తువులన్నియు నశించిపోయి భూగోళముకూడ నశించి పోవును. ఈభూమియు నింక నితరనక్షత్రములుమున్నగునవియు నీసూర్యునిచుట్టు తిరుగుచున్నవి. ఇదంతియుగూడా నిజముగా ప్రేమయొక్క విలాసమే.

కావున స్థూలదేశమంతకును ఆకర్షణశక్తి పరమశక్తియేగాక, ప్రాణమనికూడ తేలుపడుచున్నది. అయితే చైతన్యశక్తియే దీనికితోడుగనుండి ఈ శక్తులన్నిటిపైన నాధిపత్యము చలాయించుచున్నది. ఇచ్చటనున్న స్థూలపదార్థములు, తత్త్వములు అన్నియు దీనివశములోనే యున్నవి. దీనిఆజ్ఞానుసారమే యీతత్త్వములన్నియు పరస్పరముసహాకరించుచు నన్నిపదార్థములను తయారు చేయుచున్నవి. ఆచేతనశక్తి యెప్పుడంతరించునో అప్పుడు అవి పరస్పరవిరుద్ధముగ పనిచేయుచు నాపదార్థమునే నశింపచేయుచున్నవి. స్థూలదేశమున కాకర్షణశక్తి యెట్లో, చైతన్యదేశమునకు ప్రేమశక్తికూడ నట్లే ప్రాణమును, ఆత్మయు నైయున్నది. ఈఆత్మ చైతన్యస్వరూపము. కావుననే అదిప్రేమస్వరూపమైనది. సమస్తాత్మలకును భండారమైనపరమపురుషునుకూడ ప్రేమస్వరూపుడు. ఈయిరువురికిని సంబంధము కలుగజేయుచున్న శబ్దధారకూడా ప్రేమస్వరూపమే. అందుచే నీశబ్దమునుపట్టుకొని, అభ్యాసముచేసి పరమపురుషునిచరణములందు చేరుకొనుటయే ప్రేమయు, భక్తియు నగును. ఇదియ సంతుల మార్గము.

సంతులు తమపవిత్రగ్రంథములలో, ప్రేమ పర్వతములనుగూడ పిండిగుండచేయుననియు, సముద్రములను చీల్చివేయుననియు వ్రాసినవిషయములలో నొక ఆవగింజంతయైన నతిశయోక్తి లేదు. ఏమహాపురుషునిలో యథార్థమైన ప్రేమ యుండునో, అతడు తనదృష్టిని పూర్తిగ నొకపర్వతముపై బరపినయెడల నది నిజముగ చూర్ణమైపోవును. మనలో నిండియున్న కామక్రోధాదిలక్షణము

లన్నియు పెద్దపెద్దమహాపర్వతములు. కాని అవన్నియు ప్రేమయెదుటకు వచ్చి నప్పుడు చూర్ణమైపోవును. మరణసమయము మహాభీకరమైన కష్టసమయము. మనశరీరములో నొకసూది గ్రుచ్చుకొనినచో మన కెంతబాధ గలుగును! మరణించునపుడైతే ప్రత్యవయవమునుండియు ధార వెనుకకు లాగివేయుచుండును. మనలో శరీరమునకును మనస్సునకును లెక్కలేనన్ని బొత్తాములు పెట్టియున్నవి. ప్రేమ అంతర్యమున ప్రవేశించినపుడు దానిప్రభావమువలన నన్నియు నొక్కసారిగ విడిపోవును. ఆశ్చర్య మేమున్నది! చూడుడు, ఇనుపగొలుసుల నెంత బిగించి కట్టివేసినను, ఒకఅయస్కాంతము వానివద్ద తెచ్చిపెట్టినట్లైతే, వాని గ్రంథులు, అతుకులన్నియు పటపట తెగిపోయి, ఆగొలుసులు అయస్కాంతము వైపున కాకర్షింపబడిపోవుచున్నవికదా! కాని, ఈప్రేమశక్తిని మేల్కొల్పుట చాలకఠినము. సంతులిట్లు సెలవిచ్చిరి.

యహ తో ఘర్ హై ప్రేమ కా ఖాలా కా ఘర్ నాహిం
సీస ఉతారే భుఇ ధరే తబ్ పైఠే ఘర మాహిం

అర్థము:—ఇది ప్రేమగృహము కాని, పినతల్లిగారియిల్లు కాదు. తల తీసి క్రిందపెట్టినపుడే, ఈ యింట్లో అడుగుపెట్టుటకు వీలగును.

ఈశబ్దములో "ఖాలా" (పినతల్లి) అనగా మాయఅనియు, సీస్ (తల) అనగా అహంకారమనియు తాత్పర్యము. అహంకారము హారములోని మధ్యమణి. ఈ "అహం" లేకపోయినచో, కామలక్షణముండ నేరదు, అనగా కామము పుట్టనేరదు, అటులనే లోభము మోహమునుకూడ నుండనేరవు. కావున నీ "అహం"యే శిరస్సు. కాబట్టి దీనిని ముందు చంపి, దీనుడును, నమ్రుడును కావలెను. అపుడే పనిసాగును, ప్రేమబయలుదేరును. అనగా సంపూర్ణముగా దీనుడై సద్గురుచరణములందుచేరి ప్రేమయు, భక్తియుచేసినపుడే, యెవరైన నాపరమపురుషుని పొందగలరు.

క్రొత్తగావచ్చిన యొకవృద్ధుడు సర్కారువారే స్వయముగ సమస్తము చేయించగలసమర్థులని విన్నవించుకొనగా, సమస్తమును రాధాస్వామిదయాళు రే స్వయముగచేయుచున్నారు, నేను ఒకపనికిమాలిన దాసుడనుమాత్రమే యనిసెలవిచ్చిరి. ప్రాచీనకాలములో నీవిధమైనవివరణము గురుశిష్యపరంపరగా నేర్చుకొనుచుండెడివారు కాని, సంతులు బయటకువెళ్ళి, ఆర్యసమాజికులుమొద

లగువారివలె ఉపన్యాసములిచ్చెడివారు కారు. ఏలననగా అట్లుచేయుట వృథా ప్రయాసయగును. పూర్వకాలములో సంతులు విశిష్టసంస్కారజీవులనుమాత్రమే తమచరణములందు లగ్నముచేసికొని వారిచేత భక్తిచేయించెడివారు. అందువలననే వారికి సజీవులైయుండగనే జ్ఞానోదయమగుచుండెడిది. ప్రాచీన మహాపురుషులు ఈవిషయములను కేవలము సంజ్ఞలు, సూచనలరూపముగనే తెల్పెడివారు. ఇప్పుడైతే రాధాస్వామీదయాళురు, మహాదయ చూపి ప్రస్తుత కాలపు విద్యాజ్ఞానమునకు తగినట్లుగ విమర్శ స్వల్పసంభాషణతో చేసి జనులందఱకు బోధపర్చుచున్నారు. ఈమతములో భక్తిసలిపి బ్రతికియుండగనే భగవంతునితో ప్రత్యక్షముగా కలిసికొనుటకు అవకాశమున్నది. కబీరువారొక శబ్దములో నిట్లు సెలవిచ్చిరి :—

తన ఛూటే జో మిలన కహత హైం సో సచ్ ఝూఠీ ఆసా।

అబ్ హూం మిలా సో తబ హూం మిలి హై నహీం తో జమ పుర బాసా॥

అనగా, ఇప్పుడే నీవు భగవంతుని కలిసికొననియెడల తర్వాతకలుసుకొనుట సాగదు. బ్రతికియుండగనే భగవంతుని పొందుము.

## 25

### సంతులదర్శనమువలనను, అభ్యాసముమూలమునను కర్మలు నశించుట.

ఈరోజున నొకబెంగాలుదేశస్థుడు వచ్చి కొన్నిమామూలుప్రశ్నలు వేసెను. సర్కార్‌సాహబ్‌వారాప్రశ్నలకు సంక్షేపముగాసమాధానముచెప్పి, "ఈమతములోని ఆంగ్లగ్రంథములను ముందు బాగుగచదువుకొనుము. నీకప్పుడే యీమతమునుగుఱించి సరిగా బోధపడగల"దని సెలవిచ్చిరి. పిమ్మట హుజూరువారు వచనమును ప్రారంభించి, నిన్నటివచనములో భగవంతుడు ఆకర్షణశక్తియొక్క అనగా ప్రేమయొక్క భండారమని చెప్పియుంటిమని జ్ఞాపకముచేసి, అందుచే భగవంతుని అవతారపురుషులైన సంతులుకూడా ప్రేమ భండారమే అనియు వారియెదుటపడినందువలన జీవుని కనంతసంఖ్యాకమైన కర్మలు నశించిపోవుననియు సెలవిచ్చిరి. ఎట్లనగా నొకపెద్దఅగ్నిజ్వాల యున్నదనుకొనుడు. కట్టెలుమున్నగువానిలో నిప్పు గుప్తముగనుండును. అట్టిపదార్థములను అగ్నిజ్వాలదగ్గఱకు తీసికొనివచ్చినచో వానిపై పొరలు ఊడిపోయి మండిపోవుచుండును. అవి ఆజ్వాలలోపడినపుడు పూర్తిగ మండిపోవును. అటు

లనే జీవుడు సంత్ సద్గురునిదృష్టిలో పడినపుడు, సంత్ సద్గురునిలో చైతన్య ప్రేమల నుహాప్రకాశమున్నది కావునను జీవునిలో ఆత్మచైతన్యమున్నది కావునను జీవుని కర్మలయొక్క కోశములు తెగిపోవుచుండును. సత్సంగిలోకూడా ప్రేమాగ్ని కణము రగులుకొనియున్నది. కావున సంతులకు దగ్గరగావచ్చినపు డాయగ్ని కణము ఎక్కువప్రబలముగ వెలుగొందుటచే నతనికర్మకోశములు మండిపోవును. ఉపదేశమిచ్చిననాటినుండియు జీవుడు చరణధారతో పెన వేయబడుచుండును. అతనికి ప్రేమాగ్నికణముకూడా నప్పుడేదాన మీాయబడును. ఆకణము లేక బీజము రోజురోజు వృద్ధినొందుచుండును. అందువలన ఆతనికర్మలు నశించుట ప్రారంభించి, చివర కతనికర్మలన్నియు నీజన్మలోనే పూర్తిగా నశించిపోవును. ఎవనికర్మలైన నీజన్మలో పూర్తిగనశింపజేయదగి యున్నవోలేవో పరీక్ష చేసినపిమ్మటనే సంతు లతనిని చరణములయందు తీసికొందురని ఇంతకుముందు గనే వారుసెలవిచ్చిరి. ఆవిషయము సమర్థించుచు పవిత్రగ్రంథములలోగూడ నీక్రిందిద్విపద చెప్పబడినది.

కాల సే నాతా టూటా, కర్మ భర్మ సబ్ ఛూటా।
మౌజ్ సే తుమ్హారీ హోయ సో హోయ్, దూసర కరనహార్
నహీం కోయ్ ॥

అర్థము :—కాలునితో సంబంధము తెగిపోయినది. కర్మభ్రమలన్నియు నశించిపోయినవి. ఏమి జరిగినను మీాదిచ్ఛవలననే జరుగవలసియున్నది, కాని మఱొకరు చేయువారు లేరు.

ఏజీవుడైనను కాలునిసృజించినకర్తయొక్క రక్షణలోనికి వచ్చినపుడు అతనికి కాలునితో సంబంధము, దానంతటనదియే తెగిపోవును. కాలుడిక నతని నేమియు చేయలేడు. అందువలననే అతనికి జననమరణచక్రములో తిరుగుట కట్టువడిపోవును. కొందఱు తెలివితక్కువసత్సంగులు, ఈదయాభరితమైన మహా వచనమువలన, "సరే సంతులవాక్యమునకు తిరుగెన్నడు నుండనేరదు కావున మనకింక జననమరణచక్రములోనికి వెళ్లుట అసంభవము; కావున మనము విచ్చలవిడిగా సుఖముల ననుభవించుచు పాపకృత్యముల నెన్నిచేసినను చేయ వచ్చును. ఇంక దేనికి భయము" అని అనుకొందురు. ఇట్టిఆలోచనలుగల సత్సంగు లిదివఱలోగూడ నుండెడివారు, ఇప్పుడుకూడ గలరు. కాని వారంద

ఱును గొప్పపొరపాటు పడుచున్నారు. అట్లుచేసినచో వారు, మహాదుఃఖము నెత్తిమీదకు తెచ్చుకొందురు. ఏలననగా, సంతులీవిధముగకూడ సెలవిచ్చిరి.

కర్మ జో జో కరేగా తూ, వహీ ఫిర్ భోగనా భరనా।

అనగా నీ వేయేకర్మలు చేయుదువో, వానిఫలితమును తప్పకఅనుభవించవలసి యున్నది. నడవడి సన్మార్గములోనుంచుకొనినచో నెక్కువగ కష్టములు గలుగ నేరవు. లేనిచో అంతకుముం దొకపాపకర్మచేసియుండినచో దానిమూలమున అయిదునిముషములసేపుమాత్రమే బాధ అనుభవించవలసియున్నను, మఱొక పాపకర్మ తిరిగిచేసినందువలన వారు ఆబాధను పదినిముషములవఱకు ననుభవించ వలసివచ్చును. కావలెనన్నచో పాపకృత్యములను చేయుము, కాని దానితో పాటు వానికి ఫలితముగా దుఃఖములనుగూడ సహించుటకు సిద్ధముగనుండుము.

అనేకపూర్వజన్మలసంచితకర్మలును, క్రితముజన్మయొక్క ప్రారబ్ధకర్మ యును, ఈజన్మయొక్క క్రియమాణకర్మలును ఇవన్నియుకూడ సంతులు జీవునిచే నీజన్మలోనే అనుభవింపజేయవలసియున్నది. కావున వీనిఅన్నిటికి పూర్తియైన ఫలానుభవము సమాప్తమైపోవలయునన్నయెడల అంతకాలము ఈశరీరము నిల్వనేరదు సరికదా, అది మనకు సహింపశక్యముకూడ కాదు. సంతులు శూలపుపోటు నొక చిన్నముల్లుగను, మణుగుబరువు నొక ఛటాకు (అనగా అయిదుతులములు) అంతగను తగ్గించివేయుదురని చెప్పినవాక్యము పూర్తిగా నిజము. లేనిచో నొక్కజన్మలోనే సమస్తకర్మలు నశింపుకానేరవు. ఉదాహరణకై ఏదైననొకకర్మమూలమున జీవుడు నరకమునకుపోవలసియున్నచో, నక్కడ అనుభవించవలసినమహాదుఃఖమునకు బదులుగా, ఆకర్మఅనుభవించవల సినసమయమువచ్చినపుడు సత్సంగికి అభ్యాససమయములో నొకసహించలేనంత కష్టము గలిగి, అభ్యాసానంతరముకూడ కొంతకష్టము కలుగుచునేయుండును, కాని ఆవిధముగా ఆకర్మ నశించిపోవుచుండును.

ఈవిధముగా అనేకకర్మలు అభ్యాససమయములో నశించిపోవుచుండును. అందుచే భక్తజను లెప్పుడును చింతాక్రాంతులై దుఃఖితులుగనుందురు. ఏల ననగా వారితాలూకు అనంతసంఖ్యాకముగా కుప్పలు, కుప్పలుగ చేరియున్నట్టి కర్మలన్నియు నొక్కసారిగా నీజన్మలోనే సంక్షేపముగ తెగగొట్టబడుచునుం డును. అందుచే భక్తజను లెప్పుడును చింతాక్రాంతులై దుఃఖితులుగనుందురు.

కాని వారు గాబరాపడనవసరము లేదు. భక్తు డెల్లపుడు లోలోపల సంతసించుచునుండుటయేగాక, పైగా అతనిమనస్సునకు దుఃఖము లేనిసమయములో, భగవంతుని కతనిపైన దయ తగ్గిపోయినదని యెంచుకొనుచు, తన కింకను బాధగలుగజేయుడని భగవంతుని ప్రార్థనకూడ చేయుచుండును. భక్తు డెల్లపుడు నట్లే ప్రార్థించుచు, తిరిగి ఆతని కేదైన బాధగల్గినపుడు భగవంతుడు తన పైన దయాహస్తముపెట్టినట్లు సంతోషించును. అందుచే భగవచ్చరణములను పట్టుకొన్న ప్రతిజీవుడును తానంతకుముందు జేసిన పాపకర్మలకు పశ్చాత్తాప పడుచు, నిఁకముందు బాగుగ విమర్శించుకొనుచు ప్రవర్తించవలయును. భగవంతునిదయఅయితే సముద్రమువలె పొంగిపోవుచునే యున్నది. ఇతడాసము ద్రములో పడిపోయెను. ఇఁక నేపరిస్థితిలోనుగూడ నీవలకు రానేరడు. ఏల ననగా, "రాధాస్వామీ ఛోడే న జిసే గహే రీ" (అనగా రాధాస్వామీవా రెవరిని పట్టుకొందురో వారి నెన్నటికిని విడిచిపెట్టరు.) అని పవిత్రగ్రంథము లోనే వ్రాసియున్నది. ఈప్రవాహముతోపాటు తానుకూడా తిన్నగా ప్రవహించినచో, నితనికార్యము త్వరలోసఫలమైపోవును, అతనికెట్టిబాధయు నుండదు. కాని, అతఁడీప్రవాహమున కెదురుగాపోయినచో, నాప్రవాహము బలవత్తరమైనది కావున నతని చెవి, ముక్కువగైరా అవయవములన్నియు చూర్ణమైపోవును. అనగా అతనిమనస్సుయొక్క సూక్ష్మాంగములు ముక్కలుముక్కలైపోయి, అతడు మహాబాధసహించవలసివచ్చును.

## 26

పరమార్థమునుగురించి లోకములోగల తప్పుడభిప్రాయములు, శరీర మనస్సులు మహాశత్రువులు, సంతసద్గురుని సహాయము లేనిదే వీనిని జయించుట సాధ్యము కాదు.

14 జనవరి 1911 :— పరమార్థమనగా కొందఱిఅభిప్రాయ మేమనగా, తమప్రాపంచిక కార్యములన్నియు యథాప్రకారము బాగుగసాగిపోవుచుండవలెననియు, పరమేశ్వరు డేమియు శ్రమపడనక్కఱ లేకుండగనే దొరికిపోవలెననియు అనుకొనుచుందురు. ఇంతియగాక కొందఱు తాముశరీరముకాని మనస్సుకాని కాదనియు, తాము అసలే లేము అనియు చెప్పుచుందురు. అభ్యాసముకూడా నేయుచుందురు కాని ఆ అభ్యాసము మహాశ్రమపడి చేసినమీదట మనోఆకాశ

ములో కొన్ని నిముషములుమాత్రమే ఆనందము లభించినచో మహాసంతోషము నొందుచుందురు. మఱికొందఱు యీలోకములో బహుశ్రేష్ఠమైనవస్తువులను చూచినపుడు పరమేశ్వరుని తలంచుకొనుచుందురు. కాని యీపద్ధతులు వేని వలనను భగవంతునిపొందుట సాధ్యముకాదు. ఈవిధముగ నెవరైనను అభ్యాసముచేసిననుకూడ వారికి అందువలన కొద్దినిమిషములు నిశ్చలత్వముమాత్రమే లభించును; కాని అదంతయు వ్యర్థమే. వీరందఱును పొరపాటులో పడి యున్నారు. కేశవచంద్రసేన్‌గారి జీవితచరిత్రలో వారినిగుఱించి యీవిధను గనే వ్రాయబడియున్నది. కర్నల్ ఆల్కాట్‌గారినిగుఱించికూడా అట్లేవ్రాయ బడినది. వారికి తేజస్సు దర్శనమయ్యెనట. అంతటితోనే వారికి తృప్తిగలిగెను. దేవేంద్రనాథ్‌టాగూరుగారికికూడా ఇట్లే అయ్యెను. ఆయన గొప్ప విద్వాంసుడు, సంస్కృతఅరబ్బీభాషలలో ప్రవీణుడును గొప్పఉత్తమప్రవర్తన గలజీవితమును గడిపినవాడును. అయినను, వీరందఱును భ్రమలో చిక్కుకొని యుండిరి.

ఇట్టిభ్రమలో పడిపోవుటకు కారణమేమియని ఇప్పుడు ప్రశ్నబయలుదేరు చున్నది. సంతులు మనకిచ్చట నెవరుశత్రువో, ఎవరు మిత్రమో ముందు తెలిసి కొనవలెనని సెలవిచ్చిరి. ఇచ్చట మనకగుపడునవి రెండుప్రధానాంగములు. ఒకటి శరీరము, రెండవది మనస్సు. ఈరెండును మనకు మహామిత్రములుగ కన్పట్టుచున్నవి. కాని ఇవి మనకు మహాగర్భశత్రువులు. వీనిమూలముననే మన మీసంసారములో చిక్కువడినది. మన మీశరీరమునకు చాలఅధీనులము. కొద్దిగా ఊపిరిఆడుట కష్టమైనచో, మన కెంతబాధగలుగునో చూడుడు. జబ్బు చేయనిండు, యెంతబాధగనుండును! ఈశరీరము మనపైన అధికారము చాల చలాయించుచున్నది. ఇక మనస్సు అధికారమైతే చెప్పనలవియేకాదు. దీని అంగములైన కామక్రోధాదులే మనను ప్రపంచములో త్రిప్పివేయుచున్నవి.

శరీరమునకు హద్దు ఆఱవచక్రమువఱకునున్నది. అచ్చటివఱకు నది మనతోకూడ వచ్చును. ఏలననగా, దానిహద్దు పిండదేశమువఱకు అనగా మృత్యుస్థానమువఱకు నున్నది. మొదట స్వప్నావస్థ, రెండవది సుషుప్తి, అటు పిమ్మట సమాధ్యవస్థ, ఆతరువాత మృత్యువును గలుగును. స్వప్నావస్థ యోగులకు కల్పవృక్షమువంటిది. ఏలననగా యీఅవస్థలోనికి ప్రవేశించినపుడు జీవుడు ఏదికావలెనన్న అది వెంటనే సిద్ధమైపోవుచుండును. ఇదికూడ గొప్పస్థానము.

జాగ్రదవస్థలో స్మృతిగలిగియుండగనే స్వప్నావస్థను కలుగజేసికొనసమర్థుడైన జీవుడు రాజులు, మహారాజులుకన్నగూడ గొప్పవాడు. జాగ్రదవస్థలో మనకు మీగడ తినవలయునని యున్నయెడల ముందు పాలుతెచ్చుకొని వానినుండి మీగడ తయారుచేసికొనవలసియున్నది. అట్లనే షికారుగా వెళ్ళదలచినచో బయలుదేరి తోటకు వెళ్ళినపిమ్మటనే తోటచూడనగును. కాని స్వప్నావస్థలో నట్లుగాక ఏవస్తువుకావలయునసిన నది వెంటనే యెదుట సిద్ధమగును. శరీరము పూర్తిగా మాయికపదార్థముతోనే తయారైనది. ఈశరీరమును జయించిన వానితరహాకూడ చాలగొప్పది. అతనికి పిండదేశముయొక్క సృష్టికర్తనజకును గతి సిద్ధించినది. దానిపైన మనోదేశమైనబ్రహ్మాండదేశ మున్నది. ఇదికూడ మాయికపదార్థమేకాని, సూక్ష్మమాయతో తయారైనదని సంతులుసెల విచ్చిరి. శరీరము, మనస్సననెడి యీరెండును జీవుని జననమరణచక్రములోనికి తీసుకొనిపోవుచున్నవి. శరీరమైతే పిండదేశములో నుండిపోవును. అది మాయిక పదార్థముతో తయారైనది. కావున మృత్యువుకలిగినపుడు జీవుని నది తన సజాతీయపదార్థములోనికి తీసుకొనిపోవును (అనగా జననమరణచక్రములోనికి తీసికొనిపోవును) మనస్సుకూడ నట్లే చేయును, కాని యీరెండును నాశమాన మైనవి. ఇవి మహాప్రబలశత్రువులు. ఈదేశములోజీవుడు పిండీమనస్సు చెప్పినట్లె అన్నిపనులు చేయుచుండును. ఈపిండీమనస్సు శరీరముమీద అధికారము చలా యించుచు, దానివివిధాంగములద్వారా మనలను భ్రమింపజేయుచున్నది. పై నున్నకాలదేశములో తనసైన్యమును పెట్టుకొని సన్నద్ధుడైయున్నకాలునికి, ఈ మనస్సు పుత్రుడు. దీనిపైన లక్ష్యమనస్సును, దానిపైన బ్రహ్మాండీమనస్సును ఉన్నవి. వీనిఅన్నిటితోను యుద్ధముచేయుట ఒకమహాఘోరునిపని. ఎందరో యోధులు, ఋషులు, మునులు, మహాత్ములును, యీమనస్సుచేత పరాజితులై పోయిరి. మహానిర్బలుడైన యీజీవునికి దీనినిజయించుటకు శక్తిఎక్కడఉన్నది?

ఈపిండీమనస్సు అసలేమహాబలవత్తరమైనది. అంతియగాక దానికి బహు చాతుర్యము, విద్వత్తియు, ప్రజ్ఞయుగూడ గలవు. ఇది బహుమోసము, కపట ముతోనుకూడిన పన్నుగడలు పన్ని జీవుని పూర్తిగా తనవశములో నుంచు కొనును. ఎవనికైనను ఏవస్తువునందుకాని ఏవిషయమునందుకాని అధికాసక్తి యున్నట్లుకనిపించునో అందులోనే అతనికి మహానందముకలుగజేసి తనజాలము నుండి అతనిని బయటకుపోకుండ చూచుకొనును. ఎవరైన నొకమహాసన్యాసి

లేక బైరాగియైననో అతనికి గొప్ప చమత్కారముచూపి ముందుకుసాగకుండ అచ్చటపడియుండిపోవునట్లు చేయును. కాని దీనిమోసమంతయు సంతుమహాత్ములు పూర్తిగా బయలుపఱచిరి. భక్తజనులకు దీనిమోసపుప్రవర్తన అంతయు బోధపడి వారు దీనిపట్టులో పడిపోకుండునిమిత్తమై దానిప్రవర్తనావిధానము లన్నిటిని సంతులు తమపవిత్రగ్రంథములలో విశదీకరించి వ్రాసిరి. అందువలననే పవిత్రగ్రంథములపఠనము అత్యావశ్యకము. వానిని శ్రద్ధగ విని, అవగాహనచేసికొని మననముచేసికొనుచుండవలెను. ఇదికూడ యొకవిధమైన యభ్యాసమే. భక్తజనులు విద్యలో చిక్కుపడిపోకుండునిమిత్తమైయే, సంతులు విద్యాజ్ఞానము తుచ్ఛమని నిందించిరి. అనగా "హే విద్యా తూ బడీ అవిద్యా" వగైరా వగైరా వ్రాసిరి.

ఈకాలునినుండియు, మనస్సునుండియు జీవులను కాపాడునిమిత్తమై ప్రత్యేకముగ నుత్తమలోకమునుండి అనగా నిర్మలచైతన్యదేశమునుండి వచ్చి యీసంసారములోఅవతరించినట్టి ఆపరమశక్తిధారయొక్కటే జీవులను ఈరెండింటినుండియు కాపాడగలదు. ఏలననగా, ఒకమహాప్రబలశక్తియెదుట దానికన్న అల్పశక్తి సూర్యతేజస్సునెదుట సాధారణదీపపుకాంతి వెలవెలబోయినట్లుగ, అంతరించిపోవును. సాక్షాత్పరమపురుషుడును మనకు తల్లియుదండ్రియునైనట్టి నిర్మలచైతన్యధార ఈలోకమున నెప్పుడైన నవతరించినపుడు అదియే యీజీవుని సీజాలములనుండి పైకితీసికొనిపోగలుగును. ఈమనస్సు, కాలుడును ఆనిర్మలచైతన్యధారకొక్కదానికే భయపడుచుందురు. కావున పరమపురుషుని అవతారస్వరూపులైనసంతసద్గురువు మీఅదృష్టమువలన నెప్పుడైన మీకు లభించినచో వారివలన రహస్యమంతయు తెలిసికొని మీఆత్మను మేలుకొలుపుకొని ఊర్ధ్వముగ నారోహింపజేయుడు. ప్రస్తుతము జీవునిఆత్మ చైతన్యస్వరూపమైనను నిద్రాణమైయున్నది. ఇదికూడ తనసజాతీయపదార్థమైన చేతనధారవలననే మేలుకొనగలదు.

కొందఱు "మేము మంచిమంచికార్యములు చేయుచున్నాము. భగవంతుడు సర్వసమర్థుడుకదా, కావున ఆయన మాకీవిధముననే లభించగలడు"అని అనుచుందురు. కాని వారు పొరపాటుచేయుచున్నారు. ఏలననగా ఒకదప్పికగొన్నవాడు భగవంతుడు సర్వసమర్థుడుకదా ఆయనమాకు మంచినీరును పంపించగలడని కూర్చుండిపోయినచో వానికి మంచినీరు లభించదుకదా ! భగవంతుడు

మంచినీటి బావులు వగైరా ఏర్పాటుచేసిఉంచెను. నీవు స్వయముగ నచ్చటికి పోయి త్రాగవలయును. ఇంక నెక్కువసహాయముకొఱకు ప్రార్థించునట్టి యజ్ఞానులకు ఒకబుద్ధిమంతునితో సంయోగముకలుగజేసి అతనిద్వారా ఆ నుయ్యివగైరాస్థలములకు త్రోవను తెలియజేయగలరు. అదియ భగవంతుడు అట్టిఅజ్ఞానులకుచూపగల అధికాధికదయ. అందుచే వాస్తవపరమార్థముచేసి కొనవలయుననియు, భగవద్దర్శనము లభించవలయుననియు కోరెడివారు సద్గురుని నాశ్రయించి ఆధ్యాత్మికమార్గముయొక్కరహస్యములు తెలిసికొని ప్రయాణముజేయవలయును. వారిసహాయములేనిదే ఆప్రయాణముచేయుట అసంభవము. దీనికి మఱొకవిధానమే లేదు.

## 27

### నిజమైనమత మనగ నెట్టిది ?

15 జనవరి 1911 :—మిలిటరీడిపార్టుమెంటులో నుద్యోగముచేయుచు నీ మధ్యనే లక్నోబదిలీఅయిన ఒకమద్రాసుదేశస్థు డీరోజున వచ్చెను. సర్కారుసాహెబ్ వా రాయననుచూచి, "మీకాంగ్లభాష యెక్కువబాగుగ నవగాహనయగునుకావున నే నీరోజుసంభాషణలో ఆంగ్లభాషాపదముల నెక్కువప్రయోగించెదను. కాని యిచ్చట చాలమందిసత్సంగులకు ఆంగ్లభాష తెలియదుకావున హిందూస్తానీభాషకూడ కలగలుపు జేసి మాట్లాడెదను. ఆవిధముగచేసినందువలన మీకును చెప్పినవిషయము బోధపడగల"దని సెలవిచ్చిరి.

నిజమైనమత మెద్ది ? ప్రపంచములో ప్రతివ్యక్తియును సుఖములభించవలయుననియు, దుఃఖమునుండి నివృత్తికావలయుననియే కోరుచుండును. చిత్తమునందు శాంతియు, ఏకాగ్రతయు గలిగినపుడు సుఖముకలుగును; అనగా మార్పులేకుండనుండి చిత్తముతన్మయమై యుండునపుడు సుఖముకలుగును. సుఖమనుపదము ఇచ్చట బహువిశాలార్థములో ఉపయోగించబడినది. అట్లుగాక, మార్పులుగలుగుచునుండి చిత్తము వ్యాకులమైయుండినపుడు దుఃఖముకలుగును. అనగా చిత్తమునకు శాంతియున్నపుడు సుఖమును, అశాంతి యున్నపుడు దుఃఖమును గలుగును. మామూలుసుఖముకన్న నెక్కువసుఖ మెచ్చటనైనలభించినచో జీవుడు మొదటిసుఖస్థానముకన్న నారెండవడుత్తచు

సుఖస్థానమునే యెక్కువగనిష్టపడును. ఈవిధముగ సుఖముయొక్కతరహాను పెంచుకొనుచుపోయినయెడల ప్రతిమానవునకును పరమసుఖము పరమశాంతియును, దుఃఖమునుండిసంపూర్ణనివృత్తియు లభించవలయుననియే కోరికయున్నట్లు పర్యవసానము తేలును. కాని, మార్పుచెందునట్టిపదార్థములలో సుఖము లభించ నేరదు.

ఇప్పుడు ఏపదార్థములు పరివర్తనశీలములు అనువిషయము తెలిసికొనవలసియున్నది. ఇది మనకు రోజూగలుగుచుండెడి అనుభవమువలననే తెలిసిపోగలదు. ఈశరీరము ప్రతిక్షణము మాఱిపోవుచునేయున్నదని మనకు తెలుసును. మొదట నది పసిపిల్లవానిరూపమున నుండి, పిమ్మట యౌవనరూపమై, ఆతరువాత వృద్ధరూపములోనికి మాఱిపోవుచున్నది. చివరకు మరణసమయమున నది మనఅందఱిని పూర్తిగవిడిచిపెట్టి పోవును. అంతర్దృష్టి కొద్దిగనైన వికసించినప్రతిమానవునకును, ప్రతివ్యక్తినుండియు మలినపరమాణువులు బయలువెడలుచున్నవనియు నవి అతనిచుట్టు నొకమాలిన్యచక్రముగా తయారగుచున్నవనియు కనబడగలదు. కాని సంతుమహాత్ములచుట్టు నొకమహాప్రకాశమానమైనచక్రము ఉండును. ఏలననగా, వారిలోనుండి నిర్మలపరమాణువులు బయలువెడలుచుండును. కావున ఆప్రకాశమానతేజోవలయముతో స్పర్శ లభించినవారందఱికిని తప్పక చైతన్యలాభము గలుగును.

ఈపరమాణువులవలయము నిరంతరము తయారగుచునేయుండుటవలన శరీరములో ప్రతిక్షణము పరివర్తనకలుగుచునేయుండును. అది నాశమానము. ఈవిధముగ నీశరీరదేశములో అనగా పిండదేశములో సూదిమొదలుకొని పెద్దపెద్ద పదార్థములవఱకు నన్నిపదార్థములు నాశమానములే. మన దనెడి పదార్థమెద్దియు లేదు. మన దని భావించుకొన్నవస్తువు మనకన్న నెక్కువబలవంతుడైన మఱొకరు లాగుకొనిపోయినచో మనకు దుఃఖముకలుగును. ఇందుకు కారణమేమనగా మనమనస్సు ఆవస్తువునకు ఒకసూత్రముతో కట్టబడినది. ఆ వస్తువు మనవద్దనుండిబలవంతముగ లాగుకొన్నపుడు మనమనస్సున కొకఆఘాతము (shock) తగులుచున్నది. అదిగాక మనమనస్సుకూడ ప్రతిక్షణము మాఱుచునేయున్నది. కావున శరీరము, శరీరదేశమును. మనస్సు, మనోదేశమును ఇవన్నియుగూడ నాశమానములే. వీనిలో మనముకోరినంతసుఖ మెన్నడును లభించజాలదు. అనగా వీనిహద్దులలో నుండిపోయినపుడు నాశరహితమైన

పరమసుఖము మన కెన్నటికిని లభింపనేరదు. ఇప్పుడు ఈశరీరము మనది కాదు, ఈమనస్సు మనదికాదు. అనగా ఈరెండును మనయొక్క "అహం" (Ego) కావు. ఇవిగాకుండ మఱొకమూడవవస్తువులగు ఆత్మ లేక సురత్ అనునది గలదు. వాస్తవములో అదియే మనము. అది పరివర్తన రహితమగుటయేగాక, పైగా అజ్ఞేయముకూడ. ఏలననగా, పసిపిల్లలోను ఆఆత్మయేవున్నది. యువకుడైనపుడు, తిరిగివృద్ధుడైనపుడుకూడ నా ఆత్మయే యుండుచున్నది. అదియే మహానిర్మలచైతన్యము. ఈపిండములోనున్నపుడు అది శరీరమనస్సులతో బంధింపబడియున్నట్లు కనబడునుగాని నిజమునకది వానికతీతమై యున్నది. ఈఆత్మ యెచ్చటనుండిబయల్వెడలెనో అట్టిఆత్మభండారము మహానిర్మలము, మహాచైతన్యస్వరూపముగను ఉండును. దానిలో మాయ లేశమాత్రముకూడ నుండదు. అది శరీరమనస్సులకు పైన అనగా మాయికదేశములకుపైన పూర్తిగపరివర్తనరహితమై యొప్పారుచుండును. కావున మనకు నాశరహితమైన పరమసుఖము అచ్చటనేగాని మఱెచ్చటను లభించనేరదు. దీనినిబట్టి యెక్కడ పరివర్తనయు, వ్యాకులతయునుండునో అచ్చట పరమసుఖములభించనేరదనియు, పరివర్తనరహితమైనచోట దుఃఖముండనేరదనియు స్థిరపడుచున్నది. మన మేయుద్దేశములను సాధించుకొనునిమిత్తమై యీవిమర్శ ప్రారంభించితిమో ఆరెండును మనకు సమకూరెను. అనగా పరమసుఖముయొక్క ప్రాప్తియు, దుఃఖమునుండిసంపూర్ణనివృత్తియు అనెడి రెండు కార్యములును నిర్మలచైతన్యదేశములో నెఱవేరునని తేటపడెను.

ఇకనిపుడు మనకు "అట్టిదేశ మెక్కడున్నది ? దానినిపొందు విధ మెద్ది? ఆత్మకు తనభండారమువద్దకారోహించునపుడు, పట్టుకొనిపైకెక్కుట కాధారముగనుండగల త్రాడువంటి దేదైన ఆధారమొకటి ఆభండారమునుండి క్రిందివఱకు వ్రేలాడుచునున్నదా ? మార్గమధ్యమందు మజిలీలు ఏమేమిగలవు ?" అను ప్రశ్నలు బయలుదేరును. ఈవిషయములన్నియు కొన్నిదినములు సంభాషణ చేయగ క్రమక్రమముగ బోధపడగలవు. ఆతరువాత నీసాధననుఉపదేశము పొంది, అభ్యాసముచేసి అనుభవముపొందవలయును. అప్పుడు అతనికి తన యుద్ధారము జరుగుచున్నదనువిషయమును, తనఆధ్యాత్మికాభివృద్ధి రోజురోజు కలుగుచున్నదనువిషయమును, తనఆత్మ బంధనములనుండి విముక్తిఅయిపోవుచున్నదనువిషయమును జీవించియుండగనే బోధపడగలవు. ఒకపిల్లవాడు బడిలో చదువుకొనుట ప్రారంభించినపుడు మొదటితరగతి, రెండవతరగతి. పిమ్మట

మూడవతరగతి యీప్రకారము చదువుకొనుచు పైపైకివెళ్లుచుండును. అప్పుడు ఆపిల్లవానికి తనవిద్యాజ్ఞానము రోజురోజు అభివృద్ధియగుచున్నట్లు స్వతహాగనే తెలిసిపోవును. ఇదేవిధముగా అభ్యాసికికూడ తనఅభివృద్ధి అవగాహనఅగుచుం డును. నేనిదంతయు సంతుమతమనగ నెట్టిదో మీకు తెలియవలెనని ఉపోద్ఘాత ముక్రింద చెప్పితిని. ఇదియే నిజమైనపరమార్థమార్గము. మిగిలినమతములలో చేయించెడికృత్యములన్నియు వ్యర్థములు. భగవంతుని మరెవ్విధముగను పొం దుట సాధ్యముకాదు.

అటుపిమ్మట ఆమద్రాసుదేశస్థునితో ఆంగ్లభాషలో సంభాషణజరిగెను. ఈమతమునుగురించిన సంపూర్ణవివరణము ఆంగ్లభాషలో నచ్చొత్తించినచో సామాన్యజనమందరికిని లాభముగలుగునని ఆయనచెప్పగా హుజూర్‌సర్కార్ సాహబ్‌వారు మాకు జనసామాన్యమందరికిని తెలియపరచవలసినఅవసరము లేదని సెలవిచ్చిరి. ప్రస్తుతము ప్రపంచమంతయు ఐహికవిషయములలోనే పూర్తిగ గ్రస్తమైయున్నది. ఎవరికిని మతమునుగురించి ఆలోచనయే లేదు. సుసంస్కారులైనవారు కొద్దిగనే యుందురు. వారికి ఆంతర్యసూచనలు అనుభవ రూపముగ గలిగినపుడు వారంతట వారే వచ్చి యీమతములో చేరుచుందురు. ఈమతము ప్రారంభించి యేబది యేండ్లైనది. ఇంతవరకు నలుబదివేలకుపైన సత్సంగులున్నారు. వారందరు తమతమస్థలములలో ఆధ్యాత్మికాభ్యాసము నిశ్శ బ్దముగ చేసికొనుచున్నారు, కాని వారు ఆవిషయమును పైవారికెవ్వరికిని గూడ తెలియనివ్వరు. ఎవరికివారు ఒకఏకాంతస్థలములోకూర్చుండి, అభ్యాసముచేసి కొనుచుందురు. జనసామాన్యమందరకును పబ్లిక్ (public) లో లెక్చర్లు వగైరా లిచ్చుట బొత్తిగనిషిద్ధము. విజ్ఞానశాస్త్రములో ప్రజ్ఞగలమనిషి ఎన్ని యోసంవత్సరములు పాటుపడి యేదైనక్రొత్తవిషయమును తెలిసికొన్నపుడు, అతనికి ఆవిషయముయొక్క ప్రాధాన్యమును తెలిసికొనగలవ్యక్తి దొరికెడి వరకు, మరెవ్వరికి నావిషయము చెప్పడు. అటులనే యీమతముగూడ నొక మహావిజ్ఞానశాస్త్రము. యథార్థమైన జిజ్ఞాసువెవరైన వచ్చినపుడేకాని యీ మతరహస్యములు తెలియజెప్పము. ఇక పుస్తకమువిషయములో, మానాయ కులు (leader) ఆంగ్లభాషలో నత్యుత్తమశైలిని మహోదయతో నొకగ్రం థము వ్రాసిరి. అది క్లిష్టముగనే యున్నది. కాని దానిలో సంపూర్ణవివరణము లున్నవి. అది మీరు చదువుకొని అందులో తెలియనిభాగములను గుర్తుపెట్టు

కొని నన్నడిగి తెలిసికొనవచ్చును. నేను నాకు తెలిసినకొద్దివిషయములను నొక శిష్యునివలె చెప్పుచున్నాను. కాని నాకుగల ఆంగ్లభాషాజ్ఞానము చాల సామాన్యమైనది.

## 28

సర్వధర్మసమ్మేళనవిషయములు :—

నిజమైన సద్గురువు లభించుట గొప్పమహాదృష్టము :—

సత్సంగి నిర్లక్ష్యముగ ప్రవర్తించకూడదు—

అలహాబాదుపార్టీవారి ప్రవర్తన—

18 జనవరి 1911 :—అనేకవిషయములపైన సంభాషణజరిగెను. ఈమధ్యనే అలహాబాదులోజరిగిన సర్వధర్మసమ్మేళనసభ (Convention of Religions) ను గుఱించి మొట్టమొదట చెప్పుచు, మతములన్నిటిలోను పరస్పరవిరుద్ధవిషయములను తొలగించి వానినన్నిటిని ఒకేమతముగ చేయవలయునని ఆసమ్మేళనమువారియుద్దేశమై యున్నదని సెలవిచ్చిరి. కాని వీరిఅభిప్రాయము తప్పు. ఏలననగా, అన్నిమతములు నొకేవిధముగ లేవు. క్రైస్తవమతమునుగాని, మహమ్మదీయమతమునుగాని, హిందూమతముతో నేకీభావముచేయవలయునన్నచో నది యెట్లు సాధ్యమగును? హిందూమతమును సంతుమహాత్ములపవిత్రగ్రంథములతో సమముచేయగోరిన నదికూడ యసంభవమే. అసలు మతమనగ నెద్దియో వీరలకు బొత్తిగ తెలియదు. ఐతే సామాజికదృష్టికోణమును బట్టిచూడగా వీరు చేసెడిప్రయత్నములు లాభదాయకములే. అయితే రాధాస్వామీమతమువారికిగూడ రావలసినదని ఆహ్వానముపంపిరి. రాధాస్వామీమతస్థు లచ్చటికిపోయినచో ప్రతిమతమును ఖండనచేయుదురు. కావున నీమతస్థులచ్చటికిపోవుట కవకాశములేదు. ఐనను, సంతుమతముయొక్కదృష్టికోణమునుబట్టిచూడగ నొకలాభము తప్పకగలుగగలదని తోచును. ప్రస్తుతకాలములో ప్రతిమతము నశించిపోవుచున్నది. ఈసమ్మేళనసభవలన మతమునకు మఱొకగట్టిదెబ్బ తగులగలదు. దానితో మిగిలినకొద్దిమతములుగూడ నశించిపోవచ్చును. ఈవిధముగా కొంత శుద్ధియగును. ఇదేవిధముగా ఇంగ్లాండుదేశములోగూడ ఒకమతము "యూనిటేరియన్సు" (Unitarians) అనుపేరుతో నున్నది. వారియుద్దేశ్యముకూడ నిదియే. కాని వీండఱు మతనాయకులుగ తయారైనచో మూర్ఖతయగును.

నిజమైనపరమార్థమును గోరువానికి, వానియదృష్టవశమున సద్గురువు లభించినచో కార్యమంతయు నెఱవేఱినట్లే. పవిత్రగ్రంథములో "గురూ మిలే ఫిర్ కహా కమానా" (సద్గురువుదొరికినచో చేయవలసినది మఱేమున్నది ?) అని సెలవియ్యబడినది. సోదరా, నిజము చెప్పవలయునన్నచో గురువైతే సత్సంగు లకు లభించియేయున్నారు. పరమపురుషుడు దయతో సద్గురుస్వరూపమును ధరించివచ్చి మనలను తమచరణములందేనాడుతీసికొనిరో మనయుద్ధారకార్య మానాటినుండియు జరిగిపోవుచునే యున్నది. పవిత్రగ్రంథములలో సంతులసమ క్షమునకు ఏజీవుడైనను వచ్చినపుడు సంతులతనిని బాగుగపరికించి చూతురని వ్రాసియున్నట్లు ఇంతకుముందుకూడ చెప్పియుంటిమి. కాలుని కతడు తీర్చవలసి యున్న ఋణము ఈజన్మలో తీరిపోవునని తోచినపుడే అతనిని చరణములందు తీసికొందురు. కాలుని కతడు ఋణగ్రస్తుడై ఇంకనుకొంతకాల ముండవలసివచ్చి నచో అతనిని అభ్యర్థిగమాత్రమే చేసికొందురు. కావున దీనినిబట్టి సత్సంగిగ నైపోయినవారు చరణములయందు వచ్చిచేరిరనియు, వారు ఉద్ధారమునకర్హు లనినిశ్చయించబడియే చరణములందు తీసికొనబడిరనియు స్పష్టముగ తేటపడు చున్నది. ఇరువురు ఏకోదరసోదరులుండగ, సందులోనొకడు చురుకైనవాడు గను కుశాగ్రబుద్ధియునై యుండికూడ, సత్సంగి కాకపోవుటయు, రెండవవాడు చాలఅమాయకుడై యుండి సత్సంగియగుటయుగూడ చాలసార్లు తటస్థించుచుం డును. దీనియర్థమేమనగా సత్సంగియైనవానికి కర్మలు తక్కువగనుండుటచే నతడు ఉద్ధారమునకు అర్హుడయ్యెననియే. ఈపైనుదహరించినపవిత్రగ్రంథవచ నముప్రకారము అతడు తిరిగి జననమరణచక్రములోనికి పోజాలడు. అతనికి మరణానంతరము అధమాధమము బ్రహ్మాండములో నివాసము తప్పకలభించును. అతనికర్మలన్నియు నీజన్మలో పూర్తిగనశింపుకానిచో నతడు బ్రహ్మాండము నెట్లు పొందగలడు ? కావున తప్పకుండా అతనికర్మలన్నియు పూర్తిగా నశింప జేయబడును.

కొందఱు మనకెన్నటికి నిఁక జననమరణచక్రములోనికి పోవుటయుండదు కావున మనఇష్టమువచ్చినట్లు పాపములుచేయవచ్చునని యభిప్రాయపడుచుం దురు. దీనికి సమాధానముగ, "నిశ్శంకగా పాపములుచేయుడు, కాని దానివలన గలుగు దుఃఖములననుభవించుటకుకూడ సిద్ధముకండు." అని చెప్పవలయును. ఏలననగ, "కర్మ జో జో కరేగా తూ వహీ ఫిర్ భోగనా భరనా", అనగా

నీవు ఏయేకర్మలుచేయుదువో వానిఅన్నిటిఫలితము:ను పూర్తిగ ననుభవించ వలసియుండును. నాయనా, ఇంతకుముందే పడియున్నకర్మ లేమైన తక్కువ యయ్యెననియా నీవింకను బుద్ధిపూర్వకముగ కర్మలుచేసి, కర్మభారము పెంచు కొనుచున్నావు? అట్లైనచో చాల బాధపడవలసియుండును. దయాధార మహా వేగముగ ప్రవహించిపోవుచున్నది. నీవుదాని కెదురుగపోయినచో, నది నిన్ను బలాత్కారముగ లాగినపుడు నీవు దెబ్బతినెదవు. మహాకఠినయాతనల ననుభ వించవలసివచ్చును. కావున భగవంతుడు మనకు అభ్యాసమును చేసికొనుడని విధించినధర్మమును తప్పకుండా పాలించవలయును. తతిమ్మాపనిఅంతయు వారే స్వయముగ సాగించుదురు. నీమనస్సు చాంచల్యముతో నిండియున్నది. ఆచాంచ ల్యమే, నీవుచాలపాపకర్మలుచేయుటకు కారణము. అభ్యాససమయములో నీకు నీమనస్సుతో నెప్పుడు యుద్ధము జరుగుచుండుటమూలమున ఆమనశ్చాంచల్య మునయొక్కయు, నీపాపకర్మలయొక్కయు దుష్టప్రభావము చాలతగ్గిపోవును. అదియే అభ్యాసముచేయుటవలన లాభము. అట్లు తగ్గిపోనియెడల ఊర్ధ్వారోహ ణముచేయుట సాగదు. ఆత్మయొక్క ఊర్ధ్వారోహణకార్యమైతే ఆపరమపురు షుడే కటాక్షించి స్వయముగ చేయించుదురు. ఈరోజన శబ్దపాఠముచేసినపుడు చదివిన

"యహా కరనీ మైం ఆప కరాఊం,
ఔర్ పహుం చాఊం ధుర దరబారా",

అనుచరణములో సెలవిచ్చినట్లుగ నీఆత్మారోహణము ఆపరమపురుషుని ప్రత్యేకవరదానము.

పై చరణమునకర్థము :–నీచేత నీయభ్యాసమును నేనేస్వయముగ చేయిం చెదను. అట్లుచేయించి ఆమూలధామమునకు జేర్చెదను.

పిమ్మట సంభాషణ అలహాబాదుపార్టీవారినిగురించి జరిగెను. 1907 సం॥ నవంబరు నెలలో, ఇంద్రసింగ్, మఱియిద్దరుముగ్గురు మనుష్యులతో కలిసి ఇచ్చటకువచ్చి, తిరిగి అలహాబాదు వెళ్ళినపుడు బాబూజీగారివద్దనుండి మాకొక ఉత్తరము వచ్చెను. అందులో మనకు కొన్నిహితోపదేశములను చేసిరి. దానికి మేము 40 పేజీలఉత్తరము సమాధానముగవ్రాసి పంపితిమి నిజముగ నీవిడిపో వుట దివ్యేచ్ఛచేతనే జరిగెను, పైగా అది చాలమంచిపనియే అయినది. లేనిచో వారు ఉత్తరములు మనకు పంపుచుండుటయు మనము వానికి సమాధానములు

వ్రాయవలసివచ్చుటయు జరుగుచుండెడిది. ఇపుడా అల్లరులేమియు లేవు. మత ప్రచార మెక్కుడజరిగినను మంచిదే. పైగా ఇరువురుసోదరులుండినపుడు, వారు కలిసియేయుండినచో, వారిమధ్యన పరస్పరముప్రేమ అంతగనుండదు. వారు వేఱైపోయినపుడు పరస్పరముప్రేమ చాలవృద్ధియగును. అట్లే ఇపుడుకూడ కొంతకాలమైనపిమ్మట మనలోమనకు ఇదివఱలోకన్న నెక్కువప్రేమ గొప్పఆదర భావముతోకలిసి యేర్పడగలదు. లేనిచో మనమనోభావములు ఇప్పుడుకూడ ఇదివఱలోనున్నట్లే యున్నవి. మేమువ్రాసినదికూడ నావిధముగ నేవ్రాసితిమి. కాని నాయకులు భేదభావములభివృద్ధియయ్యెడివిధముగ ప్రవర్తించకూడదు. వారిలోకొందఱు మమ్మునుగుఱించి సమ్మోటకుగూడ వీలులేనట్టిమాటల నను చున్నారని ఒకపెద్దమనిషి మాకుచెప్పెను. ఆపెద్దమనిషిపేరు చెప్పుట మా కిష్టములేదు.

## 29

### రాధాస్వామీమతముయొక్క ఉత్కృష్టత.

ఈరోజున ఒకబెంగాలీప్రొఫెసర్ ఎం. ఎ., క్రొత్తగావచ్చిరి. ఆయనతో మఱొకపెన్షనర్‌గూడ (Pensioner) వచ్చెను. హుజూరువా రిట్లు సెలవిచ్చిరి: ఈకాలములో చాలమంది తాముపుట్టినకులముయొక్కమతముప్రకారమే పర మాత్మను ధ్యానముచేయుచున్నారు. కాని వారు అట్లుచేయుటచే భగవంతుని కలుసుకొనగలమా లేదా యని ఆలోచించుకొనవలసియున్నది. ఆపరిశీలన కొఱకై వారు మూడువిషయములు చూచుకొనవలయును. మొదటిది ప్రాపం చికమైనకృత్యములు విషయములలో తమమనస్సు ఎంతశ్రద్ధవహించుచున్నదో పారమార్థికవిషయములలోగూడ నామాత్రముశ్రద్ధ తీసుకొనుచున్నదా లేదా? రెండవది తమకాయభ్యాసముచేసినందువలన ప్రాపంచికసుఖదుఃఖములవిషయ ములో కొంతవిరక్తి గల్గెనాలేదా? మూడవది భగవంతుడనగనెవరు, ఆయన యెచ్చటఉన్నారు, ఆయననెట్లుపొందుట అనెడిరహస్యము లామతములో తేలుప బడుచున్నవా లేదా అనెడివిషయములు. ఈమూడునులేనిచో వారుచేసెడి కార్యక్రమమంతయు వ్యర్థమే. ఈవిషయములను తెలిసికొనవలయునను కోరిక గలవాడే నిజమైనజిజ్ఞాసువు. సంతుమతములో నీవిషయములన్నియు లభించును.

ఇప్పుడు కొంచెము ఈమతమునుగుఱించి చెప్పెదను. దీనిని సురత్ శబ్ద యోగమనికూడ చెప్పుదురు. సురత్ అనుపదమునకు అసలురూపము "స్వరత"

అనగా తనలో తాను తన్మయమైయుండున దనియర్థము. ఈ "సురత్" నిర్మల చైతన్యరూపమై సకలవిధములసంపూర్ణమైనదై సకలవిషయములపైన నధికారము చెలాయించుచున్నది. ఇది ఆపరమపురుషునియొక్క కిరణము లేక బిందు వువంటిది. కిరణము సూర్యునితో నిరంతరధారారూపముగ సంబంధముగల్గి యుండి సూర్యుడు అస్తమించినపుడు కిరణముగూడ నెట్లు ఆధారతో వెనుకకు లాగివేయబడునో, ఆత్మకూడ నట్లే ఏధారమీదుగ నది వచ్చెనో, ఆధారతోనే వెనుకకు వెడలిపోవును. ఆత్మలో శబ్దము గలదు. ఆశబ్దము మనలో ననుక్షణము మ్రోగుచునేయున్నది. అది ధ్వన్యాత్మకనామము అనగా, పరమపురుషుని సహజనామము. ఆశబ్దమువలననే యీసృష్టిఅంతయు నుత్పన్నమయ్యెను. కావున ఈధ్వన్యాత్మకనామమునే స్మరణచేయవలెను. నామముతోపాటు స్వరూపము గూడ తప్పనిసరిగ నుండును. ఏలననగా, మన మేమనిషిపేరునైన తలంచినపుడు అతనిస్వరూపముగూడ తప్పక మనమనస్సునకు వచ్చునుకదా. మానవుని ముఖము అతనిఅంతర్వ్యస్థితిని సూచించుచుండును. అనగా ఎవరైననొకహాస్యగాడు వచ్చి యెదుటనిలబడినచో, అత డేమియుమాటలాడకుండినను అతని ముఖమును చూచినందువలన స్వతహాగా నవ్వువచ్చుచుండును ఒకదుఃఖాక్రాంతుడైనమనిషి వచ్చి యెదుటనిల్చినచో అతనినిచూడగనే దానంతట నది దుఃఖమువచ్చును. ఆత్మ మహాజాజ్వల్యమానప్రకాశముతోకూడినదై భగవత్స్వరూపమునకు ఒకచిన్న నమూనాగా యున్నది. ఏమహాపురుషుడు ఆభగవంతునితో నెల్లప్పుడు నైక్యమైయుండి, ఆయనఅవయవములన్నిటినుండియు ఆత్మధారలు ప్రవహించుచుండునో, అట్టిసంత్ సద్గురువు భగవంతునిస్వరూపమే. వారి స్వరూపము ధ్యానముచేయుట పరమపురుషుని స్వరూపధ్యానమే యగును. కావున నామస్మరణము, సద్గురుధ్యానము, శబ్దమునందు ఆత్మనుజేర్చి ఊర్ధ్వారోహణముచేయుటయు నీమూడును జరిగించుచుండినయెడల బ్రతికియుండగనే భగవద్దర్శనము చేసికొన్నట్లగును.

సద్గురువు మనలను మహాదయతో తమచరణములందు లగ్నముచేసికొన్నపుడు అనగా వారి చేతనధారకు మనచేతనధారనుకలిపి ముడివేసినపుడు మన కుద్ధారమగుటలో నాలస్యమేలగలుగును? నరశరీరమునుపొందియుగూడ భగవంతుని కలసికొనుటకై ఈవిధమైనప్రయత్నము నెవ్వరుచెయ్యరో వారికి జననమరణచక్రములో పడిపోవుట తప్పదు. అట్టివాడు తనజీవునికి ఘాత చేసికొనుచున్నాడు.

ఇదంతయు నొక యుపోద్ఘాతరూపముగ నీమతవిషయమై చర్చించితి నని సెలవిచ్చిరి. దీని మిగతవిషయములనుగుఱించి సంపూర్ణ వివరణచేయుటకై తే మెన్ని యోమాసములు పట్టును. ఆపైన్ననరు, "శాస్త్రములలోగూడ శబ్దమును గుఱించి చెప్పబడినదా" అని అడుగగా వారు శాస్త్రములలో ముఖ్యముగ ప్రాణాయామమునుగుఱించి చెప్పిరిగాని మఱేఅభ్యాసవిధానమునుగుఱించియు వర్ణించలేదని సెలవిచ్చిరి. ప్రాణాయామము మాయతోసంబంధించినదగుటచే, సంతులు దానిని మొదటనే త్రోసిపుచ్చిరి. శాస్త్రములలో పిండదేశముయొక్క ఆఱవచక్రమువఱకుమాత్రమే వర్ణించిరి. ఆచక్రమునుపొందినవారికిగూడ గొప్ప శక్తులు చేకూరును. పతంజలికూడా శబ్దాభ్యాసమునుగుఱించి వివరించెనుకాని అదంతయు మాయతో సంబంధించియున్నది. ఆచైతన్యభండారమునుగుఱించి కాని దానికిసంబంధించిన అభ్యాసమునుగుఱించికాని అందులో నేమియు వర్ణన లేదు. పూర్వముగూడ సంతులుండెడివారుకాని వారు ఈవిషయము కొద్దిగా మాత్రమే చెప్పిరి, అదికూడ చాలగుప్తరూపమున చెప్పిరి. అంతియకాని, దీని అసలువిషయము గురుముఖతఃగనే నేర్చుకొనవలసియుండెను. ఇప్పుడు రాధా స్వామీదయాళురు జీవులయెడల మహానుగ్రహముచేసి రహస్యమునంతను అందఱకు బయలుపఱచిరి. కావున మానవుడు లౌకికవ్యాపారవిషయములలో తన లాభనష్టములను చూచుకొన్నట్లె పరమార్థవిషయములోగూడ తానేమిప్రయత్నముచేయుచున్నాడో అందువలన తనకేమైన నభివృద్ధిగలుగుచున్నదోలేదో ఇకముందు తానేమిచేయవలసియున్నది అనెడివిషయముల నాలోచించుకొనుచుండవలెను.

## 30

### సృష్టినిగుఱించి.

20 జనవరి 1911 :- ఈరోజున సృష్టినిగుఱించి కొద్దిగా సెలవిచ్చిరి. పరమశక్తి అనగా పరమపురుషుడు సృష్టి కాకపూర్వము నామము, రూపము లేకుండ నుండెను. దివ్యేచ్ఛగలిగినపుడు అనగా, సృష్టికిప్రేరణ గలిగినపుడు ఆయననుండి ఒకధార బయలుదేరెను, శబ్దము ప్రకటమయ్యెను. ఒకశక్తి ప్రకటమైనపుడు దానికి రెండులక్షణములు తప్పకుండనుండును. ఒకటి విక్షేపము (Repulsion) రెండవది ఆకర్షణ (attraction) అనగా, దానితో సజాతీయ

రూపములోనికిమాత్రిపొజాలనిపదార్థమును అది విక్షేపముచేయుచు, అనగా దూరముగాత్రోసివేయుచు, అట్లుగానిపదార్థమును తనవైపునకు లాగుకొనుచు తనతోసజాతీయముగామార్చివేయుచుండును. అయస్కాంతశక్తి దీనికుదాహరణగ చెప్పవచ్చును.

భగవంతుడు ప్రేమస్వరూపుడు. ప్రేమతో ప్రేమీ, ప్రియతమభావములు రెండును ఉండుట ఆవశ్యకము. ఆరెండును లేకుండగనే ప్రేమనుభావించుట పూర్తిగఅసంభవము. ప్రియతముడు సర్వలక్షణసంపన్నుడై లోపములేమియు లేకుండ నుండవలయును. ప్రేమీభావమనగా లోపములు గలిగియుండుటయు, అనుక్షణము సహాయమునకై తనప్రియతమునియం దాధారపడియుండుటయును. కావున ఈవిధముగ రెండుఅంగములును భగవంతునికి ఉండెను. ఒకటి విశేషచేతనతాసంపన్నుడైనప్రియతముడును, రెండు న్యూనచైతన్యముగలప్రేమియును. అపుడు ప్రియతమునినుండి ఒకపెద్దచైతన్యధార క్రిందకువచ్చి ప్రేమిని కలుసుకొనెను. ఆవిధముగ ప్రేమీప్రియతములకు సమ్మేళనగలిగి, ప్రేమీకూడ ప్రియతమరూపుడైపోయెను. ఇచ్చటకూడ తిరిగి రెండంగములేర్పడెను. ఒకటి "యోగాంగము" అనగా ప్రియతమునితోకలిసి ప్రేమస్వరూపమైపోయిన భాగము. రెండవది "వియోగాంగము" అనగా ప్రియతమునితోకలసిపోవుటకు యోగ్యముగ లేనందున వేఱుచేయబడి క్రిందికిత్రోసి వేయబడినభాగము. ఈ "యోగాంగము"నకును "వియోగాంగము"నకును మధ్యనున్నచైతన్యధార "పీడ్కోలు, పీడ్కోలు"అని అదేపనిగ నెల్లపుడు మొఱ్ఱపెట్టుచుండెను. ఈ యోగాంగముగ నేర్పడినపై భాగము నిర్మలచైతన్యదేశముతోకలిసి యుండిపోయెను. ఈయోగాంగవియోగాంగములమధ్య నున్నచైతన్యధార ఆరెండంగముల నొకవిధముగ కలుపుచున్నట్టిసాధనముగ (connecting link) నేర్పడెను. అందుచే దానికి ప్రేమఅని పేరువచ్చెను. దానితోనే బ్రహ్మాండము తయారయ్యెను. వియోగాంగముగ నేర్పడినదానిలో చైతన్యము బహుక్షీణముగనుండెను. ఇదియే నిజముగ మాయఅనునది. దీనినుండియే ఈపిండదేశము తయారయ్యెను

## 31

కష్టములు, అశాంతి, దీనత్వమును, పరమార్థము సంపాదించుకొనుటకు చాల అవసరము.

21 జనవరి 1911 :–మనస్సునకు ఎంతయెక్కువఅశాంతి గలుగునో అంత యెక్కువపారమార్థికలాభము చేకూరును. ఏలననగా, ఒకప్రక్క నుంచిపరమా

ర్థమునందు మనస్సులగ్నముగాక అభ్యాసమేమియు సాగకుండనుండిపోయి, రెండ వ ప్రక్కన స్వార్థముగూడ చెడిపోవుచున్నయెడల మానవు డెంతయువ్యాకుల చిత్తుడైపోయి తిరిగి బాగుపడుటకు ప్రయత్నములెన్నియో చేయును. సకల ప్రయత్నములు విఫలమైపోవుచున్న ట్లతనికి తోచినపుడు ఒకవిధమైన విసుగు దల, అశక్తతాభావమును కలుగును. ఈపరిస్థితివచ్చినపు డతడు స్వతహాగా దీనుడైపోవును. దీనుడెప్పుడయ్యెనో అపుడు అతనిమీద పరమపురుషుడు తప్పక దయచూపును. కావున నెవనిమన స్సెల్లపుడు నుదాసభావముతో నుండునో అతనిలోలోపల నెల్లపుడు దయాధార వర్షించుచుండును. అందువలన నతనికి శరీరమనస్సులవిషయమై పూర్తినిర్లక్ష్యము కలుగును, అనగా అతడు ఆరెండి టిని ఒకవిధముగ భగవంతుని కర్పణచేయును.

## 32

మనుష్యుడనగ నెవరు-
భగవంతుని కలిసికొనుట యెట్లు-

22 జనవరి 1911:—ఈరోజున ఒకసత్సంగియొక్కసహోదరుడు సత్సంగ మునకువచ్చెను. ఆయనప్లీడరువృత్తి చేయుచుండిరి. ఆయనసత్సంగమునకువచ్చు టకు ఇదియ మొదటిసారి. ఆయనకొఱకై ఈక్రిందివచనము సెలవిచ్చిరి. మను ష్యుడనగ నేమి యనువిషయమును మొదట పరిశీలించవలెను. ఒకటి అతనిశరీ రము. ఈశరీరము ఈపిండదేశముయొక్క సూక్ష్మపదార్థముతో తయారైన ఒకవిధమగుయంత్రము. ఇతడు చనిపోయినప్పుడు ఈశరీరముయొక్కభాగము లన్నియు తమతమసజాతీయపదార్థములలో కలిసిపోవుచున్నవి. దీనినిబట్టి మూడు విషయములు తేలుచున్నవి; ఒకటి ఇది మనదికాదనియు, రెండు ఇది పిండదేశ ముయొక్కభండారమునుండి వచ్చుచున్నదనియు, మూడు ఇది నాశమానమైన దనియు. ఇదిగాక మనకు ఆలోచనలు, విచారణలుచేయునట్టి అనగా మనకు సంకల్పవికల్పములుపుట్టించునట్టి మఱొకయంత్రముకూడ కలదు. అదేదియనగా మనస్సు. దానికిగూడ పైనచెప్పిన మూడువిషయములును వర్తించును. దీనిని బట్టి యేదైననొకఅంశయున్నపుడు దానికి ఒకభండార ముండితీరవలయునని తేలుచున్నది. రెండవది అంశకుగల ప్రత్యేకలక్షణములు దానిభండారమునకు గూడ ఉండితీరవలయునని తేలుచున్నది. ఈశరీరమనస్సులుగాక మఱొకపదా

ర్థముగూడ వేఱుగనున్నది. నిజముగ నదియే సమస్తకార్యములకును ప్రేరకము. దానిని సురత్ లేక ఆత్మఅని యందురు. అది చైతన్యస్వరూపము. అది ఈశరీరమనస్సులకంటె భిన్నమైయున్నది. దీనికిగూడ నదేవిధముగ నొకభండారము తప్పకనున్నది, కాని ఈఅంశ నాశరహితమైనదికావున దానిభండారము కూడ నట్లే అవినాశియైయున్నది. ఆభండారమే పరమపురుషుఁడు.

ఇప్పుడు వీనిలక్షణములను చూచుడు. ఎట్లనగా మనలో నొకఇల్లు కట్టవలెనని కోరిక (తరంగము) పుట్టె ననుకొనుడు. ఇది ఒకవిధమైన ప్రేరణ లేక రాజాజ్ఞవంటిది. పిమ్మట మనస్సుయొక్కఘట్టములో ఆఇంటికి ప్లాను (plan) తయారైపోవును. అనగా మనస్సుయొక్క ఘట్టములో ఆయిల్లు తయారైపోవును. ఆపిమ్మట బాహ్యమున గృహము స్థూలపదార్థములతో తయారగును. అనగా, మనము చేసెడిపనులన్నిటికిని (మనకు తెలిసినను తెలియకపోయినను) ఈ పద్ధతిగనే కార్యక్రిమము జరుగుచుండును. ఒకతృణము నెత్తవలెనన్నగూడ నిదియేపద్ధతిగా జరుగును. ఒకచక్రివర్తి యేదైనపనిచేయుడని యొకసారి ఆజ్ఞనిచ్చినచో వైస్‌రాయ్ వగైరా క్రిందిఅధికారులు ఆపనిని ఎట్లుపూర్తి చేయుదురో, ఈమనస్సుకూడ నట్లే సమస్తపదార్థములను తయారుచేయును. ఇదియే ఈపిండదేశమున కొకవిధముగ సృష్టికర్తయై యున్నది. కాని పైనుండి ఉత్తరువులిచ్చుశక్తి యిది కాదు, దీనికంటె వేఱుగ నున్నది.

ఇఁకనిపుడు వీనిశక్తిసామర్థ్యములను గమనించుడు. ఈపిండదేశములో మన మేమిచూచుచున్నాము? చూడు డీపృథివి ఎంతపెద్దదో! దీనినుండి సూర్యు డెంతదూరముగ నున్నాడో చూడుడు. లెక్కకుమించినన్ని నక్షత్రగణములును, చంద్రులును ఉన్నారు, ఎన్నియోనక్షత్రముల కాంతిగూడ నింతవఱకు భూమిమీదకు ప్రసరించనేలేదట. ఇవన్నియు నీపిండదేశముయొక్కఆవరణాలోనే యున్నవి. అందుచే నీపిండదేశము ఎంతమహావిస్తీర్ణమైయున్నదో ఆలోచించుడు. సరే ఇఁక నీపిండదేశమునకుసృష్టికర్తయైనబ్రహ్మాండముయొక్క అఖండవైశాల్యమునూహించుటకైన నెవరికిశక్యము? అయితే ఇట్టిబ్రహ్మాండము లింకనెన్నియో గలవు. ఇఁక నీరెండుదేశములకునుగూడ సృష్టికర్తయు, పరమపితయు, అవినాశియునగు ఆనిర్మలచైతన్యముయొక్క మహాశోభకు హద్దుమేర లెక్కడుండును?

జీవులమందఱము ఆచైతన్యమున కొక్కొక్కకిరణమువంటి వారము. ఆపరమసింధువు లేక పరమసూర్యుడు మనకు తల్లియు తండ్రియును. కావున మొదటలో "మనుష్యుడనగనేమి ?" యని మనము వేసుకొన్నప్రశ్నకు సమాధానము ఇప్పుడు మనకులభించినది.

ఇప్పుడు ఆపరమపితతో కలియుటెట్లనువిషయము నాలోచించుకొనవలయును. ఎచ్చటనైననొకస్థలమున పడినట్టి సూర్యకిరణమునకును, సూర్యునకును భేదమేమియునుండదు, అనగా వానితత్త్వములలో నేమియు భేద ముండనేరదు. అనగా. ఆకిరణముకూడ సూర్యునిరూపములోనే యుండి, దానిలోగూడ ఉష్ణము ఉండి, ఆకిరణములో సూర్యునిలోవలెనే అనేకవర్ణములుగూడ నున్నవి. అయిన నొక్కభేదముమాత్రము గలదు. ఈకిరణము ఆకాశమండలములోని అనేక కోశములను చీల్చుకొనివచ్చినది. ఏలననగా, మనము చూచుచున్నఆకాశము మనకగుపడుచున్నంత నిర్మలముగను శూన్యముగను లేదు. అభ్యాసికి అదంతయు కేవలము నిప్పేఅయినట్లు బోధపడును. ఇప్పుడువైజ్ఞానికులుగూడ కొంత పరిశీలనచేసి, భూమి దానిలోపలనున్నఅగ్ని కొకఆచ్ఛాదనరూపముగ నున్న దనియు, ఇది పరిభ్రమణముచేయుటలో మఱొకనక్షత్రమునకుతగిలి ఈరెండును ఢీకొన్నపుడు, దీనిపైపెచ్చు కొద్దిగ పెట్లిపోవుటచే ఉల్కములు బయల్వెడలు ననియు కనుగొనిరి. ఇట్లే మనఆత్మయొక్కయు, పరమపురుషునియొక్కయు నిజ తత్త్వములలో నేమియు వ్యత్యాసములేదు. ఉన్నవ్యత్యాసమంతయు సురత్ అనునది భగవంతునివద్దనుండి చాలదూరముగ పడిపోవుటయే. దీనిపైన నెన్నియోకోశము లేర్పడియున్నవి. కాని, ఇదిమాత్రము వేఱుగనేయున్నది. సూర్యునికాంతి బట్టబయలుగనున్న మైదానములో మహాదేదీప్యమానముగ నుండి, సూర్యునివద్దనుండి ఒకతేజోధారరూపముగ వచ్చుచున్నట్లు కనిపించును. సూర్యుని మనము సులువుగనే చూడగలుగుచున్నాము. మఱియు మనకు సూక్ష్మమైపోగలశక్తి యున్నచో, ఆతేజోధారతోకలిసి మనము తిన్నగ సూర్యునివద్దకు వెళ్ళిపోవచ్చును. అట్లే ఆపరమపురుషుడుగూడ మహాదయతో ధారారూపముగ నప్పుడప్పుడు స్వయముగ నిచ్చటకుదిగివచ్చి నరశరీరములో ప్రకటమగుచు, మనఆత్మలను వానిపైన నేర్పడినకోశములనుండి విడుదలచేయుచుండును. వారే పరమగురువు. కొందఱికి భగవంతుడు తనధామమునువిడిచి యిచ్చటకువచ్చి అవతరించుననుమాట, పసిపిల్లలఆలోచనవలె కనిపించును.

కాని అట్లుఅనుకొనుట సరికాదు. నిజముగ వారు ధారారూపములో నిచ్చటికి దిగి వచ్చుచుందురు. ప్రస్తుతకాలములో గురువులుగ తయారై కాషాయవస్త్ర ధారులై, ముద్రలుధరించియున్నట్టివారు వాస్తవముగ సజ్జానులు. గురువనగా అంధకారములోప్రకాశమునుకలుగజేయువారని యర్థము. అందుచే ఆపరమ పురుషుడే పరమగురువని చెప్పబడును. మహాదృష్టముగలిగినపుడే వారు మనకు లభింతురు. వారు సాక్షాద్భగవత్స్వరూపులు. ఈసృష్టిఅంతటిలోను, భగవద్దర్శ నము వారిస్వరూపములోదప్ప మరెచ్చటను లభ్యముగాదు. వారు జీవులకు భగవంతునిదర్శనము లభింపచేయునట్టి దర్పణము లేక గవాక్షమువంటివారు. ప్రస్తుతకాలములో జనులు గాలిని, ఆకాశమును దేవునిగభావించి పూజించు చున్నారు. అట్టివారందఱును అజ్ఞానులు. సురత్ శబ్దయోగాభ్యాసము. సద్గురు సత్సంగము, సద్గురు సహాయమును లేనిదే యెంతమాత్రమును పనిసాగదు.

## 33

భగవంతు డవతారమెత్తినపుడు పాటించబడు నియమములు – సద్గురువు యొక్క మహిమ–

23 జనవరి 1911 :—ఈనాడు ఆప్లీడరుగారు నిన్నటి వచనములోనుండి ఒకటిరెండు విషయములు తిరిగిచెప్పుడని కోరిరి. అందొకవిషయ మేమనగా, భగవంతుడు నరశరీరములోని కెట్లువచ్చును, వారవతారమెత్తినపుడు, ఆశక్తి మొదటినుండి చివరవరకు వారిలోనుండునా అనుప్రశ్నలు. హుజూరువా రిట్లు సెలవిచ్చిరి :–

నిన్న చెప్పినట్లు, నరశరీరము అన్నిటికంటె శ్రేష్ఠమైనదిగనుక భగవంతుడు ఒకధారారూపమునవచ్చి నరశరీరములో అవతరించును. ఇతరమతములవారం దఱునుగూడ ఇట్లే వ్రాసిరి. ఉదాహరణార్థము మానవస్వరూపము పరమా త్మనిస్వరూపమునకు అనుకరణమని వ్రాయబడినది. భగవంతుడు జన్మమెత్తు టకై గర్భములోపడినప్పటినుండియు వారు సర్వసమర్థులైయుందురు. కాని వారు తామేర్పాటుచేసిన ప్రకృతినియమముల నెన్నడు నతిక్రమించరు. వారు అందఱికన్న నెక్కువగ నానియమములను పాటింతురు. అందుచే వారుకూడ, లోకములో జీవులందఱు పుట్టినవిధముననే జన్మనెత్తుదురు. అదేవిధముగ వారికిని బాల్యసమయము, యౌవ్వనసమయముగూడ నుండును. వారు జీవులకు ఆంతర్య

రహస్యములన్నిటిని విశదముగ చెప్పి ఉపదేశించి వారిచేత నభ్యాసముచేయించి వారిని తమతోగూడ ఆమార్గమున పైకి తీసికొనిపోవుదురు వారిసంరక్షణను గుఱించియు, వారిమహిమనుగుఱించియు, చిహ్నాలు ఆఖరుసమయములో నెక్కువగ ప్రకటమగును. అదే ఒకప్రత్యక్షనిదర్శనము. కొందఱుసామాన్యసత్సంగులు ఆఖరుసమయములో నెట్టిసంరక్షణపొందిరో, ఎట్లు పూర్తిస్మృతిగలిగి యుండి బహుసంతోషముగాపోవుచున్నట్లు కనపించిరో మనము వినియేయున్నాము. ఇక మిగిలిన పెద్దపెద్దపండితులు, జ్ఞానులైనవారుకూడ మరణమునకు పదునైదురోజులు ముందునుండియే స్మృతి తప్పిపోయి అగమ్యగోచరమైన పరిస్థితిలో పడియుండినట్లుకూడ మనమువినుచున్నాము. సద్గురువు ఒకమహాకార్యమును నెఱవేర్చునిమిత్తము ఇచ్చటికివత్తురు. అన్నిటినివిడిచి యొంటరిగపోవలసిన మహాభయంకరపరిస్థితి మరణసమయములో గలిగినపుడు వారొక్కరే తోడుగనుందురు. ఆసమయమున పోవునపుడు మార్గములో సహాయ మెవరు చేయగలరో కొంచెము మాలోచించుకొనవలయును. మహామహాయోధులు, ఋషులు, మునులుగూడ ఆమార్గమున ప్రయాణముచేయుటకు వణికిపోవుచుందురు.

ఇదంతయు చెప్పినపిమ్మట నాప్లీడరుగారు గురువు ఈశ్వరునికంటెగూడ గొప్పవారా యని ప్రశ్నించిరి. అంతట నందఱును పకాలున నవ్విరి. సర్కార్ సాహబ్ వారు "ఉత్తగొప్ప యేమిటి? చాలగొప్పవారు" అని సెలవిచ్చిరి. ఈశ్వరుడైతే జీవునిసకలక్లేశములకును మూలము. ఈప్రపంచమంతయు ఆయన చేసినదే. ఒక మహాభూతమువంటి వాడు. సమస్తపాపములను, దుష్కృత్యములను చేయించువాడాయనయే. ఒక్కపరమగురువుతప్ప మఱెవరినికూడ భగవంతునిగ చెప్పుట నాస్తికభావమే అగును. సరే అందఱును సద్గురువునకే మహామహిమయున్నట్లు చెప్పియున్నారు. భగవద్గీతలోగూడ నట్లేవ్రాసియున్నది. మాలానారాయణ్‌గారుకూడా స్పష్టముగవ్రాసిరి. మహాభాగ్యము ఉండిననే అట్టిగురువు లభించుదురు. స్వామీజీమహరాజువారు ఐదేండ్లప్రాయములో నున్నపుడే వారింటికి తఱచుగవచ్చుచుండెడి సంతుమహాత్ములైనతులసీ సాహబ్ వారు స్వామీజీమహరాజువారిని చూచి వారితల్లిగారితో "అమ్మా మేమిక మీఇంటికి రానవసరము లేదు. మీయింట పరమసంతు వచ్చియున్నారు" అని సెలవిచ్చిరి. ఆతరువాత వారు వెళ్ళిపోయి కొద్దిదినములపిమ్మట

శరీరమును చాలించిరి. కావున తెలిసికొనగలశక్తియున్నవారు అసలువిషయ మును వెంటనే తెలిసికొనగలరు. మీకును మాకునైతే మొట్టమొదట సిద్ధాంత ములను తెలిసికొనవలసియున్నది. పిమ్మట సద్గురువువలన నుపదేశముపొంది అభ్యాసముచేయవలయును. అపుడే కొద్దిగ నిజవిషయము తెలిసికొనసాధ్య మగును. కాని అదికూడ సద్గురువు స్వయముగ అనుగ్రహించిననే సిద్ధించును.

## 34

### శబ్దముయొక్క మహత్వము.

24 జనవరి 1911 :–నిన్నను, మొన్ననుకూడ భగవంతుడు ఒక్క మానవ శరీరములోనే సద్గురురూపమున అవతరించుదు రనెడివిషయముపైన వివరించి చెప్పిరి. ఈశరీరముకన్న నుత్తమమైనశరీరము ఈప్రపంచములోనేగాక మఱే లోకములోనుగూడ మఱొకటిసృజించబడలేదు. ఏశక్తియైనను ప్రకటమైనపుడు దానికి మూడంగములు తప్పక నుండవలెను. ఒకటి, అదిఎచ్చటనుండిప్రకట మగునో ఆకేంద్రము; రెండవది, ఏధారరూపములో నది వ్యాపించునో ఆధార; మూడవది, దానిస్వరూపము. వీనిని మస్తకము, కాయము, చరణములనిగూడ చెప్పవచ్చును. ఈమూడును మానవశరీరములోగూడ కన్పట్టుచున్నవి. మన క్రిందిభాగములో అనగా పాదములు, కాళ్లుమున్నగువానిలో చైతన్యము చాల తక్కువగనుండును. అందుకుపైనున్నశరీరములో నంతకన్న నెక్కువచైతన్య మును, ఆపైనున్నమస్తకము అనగా శిరస్సునందు చైతన్యము విశేషముగను ఉండుచున్నది.

కావున భగవంతునిస్థూలరూపమైతే ఈమానవశరీరమే. అయితే, మఱి ఆయనసూక్ష్మరూప మెద్ది? శక్తిలో నొకతరంగము బయలుదేరినపుడు దానిని సూచించునది శబ్దమేకాని మఱొకటిలేదు. ఎట్లనగా శక్తి దేనితోనైన డీకొన్న పుడు శబ్దముపుట్టును. మనఅనుభవములో, శక్తి స్థూలపదార్థములపైన ప్రభా వముచూపినపుడు శబ్దము తప్పకకల్గుట చూచుచునేయున్నాము. కాని అది చాలమోటుగను నిర్బలముగను ఉండును. శక్తి తనప్రభావమును సూక్ష్మపదా ర్థముపైన కనపరచినపుడు గలిగెడిశబ్దము మనమువినుటకు సాధ్యముగాదు. ఏల ననగా, మనశ్రవణేంద్రియమునకు 18000, 20000 కంపనముల (Vibrations)

కన్న నెక్కువకంపనములుగలశబ్దమును వినగలశక్తి లేదు. ఉదాహరణకు ఈ లేంపు (lamp) నుండి ప్రసరించుచున్న కాంతిలోగూడ శబ్దమగుచున్నది. కాని అది బహుసూక్ష్మముగ నుండుటచే మనము వినలేకున్నాము. ఈసమస్త లోకములోను మహాగంభీరశబ్దము మ్రోగుచున్నది. గ్రీసుదేశస్థుడైన పైథాగరస్ (Pythogarus) అనునాయనగూడ Music of the spheres (ఆకాశగోళములసంగీతము) అని చెప్పియుండెను. కొందఱు రాత్రివేళ ఏకాంతస్థలములో కూర్చుండి ఈశబ్దమును శ్రవణముచేయునట్టిఅభ్యాసము చేయుచుందురు. వారికి కొద్దిగ నిది వినబడునుకూడ. నక్షత్రాదులలోకూడ శబ్దమగుచున్నది. సూక్ష్మపదార్థమునందు అయ్యెడిశబ్దము చాలప్రభావముగలదై ఆహ్లాదకరముగనుండును. పదార్థము అసలేమియు లేకుండగనే నిర్మలశక్తి నిర్మలచైతన్యముమీద గలుగజేయుప్రభావమువలన జనించునట్టిశబ్దముయొక్క మహాత్త్వము ఊహించుటకే సాధ్యముగాదు. ఆశబ్దము సాక్షాత్పరమపురుషుని స్వరూపము. ఈసృష్టి నంతను ఆశబ్దమే రచించినది.

ఈలోకములో స్థూలశబ్దమున కెంతశక్తియున్నదో చూడుడు. ఒక్క సెకండుసేపు (నిముషములో 60 వ వంతుకాలము) ప్రపంచమంతను నిశ్శబ్దమైన పరిస్థితిలో ఉంచినచో నెంతగడబిడ మైపోవును. ఏపనియు సాగకుండపోవును. లేళ్లువగైరా జంతువులనుగూడ నిలబడిపోవునట్లు చేయగలిగినంతశక్తి ఈశబ్దములో నున్నది. అదినిజమేయని అంగీకరించినచో, తాన్‌సేన్‌మున్నగుసంగీతగాయకులు వారిపాటలప్రభావముచే నిప్పును అంటుకొనునట్లుగను, మేఘములనువర్షించునట్లుగనుకూడ చేసిరని చెప్పుదురు. ఈప్రపంచములోని ఏర్పాట్లు, అధికారములు మొదలగునవన్నియు నీశబ్దముమూలముననే సాగుచున్నవి. ఎవరైనను ఒక్కొక్కపెటుకు మాటఅన్నపుడు ఒక్కొకడు గొంతుకకోసి వేయుటకు తయారగును. అతడే ఒక మధురశబ్దమును పలికినపుడు దాస్యముకూడ చేయుటకు తయారైపోవును. ఆభగవంతునికి నిజరూపమైనశబ్దరూపములో ఈసృష్టిలోని కార్యక్రమమంతయు జరిగించగలుగునంతటి మహాగంభీరశక్తి గలదు. మిగిలినమతములలోగూడ నెట్లు చెప్పిరో సరిపోల్చిచూతము. ఏసుక్రీస్తు ఈవిధముగ చెప్పెను "In the beginning was the word and the word was with God and the word was God." అనగా, "సృష్టికిప్రారంభమందు శబ్దమయ్యెను. ఆశబ్దము భగవంతునితో కలసియున్నది. ఆశబ్దమే భగవంతుడు." ఇదేవిధముగా పార్సీలలో

గూడ నున్నది. కొందఱు శబ్దమును ఆకాశముయొక్క లక్షణముగా చెప్పెదరు, కాని శబ్దము ఆకాశమునకు ప్రాణమే.

## 35

శ్రవణేంద్రియము దర్శనేంద్రియముకన్న తీక్ష్ణమైనది – దశమద్వారము ముక్తిస్థానము–ఉపదేశమిచ్చినపుడే సత్సంగిని చేర్చవలసిన స్థానము నిశ్చయించ బడిపోవును. ఆతెరువాతజరిగెడిదంతయు అతనిలోటుపాట్లు సవరించి మార్గము సాఫుచేయుటయే–స్మరణ, ధ్యానము, భజనాభ్యాసములలో ఏది యెప్పుడు చేయవలెను.

25 జనవరి 1911 :–పంచతత్త్వములు, పంచేంద్రియములు, పంచావయవములు, పంచదూతలు, వీనన్నిటికిని పరస్పరసంబంధము గలదు. నేత్రేంద్రియము అన్నిటికన్న ప్రధానమని పూర్వీకులువ్రాసిరి. కాని అట్లుచెప్పుట పొరపాటు. శ్రవణేంద్రియ మన్నిటికన్న శ్రేష్ఠమైనది. బాహ్యముగాచూడగా శ్రవణేంద్రియముకన్న నేత్రేంద్రియమే ఈస్థూలదేశములో నెక్కువప్రభావవంతముగ నున్నట్లు కన్పట్టును. ఏలననగా, మనమువినగలిగిన ఆవరణ ఈవాయుమండల మున్నంతమేరయే అనగా పొడుగు ఈభూగోళముచివరవఱకు రమారమి 20000 మైళ్ళు దూరమును, ఎత్తు రమారమి 40, 50 మైళ్ళుదూరమునుమాత్రమే యున్నది. కాని చూచుటవిషయములో కోట్లకొలదిమైళ్ళదూరముననున్న సూర్యుడు నక్షత్రములు వగైరాలనుగూడ చూడగలుగుచున్నాము. అనగా చూచెడుశక్తి ఎక్కువగనున్నట్లు తోచును. కాని, ఈసామాన్యావస్థకాకుండ స్వప్న, సుషుప్తి, తురీయావస్థలుకూడ గలవు. వానిలోగూడ ఈజ్ఞానేంద్రియములే పనిచేయుచుండును. వానిలో శ్రవణేంద్రియము ఎక్కువప్రభావవంతమైనది. ఏలననగా, ఆయవస్థలలో బహుదూరముగనున్న లోకములనుండి వచ్చెడి శబ్దముగూడ వినగలము. కాని ఆయాలోకాధిపతులదర్శనముమాత్రము పైకారోహించినమీదటనే లభ్యమగును.

అక్షరపురుషునికన్న క్రిందికి ధార దిగివచ్చినపిమ్మట నది మథనముకాగా ఆకాశతత్త్వమే మొదట తయారైనది. ఇది అన్నిటియొక్క శిఖరముపైన నున్నది. మనలో విశేషచైతన్యము పెరిగిపోవుచున్నపుడు మనము పైలోక

ముల కారోహించుచున్నకొలఁది మనఇంద్రియము లొక్కొక్కటే లుప్తమై పోవుచుండును. ఒకమనిషి ఒక తెర వెనుకకూర్చుండి మనతో మాట్లాడుచున్నపుడు ఆ తెర కీవల ప్రక్కనుండి మనమాతనిమాటల నెక్కువశ్రద్ధపెట్టి కొంతసేపు వినుచుండినచో మనకు ఆమాటలువినబడుటయొక్కటేగాక మనయెదుట నామాట్లాడెడువానిరూపముగూడ నేర్పడిపోవును. అనగా దర్శనశక్తివచ్చి శ్రవణశక్తిలో కలిసిపోవుచున్నది. అందువలననే అతనిస్వరూపము ఆసమయములో మనకండ్లయెదుటనున్నట్లయ్యెను. ఈఇంద్రియము లేయేస్థలములనుండి బయలుదేరినవో ఆయాస్థలములను చేరుకొనగనే అవి ఒక్కొక్కటే లుప్తమైపోవుచు, త్రికుటిస్థానములో చేరుకొనుసరికి అవన్నియు అంతరించిపోవును. అనగా ఒక్కొక్క ఇంద్రియమే తనకన్నపై ఇంద్రియముయొక్క మండలములో కలిసిపోవుచుండును. మిగిలినఇంద్రియశక్తులన్నియు లుప్తమై ఒక్క శ్రవణేంద్రియశక్తిమాత్రము లుప్తముగాకుండనుండిపోవును. మిగిలిన ఇంద్రియములశక్తులన్నియు దానిలో కలిసిపోవును. ఈఇంద్రియములయొక్కయు, తత్వములయొక్కయు కోశ మొకటి చైతన్యప్రకాశస్థానమునకుపైన ఏర్పడియున్నది. త్రికుటిలోమునిగినపుడే ఈ ఇంద్రియములన్నిటినుండియు విముక్తిగలుగును. గురుస్వరూపముయొక్క నిజదర్శనమును, నిజశబ్దముయొక్క శ్రవణమును త్రికుటిలో లభించునని అందువలననే చెప్పబడినది. ఇచ్చటివఱకు ఒక్క ఇంద్రియములనుండిమాత్రమే విడుదల గలుగుచున్నది. ఆపైన పురుషుడు ప్రకృతియును, మాయాబ్రహ్మలును మున్నగువారితో సంబంధము గలుగును. వీరినుండి విడుదల దశమద్వారమునందు ప్రవేశించినపుడు గలుగును. అచ్చట మానససరోవరమున్నదని వర్ణించబడినది. అది యొకగోళాకారమైన చైతన్యసరోవరము. సూర్యచంద్రులచుట్టు నెట్లు వారికాంతి గోళాకారముగ నావరించియున్నట్లుకనిపించునో, అట్లే సత్యపురుషుని కళయైన అక్షరపురుషునికి క్రిందుగ నీచైతన్యవలయము మానససరోవరమను, పేరుతో నున్నది. దీనిలో స్నానముచేసినపుడే జీవునికి మాయాబ్రహ్మలు ప్రకృతిపురుషులు వర్గాలనుండి విముక్తిగలుగును. ఇదియే నిజముగ ముక్తిస్థానము.

సామాన్యముగ రెండుజన్మలలో నుద్ధారమగుననియు, తప్పినయెడల మూడుజన్మలనియు, మహాదుష్టకర్మలుగలవానికి నాలుగుజన్మలనియు సంతుల గ్రంథములలో వ్రాసియున్నది. కాని యథార్థమేమనగా, ఆప్రభు వెవరినైన

తమచరణములమీాదికి తీసికొని ఉపదేశమిచ్చిననిమిషములోనే కానుకాదు, ఆ సెకండులోనే ఆజీవుని నెచ్చటజేర్చవలసియున్నదో అచ్చటికే చేర్చివేయుదురు. ప్రతివ్యక్తిని అధమాధమము బ్రహ్మాండదేశమునందు జేర్పింతురు. అటుపిమ్మట నతనిని సరిచేసి బాగుచేయుటయు, అతనికిమార్గముబాగుచేయుటయు జరిగించు చుందురు. అతనికిశుభకర్మలచక్రము తిరిగివచ్చినపుడు ఆంతర్యానందమెక్కువగ లభించుటయేగాక, అప్పుడప్పుడు విశేషాంగములో భగవద్దర్శనముగూడ లభించు చుండును. పాపకర్మలయొక్కచక్రము మీాదికివచ్చినపుడు దుష్కర్మలనుచేయు టయు, పరమార్థసాధనలు అభ్యసించలేకపోవుటయు తటస్థించుచుండును. కాని అతనికెట్టిహానియు పారమార్థికదృష్టికోణములో కలుగనేరదు. అయినను కర్మల ఫలితము నెవరైనను తప్పక అనుభవించవలసినదే. బుద్ధిపూర్వకముగ పాప కర్మలుచేసిననేమి, అజ్ఞానవశమున చేసిననేమి? వానిఅన్నిటిఫలితమును అనుభ వించుట తప్పదు. కర్మానుభవనియమములు పూర్తిగ నిరర్గళమైనవి.

తర్వాత చిరునవ్వునవ్వుచు నిట్లుసెలవిచ్చిరి. ఈకాలములో మఱొక సిద్ధాంతము, అనగా సత్సంగులు జననమరణచక్రములోనికిగూడ వెళ్లుదురనియు, అధమాధమము ఐదువేలసత్సంగులైనను తప్పకవెళ్లుదురనియు లేవదీయబడినది. అట్లుచెప్పెడివారు యీామతసిద్ధాంతము తెలియకనైన చెప్పవచ్చును, లేదా తెలిసియు బుద్ధిపూర్వకముగకూడ చెప్పియుండవచ్చును. ఈరెండుపరిస్థితుల లోనేదప్ప మఱొకవిధముగనైతే అట్లుచెప్పుట అసంభవము. అయ్యా, మమ్ము జననమరణచక్రములోనికివెళ్లుమన్నను మేమువెళ్లునది లేదు. పూర్తిగ నిరాక రించెదము. అపుడు జ్ఞానబాబుఅనునాయన కొందఱు భజనాభ్యాస మవసరము లేదనియు, స్మరణధ్యానములే చేసినచాలుననియు నందురనిచెప్పెను. అంతట హుజూరువారు ప్రారంభికులకు స్మరణధ్యానములమీాద నెక్కువశ్రద్ధ వహిం చుట యవసరమని సెలవిచ్చిరి. ఐనను భజనాభ్యాసము బొత్తిగావదలిపెట్ట కూడదనియు, గౌణాంగములో చేయుచుండవలెననియు సెలవిచ్చిరి. స్మరణ, ధ్యానభజనలుమూడును చివరకొక్కటేకదా! ఏలననగా ఏపురుషునిస్మరణచేయు చుందుగో ధ్యానముకూడ నాపురుషునిగుఱించియే చేయబడుచున్నది. శబ్దమును శ్రవణముచేయుటయే భజనయని పేర్కొనబడును. జుగత్ ప్రకాశ్ లో స్మరణ ధ్యానములనుగుఱించి, మొట్టమొదట స్మరణమీాదనే యెక్కువశ్రద్ధ పెట్టవల సినదనియు పిమ్మట దానితోకలిపి ధ్యానము చేయవలసినదనియు స్పష్టముగ

వ్రాయబడినది. ఇవి భజనాభ్యాసమునకు మెట్లువంటివి. శబ్దాభ్యాసమునకు చాలపరిశుద్ధి కావలెను కావున మొట్టమొదటనే భజనాభ్యాసములో మనస్సు లగ్నముకానేరదు. శబ్దమువినిపించుట ప్రారంభమైనచో గంటలకొలది (ఒక్కొక్కరు రాత్రిఅంతయు) గూడ భజనాభ్యాససంబంధమైన ఆసనములో కూర్చుండి భజనచేయుచునే యుందురు.

## 36

<u>పరమార్థికి తనతప్పులను తెలిసికొని క్షమార్పణ వేడుకొనుట అత్యవసరము. పరమార్థి ఎవరియందును మమకారము పెంచుకొనకూడదు.</u>

2 ఫిబ్రవరి 1912 :—సంతులదర్బారులో తప్పులను ఒప్పుకొనుటమాత్రమే చాలదు; ఆతప్పులను తెలిసికొని క్షమార్పణగూడ వేడుకొనవలయును. ఉత్త నోటితోనేగాక హృదయపూర్వకముగ లోలోపల మొఱపెట్టుకొనవలెను. బహుగాఢమైన పశ్చాత్తాపముగలినచో పైకి నోటితో చెప్పుకొన్నను చెప్పుకొనకపోయిననుగూడ, ఆభగవంతుడు వెంటనే క్షమాపణచేయుదురు. వాస్తవములో జీవు డశక్తుడుకావున నతడు తప్పులుచేయుట అనివార్యవిషయము. అందుచే నతడు తప్పులుచేయుచునే యుండును. అయితే అతడెల్లపుడు నొక కావలివానివలె తనమనస్సును పరికించుకొనుచుండవలెను. ఏదైనపొరపాటు చేసినపుడు సత్సంగికి ఆవిషయము తప్పకుండ తెలిసిపోవును. అతడు వెంటనే హృదయపూర్వకముగ క్షమాపణ వేడుకొనవలెను. అట్లుచేసినయెడల నతనికి ఈక్రిందిచరణములో చెప్పినట్లుగా తత్క్షణమే క్షమార్పణ లభించిపోవును.

> "జో నజర్ అపనే కసూర్ పర్ కరే
> జల్ద్ పూరా హోవే రస్తా తై కరే"

అర్థము :—ఎవరైతే తమదృష్టిని తమలోపములు తమదోషములపైననే యెల్లపుడు పెట్టుకొనుచుందురో అట్టివారు త్వరలో పరిపక్వమునుపొంది తమ ప్రయాణమును పూర్తిచేసుకొందురు. ఇట్టిస్వభావము పరమార్థికి నిజముగ మహాలాభదాయకము. అంతియకాదు, నిజముగ పరమార్థమంతయు దీనిమీదనే ఆధారపడియున్నది. ఎవరైనను తప్పుచేసి ఆతప్పు తనది కాదు తనపూర్వకర్మల ప్రభావమని అన్నయెడల, నతడు ఆతప్పుచేసినందుకు పశ్చాత్తాపపడకపోయినను,

తాను చేసిన పూర్వకర్మలైనను నిస్సంశయముగ నతనితప్పులేకదా యనువిషయ మాలోచించుకొనవలెను.

ఒకసత్సంగి తనమనస్సు తనచే బలవంతముగ కర్మలుచేయించుచున్న దనియు అప్పుడతడు తనకర్మలప్రభావముచే నష్టైపోవుచున్నదని తనకుతాను నచ్చచెప్పుకొని ఊరుకొనుచున్నాడనియు నావిధముగ తానశక్తుడై పోయె ననియు దాతలైన సర్కార్‌సాహబ్‌వారితో మనవిచేసుకొనెను. అపుడు సర్కార్‌సాహబ్‌వారు అదంతయుమనస్సుయొక్క దుర్మార్గప్రవర్తనఅనియు, నావిధముగ నెన్నడు క్షమార్పణ లభ్యముకాదనియు, నిజముగ మనస్సు తన దోషమును కప్పిపుచ్చుటకై కర్మలమీాద నెపమువేయుచున్నదనియు సెలవిచ్చిరి. ఒకమనిషి బుద్ధిపూర్వకముగ ఒకత్రోవనుపోవుచు నాత్రోవలోపొరపాటున నిప్పుత్రొక్కె ననుకొనుడు. అతనికాలు కాలకుండ నుండిపోవునా? కర్మల యొక్కఫలితముగూడ నట్లే తప్పకకలుగుచుండునని తెలిసికొనవలయును. తన తప్పును తెలిసికొని దర్బారులో క్షమార్పణవేడుకొననిచో దానికిబదులుగ నతడు మహాప్రబలదుఃఖమును శిక్షను అనుభవించవలసివచ్చును. ఇచ్చట దర్బారుఅనగా సంతులయెదుటికివెళ్ళి బాహ్యముగ ప్రార్థించవలయునని మా అభిప్రాయముగాదు. భగవంతునియెదుట నాంతర్యమున క్షమార్పణవేడుకొనుచు తీవ్రముగపశ్చాత్తాపపడినచో భగవంతు డతనిని తత్క్షణమే క్షమించివేయును. ఆవిధముగా తనదృష్టి నెల్లపుడు తనదోషములు, లోపములమీాదనే పెట్టుకొను వానికి భగవంతుడుకూడ నెన్నడు మహాదుఃఖము కలుగనీయడు. పైగా అతని కేదైననొకబాధకాని శిక్షకాని రావలసియున్నను దానినికూడా రాకుండ చేయును. అట్టివానికి ప్రయాణమంతయు సుఖప్రదముగ సాగిపోవును, ఈలోక ములోకూడ నతని కెట్టికష్టమును కలుగదు.

పరమార్థి తనకేదైనజబ్బు వచ్చినను లేక బాధకలిగినను నిస్సంశయ ముగ నితరుల సహాయమును తీసికొనవచ్చును. కాని ఆవిషయములో నెక్కువ మమకారముపెట్టుకొనగూడదు. అనగా, అతడిచ్చినమందు పుచ్చుకొని తగిన వైద్యము నిస్సంశయముగచేయించుకొనవచ్చునుకాని ఆవిషయములో నతడు గాఢబంధనము కలుగజేసుకొనగూడదు. అట్టిగాఢబంధన మేర్పడుచున్నట్లు పరమార్థికి తెలిసినతోడనే స్వయముగ నతడే ఆమనిషిని విడచివేయును. ఏల ననగా, అతనికి తరువాత దానివలన గొప్పకష్టము గలుగగలదని తెలుసును.

అందుచే పరమార్థి స్వయముగనే దానిలో చిక్కుకొనిపోకుండ తప్పించుకొనును. పరమార్థిహృదయము ప్రాపంచికజీవులకన్న నెక్కువకోమలముగనుండి, అతనికి ముందుజరుగబోయెడివిషయములు ఎప్పటికప్పుడే తెలియుచుండును. అందుచే అతడు అట్టిపనులలోని కెన్నడును దిగడు. లోకములో గొప్పగొప్పవిగ నెంచ బడెడికార్యములు పరమార్థములో అందుకుపూర్తిగ విరుద్ధముగ నెంచబడు చుండును. ఎట్లనగ బీదలకు, పేదలకు ఆహారపానీయములిచ్చుటయు, తనశక్తి కొలది సహాయముచేయుటయు, లోకములో మహోపకారముగ నెంచబడును కాని పరమార్థములో నీకార్యములు విఘ్నకారకములుగ నెంచబడును. ఏల ననగా సాధారణరూపములో సహాయముచేయుట మంచిదేకాని దానిలో నెక్కువగ లిప్తమగుట విఘ్నకారకమగును.

## 37

### అభ్యాసముచేయుట యెందునిమిత్తము.

ఈస్టరు 1912 :—సాధారణముగా జనులు మనము భగవంతునిచరణశర ణ్యములోనికి వచ్చితిమిగావున మనకింక వారిదయ తప్పకగలుగును, జీవకళ్యా ణముగూడ నిస్సంశయముగనైపోగలదు, అని యనుకొనుచు అభ్యాసముచేయు టకు బద్ధకించుదురు. దీనిలో నొకపొరపాటు దిద్దుకొనవలసియున్నది. జీవకళ్యా ణమైపోవుటలో సందేహములేదు. జీవుని కార్త్యారోహణము తనఅభ్యాసము వలననే నెఱవేరజాలదని చెప్పుటలోకూడ సందియములేదు. అయిన నీవిషయ ములో జీవునికి కొన్నిబాధ్యతలుగూడనున్నవి. జీవుడు తనపై తాను దయదలచి ఆ బాధ్యతలను నిర్వహించుకొనవలసియుండును. ఏజీవునినైన భగవంతుడు తన చరణములయందు లగ్నముచేసుకొన్నప్పుడా ఆత్మను ఊర్ధ్వముగ ఆరోహింప జేయుట భగవంతునియొక్కపని అయియున్నది. ఈపనిని అనగా ఆకర్షించి ఆరో హింపజేయుట భగవంతుడు స్వయముగాచేయుచున్నాడు. మరియు మొహ మాటముగాని, జాలిగాని లేకుండా చేయును. అందునిమిత్తమై యేమైనవిరు పులుచెఱుపులు నవసరమైనను, బాధలుకష్టములు కలిగించవలసివచ్చినను బలా త్కారము, బలవంతముచేయవలసివచ్చిననుగూడ నేమియు వెనుదీయకుండ నా కార్యమును నిరభ్యంతరముగ సాగించివేయుదురు. కాని అట్లుఆకర్షించి, పైకి లాగుటలోనే, జీవునికిగలబంధనములమూలమున నతనికి బాధగలుగుచుండును. భగవంతుడు తనపరమదయాళుతాభావమువలన, నీబంధనములను శిథిలముచేయు

నిమిత్తమై యొకఅభ్యాసమునుగూడ చెప్పిరి. కావున నాయభ్యాసముచేయుట జీవునికి పరమవిధి యైయున్నది. అట్లు అభ్యాసముచేయుటచే ఆయభ్యాసి తన ఆత్మ నాయభ్యాసముద్వారా పైకిఆరోహింపజేయఁగలుగునని యభిప్రాయము కాదు. మఱి ఆయభ్యాసము చేయించుటలో నుద్దేశమేమనగా, భగవంతుడు ఆయభ్యాసిఆత్మను పైకారోహింపచేయుటకై ఆకర్షించుచున్నపుడు, అభ్యాసము చేసుకొన్నపరమార్థి అయితే, ఆకార్యములో తానుకూడ సహకరించి తనకు కష్టములేకుండనుండుటయేగాక, నందువలన ఆనందమునుగూడ పొందగలడని యును, మరణసమయమునగలుగు మహాభీకరదుఃఖములనుగురించి నిశ్చింతగ నుండి, దానికై సంతోషముగ నెదురు చూచుచుండగలడనియు మాత్రమే.

—(o)—

# పరమగురు హుజూర్ సాహబ్జీ మహరాజువారి వచనములు

## 1

స్మరణ, ధ్యానాభ్యాసములు, వ్యర్థాలోచనలు.

సోలన్ 26 జూన్ 1915 :—మీరు స్మరణచేయునపుడు మీరెండుకండ్ల మధ్యన లోవైపున ఆత్మయుండెడిస్థానమందు ఆత్మజిహ్వతో రాధాస్వామీ, రాధాస్వామీయనుచుండవలెను. ఈశారీరికజిహ్వనుగాని, హృదయముయొక్క జిహ్వనుగాని కదపకుండనుండునట్లు చాలశ్రద్ధతీసికొని కనిపెట్టుచుండవలెను. ఆత్మస్థానమందు ఆత్మజిహ్వతోనే ఉచ్చరించవలెను. నీవు హృదయస్థానమునకు జారిపోకుండునట్లుగను, ఆత్మస్థానమువద్దనే నిలచియుండునట్లుగను జాగ్రత్తపడ వలయును. ధ్యానవిషయములోగూడ నిట్లే సెలవిచ్చిరి. మీకుపుట్టెడి వ్యర్థా లోచనలన్నియుగూడ మీయొక్క ఇచ్ఛలమూలముననే కలుగుచున్నవి. ఈ ప్రపంచమునకుసంబంధించినఇచ్ఛలు, వాసనలును మీలో నెక్కువప్రబలముగ నుండుటచే మీఆలోచన లెక్కువగా నీప్రాపంచికవిషయములకే సంబంధించి

యుండును. ఆలోచనలు భజనచేసికొనుసమయములోనే గాక మిగతారాత్రిం బవళ్లుఅంతయును ఒకేప్రవాహముగ వచ్చుచు పారమార్థికాభ్యాససమయములో మఱింతఅధికమైనప్రబలధారగా వచ్చుచుండును. (ధనము, ఆరోగ్యము మున్నగువానిని మీకు అవసరమున్నంతవఱకు ఇచ్చెడి బాధ్యతను భగవంతుడు తీసికొనియుండగా మీకు ఈఅనవసరమైన వ్యర్థాలోచన లేల ?)

## 2

## దర్శనము, చరణామృతము, ప్రసాదములమహిమ.

27 జూన్ 1915 :– కొందఱుసత్సంగులు మనకుపదేశమైపోయినదికదా, మఱి ఇపుడింక గురువుగారిదగ్గఱ ఉండవలసినఅవసరమేమి ? అని అనుకొనుచుందురు. అది వారి తెలివితక్కువ. వారికి గురుముఖులప్రవర్తన యెట్లుండునో తెలియదు. వారు మామూలుజీవులప్రవర్తననునుసరించి అట్లాలోచించుచున్నారు. మాటిమాటికి సద్గురువిసాన్నిధ్యము అవసరము. లేనిచో హుజూర్ మహారాజువారు, మహారాజ్ సాహబ్ వారును అంతయెక్కువగ సద్గురుసత్సంగము నెందుకు చేసికొనుచుండెడివారు ? జీవులయందు మాటిమాటికి ప్రభావము గలిగి సంస్కారములుపడుటకై దర్శనము ఆవశ్యకము. ప్రతివ్యక్తికిని దర్శనమెల్లపుడు లభించనేరదు. కాని ప్రసాదము, చరణామృతము తమదగ్గఱ ఉండిన యెడల వానిని ప్రతిదినము సేవించుటచేగూడ దర్శనముయొక్కఫలితము లభించును. పదార్థమేదైన చెడిపోయినపుడు దానికుళ్లును పోగొట్టుటకు రెండే ఉపాయములున్నవి. ఒకటి ఆకుళ్ళినభాగమును కాల్చివేయుట లేదా రెండు, తీసిపాఱవేయుట. అట్లు బహిష్కరించుసమయములో పారమార్థికముగ చాల బలహీనత కలుగుచుండును. శరీరములో బలహీనతగలిగినపుడు బలవర్ధకౌషధ (tonic) మెట్లవసరమో అటులనే పారమార్థికదౌర్బల్యము గలిగినపుడుగూడ చరణామృతము, ప్రసాదమును ఉపయోగించవలసివచ్చును. వానినుపయోగించినందువలన పరమార్థములో చతికిలపడిపోకుండ నిలబడియుండగలశక్తి జీవునికి చేకూరును.

## 3

## సత్ప్రవర్తన.

ఒకఅమ్మాయికి ఇద్దఱువదినలు, అక్బరీఖానం, అస్గరీఖానం అనెడిపేర్లు గలవా రుండిరి. పెద్దవదినగారు అక్బరీఖానం ఇంట్లోపనిపాటలన్నియు చేయుచు

వంటవండుచు నుండెడిది. చిన్నవదినగారు గౌరవమర్యాదలు తెలియని మనిషి అయినందున, ఇంట్లో పాత్రలువగైరాలను పడవేయుట, బ్రద్దలుగొట్టుట చేయుచుండెడిది. ఈఅమ్మాయి కూడ తనఅత్తవారింటికివెళ్ళినపుడు సామానులు పడవేయుట, బ్రద్దలుకొట్టుట మొదలుపెట్టెను. అట్లేలచేయుచున్నావని యడుగగా మాచిన్నవదిన ఆస్థరీఖానం ఈలాగుననే చేయుచున్నదని సమాధానము చెప్పెను. "నీవు మీచిన్నవదిననుచూచి నేర్చుకొనకుండా మీపెద్దవదినను చూచి నడవడి నేలనేర్చుకొనగూడదు ? అస్థరీఖానం యిట్లుచేయుచుండినచో ఆమెకు దెబ్బలు చివాట్లుగూడ తగులుచుండెడివికదా" అని అత్తవారింటివారు బుద్ధిచెప్పిరట. అటులనే జీవులుకూడ గురుముఖుని ప్రవర్తనను ఆదర్శముగ చేసికొని ఆప్రకారము నడచుకొనుటకై ప్రయత్నించవలెనుగాని నిర్లక్ష్యముగ ప్రవర్తించి పడిపోవుచుండెడివారినడవడిని అవలంబించకూడదు.

## 4

### స్మరణాభ్యాసము.

28 జూన్ 1915 :—స్మరణాభ్యాసము జీవులకు చేయసాధ్యము కాదు. అప్రయత్నముగ ఆజ్ఞచక్రమునందు నామజపము దానంతటనది జరిగిపోయినపుడే అది స్మరణాభ్యాసమని యనిపించుకొనును. ఇప్పుడు మనము నామమును ఆజ్ఞచక్రమువద్ద తలచుకొనుటయే చెయ్యవలసినపని. హృదయస్థానమునగాని, నాలుకతోగాని ఉచ్చరించకూడదు. హృదయస్థానమున నామముబయలుదేరినను నాలుక అట్లుచ్చరించబోయినను వెంటనే కట్టిబెట్టి మీశ్రద్ధను ఆజ్ఞచక్రమువద్ద నేకాగ్రముచేసి అచ్చట రాధాస్వామీనామమునుచ్చరించుడు. అందుకు ఆటంకముగలిగినచో అదేస్థానమున రాధాస్వామీ, రాధాస్వామీ అని ఆవేశముతో బిగ్గరగ స్మరణచేయుడు. కాని నాలుకతో చప్పుడుచేయకూడదు. నోటినుండి పైకేమియుమాట రానివ్వకుండగనే, లోలోపల నెట్లు పాటలుపాడుకొందురో అట్లే నాలికకదపకుండగనే లోలోపల బిగ్గరగ నామమునుచ్చరించుకొనవచ్చును.

## 5

### సత్సంగమునుండి దూరముగనున్నపుడు ప్రసాదమును చరణామృతమును ఉపయోగించుకొనుటవలన పారమార్థికలాభము గలుగును.

సత్సంగములో సద్గురునిసమక్షమున సత్సంగులు కూర్చుండినపుడు వారి యావత్స్వరూపము వారియెదుట పెట్టబడును కావున, ప్రసాదమైపోవును,

అనగా సద్గురుని సాంగత్యమువలన ప్రభావితమైపోవును. సత్సంగి సత్సంగము నుండి దూరముగపోయినపుడు అతనికి యథావిధిగా అభ్యాసముచేయుట సాధ్యపడదు. అభ్యాసముచేయబోవునపుడు వ్యర్థాలోచనలు వచ్చి చెఱుపుచుండును. ఎదురుగ సద్గురునిఫొటోను పెట్టుకొనికూర్చుండినను లేదా పవిత్రగ్రంథముల లోనిశబ్దములను పాఠముచేసుకొన్నను, అతనికి అసలు ఉత్సాహమేమైననుండిన నదివృద్ధికాగలదు. అసలు ఉత్సాహమే లేనిచో ఫొటోకాని, పవిత్రగ్రంథములుకాని ఉత్సాహమును పుట్టించలేవు. సత్సంగవార్తలు విన్నందువలన మనసున ఆవేశముపుట్టినను, అట్టిఆవేశ మెక్కువలాభదాయకమును కానేరదు, దానివలన పారమార్థికస్వస్థతయు నిలబడనేరదు. ప్రసాదము, చరణామృతమును దగ్గఱఉన్నయెడల వానినుపయోగించుటచే పారమార్థికస్వస్థత నిలబడవచ్చును. దూరముగనున్నపుడు సత్సంగికి ప్రసాదము చరణామృతముదప్ప మఱొకఉపాయములేదు.

## 6

## కష్టములువచ్చినపుడు ప్రార్థనచేయుటవలన గలుగు లాభనష్టములు.

29 జూన్ 1915 :—కొద్దికష్టముకలుగునప్పటికే గాబరాపడిపోయి ఆకష్టము పోగొట్టవలసినదని ప్రార్థనచేయవొడగుట మనస్సుసకలవాటు. అట్టిప్రార్థనలను ఉత్తరములద్వారా చేయకపోయినను లోలోపలనే మనస్సుచేయుచుండును. ఈరెండిటిలో వ్యత్యాస మెక్కువలేదు. ఉత్తరమెట్లుచేరునో అట్లే అంతర్యప్రార్థనగూడ సద్గురువునకందిపోవును. దానికి పర్యవసానముగ ఆబాధ పూర్తిగనైన తొలగిపోవును లేదా కొంతవఱకైన తగ్గిపోవును. కాని అట్లుచేయుటవలన ఆకర్మలును నశింపుగావు, మనస్సునకు నిర్మలత్వమును చేకూరదు. ఆ ఆపత్తు కొంతకాలమువఱకు దూరముగమాత్ర ముంచబడును. అనగా అప్పటి మట్టుకు ఆఆపత్తు తప్పిపోవును. ఎవనిపిల్లవాడైనను ఒకక్లాసు పరీక్షలో తప్పిపోవచ్చును, లేదా జబ్బుపడవచ్చును లేదా చనిపోవచ్చును లేదా అతడేస్వయముగ జబ్బుపడవచ్చును లేదా అతనికి ధననష్టమురావచ్చును. అట్టిసమయములలో మీరు తబ్బిబ్బులుపడవలసినపని యేమున్నది. వేలకొలందిపిల్లలు పరీక్షలలో తప్పిపోవుచున్నారు, జబ్బుపడుచున్నారు, చనిపోవుచున్నారు. యుద్ధములలో లక్షలకొలందిమనుష్యులు నరికివేయబడుచున్నారు. వారుకూడ నెవరికో పిల్లలు, నెవరికో తండ్రులు, నెవరికోభర్తలేకదా!

తనకష్టమును పెద్దకష్టముగను, ఇతరులకష్టములను లక్ష్యపెట్టనక్కఱ లేనివానిగను ఎంచుకొనుట మనస్సుయొక్కలక్షణము. వార్తాపత్రికలలో వేల కొలఁదిమనుష్యులు చనిపోయినట్టివార్తలును చాలకిమ్మతుగలసామానుతో నిండినపడవలు వందలకొలఁది మునిగిపోయినవార్తలును చూచుచునేయున్నాము. ప్రతివ్యక్తియు తనశరీరమును, ధనమును, కుటుంబపరివారమును ఏదోయొక రోజున తప్పక విడిచిపోవలసివచ్చునని జ్ఞాపకముంచుకొనవలెను. కనుక వానికి కలుగు నష్టకష్టములవిషయములో నెక్కువ వ్యాకులపడకూడదు. సత్సంగి యెప్పుడు నీతీరుననే వివేచనచేసికొనుచుండవలెను. ప్రార్థనచేసినప్పుడు తనకు గలిగినకష్టము తొలగకపోయినచో తనప్రార్థనను గురువుగారు వినలేదని సత్సంగి అనుకొనుచుండును. కాని అసలువిషయము వేఱు. అతనికి తెలియనట్టి మఱొక పెద్దకష్టము సత్సంగికి ముందురావలసియుండగా, అది యీవిధముగ రాకుండ తప్పించబడిపోయెను.

## 7

## సద్గురువు గుప్తమైనచో సత్సంగి యేమిచేయవలెను.

మన కొకసంత్ సద్గురునిచరణములయందు పరిపూర్ణ భావముండి వారినే సమస్తవిషయములలోను నమ్మికొనియున్నపుడు వారు గుప్తమైపోయినచో మన మేమిచేయవలయును? అన్నిటికన్న నుత్తమమైనసలహా ఏమనగా సత్సంగి తనప్రవర్తనను (రహనీ, గహనీ) యోగ్యముగనుంచుకొనవలెను. అట్లైనచో తిరిగి సంత్ సద్గురువు ప్రకటమైనపుడు వారు మనప్రవర్తనకు సంతసించి మనము తయారైయున్నందున మనఆత్మ నూర్ధ్వముగ నారోహింపజేయుదురు. మన ప్రవర్తనమాత్రము మనము సరిచేసికొనగలము కాని పైకి ఆరోహించగల శక్తి మనకు లేదు. ఏమైననుసరే, సద్గురువు ప్రకటమగువఱకు మనప్రవర్తనను సవ్యముగ నుంచుకొనవలెను. లేనిచో నెప్పటికైనను చేయవలసినపని అదియే. అట్లుచేసినపిమ్మటనే సద్గురువు మనఆత్మను ఊర్ధ్వముగ నారోహింపజేయుదురు.

ఇంతియగాక ప్రవర్తనను సవ్యముగనుంచుకొనుటవలన తమ్ముతాము గురువుగ ప్రకటించుకొనునట్టి వ్యక్తులయొక్క వాస్తవత్వమును పరిశీలించగల సామర్థ్యముకూడ సత్సంగికి గలుగును. నిజమైనసద్గురువు చేయించునట్టికార్య క్రమములో దేనియందును మితిమీరినబాధన ముండదు. అనగా, వైరాగ్య

మునో లేక నట్టిమఱొకవిషయమునో పట్టుకొని, అదేప్రధానమన్నట్లుగ ప్రవర్తించరు. అసత్యగురువయితే, నిజమునకు ఏవిషయములోను తిన్నగ ప్రవర్తించ నేరడు. అనగా ఒక్కవైరాగ్యలక్షణమేతీసికొన్నను అతడు ఆవైరాగ్యప్రవర్తనలోనే పతితుడగుచుండును. పరిపూర్ణగురువు సకలలక్షణములలో ప్రవర్తించుచుండియు తమకు వానితోసంబంధములేనట్లే యుందురు. తమప్రవర్తనను సంపూర్ణముగ సవ్యముగచేసికొన్నసత్సంగులును, పూర్తిగకాకపోయినను చాల మట్టుకు సవ్యముగచేసికొన్న సత్సంగులును, నిజమైనసద్గురువునకు ఇష్టముగనుందురు. పర్యవసానమేమనగా, ఇట్టిసత్సంగి పరిపూర్ణగురువును తెలిసికొనుటకు ఒకగీటురాయివలె నుండును.

రహనీ[1] అనగా మనస్సును శోధనచేసికొని దానిలోనుండెడి దుర్లక్షణములను తొలగించుకొని ఉంచుకొనదగినశుభలక్షణములనుమాత్రము నిలబెట్టుకొనుట యనిభావము. గహనీ[1] అనగా పైనుండి తెచ్చుకొని తనమనస్సునపెట్టుకొనదగిన విషయములను గ్రహించుట యనిఅర్థము. సంత్ సద్గురు విచ్చటి లోకపరుసవేదివలె దయచేసిరి. జీవులు వారికి తమ్ముతాము తాకుకొనవలెను. అట్లైవరైన తనంతటతా నొకసారి తాకుకొన్నచో సద్గురువు మఱొకఐదుసార్లు వారిని రాపాడించెదరు. ఏలనన ఈలోహము త్వరలో బంగరుగమాఱిపోయి, అవ్విధముగ తామిచ్చటకువచ్చి నెఱవేర్పదలచుకొన్న మహోద్దేశ్యము త్వరలో పూర్తికావలయుననియే వారియిచ్ఛ.

## 8

### ప్రవర్తననుగుఱించి మఱికొంతవివరణ.

30 జూన్, 1 జూలై :— సత్ప్రవర్తనలో నిమిడియున్న విషయముల నన్నిటిని వివరముగ చెప్పవలెనన్నచో, వేలకొలది విధిసూత్రములు తయారుచేయవలసివచ్చును, పుస్తకములమీద పుస్తకములు వ్రాయవచ్చును. కాని ఆవిధిసూత్రములన్నిటికిని సారభూతమైనసిద్ధాంతమును గమనించవలసియున్నది. ఈసూత్రములు తయారుచేసినపుడు ఆసూత్రములలో తయారుచేసెడివారి మానసికవికాసమును, భావసౌష్ఠవమును కలిసియుండును. ఇప్పుడు మనము ప్రవర్త

1 ప్రవర్తనకు హిందీభాషలో "రహనీ, గహనీ" అనుపదమును ఉపయోగింతురు. ఆపదములోని భాగములు రెండిటిని విడదీసి ఇచ్చట అర్థము చెప్పిరి.

నను సన్మార్గములో నుంచుకొనునిమిత్తమై ముఖ్యముగ దృష్టిలోనుంచుకొన వలసిన విషయములను పరికింతెను. ఆవిషయములు రెండే, ఒకటి భయము, రెండవది భావమును. అనగా భగవంతునికి తనమీద అప్రసన్నతగలుగునేమో ననెడిభయమును, భగవంతునికలిసికొని వారినిసంతోషపెట్టవలెనను నుత్సాహ మును. ఈభయమును, ఈభావమును సంపాదించుకెట్లు అనెడిప్రశ్న ఇప్పుడు బయలుదేరును. దీనికుపాయము భగవంతుడుసర్వసాక్షియనియు, నిత్యము తన తోనే యుండుననియు భావించుకొనుటయే. కాని అట్లు భావించుకొనుట సులువుగాదు. ఈభావనగల్గు పరిస్థితి యెట్లు సంప్రాప్తమగును?

మానవు డేపనిచేసినను తనఇష్టానిష్టములనుబట్టి అనగా తనమనస్సున కేదిఇష్టమో ఏదిఅప్రియమో చూచుకొనియే చేయుచుడును. తనప్రవర్తన నెవరైనను సన్మార్గమున నుంచుకొనగోరినచో నతడు తనమనస్సుయొక్క ఇష్టానిష్టములేగాక మఱొకవిషయము ప్రధానముచేసికొనవలయును. మనము స్వార్థమునకుగాని పరమార్థమునకుగాని సంబంధించిన యేపనైనను మొదలు పెట్టుటకుముందు భగవంతుడు మనసోదరుడు లేక తండ్రివలె మనప్రక్కనే యున్నట్లెంచుకొనవలెను. వారిని "నేనీపని చేయదల్చుకొన్నాను దీనివలన మీకప్రసన్నత గలుగదుకదా" అని అడుగవలయును. అప్రసన్నత గలుగునని సమాధానమువచ్చినచో వెంటనే ఆపనిని విడిచిపెట్టవలెను. ఇవ్విధమైనప్రశ్న వేసికొని, సమాధానము తెచ్చుకొనెడిపద్ధతిని ఏసత్సంగియైనను మొట్టమొదటి లోనే తనపనులన్నిటివిషయములో నవలంబించవలయునని ఆశించుట అసా ధ్యమే. కాని పెద్దపెద్దపనులవిషయములో నీవిధముగ చేయవలసియున్నది. కాని సత్సంగికి ఇంకను హృదయము పూర్తిగనిర్మలముకాలేదు. కావున నత డీవిధమైన కార్యక్రమము నవలంబించుటలోగూడ తప్పులుచేయవచ్చును లేక మోసపోవచ్చును. కాని అట్టిపొరబాటులో న్యాయబుద్ధికలిసియున్నదికావున దానివలన హాని కలుగనేరదు. కొన్నాళ్లు ఈప్రకార మభ్యాసముచేయగా ఆపొరబాటుకూడ తగ్గిపోవును.

ప్రతికార్యము సత్ప్రవర్తనాసిద్ధాంతములకు భంగములేకుండ చేసినచో నది సాధుగతి యగును. కాని మనముకూడ నెప్పటికైన నాగతిపొందవలసిన వారమేకదా. కావున మనముకూడ నావిధముగనే ప్రవర్తించుట అలవాటు చేసికొనవలెను. భగవంతునిధ్యానముద్వారా తనయెదుటపెట్టుకొని పనులు

సాగించవలెనన్నచో భగవంతుని సర్వవ్యాపకమైనబ్రహ్మగా మన్నించినచో నది సాధ్యముకాదు. ఆకాశమువలె సర్వవ్యాపకమైనభగవంతునియందు ఎవని కిని భయముగాని, భావముగాని యుండనేరదు. బ్రహ్మను సర్వవ్యాపకమైనట్లు నమ్మికొన్నవారు అట్టివిశ్వాసప్రభావమువలన తాము చెడుకర్మలుచేయకుండ తప్పించుకొంటిమని యన్నచో అది నిజముకానేరదు. వారు చెడుపనులుచేయక పోవుటకు అసలుకారణము లోకాపవాదముగలుగునవెడిభయమే. పరిపూర్ణమైన భయభక్తులు గలుగవలెనన్నయెడల, దేహధారియైనసద్గురువును ధ్యానముచే యుట ఆవశ్యకము. ప్రారంభములో ధ్యానముచేయలేనియెడల వారినితలచు కొనుచుండుట చాలును. మానవుడు సద్గురువును ధ్యానముచేయుటగాని తలచు కొనుటగాని మఱచిపోవుచుండును. కాని అతడుచేయుచున్నకృత్యములనే భగ వంతునిధ్యానమునుచేయులాగున నేర్పఱచుకొన్నచో క్రమక్రమముగ సద్గురు స్వరూపము అతనియెదుటకు వచ్చుట ప్రారంభమగును. ఇదేమియు నసాధ్యము లేక అసంభవమైన కార్యముగాదు. ఏలననగా, మనప్రభువు సదాజాగ్రత్పురు షులు, వారే మనకు త్రోవచూపదల్చుకొనియున్నారు. కావున నీకార్యభార మంతయు మనఒక్కరిపైననే లేదు, మన యొక్కరిప్రయత్నముమీదనే ఆధార పడలేదు. భగవంతుడుకూడ మనకు త్రోవచూపుటకు సిద్ధముగనున్నాడు. మనముగూడ అట్లునడిపించబడుటకు సంసిద్ధముగనుండవలయును. ఉత్తకబుర్లు (కథనీ) వలనగాని కేవలము అభ్యాసమువలనగాని పనిసాగదు. కబుర్లకన్న అభ్యాసముయొక్కతరహా నిస్సంశయముగ హెచ్చైనదే. కాని "రహనీ"కూడ అనగా మనస్సు భగవంతునియందు లీనమైయుండిపోవుటగూడ అలవాటుచేసి కొనవలయును. "రహనీ" అనగా భగవంతునియెడల మనస్సునగలభయమును, భావమును దృఢపఱచుకొనుటయును, ఇతరులయెడల మనస్సునగల భయమును భావమును త్రోసిపుచ్చుటయును అనిఅభిప్రాయము. "గహనీ" అనగా భగ వంతునియెడల భయమును, భావమును ఏసహవాసములో రోజురోజు నెక్కువ యగుచుండునో, అట్టి సహవాసములో ప్రవేశించి, అట్టిసహవాసప్రభావము వలన తనకు ప్రస్తుతమున్న భయమును, భావమును వృద్ధిచేసుకొనుచుండవలయు నని యభిప్రాయము.

కొందఱు తమకుపదేశించిన అభ్యాసము నెప్పుడు చేయకుండగనేయుండి పోయి పైగా దానిలోవివిధవిధములైనకష్టములు ఉన్నవని భయపడుచున్నట్లు

చెప్పుచుందురు. సాహబ్జీమహారాజువారు ఈవిషయమై ఒకకథ చెప్పిరి. ఒకయజమానికి ఒక నౌకరుండెడివాడు. ఆయజమానికి జబ్బుచేసెను. అప్పుడు మిట్టమధ్యాహ్నపువేళ, ఎండకూడ మహాతీవ్రముగనుండెను. ఆయజమాని నౌకరును పిలిచి వైద్యునివద్దకు వెళ్ళి మందు తెమ్మనిచెప్పెను. "అయ్యా ఆవైద్యుడింటివద్ద లేనిచో నేమిచేయవలయు"నని నౌకరు ప్రశ్నించెను. "అరే, ముందుఅచ్చటికి వెళ్ళి చూడు" మని యజమాని సమాధానముచెప్పెను. అంతట నౌకరు బట్టలు వేసుకొని జోడుతొడుగుకొని బయటకువెళ్ళెను. కాని ఆఎండతీవ్రముచూచి తిరిగి వెనుకకువచ్చి తనయజమానితో "వైద్యుని కలిసికొన్నాననుకొనుడు, ఆయన మందివ్వకపోతే" అని యజమానిని తిరిగిప్రశ్నించెను. ఆయజమాని, "నీవు మొదటినుండియు వాదనలే చేసెదవేమి? వెళ్ళినచో సరిపోవునుగదా" అని సమాధానము చెప్పెను. నౌకరు పదిపదునైదుఅడుగులు వీధిలోనికివెళ్ళి తిరిగివెనుకకువచ్చి తనయజమానితో "అయ్యా వైద్యునికలసికొన్నాను అనుకొనుడు, మందుకూడ ఇచ్చినారనుకొనుడు. కాని ఆమందు పనిచేయనిచో" అని ప్రశ్నించెను. ఆయజమానికి కోపమువచ్చి నౌకరును పది, పదునైదు తాపులు తన్నెనట. మనస్సుపరిస్థితిగూడ నిట్టిదే. అనేకవిధములైన నెపములు లేవదీయుచుండును. చెప్పినమాట విననపుడు దానిని సరిదైననుచేయవలయును, లేదా శిక్షించవలెనుకాని మఱొక యుపాయ మేమున్నది.

## 9

## సత్ప్రవర్తనవిషయములో మఱికొన్నిప్రశ్నలు.

1 జూలై 1915:—సద్గురువును మనసుననుంచుకొని ఏవిషయమునైనను తేల్చుకొనుట మనస్సాక్షిని (conscience) అడుగుటవంటిదే యగునుకదా యని ఒకసత్సంగి ప్రశ్నించెను. అంతట హుజూరువా రట్లుగాదని సమాధానముచెప్పిరి. అంతస్సాక్షియొక్క-ప్రమాణము పూర్తిగావిశ్వసించదగినదిగాదు. ఉదాహరణకై, ఇరువురుభార్యలను పెండ్లియాడుట న్యాయమాయని ఒకక్రైస్తవుని నడిగినచో అతనియంతస్సాక్షి దానికి పూర్తిగ ప్రతికూలభావము దెల్పును. అనేకభార్యలను ఇంటనుంచుకొన్నట్టి రాజపుత్రుల నెవరినైన నదేప్రశ్న యడిగినచో అతనియంతస్సాక్షి అందు కేమియు నడ్డుచెప్పదు.

సత్ప్రవర్తనవిషయములో హుజూరువారు సెలవిచ్చినపద్ధతిని తీర్మానము చేసికొనుటలో ప్రతిబంధములు గల్గుచుండునని మఱొకరు చెప్పిరి. అంతట హుజూరువారు ఒకచాలఅంత్యశ్రేణిలోని (Extreme) దృష్టాంతము నిచ్చెదనని చెప్పి ఇట్లు సెలవిచ్చిరి; ఒకసత్సంగికి ప్రతిరోజు సత్సంగమునకు రావలెననియున్న దనుకొనుడు. అతనిభార్య అత డట్లుచేసినచో తనపీకెను నరికివేసుకొందునని యనును. పిల్లవాడు విషము తినెదనని భయపెట్టును. తండ్రి అతనిని యింట నుండి తరిమివేయుదునని భయపెట్టును. అతడు సద్గురుస్వరూపమును ధ్యానము చేసుకొని ఆస్వరూపము నెదుట "ప్రభో, నేను సత్సంగమునకు వెళ్లనా, వద్దా? నాకు హృదయపూర్వకముగ వెళ్లవలెనని యున్నది. కాని నేనట్లు వెళ్ళినచో చాలమందికి ప్రాణహాని కలుగగలదు. నన్నుకూడ నింటినుండి తరిమివేయు దురు", అని మొఱపెట్టుకొనును. ఈప్రశ్నకు సమాధానమేమియు నతనికి లభించదు. అతడు వ్యాకులచిత్తుడై ఏడ్చుచు తనకుటుంబీకులతో "నాకు సత్సం గమునకు వెళ్ళవలెనని చాలకోరికయున్నది కాని మీ మూలమున మానివేయు చున్నాను", అని చెప్పి ఇంటనే యుండిపోవును. కాని అతడు మనస్సులో అది వఱలోవలెనే ఏడ్చుచు గాబరాపడుచుండును. అయితే ఆపరిస్థితిలో కుటుంబీ కులలో నెవరికైన భగవత్ప్రేరణగల్గి ఇతనిని సత్సంగమునకు వెళ్ళుమని భగ వంతు డతనిచే చెప్పించవచ్చును. లేదా అట్లుకాకపోయినను ఆసత్సంగికి, సత్సంగమునకై అంతయెక్కువ బాధపడి యేడ్చినందువలన, కొన్నియేండ్లు సత్సం గము చేసికొన్నందువలన లభ్యముకావలసినంత యధికలాభము గలుగును. కావున మేము చెప్పినపద్ధతి నవలంబించుటచే లాభకరముగనే యుండును.

తిరిగి మఱొకదృష్టాంతము నిచ్చెదనని సెలవిచ్చిరి:—ఒక పెళ్లికి బాణ సంచా జౌన్‌పురములో తయారుచేయించవలయునా, లేక మురాదాబాదులో చేయించవలెనా అనియు, భోగముమేళమును తీసికొనిరావలయునా వద్దా అనియు ప్రశ్నలు బయలుదేరినవనుకొనుడు. సత్సంగి సద్గురువును ధ్యానము చేసి మొఱపెట్టుకొనెను. కాని సమాధాన మేమియు రాలేదనుకొనుడు. ఇంటి వారు ఆసత్సంగిని అడుగగా అతడు సమాధానము చెప్పలేక ఊరుకొనవచ్చును, లేదా, "ఏదోవిధముగ చేయవలసినదేగదా మీఇష్టమువచ్చినట్లు చేయుడు. దీనికై యెక్కువ ఆలోచన చేయవలసినపనిలే" దని చెప్పవచ్చును. అతడు దానివిషయమై యెక్కువగ నాలోచింపలేదనుకొనుడు; లేదా ఆతని కుటుంబము

వారు కొంతసేపటివఱకు నిరీక్షించిన పిమ్మట నాపనిని తమ ఇష్టమువచ్చినప్రకారము చేసివేసి రనుకొనుడు. ఎట్లైననుగూడ అసత్సంగికి శ్రమలేకుండ తప్పిపోయినదికదా!

## 10

### భేంటు, సత్ప్రవర్తనలను గుఱించి.

పరమార్థము రూపాయలిచ్చి కొనుగొనుటకు వీలైనదికాదు. ఒకడు కోటిరూప్యములను భేంటుగ నిచ్చినను అతనికి ఒకరేణువంతపరమార్థముగూడ లభించకపోవచ్చును. మఱొకడు ఒకదమ్మిడిమాత్రమే భేంటుగనిచ్చి పారమార్థికముగ మహాలాభమును సంపాదించుకొనవచ్చును. భేంటునిచ్చువాని శ్రద్ధాభక్తులకే ప్రాధాన్యము. లోకములో నెవరైనను మఱొకరివద్ద నేదైన తీసికొన్నపుడు దానిని తీర్చివేయుటగూడ తప్పదు. ఇచ్చిపుచ్చుకొనుటకు సంబంధించిన లెక్క చెప్పియేతీరవలయును. సద్గురుపున కెవరైన భేంటు ఇచ్చినపుడు, అతడు వారికే స్వయముగ నిచ్చినట్లు తలంచుచుండును. వాస్తవ మేమనగా, ఆసొమ్మును వారు తమ స్వలాభమున కై ఎన్నడు నుపయోగించరు. తిరిగి వారు దానికి నూటికినూరుపాళ్ళు నేదోవిధముగ నతనికి ఇచ్చివేయుదురు. ఎట్లనగా ఒకరికి జీతములో వృద్ధికావచ్చును. మఱొకనికి జబ్బు తగ్గిపోయి, ఆవిధముగ నింటిలో వైద్యమునిమిత్తమై ఖర్చు తప్పిపోవచ్చును. ఇదిగాక పారమార్థికముగగూడ మహాదానము లభించును. సద్గురువునకు భేంటుగ నిచ్చిన ధనమును వారీశరీరములోనుండగనే తిరిగి ఇచ్చివేయుదురు. ఏలననగా వారు అందునిమిత్తమై మఱొకసారి శరీరమును ధరించరు. కావున వారు ఈశరీరములోనే దానిని తీర్చివేయుట యావశ్యకము.

### పరిశిష్టము (Post script)

రాధాస్వామీ మతముయొక్క మాధుర్యము నెవరును enjoy (ఎన్జోయ్) చేయనేలేదు. అనగా, దీని ఆనందమును అసలు అనుభవించనేలేదు; లేదా, అనుభవించినను చాల తక్కువమందిమాత్రమే అనుభవించియుందురు. తమ పారమార్థికకార్యశైలిని పైపద్ధతిగా నడిపించుకొన్నయెడల, దాని ఆనందమును చవిచూడగలరు. మన మింకను మనస్సుయొక్క వృత్తులను త్రోసి

పుచ్చి పనులుచేయలేకున్నాము. అందుచే ప్రస్తుతములో, మనస్సును సంప్రతించినపుడెల్ల, సద్గురువునుగూడ నాంతర్యమున దలచుకొని వారినికూడ నడిగి తెలుసుకొనుచుండిన, నదియే యుక్తము అనికూడ సెలవిచ్చిరి. అందువలన, మనస్సుయొక్క అవిధేయతయు గురుతిరస్కారమున నెడి ప్రారంభిక దుష్టప్రవర్తన బయల్పడును. ఇదేమైనను తక్కువలాభమా? "అప్పుడప్పు డేదైన నొక విషయమునుగురించి సద్గురువుయొక్క అనుజ్ఞను పొందవలెననియుండునుగాని, వారు అనుజ్ఞ ఇవ్వరేమో యనెడి ఆలోచన పుట్టి, అట్లైనచో, వారి ఆజ్ఞోల్లంఘనపాపమును చేయుటకంటె, వారిని అడుగకుండుటయే మంచిదని యనిపించుచుండును. అది సరియా కాదా?" అని ఒక సత్సంగిప్రశ్నించెను. అది మనస్సుయొక్క బహుదుష్టస్వభావమనియు దాని ప్రభుత్వమును నిలబెట్టుకొనుట్కై మనస్సు అట్లుచేయుచుండుననియు సెలవిచ్చిరి. సద్గురువును అడిగినపుడు వారనుజ్ఞ నివ్వనిచో నెవరైనను ఆ నిషేధించినపనిని చేసినయెడల నతనికి అటు పిమ్మట పశ్చాత్తాపము కలిగి ఆపైనుంచియైనను అతడు జాగరూకతతో ప్రవర్తించును. సద్గురువును అసలే అడుగకుండగ నుండిపోయినచో అతనికి ఈ లాభము లేకుండ పోవును. ప్రతిక్షణము సద్గురువును ధ్యానముచేసికొని ఆంతర్యమున ప్రశ్నించుట కలవాటుపడినవాడు ఏదైన తప్పుచేసినచో నతడు తరువాత సద్గురునియెదుటకు వెళ్ళినపుడు చాల వణకిపోవును. ఆతర్వాత నతడు వారి సాన్నిధ్యమున సేవనికాని సంభాషణకాని నిర్లక్ష్యముగ చేయనేరడు.

## 11

### సద్గురువునందు భక్తిభావము — సద్గురువుచనములను సెలవిచ్చుటలో వారి యుద్దేశ్యము:—

2 జూలై 1915:—సత్ప్రవర్తననుగురించి మఱొకవిషయముగూడ జ్ఞాపకముంచుకొనవలయును. ఒకపిల్లవాడు అదే మొదటిసారిగా వర్షముకురియుట చూచెనను. వాడు మేఘము లెచ్చటనుండి వచ్చుచున్నవని అడిగెను వానితల్లియో లేక పితామహియో, ఈమేఘములు కొండలమీద నుండిగాని, సముద్రమునుండిగాని, వచ్చి వర్షించుచుండునని చెప్పెను. కొన్నిరోజుల తరువాత ఒకపెండ్లిసమయములో నొక పురోహితుడు వచ్చెను. అప్పుడే వర్షముకూడ కురిసెను. ఆపురోహితుడు ఇపుడు ఇంద్రదేవత ప్రసన్నుడై

ఈవర్షము కురిపించెనని యనెను. పిల్లవాడు ఇంద్రుడనగా నెవరని యడిగెను. ఇంద్రుడు ఒక దేవతయనియు, ఇంద్రపురి యనులోకమున నుండుననియు, మేఘములు మున్నగువానికి ఆయన రాజనియు మెఱుపులు ఆయనకు దూతలనియు, చెప్పెను. మనము ఇంద్రదేవతను పూజచేయుచు యజ్ఞములు చేయుటచే వర్షములుకురిసి పంటలుపండుచున్నవని చెప్పెను. పిల్లవానికి ఈ క్రొత్తవిషయము బోధపడినపుడు బ్రాహ్మణులు మనచేత ఇంద్రునికి పూజలు చేయించి, వర్షములు కురిపించి మనకందఱకు లాభముగలుగజేయుచున్నారనియు, బ్రాహ్మణులు మంచివారనియు నభిప్రాయ మేర్పడెను. ఆపిల్లవాడు తన పితామహి దగ్గఱకు వెళ్లి తన కీమాటలు ముందుగా ఆమె చెప్పలేదని తప్పుపట్టెను. పిల్లవాడు కొంచెము యెదిగి 6, 7 క్లాసులలోనికి వచ్చినపుడు 'గేకి' (Gekie) అను నాయన వ్రాసిన ప్రాకృతికభూగోళశాస్త్రమును చదువుకొనెను. అప్పుడు దానిలో మేఘములు, మంచు, పొగమంచును తయారయ్యేడి విధమునుగుఱించియు, ఋతుపవనముల సిద్ధాంతమును (Monsoon Theory) గుఱించియు వ్రాసిన విషయములను తెలిసికొనెను. అతనికి అపుడు ఇంద్రుడను దేవత లేడనియు, పండితులు ఇంద్రదేవత వగైరాలను గుఱించి చెప్పినదంతయు నబద్ధమనియు తోచెను. అప్పు డతడు తనపితామహితో ఋతుపవన సిద్ధాంతమును గుఱించి విస్తరించిచెప్పి తనకుగలిగిన క్రొత్తజ్ఞానమునకై చాలసంతోషించెను. అతనికి 20, 25 ఏండ్ల ప్రాయము వచ్చినపుడు వేదశాస్త్రములలో చెప్పబడిన ఇంద్రాదిదేవత లందఱును నిజముగ శక్తులని బోధపడెను. అప్పుడు అతనికి పాపము బ్రాహ్మణుడు ఇంద్రుడు మేఘముల రాజని చెప్పినవిషయము ఒకవిధముగ యుక్తమేయని బోధపడెను. పర్యవసాన మేమనగా ఆపిల్లవానికి వేఱువేఱుసమయములలో వేఱువేఱు అనుభవములు కలుగుచుండెనని తెలినది. ఇట్టి బుద్ధిమీాద ఆధారపడుట యెట్లు ? కావున బుద్ధికి సంబంధించిన విషయములను విన్నందువలన నెవరికైనను సద్గురువునందు భావముగల్గినచో అది విశ్వసనీయము గాదు. అయినను గూడ వారు సద్గురువునందు భావము అసలే లేనివారికన్న మెఱుగే.

తన మనోరథమేదైన సిద్ధించినందువలన కొందఱికి సద్గురువునందు భక్తిభావము పుట్టును. అసలుభావములేనివారికన్న నిట్టివారు మెఱుగేలయినను, ఈవిధముగ నేర్పడినభావముగూడ విశ్వాసపాత్రముగాదు. ఎవరికైన పనులు

ఎల్లప్పుడు తమయిష్టమువచ్చినట్లే జరుగుట అసంభవము. అట్టివారికి మఱొక సమయములో మఱొకకోరికయేదైన సిద్ధించనపుడు మొదట మనోరథసిద్ధి హేతువుచే కలిగినభావము అంతరించిపోయి వారు సద్గురువునుండి విముఖులైపోవుదురు. సద్గురువు తమకుచూపెడి ఆదరగౌరవములమూలమున కొందఱికి భక్తి బయలుదేరును. భావము అసలులేనికన్న ఇదిమెఱుగే అయినను ఇట్టిభావము గూడ నమ్మదగినదికాదు. ఆదరగౌరవము లెవనికైన నెల్లపుడు చూపబడవు. ఏలననగా, అట్లైనచో వానిఅహంకారము నశించుటెట్లు? వానిమనస్సులోని మాలిన్యము పోవుటెట్లు? కొందఱికి సద్గురువుయొక్క రూపసౌందర్యము వారి మాటధ్వనులయొక్క మాధుర్యమువూలమున అనగా ఇంద్రియాస్వాదము ద్వారా సద్గురువుపై భావముబయలుదేరును. ఇట్టిభావముగూడ నమ్మదగినది కాదు. ఏలననగా గురువుగారి కెప్పుడైనను కంఠముచెడి, ధ్వని మాధుర్యము పోవుటగాని, లేదా జబ్బుచేసి బుగ్గలు నొక్కుకుపోవుటయు, కండ్లయొక్క అందము చెడిపోవుటయు తటస్థించినచో అట్టిభావము నశించిపోగలదు.

నిజమైనప్రేమ సంప్రాప్తమైనపుడు గలిగెడి భావమే అసలైనభావము. నిజప్రేమ యెట్లుండుననువిషయము మనకిపు డూహింపశక్యముగాదు. కాని లైలామజ్నూలు, షిరీంఫర్హాదులు మొదలైనవారి సాంసారికప్రేమయొక్క లక్షణములనుబట్టి నిజప్రేమనుగుఱించి కొంత యూహించుకొనవచ్చును. ఏమహాపురుషుని సహవాసమువలన మనసున ప్రేమాగ్ని ప్రజ్వలించునో వారే పరిపూర్ణ గురువని తెలిసికొనవలయును. మిసెస్ బీసెంట్ (Mrs. Besant) చాల పెద్ద వక్త. ఆమె పెద్దపెద్దసభలలో ఉపన్యాసములనిచ్చి ఆసభలలోనివారినందఱిని ఉత్తేజితముగ (electri fied) చేయుచుండును. కాని అందువలన భగవచ్చరణములందు ప్రేమ వర్ధిల్లునా! ఎంతమాత్రముకాదు.

ఈవచనము సెలవిచ్చుచుండగా మధ్యన నొకసత్సంగి లేచి ఏదో ప్రశ్నింపబోయెను. అపుడు హుజూరువారు "ఈవిషయమునకు సంబంధించి ఏదైన నడుగదలచినచో అడుగుము. అసంబద్ధవిషయమునైతే ఇప్పుడు చెప్పవద్దు. అందువలన నీకును పైవారికినిగూడ మనస్సు ప్రస్తుతవిషయమునుండి చెదిరిపోయి, ఈచెప్పెడివిషయము కట్టడిపోవును. నేనీవచనమును మీకిపుడు చెప్పవలసినఅవసరమును లేదు; మీకిది చెప్పి వినిపించవలయునని నాకాసక్తియులేదు, నాప్రజ్ఞ మీకు చూపించవలయుననిగాని, మీఅందఱివలనను "ఆహా! ఆహా",

అని పొగడ్తలుపొందవలయుననికాని కోరికయు నాకులేదు; ఇక్కడున్నవారిలో నీవచనము నవగాహనచేసికొనుటకుగాని, దానివిలువను గ్రహించుటకుగాని శక్తిగలవారు ఎవరును కనిపించుటయులేదు. అయిననుకూడ నేనీవచనమును చెప్పవలసివచ్చుచున్నది. ఎందుకనగా, మీరెవరును స్మరణధ్యానములా చేయలేరు, భజనాభ్యాసమును అంతకన్నను చేయలేరు. మఱొకఆధ్యాత్మికసాధననైనను సరిగాచేయలేరు. కావున మీమనస్సును పదిపదునైదునిమిషము లీవచనముమూలముగనైన న్నావైపునకు త్రిప్పుకొనవలెనని యిట్లుచేయుచున్నాను కాని మఱేమియుకాదు." అని సెలవిచ్చిరి.

## 12

### సద్గురువుయొక్క అంతర్యామిత.

3 జూలై 1915 :— సంత్ సద్గురువుయొక్క శరీరమనస్సులు అంతర్యాములుకావు. కాని వారిశరీరములోనున్న ఆత్మమాత్రము నిస్సంశయముగ సర్వసమర్థమైనదియు, అంతర్యామియును. వారు ఉన్నతఘట్టములజ్ఞానమును ఆఘట్టములమీదనుంచి హృదయఘట్టముమీదికి ధారారూపముగ దింపినపుడు వారికి హృదయఘట్టములోకూడ అంతర్యామిత్వము గలుగును. కాని వారు ఈ ఘట్టముమీదికి ఆధారను ఎంతయవసరమో అంతమాత్రమే దింపుచుందురు. వారిహృదయము మహానిర్మలముగను పవిత్రముగను ఉండును. అచ్చటనెట్టి ఛాయలు నుండనేరవు. పైనుండి ఏఆజ్ఞ వచ్చునో దానినే వారు ప్రకటించి చెప్పుదురు లేదా నెఱవేర్చుచుందురు. సంత్ సద్గురుని హృదయస్థానములోనికి సత్సంగసమయమునగాని పూర్వసంతులభండారాలసమయమందుగాని మఱొక ప్రత్యేకముఖ్యసమయములందుగాని నిజధార వచ్చుచుండును. మిగిలినసమయములలో వారిశరీరకృత్యములన్నియు ఆధారయొక్కఆభాసవలననే జరిగిపోవుచుండును. ఒకదృష్టాంతమునుగూడ నిచ్చిరి. ఎట్లనగా, నేను అంతర్యామి ననుకొనుడు. నీవంతర్యామివి కావనుకొనుడు. కాని నావద్దకు అనుక్షణము వచ్చిపోవుసావకాశము నీకుగలదనుకొనుడు. ఎవరైనను నిన్నేదైనవిషయము నడిగినపుడు నీవు నావలన నది అడిగితెలిసికొని ఆమనిషికి చెప్పినచో నిన్ను అంతర్యామిఅనుటలో తప్పులేదు. ఏలననగా, నీవెల్లపుడు నేవిషయమునైనను నన్నుకనుగొనియే పైవారికి తెలియజేయగలవు. ఐతే నీవు అంతర్యామివి

కావనిచెప్పుటగూడ నొకవిధముగ సరియే. ఏలననగా, నీకు ఏవిషయమును నన్నడగనిదే తెలియజేయగలశక్తి లేదు. సంత్ సద్గురువుపరిస్థితిగూడ నిట్లే యుండునని తెలిసికొనుడు. అంతర్యామితయు సమర్థతయు నేస్థానమున విరాజిల్లుచున్నవో ఆస్థానముతో సంబంధము కలుపుకొనుటకై వారిహృదయస్థానములో నొకటెలిఫోను (telephone) ఉన్నది. వారెప్పుడుకావలెనన్న నప్పుడు ఆటెలిఫోను వాడుచుందురు.

## 13

### మనస్సుయొక్క తొందరపాటు, అజ్ఞానమును.

3 జూలై 1915:—తొందరపడుట మనస్సుయొక్క స్వభావము. ఉపదేశముపుచ్చుకొన్నక్షణములోనే చాలమంది తామీలోకములన్నిటిని రెండుమూడురోజులు లేక రెండుమూడు నెలలు లేక రెండుమూడుసంవత్సరములలోపుననే, అభ్యాసముచేసి జయించివేయుదమని తలంచుచుందురు. ఇది పొరబాటు. పుస్తకములుచదువుటలోగూడ నిట్లే కొందఱు తొందరపడుచుందురు. పుస్తకముయొక్క శీర్షికపుటము (Title page) చూచి దాని భూమికను కొద్దిగా చదివి పుటలను ఇటునటుత్రిప్పి అంతటితోనే తృప్తిపడి ఆపుస్తకమును ప్రక్కన పెట్టివేయుదురు. అటులనే సత్సంగికూడ భక్తిభావముయొక్క మహిమవిని, అభ్యాసముకన్న దానికెక్కువమహత్త్వమున్నట్లు తెలిసికొన్నపుడు, తాను పది పదునైదురోజులు గట్టిపట్టుదలతో భక్తిప్రేమలుచేసి యీకఠినసమస్యనుకూడ సాధించివేయగలనని ఊహింపసాగును. కాని ఇది బొత్తిగపొరబాటు. ఈపని ఒకరోజులో నైపోయెడిదికాదు. భగవంతునితత్త్వముతో సత్సంగి తద్రూపమైపోయెడివఱకు పేచీ ఉండుచునేయుండును. లోకములో నొకమనిషి మఱొకనితో ప్రేమ చేయదలచినపుడు అతడు రెండవవానిచెయ్యి పట్టుకొని గట్టిగ నొక్కును, లేదా కౌగలించుకొని అతనివక్షస్థలముతో తనవక్షస్థలమును కల్పును, లేదా ముఖముతో ముఖముకలిపి చుంబనముచేయును. లోలోపలనుండి ఇరువురకును కలిసిపోవలయునని యుండునుగాని శరీరము మధ్యన అడ్డుగనుండిపోవుటచే అట్లు చేసిచేసి అలసిపోవుదురు. అప్పటికి వారి ఆవేశముగూడ చల్లబడిపోవును. చంటిపిల్లవానివంటి పరిస్థితి గలుగువఱకును పరమార్థముయొక్క అసలువిషయము బోధపడనేరదు. ఒకపిల్లవాడును, ఒకఆడపిల్లయు పసితనములో

ఆటలాడుకొనునప్పుడు, ఒకచంటిపిల్లనుకూడ వారొడిలోపెట్టుకొని పాలిచ్చు చుందురు. కాని పెండ్లియనగ నెట్టిదో, శిశువెట్లుపుట్టునో, జననమునకు ముందు గలుగు ప్రసవవేదన యెట్లుండునో ఈవిషయములేమియు నాపిల్లలకు తెలియవు. మనముగూడ పరమార్ధములో నట్టిపరిస్థితిలోనే యున్నాము.

## 14

### సేవను గుఱించి.

5 జూలై 1915 :—కబీరుసాహబ్ వారిట్లు సెలవిచ్చిరి :—

"కౌతుక దేఖా దేహ బిన్, రవి శశి బిన ఉజియాస్ ।
సాహబ్ సేవా మాంహి హై, బేపరవాహీ దాస్"

అర్థము :—సేవకుడు శరీరములేనట్టియు, సూర్యచంద్రులులేకుండగనే ప్రకాశించుచున్నట్టియు నొక విచిత్రస్థానమును చూచెను. స్వామియొక్క సేవలో నతడు పరతంత్రుడై నిశ్చింతగనుండెను.

దీనికి కొందఱు "శరీరములేకుండ పనిజరిగిపోవుచుండుటయు సూర్యచంద్రులులేకుండ ప్రకాశముగలుగుటయు, భగవంతుడే సేవచేయుచుండుటయు చూచి సేవకుడు నిశ్చింతుడైపోయెను" అని అర్థము చెప్పుదురు. ఈఅర్థము పొరబాటు. ఈద్విపదలో సేవకుడు, ఏస్థానమున శరీరముఉండుటగాని, శరీరము ద్వారా పనులుజరుగుటగాని లేదో ఏస్థానమున సూర్యుడులేకుండగనే మహా ప్రకాశమానముగ నుండునో అట్టిస్థానమునుగుఱించి చెప్పుచున్నాడు. అచ్చట సూర్యుడు లేనందున తాపముగూడ నుండదు. అట్టిస్థానములో సేవచేయుటకుగాని, చేయించుకొనుటకుగాని అవసరమేయుండదు. అట్టిపరిస్థితిలో భగవంతుడు దాసునికి సేవచేయుచున్నాడని చెప్పుట యుక్తముగ నెట్లుండును ? ఇంతియగాక దాసునిమనస్సున భగవంతుడు సేవచేయుచున్నాడనెడి యాలోచన వచ్చుటయే భక్తిభావమునకు విరుద్ధము. పైపద్యములో రెండవపంక్తికి "దాసుడు సాహబ్ వారిసేవ చేయుచు నిశ్చింతగనుండెను" అని యర్థము చెప్పుట యెక్కువశ్రేష్ఠముగ నుండును. ఇచ్చట సేవయనగా దాస్యభావముతో సిద్ధముగనుండుటయని మాత్రమే యర్థముకాని పనిపాటలుచేయుట అని అర్థముకాదు. ఏలననగా ఆస్థానములో పనిపాటలు చేయనవసరమే లేదు.

సేవలో అలసట చెందుట, బద్ధకము కలుగుటయు కలసియున్నవి. శరీరమును, మనస్సును నిరంతరము పని చేయునపుడు అలసిపోకుండనుండుట యసంభవము. అలసట, బద్ధకము వచ్చినపుడు ఇతరులచే సేవ చేయించుకొనునావశ్యకత కలుగును. శరీరముగాని మనస్సుగాని లేనిస్థానములో అలసటయు, మాంద్యమును కలుగుట కవకాశమే లేదు. కావున నచ్చట సేవనుగుఱించి ప్రశ్న పుట్టుటకే సావకాశము లేదు. కబీరుసాహెబ్ వారు "అనగఢియా దేవా, కౌన్ కరే తేరీ సేవా" అనగా, "నిరాకారుడవైన ఓ దేవా! నీకు సేవ చేయుట యెవరి తరము!" అని వ్రాసిరి. కావున భగవంతుని కెవరివలనను సేవతీసికొన నవసరము లేదు. ఎవరునుకూడ వారి సేవ చేయను లేరు. భగవంతుడనగా కేవలము శక్తియే. ఆత్మ ఆయనయొక్క అంశయే కావున నదికూడ కేవలము శక్తిస్వరూపమే. ఆత్మకూడ సేవతీసికొన లేదు, సేవ చేయను లేదు. దానియొక్క ప్రకృతియే అట్టిది. ఆత్మ మనోమాయలతో కలిసి జీవావస్థలోనికి వచ్చినపుడే సేవకు అవకాశము గలుగును. కావున తాను భగవంతునికి సేవచేసితిననియు, ఆవిధముగ భగవంతుని కుపకారము చేసితిననియు నూహించుకొనుట బొత్తిగపొరబాటు. మొదటివిషయమేమనగా పైన చెప్పినట్లు భగవంతునికి సేవ చేయుటయే అసంభవము. వారు జీవులకుపకారము చేయునిమిత్తమై వారివలన సేవతీసికొనుటకై తమకు సేవ కావలసినట్లుగ కనపరతురు. అనగా శరీరధారణము చేయుదురు. అప్పుడే సేవ చేయుటకవకాశము గలుగగలదు. భగవంతుడు మనవలె శరీరమునుధరించి తనకు మన ఆవశ్యకతలవంటి ఆవశ్యకతలను పుట్టించుకొని సేవా సావకాశము కలుగజేయుట భగవంతుడు జీవుల కుపకారము చేయుటయే కాని జీవుడు వారికుపకారము చేసినట్లు కానేరదు.

## 15

సద్గురువు ఉపయోగించినవస్తువులనుగుఱించియు, ఆత్మయొక్క ఐదు అంగములను గుఱించియు.

సంత్ సద్గురువు ఉపయోగించిన మంచము వగైరా వస్తువులలో సద్గురువుయొక్క చైతన్యాధార తప్పక వచ్చునుకాని ఆధార కొంతవఱకుమాత్రమే అట్టి వస్తువులలో ప్రవేశించును. అవి వానిశక్తికి తగినంతగ నాధారను తీసికొన్న పిదప వానిలో ఆధార మఱిప్రవేశించనేరదు. సద్గురువుయొక్క ఆజ్ఞ ననుసరిం

చియు, వారిఅనుమతితోను ఒకమానవుడు ప్రసాదమును, చరణామృతము తీసి కొన్నందువలన నతనికి పారమార్థికస్వాస్థ్యము అభివృద్ధియగును. అవ్విధమైన చేతనత పైన చెప్పినవస్తువులలో (వానిని సద్గురువు వేలకొలందిసంవత్సరము లుపయోగించినను కూడ) చేకుఱనేరదు. ఆవస్తువులమూలమున ఆత్మ కారోహణము గలుగనేరదు. వారిసమాధిపైన శిరస్సుపెట్టి దండప్రణామములుచేసినందువలన లాభములేదు. సద్గురు వట్లాజ్ఞాపించినపుడు దండప్రణామములు సమాధివద్దచేసినచో లాభముగలుగును. అచ్చట దండప్రణామములుచేయవద్దని యాజ్ఞఇచ్చినపు డెవరైననట్లుచేసినచో లాభమునకుబదులు నష్టముగలుగవచ్చును. అసలు విషయము సద్గురుని ఆజ్ఞాపరిపాలనము.

శీల, సంతోష, విరహ, జ్ఞానములు. ప్రేమయును, అను అయిదును ఆత్మకు అంగములు. ఈ ఆత్మ భగవంతునిసమ్ముఖముననున్నపుడుగూడ దానికి ఈ అయిదంగములును అట్లేయుండును. ఐతే అక్కడ విరహ మేలయుండునని ప్రశ్న రావచ్చును. దీనికి సమాధానమేమనగా, ఆత్మలో రతమైపోవుశక్తి ఒకటియు, నిరతమైపోగలుగుశక్తిమఱొకటియు గలవు. భగవంతునితత్త్వములోరతమై అనగా లీనమైపోయినపుడు అభేదభక్తియొక్క పరిస్థితి గలుగును. కావున ఆ ధామములో ఈ ఆత్మకు విరహపరిస్థితియున్నది.

## 16

### వివిధసత్సంగములలో నిజానిజములు తేల్చుకొనుట చాల అవసరమైన పని – ఉద్ధారమునకు కావలసిన షరతులు.

6 జూలై 1915 :– ఈకాలములో అనేకస్థలములలో సత్సంగనాయకు లున్నారు. ఈనాయకులందఱునుకలిసి ఒకసభచేసి వీనిలో నేసత్సంగము సరియైనదో తేల్చి జీవులకు మోసముగలుగకుండ చేయలేరా ? ఇది ఈనాయకుల యొక్క కర్తవ్యము. తేల్చవలసినవిషయములు రెండేయున్నవి. ఒకటి, సత్సంగములన్నియుగూడ నసత్యములేగావచ్చును, లేదా వీనిలో ఒక్కటి నిజమైన సత్సంగమును మిగిలినవి అసత్యమైనవియును కావచ్చును. ఈవిషయము నిర్ణయముచేయుటలో తోడ్పడినవారందఱిమీదను భగవంతుడు మహానుగ్రహము చూపెదరు. మనలోమన మీవిషయమును తేల్చుకొనకుండ నుండిపోయి భగ

వంతుడే కలుగజేసికొనవలసివచ్చినచో సత్సంగులందఱికి నొకపెద్దఆపత్తు వాటిల్ల గలదు. ఉదాహరణార్థము, ఒకయోడలో ప్రయాణముచేయువారిలో 8, 10 మందికి ఆయోడ నాశనమైపోవలసినంత చెడ్డకర్మలుండినచో ఆయోడలోనున్న మిగిలినవారికిగూడ వారంతటిదోషులు కాకపోయినను ఆపత్తుగలుగును. వీరు పడవలలోను బల్లకట్లమీదను ఎక్కి ప్రయాణముచేసి చివరకెట్లైనను ఒడ్డునజేర గలిగి ప్రాణము కాపాడుకొందురనుకొనుడు, అయిననుగూడ వారికిని కష్టము కలిగినదనుటలో సందేహములేదు. ఏలననగా వారు గాలియొక్కయు, సముద్ర తరంగములయొక్కయు దెబ్బలు తిని మునిగిపోగలప్రమాదమును సహించవలసి యుండెను.

ఉద్ధారముజరుగుట కీ క్రింది మూడుషరతులును పూర్తి కావలసియున్నది.

1. భగవంతు డిచ్చటికివచ్చి విరాజిల్లియుండవలెను.

2. ఉద్ధారముచేయుటకై భగవదిచ్ఛ యుండవలెను.

3. మనకు ఉద్ధారముపొందవలెననుకోర్కె యుండవలెను.

ఈ మూడింటిలోను ఏషరతు పూర్తి కాకపోయినను ఉద్ధారకార్యక్ర మము సాగనేరదు.

## 17

### సద్గురుదర్శనముయొక్క పరిభావము.

7 జూలై 1915 :- దర్శనమిచ్చుటకును, దర్శనము చేసుకొనుటకును వ్యత్యాసముగలదు. మనస్సుయొక్కస్థానము హృదయము. అచ్చటనే మనో ఆకాశ మున్నది. మనము చూచెడివస్తువులఛాయలు మనోఆకాశముమీద పడును. ఆఛాయలతోపాటు భావనలకుగలసంపర్కముమూలమున (Association of Ideas) కొన్నిభావములఛాయలుగూడ నచ్చట పడును. మనకు గురుస్వరూపముయొక్క దర్శన మైనపు డాదర్శనము మనోఆకాశముమీద లభించును. అప్పుడు భావనలయొక్కసంసర్గహేతువుచే కొంతఆనందముగూడ గలుగును. కాని ఇది అసలైనదర్శనముగాదు. భగవంతుడు దర్శనమిచ్చినపుడు వారు చిదాకాశముమీదికి అనగా, ఆజ్ఞచక్రములోనికి దిగివచ్చి మనను అచ్చట కాకర్షించి దర్శనమిత్తురు. అదే నిజమైనదర్శనము. మనోఆకాశము

మీదగాని స్వప్నములోగాని దర్శనమిచ్చినపుడు గురుస్వరూపముతోపాటు ఇతరస్వరూపములు, పదార్థములయొక్క ఛాయలుగూడ కనబడుచుండును. అసలు దర్శనమైనపుడు ఒక్క గురుస్వరూపముమాత్రమే మహాదేదీప్యమాన ప్రకాశముతో దర్శనమగును అపుడు శరీరమంతయు కంపించిపోవును. ఋతుపవనములు వచ్చునపుడవి యెంతతీవ్రముగవచ్చునో చూడుడు. భూకంపము వచ్చినపు డది యెంతఅట్టహాసముతో వచ్చునో చూడుడు. ఐతే వానివలనగలిగెడి ప్రభావములో వ్యత్యాసముండును. ఎట్లనగా, ఒకమనిషి రాత్రివేళ నిద్రపోవుచునుండగా భూకంపమువచ్చె ననుకొనుడు. మఱొకరు మఱునాడుదయమున నతనిని క్రితమురాత్రి భూకంపమువచ్చినది నీకు తెలుసునా యని అడిగినచో అతడు అదితలచుకొని భయపడును. కాని అది ఒకవిషయము. నిజముగ భూకంపమువచ్చినపుడు అతడు మెళుకువగనుండి దానియనుభవముపొందుట మఱొకవిషయము. భగవంతుడు దేదీప్యమానప్రకాశముతో దర్శనమిచ్చినపుడు జ్ఞానతంతువ్యూహముతో (Nervous system) సహితముగ సమస్త శరీరమును ఆదర్శనముచే ప్రభావితమైపోవును.

## 18

## స్మరణ ధ్యానభజనలు చేయుటలో గలుగు విఘ్నములను జయించుట.

8 జూలై 1915 :—శబ్దముగాని రూపముగాని ప్రకటమగుట బహుదూర విషయము. వానిని పొందుటకు అధికారము అనగా అర్హత సంపాదించుకొనగలిగినచో అదియే గొప్పవిషయము. లోకములో మఱేవస్తువునందుగాని భోగమునందుగాని దానికి సరిపడెడి ఆనందము లభ్యముకానేరదు. శబ్దముగాని, రూపముగాని ప్రకటమగుట మనస్వాధీనములోనున్నపని గాదు. అది భగవంతుని ప్రత్యేకవరదానము. మనము అందులకై కనిపెట్టుకొనియుండుటమాత్రమే చేయగలము. అయితే మనలో ఆశబ్దరూపములు ప్రకటమగుట కవసరమైన అధికారమును అనగా అర్హతను పుట్టించుకొనుటకై మనము ప్రయత్నము చేయవలసియున్నది. మనస్సు చాల మఱుపుస్వభావముగలదియును, జ్ఞానహీనమైనదియును. అది యేపనినైన నేయుద్దేశ్యముతో ప్రారంభించునో ఆయుద్దేశ్యము ఆపనిపూర్తియగువఱకు దానికి అట్లే నిల్చియుండదు. కొద్దిక్షణముల తరువాత మఱొకఆలోచనలప్రవాహము (అది అందుకు సంబంధించినదే అయి

నను కావచ్చును) బయలుదేరును. ఎట్లనగా ఎవనికైనను బట్టకుట్టుకొనవలెనని ఆలోచన లేక కోరికపుట్టె ననుకొనుడు. సరే, అతడు ఒకసూదిని, ఒకకత్తెరను బట్టను తీసుకొని ఒకచోట కూర్చుండును. అపుడతనికి ఆబట్ట కత్తిరించుటను గుఱించియు, దానినాణ్యమును కనిపెట్టుటనుగుఱించియు ఆలోచనలుబయలు దేరి అదేసందర్భములో ఆబట్టకట్టుకొనువాడు ఎవ్విధముగనుండును, అతని కెట్టి బట్ట ఇష్టముగనుండును మున్నగుఆలోచనలుగూడ వరుసగ నతనిలోనికి వచ్చు చుండును. చెప్పవచ్చినదేమనగా బట్టకుట్టుదమనెడి మొదటిఆలోచన నతడు పూర్తిగ మఱచిపోయెను. అట్లే ఒకమనిషి స్మరణధ్యానములకై కూర్చొన్న పుడు మొట్టమొదట నతడు నిస్సందేహముగ స్మరణధ్యానములు చేసికొనవలయు ననునుద్దేశ్యముతోనే కూర్చుండును. కాని వెనువెంటనే ఆతలంపు మఱచిపోయి అతనిమనస్సు ఇతర ఆలోచనలలో పడిపోవును. అయితే ఆ ఆలోచనలు ప్రాపంచికవిషయములకు సంబంధించినవి కావచ్చును లేదా పరమార్థమునకు సంబంధించినవేమైనను అసంగతవిషయములనుగుఱించి కావచ్చును; ఉదాహార ణకు, సత్సంగము, సత్సంగులయొక్క పరిస్థితులు మున్నగువిషయములనుగూర్చి ఆలోచించుట మొదలిడవచ్చును. అపుడు వానిని కట్టిపెట్టవలెను. దీనికి పద్ధతి యేమనగా ఒక్కొక్కనిమిషమునకుగాని లేదా అర్ధనిమిషమునకొక్కసారిగాని మనస్సుతో "స్మరణధ్యానములు చేయుము." అని చెప్పుచు హెచ్చరించుచుండ వలెను. అట్లు నిరంతరము జ్ఞాపకముచేయుచుండుటవలన మనస్సు మఱేవైపున కును పోకుండ నిల్చియుండును అందువలన కొంతచిత్తవిక్షేపముగలిగి అభ్యాస మునకు తప్పక విఘ్నము గలుగుచుండును. కాని విఘ్నమును విఘ్నముతోనే కొట్టవలయును. మాటిమాటికి "స్మరణధ్యానములుచేయు"మని మనస్సుతో చెప్పుచుండినయెడల ఆమాట చెప్పిన క్షణమునుండియు తిరిగి పనిప్రారంభమగుచుం డును. ఇట్లు తిరిగి తిరిగి ప్రారంభించుచు, తిరిగి తిరిగి అభ్యాసవిఘ్నముగలుగుచు నుండగా కొన్నిరోజులకు ఒక్కక్షణమునకుబదులుగా రెండుక్షణములసేపును, అటుపిమ్మట అంతకన్న నెక్కువకాలమును నిర్మలమైన అభ్యాసము సాగు చుండును.

భజననుగుఱించికూడ నీవిధముగ సెలవిచ్చిరి. భజనలోకూర్చుండిన తోడనే మొట్టమొదట నేశబ్దమైనను వినబడనారంభించినచో దానిని వినకుం డగ ఆపుచేయవలెను. ఏలననగా, అది నాడులయొక్కధ్వని కాని వాయువు

యొక్క ధ్వని కాని కావచ్చును. అట్టిధ్వని నిర్ణీతస్థానమువద్ద ఒకటిరెండు క్షణముల కన్న నెక్కువసేపు ఉండనేరదు. ఆనిర్ణీతబిందువువద్ద ఆధ్వని నిలబడియున్నచో అనగా నిరంతరము నష్టే యగుచు సరియైనవైపునుండివచ్చుచున్నచో ఆశబ్దము మంచిదే. దానిని వినవచ్చును. భజనలోగూడ మనస్సు సరియైనబిందువువద్ద నుండి తప్పిపోయి మఱొకవైపునకు తిరిగిపోవుచుండును. కావున భజనచేయు నపుడుగూడ కొద్దికొద్దిసేపటి కొక్కొక్కసారి సరియైనబిందువువైపునకు శ్రద్ధను త్రిప్పుకొని అచ్చటనేయుండి శబ్దమునువినుచుంటినా లేక ఆబిందువునువిడచి మఱొకచోటికిమాఱిపోయి అచ్చటవినుచుంటినాయని పరిశీలించుకొనుచుండ వలయును. ఈపైన చెప్పినవిధముగ స్మరణధ్యానభజనాభ్యాసములను చేయుచుం డినచో కొన్నాళ్ళకు మనస్సుయొక్కలక్షణము సరియైనపద్ధతిలోనికి మాఱి పోవును.

మనస్సుయొక్క వికారములగుఱించి పరిజ్ఞానము సంపూర్ణముగనుండి, ఆవికారములను పోగొట్టుకొనుటకై కోరికగూడ తీవ్రముగనున్నయెడల, నటు పిమ్మట మనస్సునుజయించుట కింకొక్కటే మెట్టు దాటవలసియుండును అని సెలవిచ్చి, దానిని బోధపఱచుటకై ఒకఉదాహరణ జెప్పిరి. ఇద్దఱుమనుష్యులు కఱ్ఱసాము చేయుచుండిరనుకొనుడు. ఆట మొదలుపెట్టినపుడు ఒకరికొకరు దూరముదూరముగనే యుండి కఱ్ఱలుత్రిప్పుచు, మెల్ల మెల్లగ దగ్గఱకువచ్చుచు ఒకరికఱ్ఱను మఱొకరుకొట్టి దూరముగ పోవుచుందురు. అప్పటిలో వారిరువు రిలో నెవ్వరికిగూడ రెండవవానినికొట్టవలెనని యుద్దేశ్యములేదని వారికి తెలి యును. కొంతసేపైనపిదప అత్యావేశముతో పోటీజరుగుచున్నపుడు ఇరువురును ఒకరిపైన నొకరు తీవ్రముగ కఱ్ఱలుత్రిప్పుట ప్రారంభమైనపిదప నిరువురును పూర్తిగ తులతూగునట్టి తీవ్రతతో పోరాడుచుండెడిసమయము వచ్చును. ఇరు వురును సరిసమానముగ పోరాటము సలుపుచుందురు. సమానపరిస్థితిలోనుండగ ఇరువురిలో నెవరికైనను జయము ఒకతలవెంట్రుకవాసిలో గలుగవచ్చును. ఏలననగా, సమానతీవ్రమైన ఆపరిస్థితిలో నెవరైనను ఒక్కపేటుతో రెండవ వానిని ఓడింపజేయవచ్చును. మనస్సును ఓడించి దానిపైన విజయముపొందు విధముగూడ నిట్టిదేయని తెలిసికొనవలెను.

కొందఱు తమకు అభ్యాసముచేయువిధానము తెలిసిపోయినది గనుక పనిఅంతయు పూర్తియైపోయినదని అనుకొనుచుందురు. అదియెట్లుండుననగా

ఒకపక్షి తనముక్కున నొకకాగితపుముక్కను పట్టుకొని, అదియే ఒకతినుబండారమని యనుకొని సంతోషముగ నెత్తుకొనిపోయి దూరముగ నొకచోట క్రింద పెట్టుకొనిచూడగా, అది ఉత్తపంచదార, నెయ్యిమైదాలకు పాళ్ళు తెల్పెడి జాబితామాత్రమే యని తెలిసికొన్నట్లే యుండును. దాని కేమియు నందువలన పనిసాగ నేరదు. ఆవస్తువులెవ్వియు దానికి దొరకలేదు. ఉత్తజాబితా ఒక్కటి మాత్రమే చూచుకొనుట జరిగినది. అట్లే నీరుత్రాగుటకును, నీరుసంపాదించుకొనుటకును వ్యత్యాసము చాలగలదు. ఒక చేత్రాడును బాల్చీని సంపాదించుకొని ఆచేత్రాడుతో బాల్చీనికట్టి నూతిలోదింపి నీరుపైకితీసికొనువఱకును నీరెట్లులభించగలదు ?

ఏమనిషియొక్క ప్రవర్తననుగుఱించిఖైనను తెలిసికొనగోరినచో, ఇతర విషయములట్లుండగా అతడెట్టిసహవాసములో తిరుగుచున్నాడ నెడివిషయమును కనిపెట్టవలెను. ఉదాహరణకై కుట్టుపనివాడొకడుండినచో అతనియింట బట్టలు కుట్టుకొనునిమిత్తము సూది, కత్తెర, ఒకసూయింగ్ మెషీనున్ను (sewing machine) ఉండును. అట్లే ఒకసత్సంగియున్నచోట కొన్నిపవిత్రగ్రంథములు, సద్గురువుఫొటోఒకటి, ఒక "బైరాగిన్" దండము వగైరాలుండును. అయితే, అతడు ఆడంబరముగలవాడైనచో ఒకబైరాగిన్ దండమునకుబదులు ఆఱుబైరాగిన్ దండములు పెట్టుకొని ఫొటోలు ప్రత్యేకముగ ఒకరమ్యమైనవిధమున ఏర్పాటు జేసుకొనును. నిజమైనభక్తజను లట్లుచేయరు.

## 19

### సత్సంగములోజరిగెడి యేర్పాట్లవలన లాభము.

9 జూలై 1915 :— ఒకసత్సంగి దయాల్ భండార్ లో ఒకరకమైనపప్పు అనగా పెసరపప్పుమాత్రమే వండుచున్నారనియు మినప్పప్పు లేక కందిపప్పుఐనను గూడ చేయుటలేదనియు చెప్పుకొనెను. అంతటహుజూర్ వారు దయాల్ భండారులోనిభోజనము ఇష్టములేనివారు వేఱేభోజన మేర్పాటుచేసికొనవచ్చునని సెలవిచ్చిరి. నోటిరుచికై యెక్కువఆశపెట్టుకొనుట మంచిదిగాదు. ఆహారపానీయములలో రుచినిప్రధానముగ చేసికొన్నవారికి కామాంగము తప్పక ప్రబలమైపోవును. అనగా మంచిభోజనము తినవద్దని మంచిబట్టలుకట్టుకొనవద్దనియు నా అభిప్రాయముగాదు. ముఖమల్ కోటు లభించినపుడు తొడుగుకొనవచ్చును.

కాని దానికొఱకై యెక్కువకోరిక పెట్టుకొనగూడదు. రాధాస్వామిదయాళు రున్నారనియొప్పుకొనినపుడు ఆహారపానీయములు, గృహవసతులు, మూత్రపురీషవిసర్జనము మున్నగువిషయములనుగుఱించి సత్సంగములోచేయబడు నేర్పాట్లన్నియు గొప్పసదుద్దేశ్యముగలవై లాభదాయకముగనే యుండితీరును. కాని ఆలాభము మనకంటికి గనుపడదు. అందుచే మనము దానివిలువను తెలిసికొనలేకున్నాము. ఈయేర్పాట్లమూలమున మనకెన్ని ఆపత్తులు, కష్టములును రాకుండ సంరక్షణజరుగుచున్నదో మనకు అవగాహనలేదు. ఎవరైనను ఒక గ్రుక్కెడు చల్లనిపానీయమును మనకు త్రాగుటకై ఇచ్చినచో లేదా జబ్బుగనున్నపుడు మందిచ్చి జబ్బుతగ్గించినచో మనము ఎంతయు కృతజ్ఞత చూపించుచుందుము. కాని అసలు జబ్బులేకుండగనే దాహముకూడలేకుండగనే యుండులాగున నేర్పాట్లుచేసినచో దానివిలువ మనము తెలిసికొనము. కొందఱు తమ శరీరమనస్సులను సరిచేసుకొనునిమిత్త మవసరమైనవిధముగనే బలాత్కారముగనైన తమచే ప్రవర్తించునట్లుగ చేయవలయునని సంతోషముగ కోరుకొనుచుందురు అట్టివారికే సత్సంగభండార్ వద్దరా యేర్పాట్లు ఇష్టముగనుండును. వారేవానివలన లాభమునుగూడ పొందుదురు. కొంతభూమి సంపాదించి, అందులో సత్సంగిస్త్రీపురుషులు కలిసి కష్టపడిపనిచేసినచో, వారు బాగుగ అలిసిపోయి సుఖముగ నిద్రపోగలరని హుజూరుసర్కార్ సాహబ్ వారు సెలవిచ్చిరి. ఇచ్చట పర్వతములమీదతిరుగుటకూడ పొలములలో పనిచేయుటతో సమానమే.

## 20

సాధువునకును, భగవంతునికిని పోలికలు.

11 జూలై 1915 :—

> సాధ్ మిలే సాహబ్ మిలే, అంతర్ రహీ న రేఖ్ ।
> మనసా వాచా కర్మణా, సాధూ సాహబ్ ఏక్ ॥

అర్థము :—సాధువులభించినచో ఆపరమపురుషుడే లభించెను. వారిరువురిలో వ్యత్యాస మేమియులేదు. సాధువు భగవంతుడును మనోవాక్కాయకర్మలచే పూర్తిగ నొకరే.

ఈద్విపదలో సాధువునకును, భగవంతునికిని ఐక్యము చెప్పబడినది. ఎవరైనను భగవంతునిగుర్తుపట్టగలిగినచో సాధువునుగూడ గుర్తుపట్టగలరు. సాధువును తెలిసికొన్నవానికి భగవంతుడుగూడ గోచరమగును.

భగవంతుడు సర్వవ్యాపకుడును, సర్వసమర్థుడు ననియే అందఱును చెప్పుచున్నను లోకములో భగవంతునిగుఱించి యెన్నిభిన్నాభిప్రాయములు అపోహలును గలవో అన్ని మఱిదేనినిగుఱించికూడ లేవు. ఈభూమినిగుఱించి కూడ గుండ్రముగనున్నదనియు, చపటాగానున్నదనియు లేక నిట్రముగనున్నదనియు, నిట్లు పదిపండ్రెండుభిన్నాభిప్రాయము లుండవచ్చును. కాని భగవంతునిగుఱించి చాలమంది భగవంతుడసలేలేడనిగూడ చెప్పుచుందురు. భగవంతునిగుఱించి వేలకొలంది వివిధాభిప్రాయములున్నట్లే సాధువునుగుఱించిగూడ వివిధాభిప్రాయములు గలవు. ఉదాహరణకై హిందువులలోను, జైనులలోను, మహమ్మదీయులలోను క్రైస్తవులలోను చూడుడు.

మానవునిమనస్సునకు శక్తిని పూజించుట సహజలక్షణము. లోకులు శ్రీరామచంద్రుని పూజించుటకు కారణము ఆయన లంకను జయించెననియే; శ్రీకృష్ణునిపూజించుటకు అతడు మహాభారతయుద్ధమునుచేయించుటయు, రాక్షసులనుచంపుటయే కారణము. హనుమంతునికి ఆధ్యాత్మికముగ నెట్టిగొప్పతనము లేకపోయినను లక్షలకొలదిజను లతనిని బలవంతుడనుహేతువుచే పూజించుచున్నారు. సాధువులను అన్వేషించుటలోకూడ లోకులకు ఇట్టిభావములే యున్నవి. చేతులుశుష్కింపచేసికొన్నవారికిని, పెద్దపెద్దగోళ్లు పెంచుకొన్న వారికిని, మేకులమీదపరుండువారికిని లేక ఇటువంటి అసాధారణశక్తులను ప్రకటించువారికినే లోకములో అందఱు నెక్కువమహిమయున్నట్లు మెచ్చుకొనుచుందురు. సత్సంగులలోగూడ ఇట్టిఅపభ్రమయే యున్నది. తనయధికారము చూపించి యితరులను ఎవడు బెదిరించగలడో అతడే సాధువుగ నెంచబడుచున్నాడు. ఏదైననొకసమయములో సంతులు ఒకవిషయము నంగీకరించినచో సంతుల కావిషయము ఇష్టమని అనుకొనుచుందురు. భగవంతుని కెట్లు దేనియందును అనురాగముకాని ద్వేషముకాని లేదో సాధుసంతులపరిస్థితిగూడ నిజముగ నట్లేయుండును. భగవంతుడు తన ఆదిదివ్యేచ్ఛప్రకారమే నిశ్శబ్దముగను గంభీరముగను సమస్తకార్యముల నెట్లు నెఱవేర్చుకొనుచున్నాడో అట్లే సాధుసంతులుగూడ కార్యములన్నియు చేయుచుందురు. సత్సంగు లీవిషయము

లను మనస్సునబెట్టుకొన్నచో వారు పూర్వకాలములోచేసిన పొరపాట్లను ఇక ముందైనను తిరిగి చేయకుండ తప్పించుకొనగలరు.

## 21

### మృత్యుసమయమున సద్గురుభక్తివలన గలిగెడి లాభము.

11 జూలై 1915 :—అప్పుడప్పుడు కలలలో తనమెడ కెవరో త్రాడుకట్టి ఉరి వేయుచున్నట్లును, పాముకఱచినట్లును లేదా తన నెవరో తుపాకీతో కాల్చి నట్లును, ఆవిధముగ చనిపోయినట్లుగాని, చావుకుసిద్ధముగనున్నట్లుగాని కనిపిం చుచుండును. కలలలో నిట్టియనుభవములు గలుగుటకును జాగ్రదవస్థలో అట్టి అనుభవముగలుగుటకును వ్యత్యాస మంతయెక్కువగ నుండదు. మరణసమయ మందు పదార్థములతోను, మనుష్యులతోను వియోగముగలుగుటవలన బాధ గలుగుచుండును. కాని మరణభావన కలలలో గలిగినపుడు స్వప్నసమయములో దగ్గఱనున్నమనుష్యులు, పదార్థములనుండిమాత్రమే వియోగబాధ గలుగును. జాగ్రదవస్థలో మృత్యుబాధ వచ్చినపుడు మరణించువానిబంధనము ఏయేమను ష్యులు పదార్థములతో నున్నదో (వారుదగ్గఱగనున్నను లేకపోయిననుగూడ) వారందఱితో వియోగముగలుగుచున్నట్లు బాధగలుగును. మరణమువచ్చు టకుముందు దైవకృపచే స్మృతిపోయినఅవస్థ గలిగినచో స్వప్నసమయములో వలెనే తక్కువమందిమనుష్యులు. తక్కువపదార్థములును మరణించువానికి జ్ఞాపకమువచ్చి వియోగకష్టముకూడ తక్కువగనుండును. అప్పుడు భగవత్కృప వలన ఒక్కసద్గురుస్వరూపముదప్ప మఱియేస్వరూపమును జ్ఞాపకముండనిచో ఆస్వరూపమువలన వియోగబాధ గలుగుటకు బదులుగా మహానందమే గలు గును. ఏలననగా, ఆ సమయము సద్గురుస్వరూపము ప్రత్యక్షముగ తోడుగనుం డెడి సమయము. ఈక్రింది ద్విపదలో నీవిషయమే చెప్పబడినది.

“జా మరనే సే జగ డరే మేరే మన ఆనంద్,
కబ్ మరిహౌ...కబ్ పాయిహౌ పూరన పరమానంద్ ॥”

అర్థము :—ఏమరణముపేరుచెప్పినచో లోకమంతయు బెదిరిపోవుచున్నదో నామనస్సున కది ఆనందదాయకమైనది. నే నెప్పుడు చనిపోవుదు నెప్పుడు ఆసం పూర్ణపరమానందమును పొందుదునా యనియే యెదురుచూచుచున్నాను.

సద్గురువు ఒకవేళ అసత్యపుగురువేఅయిననుకూడ అట్టివాని చరణములందాసక్తి యుండుటవలన మృత్యుసమయమునందు వియోగదుఃఖము ఆ ఒక్క స్వరూపముతోనే గలుగును. కావున నదిగూడ నొకసౌకర్యమే యగును. అట్లుగాక సద్గురువు వర్ణింపబడినంతమహిమ నిజముగగలవారే అయినయెడల మరణించువానికి గలిగెడి యానందమునకు మేరయేయుండదు. మఱియు నతనికి మరణానంతరము అతనియొక్క వాసనానుసారముగ నొకయుత్తమలోకములోనే నివాసము లభింపజేయబడును.

## 22

### పరమార్థములో ఆనందము సద్గురుభక్తిలో లోపమున్నచో గలుగదు.

ఈమతముయొక్క పరిపూర్ణానందపరిస్థితి జీవితకాలములోనే లభ్యమగుట చాలకఠినసాధ్యమేకాని, శోచనీయవిషయమేమనగా హృదయస్థానమునందెంతవఱకు ఆపరిస్థితిని అనుభవించుట కవకాశమున్నదో, ఆమాత్రముగూడ సత్సంగులు ఆపరిస్థితిని సంపాదించలేకున్నారు. సత్సంగుల ఉత్సాహరాహిత్యమునకు కారణమిదియే. అసలువిషయమేమనగా పరమార్థమనునది మనోఘట్టమును అతిక్రమించినవిషయము. ఏదైన గట్టిగ నాలోచించవలసినవిషయమునుగుఱించి ఒకరిని ప్రశ్నించినపుడు ఆసమయములో నతడు క్రికెట్టు (cricket) లేక ఫుట్‌బాల్ (foot ball) ఆటకాని ఆడుకొనుచును, లేక పరుగెత్తుచును లేక ఒకపర్వతముపై నెక్కుచునుగాని యుండినచో "కొంచెము ఆగుడు, కొద్దిగస్థిమితముగ కూర్చుండనిండు అప్పుడు నేను మీకు సమాధానము చెప్పెదను" అని చెప్పును. ఇందుకు కారణమేమనగా ఆసమయములో చంచలముగనున్నట్టిశరీరము స్థిమితపడునంతవఱకు నతని కాలోచించుట సాధ్యముగాదు. పారమార్థికమైనఆనందమైతే ఒక్కశరీరమేగాక మనస్సుగూడ నిశ్చలమైపోయిననేగాని లభ్యముగాదు. మనస్సును నిశ్చలముగనుండుమని చెప్పినచో నది మఱింతయెక్కువగ గంతులువేయును. ఇదొకపెద్దకష్టము. మనస్సునకు నిశ్చలతగలుగుటకై సద్గురుస్వరూపమునందు ప్రీతి యవసరము. అట్టిప్రీతి భక్తి వలన జనించగలదు. కావున మనకు పారమార్థికానందము కలుగకపోవుటకు ముఖ్యకారణము మనము సద్గురువునకు భక్తిచేయకపోవుటయే.

## 23

### వ్యర్థాలోచనలను గుఱించి.

సోలన్ 26 జూలై 1915 :—జీవుని కీ ప్రపంచములోని యేయేజీవులతోను జడపదార్థములతోను పూర్వముగాని ప్రస్తుతముగాని సంబంధముగలుగునో వాని అన్నిటియొక్క నామములు రూపములును లెక్కకుమించినన్ని ఈతని మనస్సున స్థాపితమైయుండును. అతని కెక్కువప్రియమైనవిషయముల నతడు మనస్సులోనికి తిరిగి తిరిగి జ్ఞాపకము తెచ్చుకొనుచు వానిని గుఱించి ఆలోచనలు పుట్టించుకొనుచుండును. రాధాస్వామీదయాళురు "మానామమును, మారూపమును హృదయమున పెట్టుకొనుము, మిగతనామరూపములనన్నిటిని విడిచి పెట్టుము" అని ఆజ్ఞాపించిరి. ఇంతస్పష్టముగ ఆజ్ఞయున్నప్పటికిగూడ లౌకిక నామములు రూపములు యెవనికి మెళుకువగనున్నపుడు, నిదురపోవునపుడుగూడ మనస్సులో నెడ తెరిపిలేకుండ ప్రవహించుచుండునో అతనికి రాధాస్వామీనామమునందును, రూపమునందును గాఢమైనప్రేమ లేదని స్పష్టపడుచున్నది. లోకమునకుసంబంధించిన నామరూపము లొకవైపుననుండినచో రాధాస్వామీదయాళునినామరూపములు అందుకు ప్రతికూలమైనదిశనున్నవి. మనసున నేవైపున నెక్కువయభిమానముండునో ఆవైపునామరూపములు రెండవవైపునామరూపములను బయటకు త్రోసివేయును. అసంగతాలోచనలు మనసునపుట్టుటయే, రాధాస్వామీదయాళుని నామరూపములందు ప్రేమలేనట్లు ఋజువు చేయును. రోజురోజుజరిగెడివిషయములనుగుఱించి (అనగా లౌకికనామములు రూపములనుగుఱించి) వ్యర్థాలోచనలు మనసున నేలపుట్టవలెను ? ఇదియేమంత అల్పవిషయమా ? కడుశోచనీయమైనది.

## 24

### సత్ప్రవర్తననుగుఱించి సలహాలు.

సెప్టెంబరు 1915 :— హృదయపూర్వకముగ తన్నుతాను అందరికన్న తక్కువగను, నీచునిగను, తుచ్ఛునిగను ఎంచుకొనుచుండుట, సత్సంగియొక్క సత్ప్రవర్తనకు లక్షణమని చెప్పబడినది. అట్లుగాక నెవరైనను తనను తాను గురుముఖునిగ నెంచుకొన్నయెడల అట్టివాడు సత్సంగములో నందఱికన్న తానే

ఉత్తముడని మనసార భావించుకొనుచున్నట్లు స్పష్టపడును. అట్టివా డెన్నటికిని గురుముఖుడు కానేరడు. ఇందుకుదాహరణ గురుదాసు వగైరాలు.

2) సత్సంగికిని ప్రాపంచికజీవునకును ఎక్కువ తేడా లేకున్నను వారిరువురిలోను సూక్ష్మమైనవ్యత్యాస మొకటి గలదు. ప్రాపంచికజీవులు ధనమును ధనముకొరకే ప్రేమింతురు. కాని సత్సంగులు తమఅవసరములనిమిత్తమే ధనమును కోరెదరు.

3) ప్రసాదమును ఉత్తమిఠాయిగా రుచికొఱకై తిన్నపుడు దానివలన లాభము గలుగనేరదు. అట్లుగాక అదితిన్నందువలన భగవంతుడు తనకుపకారము చేయుననుభావముతోను, తనకు పారమార్థికలాభము కలుగజేయుమని భగవంతుని ప్రార్థించుచును తినినయెడలనే అది తప్పక లాభము కలుగజేయును. భండారాలలో తిష్ఠ వేసుకొని కూర్చుండి పొట్టనింపుటయే ప్రధానముగనెంచుకొని తినినచో పారమార్థికలాభ మేమియులేదు. అట్లుగాక "ఓభగవంతుడా ఇది నీవుచేయునట్టిభండారా. నాకు పారమార్థికలాభము కలుగజేయుము" అని ప్రార్థనచేయుచు భావముతోతిన్నయెడల దానిప్రభావము వేఱుగనుండును.

4) ఎవరైనను స్కూలుకొఱకు తాను నెలకు అయిదురూపాయలర్పించుచుంటినని ఆలోచించుకొనగూడదు. అట్లాలోచించుట భగవంతుని. కూడా అసహ్యముగనే యుండును. ఎవరెవరు ఏభావముతో లేక ఎంతప్రేమతో నిచ్చుచున్నారో భగవంతుడు కనిపెట్టుచుండును. ఫలానాసత్సంగికన్న తానెక్కువ ఇవ్వవలెననిగాని తానెక్కువ భేంటిచ్చుచున్నట్లు సాహబ్జీమహారాజు వారికిగూడ తెలియవలెననికాని భావము గలిగియుండుట నీచత్వము.

5) ఎవనియందును మనసున ఈర్ష్య పుట్టకుండ చూచుకొనవలెను.

6) మనస్సునకు రెండు అవగుణములున్నవి నిద్దురపోవుటయు, పరుగులెట్టుటయు. ఈరెండుఅవగుణములనుండియు తప్పించుకొనవలెను.

## 25

### స్మరణాభ్యాసము.

దసరా, అక్టోబరు 1915 :—చూచుట కంటియొక్కలక్షణము. ఏలననగా కంటిలో అగ్నితత్వమున్నది. ఏమనిషియు తనచెవితో చూడలేడు, అటులనే

కంటితో వినలేడు. ఏలననగా వినునట్టిపని చేయు ఆకాశతత్త్వము చెవిలోనున్నది. మామూలుగనైతే శరీరమంతలోను అన్నితత్త్వములును వ్యాపించియున్నవి. కాని ఒక్కొక్కతత్త్వమునకు ఒక్కొక్కస్థలము ప్రత్యేకముగ నిర్ణీతమైయున్నది. అందుచే ఆపని ఆప్రత్యేకఇంద్రియమువలననే చేయుటకు సాధ్యమగును. అటులనే స్మరణ, ధ్యాన భజనలు ఆత్మస్థానమునుండియే చేయుటకు సాధ్యమైనవి. హృదయస్థానమునుండికాని, అనగా ఆలోచనచేయువిధముగాగాని, కంఠస్థానమునుండికాని అనగా నోటితో ఉచ్చరించిగాని, అభ్యాసము చేసినచో చెవితో చూచుటకు ప్రయత్నించినట్లుండును. వెయ్యేండ్లు అట్లు చేయుచు గడిపినను ఏమియుపని సాగదు. కావున ఆత్మస్థానమువద్ద ఆత్మజిహ్వతోనే అభ్యాసముచేయవలెనుగాని మఱొకవిధముగా చేయుట నిష్ఫలము.

## 26

### మానవుని లోపములు, క్షమార్పణ వేడుకొనుటయు.

25 డిశంబరు 1915 :—మానవుడు చేసెడి తప్పిదములకు లెక్కయే లేదు. ఎంతవఱకని అతడు క్షమార్పణ వేడుకొనగలడు? అన్నిటికన్న మొట్టమొదటి తప్పిదము అతడు భగవంతునివైపునుండి విముఖుడై మనోవికారములలో అత్యావేశముతో వర్తించుటయే. ఇదియే భగవంతునికి మనముచేసెడి మహాపరాధము. సత్సంగమునకువచ్చి నిదురపోవుటయు, అభ్యాససమయములో వ్యర్థాలోచనలలోపడిపోవుటయుగూడ నిందులోనే లెక్కకువచ్చును. ఐతే భగవంతుడు కేవలము దయాళువు. ఎవరైనను తప్పులుజేసినను, దానితోపాటు అతడు లోపల దీనత్వము గలిగియుండి క్షమార్పణకొఱకై ప్రార్థనచేయుచుండినచో అతని తప్పులన్నియు క్షమించబడిపోవును. అట్లుగాక అతడు చాతుర్యము చూపించినచో మహాదండనకు పాత్రుడగును.

## 27

### దివ్యేచ్ఛ.

26 డిశంబరు 1915 :- ఆంగ్లేయులు సత్సంగములో నెందుకు జేరుట లేదు? ఫలానా పెద్దపెద్దవ్యక్తులు సత్సంగమున కెందుకు వచ్చుటలేదు? లేదా వచ్చిచేరినను ఎందుకు వెళ్ళిపోయిరి?

అది భగవదిచ్ఛ.

"స్వామీ దయాళ్ మహరాజ్ ఐసీ ధారీ।
దీన హోయ తిస లే హైఁ ఉబారీ॥

అర్థము :—దయాళులైన ప్రభువు దీనులైనవారినే ఉద్ధరించులాగున దివ్యేచ్ఛ ధరించిరి.

## 28

సంతులు సజీవులుగనున్నపుడే వారిమహిమను తెలిసికొని లాభము నొందవలెను.

జడపదార్థముయొక్క వివిధావస్థలయిన పృథ్వి, జలము, అగ్ని, వాయువు, ఆకాశములలో పరస్పరము వ్యత్యాసము ఎంతయెక్కువగనున్నదో చూడుడు. ఒకతత్వమునుమాత్రమే చూచినందువలన మిగిలినతత్వములను గుఱించి ఊహించనైన ఊహించలేము. దీనినిబట్టిచూడగా జడచేతనముల మధ్యన నెంతవ్యత్యాసముండవలయును ? మఱియు సత్లే సంత్ సద్గురువుయొక్క శరీరము మనస్సు ఆత్మలకును, సామాన్యజీవుల శరీరము. మనస్సు ఆత్మలకును వ్యత్యాసమెంతయుండునో ఎవరైన నూహించగలరా ? అట్లుండగా సంత్ సద్గురువునకును, సంత్ సద్గురువుయొక్క బంధుమిత్రులు లేక ఇరుగుపొరుగు వారికిని తేడా 20 : 19 నిష్పత్తిలో నుండుననని యూహించుట యెంతమహా మూర్ఖత. ప్రతి సంత్ సద్గురువుయొక్క మహిమను వారు గతించిపోయినపిమ్మటనే గాని తెలిసికొనలేకపోవుట బహుశోచనీయము. ఈవిషయమునే స్వామీజీ మహారాజువారుగూడ నీక్రిందివిధముగ సెలవిచ్చిరి :—

"బారహ్‌మాస్ బఖాన పుకారే
కహ కహ కర్ అబ్ హమ్ భీ హారే॥

అర్థము :—"బారహమాస"[1] చెప్పిచెప్పి మేముగూడ నిప్పుడలసిపోయితిమి. ఇదేవిధముగ హుజూర్‌మహారాజ్‌వారు స్వామీజీమహారాజ్‌వారి

---

1 బారహమాస అనగా ప్రతిపదార్థము పండ్రెండు మాసములు హిందీలో ఒకకవితా రచనను ఈనామమునుతో పేర్కొందురు. హుజూర్ స్వామిజీమహరాజ్‌వారు సారబచన్‌అను పద్య గ్రంథములో బారహమాస అను ఒకకవిత్వముగూడ రచించిరి ఈపైపంక్తు లాకవిత్వము లోనివి.

సిగుఱించియు, మహారాజ్ సాహబ్ వారు హుజూర్ మహారాజ్ వారినిగుఱించియు, సర్కార్ సాహబ్ వారు మహారాజ్ సాహబ్ వారినిగుఱించియు, సర్కార్ సాహబ్ వారినిగుఱించి ప్రేమసందేశములో మొట్టమొదటిభాగములోను "వారి మహిమను వారి జీవితకాలములోనే తెలిసికొని వారు ఉపదేశించిన సాధనలను అందఱును అభ్యాసముచేయుచుండవలయు"నని చెప్పిరి.

ఏజీవుని హృదయములోనైనను తన ఆధిక్యతను గుఱించి (self importance) ఆలోచనలు ఏనాడు తలఎత్తునో, ఆరోజుననే అతడు చేజారి పోయినట్లు తెలిసికొనవలయును. ఇక నతనిని కాపాడుట కష్టతరమే. అతని అహంకారము అతనిని నాశనముచేసివేయును.

## 29

అభ్యాసము సాగకపోవుటకు కారణములు –

రాధాస్వామీమతము సజీవమైనమతము –

అంబాలా 13 మార్చి 1916 :-అభ్యాసము చేసికొనగలమని ఆశపడియే అందఱు నీమతములో చేరిరికాని, సత్సంగులందఱును ఆవిషయములోనే బాధ పడుచున్నారు, అనగా సామాన్యముగ సత్సంగులందఱును తమకభ్యాసము సాగుటలేదనియు, లేదా అభ్యాసములో ఆనందము కలుగుటలేదనియు ఫిర్యాదు చేయుచున్నారు. దీనికి కారణమేమనగా వారు నేర్చుకొన్నసాధనను వారు తగినవిధముగ నభ్యసించుటలేదు. టెన్నిస్ (Tennis) ఆట ఆడెడిస్కూలు పిల్లలలో నొకడు అట్లు ఆడుచున్నదెందుకనగా, డాక్టర్లు వ్యాయామము బాగుగ చేసినయెడల నారోగ్యము వృద్ధియగునని చెప్పిరికావున ఆడుచున్నాడు. మఱొకడు టెన్నిస్ ఆడుచున్నదెందుకనగా, ఆసమయములో స్కూలుపిల్లలు ఆటలాడవలసినదని విధించబడియున్నది కావున నాడుచున్నాడు. మూడవవాడింకొకడు తన కాయాట సరదాగ నుండుటవలన ఆడుచున్నాడు. మొదటివాడు ఉత్తడాక్టర్ల సలహావలన టెన్నిస్ ఆడుచున్నాడు! కనుక వాడు ఆటఆడుచున్నను తనశరీరము కండపెట్టుచున్నదా లేదా యనియే యెప్పుడు చూచుకొనుచుండును. అందుచే అతనికి ఆఆటవలన కలుగవలసినంత ఆనందము గలుగనేరదు. అటులనే స్కూలులోని ఉత్తరువు మన్నించునిమిత్తమై ఆటఆడుచుండిన

స్కూలుపిల్లవానికిగూడ ఆటలో ఆనందము గలుగదు. ఆ ఆటయొక్క సంపూర్ణమైన ఆనందము, దానియందుత్సాహముండుటచే నాడునట్టి మూడవవానికే గలుగును. అభ్యాసముయొక్క పరిస్థితిగూడ నిట్టిదే. ఒకనియమితకర్తవ్యము క్రిందనే భావించుకొని చేసినచో అది రసహీనముగనే అనిపించును.

ఆతరువాత హుజూరువారు ఒకదృష్టాంతమును చెప్పిరి. ఒక బీదవాడుండెను. రాత్రిళ్ళు అతడు ఒక గుడిసెలో నేలమీద నిద్రపోవుచుండెడివాడు. అతడు మంచములేక కష్టపడుచున్నాడని మఱొకపెద్దమనిషి చూచి జాలిపడి, మంచముమీద నతడు సుఖముగ నిద్రపోవచ్చుననునుద్దేశ్యముతో, నతనికి మఱునాడొకమంచమును పంపెను. కాని ఆపేదవాడు మంచమును గుడిసెలోపల జాగ్రత్తపెట్టి తానుమాత్రము యథాప్రకారము బయట నేలమీదనే పరుండెను. దానికి పర్యవసానముగా ఆపేదవాడు రాత్రిసమయములో నతనికి చలికొట్టినందున శరీరములో నొప్పులుబయలుదేరి, బాధపడెను. ఆధనికుడైతే ఈపేదవానిమీద జాలిపడి మంచముపంపించెను గాని అతడామంచమును సరిగా నుపయోగించుకొనలేదు.

రాధాస్వామీమతమునకును, మిగిలిన కబీర్‌సాహబ్‌వారు, గురునానక్‌వారు, మౌలానారూమ్‌గారు, మున్నగు సాధుసంతుల మతములకును తేడా ఏమనగా, అవన్నియు మృతప్రాయములుగను, రాధాస్వామీ మతము సజీవముగను నుండుటయే. మిగతి అభ్యాసవిధానము సేవజేయుటవగైరాలలో తేడా ఏమియు లేదు. రాధాస్వామీమతములో నుపదేశించబడిననామము ఉత్తమోత్తమమైన దనువిషయమైతే తప్పక నిజమేగాని, అది ఒకపెద్దవ్యత్యాసముగాదు. ఆవ్యత్యాసము యెక్కువ కాదనుటలో రాధాస్వామీనామముయొక్క సంపూర్ణమహిమ ఇప్పుడప్పుడే అనుభవములోనికిరాదనియు, ఆచిన్నచిన్ననామముల హద్దులనుదాటి పైకివెళ్ళినపిమ్మటనే బోధపడుననియుమాత్రమే మాయభిప్రాయము. అసలుతేడా ఏదనగా నిజధార తనకార్యము పూర్తిగనెఱవేరువరకు నీలోకములో దేహస్వరూపములో నిరంతరము నుండుననెడి రాధాస్వామీమతస్థులవిశ్వాసము. భగవంతుడు మనకందఱకు అట్టిస్వరూపముతో కలిసి తిరుగుటకు సావకాశముగలిగించుటయే ఒక మహాకటాక్షమును, ఒకమహావరదానమును.

# 30

## సద్గురువును గుర్తుపట్టుటకు చిహ్నాలు.

14 మార్చి 1916:—సద్గురువును గుర్తించుట చాలకఠినమేగాని, అసాధ్యముగాదు. 'సారబచన్' గద్యలో నీవిషయమై రెండు మూడు వచనములు గలవు. ఒకవచనములో సద్గురువుయొక్క నిజచిహ్నాలయితే వారు స్వయముగ ననుగ్రహించియిచ్చినదే యనిగూడ సెలవిచ్చిరి. సంత్ మతములో జేరువారు చాలమంది ఏదోయొకవాసనను లేక కోరికను (ఆవాసన మలినమైనది కావచ్చును కాకపోవచ్చును) పెట్టుకొని వచ్చుచుందురు. ఎట్లనగా ఒక్కొక్కడు తనకు సంతానము కలుగవలెననుకోరికతో సత్సంగములో చేరును. ఆకోరిక పూర్తి చేసికొనుటకై అతడు పెండ్లియాడి భార్య నింటికి తెచ్చుకొనును. కాని పిల్లవాడు పుట్టలేదనుకొనుడు అప్పు డతడు తన శరీరములో నొకదోష మున్నదని యూహించి వైద్యులచేతను, డాక్టర్ల చేతను వైద్యము చేయించుకొనును. అయినను అతని కోరిక పూర్తికానందున దేవాలయములలో దేవతాపూజలు చేయించును, భూతప్రేతములను పూజించును, సాధువులను, ఫకీర్లను ఆశ్రయించును. ఈకృత్యములన్నియు నతడు తనకు పిల్లవాడు కలుగవలెనను నుద్దేశ్యమొకటే పెట్టుకొని జరగించెను. కాని ఆయుద్దేశ్యము నెఱవేరలేదు. చివరికి, అతనికి రాధాస్వామిదయాళురు, ఈజగత్తంతకు అధిపతియైన పరమపురుషుడని యెవరివలననో చెవినిపడెను. అత డప్పుడు సత్సంగములోనికివచ్చి ఉపదేశము పొందగా భగవదిచ్ఛవలన అతనికి పిల్లవాడు కలుగును. దానితో నతడు మహానందభరితుడై గురువుగారిని సర్వసమర్థు లనియు, పరిపూర్ణ గురువనియు పొగడ నారంభించును. గురువుగారి మహిమ తనకు బోధపడినదని అతడనుకొనును. కాని ఇట్టిబోధ గణింపదగినదికాదు. అతని విశ్వాసము వృద్ధిచేయు నిమిత్తమై అతని కావాసన పూర్తి చేయబడినది. నాలుగు మాసములతరువాత నాపిల్లవాడు చనిపోయినచో నతడు తన ప్రారబ్ధమునైనను తప్పుపట్టుకొనును లేదా "కబీరువారు, గురునానక్ సాహబ్ వారలవంటి మహాత్ము లీకాలములో నేరి" అని అనవచ్చును. మఱొకడు సత్సంగములో జరిగెడి చర్చలు తనకు నచ్చుట చేతను, తనప్రశ్నలకును, ఆక్షేపణలకును లభించిన సమాధానములు నచ్చుట చేతను సత్సంగములో జేరును. కాని ఇదికూడ సద్గురుమహిమను గుర్తుపట్టుటకు తగిన చిహ్నాలలో చెప్పతగినదికాదు. మానవుని మనస్తత్వరూపమైన

(psychological) "అహం" యీ క్రింది మూడింటిలోనే ఇమిడియున్నది కాని వాని నెన్నటికి నతిక్రమించి పోనేరదు. ఆమూడు నెవ్వియనగా (1) మొదటిది యేదైన నొకవాసన సిద్ధించుటయు, దాని భోగములోను అందును గురించిన ఆలోచనలలోను తన్మయత్వమునొంది ఆనందించుచుండుటయు (2) ఏదైన నొకకోరిక తీరువఱకు నిరీక్షణ చేయుచుగాని అందునిమిత్తమై ప్రయత్నములు అధికముగ చేయుచుగాని, లేక అది తలచుకొని ఆనందపడుచును కాని లేక వ్యాకులపడుచునుగాని యుండుట (3) మూడవది కోరిక పూర్తి కాకపోవుటయు. అందునిమిత్తమై దుఃఖించుటయు. మానవునకు ఈమూడురకములైన వాసనలును లేనిచో నతడేపనిని చేయనేచేయడు సరిగదా చలనము కూడ లేకుండా నల్లే పడియుండును; ఉత్తఊపిరిమాత్రమే అతనికి పైకి లోనికి పోవుచుండును. ఏకాంతముననుండి అభ్యాసముచేసికొనుచు నలువైపులనుండి తప్పించి శ్రద్ధను లోనికి త్రిప్పుకొని ఆంతర్యముననిశ్చలావస్థలోనికి పోయిన యెడల అందువలనకూడ నొక మహానందపరిస్థితి గలుగును. ఆసమయమున గురుమహారాజువారు తమదివ్యస్వరూపమును ప్రకటముచేసినచో అభ్యాసి తన్మయమైపోవును. ఈచిహ్నమే (ఆంతర్యస్థానములెవ్వియు తెలుసుకొనకపోయినను) విశ్వసింపదగినచిహ్నం.

## 31

### అభ్యాసములో అనుభవములు.

15 మార్చి 1916 :–జీవులు సద్గురువుయొక్క మహిమను తెలిసికొనునిమిత్తమై తమ ఇచ్ఛలు, వాసనలయొక్క రంగుగల అద్దములతోనున్న కండ్లజోడును ధరించి వారిని చూచుచుందురు. ఆకండ్లజోడులేకుండగనే తమ్ముచూచినచో వారిమహిమను తెలిసికొనగలచిహ్నలు లభించగలవు కావున సద్గురువు తమరి నావిధముగ చూడవలయునని జనులను కోరుదురు. వారిమహిమ బోధపడనిచో ప్రతీతి కలుగనేరదు. ప్రీతిలేనిదే ప్రేమ యుత్పన్నము కానేరదు. ప్రేమలేనిదే యుద్ధారము కాజాలదు. పైనచెప్పిన నిశ్చలావస్థ లభించినపిమ్మట గలుగబోయెడి ఆపైపరిస్థితి యెట్లుండునో అనుభవించవలయునను ఆసక్తి యుండవలయును. ఎవరైనను ఈమాత్రపుఆనందపరిస్థితి లభించినమీదటనే తనకార్యము సఫలమైపోయినదనియు, తనకు అప్పుడే అనన్యలభ్యమైన అనుభవము గలిగి

పోయినదనియు అనుకొన్నచో అతడు ముందుకు పోజాలడు, పతితుడుగూడ నైపోగలడు. ఈమాత్రపుపరిస్థితి గలిగినపిమ్మట అతడు తనమిత్రులకు ఇరుగు పొరుగువారికిని ఇదంతయు చెప్పవలెనని కోరుట ప్రారంభించినచో నతనికి నష్టము వాటిల్లును. తనపొట్టలో నుంచబడిన అమూల్యరత్నము నతడు కక్కివేసికొన్నట్లగును. ఆనిశ్చలావస్థనుదాటి పైకివెళ్ళవలెననెడికోరికగల అభ్యాసికి తనశరీరమునుండి ఊర్ధ్వముగ అంతర్యమున తాను ఆకర్షించబడిపోవుచున్నట్లు అనుభవముగలిగి శరీరమంతయు దడదడ కంపించనారంభించి, పిమ్మట నతనికి అంతులేనంత అధికముగ నేడుపు వచ్చును. ఆసమయములో నతనిహృదయమున నేదైన మహామలినవాసన యున్నయెడల, నది వందలాదిమైళ్ళలోతున కప్పెట్టబడియున్ననుగూడ పైకివచ్చును. కాని ఉత్తమతరగతిదైన అంతర్యాకర్షణగలుగుటచే ఈమలినవాసన అభ్యాసిపైన నెక్కువప్రభావము కనపరచలేదు. అయిననుగూడ అభ్యాసి ఆపరిస్థితిలో చాలజాగరూకతగలిగి యుండవలెను. ఒక్కొక్కఅభ్యాసి తనలో నావిధముగ మలినవాసనప్రకటమగుటవలన తన కావాసన పూర్తికాబోవుచున్నదనియు, దానిని అనుభవించుటకై, భగవదాజ్ఞయున్నదనియు అనుకొనుచుండును. అట్లుచేయుటచే నతడు జీవితమంతయు ఆవాసన ననుభవించుటలోనే వ్యర్థపుచ్చుట తటస్థించగలదు. ఎవరైనను తనకు సుఖ, దుఃఖపరిస్థితులుగలిగినపుడు ఆపరిస్థితులనుండి తప్పించుకొనుటకై ప్రార్థనచేయుచుంటినా లేదా యని తనకుతాను ప్రశ్నించుకొనినచో దానికి తనలోనుండి వచ్చిన సమాధానమే తనకార్యముపూర్తియైనదోలేదో విశదపరచగలదు. ఇతరులెవరైనను కోరినందువలన వారినిమిత్తమై ప్రార్థనచేయుట వేఱు. తన స్వలాభమునకై ప్రార్థనచేయనివారు చాల అరుదుగ నుందురు.

## 32

<u>సద్గురుమహిమను గుర్తుపట్టినవానికి ఉండవలసిన రెండు ప్రధానలక్షణములు.</u>

15 మార్చి 1916 :– మానవు డేఘటననుగుఱించియైనను ఆలోచించినపుడు అతడు ఒకేపర్యవసానమును అనేకవిధములుగ తేల్చుకొనవచ్చును. ఒక ల్యాంపు ఆరిపోవుటకు సిద్ధముగనున్నదనుకొనుడు. ఒకడు దానివత్తికేసిచూచి ఆవత్తి చాలతక్కువగనుండుటచే నది యాఱిపోవుచున్నదని యూహించును,

మఱొకడు వత్తిని చూడకుండగనే లాంపులోనినూనె తక్కువగనుండుట మాత్రము చూచి దానినిబట్టియే ఆదీప మాఱిపోవునని తెలిసికొనును. మూడవ వాడు దాని వెలుతురు తక్కువగనై పోవుచుండుటచూచి దీప మాఱిపోనై యున్నదని యూహించుకొనును. జీవాత్మ ఈశరీరములో ఆజ్ఞాచక్రమునందు న్నప్పుడు లాంపు వెలుగుచుండును. లాంపు ఆఱిపోవుట యనగా ఆత్మయొక్క ధార లోనికి ఆకర్షించబడి ఉద్ధారము జరిగిపోవుటయే.

ఎవనికైన సద్గురుమహిమ తెలిసినచో అతనికి ఈక్రింది రెండులక్షణము లును ఉండగలవు. మొదటిది చాలమంది ఖైదీలు జీవితపర్యంతము ఖైదుశిక్ష వేయబడినవారు ఒకచోట నున్నారనుకొనుడు. ఆఖైదీలవలెనే దుస్తులుధరించి నట్టియు, చేతులకు కాళ్ళకు సంకెళ్లు వేసుకొన్నట్టియు నొకమనిషి వారిమధ్యకు వచ్చి ఆఖైదీలతో "మీరు నేను చెప్పినఉపాయము నవలంబించినచో మీకు విడుదలయైపోవులాగున చేసెదను. నేను ఖైదీదుస్తులను ధరించి చేతులకు కాళ్ళకును సంకెళ్లు వేసికొనియున్నానుకాని నిజముగ స్వతంత్రుడనుసుమీ. నేను మీదగ్గఱకువచ్చి మీతో మాట్లాడుటకు కాపలావాండ్రు అడ్డుపెట్టకుండ నుండునిమిత్తమై ఇట్టివస్తులను ధరించితిని" అని చెప్పెననుకొనుడు అంతట కొందఱుఖైదీలు "ఈ అల్పుడు మననేమి విడిపించగలడోయ్ ?" అని పరిహా సముచేయుదురు. మఱికొందఱు "పోనిమ్ము ఇక్కడనే మనకు సుఖముగానున్నది. తిండి దొరుకుచున్నది. కాలక్షేపము అయిపోవుచున్నది. ఇక్కడనుండి విడుదల అయిపోయి చేసెడిదేమున్నది" అని యందురు. కొందఱు ఆవిడుదలచేయువాని శుభసందేశమువిని తాము విడుదలైపోవుచున్నామనెడి తలంపుమూలమున అంతులేని సంతోషమునొందుచు, విడుదలవిషయమై యెన్ని యోప్రశ్నలు వేసి తెలిసికొని అతనిమాటలపైన విశ్వాసముపెట్టుకొని అతడుచెప్పిన పద్ధతుల ప్రకారము నడుచుకొనుటకు సిద్ధముగుదురు, గుండె పగిలిపోవునంతసంతోషము ప్రకటింతురు. సద్గురువు లభించినపు డెవరికైన నింతయానందము కలుగనిచో, నతనికి సద్గురువుయొక్క మహిమ అవగాహనమైనదని నమ్ముటకు వీలులేదు.

రెండవవిషయ మేమనగా సాధననుపదేశించినపురుషునిమీద పూర్ణ విశ్వాసముగలిగి, ఆసాధననభ్యాసము చేయుటకూడా ప్రారంభించి జరిగించుచున్న సాధకునికి తనవిమోచనకై సాధనుపదేశించినపురుషుడు స్వకీయకష్టసుఖము లను చూచుకొనకుండగనే యీ సాధకునికొఱకై సకలవిధముల పాటుపడుచుం

డినను కూడ తన కార్యములు వేఱ వేరు సూచనలు కనిపించుట లేదని తోచినపుడు అత్యంతవ్యాకులచిత్తుడై మొఱపెట్టుకొనును. అట్లు చేయకుండినచో నతనికి సద్గురుని మహిమ తెలిసినట్లు నమ్మరాదు.

## 33

### ప్రేమయొక్క చిహ్నములు.

17 మార్చి 1916 :-ఈక్రింది మూడుప్రశ్నలను ముందు తేల్చుకొనవలసి యున్నది :

1) గురువునకు ఏ ఏ విషయములమూలమున మనయెడల ప్రసన్నత గలుగుచున్నది ?

2) వారి ప్రసన్నత సంపాదించుకొనుట యెట్లు ?

3) సద్గురువు తనను పూజించుమనియు, తనసేవచేయుమనియు, తనయందు ధ్యానముంచుకొనుమనియు బోధించుచున్నారుకదా. అది వారుస్వార్ధపరత్వమువలనను, తమ ప్రాపంచికలాభమునిమిత్తమును అట్లు చెప్పుటలేదుకదా, అనగా వారు కపటస్వభావులు, లోభులును కారుగదా ? హుజూరువారు శిష్యుడు గురువుతో తద్రూపమైపోవలయుననియు, అట్లుఅయినపుడే వారిప్రసన్నత శిష్యునకు లభించుననియు సెలవిచ్చిరి.

ఆశికీ రా శశ్ నిశాన_స్త ఐ పిసర్,
ఆహ సర్దో రంగ్ జర్ద-ఓ-చశ్మ తర్ ।
గర్ తో మీ పుర్సీ కి సేహ దీగర్ కుదామ్,
కమ్ ఖుర్దన్, కమ్ గు_ఫ్తన్, వ ఖు_ఫ్తన్ హరామ్ ॥

అనగా, ఓపుత్రుడా, ప్రేమకు ఆఱుచిహ్నాలు. అందులో మూడుచిహ్నాలు చల్లని నిట్టూర్పు, పాలిపోయిన ముఖము, అశ్రుపూర్ణమైనకండ్లును. ఇక మిగత మూడులక్షణము లెవ్వి యని అడిగెదవా ? అవెవ్వియనగా తక్కువతినుట, తక్కువమాట్లాడుటయు, నిద్రలేమియును.

## 34

### ప్రశ్నోత్తరములు.

ప్రశ్న :-ఏమానవునికైనను సర్వోత్తమమైన మతమెద్ది ?

సమాధానము :-ఏది ఆమనుష్యునకు ప్రియముగా నుండునో అదియే.

ప్రశ్న :-ఎవనికైన నెట్టిమతము ప్రియముగ నుండును ?

సమాధానము :-ఏమనిషికైనను అతని చిత్తవృత్తికి ప్రియమైనవస్తువు నేమతము లభింపజేయునో, ఆమతమే ప్రియముగనుండును.

## 35

## మహాకష్టము వచ్చినపుడు ఉపయోగించవలసిన అద్భుతసూత్రము.

ఈ సూత్రమును మనసున జ్ఞాపకముంచుకొనుడు, వ్రాసిపెట్టుకొనుడు. అన్ని ప్రయత్నములును విఫలమైపోయి, మఱొక ఉపాయమెద్దియు తోచనపుడు సర్వశ్రేష్ఠమును, అనర్ఘమునైన యీమందును ఉపయోగించుకొనుడు. మనస్సునకు "భగవదిచ్ఛకు వదిలిపెట్టుము" అని చెప్పుము. నీవు హృదయపూర్వకముగ మనస్సుతో నిట్లన్నయెడల నీవిచారము వ్యాకులతయు నశించిపోవును. ఏదైన దుఃఖపరిస్థితి వచ్చినపుడు నీవు దానితో తదూపమై దుఃఖగ్రస్తుడవైనచో అందువలన జరుగున దేమున్నది ? గొప్పగొప్ప మహామహులుగూడ చాలవిషయములను ఆఖరికి విసుగెత్తి దైవయోగమునకే విడిచివేయుచున్నారు. ఉదాహరణకై చాలమంది రాజనీతివిశారదులు ఒకమహాక్లిష్టసమస్యను తేల్చుకొనుటకై కలిసి ఆలోచించుకొనుచుండి రనుకొనుడు. ఉదయము మొదలుకొని సాయంకాలమువరకును వారనేకవిధములుగ నాలోచనలు చేసిచేసి అందఱు నెక్కునగ నలసిపోయి, మొదటలో చర్చ ప్రారంభించినపుడున్నంత శ్రద్ధకాని పట్టుదలకాని వారెవరికినిగూడ లేకుండుపరిస్థితి యేర్పడును. అప్పుడు వారా విషయము నేదోవిధముగ ముగించివేయదల్చుకొని, ఇంకను శ్రద్ధగ నాలోచించవలసిన విషయములు మిగిలిపోయినను, వానినన్నిటిని అట్లే విడిచిపెట్టి, యేదో యొక తీర్మానమును చేసుకొని ముగించివేయుదురు. అనగా యెట్టిమానవునికైనను, ఏవోకొన్ని అంశములను దైవవశమునకు విడిచిపెట్టకతప్పదని స్పష్టపడుచున్నది. ఏపనినైనను ప్రారంభించకముందే, దాని వివరముల నన్నిటిని సంపూర్ణముగ తెలుసుకొని, లిఖితముగూడ చేసికొన్నపిమ్మటనే దానిని ప్రారంభించవలయునన్నచో, నెల్లపుడు నట్లు సాధ్యముకానేరదు.

హంగామే-తంగదస్తీ దర్ ఐశ్ కోశోమస్తీ
కి ఈం కీమియా -ఐ-హస్తీ కారూం కునద్ గదా రా।

దీనిభావ మేమనగా, నీకు కష్టదశవచ్చినపుడుకూడా, సంతోషముగనుండి మైమ అచిపొమ్ము, కాని దుఃఖముతో తద్రూపమైపోకుము. ఇది కడుబిచ్చగానిని కూడ భాగ్యవంతునిగ చేసివేయగల్గినంతటి యుత్తమహితోపదేశము.

## 36

పరమార్థములో బుద్ధినొక్కదాని నేగాక, హృదయమునుకూడా లగ్నము చేయవలయును.

సద్గురుభక్తి లేనిదే యేమియు సాధ్యముకాదు. ఎవనికైనను సద్గురువు నందు ప్రీతి యున్నదా లేదా, భక్తి యున్నదా లేదా యనువిషయమును తెలిసికొనునిమిత్త మీక్రిందివిధముగా పరీక్షించుకొనవచ్చును. ఒక సత్సంగి సత్సంగ స్థానమునుండి దూరముగ నున్నపుడు, అచ్చట సద్గురువునుగురించి యెవరైన వర్ణించినను, లేక యేవైన తలంపులు వచ్చినను, సద్గురుని సన్నిధానముననున్నపుడతడెంతభయభక్తులు గలిగి గంభీరభావముతో ప్రవర్తించునో, అట్టి గంభీరతయు, భక్తిభావము నతనిమనస్సున వెంటనే గలుగవలెను. ఇదియొక గుర్తు. రెండవది సద్గురునియెదుట నున్నపు డెంతసేపు వారిచరణములధ్యానమే దప్ప మఱొకయాలోచన యుండకూడదు.

పరమార్థములో నొక్కబుద్ధినేగాకుండా, హృదయమునుకూడ నుపయోగించి పనిచేయవలయును. అట్లు రెండిటినిచేర్చి పరమార్థసాధన చేసినచో నిక చెప్పుట కేమున్నది. హృదయమనగా భావోద్రేకము లేక భావావేశము పుట్టునట్టి మనోలక్షణమని అభిప్రాయము. అనగా, విచారణ విమర్శ లెవ్వియు లేకుండగనే పరమార్థమార్గము నవలంబించుడని యభిప్రాయముకాదు. బాగుగ విమర్శించుకొన్నపిమ్మట పరమార్థకార్యక్రమము చేయుట ప్రారంభించినపుడు, పరమార్థముయొక్క ప్రాధాన్యమును కేవలము బుద్ధితో విమర్శచేసి తెలిసికొనుట చాలదు. అందుతోపాటు భావావేశముకూడ చేరియుండవలెను. మనస్సును నిశ్చలపరిస్థితిలో నుంచుట యావశ్యకవిషయము కాని సూక్ష్మవిషయములనుగురించి ఆలోచించునపుడు చిత్త మెక్కువ వ్యాకులపడిపోవుటయు, మనస్సు మఱింతవేగముగ పరుగులిడుటయు జరుగుచుండును. ఆసమయములో మనస్సును కొంచెము ఆగుమని చెప్పినచో నది యెట్లు శాంతించును.

అది యెట్లుండుననగా ఒక బాలుడు తీవ్రమైన ఆవేశముతో నిండినవాడై మహా వేగముగ పారిపోవుచున్నపు డతనికి "నోరు మూసుకొని కూర్చుండుము, నిశ్శబ్దముగ నుండు" మని యెవరైన చెప్పినట్లేయుండును. ఆ యావేశోద్రేకములో నుండగ నత డామాట లెంతమాత్రము లెక్కసేయడు సరికదా, ఆ చెప్పిన మనిషిని రెండుతన్నులుగూడ తన్నవచ్చునుకదా.

## 37

### మనస్సుయొక్క వేగము నరికట్టుటకై సలహాలు.

18 మార్చి 1916:—మనస్సుయొక్క పరుగులు, మనోవేగమును గురించియు, దాని నరికట్టువిధమును గురించియు, దృష్టాంతసహితముగా బోధపర్చిరి. ఒక దృష్టాంతము నివ్విధముగ చెప్పిరి. ఒకరాజుగారి కొక గుఱ్ఱమున్నది. అది గంటకు 40 మైళ్ళు చొప్పున నతితీవ్రముగా పరుగెత్తగలదు. కాని అది తనపైన నెవరి నెక్కనే ఎక్కనియ్యదు; చాల తెలివిగలది; పని చెయ్యకుండగనే తిండితినుచు కూర్చుండగోరును. రాజుగారి కాగుఱ్ఱమును లొంగుబాటులోనికి తెచ్చుట యెట్లా యని బెంగపట్టుకొనెను. గుఱ్ఱములకు స్వారినేర్పువాడు ఒకడువచ్చి తాను ఆగుఱ్ఱమును లొంగదీయగలనని చెప్పి, అందునిమిత్తమై యొకనూఱుమైళ్ళయడవిని చెట్లువగైరా లెవ్వియు లేకుండ పూర్తిగా శుభ్రముచేసి ఒకమైదానమువలె తయారుచేయుడని చెప్పెను. ఆ ప్రకారము మైదానమును తయారుచేయించిరి. స్వారినేర్పువాడు గుఱ్ఱముపై నెక్కి ఒక్కకొరడాదెబ్బ తగిల్చెను. గుఱ్ఱమతనిని తనపైన పెట్టుకొని మహా వేగముతో పరుగెత్తెను. 30, 40 మైళ్ళు వెళ్ళినతరువాత నతడు తిరిగి మఱొక దెబ్బ తగల్చగా, అది తిరిగి ఇంకొక 30, 40 మైళ్ళదూరము పరుగెత్తెను. అప్పుడతడు దానిని వెనుకకుత్రిప్పి ఒకదెబ్బ కొట్టెను. ఇట్లు 2 గంటలసేపు ఆగుఱ్ఱము పరుగులెత్తి బాగుగ చెమటపట్టునట్లు అలసిపోగా, ఈరౌతు గట్టినేర్పరియని దానికి బోధపడెను. అప్పు డది తనరౌతుతో "అయ్యా, మీతో నేను సంధి చేసుకొందును. మీరు నావలన నేమి కోరుకొందురో చెప్పు"డని ప్రార్థించెను. రౌతు అప్పు డాగుఱ్ఱముతో తాను చెప్పిన ట్లది చేయవలయునని చెప్పెను. అతడు వెళ్ళి రాజుగారితో గుఱ్ఱమును లొంగుబాటులోనికి తీసికొనివచ్చితినని చెప్పెను. ఆధ్యాత్మికాభ్యాసములో స్మరణధ్యానసాధనగూడ నట్టిదే. అనగా,

మనస్సనెడి గుఱ్ఱమును వశములోనికి తీసికొనిరాగల సామర్థ్యము ఈసాధనకు గలదు. ఆఱవచక్రమువద్ద మనస్సును చేర్చి, దానికి పరుగెత్తుటకై ఆమైదాన మేర్పాటుచేయబడినది. అది పరుగెత్తుట మొదలుపెట్టగనే, దానితో "రాధాస్వామీ అనుము, చేయుము ధ్యానము; అనుము రాధాస్వామీ, చేయుము ధ్యానము, అనుము రాధాస్వామీ. చేయుము ధ్యానము" అని దానిని ఆజ్ఞాపించుచుండవలెను. అనగా దానిని కొరడాతో కొట్టుచున్నట్లే. దానితో అది అలిసిపోయి లొంగిపోవును.

కొందఱు స్మరణధ్యానముల యభ్యాసము సాగుట కేదైన నుపాయము తమకు చెప్పుడని కోరుచుందురు. దీనికికూడా సాహబ్జీమహారాజువారొక దృష్టాంతమును చెప్పి బోధపఱచిరి. ఒకనికి కడుపునొప్పివచ్చి వైద్యునివద్దకు వెళ్లెను. వైద్యుడు మందిచ్చి అది తినుమని చెప్పెను. ఆరోగి చాలబద్ధకస్తుడగుటచే "నేనట్లు చేయలేను, నాకిదితినునట్లుచేయు మందుకూడా యిండ"ని బదులుచెప్పెను. అప్పుడు వైద్యుడు, "సరే, మందుతినకండి, మీకింకను తొందరలేదు, తొందరవచ్చినపుడు తినవచ్చు"నని చెప్పెను. పిమ్మట నతనికి బాధ యెక్కువైపోగా అతడు బిగ్గఱగనేడ్చుచువచ్చి అదేమందు అడిగి తీసికొని దాని నుపయోగించెనట.

ఈ విషయముమీదనే మఱొక మూడవదృష్టాంతముగూడ నిచ్చిరి. ఒక భోగముమనిషి యుండెను. ఆమె మహమ్మద్ ఖాన్ అనునొక హకీమ్‌గారివద్దకు వెళ్ళి తనకు కడుపునొప్పి వచ్చుచున్నదనియు, విరేచనములువెళ్లుచున్నవనియు, వంట్లో అక్కడక్కడ నొప్పులుగా నున్నదనియు, ఆకలియుండుటలేదనియు చెప్పుకొనెను. "చాల నీరసపడిపోయితిని, నావృత్తిచెడిపోవుచున్నది, నాపోషణలోనున్నవారు తిండిలేక మాడిపోవుచున్నారు." అనికూడా చెప్పుకొనగా, హకీమ్‌గారు ఆమె నొకఅర్ధశేరుశనగలు తినుమని చెప్పిరి. హకీమ్‌గారి మాటల నామె విశ్వసించి ఆప్రకారము అర్ధశేరుశనగలు తినెను. దానితో ఆమెకు బాధలన్నియు తగ్గిపోయినవి. అయితే జరిగినదేమనగా ఆక్రితమురాత్రి ఆమె భోగమాట ఆడుటకై యెచ్చటికో వెళ్ళగా ఆమెకచ్చట మంచిమంచిపక్వాన్నములు పెట్టిరి. అవి చాల యెక్కువగా తిన్నందున నామెకు ప్రేగులలో ఆమము పెరిగెను. అయితే శనగలు తినుటచే, ఆ ఆమమంతయు బయటకువచ్చి, శరీరము నిర్మలమైపోయెను.

## 38

### ఇచ్ఛాతరంగములనుండి తప్పించుకొనుటకు ఉపాయము.

19 సెప్టెంబరు 1916 :-సారవచనము గద్య, రెండవభాగములో నొక వచనములో గురువుగారొకపక్కనుండిన మనస్సు మఱొకపక్కనున్నదని సెలవియ్యబడినది. జీవుని కేదైన కఠినసమస్య గలిగినపు డతడు "నేను గురువును విడనాడినచో మనస్సుయొక్క తరంగములలోపడి కోరికలప్రవాహములో కొట్టుకొనిపోవుదును. కావున నేను నాగురుని ఆజ్ఞలనే మన్నించెద"నని తనకుతాను బోధించుకొనవలయును. అట్లు చేసినందువలన, తనమన స్తరంగములయొక్కయు ఇచ్ఛలు వాసనలయొక్కయు వ్యాకులత తగ్గిపోయి అనుక్షణము పుట్టుచుండెడి వ్యర్థాలోచనలప్రవాహ వేగముగూడ తగ్గిపోవును.

## 39

### సత్సంగుల ఐహిక పరిస్థితులలో సద్గురుని సహాయము.

లాలా మోతీరామ్ అనెడి లాహోరులోనిసత్సంగియొక్క కుమారుని హత్యజరిగినపుడు ఈక్రిందివిధముగ హుజూరువారు వచనము సెలవిచ్చిరి. ప్రాపంచికజీవులైతే రాధాస్వామీమతముమీాద ఈమతస్థులు మానవపూజ చేయుచుందురని నెపమువేయుచున్నారు. ఇక నీమతములోనివారైతే "ఇట్టి కష్టము మీాదికివచ్చినపుడు రాధాస్వామీదయాళురు మన కేమియు సహాయము చేయలేదే, కారణమేమి ? బహుశః మనమేదైనకార్యము చక్కనయినపు డది రాధాస్వామీదయాళునిదయవలననే అట్లయినదని వారిమీాదపెట్టుచు, చెడిపోయినచో ప్రారబ్ధమువలననే అట్లయినదని మనకుమనమే అనుకొనుచుంటిమేమో. చూడగ నట్లే కనబడుచున్నది. ఇందులో రాధాస్వామీదయాళుని కేమియు సంబంధము లేదుకాబోలు"నని శంకించుచుందురు. ఆవిధముగ చివరకు, వారు మనసుఖదుఃఖపరిస్థితులతో భగవంతునికి నిజముగ నేమియు సంబంధములేదనియు, నేమిజరిగిన నదంతయు రాధాస్వామీదయాళురే చేసిరని మన తెలివితక్కువమూలముననుు, అంధవిశ్వాసముమూలముననుు, వారియందు మనకుగల గౌరవప్రపత్తులమూలమునను మనమనుకొనుచుంటిమేకాని మరేమియుకాదనెడి పర్యవసానమునకు వచ్చుచున్నారు. అసలు విషయ మేమనగా

సంతు లీప్రపంచమునకు వచ్చినది, ఇచ్చటిజీవులు అనుకొనుచున్నట్టి యుద్దేశ్యముతో కానేకాదు. రాధాస్వామీమతములోని వారి కెల్లపుడు స్వార్థవిషయములన్నియు వారికిష్టముగనున్నవిధముననే సాగించబడిపోవుననికాని వారి మీఁది కెట్టికష్టములును రాజాలవనికాని యెన్నఁడు వాగ్దానముగూడ చేయబడలేదు. సంతులకును జబ్బులు చేయుచున్నవి. వారిభక్తులకును కష్టములు వచ్చినవి, అపజయములును గలిగినవి. వారీప్రపంచమునకు వచ్చుటలోని దేయుద్దేశ్యమైనచో, నల్లెంతమాత్రము జరిగియేయుండకపోవును. వారు ఈప్రపంచమున నవతరించినది, జీవులకు నిజమైన ఆనందమునిచ్చి, దుఃఖములు కష్టముల నుండి శాశ్వతవిముక్తి గలుగజేయునిమిత్తమే. ఈజగత్తులో నొకసమయములో సుఖమునిచ్చునట్టిపదార్థము, మఱొకసమయములో దుఃఖదాయకముగ నుండునని వారికి తెలుసును. అందువలన జీవులకు సుఖముగలిగించుటకై వారికి ఈజగములోని పదార్థములను ప్రోగుచేసియిచ్చుటయు, వారిని రోగముల నుండియు, శీతోష్ణపరిస్థితులనుండియు తప్పించుటయు ఆవశ్యకకార్యములుకావు. ఈ బ్రహ్మాండములోనున్న సామగ్రికూడ న్యూనచైతన్యసంబంధమైనదే కావున, నచ్చటకూడ సుఖముండుట కవకాశము లేదు. కావున బ్రహ్మాండమునుండి కూడా జీవులను పైకి తీసికొనివెళ్ళి నిర్మలచైతన్యదేశములో జేర్పించవలయుననియే సంతుల ముఖ్యోద్దేశ్యము. ఏలనన, నచ్చట జేర్పించినపుడే వారికి పరిపూర్ణసుఖము లభించగలదు. కావున తమ కాపత్తులు రానేరవని సత్సంగులెన్నడును తలంచకూడదు. రాధాస్వామీదయాళునకు జీవుని నీసృష్టిలోనుండి పైకి తీసికొనిపోవలయుననియే ప్రధానోద్దేశ్యము కావున ఆకార్యక్రమసందర్భములో నతని కేరోగములు వచ్చినను కష్టములుగలిగినను వారు లెక్కసేయరు. అది యెట్లుండుననగ, నెవనికైనను కడుపునొప్పివచ్చి విరోచనబద్ధము చేసినందువలన రొంపపట్టుటయో లేక అటువంటి మఱొకచిన్నరుగ్మత యెద్దియో గలిగెననుకొనుడు లేదా కంటిలోనో, వ్రేలిమీఁదనో చిన్నకురుపు వేసెననుకొనుడు. అప్పుడు డాక్టరుగారు మొట్టమొదట అతని కడుపునొప్పికి వైద్యముచేయుదురు. ఏలననగా కడుపునొప్పియు, విరేచనబద్ధమును పోయినపుడు ఆవిరోచనబద్ధము యొక్క బాహ్యరూపములైన చిన్నచిన్న బాధలన్నియుగూడ వానంతటనవియే పోగలవు.

ఏసత్సంగికైనను ప్రాపంచికవిషయములలో సహాయముగలిగినను లేదా ఒక విచిత్రమైన అనుభవముగలిగినను భగవంతుని కట్లుచేయుటలో ముఖ్యో

ద్దేశ్యము సత్సంగికి అందుమూలముగా భక్తివిశ్వాసములు జనించి, వృద్ధిపొంద వలెననియే కాని, అతని కాసుఖము కలుగవలెననికాని లేక ఆకష్టమును పోగొట్ట వలెననికాని కాదు. అదితప్ప మఱొకయుద్దేశ్యమేమియు నుండనేరదు. కావున నెవ్వరైన నీమతములోచేరి, పరమపురుషునివద్దనుండి పుత్త్రులు ధనము వగైరా ఐహికవాంఛలను కోరినచో వారికి మతముయొక్క సిద్ధాంతములు తెలియలేదని యర్థము. ఇట్టిపనులలో భగవంతుడెంతమాత్రము కలుగజేసికొనడు. ఈ సంద ర్భములో నీక్రిందిశబ్దము సారబచన్ (పద్యభాగము) నుండి తీసి చదువబడినది.

"సతగురు మోహిం దీనా నామ సహీ, తృష్ణా సకల దహీ."

## 40

కర్మకాండ సిద్ధాంతమునకును సంతుమతముయొక్క భక్తిమార్గమునకును వ్యత్యాసము.

23 సెప్టెంబరు 1916 :- ఈనాడు ఉదయముపూట లాలా మోతీరామ్ గారి విషయములో వచనము నిట్లు సెలవిచ్చిరి :-

"సజనీ కంచన్ కసన కో విపతి కసౌటీ కీన్"

అర్థము :-బంగారమును పరీక్షించుటకు గీటురాయివలెనే పరమార్థిని పరీక్షచేయుటకు విపత్తులు తయారుచేయబడినవి. సత్సంగికి చివరకు గలిగెడి పరి ణామము చాలశ్రేష్ఠమైనది. లోకములో కర్మకాండను ప్రధానముగపెట్టు కొన్నవారి సిద్ధాంతము అసలులో పొరబాటు కాదు. వారి అసలు అభిప్రాయ మేమనగా, జీవులందఱును ఆదికర్మయొక్క ప్రభావమువలననే ఈప్రపంచము లోనికివచ్చి రనియే. అయితే వారుచెప్పెడి శిక్షణయేమనగా "మీరీప్రపంచ ములోనుండుడు. ప్రతికార్యమును న్యాయముగను, నిర్మలముగను చేయుడు. మంచి శరీరబలముగలిగి సంతోషముగనుండుడు. మంచిసంతానమును కనుడు. బాగుగ సంపాదించుకొనుడు. బాగుగ తినుడు. పరోపకారము చేయుడు. యుక్తకాలము వచ్చినపుడు మీకర్మలన్నియు పూర్తిగ నశించిపోయి, మీకు పరమపదమందు నివాసము లభించగలదు" అని బోధించుచున్నారు. కాని యీ శిక్షణ జీవులను తిరిగి యీలోకములోనే బంధింపజేయుచున్నది. ఏలననగా, సద్గురువులేనిదే కార్యము నెఱవేరుట అసాధ్యము. అది కాకుండ ఈ శిక్షణ ప్రకారమైతే సమస్తసృష్టికి నుద్ధారమైనపుడే పరమపదమందు నివాసము లభ్య

మగును, అనగా ఉద్ధారము ప్రళయమగువఱకు నాలస్యము చేయబడినది. అట్లు గాక సత్సంగికిపట్టిన మహాదృష్టము అద్భుతమైనది. ఏలనన, ఈనవీనభక్తిమార్గము మును ఆపరమపురుషుడేవచ్చి ప్రకటించిరి. ధర్మమునకు మనుధర్మశాస్త్రములో చెప్పిన పదిలక్షణములలోను భక్తినిగుఱించి పేరైన నెత్తలేదు ఈభక్తిమార్గము మూలమున జీవుడు కర్మచక్రములో పూర్తియైనకాల ముండనక్కఱలేకుండ గనే, ఒకపక్షి చీమను ఎత్తుకొని ఎగిరిపోయినట్లుగా, పరమపురుషుడు జీవుని కర్మ చక్రమునుండి పైకితీసి తనరాజదర్బారునందు నివాసమిప్పించును. వారిదర్బా రులో ప్రవేశించునిమిత్తము వారు సత్సంగికి ఒకచిన్నషరతుమాత్రమే పెట్టిరి. అది ఏది అనగా ప్రపంచమునెడల వైరాగ్యమును వారి చరణములయందు ప్రేమను గలిగి యుండవలెనని. ఇది సంపాదించుకొన్నవానికి పరమపురుషుని దర్బారులో నివాసము లభ్యమగుచున్నది. గొప్పశ్రమపడి మహావిద్యాసంప త్తును పొందికూడ నీపైనచెప్పిన ప్రధానమైననియమమును తెలుసుకొననట్టి విద్వాంసులు అనేకకష్టములు పాట్లుపడుచు నెట్లీప్రపంచములో కొట్టుకొనిపోవు చున్నారో, మిగిలినవారందఱునుగూడ నట్లే నిరాధారముగ నుండిపోవుదురు.

## 41

### సత్సంగమువలన పొందవలసిన లాభము.

26 డిశంబరు 1916 :– లోకములో సప్తసముద్రములు ప్రసిద్ధికెక్కి యున్నవి. ఆ ఏడింటిలోను అన్నిటిలోను ముత్యములు లభించవు. అందులో కొన్ని సముద్రములలోనే ఒక్కొక్కప్రత్యేకస్థలములోమాత్రమే ముత్యములు బయలుదేరును. హంస ముత్యములకొఱకై బయలుదేఱినయెడల అది ఈ లోకములోనున్న సప్తసముద్రములన్నిటిలోనుండియు ముత్యములున్నసముద్ర మును మొదట వెతుకుకొనవలయును. తిరిగి ఆసముద్రములో ముత్యములు దొరికెడిస్థలమును వెదకికొని, తరువాత అందులో ముత్యపుచిప్పలను వెదకికొన వలయును. కాని అప్పుడుకూడ నది ఆముత్యపుచిప్పనే పట్టుకొని అనగా ఆ ముత్యపుచిప్పయొక్క బాహ్యశృంగారమునుమాత్రమే చూచుకొని ఆనందిం చుచు, నంతటితోనే తృప్తిపడిపోవు ప్రమాదముగూడగలదు. కొంగకూడ హంసవంటి శరీరమునే కలిగి హంసవలెనే నిలబడును. కాని స్వరూపములో సరిగహంసవలెనేయున్నను ముత్యములు వగైరాలకొఱకే అది వెదకుకొనుచుం

డును. అటులనే జీవుడు ఈసంసారములోనున్న సాగరములలో మొట్టమొదట ముత్యములున్నట్టి సముద్రమును వెదకికొనవలెను. అనగా సత్సంగమును వెదకికొనవలెను. తిరిగి ఆసత్సంగములో ముత్యపుచిప్పను వెదకికొనవలెను. ముత్యపుచిప్ప అనగా సంత్ సద్గురువు. తిరిగి ఆసంత్ సద్గురువుయొక్క శరీరమనస్సులకు సంబంధించిన బాహ్యసేవలోనే చిక్కుకొనిపోకుండ శరీరమనస్సుల కతీతమైనట్టి నిజధారను లేక ఆత్మను అన్వేషించుకొనవలెను. సత్సంగములో నెన్నిసంవత్సరములనుండి యుంటిమి, ఇప్పటికైనను ఆముత్యమును పట్టుకొనగలిగితిమా లేదా యనికూడ చూచుకొనుచుండవలయును. సత్సంగములో నెల్లప్పుడు నుండువారికి ముత్యపుచిప్పను పైపైన కడిగి శుభ్రపఱచుటలోనే తమసమయమంతను వెచ్చించుకొను ప్రమాదము గలదు. అట్లుగాక వారు ఆముత్యపుచిప్పను తెఱచి దానిలోనున్న ముత్యమును పట్టుకొనవలయును. లేనియెడల నట్లు సంత్ సద్గురువు లభించియు వారివలన అసలు లాభమును పొందకుండనుండిపోయిన సత్సంగికి, ఇతరమానవులకన్నగల విశిష్టత, ముత్యములసముద్రము నసలే తెలిసికొనలేని హంసకన్న ముత్యపుచిప్పను పైపైన శుభ్రముచేయునట్టిహంసకుగల విశిష్టతవంటిదే.

## 42

## దయాల్బాగులో సత్సంగహాలు నిర్మాణము.

26 డిశంబరు 1916 :—స్వామిజీమహారాజువారి సమాధి కట్టుట ప్రారంభించబడినది, కాని సత్సంగులందఱు దానినెన్నియోకారణాంతరములవలన విడిచిపెట్టవలసివచ్చెను. హుజూర్ మహారాజువారి సమాధిపరిస్థితిగూడ నట్లేయున్నది. వారణాశిలో సత్సంగభవనముపరిస్థితిగూడ నట్లేయున్నది. రాధాస్వామిదయాళురు ఈక్రొత్తహాలును (Hall) కట్టించి దానిని సత్సంగముకొఱకై ఉపయోగించుట సత్సంగచరిత్రలో ఇదే మొదటిసారి. ఈకార్యములో పాల్గొన్నవారిది మహాదృష్టము. భవిష్యములో సత్సంగమునకు గలుగబోయెడి విశాలమహాభివృద్ధితో పోల్చినపుడు డీకాక్షానా, స్కూలు, హాల్ వగైరా భవననిర్మాణమంతయు చూడగ, నొకదివ్యరాజభవనముకట్టుచున్నపుడొకయిటుక నెవరైనను ఆనిర్మాణమునకు సహాయముచేసిన నెట్లుండునో అంతమాత్రమేయుండును. అయిననా ఇటుకపెట్టి పాల్గొన్నవారుగూడ మహాదృష్టవంతులే. భగవంతునియెదుట

రూపాయిలకును, పైసలకును విలువలేదు. పరమార్థము రూపాయిలకును పైస లకును అమ్మునట్టిదికాదు. భగవంతుడు మానవునిలో పరికించిచూచెడిది అతని ఆదర్శ మొక్కటే. ఆ యాదర్శములో దీనత్వము మున్నగునవి యున్నచో ఫలి తము చాలబాగుండును. ఎవరైనను స్వాభిమానము, అహంకారమును ప్రధానముజేసికొని ఈవిషయములో భేంటు ఇచ్చినచో దానివలన నతని కేమియు ఫలితముండదు.

## 43

### గురుభక్తియొక్క ప్రాధాన్యము.

27 డిశంబరు 1916 :- ఇది చాల నాజూకైన విషయము. భగవంతుడు జీవునినైతే తనసత్సంగములో చేర్చుకొనును. కాని సారబచన్ గద్యభాగ ములో 151 వ నెంబరు వచనముప్రకారము, సత్సంగికి సంత్ సద్గురువునందును, భగవంతునియందును ఆవచనములో చెప్పినంత గాఢమైన ప్రేమ పుట్టనిచో నించుకేనియు లాభముండనేరదు. జీవుని సత్సంగములో జేర్చుకొన్నపుడు జీవు నికి అట్టిభక్తివిశ్వాసములను కలుగజేయుట భగవంతునికే అవసరమైనపని. జీవుడైతే వాసనలన్నిటికి నొక భండారమువంటివాడు. అందుచే, నతడీప్రపంచ సంబంధమైన కోరికలనే యెప్పుడు పెట్టుకొనియుండును. కావున అతనిభక్తి విశ్వాసములను వృద్ధిచేయునిమిత్తమై భగవంతు డతనికోరికలనుగూడ తీర్చు చుండును. ఉదాహరణకై అతడు సంతానముకొఱకై ఆశించినపుడు అతని భక్తివిశ్వాసములను వృద్ధిచేయుటకై భగవంతు డాతనికి పిల్లవాని నిచ్చును. అతడాపిల్లవానిని తీసికొని సత్సంగమునకువచ్చి, ఆపిల్లవాని కాయుర్దాయ మెక్కువకావలెననియు, అతడు మంచిశ్రేష్ఠుడైన బాలుడు కావలెననియు తలం పుతో నతనికి పేరుపెట్టుమని సంత్ సద్గురువును ప్రార్థించును. అట్లు పేరుపెట్టిన పిదప అతని పెండ్లియేర్పాటుగూడ సద్గురువుద్వారానే చేయించుకొనును. అది గాక తనకింక ముందుపుట్టబోవు సంతానముగూడ నీపిల్లవానికన్న నెక్కువ యోగ్యత గలిగియుండవలయునని మనసున నాశపెట్టుకొనును. అయితే భగ వంతు డతనిప్రేమను వృద్ధిచేయునిమిత్తమై అతనికి మొట్టమొదట నొకపిల్లవాని నిచ్చెనుగాని ఇప్పుడు ఆజాలము అధికముగ పెరిగిపోయి ముందుముందు ఇంత కన్న నెక్కువగ పెరిగిపోవునట్లైపోవుచుండెను. సంత్ సద్గురువు ప్రపంచమునందు

మోహము లేకుండ నుండుడని ఉపదేశించిరి. కాని జరిగెడిదేమనగా ఒక మోహమునకు బదులుగా ఇరువది మోహములు తయారయ్యెను. సంత్ సద్గురువునకును చేయునదేమియు లేకుండగనుండెను. జీవుడుగూడ నశక్తుడే. కావున పైనుదహరించిన వచనములో వర్ణించినగతి యెంతయు దూరమైపోయెను. మొట్టమొదట సంత్ సద్గురుని చరణములయందు ప్రేమపుట్టవలెను. ఆతరువాత ప్రపంచముయొక్క ఆశలన్నియు హరించిపోవునంత పరిపూర్ణతీవ్రమైనభక్తి పుట్టవలెను. అప్పుడే ప్రథమజన్మయొక్క కార్యము పూర్తియైనదెంచుకొనుము.

"ఏక జనమ గురు భక్తి కర్, జనమ దూసరే నామ్."

అర్థము:-ఒక జన్మఅంతయు గురుభక్తి చేసినపిమ్మట రెండవజన్మలో నామభక్తి చేయవలెను.

## 44

### సంత్ సద్గురుని మహిమను తెలిసికొని ప్రవర్తించుట.

28 డిశంబరు 1916:-ఒకతండ్రి తనకుమారునితో "నాయనా కాలము చాల విలువైనది. దానివిలువ తెలిసికొని ప్రవర్తించవలయును" అని చెప్పెను. ఆపిల్లవానికి తొమ్మిదియేండ్ల ప్రాయమగుటచే నతని కది యర్థము గాలేదు. అందుచే నతడు కాలమనగ నేమిటో చెప్పుమని తండ్రినడిగెను. పిల్లవానికి కాలమనగ నేమిటో యూహించుకొనగలశక్తి లేదు. తండ్రి ఒకగడియారమును చూపి "అది కాలమును తెలుపు" నని చెప్పెను. ఆపిల్లవానికి గడియారమును తుడిచి శుభ్రముగనుంచుటయే కాలముయొక్క విలువను తెలిసికొనుటయని బోధపడెను. ఆప్రకారము మఱునాడే ఒకబట్టతీసుకొని ఆగడియారమును తుడుచుట ప్రారంభించెను. ఆబట్టపెట్టి తుడుచుటచే ఆగడియారముయొక్క లోలకము (అనగా పెండ్యూలము-pendulum) కొద్దిగా వంకరైపోయి గడియారము ఆగిపోయెను. (సంత్ సద్గురువు గుప్తమగుట). కొద్దిరోజులతరువాత తండ్రి పిల్లవానిని పిలిచి "నీవు కాలముయొక్క విలువను బాగుగ కనిపెట్టుచున్నావా" అని ప్రశ్నించెను. పిల్లవాడు "ఔ"నని సమాధానము చెప్పెను. "ఎట్లు" అని తండ్రి అడిగెను. పిల్లవాడు తాను ప్రతిదినము బట్టతో గడియారమును బాగుగ తుడుచుచుంటినని సమాధానము జెప్పెను. తండ్రి చూడగా గడియార మాగిపోయియుండెను. అపుడు తండ్రి పిల్లవానికి నీకే

మియు తెలియలేదని చెప్పి, పెండ్యూలమును చూపి కదులుచుండెడి పెండ్యూలమే కాలమును తెలుపుచుండునని చెప్పెను. అప్పుడు పిల్లవాడు గడియారమునకు బదులుగ పెండ్యూలమును శుభ్రముచేయుట మొదలుపెట్టెను. పరిస్థితులన్నియు తిరిగి మొదటిలోవలెనే వచ్చెను. అప్పుడు తిరిగి తండ్రి ఈపెండ్యూలము ఒకసారి కదలి రెండవకదలికలోపున గతించినసమయమునే కాలమందురని చెప్పెను. అంతట పిల్లవాడు ఆసమయమును పట్టుకొనుటెట్లని ప్రశ్నించెను. అపుడు తండ్రి "నీకు కాలమనగా సరిగ నర్థమైనదని" చెప్పి "నీవు దాని నీవిధముగ పట్టుకొనవచ్చును. ఎట్లనగా, ఈపెండ్యూలము కదులుచున్నట్లు నీకు కొంచెముగూడ తెలియకుండ నీపనిలో గంటలతరబడి లగ్నమైయుండినచో నదియే సమయమును పట్టుకొనుట" అని బోధించెను.

ఇటులనే సంత్ సద్గురువుయొక్క మహిమను తెలిసికొనుడనియు, ఈప్రపంచమున సంత్ సద్గురు వొకదుర్లభరత్నమనియు పవిత్రగ్రంథములలో అడుగడుగునకు వ్రాసియున్నది సంత్ సద్గురువుయొక్క విలువ తెలిసికొనుటయనగా మామూలు ఆచారప్రకారము వారికి సాష్టాంగపడుటయు. భేంటునిచ్చుటయు, ప్రసాదమును పంచిపెట్టుటయు, స్మరణ, ధ్యానములు చేసికొనుచుండుటయునని సత్సంగులు అభిప్రాయపడుచుందురు. కాని ఇది బొత్తిగ పొరబాటు అభిప్రాయము. కోటిరూప్యములు భేంటునిండు ఒకదమ్మిడీ ఇండు ప్రసాదము పంచిపెట్టనిండు పెట్టకపోనిండు, స్మరణ ధ్యానములు ఘంటలకొలది చేయనిండు లేదా ఒకనిముషమే చేయనిండు, కాని ఈపనులన్నియు తగినవిధముగ తగినభావముతో చేసినపుడే సంత్ సద్గురుని గౌరవించినట్లు తెలిసికొనుడు. లేనిచో కోటిజన్మ లట్లుచేసినను ఫలితమేమియు నుండదు. ఈపనులన్నియు చేయుటవలన నీమనసున సంత్ సద్గురువుయొక్క మహిమనుగుఱించి భావము రోజురోజు వృద్ధియగుచున్నచో నీకార్యక్రమమంతయు సరియైనదని తెలిసికొనుము. లేనిచో అంతయు వ్యర్థమనియే తెలిసికొనుము. పనులుమాత్రము చేయబడుచునే యున్నవి కాని ఆకాలమంతయు నింతవఱకు వ్యర్థమే అయిపోయెను.

శరీరములో నెచ్చటనైన మాంసమునుగాని, ఎముకలనుగాని ఊడపెఱికినపుడు అవి ఆస్థలములో చాలగట్టిగ పట్టుకొనియున్నచో అందువలన మితిలేని బాధ గలిగి చాలరక్తము కారిపోవచ్చును. ఏలననగా, ఆమాంసమునకును, ఎముకలకును ఆస్థానములో చాల గాఢమైన సంబంధము గలదు. కాని గోళ్లను

పీకినపుడు కష్టమేమియు లేకుండ చాల సునాయాసముగా తీసివేయగలుగుచున్నాము. ఏలననగా, గోళ్ళకు శరీరముతో సంబంధము నామమాత్రముగనే యున్నది, అసలు లేనట్లే చెప్పవచ్చును. సత్సంగానంతరము మీరు సంత్ సద్గురువువద్దనుండి ఇంటికి వెళ్ళునపుడు మీగుండెలో గాబరాపుట్టినయెడలనే మీకీవచనము సరిగ నర్థమై మీరు దానిని ఆచరణలో పెట్టుచున్నట్లు సూచితమగును. అప్పుడే మీరిచ్చెడి భేంట్లును, పంచిపెట్టించెడి ప్రసాదములు, అభ్యాసముచేసెడి స్మరణధ్యానములు వగైరాకృత్యములన్నియు కొంత సఫలమైనట్లెంచుకొనవచ్చును. లేనిచో నీకృత్యము లన్నియు నిష్ఫలములే.

## 45

### స్కూలు ఉద్ఘాటన విషయములు.

31 డిశంబరు 1916:—ఈరోజున స్కూలుకు ఉద్ఘాటనోత్సవము (Opening Ceremony) జరిగెను. మధ్యాహ్నము పండ్రెండు గంటలకు సాహబ్జీమహారాజు వారు దయచేసిరి. పిల్లలు మొట్టమొదట సర్కార్ సాహబ్ వారి "పరమగురు పరమపితు పరమప్రియ నాథ మమ" అను బినతీశబ్దమును చదివిరి. తరువాత కొందఱు పిల్లలు స్వయముగ తయారుచేసిన శబ్దము నొకదానిని చదివిరి. ఆ శబ్దము చదువుచున్నపుడు సాహబ్జీమహారాజువారికిని, చాలమంది సత్సంగులకును గూడ కన్నీరు కారెను. అందఱికిని ఊపిరాడుటగూడ కష్టమాయెను. తరువాత నందఱకును బహుమతులు పంచిపెట్టిరి. మొదట ఇంజనీర్లకును, తాపీమేస్త్రిలకును బహుమతు లిచ్చిరి. పిమ్మట సభామెంబర్లకును, కరస్పాండెంట్లకును ఇచ్చిరి. ఆతరువాత సాధువుల కిచ్చిరి. అటుపిమ్మట సాహబ్జీమహారాజ్ వారు కొందఱిని పేరుపెట్టి పిలిచి బహుమతు లిచ్చిరి. అప్పుడు నా[1]మనస్సులో నీవిధముగా ఆలోచన పుట్టెను. "ఓపరమపురుషా, నాచేత నీసంవత్సరములో నేదైన పారమార్థికకృత్యము తమకు చేయించుకొనవలసియున్నచో నాకు[1]కూడ నా పేరుపిలిచి బహుమతి ఈయుడు. లేనిచో నాకు[1] బహుమతి అవసరములేదు". చివరవఱకు కనిపెట్టుకొనియుంటిని కాని నాపేరు రాలేదు. అపుడు సాహబ్జీ మహారాజువారు "మీలో బహుమతి పొందవలసినవార మని యెంచుకొనుచున్నవా రెవరైన నున్నచో లెం"డని సెలవిచ్చిరి. కాని అప్పుడుకూడ నేను

1 ఈవచనమును వ్రాసినవారే తమ స్వవిషయమును తెల్పుకొనుచున్నారు.

లేవలేదు. ఏలననగా నాకేమియు అట్లు హక్కున్నట్లు తోచలేదు. చాలమంది లేచిరి. కాని సాహబ్జీమహారాజువారు వారికేమియు నివ్వకుండ, మీకేమియు హక్కు లేదని వారికి జెప్పిరి. సత్సంగమైపోయినతరువాత నేను[1] మఱొక సావకాశమునకై ఎదురుచూచుచుంటిని. తరువాతను. సాహబ్జీమహారాజువారు బహుమతులిచ్చి లోనికి దయచేసినపుడు వారు బీబీజీగారితో బహుమతి తీసుకోవలసినవ్యక్తి మఱొక్కరు ఉండిపోయిరని సెలవిచ్చినట్లు తెలిసినది. బీబీజీవారు "కర్నాలుగ్రామపు ఆడమనిషికి ఇచ్చితిరా లేదా" యని అడిగిరి. వారు "ఆం ఔను ఆవిడయే మిగిలిపోయెను" అని సెలవిచ్చిరి; "మేము అన్నియు పంచిపెట్టుట యైపోయినదే, ఇంక నిచ్చుటకు మిగిలిన దేమున్నది" అని అనిరి. అపుడు వారు మాతల్లిగారిని పిలిపించి తాము ధరించిన వేస్టుకోటును (waist coat) ఆమెకిచ్చి, భాయీ రాధామోహన్‌లాల్‌గారు అంతకుముందే అలిగఢ్‌నుంచి తీసుకొనివచ్చినట్టి క్రొత్తమఫ్లర్‌ను ఇచ్చి దానిని నాకిమ్మని సెలవిచ్చిరి. కాని బీబీజీగారు "మీరు ధరించిన మఫ్లరును దేనినైన నిచ్చినచో బాగుండు"నని చెప్పిరి. అపుడు ఆమఫ్లరును మార్చి మాతల్లిగారికి తెల్లమఫ్లర్ ఇచ్చి, దానిని మీపెద్దకుమారున కిమ్మని సెలవిచ్చిరి. ఆవిధముగా ఆమఫ్లరు నాకు లభించెను.

## 46

### సంతులు చేసెడి యుక్తులు.

సంతులు చేసెడిపనులను కొన్నిటిని లోకులు నటనలని భావించుకొనుచుందురు. కాని, ఏదైననొకపనిని సాధించునపుడు తమకు గల్గెడి ఆటంకములనుండి తప్పించుకొనుటకై వారట్లు చేయుదురు కాని వానిని నటన లని చెప్పగూడదు. దానికీ క్రింది ఉదాహరణ నిచ్చిరి. ఒక పసిపిల్లవాడు చాలఅల్లరిచేసి తల్లిని బాధపెట్టెను. అపుడు తల్లి "మీనాన్నగారితో చెప్పి నీకు డబ్బు యివ్వకుండచేసెదను" అని చెప్పి పిల్లవానిని బెదిరించెను. పిల్లవాడు తండ్రిని డబ్బడిగినపుడు తల్లి "వీ డల్లరిచేసినాడు, వీనికి డబ్బివ్వవద్దు" అని అడ్డుపెట్టెను. తండ్రికి ఒకప్రక్కనుండి పిల్లవాడు తెలివితక్కువగనే ప్రవర్తించెను కాని వానికి డబ్బు ఈయనిచో స్కూలులో వాడు ఆకలితో బాధపడునని యనిపించుచుండెను. మఱొక ప్రక్కన వానితల్లిని తోసిపుచ్చుటయు నిష్టములేదు. అపుడు తండ్రి పిల్లవానితో నీకు మూడులెక్క లిచ్చెదను. అవి నీవు సరిగా చేయలేకపోయిన

యెడల నీకు డబ్బేమియు నివ్వను. వానిని తప్పుగ చేసినచో నీకు దెబ్బలుకూడ తగులును" అని చెప్పెను. తండ్రి పిల్లవానిని దెబ్బలు వేసెదనని చెప్పుటచే తల్లి సంతసించెను. తండ్రి పిల్లవానికి చాలసులువైన లెక్క లిచ్చెను. పిల్లవాడు వానిని సరిగనే చేసివేసెను. అందులో నేదైన తప్పున్ననుగూడ తండ్రి సరిగనే యున్నవని ఒప్పుకొనెను. పిల్లవాడు లెక్కలు సరిగ చేసెనని తల్లిగూడ సంత సించెను. ఈవిధముగ వారి తగవు తీరిపోయెను, అనుకొన్న పనియు నెఱవేరెను.

# 47

## పరమార్థమున కవసరమైన మూడుముఖ్యవిషయములు — అభ్యాసము విరహప్రేమభావములతో చేయవలెను.

1917 సం॥రము ఏప్రియలు నెల 6 మొదలు 9 వ తేదీవఱకు ఈస్టరులో: ఎవరైనను హల్వా చేసికొనవలెనన్నచో గోధుమనూక, పంచదార, నెయ్యి ఈమూడువస్తువులను సంపాదించుకొనవలెను. ఎవరివద్దనైనను ఒక్కగోధుమ నూకయే అంతులేనన్నిబస్తాలు పడియుండినను, లేదా ఒక్కపంచదారయే చాలాబస్తాలు పడియున్నను లేక ఒక్క నెయ్యి యెన్నియోడబ్బాలు పడియు న్ననుగూడ అతనికి హల్వాచేసికొనసాధ్యముగాదు. ఏలననగా ఒక్కపదార్థ ముతో పనిసాగదు. ఆమూడుపదార్థములును కావలసియున్నవి. ఇటులనే నిజ ధామము పొందుటకు ఆసక్తిగలవానికిగూడ మూడువస్తువులు అవసరమై యున్నవి. సమకాలిక సంత్ సద్గురువు, గురుభక్తి, అభ్యాసము. వీనిలో నేదైన నొక్కవస్తువుమాత్రమేయుండి మిగిలినవిలేనిచో కార్యము సఫలము కానేరదు. ఎవరికైనను సమకాలికసద్గురువు లభించినను మిగిలినరెండువస్తువులును లేనిచో వృథాకాలక్షేపమే యగును. ఎవనికైనను గురుభక్తియుండి మిగిలినరెండును లేనిచో అపుడుగూడ నిష్ప్రయోజనమైపోవును. ఎవరైనను అపారముగ నభ్యా సము చేసినను మొదటిరెండువిషయములు నతనికి లేనిచో అపుడుకూడ వ్యర్థమే అందువలన ఈమూడువిషయములకుగూడ మహిమయున్నది.

ఒకరెవరైనను అభ్యాసముచేయుచుండె ననుకొనుడు, రోజునకు రెండు సార్లు అభ్యాసముచేయవలసినదిగా విధించబడియున్నది కావున తప్పనిసరియైన దనెడి భావముతో అతడా అభ్యాసముచేసినను లేక తాను ఉత్తమలోకముల

లోనికి ప్రవేశించగల ననెడి ఆశతో చేసినను, ఈరెండుపరిస్థితులలోనుగూడ, అభ్యాస మనలే చేయనివానికన్న నతని కెక్కువఫలిత ముండును కాని, ఆ ఫలితము నామమాత్రమే. మొదటిపరిస్థితిలో మనము, మనకర్తవ్యమును నెఱవేర్చితిమ నెడి అహంకారము తక్షణమే పుట్టును. రెండవపరిస్థితిలోగూడ అహంకారముపుట్టుట కవకాశ మున్నది, లేదా అధమాధమము అది ఒక వెట్టిపనివంటిదై పోవును. విరహప్రేమభావములతో చేసినఅభ్యాసమే అసలైన అభ్యాసము చాలయెక్కువగ నభ్యాసముచేయువాడు ఒకకపటియైనను కావచ్చును లేదా అత్యంతవిరహముగల భక్తుడై నను కావలెను.

# 48

## సంతుమతములో కర్మనాశనము — సత్సంగులు ఆసుపత్రిలోనున్న రోగుల వంటివారు — సత్సంగికి మరణానంతరము గలుగుసహాయము.

5 జూన్ 1917:—సంత్ సద్గురువుయొక్క కార్యక్రమములకును, మిగిలిన మతములలోని కార్యక్రమములకును, భూమికిని ఆకాశమునకు నున్నంత వ్యత్యాసము గలదు. ఎట్లనగా ఇతరమతములవారు చాలగ్రంధపఠనము చేసినపిమ్మట కొద్దిగా కామమును లేక క్రోధలక్షణమును ఎప్పుడైన నొకప్పుడు అణచిపెట్టినచో వారు, "చూడుడు, నేను నాకామమును లేదా క్రోధలక్షణమును ఈవిధముగ నణచివైచితిని" అని అందఱితో చెప్పుకొందురు. కాని, వారు ఒకవైపు నుండి ఒకవికారమును కొద్దిగ నణచిపెట్టినపుడు వారియహంకారము మఱొకవైపునుండి మఱొకవికారము నెంతతీవ్రముగ వారిలో నెట్లు పైకిలేవదీయుచున్నదో వారు తెలిసికొనలేకున్నారు. వీరుచేసెడిపనులన్నియు ఒకచెట్టునుండి నాలుగైదు లేక పది ఆకులుమాత్రమే తుంచివేయుటతో సమానమైనది. అనగా కామమును లేక క్రోధమును కొద్దిగమాత్రమే వీరు అణచగలుగుచున్నారు. సంతులు అట్లుగాక చెట్టుయొక్కమూలమునే కొట్టివేయుదురు. మొదలు కొట్టినమీదట ఆకు లింకను పచ్చగనే కనబడుచుండును కాని అవిఎండి గాలిలో నెగిరిపోవునపుడు దానిమూలమే నరకబడిపోయినదని తెలియగలదు మిగిలినమతముల కార్యక్రమముల ఫలితముగ కొంతవరకు పైపై తళుకుబెళుకులు తప్పక కనబడుచుండవచ్చును. కాని అదిఅంతయు ఒక పైసమీాద వేయించిన వెండిపూత ఒక్కసారి చెయ్యి వేసినపుడు మాయమైపోయినట్లే నశించిపోవును.

సత్సంగము చేసుకొనుచున్నవారందఱును నిజమునకు ఒక ఆసుపత్రిలో నున్నారు. సత్సంగములోనికి సజీవులుగనున్న రోగులనే తీసికొందురుకాని చనిపోయినవారినితీసికొనరు. వైద్యుడు ఏరోగికైనను మందిచ్చినపుడు, ఆరోగికి వందల కొలదివి రేచనములగుచున్నను ఆయాలోచనపెట్టుకొనకుండ తానిచ్చినమాత్రలు వంటపట్టుచున్నవా లేదా యనువిషయమొక్కటే యెల్లుచూచుకొనుచుండునో, అటులనే సంత్ సద్గురువుగూడ, ప్రేమప్రీతులనెడి మాత్రల నిచ్చుచు సత్సంగికి అవి వంటపట్టుచున్నవిషయమును మాత్రమే చూచుచుందురు. రోగి యెంత జబ్బుపరిస్థితిలోనున్నను. చనిపోవుటకు సిద్ధముగనున్ననుగూడ వైద్యుడేమియు లెక్కపెట్టడు. అల్లే సద్గురువుగూడ ఇతరమతములవారిని గుఱించి ఆలోచించరు. ఏలననగా, తమయెడల భక్తిగల్గియున్నపుడు అది సమస్తదోషములను సమూలముగ నాశనముచేయునని వారికి తెలియును. వారీవిధముగ తమప్రేమప్రీతులనెడి మాత్రలనిచ్చుచు భక్తులను క్రమక్రమముగ సమస్తసుఖములకును, శాశ్వతానందమునకును ఆటపట్టైన సర్వేశ్వరునిధామమునందు చివరకు చేర్పించుదురు.

జీవుడు ఏపనిచేసినను, తనకున్నవాసనలప్రకారమే చేసితీరునను విషయముగూడ మనము లోకములో చూచుచున్నాము. ఎట్లనగా, ఒకచోరుడున్నాడనుకొనుడు. దొంగతనము చేయునపుడు, ఆఇంటి యజమాని తనను పట్టుకొన్నచో తాను జైలుకు వెళ్ళవలసియుండుననియు, లేదా తాను మేడమెట్ల మీదనుండి క్రిందకు పడిపోయినయెడల చనిపోవలసియుండుననియుగూడ నా చోరునకు ముందే తెలిసియుండిననుగూడ అతడు తనవాసనకు వశమైపోయియుండుటచే ఆపనిని చేయకుండ వదలిపెట్టడు. అటులనే ఈజీవునికి తా నేయింట పుట్టగలడో, చెట్టై పుట్టునో లేక జంతువై పుట్టునో ముందేమియు తెలియక పోయినను, చనిపోయిన పిమ్మట తిరిగి పుట్టకముందు అతనివాసనలప్రభావ మతని నేవైపునకు లాగివేయునో ఆవైపునకే అతడు వెళ్ళి జన్మనెత్తును. కాని సత్సంగికి సంత్ సద్గురువునందు భక్తి అంతరంగమున నాటుకొనియున్నందున ఆఖరిసమయమందు సంత్ సద్గురు వతనిలో తప్పక ప్రకటమై నిస్సంశయముగ నతనికి ఉత్తమ సుఖస్థానములలో నివాసము నిచ్చెదరు. ఈప్రశ్నను పరిష్కరించుటకై ఈ మాత్రము విమర్శ చాలును. ఇంతకన్న నెక్కువ ప్రయోగాత్మకమైన ప్రమాణము నిచ్చుట సాధ్యముగాదు.

# 49

## అభ్యాసముచేయుటవలన శరీరము నీరసపడునా!

8 జూన్ 1917 :-అభ్యాసుల శరీరములు అభ్యాసముచేయుటవలన నీరసించిపోవుచున్నవని చెప్పుచుందురు. ఈవిషయమై ఒకమాట చెప్పవలసియున్నది. సామాన్యముగ లోకములోనన్నిటికిని క్షీణదశ వచ్చుచునే యుండునుకదా. ఏ యే జాతులవారు పూర్వము గొప్పయభివృద్ధిలో నుండిరో వారిపుడు అవనతిలో నున్నారు. 1870 వ సంవత్సరములో యుద్ధముజరిగినది మొదలుకొని ఇప్పటివఱకు ఫ్రాన్సుదేశముయొక్క పరిస్థితిని పరికించిచూడుము. వారి ఎత్తు రమారమి ఒకఅంగుగు తగ్గిపోయినదని చెప్పుచుందురు. గ్రీసుదేశరాజ్యముయొక్క అభివృద్ధి ఎంతగొప్పగనుండెడిదో ఇప్పుడు అంత అనామకమైన అవస్థలోనికి వచ్చెను. మనదేశములో క్షత్రియులు, రాజపుత్రుల యభివృద్ధిని గూడ చూడుడు. మొదటిలో వారిశౌర్యము లోకములో నెచ్చటను సాటిలేనట్లుండెడిది. ఆక్షత్రియులు, ఆరాజపుత్రులునే ఈకాలములో గడ్డి కోసుకునువారుగను, గుఱ్ఱములు తోలుకునువారుగను, కూలివారుగను తయారైరి. ఒకప్పుడు అభివృద్ధిగలిగియుండుటయు, మఱొకప్పుడు క్షీణదశ గలుగుటయు నీలోకములో రివాజుగ నున్నది. సర్వసామాన్యమైన యీక్షీణదశ గలుగుటయు, శరీరములకు దుర్బలత్వము గలుగుచుండుటయు నందఱకును స్వానుభవవిషయమే. ఇవ్విధముగ, క్షీణదశ యీ సృష్టిఅంతయు నశించిపోవునంతవఱకు నట్లే పెరిగిపోవుచు నుండగలదు.

ఇప్పు డిఁక నభ్యాసమువలనగలిగెడి బలహీనతనుగుఱించి యాలోచించవలసియున్నది. కొందఱు అభ్యాసము క్రొత్తగా ప్రారంభించినవారు అనియు, మఱికొందఱు కొంతకాలమునుండి అభ్యాసము చేయుచునుండినవారనియు, మూడవరకమువారు అభ్యాసము చాలకాలముచేసి పరిపక్వమైనవారు అనియు, అభ్యాసులలో మూడురకములవారున్నారు. ఈ మూడురకములవారును అభ్యాసులేయని పేర్కొనబడుదురుగాని అందులో మొదటి రెండురకములవారును సామాన్యతరహా అభ్యాసులు కావున వారికి అభ్యాసముమూలమున శరీరము నీరసపడిపోయెనని చెప్పుటకు వీలులేదు. ఇఁక మూడవరకపు అభ్యాసులైతే వారిమన స్సీప్రపంచమునుండి విరక్తమైపోయి, వారు శరీరమన్న నెంతమా

త్రిము శ్రద్ధతీసుకొనకుండ నుండుచు, రుచితో నిమిత్తములేకుండ నేదిలభించిన దానితోనే పొట్టనింపుకొనుచు, ఇంద్రియసుఖములకొఱకై వారెంతమాత్రము నాలోచించరు. వారి హృదయములలో నెల్లపుడు తమగురుచరణములందు ప్రేమభావమే వ్యాపించియుండును. వారికెల్లపుడును ఒకవిధమైన చింత హృదయమున నుండి వారు ఉన్మత్తులవలె నుందురు. ఈ మూడవరకము అభ్యాసి శరీరము నీరసపడిపోవుటకు కారణము సులువుగ బోధపడగలదు. కాని ఆతన్మయావస్థ పదిపండ్రెండేళ్ళకైనను కలుగుట కష్టము. ఐనను ఆవశ్యకమైన ప్రాపంచికకార్యములయెడల నతడు నిర్లక్ష్యముగనుండిపోడు, అతనికి అట్టికార్యములను నెఱవేర్చుకొనుటకు అసమర్థతయు నుండనేరదు. అయితే అట్టివారికి వ్యర్థమైన ఐహికచింతలలో కాలక్షేపముచేయుటగాని వ్యర్థమైనమనుష్యులతో, అనగా మనోఘట్టముతో నెక్కువసంబంధము గలిగినవారితో కలిసిమెలిసి తిరుగుచు కాలక్షేపముచేయుటగాని ఇష్టము ఉండదు. వారికి అట్లుచేయుట అవసరమున్నట్లుగూడ అనిపించదు. అట్టివిషయములు వారిమనస్సునకు అప్రియముగ నుండును. ఆత్మయొక్క నివాసస్థానమును తెలిసికొని అచ్చట తమ చిత్తము నేకాగ్రముచేయు రహస్యము నెఱింగినవారికి తమ క్లిష్టవిషయముల నన్నిటిని సులువుగ సాధించుకొనగలశక్తి లోలోపలనుండి యుద్భవించును.

ఈలోకములో చూడుడు, ఎంతశక్తిసామర్థ్యములున్ననుగూడ మఱొకశక్తియొక్క సహాయ మెప్పుడును కావలసియేయుండుచుండును. చక్రవర్తుల వద్ద లక్షలకొలదిసైన్యముండియు ఖజానాలు పూర్తిగ నిండియున్నను లక్షలకొలది పనిచేయువాండ్రుండియు లెక్కలేనంతమంది నౌకర్లుకూడ యుండియున్నను వారికి మఱొకరితో యుద్ధమువచ్చినపుడు తమఅశక్తత బోధపడి మఱొకబలవత్తరశక్తియొక్క సహాయమును వేడుకొనుచుందురు. దేవాలయములు, మసీదులు, చర్చిలలోనికిని (churches) వెళ్ళి అచ్చట తమసైనికులకు మరణమునుండి భయపడకుండులాగున ధైర్యమునిమ్మనియు, తమశత్రువులపైన విజయము సాధించగలశక్తి తమ ఆయుధముల కిప్పించుమనియు, శత్రువులకు పరాజయముగలిగించు పన్నుగడలను ఉపాయములను చేయగలసమర్థత తమ బుద్ధికి గలుగజేయవలెననియు ప్రార్థనలు చేయుచుందురు. చెప్పవచ్చినదేమనగా అన్నిరకములైన సామగ్రియు తమవద్దనుండినను అదిచాలక ఇంకొకమహాశక్తియొక్క సహాయము ఆవశ్యకమైనట్లు బోధపడుచున్నది. చిత్తము నేకాగ్ర

ముచేసికొనగల రహస్యము తెలియనివారే ఈవిధముగ క్లిష్టపరిస్థితులు వచ్చి నపుడు ఇతరులవద్దకు పోయి సలహాలను ఉపాయములను తెలిసికొనగోరుదురు. అప్పుడు ఆఇతరులు చిత్తము నేకాగ్రముచేసికొని చెప్పెడి ఉపాయమును వీరు అవలంబించి, అందువలన లాభము నొందుచుందురు.

ఇప్పుడు తెలిసికొనవలసిన విషయమేమనగా తనఆత్మను ఆత్మస్థానము దగ్గఱ నిలబెట్టుట తెలిసికొన్న అభ్యాసికి పరసహాయమెద్దియు లేకుండ తనకు తానే కఠినసమస్యల నన్నిటిని సాధించుకొనగలసమర్థత చేకూరును. కావున శరీరముయొక్క తుచ్ఛమైనరక్తమాంసములు కొంతతగ్గిపోయినను, అందుకు ప్రత్యామ్నాయముగా తనక్లిష్టాతిక్లిష్టకార్యమునుగూడ సులువుగ సాధించు కొనగలశక్తి చేకూరినచో నట్టిబేరములో నష్ట.మేమియు లేనట్లే చెప్పవలెను. అనగా అతనికి అభ్యాసమువిషయములో అశ్రద్ధచేయవలసినంత భయంకరమైన నష్టమెద్దియు కలిగినట్లు తోచదు. చెప్పవచ్చినదేమనగా అభ్యాసమువలన కొంత శరీరదౌర్బల్యము గలిగినట్లు ఒకవేళ కనబడినను ఆయభ్యాసికి దాని కెన్నియోరెట్లెక్కువలాభము మఱొకవిధముగ గలుగుచున్నది. ఇంకొకవిధ ముగగూడ చెప్పవచ్చును. పరమపురుష రాధాస్వామీదయాళురు సచ్చిదా నందస్వరూపులు. ఈజీవుడు అనగా ఆత్మకూడ వారి అంశయే. ఆత్మలో దానికి సహజమైన సచ్చిదానందావస్థ మేలుకొని, జీవుడు తన సచ్చిదానందస్వరూపమును తెలిసికొన్ననాడు అతనికి మఱొకరివలన నెట్టిసహాయమును పొందవలసిన ఆవ శ్యకతయే యుండనేరదు. లౌకికపదార్థములన్నియు సమృద్ధిగనుండినపుడుగూడ ఏశక్తియొక్కసహాయము జీవుల కావశ్యకమైయున్నదో ఆశక్తి ఈయభ్యాసికి సంప్రాప్తమైపోయినందువలన నతడు ఐహికక్లేశములనుగుఱించియు, శరీరమన స్సులనుగుఱించియు నిశ్చింతగనుండును. మహామహాచక్రవర్తులకుగూడ నేశక్తి యొక్క సహాయము అవసరమైయున్నదో అట్టిశక్తియొక్క నిజభండారము నుండియే ఈఅభ్యాసి కెల్లపుడు శక్తిచేకూరుచుండును. శరీరదౌర్బల్యవిషయ ములో చెప్పవలసిన అంశము ఇదొకటి.

ఇక మఱొకచెప్పవలసిన ఆవశ్యకవిషయ మేమనగా, నిజమున కభ్యాస మువలన అభ్యాసిశరీర మెన్నటికి నీరసము కానేరదు. చదువుకొనెడి విద్యార్థి కెవనికైనను, దృష్టిలోపముగాని తలతిప్పుగాని గలుగుచుండును. కాని అత నికి చదువుటవలన అట్లుకాలేదు. అతడు చదువుటలో తప్పుపద్ధతుల నవలంబిం

చుటవలననే అట్లయ్యెను. చదువునపుడు కావలసినంత వెల్తురు లేకుండ నతడు చదువుకొనుచుండవచ్చును. లేదా పుస్తకములో అచ్చు సరిగా నుండకపోవచ్చును. లేదా అట్లే మఱొక కారణ ముండవచ్చును. అతనికండ్లకు ఇట్టివిషయములవలననే చెడుపరిభావముగలిగి దృష్టిలో లోపము గలుగుచుండును. కాని అందఱును అతనికి చదువుకొనుటవలన ఆచెరువు గలిగెనని యనుకొనుచుందురు. అభ్యాసమునుగుఱించిగూడ ఇట్టిపొరబాటుఅభిప్రాయమే పడుచున్నారు. ఎట్లనగా, అభ్యాసి యెక్కువనిద్ర పోవచ్చును, యెక్కువ మేల్కొనవచ్చును, లేదా యెక్కువ తిండితినవచ్చును. గురుచరణములందు ప్రేమలేకుండా తన శక్తి నుపయోగించి బలవంతముగ అభ్యాసముచేయుచు ఆ అభ్యాసముగూడ నెక్కువతీవ్రముగ చేయవచ్చును. దానిమూలమున నతనిశరీరము దుర్బలము కావచ్చును. తనదౌర్బల్యమునకు తానుచేసిన అభ్యాసమే కారణమని అతడు అపోహపడినందువలన అభ్యాసమునం దతనికి అభావము గలిగినను గలుగవచ్చును, లేదా అతడు అభ్యాసము చేయుటయే చాలించినను చాలించవచ్చును. ఇది చాలపొరపాటు. అట్లుగాక నతడు చేయవలసినపని యేమనగా, సద్గురు చరణములందు ప్రేమభక్తులను నిలుపుకొని వారి మహాసహాయముపైన నాధారపడుచు, ఆహారనిద్రాజాగరణాదులలో కట్టుబాటుతో ప్రవర్తించుచు, నిషిద్ధపదార్థములను, నిషిద్ధకృత్యములను విసర్జించి, మొఱటుపద్ధతుల నవలంబించకుండ అభ్యాసము చేసుకొనుచుండవలయును. ఈవిధముగ నభ్యాసము చేసుకొనుచుండిన నెట్టిలాభము సేకూరునో పైన తెల్పియేయుంటిమి. అనగా సకలసృష్టికి నధీశ్వరుడైన రాధాస్వామిదయాళు రట్టివానిమీద నెల్లపుడు దయ వర్షించుచుందురు. రాజాధిరాజులుకూడ నేదయకై ఆశించుచుందురో అట్టిదయ కీఅభ్యాసి పాత్రుడగును. ఈవిధముగ నేకార్యములోనైనను దోషము వచ్చినపుడు దానికి నిజమైనకారణమును కనుగొని ఆదోషమునకు హేతుభూతమైన విషయమును విసర్జించవలెను. కారణము విషయములో దురభిప్రాయము పడి ఈశుభకార్యమును వదలిపెట్టుట తెలివైనపని గానేరదు.

## 50

### పరమార్థమునకు మనోభావము సరిగనుండుట ముఖ్యము.

11 జూన్ 1917 :-ఏపని చేయుచున్నను "రామరామ" అని ఉచ్చరిం

చుచు తీర్థయాత్రలు, దానపుణ్యములు చేయుచుండువారు భక్తిచేయుచున్నారని లోకులందఱు నభిప్రాయపడుచు, అట్టివారిని భక్తులని పేర్కొనుచున్నారు. ఎట్లనగా ఒక డాక్టరున్నాడనుకొనుడు. ఒకరోగికి వ్రణముపేసెను. ఆడాక్టరు ఆరోగిని చాలదయతో పరీక్షించి అతని కురుపునకు ఆపరేషను బహుశ్రమపడి చేయును. ఫీజు ఏమియు తీసుకొనడు. మందులఖర్చుగూడ తీసుకొనలేదు. జబ్బు తగ్గినతరువాత అతనిని తూచి బరువునుచూచి, బాగుగా ఆరోగ్యము వచ్చిన పిమ్మట ఇంటికి పంపించును. లోకులు ఇదంతయుచూచి ఆడాక్టరు చాలమంచి వాడనియు, గొప్పభక్తుడనియు చాలశ్లాఘింతురు. కాని అసలువిషయ మేమనగా ఆడాక్టరుకు ఆరోగియందు సానుభూతియును లేదు, దైవభక్తియు లేదు. అతని అసలైనయుద్దేశ్యము మఱొకటి. ఏదనగా ఇట్లు చేయుటవలన తనకు ప్రతిష్ఠ రావలెననియు, వార్తాపత్రికలలో తన్ను శ్లాఘించవలెననియు నతని యుద్దేశ్యము. ఈవిధముగనే లోకములోని భక్తిఅంతయు స్వార్థప్రధానమై యుండును. సంత్ మతములో చెప్పెడిభక్తి ఏవిధమైనవిషయవాసనలు అనగా ఐహికవాంఛలు లేకుండ పరమపురుషుని పూజించుటయే. సేవ శరీరముతోను, ధనాదులతోను చేయవలయునన్నమాట సత్యమేగాని, సత్సంగియొక్క మనోభావము సరిగా లేనిచో నతడు లక్షలు కోట్లు ఫేంటుగనిచ్చినను, సత్సంగములో నెంతకాలముండినను, అట్టి పైపై భేంట్లు, సత్సంగసేవలును, అన్నియు వృథా ప్రయాసయే అగును.

## 51

## అభ్యాసము సాగుటకై మనస్సును కట్టుబాటులో నుంచవలెను.

12 జూన్ 1917 :- మద్యమాంసములను ఇతరనిషిద్ధవస్తువులనన్నిటిని గూడ విడిచిపెట్టినంతమాత్రముచే తమకర్తవ్యము పూర్తియైపోయినదని జనులు సామాన్యముగ ననుకొనుచుందురు. కాని వారు ఆపనులమూలమున భక్తిచేయుటకు అర్హమగునట్లు శరీరమునొక్కదానినే చేసుకొందురుకాని మనస్సును చేసికొనుటలేదు. కామక్రోధాదులు మనసుననున్నంతకాలము అది పరమపురుషునికి భక్తిచేయుట కెట్లు తగియుండును. లోకవ్యవహారములో కామక్రోధాదులుండుట కొంతవఱకవసరమే కాని అచ్చటగూడ తెలివిగలమానవుడైతే తనమనస్సు కోపమువలన వికారము చెందకుండులాగున తనకోపమును హద్దులు

మీారకుండ నణంచియుంచుకొనును. ఉదాహరణకై యెవరైననొకరు ఉదయము పూట బహుజాగరూకతతో భజనాభ్యాసము చేసుకొనుచుండును. భజనాభ్యాసమును చేసుకొనుటకై చాలసార్లు ప్రయత్నముచేసినను, అది సరిగ సాగక పోయినపుడు, అతడు చివరకు ఖిన్నుడై లేచిపోయి, ఆనాడంతయు అవిచారముతోనే గడిపివేయును. తిరిగి 4 గంటలకు అభ్యాసమునకు కూర్చుండును. అపుడు అభ్యాసము కొంతవఱకు బాగుగసాగును. బహుకష్టముమీాద దొంగ దొరికెనని సంతోషించును. తనమనస్సుయొక్క పరిస్థితి మరల చెడిపోకుండనుండులాగున బహుజాగ్రత్తగ మనస్సును నొక్కిఉంచుకొనును. కాని మఱునాడు అతని మనస్సుయొక్క పరిస్థితి తిరిగి యథాప్రకారముగ నైపోవును. ఈవిధముగ మనస్సుతో గట్టిగ పోట్లాడుచునుండినను గూడ భజనాభ్యాసమువ్యగిరా లతనికి అప్పుడప్పుడుమాత్రమే సరిగ సాగుచుండును. మనస్సుయొక్క పరిస్థితి యిట్టిదైయుండగా, కామక్రోధములు ఈర్ష్యావిరోధములు మొదలైన మనస్తరంగములలో కొట్టుకొనిపోవుచు నామమాత్రముననే సత్సంగులమని యనిపించుకొనెడివారి పరిస్థితినిగుఱించి చెప్పునదేమున్నది. ఈమార్గము చాల నాజూకైనది.

హుజూర్ మహారాజువారును, మహారాజ్ సాహబ్ వారునుగూడ కోపగించుచుండెడివారుకదా, మేముమాత్రము కోపగించినచో తప్పేమియని చాలమంది యనుచుందురు. కాని హుజూర్ మహారాజువారు మహారాజ్ సాహబ్ వారు సర్కార్ సాహబ్ వార్ల కోపమంతయు ఉత్తపైపైకోపమే. కాని వారి అంతర్యమందు లేశమాత్రముగూడ క్రోధభావ ముండెడిదిగాదు. ఇందుకు ప్రమాణమేమనగా ఎవనిపైననైన నొకప్పుడు కోపముచూపినను వెంటనే అతనితో వారెంతయు మార్దవముతో మాట్లాడుచుండెడివారు. ఎవరికైనను నిజమైనక్రోధముయొక్క ఆవేశము కలిగినపుడు అతడు తిరిగి స్తిమితపడుటకు చాల కాలము పట్టును.

## 52

### జడపదార్థము, మనస్సు, ఆత్మ.

13 జూన్ 1917 :-పండితహీరాలాల్ గారి సోదరునికుమారునితో విజ్ఞాన శాస్త్రసంబంధమైన విషయములు చర్చించిరి. జడపదార్థములో (Matter)

అనగా నీరు నిప్పు వగైరాలలో శక్తి (energy) యున్నదిగాని జ్ఞానము (Intelligence) లేదు. కావున దీనినిబట్టి వీనినన్నిటిని నడిపించెడిది (motor) మనస్సని తేలుచున్నది. ఇది చాల చంచలమైనది. దీనికి ప్రేరణ (impulse) ఆత్మవలన గలుగుచున్నది. ఆత్మయొక్క శక్తిని మేల్కొలుపుకొన్నవానికి ఐహికానందములన్నియు (వేనిని లోకము మహావరదానములుగ నెంచుకొనుచుండునో) రుచిహీనముగను, చప్పగను ఉండును. ఇత్యాది.

## 53

అభ్యాసములో నేకాగ్రత గలుగుటెట్లు? స్మరణధ్యానములవలనగలుగు మహాలాభము.

14 జూన్ 1917 :—మనస్సు నేకాగ్రముచేసి నామస్మరణచేయుట యెట్లని కుప్పుస్వామి యను మదరాసుసత్సంగి ప్రశ్నించగా, హుజూరువారు మనస్సు నేకాగ్రముచేసుకొన్నపుడు నామస్మరణ దానంతటనదియే సాగిపోవుననియు, ఈప్రశ్న వేయుటలోనే పొరబాటున్నదనియు సెలవిచ్చిరి. ఏకాగ్రతచేయుట యెట్లు అని ప్రశ్నించినచో సరిగనుండును. దీని కుపాయము స్మరణధ్యానములు. శబ్దము వినిపించనిచో స్మరణధ్యానములు చేసికొనవలెను. సద్గురుని చరణము లందు ప్రేమప్రీతులున్నచో నేకాగ్రత దానంతటనదియే కుదిరిపోవును. స్మరణధ్యానములు దానికి తోడుపడును. స్మరణధ్యానములు ప్రధానమైన అభ్యాసము. ఇంకను ముందుముందుకు వెళ్ళగా స్మరణధ్యానభజనలు మూడును ఏకమైపోవును. స్మరణధ్యానములు చేసినందువలన మొదట ఏకాగ్రత గలుగును. పిమ్మట ఏకాగ్రతతో స్మరణధ్యానములుచేసినపుడు రూపము ప్రకటమై కొంచెముకొంచెముగ శబ్దము వినబడుచుండును. తిరిగి స్మరణధ్యానములు అభివృద్ధియగుచున్నకొలఁది శబ్దము నిర్మలముగ వినిపించసాగును. ఇందుకు సరియైన పద్ధతి యేమనగా పనిపాటలుచేయుచు నిటునటు తిరుగుచున్నపుడుగూడ రోజంతయు స్మరణధ్యానములు చేసుకొనుచునే యుండవలెను. అట్లుచేయుచుండుటచే ఉదయాస్తమయములయందుచేయు స్మరణధ్యానాభ్యాసము సరిగసాగును. ఎవరికైనను పనిపాటలు చేసికొనిన వెంటనే అలిసిపోయినపుడు మనస్సు భజనాభ్యాసముచేయుటకు ఇష్టపడదు. ఎవరైన నొకసిపాయి రోజంతయు యుద్ధము చేసి సాయంకాలమున కలసిపోయినపుడు ఒకశౌర్యముపుట్టించుగానము నెవ్వరైన

పాడినచో అతనియొడలంతయు పులకరించి అతడెట్లు యుద్ధముచేయుటకు తయారగునో అటులనే రోజంతయు నప్పుడప్పుడు స్మరణధ్యానములు చేసికొనుచు పని పాటలుచేసి సాయంకాలమునకు అలసిపోయినందువలన నెవనికైనను భజనాభ్యాసములో కూర్చుండుటకు మనస్సొప్పనిచో నతడు ఒకవిరహ ప్రేమభావములతోగూడిన శబ్దమును పాడుకొనవలెను. అట్లు చేసినచో అతనికి చిత్తమందు త్సాహము బయలుదేరి భజనాభ్యాసములో కూర్చుండగనే మనస్సు అభ్యాసములో లగ్నమైపోవును. మనస్సును స్థిరముజేసికొనుట కిదితప్ప మఱొక యుపాయము లేదు.

కబీర్ సోయా క్యా కరే జాగనసే కర చౌంప్,
యహ దమ్ హీరా లాల్ హై గిన్ గిన్ గురు కో సౌంప్,
కహాతా హూఁ కహ జాత హూం కహే బజాఊఁ ఢోల్ ॥
స్వాఁసా ఖాలీ జాత్ హై తీన్ లోక్ కా మోల్ ॥

అర్థము :-కబీరువారు సెలవిచ్చుచున్నారు. నిద్రపోయినందువలన లాభమేమున్నది ? చటుక్కున లేచి కూర్చుండుము. మీ ప్రతిశ్వాసయు రత్నములతోను మాణిక్యములతోను సమానమైనది. దీనిని ఒక్కొక్కటిగ లెక్కపెట్టి గురువుగారికి అర్పణచేయుము. నేనీవిషయమును తిరిగితిరిగి చెప్పుచున్నాను. ఢంకామీద దెబ్బకొట్టి చాటించి చెప్పుదును. ముల్లోకములతోసమానమైన విలువగల యీశ్వాసను మీరు ఊరకనే పోగొట్టుకొనుచున్నారు.

స్మరణధ్యానము లెల్లప్పుడు చేయుచుండుటచే కార్యకారణనియమమునకును (causality) దేశకాలములకును (space & time) సంబంధించిన విఘ్నములనుండి కాపుదలగలుగును. మనముచేసెడి పనులన్నియు నీమూడువిషయములలో నిమిడియున్నవి కాని వానినిదాటి పోనేరవు. అనగా ప్రతిపనియు కార్యకారణనియమమునకును (causality) దేశకాలములకును (space & time) లోనైయుండును. ప్రతికార్యమునకు నొకకారణమును తిరిగి దానికి ఫలితము అనగా కార్యమును తిరిగి కారణము తిరిగి కార్యమును జరుగుచు, ఈవిధముగ మానవుడు వీనిలోనే వ్యాకులపడిపోవుచుండును. కాని స్మరణధ్యానము లెల్లపుడు చేయుచుండినయెడల ఈ మూడువిధములైన విఘ్నములును అతని కేమియు హాని గలుగచేయనేరవు.

## 54

పరమార్థములో ప్రేమప్రీతులు ప్రధానము-

బాహ్యాచారములు, ఆలోచనాశక్తి ఉత్సాహావేశములకును ప్రాధాన్యములేదు.

15 జూన్ 1917 :-ప్రతిమతములోను మూడురకముల మనుష్యులుందురు. ఒకరకమువారు తమవిచారణశక్తిని వినియోగించి పూర్తిగా ఆమత రహస్యవిషయములను బోధపఱచుకొందురు. రెండవవారు భావపూరితులైన వారు వారు ఆచుతిముయొక్క మాహాత్మ్యమునుగుఱించి అధికాధికమైన ఉత్సాహావేశములతో నిండియుందురు. ఎట్లనగా ఒకచరణము చదివినంతనే వారు ఆవేశముతో నాట్యముచేయుట ప్రారంభించుచుందురు. మూడవరకమువారు కర్మిష్ఠులు, అనగా బాహ్యాచారములు, బాహ్యానియమములను పాటించువారు. అసలు, ఈమూడును వెవ్వేఱుగ తప్పుడుకార్యక్రమము లగుటయేగాక, నీ మూడువిషయములును సంపూర్ణముగ కలిసియున్నట్టి కార్యక్రమముగూడ తప్పే. అయితే ఆంతర్య ప్రేమప్రీతులకు సంబంధించిన కార్యక్రమము ఏదైనను అట్టిప్రేమప్రీతులమూలమున సాగించబడినచో-లోకులు దానిని నిందించినను లేదా తప్పులుపట్టిననుగూడ- అది నిస్సంశయముగ పూర్తిగా యుక్తమైనదే. ఐనను భావావేశముల కార్యక్రమము, బుద్ధివిచారణకార్యములు, కర్మకాండ యొక్క కార్యక్రమమును సుషుప్త్యవస్థలో మాయమైపోవుచున్నది. కొందఱు జ్ఞానులు సుషుప్తిలో ముక్తియున్నదని చెప్పుచుందురు. కాని అది బొత్తిగ తప్పుటభిప్రాయము. సుషుప్తికిపైన ముక్తిస్థానమున్నది. దానిపైనుంచి సంతుల అభ్యాసము ప్రారంభించబడును.

## 55

రెండు ప్రశ్నలకు సమాధానములు :

16 జూన్ 1917 :-

ప్రశ్న :-భగవంతునికిని గురువునకును వ్యత్యాసమేమి ?

జవాబు :-వేదాంతమార్గప్రకారము నేను, నీవు, జీవుడు, బ్రహ్మ, వీరం

దటు నొక్కటే. కాని సంతుల సిద్ధాంతప్రకారము భగవంతుడు నిజభండార మును, బ్రహ్మ సింధురూపమును, జీవుడు బిందురూపము నైయున్నారు. మేఘము సముద్రమునుండి నీటినాకర్షించి మఱొకస్థలములో వర్షించగా ఆనీరు మట్టి లోకలిసి రొచ్చుగా తయారగును. ఆరొచ్చులోనున్న నీరు తానే సింధువుసని చెప్పినచో అది పొరబాటగును. సంయోగవశమున నేనదిలోనైన వరదవచ్చి పోంగి ఆనీరును కలిసికొని దానిని తనతోగూడ తీసికొనిపోయినచో నది సము ద్రములో కలియగలదు. అటులనే ఈజీవుడుగూడ భగవంతునిస్వరూపమేగాని అతడు ఇచ్చటకువచ్చి శరీరమనస్సులు, ఇంద్రియములతోను సమ్మిళితమైపోయి యుండుటచే నిప్పు డతడు తాను భగవంతుడనని చెప్పుకొన్నచో నది ఆరొచ్చు నీటియొక్క ప్రగల్భమువలెనే పూర్తిగ పొరబాటగును. భగవంతునితో స్వయముగ నైక్యముపొందియుండి నదీరూపముగ నిచ్చటకువచ్చిన సద్గురువెవ రైన నీజీవునకు లభించినచో వారు ఈరొచ్చురూపములోనున్న జీవుని తీసికొని పోయి సముద్రములో కలిపివేయగలరు. ఈవిధముగా గురువును నదీరూప మనియు, భగవంతుని సముద్రరూపమనియు, జీవుని రొచ్చురూపమునియు చెప్ప వచ్చును.

ప్రశ్న :—గురునియాంతర్యమున పనిచేయుచున్నదని చెప్పబడు ధారయనగ నెట్టిపదార్థము ?

జవాబు :—జీవుడు భగవంతునినుండి విడిపోయివచ్చి, ఈప్రపంచములో అనేకవిధములైన భోగములలో చిక్కువడి దుఃఖముల ననుభవించుచున్నాడు. ఈభూమి ప్రతివస్తువును తనవైపునకు తనమధ్యాకర్షణశక్తిచే (Gravitation) లాగుకొనుచున్నది, సూర్యుడు తనవైపునకు లాగుకొనుచున్నాడు. ఇవ్విధముగ పరస్పరము లాగుకొనుటలో ఈలోకముయొక్క కార్యములన్నియు సాగిపోవు చున్నవి. ఈ ఆపత్తునుండి తప్పించుకొనుటకై ఎవరైనను తనబలమునుపయో గించి పైకాలోహింపగోరినచో నేమగును ? కొంతదూరము పైకి వెళ్ళినపిమ్మట నతడు పిండిగుండయైపోవును. ఒకవేళ అతడు సూర్యునివఱకు నెట్లైన జేరుకొ న్నను అచ్చటి ఆకర్షణప్రభావమువలన నతడు అచ్చటనే సూక్ష్మాతిసూక్ష్మకణ ములక్రింద మాఱిపోవును. భగవంతునిధామమందు జేరుకొనుట అసలే అసాధ్యము.

జీవులు ఈలోకములో మహాదుఃఖితులై యున్నందున భగవంతుడు వారి సంరక్షణనిమిత్తమై తమనిజపుత్రుని లేక నిజ ముసాహిబ్‌ను పంపుచుండును. ఆనిజపుత్రుడు ఇచ్చటకువచ్చి ఒకనరశరీరములో ప్రవేశించును. జీవుల ఉద్ధార కార్యము అపుడు ఆయనద్వారా సాగిపోవుచుండును. మఱొకవిషయ మేమనగా గొప్పగొప్పవైజ్ఞానికశాస్త్రజ్ఞులు కనిపెట్టుచున్న అపూర్వమైనగుప్త శక్తుల యావిష్కరణలుగూడ నెవరోయొకమనుష్యునిద్వారానే జరుగుచున్నవని మనకు తెలియును. ఈఆవిష్కరణలుచేయు జీవాత్మలుగూడ నిచ్చటిజీవుల లాభముకొఱకును సంరక్షణనిమిత్తమును ఏదోయొక ఉన్నతలోకమునుండి దిగివచ్చి మనుష్యశరీరముద్వారానే ఆ యావిష్కరణములను జేయుచున్నారు.

సంతులీవిధముగ నుద్ధారకార్యక్రమమును ప్రారంభించినపుడు వారు ప్రకృతినియమముల నుల్లంఘించరు. వారుకూడ సరిగ మానవునివలెనే ఇచ్చట ప్రవర్తించుచు శరీరమునకు యుక్తసమయమువచ్చి దక్షతపోయినపుడు దానిని విసర్జించుదురు. ఆపరిస్థితిలో ఆధార వెనుకకు మఱలిపోవలసివచ్చును. అయితే ఆధార వెనుకకు పోయినపిమ్మట తిరిగి ఈకార్యమును క్రొత్తగా ప్రారంభించ గోరినచో నది ఒకపసిపిల్లవాడుగ తిరిగిపుట్టి కౌమారవయస్సువచ్చువఱకు పని చేయకుండ నట్లే యుండవలసివచ్చును. అట్లైనచో నీమధ్యలో పరమార్థాభివృద్ధికి గొప్ప అంతరాయము గలుగుచుండును. కావున నీధార అంతకుపూర్వమే ఇచ్చటకు వచ్చియున్న మఱొకశరీరములో (వారినే గురుముఖు లందురు) పూర్వపుశరీరము విడిచిపెట్టుసమయమందు వచ్చిప్రవేశించి ఆయనద్వారా కార్యక్రమమును సాగించుట ప్రారంభించును. దీనినే ధారయని అందురు. సారబచన్ (గద్యభాగము) 250 వ వచనములో వ్రాసినప్రకారము, ఒకసద్గురువు శరీరము విడచినపుడు వారువెళ్ళి తమఉత్తరాధికారియైన శిష్యునిలో ప్రవేశించుదురు.

అటుతరువాతను, మానవుడు నాలుగుపనులు అత్యంతావశ్యకముగ సాగించుకొనవలసియున్నదని సెలవిచ్చిరి. మేమీవిషయమును కేవలమొక మానవునివలెనే చెప్పుచున్నా మనిరి. ఈ నాలుగుపనులు మానవుడు సరియైన పద్ధతిని సాగించుకొన్నచో నతనికి దుఃఖమెంతమాత్రము కలుగనేకలుగదు, కలిగినను మూడు, నాలుగుసంవత్సరములకొక్కసారి ఎప్పుడైనను కొద్దిగ కలుగుచుండును. అదిగాక నీప్రపంచములో నతడెల్లపుడు సుఖముగనే జీవితము

గడుపుకొని చివరకుగూడ శరీరమును సుఖముగనే విడచిపెట్టును. ఆనాలుగు పనులు నెవ్వియనగా :—

1) ఒకటి, సద్గురువును అన్వేషించుకొనుట—అట్లన్వేషించుటలో జీవితమంతయు గడచిపోయినను నష్టమేమియు లేదు. అతనికి దుర్గతి కలుగదు. 2) రెండు, సద్గురువు లభించినపుడు వారికి భక్తిచేయవలెను. 3) మూడు, వారు చెప్పెడి యభ్యాసమును చేయుటకై సంపూర్ణముగ ప్రయత్నించవలెను. 4) నాలుగు, నిజధామమునకు పోవలెననెడి యాసక్తి కలిగియుండవలెను.

## 56

### సంతసద్గురువుయొక్క అసలైన చిహ్నా.

18 జూన్ 1917:—న్యూనచైతన్యమునుగురించి విమర్శించిరి. భగవంతుని సర్వజ్ఞత విశేషచైతన్యము, న్యూనచైతన్యములు రెంటిలోను వ్యాపించియున్నది "సురత్" దశ పరమపురుషుడును, "నిరత్" దశ కాలుడును అయియున్నవి. భగవంతునియొక్క స్వరూపము కేవలము ప్రేమయే కానిచో జీవుల యుద్ధారమే అసాధ్యమైపోయెడిది. ఎవరిసహవాసము చేయుటచే జీవునికి హృదయమున ప్రేమప్రీతులు జనించి, ఈప్రపంచమునుండి విముక్తి గలుగుచున్నట్లు అనుభవము గల్గునో వారే సంత్ సద్గురువు. సంత్ సద్గురువును గుర్తుపట్టుటకు ఇదియే అసలైనచిహ్నా. సంత్ సద్గురువుయొక్క కను ముక్కు తీరునుబట్టియు ముఖవైఖరినిబట్టియు వారిని గుర్తుపట్టవలెనన్నచో నట్లు సాధ్యముకాదు.

## 57

### అహంకారమును నశింపజేసుకొనువిధము — సర్వసమర్థుని రక్షణహస్తము తనపైనున్నట్లు సత్సంగి యెల్లపుడు భావించుకొనవలెను.

19 జూన్ 1917:—లోకములో సామాన్యముగ జీవులందఱును తమఅహంకారముమూలముగనే పనులన్నియు జరిగించుచుందురు. కాని జీవుడు సద్గురువుయొక్క పథప్రదర్శనముక్రిందనే తనకృత్యములను చేసికొనుచుండవలెనని సారబచన్ (గద్య) 101, 102 నెంబర్లవచనములలో వ్రాసినవిషయము పఠించబడినది. అందుపైన హుజూరువారిట్లు సెలవిచ్చిరి:—లోకములో జరిగెడి పను

లన్నిటిలోను ఒక క్రియయు ఒక కర్తయు నుండును. ఉదాహరణకై నేను ఉన్నాను; నేను చేయుచున్నాను ఇత్యాదులు. ఈవిధముగ చేసిన ప్రతికృత్యమును అహంకారముతో కూడియుండుటచే, దాని ఫలితముగూడ అహంకారమే యగుచున్నది. కాని పనులన్నియు గురువుమీదనే ఆధారపడి చేయవలసియున్నది. అభిప్రాయమేమనగా, ఏపనిచేసినను గురువుయొక్క ప్రసన్నత సంపాదించుకొనునిమిత్తమే చేయవలెను. అట్లుచేయుటచే దానివలన మొదటి నుండి చివరివఱకును సుఖమే గలుగును. ఎట్లనగా మేడమీదికి ఎక్కవలెనను కొనుడు. మెట్లెక్కునప్పు డతడు గురువుగారు తానుచేసెడిపనికి సంతోషించుచున్నారాలేదాయని గురువుగారిని తలచుకొనుచుండును. పైకెక్కినపిదప మేడ అంతయుచూచి ఇల్లుబాగున్నదని అనుకొనును. కాని ఆరంభమునుండియు గురువుయొక్క ప్రసన్నతనే అతడు ముఖ్యముగ చేసికొన్నందున అతనికి అహంకారము కలుగనేరదు. ఈవిధముగ నతడు చేయుచున్నయెడల ఏపనిచేసినను గురువుయొక్క ప్రసన్నత మనసునపెట్టుకొనియే చేయుచుండును. దానివలన అతనిలో "నేను"కి బదులు గురువొక్కరే మిగిలియుందురు. ఆవిధముగ అహంకారము పూర్తిగ నశించిపోవును.

సత్సంగులు సామాన్యముగ తమ్ముతాము చాల అసమర్థులుగను, అధములుగను, ఆపాదమస్తకము దోషపూరితులుగను భావించుకొనుచుందురు. ఇట్లనుకొనుట మంచిదేగాని అందుతోబాటు వారు ఒకమహాసమర్థపురుషుని రక్షకహస్తము తమసిరముననున్నదని జ్ఞాపకముంచుకొనవలెను. మిగిలిన మతములలో "నిజము పలుకుము, అందఱియెడల మంచితనముతో ప్రవర్తించుము, సంపాదన న్యాయముగ చేసికొనుము, నీఆత్మీయుల రక్షణపోషణలను కనిపెట్టుచుండుము" అని బోధచేయుదురు. సంతుమతములో అవన్నియుగూడ చేయవలసినదేకాని వానితోబాటు ప్రపంచముయొక్క మోహజాలములో పడకుండ తప్పించుకొనవలెనని బోధచేయబడును. అందఱియెడల మంచితనముతో ప్రవర్తించుము, కాని బంధన మెవరితోను పెట్టుకొనకుము. మిగిలిన మతములలో చాలశుభ్రముగ నుండుము, గంగాస్నానముచేయుము, నేతి, ధోతి, వగైరాలు చేసికొనుచు పరిశుభ్రముగనుండుడని బోధించబడుచుండును. రాధాస్వామీమతములో శరీరము శుభ్రముగనుంచుకొనుడని చెప్పుటయేగాక అందుతోబాటు మనస్సును, అటుపిమ్మట నిజమనస్సును దానిపైన బ్రహ్మాండీమనస్సును

గూడ పరిశుభ్రము చేసికొనుము, ఈవిధముగ నాత్మను పరిశుద్ధిచేసికొని యూర్ధ్వముగ నారోహించుమనిగూడ బోధించబడును. తానధము డనియు, అసమర్థుడనియు, ఆపాదమస్తకము దోషపూరితుడనియు భావించుకొన్నంత మాత్రముననే లాభమేమియు నుండజాలదు. సర్వసమర్థునిహస్తము తనపైన నున్నదని తెలిసికొనుచు పనిజేసినపుడే ఆకార్యములో జయమును శ్రేయస్సును గలుగుచుండును.

## 58

సద్గురు ప్రీతినిగుఱించియు, సారబచన్ గద్యభాగముయొక్క సరళ శైలిని గుఱించియు.

21 జూన్ 1917:— ఈరోజున సారబచన్ గద్యభాగమునందు పసిపిల్ల వానికి తనతల్లియం దెట్టిప్రేమయుండునో, అతడు పాలుత్రాగునపుడు ఎవరైన నతనిని లాగినను తల్లిని విడువకుండ నెట్లు పట్టుకొనునో ఆవిధమైన ప్రేమ సద్గురువునం దుండవలెననియు, అట్టిప్రేమయున్నపుడే నామము లభించుననియు వ్రాసిన పాఠ్యభాగము చదువబడినది. ఇది చాల గొప్పముఖ్యవిషయము. ఇంతగొప్పవిషయమును ఇంతచిన్నమాటలలో సులువుగ బోధపఱచుట ఆ వ్రాసినవారి మహత్త్వమును తెలుపుచున్నది. ఇది స్త్రీపురుషులందఱకును సులువుగ అవగాహనకాగలదు. ఎవనికైనను శరీరమంతటను ప్రతినాడిలోను విషము వ్యాపించినదనుకొనుడు. అతని కొకచెయ్యి కోసివేసినచో ఆచేతిలో నున్నవిషముమాత్రమే అందలి రక్తముతోపాటు కారిపోవును కాని మిగతశరీర ములోనున్న విషమంతయు నట్లేయుండిపోవును. ఒకరక్తనాళమును కోసినచో రక్తము ఏస్థానమునుండివచ్చి ఆనాళముద్వారా కారిపోవుచుండునో ఆస్థానము లోనున్న విషముమాత్రమే పైకిపోవును, కాని మిగిలినశరీరములోనున్నవిష మట్లే యుండిపోవును. విరేచనములకు మందుతీసుకొన్నచో ప్రేగులలోని విషముమాత్రమే బయటకు పోవును, కాని శరీరములోనిది అట్లేయుండిపోవును. దీనికి సరియైన వైద్యముచేయుటకు రెండేపద్ధతులు గలవు. ఒకపద్ధతి, తలకొట్టి వేయుట. దానితో అంతయు నాశనమైపోవును. లేదా రెండవపద్ధతి, ఆవిషము నకు విరుగుడుమందు నిచ్చుట. విరుగుడిచ్చినపు డది ప్రతినాడిలోనికిని వెళ్ళి లోలో పలనున్న విషమును విఱిచివేసి శరీరమునంతటను తప్పక ఆరోగ్యమును కలుగ

జేయును. సన్యాసముతీసుకొన్నవారు చేతితో రూపాయిని ముట్టుకొనమని చెప్పుదురు. అది చేతి నొక్కదానిని కోసినట్లుగనుండును. వారిలోనున్న కామ, క్రోధ, లోభ, మోహాహంకారముల అయిదింటి విషమును వ్యాపించి యుండగా అందులోనొక్కవికారమునుమాత్రమే హరింపజేసినచో మిగిలినవి యథాప్రకారముండిపోవును. రూపాయిఒక్కటే విషమునకు కారణమైనచో వారి కార్యక్రమము సరియైనదే. కాని కామక్రోధాదులన్నిటివిషమును వారి రోమరోమములందును ప్రబలముగ వ్యాపించినది. సద్గురువునందు ప్రేమపుట్టి నపుడే ఆవిషము విరుగుడై పోవును. సద్గురుప్రేమ భక్తునిహృదయమందు ప్రవేశించి ఆవిషమునంతను విఱిచివేసి మిగిలినసమస్తవిషయములందునుగల మోహమునుగూడ నశింపజేసి ఒకసద్గురువునందే ప్రేమ యుండునట్లు చేయును. ఉక్కును ఉక్కే కోయును. విషమును విషమే హరించును. అటులనే సద్గురువుయొక్కప్రేమ ప్రాపంచికప్రేమల నన్నిటిని నశింపజేయును.

సద్గురువునం దట్టిప్రీతి యెట్లుగలుగును ? దీనికి ఉపాయము, నీవు ఆత్మస్థానమునందు అనగా ఆజ్ఞచక్రమందు అనగా తృతీయనేత్రమువద్ద ప్రాపంచి కాలోచనలను, ప్రాపంచికమోహముల నన్నింటిని తగ్గించుకొని అన్నిప్రక్కల నుండియు మనస్సును మళ్ళించి అనగా ఏకాగ్రతతో ప్రేమసహితముగ సద్గురువును ధ్యానముచేయవలయును. అపుడు ఆప్రేమ విరుగుడుమందువలెనే నీలో నాడినాడిలోను వ్యాపించి కామక్రోధాదులవిషమును నశింపజేయును. ఇట్టి ప్రేమ నీకు గలిగినపుడు నీకు నామదానము లభించును. అనగా సహస్రదళకమలమునుండివచ్చునట్టి శబ్దము నీలో ప్రకటమగును. నీవు ఇల్లువిడిచి పోనవసరము లేదు. రూప్యములను, పైసలను విడిచిపెట్టనక్కఱలేదు. నీవు చేయవలసినదంతయు, ఇతర ధ్యానములన్నిటిని కట్టిపెట్టి ఒక సద్గురునియందే ధ్యానము పెట్టుకొనుటయే. ప్రాపంచికవిషయములపరిస్థితి యెట్టిదనగా, మానవుడు రోజంతయు నేయేవిషయములను చూచుచు ఇంద్రియభోగముల ననుభవించుచుండునో, రాత్రి అతడు కండ్లుమూసికొని ధ్యానముచేసికొనబోయినపుడు ఆవస్తువులే వరుసగ ఒక బజారుక్రింద తయారై లోపల కనబడుచుండును. ఇతడు అప్పుడు ఆపదార్థములనే తలచుకొనుచు వానిమాధుర్యమును తీసికొనుచుండును, కాని ధ్యానమేమియు చేయజాలడు.

ఈవిషయములను వేదాంతవిచారణపద్ధతినికాని మతొకవిధముగగాని చెప్పవలెనన్నచో వినెడి స్త్రీ పురుషు లెవరికిని ఏమియు నవగాహనగాక వారు ముచ్చెమటలు కార్చుకొందురు. శంకరాచార్యులు, వశిష్ఠులు మున్నగువారు వేదాంతవిచారణపద్ధతిని వ్రాసిన వేదాంతశాస్త్రములో నిట్లు వ్రాసిరి. 1) మనో విజ్ఞానశాస్త్రము (Psychology) (2) సృష్టివివరణశాస్త్రము (cosmology) (3) దైవమును వర్ణించుశాస్త్రము (Theology; (4) మరణానంతరము జరిగెడి విషయముల వర్ణన (Aetiology) ఈ నాలుగు శాస్త్రములను పూర్తిగ చదివి ననేగాని ప్రాకృతికధర్మశాస్త్రము పూర్తిగరాదని వారు చెప్పిరి. మహారాజ్ సాహబ్ వారు వ్రాసినగ్రంథములో ఈనాలుగధ్యాయములే యున్నవి. ఎవ రైన వేదాంతశాస్త్రజ్ఞు లీగ్రంథముచూచినచో వారికి ఆగ్రంథకర్త వేదాంత శాస్త్రములో అఖండప్రవీణులైనవారని అనిపించును. 'స్వామీజీమహారాజు వారి వచనములవిషయములో లోకులు వారెక్కువ చదువుకొనలేదనియు, వేదాంతశాస్త్రము వారికి తెలియదనియు సామాన్యముగ ఆక్షేపణచేయుచుం దురు. కాని అదంతయు పూర్తిగ పొరబాటు. స్వామీజీమహారాజువారు బహుసామాన్యమైనమాటలలో అందఱకును బోధపడునట్లు వ్రాసిరి. వారు వేదాంతశాస్త్ర విచారణపద్ధతిని చెప్పియుండినచో నెవరికిని ఎంతమాత్రము బోధపడక దాని ప్రయోజనమే లేకుండెడిది.

## 59

### గుర్వన్వేషణములో విఘ్నములు గలిగించువారు.

22 జూన్ 1917 :-సామాన్యముగ సత్సంగులందఱికిని తమ స్వార్థపర మార్థములు రెండును చక్కగా నెఱవేరిపోవునట్లుగ చేసెడి అభ్యాసమేదైనను కావలయుననియే కోరిక ఉండును. అనగా, తమకు ప్రాపంచికకార్యములన్నియు బాగుగ సాగిపోవలెననియు, మరణసమయములో కష్టములేకుండనుండవలె ననియు, మరణానంతరమందు ఉత్తమలోకనివాసముగూడ లభించవలెననియు వారు కోరుచుందురు. ఇప్పుడు ఈలోకములో పరిస్థితు లెట్లున్నవో ఆలోచించు కొనుడు. ఇచ్చట ప్రతిమానవుడును తనస్నేహితులు మిత్రులు లేక ఇరుగు పొరుగువారును ప్రవర్తించినపద్ధతినే తానుకూడ అవలంబించుచున్నాడు. ఇతరు లేమిచేయుచున్నారో చూచి అట్లే తానుకూడ ప్రపంచములో చేయు

చుండును. తనకీప్రపంచములో ఐహికసంపత్తి యెక్కువగా ఉన్న యెడల తనకు చాల సుఖశాంతులు గలుగునని అనుకొని, ఆసంపత్తునే అధికముగ గోరుచుండును. కాని రానురాను లోకానుభవము గలిగినకొలఁది, మానవుడు ఇక్కడ సంపాదించుకొన్న లౌకికసంపత్తునంతను ఇచ్చటనేవిడిచిపెట్టి చనిపోవుచున్నాడనియు, మొదటలో నేసామగ్రి తనకు సుఖముగల్గించెనో, చివరకు అదియే దుఃఖదాయకమగుచుండుననియు నతనికి బోధపడును. ఎట్లనగా, ఒకనికి లక్షలకొలది రూపాయ లున్నవనుకొనుడు. అతనికి చనిపోవునపు డాధనమంతయు నిచ్చటనే విడిచిపోవలసియున్నదని మహాబాధ గలుగును. ఈబాధలన్నియు తెలిసికొన్నపు డతడు దేవతలకు పూజలుచేయుట ప్రారంభించును, తీర్థయాత్రలు, ఉపవాసవ్రతములును చేయును, ప్రాపంచికగురువులనెవరినైన నాశ్రయించును. వీనన్నిటివలననుగూడ పనిసాగనపుడు అనగా స్వార్థపరమార్థములు సిద్ధించుటలేదని తెలుసుకొన్నపుడు సద్గురువును అన్వేషించుకొనును. సద్గురుని శరణ్యములోనికి వచ్చినపుడు అతనికి ఉపదేశము లభించును. ఆ ఉపదేశప్రకారము అతడు జాగ్రత్తగ నడచుకొన్నపు డతనికి మనశ్శాంతి కలుగును. ఇంతలో సంతసద్గురువు దైవవశమున గుప్తమైపోయినచో అతడు తిరిగి అన్వేషణ చేసికొనును. అయితే, అప్పుడన్వేషణానంతర మతనికి సద్గురువు లభించినచో వారియందు ప్రేమప్రీతులు కలుగజేసికొని దృఢపఱచుకొనుట యెట్లు? ఇది చాలశ్రద్ధగ నాలోచించవలసిన బహుసూక్ష్మవిషయము.

లోకములో ధనమునకుశత్రువులు మూడురకములుగ నుందురు. అందులో మొదటిరకము చోరులు. రెండవరకము ఇతనియందు స్నేహభావము, ప్రేమభావముతో ప్రవర్తించుచు ఇతనిచే ఆధనమంతయు ఖర్చుపెట్టించునట్టి స్నేహితులు, బంధువులును. కావున దీనినిబట్టి అతడు ధనమును కాపాడుకొనదలచినచో, నొక్కచోరులనుండియేగాక వృధావ్యయముచేయించెడి బంధుమిత్రులనుండిగూడ తప్పించుకొనవలసియున్నదని స్పష్టపడుచున్నది. మూడవరకము శత్రువు లెవరనగా, ఆధనమునకు అన్యాయార్జితమనియు, పాపిష్ఠిసొమ్మనియు పేరులుపెట్టి దానిని పాతిపెట్టవలసినదేకాని లేనియెడల నేదైన ఆపత్తు రావచ్చునని అతనికి సలహాచెప్పెడువారు. మూడవరకము శత్రువులు ఆధనమును పాతిపెట్టుమని సలహాచెప్పి తమకును అతనికినిగూడ నాధనమువలన లాభము లేకుండునట్లు చేయుచున్నారు. ఇదేవిధముగ పరమార్థవిషయములో

గూడ ముప్విధములైన శత్రువులు గలరు. అందులో మొదటిరకము పరమార్థమును దూషించెడివారు. వారు చోరులవంటివారు. చోరునికి సమాధానము కత్తులు కటార్లతో చెప్పినట్లే నిందించువానికి చర్చ సంభాషణవగైరాలతో నచ్చచెప్పవచ్చును. కాని మిగిలిన రెండురకముల శత్రువులును చాలప్రమాదకరమైనవారు. అందులో ఒకరకము ఇతనిని తియ్యనిమాటలు చెప్పి సత్సంగము నుండి దూరముచేయుదురు. మఱొకరకము ఇతనికి "స్మరణ, ధ్యానములు నీకెట్లైనను లభించిపోయినవి. మఱి నీవింక చేయవలసిన దేమియు లేదు" అని బోధించుచుందురు. వీరు పాతిపెట్టుమని సలహాచెప్పిన శత్రువుల వంటివారు. ఈవిధముగ నీముగ్గురునుగూడ పరమార్థహాని కలుగజేయుదురు. అందుచేత ప్రీతిప్రతీతులలో లోపము కలుగకుండ నుండుటకై పరమార్థి చాలజాగరూకతతో ప్రవర్తించవలెను. నిజమైన ప్రీతిప్రతీతులుగలవానికి ఇహములోను సుఖము గలుగును; అంత్యకాలములోను, మరణానంతరముగూడ సుఖము గలుగును.

## 60

### రాధాస్వామీనామ మొక్కటే భగవంతుని నిజనామము.

23 జూన్ 1917 :— ప్రతిమానవునకును, జంతువునకును దుఃఖనివృత్తియును, సుఖప్రాప్తియును కావలెననియే కోరికయుండును. సుఖమెంతయధికముగనున్ననుగూడ ఎవనికిని తృప్తియుండనేరదు. సామాన్యముగ నందఱును ఫలానావారు చక్రవర్తి కావున వారికి చాల సుఖముగనుండునని యనుకొనుచుందురు. కాని పరికించి చూచినచో సామాన్యులకు పదిరూపాయలుమాత్రమే కావలయునని కోరికయుండునుగాని ఆ చక్రవర్తియైయున్నవానికైతే పదిలక్షల కాసులు కావలెనని కోరికయుండును. అనగా లోకములో నెవనికైన నెంత యెక్కువగ సుఖశాంతులసామగ్రియున్ననుగూడ సంతృప్తిగాని సంతోషముగాని యుండుటలేదు. మఱొకవిషయమేమనగా మనము జాగ్రదవస్థలో నుండగ నేవిషయసుఖముల ననుభవించుచున్నామో స్వప్నావస్థలో సూక్ష్మశరీరములోగూడ నాసుఖములనే అనుభవించుచున్నాము. సుషుప్తిలో ఈ బాహ్యభోగములునులేవు, ఆస్వప్నభోగములుగూడ నుండవు. అప్పుడు ముక్తిఅవస్థ వంటియవస్థ యుండును. పూర్వకాలపు ఋషులు, మునులును సుఖము సంపా

దించుటనిమిత్తమె ప్రాణాయామము మున్నగు నుపాయములను చెప్పిరి. కాని బాగుగ నాలోచించిచూడగా ప్రాణములకు కంఠచక్రమువఱకుమాత్రమే ప్రయాణముచేయగలసత్తా యున్నదని తెలియగలదు. ఈప్రాణధారమీదనే జీవుడు ప్రయాణముచేసి పరమాత్మను పొందగలిగినచో సమస్త జగత్తునకు అధిపతియైన ఆపరమాత్మ ప్రాణములతోనే తయారైనట్లు తేలును. కాని పరమాత్మ సచ్చిదానంద స్వరూపుడనియు పరమైశ్వర్యవంతుడనియు నందఱు చెప్పుదురు. దీనినిబట్టి భగవంతుడు సూర్యుడు సూర్యకిరణములును ఉన్నట్లే యున్నాడని తేటపడుచున్నది. అనగా భగవంతుడు సూర్యుడును, శబ్దమువారికిరణములును. ఈశబ్దధారమీదనే ప్రయాణముచేసి జీవుడు భగవంతుని దేశములో చేరుకొనగలడు.

ఇపుడు రాధాస్వామీనామము పరమపురుషునినామ మెట్లగునని ప్రశ్న పొడముచున్నది. ఋషీశ్వరులు బ్రహ్మపదమువఱకు పైకారోహించినపుడు వారలకు ఓంకారధ్వని వినబడెను. దానినే వారు మనుష్యవాణిలోనికిమార్చి "ఓం" అని చెప్పిరి. విద్వాంసులు దానికెన్నియో అర్థములుతీసి అది భగవంతుని నామమని ప్రకటించిరి. కాని వేదములు పగ్గైరాలలో ఇది అంత్యస్థానము కాదని చెప్పబడినది (నేతి, నేతి అనగా ఇది అంత్యస్థానముకాదు, కాదు అని అర్థము). దీనినిబట్టి దానిపైనగూడ నేదోయున్నదని తేలుచున్నది. యోగీశ్వరు లాపైనున్నవిషయమునుగుఱించి చెప్పిరి. చిత్తవృత్తుల నిరోధమే యోగమని పతంజలిమహర్షి మున్నగువారు వ్రాసినది పొరబాటు. యోగమనగా కలిసికొనుట. వృత్తులను నిరోధించుటవలన ఏకాగ్రతగలుగును. కాని జీవుడు బ్రహ్మతో నైక్యమెట్లగును? దీనిపైన సంతులు, శరీరములోనున్న ఆఱుచక్రములును పిండదేశమునకు సంబంధించినవనియు, దానిపైనున్న ఆఱుచక్రములును బ్రహ్మాండమునకు చెందినవై మనస్సుతో సంబంధించి యున్నవనియు, వానిపైనున్న ఆఱుచక్రములును దయాళుదేశమునకు చెందినవనియు అనగా చైతన్యదేశమునకు సంబంధించినవనియు సెలవిచ్చిరి. ప్రతిపదార్థమునకు నొక భండారముండును. కావున శరీరమునకు భండారము పిండదేశమనియు, మనస్సునకు భండారము బ్రహ్మాండదేశమనియు, ఆత్మకు భండారము దయాళుదేశమనియు తేటపడుచున్నది. పిండదేశములోని ఆఱవచక్రముయొక్క అధిష్ఠానదేవత ఆత్మ. బ్రహ్మాండదేశములోని ఆఱవచక్రముయొక్క అధిష్ఠానదేవత పర

బ్రహ్మ. దయాళు దేశములోని ఆఱవచక్రముయొక్క అధిష్ఠాన దేవతను రాధాస్వామీదయాళురని చెప్పుదురు. జీవుడు అచ్చటికి చేరుకొన్నపుడు ఈశబ్ద మతనికి దానంతటనదియే వినబడును, రాధాస్వామీనామమే భగవన్నామమని వైజ్ఞానికశాస్త్రరీతినికూడ ఋజువుచేయవచ్చును. కాని అభ్యాసము క్రొత్తగా ప్రారంభించినవారు ఋషులయొక్కయు, మునులయొక్కయు, నోటిమాటలు వ్రాతగ్రంథములయొక్కయు ఆధారముమీదనే రామనామమును భగవంతునినామమని విశ్వసించుచున్నపుడు రాధాస్వామీనామమునుకూడ నట్లే నమ్మి స్వయముగా అభ్యాసముచేసి, వారిలో నాంతర్యమున నీధ్వనిని వినవచ్చునని విశ్వసించనక్కఱలేదా ? రాధాస్వామీనామముకన్న గొప్పనామము మఱియొకటి ముందుముందు బయల్వెడలగూడదాయని సందేహించుట పూర్తిగా తప్పు. ఏలననగా శరీరభండారమైన మలినదేశములోను అనగా పిండదేశములోను, మనోభండారమైన బ్రహ్మాండదేశములోను, ఆత్మభండారమైన దయాళుదేశములోను ఒక్కొక్క దేశమునకు ఆఱేసిచక్రములచొప్పున చక్రములున్నవి. ఇవి తప్ప మఱొకలోకము ఇంతవఱకు నీసృష్టివిధానములో అసలు రచింపబడనేలేదు, ఇకముందును రచింపబడనేరదు.

## 61

### తీర్థయాత్రాదులను గుఱించి.

25 జూన్ 1917 :—ఎవరైనను తీర్థయాత్రలు, ఉపవాసవ్రతములు, దేవతాపూజలు, యజ్ఞయాగాదులను జేసి అందువలన ఆనందము సంపాదించుకొనగలిగినచో వారినట్లే చేయనిండు. అందువలన మాకేమియు నష్టములేదు. కాని బాగుగ నాలోచించినయెడల తీర్థయాత్రలవలనగలిగెడిలాభము దేశవిదేశములను చూచుటయు, యజ్ఞయాగాదులవలన గలుగు లాభము గాలి శుభ్రపడి ఆరోగ్యదాయకముగ నుండుటయుమాత్రమే అని తెలియగలదు. ఇదిగాక తాము వానిద్వారా జననమరణరహితులైపోవుదురని ఆశపడుట బొత్తిగ పొరబాటు. అందుకొఱకై అంతర్ముఖమైన యభ్యాసము చేయువఱకు నెవనికిని వాస్తవమైన ఆనందము లభ్యముకాదు. ఎవరైనను తాము తీర్థయాత్రలు, ఉపవాసవ్రతములు. యజ్ఞయాగాదులనే చేయుచుందుమనియు, ఒకప్రత్యేకవిధమైన కాషాయరంగుగల వస్త్రము ధరించినపుడే తమకు లాభముగల్గుననియు

పట్టుపట్టినచో వారట్లే చేయుదురుగాక. అది వారి ఇష్టము కాని అట్లుచే యుటవలన వారు తమకుతామే నష్టముచేసికొనుచున్నారు కాని యితరు లెవరి కిని నష్టములేదనెడివిషయము వారు తెలుసుకొనవలెను.

## 62

### భగవత్కృప.

26 జూన్ 1917 :- సత్సంగులందఱును దైవవశమువలన నేవిషయము జరిగినను దానిని భగవంతునిదయయని అనుకొనుచుందురు. ఎట్లనగా ఏదైన నొకఱాయి మీద పడినపుడును, ఇల్లు పడిపోయినపుడును, ఎవరైన దెబ్బతగల కుండ తప్పించుకొన్నపుడును దానిని దయఅని అనుకొనుచుందురు. ఒక్కొ క్కరు శిక్షణదండనలను, రోగములు మరణము వగైరాలనుకూడ దయఅని యెంచుకొనుచుందురు. ఇవికూడ దయయే. ఈవిధముగనైతే ఈసృష్టియం తయు తయారగుటయు, నీవు మనుష్యుడవై పుట్టుటయు ఇంకను మిగిలినపను లన్నియుగూడ దయతోగూడిన కృత్యములే. కాని ఈరెండును గాక మఱొక మూడవవిధమైన దయకూడ నున్నది. అదియేదనగా సత్సంగియొక్క మనస్సు, ఆత్మయును భగవంతునివైపునకు బహుసంతోషావేశములతో పరుగులిడుచుండు నట్టి పరిస్థితి, అనగా ప్రతిక్షణమందును రాధాస్వామీ రాధాస్వామీ నామ జపము చేయవలెననెడి తత్తరపాటు ఎడతెఱిపిలేకుండగ గలుగుచుండుట. ప్రా పంచికమైన సుఖములు గలిగినను వానితో సంబంధము లేకుండగనుండి అను క్షణము తమప్రియతముని స్మరణలో మగ్నమైయుండిపోవలెను.

పైనచెప్పిన మొదటి రెండురకములదయయు, ఒకపని ఒకవిధముగ జరి గిన దనెడికారణముమూలమున నిర్ధారణచేయబడుచున్నది. అనగా అనుమాన ప్రమాణముమీద ఆధారపడియున్నది. కాని మూడవరకపుదయ అట్లు అను మానప్రమాణముతో సంబంధించిలేదు. ఇట్టిదయయే కావలెననెడికోరిక నిరం తరము నుండుట చాలశ్రేయస్కరమైన విషయము. ఒకసత్సంగియొక్క అవ గుణములను ప్రకటపర్చి అతనిని శిక్షించికాని లేక రోగగ్రస్తునిగ చేసికాని అతడు తనతప్పులను తెలిసికొని దిద్దుకొనునట్లు చేయుటయే దండనశిక్షణలలో గల దయాపరిస్థితి. సత్సంగి తనకుతానే తనఅవగుణములను తెలుసుకొనుచు

అందుమూలమున పశ్చాత్తాపపడుచు భగవంతుని క్షమాపణ వేడికొనుచు నుండినచో అతనికి దండనశిక్షణలు జరిగించవలసిన అవసరముండదు. కాని చాలమంది దండనశిక్షణలనే దయయని భావించుచుందురు. అందులో దయ అయితే తప్పకయున్నది. కాని అసలైనదయ అనగా భగవంతుని స్మరణచేయుటలో నెల్లపుడు లీనమైయుండుటయే.

ఒకని కొకగాడిద యుండెను. అది ఒకగుఱ్ఱముతో, "నాయజమానికి నాయందు మహాదయ, ఉదయము తెల్లవారినతోడనే నన్ను కఱ్ఱతో ధడధడ కొట్టుచుండును. అతనిదెబ్బలయొక్క దయాచిహ్నములుగ నాపైన నెఱ్ఱనెఱ్ఱని గుర్తులు బయల్దేరుచుండును. నీమీద నెట్టిదయ చూపించుచున్నాడు? నీవు గుఱ్ఱమవుకదా" అని చెప్పుకొనెను. తరువాత ఆయజమానికుమారునితోగూడ ఆదయనుగుఱించి చెప్పుకొని, నామీదచూపెట్టెడిదయవంటిదయ నీమీదకూడా చూపుచున్నాడా యని ప్రశ్నించెను. పిల్లవాడు, "ఔను నీమీదచూపెడిది తప్పకుండ దయయేకాని అది "గధేలీదయ" (గధేలి యనగా గాడిదకు తగినట్టి) అని బదులుచెప్పెను.

## 63

### సమకాలిక సద్గురువును మన్నించనివారినిగుఱించి.

27 జూన్ 1917 :—ప్రతిసత్సంగికిని తనకు భగవద్దర్శనము తప్పక లభించగలదనెడి దృఢవిశ్వాసము నిస్సంశయముగ నుండవలసినదే అను విషయముపైన వచనము సెలవిచ్చిరి. నాల్గుజన్మ లెత్తవలసియుండునా లేక ఒకజన్మలోనే నాలుగుజన్మలఅనుభవము కలిగిపోగలదని కొందఱుచెప్పెడిమాట సరియా, అని ఒకసత్సంగి ప్రశ్నించెను. దానిమీద "సర్కార్ సాహబ్ వారు మూడు నాలుగు జన్మలెందుకు రెండుజన్మలే చాలునని సెలవిచ్చుచుండెడివా"రని సాహబ్జీమహరాజ్ వారు సెలవిచ్చిరి. సంతులు నాలుగుజన్మలని చెప్పుటలో వారియభిప్రాయము శరీరమునకు సంబంధించిన జన్మలనియే. మఱొకసత్సంగి సమకాలికసద్గురువును మన్నించనివారిగతి యేమగునని అడుగగా సాహబ్జీమహరాజువారు అతనితో, "నీవు నిన్నుగుఱించియే తాపత్రియపడుము కాని ఇతరులవిషయము తలపెట్టకుము" అని సెలవిచ్చిరి. స్వామీజీమహరాజ్ వారు "నిందాకరే తో అపనీ, వ స్తుతికరే తో సతగురుకీ" (అనగా దోషములు ఎన్నదలచినచో నీదోష

ములనే ఎంచుకొనుము. శ్లాఘ చేసినచో సద్గురువునే శ్లాఘించవలెను) అని వచనము సెలవిచ్చిరి. సమకాలికసద్గురువును మన్నించనివారిపైన భగవంతునికి దయలేదని అనుకొనగూడదు. ఒకనికి ఐదారుగురు పిల్లలున్నారనుకొనుము. అందులో ఒకనికి ఒకఅంటువ్యాధి వచ్చెను. అంతట నతడు మిగిలిన పిల్లలకు ఆజబ్బు రాకుండచేయుటకై ఈపిల్లవానిని మఱొక ఇంటిలోనికి మార్చెను. దాని అభిప్రాయము అతనికి ఆపిల్లవానియందు ప్రేమపోయినదని గాదు. అసలు అభిప్రాయ మేమనగా ఆపిల్లవానికి చికిత్స సంపూర్ణముగ జరుగుచు మిగిలిన పిల్లలకు ఆజబ్బు రాకుండ చూడవలెననియే. ఇదంతియు కర్మలయొక్క చక్రము. భగవంతుని కన్నియు తెలుసును. మన మీతగాయిదాలలో పడగూడదు. అందఱియెడల ప్రేమభావముతో ప్రవర్తించవలెను. తండ్రి యెప్పుడైన నొకపిల్లవానిని శిక్షించినను మిగిలినపిల్లలు ఆపిల్లవానిని దూషించుట యుక్తముగాదు. తండ్రికి పిల్లలందఱును ఇష్టమే. కావున మిగిలినపిల్లలందఱకు ఆపిల్లవానిని మాటలు అనుట కధికారము లేదు.

## 64

మనస్సు లగ్నమైనను కాకపోయినను రెండుసార్లు అభ్యాసము చేయుచుండవలెను.

28 జూన్ 1917 :—పూర్వకాలములో జనులు ప్రాణాయామము చేయుచుండెడివారు, మేము అరగంటసేపు శ్వాసనుబంధించి యుంచితిమనియు, ఒక్కొక్క శ్వాసకు నూరుసార్లు గాయత్రీమంత్రోచ్చారణ చేసితిమనియు బడాయిగ నందఱితో చెప్పుకొనుచుండెడివారు. అందుమూలమున వారి కేదియో మహాలాభ మాంతర్యమున కలిగినట్లుగ అనుకొనెడివారు. ఇపుడు సంతులు సురత్ శబ్దయోగాభ్యాసమును ఉపదేశించుచున్నారు. కాని ఇందువలన సిద్ధులు కాని శక్తులుకాని యేమియు ప్రసాదించబడనేరవనికూడ చెప్పుచున్నారు. అభ్యాసముచేయుపద్ధతి యేమనగా, ఉదయాస్తమయములు రెండుపూటలును నాగాలేకుండ ప్రతిదినము నిద్రనుండి లేచినతోడనే ఉదయముపూట ఒకసారియు, సాయంకాలము పనిపాటలు అయిపోయినపిమ్మట మఱొకసారియు తప్పక చేయుచుండవలెను. పదునైదునిముషములు స్మరణధ్యానములును, పదునైదు నిముషములు భజనాభ్యాసమును చేసినయెడల మంచిదే. ఇరువదియైదు

నిముషములు స్మరణధ్యానములును, ఇరువదిఐదునిముషములు భజనాభ్యాసమును చేసినచో నింకనెక్కువమంచిది. మీమనస్సు లగ్నముకానిండు కాకపోనిండు, అభ్యాసముమాత్రము తప్పక చేయుచుండవలెను. దీనియుద్దేశ్య మేమనగా ఏరోజుననైన సద్గురునిదర్శనముకొఱకై మీలో విరహప్రేమలు గలిగినచో ఆరోజున స్మరణధ్యానభజనలు బాగుగచేసుకొని వరుసగ మూడునాలుగు రోజులవఱకు స్థాయిగ నుండగలుగునంతటి మహానందమును మీరు పొందు సావకాశము గలుగవలెననియే. ఇట్టిపరిస్థితి నెలకొకసారిగాని ఐదారుమాసములకొకసారిగాని గలిగినచో అది చాలగొప్పవిషయమని తెలిసికొని, అది తనకార్యము నెఱవేరుచున్నట్లు ఒకసూచనగ తెలుసుకొనవలెను. ఎవరైనను స్మరణ, ధ్యాన భజనల నెన్నడు చేయనిచో, అతనికి ఏనాడైన విరహప్రేమలు పుట్టినచో ఆరోజున అతనిహృదయభూమి భజనాభ్యాసములో కూర్చుండుటకు తగియుండదు. అందుచే ఆసమయములో అతనికి గలిగెడి ప్రేమఅంతయు వ్యర్థముగా పోవును. ప్రతిదినము భజనాభ్యాసములో గూర్చుండుటచే శరీరమనస్సులకు కొంతఅభ్యాసత గలుగుచుండును. అందువలననే మీమనస్సు లగ్నమైనను కాకపోయిననుగూడ లెక్కసేయక, నాగాలేకుండ భజనాభ్యాసమును రోజు తప్పకచేయవలసినదని చెప్పబడినది. నిజమైన భక్తుడగు సత్సంగి తనకెప్పుడు తృతీయనేత్రము తెఱచుకొనును, ఘంటాశంఖనాదము లెప్పుడు వినబడునని ఆలోచనతోనే యుండును. అతడు ప్రతిదినము స్మరణధ్యానభజనలు చేయుట యొక విధ్యుక్తధర్మముగ నెంచుకొని చేయుచుండును. అందుకు ఫలితముగ నతడు ప్రేమదానము వగైరా బహుమతులను పొందుచుండును.

## 65

### దీనత్వమును గుఱించి.

29 జూన్ 1917 :—సామాన్యముగ జనులు చాలదీనత్వముతో సంభాషణ చేయుచుందురు. ఏమనిషితోమాట్లాడినను దీనత్వమునే ప్రకటించుచుందురు. ఎవరైనను పేరడిగినచో దాసుడను, దీనుడను లేక తమదాసుడనను పదమునకు తమపేరునుకూడ కలిపి చెప్పుచుందురు పైకి ఈలక్షణము చాల మంచిదే కాని అన్నిచోట్ల ఇట్టిదీనత్వముచూపుట యుక్తముగాదు. ఉదాహరణకై ఒకనొకరుని "మహాశయా, ఈకుండను కొంచెము మంచినీరుపోసి నిం

వుడు", అని కాని ఒక పాకీమనిషితో "హుజూర్, పాకీదొడ్డి కొద్దిగాతుడవండి" అనికాని సంబోధించినచో అట్టిదీనత్వము యుక్తముగనుండదు. అందఱియెడల దయాభావముతో ప్రవర్తించుట మంచిదేకాని ప్రాపంచిక వ్యవహారసందర్భములలో అట్లుమాట్లాడుట యుక్తముగాదు. నిజమైన దీనత్వమనగా అన్నిపనులను భగవంతుని శరణ్యముపైన నాధారపడి చేసుకొనుటయు, తనస్వలాభముకొఱకై చేసుకొనెడిపనులు భగవంతుని నెదురుగ నుంచుకొని వారిమీద ఆధారపడి చేసుకొనుటయునే. కబీరుసాహబ్‌వారీవిధముగ సెలవిచ్చిరి.

జబ్ హమ్ థే తబ్ గురు నహీం, అబ్ గురు హైం హమ్ నాహిం।
ప్రేమ గలీ అతి సాంకరీ, తామే దోఉ న సమాహిం॥

అర్థము :— నేను ఉన్నపుడు గురువుగారు ఉండెడివారుకారు. ఇప్పుడు గురు వొక్కరే ఉన్నారు, "నేను" నశించినది. ప్రేమమార్గము చాలసన్ననైనది. దానిలో ఇరువురు నొక్కసారి పట్టరు. అనగా అహంభావమున్నంతకాలము గురువునందు గురుభావము సంపూర్ణముగ నుండనేరదు. "అహం" చనిపోయినపుడే గురుభావము నిర్దుష్టముగ నుండును.

పనిపాటలన్నియు చేసికొనుచు భగవంతునియందు ఆధారపడి పూర్ణ విశ్వాసముతో నుండుటయే నిజమైనదీనత్వము, నిజమైన శరణ్యభావము, నిజమైనభక్తియు ననిపించుకొనును. అట్లుచేయుటచే నొక్కపరమార్థమేగాక ప్రాపంచికకార్యములుగూడ చాలయోగ్యముగ సాగిపోగలవు.

## 66

### సత్సంగులు మతముయొక్క సిద్ధాంతములు తెలియక తప్పులుచేయుట.

30 జూన్ 1917 :— బాలకరామ్ సత్సంగీ యనునొకరు రాధాస్వామీ మతమును విడిచిపెట్టుచున్నానని హుజూరువారికి ఉత్తరము వ్రాయగా హుజూరువారు దాని కభ్యంతరమేమియు లేదని సమాధానము వ్రాసిరి. అట్లు లనే అతడీమతమునుగుఱించి వార్తాపత్రికలలో దూషణచేసెదనని వ్రాయగా హుజూరువారు వెయ్యిసార్లు దూషించుమని సమాధానము వ్రాసిరి. ఆబాలకరామ్ సత్సంగీ ఈరోజున సత్సంగమునకు వచ్చెను. అందుపైన హుజూరువారిట్లు సెలవిచ్చిరి. సత్సంగులు రెండువిధములుగ నుందురు. ఒకరకము భగవం

తునికొఱకై వెదకికొనుచు అందువిషయమై రహస్యము తెలిసినప్పుడు ఉపదేశముపొంది అభ్యాసము చేసికొనుచు సంతోషము పొందుచుందురు. రెండవ రకము "హిర్స్" (తృష్ణాతురులు), అనగా ఇతరులను అనుకరణచేయుచు, మత విషయము లేమియు తెలియకుండగనే మతములోచేరి కొద్దికష్టమేదైన కలిగినప్పుడు ఆమతమును వదిలిపెట్టిపోవువారు. అట్టివారికిగూడ సత్సంగముచేయుచు చుట్టుప్రక్కలవారి పరిస్థితిని కనిపెట్టుచు నుండినచో కొంతకాలమునకు సంత్ సద్గురువుయొక్క మహిమ బోధపడి, ప్రేమయుత్పన్నమై భక్తిచేయుటకు సావకాశము కలుగవచ్చును. ఈసంసారములో సుఖదుఃఖములు ఒకదానినిమించి మఱొకటి వచ్చుచునేయుండును. జీవుడు సుఖమువచ్చినను, దుఃఖమువచ్చినను భగవంతుని మఱచిపోకుండ నుండవలెను. ఎట్లనగా ఎవనికైన జబ్బుచేసిన దనుకొనుడు. అతడు మొదట వైద్యము చేయించుకొనవచ్చును. ఆబాధ సహించలేనప్పుడు అంతర్యమందు భగవంతుని ప్రార్థనచేసికొనవచ్చును. అతనికి భగవచ్చరణములయందు కొద్దిగనైన భక్తివిశ్వాసములుండినచో నెట్లైననుగూడ నతడు సంతోషముగనే యుండును. ఉదాహరణకై ఇల్లు అంటుకొన్నదనుకొనుడు. మొదట అది ఆర్పివేయుటకై ప్రయత్నించును. కాని అది తాను ఆర్పలేకపోయినచో నొకచోట మాటలాడకుండ కూర్చుండి ఆత్మృతీయనేత్రము వద్ద భగవంతుని ధ్యానముచేయుచుండును. భగవదిచ్ఛవలన నేది యెట్లుజరిగినను మంచిదే అని తలపోయును. ఏలననగా ఆత్మృతీయనేత్రస్థానము కాలిపోలేదుగదా యని అతనికి తెలుసును. రాధాస్వామిలోకమైతే కాలిపోలేదు గదా! అది అట్లే శాశ్వతముగనుండును. సుఖసామగ్రిఅంతయు నట్లే స్థిరముగనున్నది కదా. ఇల్లంటుకొన్న నంటుకొనిపోవుగాక, నష్టమేమున్నది. ఎవరైనను మేము భగవంతుని విడిచిపెట్టివేయుదుమని చెప్పినచో వారు భగవంతుని పట్టుకొన్న దెప్పుడో ముందు తెల్పుమని అడుగవలెను. భగవంతుని నొకసారి పట్టుకొన్నవాడు ఆయనను వదిలిపెట్టుటగాని, భగవంతుడు ఎవరినైన నొకసారి పట్టుకొన్నచో అతనిని భగవంతుడు తిరిగి విడిచిపెట్టుటగాని యెన్నడైన సాధ్యమగునా ? ఒకడు రెండుమణుగులబరు వెత్తుకొనగలవాడు తనకేఱాయి అగుపడినను దానినెత్తవలెననెడి సరదా గలిగియుండును. అటులనే ప్రేమభక్తులుగలవానికి ఈసేవచేయుదము, ఈభక్తిచేయుదము అనెడి ఆసక్తి హృదయమున పుట్టుచుండును. ఐతే ఒక్కొక్కప్పుడు ఏదైనను జబ్బుచేసి బలము తగ్గిపోయినప్పుడు ఆరెండుమణుగులఱాయి నెత్తగలిగినవాడే పావుసేరుబరువునుగూడ

ఎత్తలేని పరిస్థితిలో నుండును. అటులనే ప్రతిసత్సంగియు తనకష్టపరిస్థితివచ్చి నపుడు తనప్రేమభక్తులు శుష్కించిపోయినవని ఊహించుకొనవలసియున్నది. దీనికుపాయమేమనగా బరువులెత్తెడివానితో కలిసి తిరుగుచు నతడు బరువులెత్తుట చూచుచుండుటవలన, ఇతనికిగూడ కొద్దిగొప్ప సత్తువవచ్చి ఇతడుకూడ మెల్ల మెల్లగ బరువులెత్తుట నెట్లు ప్రారంభించునో అటులనే సత్సంగికూడ సత్సంగ మునకు వెళ్లుచు ఇతరులపరిస్థితి చూచుచుండుటవలన అతనికి కొంతసిగ్గువచ్చి మార్పు గలుగుచుండును.

కొందఱు సత్సంగులు తమకు మతసిద్ధాంతములు తెలియకపోవుటవలన గూడ తప్పులుచేయుచు, ఎవరినైన అడిగి తెలుసుకొనుటకుగాని ఎవరితోనైన తమపరిస్థితిని చెప్పుకొనుటకుగాని తమరిన్నాళ్ళనుండి సత్సంగియైయుండియు నీ మాత్రము తెలిసికొనలేకపోయిరాయని ఆక్షేపింతురేమోయను సిగ్గుచేత, జంకు చుందురు. ఎట్లనగా ఒకడు ధర్మామీటరునుగూర్చి తెలియనిమనిషి ఉన్నాడనుకొనుడు. అతడు ధర్మామీటరు చూచునపుడు దానిలో పాదరసమెంతవఱ కున్నదో చూడవలయును. కాని అతని కది తెలియక పైన తెల్లగామెఱియు చున్న గీతనుచూచి తనకంతయును తెలిసినదని చెప్పును. కాని పాదరస మెంత వఱకున్నదని అతనిని అడిగినచో నతడు క్రిందనుంచి పైవఱకు నంతయు పాద రసమే యని చెప్పును. అటులనే ప్రతిసత్సంగియు పైవిషయములు చూడ గలడు. కాని ఆంతర్యవిషయము లవగాహనకానిచో నతనికి మతసిద్ధాంతములు తెలియకుండ నుండిపోవును.

## 67

అంతర్యానుభవములేనివారు క్లిష్టసమయమువచ్చినపుడు సత్సంగమును విడిచిపెట్టుదురు.

1 జూలై 1917 :—మున్షీరామ్ సత్సంగి సోలన్‌లో బాబూమాధవప్రసా దుగారి సాంగత్యములో నున్నాడనియు, వారు వైజ్ఞానికశాస్త్రపద్ధతిని మత సిద్ధాంతములను చాలబాగుగ వివరించుచున్నారని అతడు శ్లాఘించుచున్నా డనియు, నెవరో బయట పొలములలోనికి వెళ్ళినపుడు హుజూరువారికి చెప్పిరి. దానిపైన హుజూరువా రిట్లు సెలవిచ్చిరి. సరియైన సత్సంగి యగుట బహు

కష్టము. ఒకనాడు యేసుక్రీస్తు తమభక్తులందఱును తనను విడిచిపెట్టి వెళ్ళిపో వుదురని చెప్పెను. యేసుక్రీస్తుకు మహాసేవ చేయుచుండెడి పీటరుఅను పేరుగల భక్తుడు "నేనుగూడ మిమ్ములను విడిచిపెట్టుదునా" అని యేసుక్రీస్తు నడిగెను. "ఔను, నీవు మూడుసార్లు విడిచిపెట్టెదవు"అని యేసుక్రీస్తు సమాధానము చెప్పెను. దానిమీద పీటరు తానెన్నటికి నట్లు చేయువాడనుకానని జవాబు చెప్పెను. యేసుక్రీస్తు "నీవు తప్పక నన్ను విడిచిపెట్టెద"వనెను. అంతట కొందఱు క్రైస్తవులుకానివారు వచ్చి క్రైస్తుయొక్క అనుచరులపైన దండెత్తి నపుడు వారందఱును పారిపోయిరి. వారు పీటరును పట్టుకొని నీవు క్రైస్తును మన్నించుచుంటివిగదా యని ప్రశ్నించిరి. అతడు కాదని సమాధానము చెప్పెను. అట్లు మూడుసార్లు ప్రశ్నించగా అతడు మూడుసార్లు స్పష్టముగా క్రైస్తును మన్నించనని సమాధానము జెప్పెను. క్రైస్తు వందలకొలది చని పోయినవారిని బ్రతికించెను, వందలకొలది జబ్బుమనుష్యుల జబ్బులను కుది ర్చెను, ఇంకనెన్నియో విచిత్రములను చేసిచూపెను. అయిననుగూడ పీటరు అంతవాడుకూడ ముమ్మారు తనకు క్రైస్తు గురువు కానట్లు నిరాకరించెను. అతని అనుయాయులందఱు నతనిని విడిచి పాఱిపోయిరి.

ఇటులనే సత్సంగముమీది కెవరైనను దండెత్తినపుడు సత్సంగులకు నిల బడుట కష్టమైపోవును. చాలమంది సత్సంగులు సత్సంగము వదలిపెట్టెదరు. కాని ఈమతమును సంపూర్ణముగ నవగాహనచేసికొని దీనివలన మనశ్శాంతి సంపాదించుకొన్న సత్సంగులుమాత్రము దీనిని వదిలిపెట్టరు. లాలాజీగారిసంఘ ములో నుండెడి నిహాలీసత్సంగినియొక్క మరణవిషయమునుగుఱించి మీారంద ఱును సత్సంగములో వినియేయుందురు. ఆమె చనిపోవునపుడు "అదిగో సాహబ్జీ మహరాజువారు వచ్చి నిలబడిరి వగ్గైరా వగ్గైరా" అని అనెను. అందుపైన వారు సాయంకాలము సత్సంగములోనికి దయచేసినపుడు, భక్తురాలైనసత్సంగి చని పోవుటకు ఎనిమిది, పదిమాసముల ముందునుండియు నతనికి స్మరణధ్యానములు వానిఅంతటనవి సాగిపోవుచుండుననియు, స్వప్నములలోను, భజనసమయమం దును, నిరంతరము దర్శనము లభించి ఆశ్చర్యకరమగు మనశ్శాంతి గలుగు ననియు సెలవిచ్చిరి. కాని బుద్ధియొక్క విచారణశక్తిమూలమున లభించిన శాంతికి అభ్యాసముమూలమునగలిగెడిశాంతితో పోలికలేదనువిషయము జ్ఞాపక ముంచుకొనవలయును. కావున అభ్యాసముచేసి శాంతిని సంపాదించుకొనవలె నని సెలవిచ్చిరి.

## 68

### సత్సంగియొక్క మరణానంతరదశనుగుఱించియు — ఒక సద్గురువు తరువాత మఱొకసద్గురువు నాశ్రయించుటను గుఱించి.

2 జూలై 1917 :—మనస్సునకు బోధించుకొన్నందువలన శాంతి గలుగ నేరదని క్రితమురోజున సెలవిచ్చిన వచనము తనకు బోధపడలేదని ఒకసత్సంగి చెప్పకొనెను. దానిపైన హుజూరువారు సద్గురువు అవలంబించునట్టిపద్ధతి చెప్పమందువా లేక సత్సంగిచేయవలసినది చెప్పమందువా యని ప్రశ్నించిరి. సత్సంగి ముందు సద్గురువవలంబించెడిపద్ధతిని సెలవిండని యడిగెను. అంతట వారు జీవులందఱిపరిస్థితియు నొకేవిధముగ నుండదు కావున ఆపద్ధతినిగుఱించి ఒక సర్వసాధారణపద్ధతిగా తెలియజెప్పుట చాలకష్టసాధ్యమని సెలవిచ్చిరి. సామాన్యజీవులలో నెవరైనమరణించినపుడు అతనికి జ్యోతిర్నారాయణులదర్శనము చాల దూరమునుండి లభించును. ఆదర్శనమైనతోడనే జీవునికి ఆవైపునకు వెళ్ళిపోవలెనని బహుతీవ్రమైన ఆసక్తి బయలుదేరును. అట్లుపోవుచుండగ నతనికి త్రోవలో తన ప్రాపంచికవాసనలన్నియు నొక్కసారిగ ప్రకటమగును. భోజనము చేయుటకు కూర్చుండినపుడు తేనీరు నొకగ్లాసులోను, మఱొకగ్లాసులో మంచువలె చల్లపఱచిన మధురపానీయమును, మఱియు 56 రకముల పక్వాన్నములు నొకేసారి తెచ్చి ఒక మనిషికి యెదుటపెట్టినచో నతనికి వానిలో నేది ముందుతినవలెనో తోచక నతడెట్లు కలతచెందునో, అట్లే ఆవాసనలన్నియు నొక్కసారి ప్రకటమైనపుడు జీవునికి చిత్తవ్యాకులత్వము బయలుదేరును. కాని చివరకు వానన్నిటిలో నెక్కువప్రబలమైనవాసన అతనిమనస్సున నిల్చిపోయి, దానికి తగిన జన్మయే అతనికి లభించును. సత్సంగి శరీరమును విడిచిపెట్టినపుడు అతనికి గూడ మొట్టమొదట తనకర్మలయొక్కచక్రము ప్రకటమగును, కాని ఆచక్రము ముగిసిపోయినవెంటనే అతని ఆంతర్యమున సూక్ష్మముగనున్న ఆకాశములో సూక్ష్మరూపములోనున్న సద్గురురూప మతనిలో ప్రకటమై అతనిని తనయొడిలో పెట్టుకొనిగాని లేక తనవ్రేలు అందించిగాని ఊర్ధ్వముగ గొనిపోయి తగిన ఊర్ధ్వలోకములో నివాస మిప్పించును. మనస్సునకు బోధచేయుటవలన శాంతి కలుగనేరదనిచెప్పటలో భావ మీక్రింది దృష్టాంతమునుబట్టి గోచరముకాగలదు. ఒకసత్సంగికి చాల జబ్బుగనుండి, ఆజబ్బుమూలమున నతడు మహాబాధ

పడుచున్ననుగూడ, నెవరైన నతనిని నీకెట్లున్నదని యడిగినచో అతడు "చాల బాగున్నది, దేవునిదయవలన ఏదోయొకరోజున చనిపోవుట తప్పదుకదా. మరెందుకు చింత? నేను సిద్ధముగనే యున్నాను" అని గాంభీర్యముతో చెప్పును. కాని ఆబాధ కొద్దిగా యెక్కువైనపుడు తిరిగి "అయ్యో, అమ్మో" అని గోల పెట్టనారంభించును, కాని అభ్యాసముచేసిన సత్సంగికి మరణసమయములో స్వతస్సిద్ధముగనే మనశ్శాంతిగల్గి బాబూస్వామీచరణుగారిమరణమువంటి మరణము గల్గును. ఆయన చనిపోవుటకు ఒకరోజు ముందుగనే తాఇతరుల కివ్వవలసిన బాకీలను తనకు ఇతరులవలన రావలసిన మొత్తములను అన్నియు లెక్కచెప్పి, ఆతరువాతనే మరణించెను, చెప్పవచ్చినదేమనగా వాస్తవభక్తులైన సత్సంగులకు చనిపోవుటకు రెండు, మూడురోజులు ముందుగనే తమకు ఫలానా రోజున ఇన్ని ఘంటలకు శరీరత్యాగము గల్గునని తెలిసిపోవును. వారికి దానంతటనదియే వైరాగ్యముపుట్టి, అంతర్యమున భగవన్నామస్మరణ చేయుచుండుటచే స్వతహాగా శాంతి చేకూరి మరణసమయమందు వారు శరీరమును మహాధైర్యముతో విడిచిపెట్టుదురు.

ఒకసత్సంగియొక్క ప్రశ్న:—ఎవరికైన మొదటి సద్గురువునందు భక్తియుండి ఆతరువాత సమకాలిక సద్గురువునందు భక్తిలేనిచో అతనికి సంరక్షణ ఎట్లుగలుగును ?

జవాబు:—అతని కేస్వరూపమునందు భక్తియున్నదో ఆస్వరూపమే వచ్చి యతనిని కాపాడును. అతనికి ఆస్వరూపముయొక్క సూక్ష్మప్రతిబింబ మేస్థానమున నిల్చియుండునో, ఆస్థానమున నివాసము లభించును. అతడు రెండవసద్గురువునందును, పిమ్మట మూడవసద్గురువునందును ప్రీతిగల్గియుండి, వారి వారి సత్సంగము చేసికొనుచుండినచో ఆ సూక్ష్మప్రతిబింబము ఇంకను పైపైకి వెళ్ళిపోవుచుండును. ఇతని ఆత్మకూడ దానితోబాటే పైపై కారోహించుచుండును. స్వామీజీమహరాజువారు ఎవరో హుజూర్ మహరాజువారును వారేయనియు, మహరాజ్ సాహబ్ వారును వారేయనియు, సర్కార్ సాహబ్ వారును వారే యనియు, ఈనలుగురిలోను ఒకే ధారయున్నదనియు, మనస్సున దృఢవిశ్వాసముంచుకొనవలయును. భక్తి నెవరును అస్థికలకును చర్మమునకును చేయరు. భక్తిచేయదగిన మహత్వము ఏధారకుగలదో ఆధారఅయితే యెప్పుడు నొక్కటే.

ఒకసద్గురువు గుప్తమైనపుడు మఱొక సద్గురువు సత్సంగికి లభించినచో నతడు వారియందు ఇంక నెక్కువ గౌరవము చూపవలెను. ఏదైన తీర్థములో పిల్లవాడొకసారి తప్పిపోయినచో తండ్రి ఆపిల్లవానిని తనవ్రేలిచ్చి పట్టుకొనుమని చెప్పి తిరిగి తప్పిపోవునేమో ననుభయముచే నెక్కువజాగ్రత్తగ నెట్లుండునో, అట్లే సత్సంగి నూతనసద్గురువు లభించినపుడు ఆస్వరూపమునందు యెక్కువ భయభక్తులతో ప్రవర్తింపవలెను. అట్లుగాక, పురాతనభావమును వదిలిపెట్టకుండ మొండిపట్టుపట్టినవారికి, సారబచన్ గద్య 250 వచనములో వ్రాసినట్లు. ముందభివృద్ధి యుండ నేఱదు. అదేమైనను తక్కువనష్టమా ? ఒకమనిషికి శ్రేష్ఠమైన భోజ్యపదార్థములు పెట్టుచు, మఱొకని కేమియు పెట్టకుండినచో ఆరెండవవాని కెట్లుండునో అతనిమనసునకే తెలియగలదు.

## 69

### "మౌజ్"ను గుఱించి.

3 జూలై 1917:—సోలన్‌లో బాబూ మాధవప్రసాదుగారితో కలిసి యుండిన సింధీసత్సంగి యొకరు వచ్చెను. అతడు మున్షీరామ్ సత్సంగి రెండు స్థలములలో సత్సంగ మేల జరుగుచుండెనని మాధవప్రసాదుగారిని ప్రశ్నించినట్లుగను, మాధవప్రసాదుగారు దానికి "అది మౌజ్" (అనగా భగవదిచ్ఛ) యని సమాధానము జెప్పిరనియు చెప్పెను. అందుపైన హుజూర్‌వారు చాల విషయములలో "మౌజ్" అని చెప్పుటలో "నాకేమియు తెలియ"దనియే అర్థమని సెలవిచ్చిరి. అసలు "మౌజ్" యొక్క అర్థము చాలగూఢమైనది. అనగా భగవంతునివద్దనుండి బయలుదేరి వచ్చిన తరంగమని యర్థము. అయితే, ఆంతర్యమున భగవంతునితో నెవరికి మాత్రము లగ్నమైయుండునో వారికే ఆ "మౌజ్"ను గుఱించి బోధపడును. అట్టి "మౌజ్"ను ప్రమాణముగ చెప్పుటకందఱికిని హక్కులేదు. ఆ మౌజ్‌ను తెలిసికొనగలశక్తిగూడ నెవరికిని లేదు. ఉదాహరణకై ఎవరైన నొకరోగి మీతో తనకష్టము చెప్పుకొన్నపుడు మీరు 'మౌజ్' అని అన్నయెడల అతని కేమిబోధపడును ? అయితే సద్గురువు తన గురుముఖునితో అట్లనవచ్చును. అప్పు డాగురుముఖుడు 'మౌజ్'యొక్క సరియైన అర్థమును తెలిసికొని నిశ్శబ్దముగ నుండి లోపల ఆనందభరితుడై పోవును. హుజూర్‌మహరాజ్‌వారి కాలములోను, మహరాజ్ సాహబ్‌వారి కాలము

లోను సత్సంగులు తమ కష్టములను రోగములనుగుఱించి చెప్పుకొన్నపుడు వారు "అవన్నియు మీపూర్వకర్మలయొక్క ఫలితము. మీరు వానిని అనుభవించ నైన అనుభవించవలెను లేదా వానిని తుంచివేయవలయును. మీరు భగవం తునికి ప్రార్థనచేయుడు. మేముకూడ మీతరఫున భగవంతునికి ప్రార్థనచేసెద" మని చెప్పుచుండెడివారు. అంతియకాని మౌజ్ అని చెప్పెడివారుకారు. వా రట్లు సెలవిచ్చి యుండినచో సత్సంగులు అట్టి మౌజ్‌ను త్రిప్పివేయుడు అని సమాధానము చెప్పియుండెడివారు. ఇటువంటి మౌజ్‌తో మాకు పనిలేదు.

రాధాస్వామీదయాళుని మౌజు రెండుచోట్ల సత్సంగము జరుగునట్లు గను, ఆరెండు స్థలములవారికిని పరస్పరము జగడములు తగాయిదాలు ఉండు నట్లుగనే యుండినచో రాధాస్వామీదయాళురు ఈవిధముగ నొకపెద్ద విషమ పరిస్థితిని కల్పించినట్లగును. ఏలననగా హుజూర్ మహరాజ్ వారు "మేరే ప్యారే బహిన్ ఔర్ భాయీ క్యోం ఆపస్‌మే తుమ ఝగడో, రలమిల కర సతసంగ కరనా" (అనగా, "ఓ ప్రియమైన సోదరీసోదరులారా మీరు పరస్పరము దెబ్బ లాడనేల ? అందఱును కలిసి సత్సంగము చేసికొనుడు" అని అర్థము) అని వ్రాసినప్రకారము సత్సంగులనందఱిని కలసిమెలసి సత్సంగముచేసికొని ఆవిధ ముగ నానందముపొందుడని ఒకవైపునుండి బోధించుచు, మఱొకప్రక్కనుండి సత్సంగములు రెండుమూడు స్థలములలోనుండి వారికొండొరులలో దెబ్బలా టలు తగాయిదాలు జరుగుచుండులాగున భగవంతుడు మౌజ్ ధరించుచున్నా డని చెప్పిరన్నచో నది పరస్పరవిరుద్ధముగ నుండును. అట్టి పరిస్థితిలో సత్సంగు లందఱకు నొకపెద్ద ఆపత్తు కల్పించినట్లగును. ప్రతివిషయమునకు నిట్లే "మౌజ్" అని సమాధానము చెప్పినచో లోకములో అన్నిపనులును భ్రష్టయి పోవును. అన్నిమతములవారునుకూడ ఇన్ని వివిధమతములు ప్రచలితమైయుండ వలయుననియే దివ్యేచ్ఛయున్నదని యందురు. అట్లయినచో భగవంతునిమీద మహాదోషము నారోపించినట్లగును. కావున నీవిధముగ బాధ్యతలంతయు మౌజ్‌పైననే పెట్టుట చాలపొరపాటు.

## 70

సత్సంగశిక్షను గుఱించి కొన్ని ఆక్షేపణలు.

---

4 జూలై 1917:—రాధాస్వామీ మతసిద్ధాంతములను సత్సంగులు కాని వారు చదివినపుడు వారి కవి పరస్పర విరుద్ధముగ నున్నట్లు కనపించవచ్చును.

ఉదాహరణమునకై సత్సంగములో బాహ్యముగ సామాజికవిషయములపై పట్టుదల వహించుచున్నట్లు కనబడుచున్నను, అంతర్యాభ్యాసములో అవే పనులయెడల నిరసన చూపించబడును. రాధాస్వామీనామమును అర్థముతో నిమిత్తము లేకుండ స్మరణచేయుడని బోధించుదురు. కాని ఆనామమునకే కొన్ని అర్థములుగూడ చెప్పుచుందురు. గురువుయొక్క దేహస్వరూపమును ప్రేమించుమని బోధించుచు, తిరిగి ఆస్వరూపమునే విడిచిపెట్టించుదురు. లోకమునందు మోహము పెట్టుకొనవద్దని బోధించుచుందురు, తిరిగి వివాహములు వగైరాలు చేయించి జీవులను ఆప్రపంచములోనే చిక్కుపడుచుచుందురు. "జగ బిచ్చూ, తిరియాహై నాగిన్" (ఈ ప్రపంచము ఒక తేలును, ఆడది ఒక పామునైయున్నారు అని అర్థము) అని గ్రంథములలో వ్రాసిరి. దానినిబట్టి ఒకఆడుపాముతో పెండ్లిచేయించుచున్నారని తేలుచున్నది. ఈపామునకొకపిల్లవాడు పుట్టినచో సత్సంగులు గురువుగారికి భేటిచ్చి ప్రసాదము చేయించుదురు. సద్గురువుగూడ సంతోషించుచున్నారు. చూడుడు, ఒక ఆడుపామునకు పుట్టునది మఱొక పామే యగునుగదా, ఆపాము పుట్టినపుడు తన సంతోషము ప్రకటించుచున్నారు. మరల ఆపామునకు మఱొక ఆడుపాముతో పెండ్లి అయినచో మఱికొన్ని మొగపాములు, ఆడుపాములు బయలుదేరునుగదా. కావున, ఈ రెండు బోధలును పరస్పరవిరుద్ధముగ నున్నవి. తిరిగి మనస్సును ఇంద్రియములను చంపివేయుడనియు, మంచి రుచిగల తినుభండారములను తినవద్దనియు బోధించుచుందురు కాని భండారాలువగైరాసమయములలో బహుస్వాదిష్టమైన హల్వా వగైరా ప్రసాదములను పూటుగ భోజనముచేయుచున్నారు. ఇదికూడ నొక విరుద్ధవిషయమే. సత్సంగేతరులు ఈప్రశ్నను ఏసత్సంగినైన అడిగినచో అతడేమియు సమాధానము చెప్పలేక ముచ్చెమటలు కార్చును. అందుకేమి సమాధానము చెప్పవలయునో మీరిపుడాలోచించుడు. మేము సాయంకాలము దీనికిసమాధానము చెప్పెదము. చివరకు ఉక్కు ఉక్కుతోనే కోయబడుననియు, మాణిక్యము మాణిక్యముచేతనే దొలచబడగలదనియు, ముల్లు ముల్లుతోనే తీయబడగలదనియు సెలవిచ్చిరి.

## 71

### మతముయొక్క నాల్గు ముఖ్యాంగములు.

4 జూలై 1917:—సత్సంగికానట్టి హోసామల్ అనెడి ఒకపెద్దమనిషి వచ్చి తనకెవ్విధమైన కష్టములు, దుఃఖములు కలుగకుండనుండవలె ననుకోరికయొక్కటి

తప్ప మఱేమియు కోరిక లేదని చెప్పుకొనెను. అందుపైన హుజూరువారు ప్రతి మతములోను సత్యాన్వేషి నాలుగు విషయములను ముఖ్యముగ గమనించ వలసియుండు నని సెలవిచ్చిరి:-(1) ఆమతముయొక్క యుద్దేశ్యము లేక ఆదర్శము. (2) ఆయుద్దేశ్యప్రాప్తినిమిత్తమై ఆమతములో చెప్పెడి మార్గము. (3) ఆసాధన తనకు అభ్యాసముచేయుటకు సాధ్యమగునా కాదా యను విషయము. (4) ఆసాధనను ఉపదేశించునట్టివ్యక్తికి అందులో సిద్ధికలిగెనా లేదా యనువిషయము.

1. ఇపుడు మతముయొక్క యుద్దేశ్యమేమి? కష్టములు శరీరమునకు సంబంధించినవి, మనస్సునకు సంబంధించినవి యని రెండువిధములుగా నున్నవి. కావున ఆత్మను శరీరమనస్సులు లేనట్టి స్థానమునకు చేర్పించినచో దుఃఖముల నుండి నివృత్తి గల్గుట యొక్కటేగాక పరమానందముగూడ ప్రాప్తించును. ఈపిండదేశము శరీరముయొక్క భండారము. బ్రహ్మాండము మనస్సుయొక్క భండారము, సత్యదేశము ఆత్మయొక్క భండారము. చెవి, కన్ను, ముక్కు జిహ్వ లనెడి యింద్రియములలో నేదైన నొక్కఇంద్రియము తాలూకు సుఖ మొక్కటే మానవునికి చెప్పనలవిగానంత ఆనందమును గలుగజేయుచున్నది. ఆ యద్భుతసుఖమంతయు ఆ సముద్రముయొక్క ఏకైకధారమాత్రమువలననే గల్గుచున్నది. కావున ఆసముద్రములో నెంతఅత్యధికానంద ముండునో ఆలోచించుకొనుడు. ఆసముద్రమందు ఆత్మను జేర్పించుటయే మతముయొక్క ఉద్దేశ్యము.

2. ఈమతోద్దేశ్యమును సాధించుటకు సాధనలు:—ఇందుకొఱకై ఐదు విషయములు చెప్పబడినవి:—ఒకటి సత్సంగము, రెండు సేవ, మూడు స్మరణ, నాల్గు ధ్యానము, ఐదు భజనాభ్యాసము. భగవంతుని కలిసికొనవలెనను కోరిక జిజ్ఞాసువునకు గల్గినపుడు అతడు సత్సంగము చేసికొనుచు సేవచేయుచుండును. సత్సంగమును సేవను చేయగా చేయగా అతనికి సద్గురువునందు ప్రేమభక్తులు వృద్ధియై సద్గురువును చూడకుండ నుండినచో మనశ్శాంతియే యుండనేరదు. అపు డతడు తమదర్శనములేనిదే నేను ఉండలేను అని సద్గురువునకు చెప్పుకొనును. అప్పుడు వారు అతనికి "చూడు, మేము నీకిపుడు మమ్ములను నీ వెప్పుడు జ్ఞాపకముంచుకొనులాగున చేయుటకై మఱొకఉపాయము చెప్పెదము"

అని చెప్పి అతనికి స్మరణధ్యానములను ఉపదేశింతురు. అతడు స్మరణ ధ్యానములను భక్తిశ్రద్ధలతో చేయుచుండిన, అతని కాంతర్యమున మహాదేదీప్య మాన స్వరూపము దర్శనమగును. ఆదర్శనమును పొంది ఆనందభరితుడై, "మీ దేదీప్యమానదర్శనమును పొందినపుడు నాకు మహానందమైపోయెను. అట్టిదర్శ నము నాకెల్లపుడు లభించునట్లనుగ్రహింపుడు", అని ప్రార్థించును. అప్పు డతని కి భజనాభ్యాసము నుపదేశము చేయుదురు. అతడు శబ్దము నాంతర్యమున విని పైకాకర్షించి శబ్దసూత్రమును పట్టుకొని భగవంతుని చరణములను చేరు కొని శరీరమనస్సులనుండి విముక్తుడై నాశరహితమైన శాశ్వతానందమును పొంది సమస్తదుఃఖములనుండియు విముక్తి నొందును.

3. ఇప్పుడీపైవిషయముల కన్నిటికిని, ఆభగవంతుని పొందుటకును సంబంధమేమైన నున్నదో లేదో చూచుకొనవలెను. మఱియు పైన చెప్పిన సాధనలు అనగా సత్సంగము, సేవ, ధ్యానము, భజన మొదలైనవి చేయుట మనకు సాధ్యమగునా లేదా యనెడివిషయముగూడ చూచుకొనవలెను.

4. అటుతరువాత నాల్గవవిషయమేమనగా ఉపదేశము నిచ్చునట్టి పురుషుడు స్వయముగ నీయభ్యాసము చేసెనా లేదా యనునంశమును అనుభవ పూర్వకముగ తెల్సుకొనుట. వారిచరణములవద్ద కొన్ని దినములు ఉండినచో వారు ఈప్రపంచమునుండి అతీతముగ ప్రవర్తించుచున్నారో లేదో అనువిష యము బోధపడగలదు. సింధీ హాసామల్ గారు చాలప్రార్థించినమీదట సమ కాలికసద్గురువనగ నెవరో చెప్పిరి. స్వామీజీమహారాజువారు, హుజూర్ మహ రాజ్ వారు, మహరాజ్ సాహెబ్ వారు, సర్కార్ సాహెబ్ వార్ల నాటి విషయ ములను వివరించిరి.

## 72

భగవంతుని పొందవలయు ననుకోరిక యుండవలయును.

4 జూలై 1917:—ఏమానవుడైనను భక్తి-ప్రేమలతో నిండినవాడై చంటి పిల్లవానివలె నమాయకత్వముతో ప్రవర్తించినచో నతనికిని పైవారికినిగూడ నందువలన సంతోషముగనే యుండును. ఏమానవుడైనను ప్రాపంచిక దుఃఖ ములవలన బెదిరిపోయినకారణముచేగాక, లేదా యేదైన నొకరోగమునకు

కష్టమునకును భయపడిగాక, ప్రత్యేకముగ తనపరమపితయైన పరమపురుషుని వియోగమును సహించలేకుండినకారణ మొక్కదానివలననే భగవంతుని కలిసికొనవలయుననియు, నీప్రపంచమునకు తిరిగి రాకూడదనియు కోరికపెట్టుకొని యున్నయెడల నది చాల శుభోదర్కమైన విషయము. సత్సంగములో నట్టివారికే ఘనత. ప్రాపంచికకష్టములమూలమునగాని, వైరాగ్యభావముచేగాని, లేక యెవనివల్లనైనను భగవంతుని మహిమనుగురించి విన్నందువలనగాని, సత్సంగముచేసికొన్నందువలనగాని యీవిధమైన కోరిక పుట్టినను, అదికూడ మంచిదే, కాని భగవంతుని వియోగదుఃఖహేతు వొక్కదానిచేతనే అట్టికోరిక దానంతటనది హృదయమున పుట్టినయెడల నది మహోత్తమము. అట్టివాడు శరీరత్యాగము చేయుసమయములో, పసువు రోజంతయు మేతమేసి సాయంకాల మింటికిపోవునపుడు దానిదూడను కలుసుకొనుటకై యింటివైపున కెట్లు పరుగెత్తుచుపోవునో, అటులనే మహావేగముతో ఉన్నతోన్నతలోకముల కెక్కిపోగలడు. జైనమతస్థులు చనిపోవుటకుముందు ఒక నెలరోజులు కాని 20 రోజులు కాని భోజనముమానివేసి శరీరమును శుష్కింపజేయుదురు. అట్లు చేసినచో వారికి మరణానంతరము ఉత్తమలోకములు లభించునని నమ్మకము. కాని భక్తుడైన సత్సంగికి ముందుజన్మ మంచిదికావలెననికాని, వైకుంఠము సత్యలోకమువగైరా ఉత్తమలోకములు కావలెననికాని కోరికయుండక, తమ ప్రియతమునితో కలుసుకొనవలయునను కోరిక యొక్కటిమాత్రమే యుండును. అతనికి మరణించినపిదప గలిగెడి గతినిగురించి చెప్పుట సాధ్యమేకాదు. చాలమంది సత్సంగులు తిరిగి యీలోకములో జన్మించవలయునని కోరుకొనుచుందురు. కాని నిజమైన ప్రేమీభక్తునికి తమప్రియతముని వియోగము సహింప శక్యముగాకపోవుటచే నతడు తిరిగి ఇచ్చటకు మరెపుడును రాకుండుటకై హృదయపూర్వకముగా ప్రార్థించుచుండును.

## 73

### సద్గురునికాలములో ప్రాముఖ్యత గలవారికి హెచ్చరిక — ఫిర్యాదుల విచారణసమితి యేర్పాటు.

8 జూలై 1917:—సంపూర్ణనిరంకుశాధిపత్యము గల చక్రవర్తులకాలములో ప్రముఖస్థానము లభించినవారు తమ అధికారమదమును ప్రకటించి

పనులు నెఱవేర్చినచో, వారివలన నపకారములను అనుభవించిన ప్రజలు తరువాత చక్రవర్తి కాలము వచ్చినపుడు వీరిపైన పగదీర్చుకొన్నట్లును, వీరు తమ తమ ఉద్యోగములనుగూడ కోల్పోయినట్లును, చరిత్రాత్మక సంఘటనలనుబట్టి మనకు తెలియుచున్నది. సంతులసమయములలోగూడ నట్లే, స్వామీజీ మహారాజ్ వారు, హుజూర్ మహారాజ్ వారు, మహరాజ్ సాహబ్ వార్ల కాలములో అధికారపదవులలోనుండి అధికారము చలాయించినవారు, తదనంతరసద్గురువు వచ్చినపిమ్మట వారివారి పదవులను కోల్పోయిరి. ఈవిషయమును బాగుగా జ్ఞాపకముంచుకొనవలయును.

ఒక బెంగాలీ, ఒక పంజాబీ, ఒకఉత్తరప్రదేశములోనివాడు, ఒకసాధువు, ఇట్లు ఒక్కొక్క ప్రాంతమునుండి ఒక్కొక్క ప్రతినిధిచొప్పున నన్ని ప్రాంతముల ప్రతినిధులను జేర్చి, ఒకసమితిని (Board) తయారుచేసి, జనులుచేసెడి ఫిర్యాదుల నాసమితి విచారించి, వారి తీర్మానమును తమవద్దకు పంపించులాగున నేర్పాటుచేయవలయునని సెలవిచ్చిరి. ఆతీర్మానము తమకు నచ్చకపోయినయెడల దానిని మేము తిరిగి ఆబోర్డునకు పునర్విచారణ నిమిత్తమై పంపుదుము కాని, దానిని మేమే రద్దుచేయము. అట్లు కలిసిమెలిసి పనిచేయుచున్నయెడల నిప్పుడు కలుగుచున్న శ్రమలవంటి శ్రమ లెవ్వియు జనుల కుండనేరవు.

## 74

### సత్సంగుల ప్రవర్తనలో లోపములనుగుఱించి.

9 జూలై 1917:—ఒక్కొక్కసత్సంగి మొదటలో కొద్దిరోజులు బహూత్సాహముతో సత్సంగకార్యములు నెరవేర్చుచుండునుకాని, తానను కొన్న ప్రాపంచికలాభము తనకు చేకూరనపుడు తన ప్రాపంచిక వాంఛలను తీర్చుకొనుటకై మఱొకప్రక్కకు తిఱిగిపోవుచుండును. అచ్చట అతనికి కొంత నష్టము వచ్చినను, దెబ్బతగిలినను, తిరిగి అతడు సత్సంగమువైపునకు మళ్లుచుండును; కాని మరల ప్రపంచమువైపునకు ఆకర్షితుడగును. ఈవిధముగా ఇటునటు నూగిసలాడుచు, చివరకు భగవత్కృపను పొందలేకుండ నుండిపోవును. కాని యే సత్సంగికిని మఱొకసత్సంగిని దూషించుట కెన్నడు హక్కులేదు. సద్గురు వొకప్పుడెవనినైన కోపపడినను, మఱొకప్పుడు వారు అతనియెడల దయాప్రేమలు చూపుచు పరమపితవలె ప్రవర్తించుదురు. సత్సంగికూడ నట్లే తండ్రివలె ప్రవ

ర్తించగల్గినచో, మంచిదే. కాని సత్సంగి కట్లు ప్రవర్తించి ప్రేమచూపుట సాధ్యముకాదు.

ఇంకను సత్సంగులప్రవర్తన కావలసినంత బాగుగా లేదు. అయినను సత్సంగి హృదయము బాగుగా దున్ని తయారుచేసిన పొలమువలె నుండును. అనగా ఆపొలములో విత్తనములు చల్లుటయేతరువాయి కాని అట్లు జల్లినచో వేలకొలది మణుగులపంట పండిపోవును. అట్లుగాక ప్రాపంచికజీవుని హృదయము ఊసరక్షేత్రమువంటిది. దానిలో సంవత్సరములకొలది పెంటవేసి, ఇంజన్లుపెట్టి బాగుగా దున్నించి బాగుచేయించినయెడలనే పనికివచ్చును.

కబీర్ మేరే సాధ కీ నిందా కరే న కోయ్,

జో పై చంద కళంక హై జగ ఉజియారా హోయ్॥

అర్థము:—నాభక్తులైన సాధువుల నెవరును నిందించకుడు, వారి కేమైన లోట్లున్నను, అవి చంద్రుని కళంకమువంటివి. చంద్రునకు కళంకమున్నను, జగత్తంతకు వెల్తురు నిచ్చుచునే యున్నాడు.

అగమప్రతాపసాధువు మోతీరామును దుర్భాషలాడెనట. అది మాకు చాలకష్టముగనున్నది. సద్గురు కేసత్సంగినైనను కోపపడెనను హేతువుచే సత నిని చెడ్డవాడని యితరులనకూడదు. రాధాస్వామీదయాళు రెవనిని తమ ఆత్మీయులుగా చేసికొనిరో, అతడు స్వతహా గొప్పవాడు కాకపోవచ్చును, కాని, అతనిపైన అందరికన్న గొప్పప్రభువుయొక్క దయ యున్నదను విషయము మఱచిపోకూడదు. భగవంతునిచే నాత్మీయుడుగా చేసికొనబడిన ప్రతిజీవునకు నెప్పటికైన భగవచ్చరణములందు నివాసము లభించగలదు.

## 75

### సమితి యేర్పఱచుటకై ప్రయత్నములు.

10 జూలై 1917:—సత్సంగ యేర్పాట్లనిమిత్తమై యొకసమితి (Board) యేర్పాటుచేయబడినది. ప్రతిరాష్ట్రములోని సత్సంగులందరికిని వోట్లువెళ్ళినవి.

## 76

### సత్సంగికి ప్రపంచములోని విపత్తులనుండి కాపుదలగల్గుట కుపాయము.

11 జూలై 1917:—ప్రతి సత్సంగియు సామాన్యవిధముగ తనకు కాలక్షేపములయిపోవుటకును, ఆహార పానీయములకొఱకును, కట్టుకొనెడి బట్టలకొఱ

కును రోగముల చికిత్సకొఱకును ఎంతఅవసరమో అంతమాత్రమే కోరుకొన వచ్చును, కాని అంతకన్న నెక్కువ చింత పెట్టుకొనకూడదను విషయముమీద వచనము సెలవిచ్చిరి. సంత్ సద్గురువుమీద ప్రేమగల్గియుండినందువలనను, అంతర్యమున భగవంతునితో నిరంతరసంబంధసూత్రము కలుపుకొనియుండుటవలనను, ప్రాపంచికవిపత్తులనుండి అతనికి కాపుదల గల్గును. ఇది తప్ప రక్షణచేసికొనుటకు మఱొక ఉపాయముగాని విధానముకాని లేదు.

# 77

సత్సంగికిని ప్రాపంచిక జీవులకును కలిగెడి మరణావస్థలలో వ్యత్యాసము.

12 జూలై 1917:—ఫతహచందు శబ్దము చదివెను. పిమ్మట హుజూరువారిట్లు సెలవిచ్చిరి:—

ప్రాపంచిక జీవులలో చాలమంది చనిపోవుసమయములో తమబంధువుల నెక్కువ కంగారుపడవద్దనియు తమ యాంతర్యములో చాల శాంతిగ నున్నదనియు, కంగారుపడవలసిన అవసర మేమియు లేదనియు చెప్పుట కలదు. ప్రాపంచికజీవులలో చాల దానపుణ్యములు చేసినట్టివారికిని, తీర్థయాత్రలు, ఉపవాసవ్రతములు చేసినవారికిని, తమ ఇష్టదైవమునందు వారికి సంపూర్ణ విశ్వాసముండుటచే, మరణానంతరము తమకుత్తమగతి లభించగలదను ఆలోచన మరణసమయమందు గలుగుచుండును. ప్రాపంచికజీవులు, రాధాస్వామీమతములోనివారికి మరణసమయమందు దయకలుగుచుండినయెడల ఆమతస్థుడైన ఫలానావ్యక్తియొక్క మరణముగూడ అవ్విధముగనే సంభవించియుండెడిదని, తఱచుగ ఆక్షేపించుచుందురు.

చూడుడు, రత్నములు, మాణిక్యములను త్రవ్వుకొనుటకై పోవుచున్న ఒక వర్తకుడును, ఢిల్లీలో ఉద్యోగముచేయుచు సెలవుమీదనుండి, సెలవు అయిపోయినతరువాత తిరిగి తన ఉద్యోగములో చేరుటకై పోవుచున్నట్టి మఱొకఉద్యోగస్థుడును, ఒకేరైలుబండిలో ఢిల్లీ వెళ్ళుచున్నారనుకొనుడు. రత్నములు, మాణిక్యములకొఱకై వెళ్ళినట్టి వర్తకుడు బహుసంతోషముగను, కులాసాగను ప్రయాణము చేయుచుండును. ఈ ఉద్యోగస్థుడు మాట్లాడకుండ నొకచోట కూర్చుండును. ఈఉద్యోగస్థుడు ఒకగ్లాసు మంచినీళ్ళకు ఒకపైసా

ఇచ్చినపుడు ఆ రత్నాలవ్యాపారస్థుడు, తనకు ఏవో లక్షలు, కోట్లు డబ్బు లభించగలదను నమ్మకము ఉండినందువలన మంచినీళ్ళగ్లాసుకు ఒక్కొక్క అణా ఇచ్చుచుండును. చూచినవారందఱకును ఉద్యోగస్థుడు ఉదాసీనముగ నున్న ట్లును, రత్నవ్యాపారి బహుఉత్సాహముతో నున్నట్లును కనిపించును. రత్న వ్యాపారస్థుడు కొండలమీదకువెళ్లి త్రవ్వకొనగా అచట నేమియు రత్నములు, మాణిక్యములు దొరకక వికలచిత్తుడైపోయి తల మొత్తుకొనుచు చాల విచా రించును. రెండవవాడు ఢిల్లీవెళ్లి తనఉద్యోగములో తిరిగి ప్రవేశించినపిమ్మట బహుశాంతచిత్తుడై తనఉద్యోగముచేసికొనుచు సంతోషముగను, ఉత్సాహము గను ఉండును.

రైలులో ప్రయాణముచేసినపుడు వీరిద్దఱిని చూచినవారే పర్వతము మీదనుండి దిగి తిరిగి ఢిల్లీవచ్చినపుడా రత్నవర్తకుని చూచినయెడల వారికి ఆ పరిస్థితి బోధపడగలదు. అదేవిధముగ చాల దానపుణ్యములుచేసి తీర్థయా త్రలు, వ్రతములు చేసికొన్న ప్రాపంచికజీవులు మరణసమయమందు తమకు తమఇష్టదైవము తప్పకుండ మరణానంతరము సహాయముచేయునని నమ్మకొని సంతోషముగను, శాంతచిత్తులుగను ఉండవచ్చునుగాని చనిపోయినతరువాత వారి క్షేత్రోవయు దొరకకున్నపుడు మహావిపత్తులోపడి బాధపడుచు దుఃఖించు చుందురు.

రాధాస్వామీమతములోనిసత్సంగికి తెలుచుగ గురుమహారాజువారు ఫలానాసమయమున శరీరత్యాగము కాగలదని ముందుగా తెలియజేయుచుం దురు. అపుడు అతనికి లౌకికవిషయములన్నిటియందును మోహము నశించి అతడు బహుశాంతచిత్తముతో ఆసమయమునకై ఎదురుచూచుచు, ఆసమయ మువచ్చినపుడు సద్గురువుతోకలిసి వెళ్ళి ఉన్నతోన్నతధామమునందు నివాసము పొందును. వీరిరువురికిని మరణసమయమందుగలిగిన యవస్థలను చూచినవా రెవరైనను తరువాతపరిస్థితిని చూడగలిగినచో నప్పుడు తప్పక వారికి అవ్యత్యా సము తేటపడగలదు. సత్సంగియొక్కమరణమునుగుఱించి నిన్న చెప్పినదంతయు నోటితోచెప్పినవిషయమేకాని, దానికి ఋజువుఇచ్చి నచ్చచెప్పుట ప్రస్తుతము సాధ్యముకాదు. అయితే రాధాస్వామీమతము యథార్థమైనదైనచో సత్సం గికి నిస్సంశయముగ అట్టిపరిస్థితి కలిగితీరును. అప్పుడతడు తనమహాభాగ్యమును తెలిసికొని, తానేమియు స్మరణ, ధ్యాన, భజనాభ్యాసములు చేయకపోయినను

ఇంతటిమహోదయ తనపై నగలిగెనని సంతోషించుచుండును. ఎవరైన నొక ఫల వృక్షముయొక్క బీజమును పాతిపెట్టినచో అది అప్పటికప్పుడే పెద్దచెట్టుగ తయారై పండ్లుకూడ ఫలించుచుండిన నతడెంత యాశ్చర్యపడి సంతోషించును. భగవంతుడు సత్సంగిని తనఆత్మీయునిగ చేసుకొన్నందువలన ప్రతిసత్సంగికి నిట్టి ఉత్తమగతి తప్పక కలిగితీరును. "అయ్యో, మనకు ఏబది, అరువది ఏండ్లు గతించిపోయినవి, ఇంతవఱకేమియు అభ్యాసము సాగలేదే"అని వ్యాకులపడ నవసరములేదు. మూడునాలుగు జన్మలతో పోల్చిచూచినచో ఈ ఏబది అరువదిసంవత్సరములునుకూడ ఒక్కరోజునకు సమానముగ నుండును. మఱి ఒక్కరోజునకై పశ్చాత్తాప మొందుట? ఒకపసిపిల్లవాడు తాను పెరిగి పెద్దవాడైనపుడు తనతండ్రిగారి దుస్తులను వేసికొనెదనని తలచుకొనుచు ఆనందించుచుండునుగాని తానింకను అంతసమర్థుడు కాలేదని తలచుకొని అసంతృప్తి నొందడుకదా! అటులనే ప్రతి సత్సంగియు భగవంతుడు తప్పక తనకెప్పటికైన నిజధామమునందు నివాస మిప్పించగలడని నిస్సంశయముగ నమ్మికొనవచ్చును.

## 78

### సత్సంగముయొక్క వ్యావహారిక ప్రబంధము.

12 జూలై 1917:—ప్రస్తుతకాలములో చూడగా పరాయిదేశములలో అభివృద్ధికొఱకై గొప్పతబ్బిబ్బులుపడిపోవుచున్నట్లు కనిపించుచున్నది. (పై దేశస్థులలోనందఱికిని) బంగారము తయారుచేయవలెననియు, ఒక్కపెట్టున అపార ధనసంపన్నులమైపోవలయుననియు కోరిక మెండుగనున్నది. పై దేశములలో వ్యాపించుచున్న విషయములన్నియు (మోటరుకార్లు వగైరాలు) మెల్ల మెల్లగా హిందూదేశములోనికిగూడ వచ్చుచున్నట్లు మనము చూచుచున్నాము. కావున నదేవిధముగా మనదేశములోగూడ అచిరకాలములో నట్టిపరిస్థితియే రాగలదు.

రాధాస్వామీమతసిద్ధాంతము ఫ్యాగ్గింగ్ (fagging=అలసట చెందునట్లు పనిచేయించుట) అను ఆంగ్లపదముచే ప్రకటించబడుచున్నది. పాశ్చాత్యదేశములలో (senior class) పెద్దక్లాసుపిల్లలు వారికన్న చిన్నక్లాసు (junior (class పిల్లలను కష్టపెట్టి వారిచే ఊరికే పనులుచేయించుకొందురు. దీనినే ఫ్యాగ్గింగ్ (fagging) అని యందురు. అట్లు కష్టపడి పనిచేసిన ఆచిన్నక్లాసు కుఱ్ఱవాడే కొన్నాళ్ళతరువాత పెద్ద గొప్పఆఫీసరై పెద్ద అధికారము చలాయిం

చును. దీనికి ఆంగ్లభాషలో "Obedience teaches how to command", అనగా "మొదట విధేయతగా నున్నందువలననే తరువాత నధికారము చేయగల సమర్థత చేకూరును" అని ఒక సామెత గలదు.

మనమతములో నొక స్వార్థరహితులైన సద్గురువు ఉండి మనమందఱము వారి కాజ్ఞాబద్ధులమై ప్రవర్తించుచుంటి మనుకొనుడు. మనసంఘమునకువచ్చిన ధనమంతయు మన అందఱి శ్రేయస్సుఖముల కవసరమైన యేర్పాట్లనిమిత్తమును, విద్యాభివృద్ధికిని టెక్నికల్ ఎడ్యుకేషన్ (Technical Education) అనగా, శిల్పకళావిద్యాభివృద్ధికిని వ్యయపఱచుచుంటిమనికూడ అనుకొనుడు. అట్లైనచో కొంతకాలమునకు మనసంఘ మొకపర్వతసమానముగ దృఢతరమైపోవును. అపు డెవరైన నీమతముతో పోటీచేసెడిపరిస్థితి గల్గినచో వారికి ఆపర్వతము క్రిందపడి తలలు పిండిగుండమైపోవునట్లు దెబ్బలు తగిలిపోగలవు. ఒకసత్సంగి యెచ్చటనైనను నెలకు ఇరువదిరూప్యములు జీతము తీసికొని ఏదైన ఇనుప సామానుపని వద్దగాని నౌకరీ చేయుచుండెననుకొనుడు. అతడు తన యజమానికి ముప్పదిరూప్యముల విలువగలపని చేయుచుండును, కావున అతడు ముప్పది రూప్యము లాయజమానికిచ్చి ఇరువదిరూప్యములుమాత్రమే తీసుకొనుచున్నట్లగును. అటులనే అతడు బయటదుకాణములలో నేవైన బట్టలను వస్తువులను కొనుగోలుచేసినపుడు ఆధనము మనసంఘమునుండి బయటకు పోగొట్టుకొన్నట్లైపోవును. కాని ఆసత్సంగియే సత్సంగములో నౌకరీచేయుచు నెలకు పది రూపాయలుమాత్రమే జీతము తీసుకొనుచున్నయెడల దానివలన మొట్టమొదటివిషయ మేమనగ, నతడు తనసంఘసోదరు లందఱికిని సహాయము చేయుచున్నట్లగును. మఱియు అతడు సంపాదించినదంతయు తనవారికొఱకే వెచ్చించుచున్నట్లు నగును. సత్సంగములో నేదైనవస్తువును కొన్నచో ఆడబ్బు తనయింట నుండిపోయినట్లే అగును; అందఱిచేతులలోనుండి తిరిగి తిరిగి మాఱుచు ఆధనము మరల తనవద్దకే వచ్చును. ఆపద్ధతిగా నడచుకొనుచుండినయెడల కొంత కాలమునకు సత్సంగము ఒకపెద్దమహాసంఘముగ నేర్పడి, మహాఘనకార్యములను స్వార్థపరమార్థములలో నెఱవేర్చగల సమర్థతగలిగినట్టియు, భగవంతునికి భజనచేసికొనునట్టియు నొక గొప్ప మహాసంఘముగ తయారవగలదు. అప్పుడు ఈసంఘముతో నెవరును పోటీచేయలేరు. ఈప్రపంచములో నెన్ని ఆవేశపూరిత సంఘర్షణలు జరుగుచుండినను, వానివలన మనసంఘమున కెట్టినష్టములును గలుగనేరవు.

## 79

### హుజూరువారు పిల్లలతో హాకీ ఆడుకొనుట.

14 జూలై 1917:—హుజూర్ వారు పిల్లలతో హాకీఆట స్వయముగ నాడి వారే ఓడిపోయిరి. పిమ్మట పిల్లలు ఉపాధ్యాయులతోగూడ హాకీ ఆడగా ఉపాధ్యాయులుగూడ నోడిపోయిరి. పిల్లలందఱు చాల సంతోషపూరితులై పెద్ద పెద్ద కేకలు పెట్టిరి. సాయంకాలము అందఱకును ప్రసాదము పంచిపెట్టిరి. అది గాక హుజూరువారు ప్రసాదమును అందఱికి విసిరివేసిరి.

## 80

### సంఘములో చెడుఅలవాట్లనుగుఱించియు, పరాయిగృహములలో భోజనము చేయుటనుగుఱించియు, భేటిలనిచ్చు పద్ధతినిగుఱించియు, బ్రాహ్మణాది వర్ణములను గుఱించియు, అత్యాచారులకును మహాత్ములకునుగల వ్యత్యాసమును గుఱించియు.

15 జూలై 1917 :—జాట్లకులములో నెవరియింటనైన మరణముగాని జననముగాని సంభవించినచో ఆసంఘ మందఱకును ఆయింటివారు భోజనము పెట్టుట ఒక రివాజై ఉన్నది. అట్లు ఏయింటియజమానిగ్లైనను భోజనము పెట్టనిచో అతనిని బలవంతపెట్టి అట్లు చేయించుదురు. తక్కువస్తోమతుగల మనిషి యెవరైన నట్లు చేయనిచో అతనిపై మఱెవరైనను ఫిర్యాదుచేసి అతనికి జుర్మానా వేయించి ఆడబ్బు సంఘమందఱికిని మద్యపానాదిఖర్చులక్రింద విచ్చలవిడిగ వెచ్చించుదురు. ఇట్టివారు స్వయముగ తామే తమజాతిని నాశనము చేసికొనుచున్నారు. ఆటులనే ఇతరుల ధనమును, అధనమును వారెట్లు సంపాదించిరో ఆలోచించుకొనకుండ. దానము పట్టుచున్నట్టియు ఇంకను అందఱి యిండ్లలోను విచక్షణలేకుండ భోజనము చేయుచున్నట్టియు బ్రాహ్మణులుగూడ చాల నష్టము చేసికొనుచున్నారు. కాని సరియైన నాయకు డున్నయెడల నతడు చాలవిమర్శ చేసినతర్వాతనే కాని తనసంఘము నావిధముగ తిండితిన నివ్వడు. స్వకాయకష్టార్జితమైన ద్రవ్యమునే కాని, మఱొక అన్యాయార్జితమైన ద్రవ్యము నెన్నడు అట్టినాయకుడు తిననివ్వడు.

ఏనియమము నేర్పాటుచేసినను, కొందఱకు కష్టము కలుగకమానదు. కాని సంఘములో చాలమందికి లాభము గలిగినచో కొద్దిమంది కది అప్రియముగనున్నదనువిషయము నాలోచించగూడదు. ఉదాహరణకై ఎవరైనను లంచముపట్టి సంపాదించిన ద్రవ్యమును అధికముగ భేంటిచ్చినపుడు ఆద్రవ్యము అన్యాయార్జితమగుటచే భేంటుక్రింద స్వీకరించకుండ తిరస్కరించినచో అతనికి దుఃఖము కలుగవచ్చును. కాని అందువలన జనసామాన్యమునకు లాభమున్నందువలన సరియైననాయకుడు అతనిమనస్సు దుఃఖించుననెడి విషయమును లెక్కచేయడు. భగవంతుని పొందగోరువారు మఱెవరిఇంటను భోజనము చేయకూడదు, అందులో ముఖ్యముగ అన్యాయముగ ద్రవ్యమార్జించువారియింటనసలే తినకూడదు. వారొకవేళ పట్టుపట్టినచో వారితో మీధన మన్యాయార్జితముకాబట్టి మేము తినమని చెప్పకూడదు. వారు ఆదరము చూపినందుకు ముందు కృతజ్ఞతనే తెలుపుచు ఆతర్వాత శరీరములో బాగులేదనికాని లేక మఱొకనెపముగాని చెప్పుకొని క్షమార్పణగోరుచు తప్పించుకొనవలెను. అట్లు చేసినను వారు వినకుండ పట్టుపట్టినయెడల అపుడు మాగురువుగారు అన్యాయార్జితమైనద్రివ్యము నెచ్చటను తినవద్దని ఆజ్ఞాపించిరని నమ్రితతో స్పష్టముగ చెప్పవలెను. మఱియు తాముగూడ అట్టిద్రివ్యమును విడిచిపెట్టినయెడల మాకు తమతో కలిసియుండుట కభ్యంతర మేమియు నుండదనికూడ చెప్పవచ్చును. భగవంతునిపొందగోరుభక్తు డెపుడైనను మఱొకరిద్రివ్యమును తిన్నయెడల భగవత్ప్రార్థనను, భజనాభ్యాసమునుచేసి ఆలోపమును తీర్చివేసుకొనుచుండును. అట్లుచేయలేనియెడల ఒకనటు డెవరైన నాట్యముచేయుచునొకప్రిక్కకు వంగినపుడు పడిపోయినచో నెట్లు పిండిగుండయైపోవునో అట్లే అయిపోవును. ఏసంఘమువారు కష్టార్జితమైనఆహారమును విచక్షణపూర్వకముగ తినుచుందురో అట్టి సంఘ మెప్పటికైన మహాఘనకార్యములను సాధించగలదు. ఆసంఘముయొక్క విశ్వాసపాత్రత లోకమంతయు ప్రిసిద్ధికెక్కును. భగవంతుడుకూడ అట్టిసంఘముపైన కటాక్షము చూపును.

మనస్సున భగవంతునియందు భక్తియొక్కటే ఆదర్శముగ పెట్టుకొని భేంటునిచ్చినచో అది చాల శ్రేష్ఠమైన విషయము. హృదయపూర్వకముగ నివ్వనట్టి భేటువలన నేమియు ప్రియోజనము లేదు. ఇంతియగాక ఎవరైనను ఏమియు నివ్వలేనిపరిస్థితిలోనుండి తనవద్ద నుండియుండినచో చాలపెద్ద మొత్త

మును భేంటు నివ్వవలెనని మనసా వాంఛగలిగియున్నచో భగవంతుడు ఆ భేంటునుగూడ,—అతడేమియు నిజముగ నివ్వలేకపోయినను అ ట్లివ్వవలెనని ఆతనిహృదయములో బాధపడుచున్నందువలన,—స్వీకరించును.

జాతులు, వర్ణములవిషయములో హుజూరువా రిట్లు సెలవిచ్చిరి:— పాశ్చాత్యదేశములలోగూడ బ్రాహ్మణకృత్యములను సాగించువారిని పాదరీలనియు, యుద్ధముచేయువారిని సైనికులనియు, వర్తకముచేయువారిని వర్తకులనియు, రోడ్లుతుడుచుట మున్నగు కూలిపనులను చేయువారిని కూలివారనియు పేర్కొనుచుందురు. ఒక పాకీవాడుగూడ చాలధనము సంపాదించుకొని, చాల చదువు చదువుకొనినచో, ఒకఫాదరీకాని, సైనికుడుకాని కావలెనన్నచో నట్లు కావచ్చును. అటులనే మనదేశములోగూడ జాతులన్నియు మొదటిలో వారు చేసెడికృత్యములనుబట్టియే యేర్పడెను. కాని యిపుడు అవన్నియు వేఱువేఱు జాతులు అనెడి భావ మేర్పడిపోయినది. బ్రాహ్మణుడు ఈకాలములో శూద్రుని కృత్యములే చేయుచున్నను బ్రాహ్మణుడనియే పిలువబడును. కాని ఒక పాకీవాని యింటపుట్టినవాడు చిన్నప్పటినుండియు నెన్నడు పాకీపని చేయక, ఒక సత్సంగియింట పెరిగి రాధాస్వామీమతములో నుపదేశముగూడ పొంది సత్సంగులవంటి సత్ప్రవర్తనయే గలిగియుండి అతనిని భగవంతుడు తనవానిగ చేసికొన్నపు డెవ్వరైన నతనిని కనిష్ఠునిగ నెంచినచో అది భగవంతుని కనాదరము చేసినట్లే యగును, మఱొకవిషయముగూడ నీసందర్భములో జ్ఞాపకముంచుకొనవలెను. లోకములో మనుష్యులు మూడురకములుగ నున్నారు. ఒకరు మఱొకరిలో నేదైన లోపము చాలకొంచెమైన నున్నట్లు కనపడినయెడల వారిని వెంటనే బహుకఠినముగ శిక్షించుచుందురు. రెండవరకము, మహాకోపిష్ఠులు, చాల చిన్నచిన్న విషయములకుగూడ మహాకోపముతో నిండిపోయి ముందువెనుక లాలోచించుకొనకుండగ నితరులను శిక్షించుదురు. ఈరెండురకములవారును అత్యాచారులని పేర్కొనబడుదురు. కాని ఎవ్వరైనను దోషముచేసినవానిని ఒకఅత్యాచారి శిక్షించినట్లే శిక్షించినను, ఆతప్పుచేసినవాడు తిరిగి అట్టితప్పును చేయకుండ తననడవడిని సవరించుకొననవలెననెడి యుద్దేశ్యమొక్కటితప్ప మఱొక భావ మెద్దియులేకుండ నున్నచో అతడు మహాత్ముడని అనిపించుకొనును.

# 81

## పెండ్లిండ్లలోని వ్యర్థవిషయములు — వాస్తవమైనవివాహము.

16 జూలై 1917:—ఈ సాయంకాలము లఖనా అను స్త్రీకి రామ్‌జీదాస్ అను పంజాబీతోను, మఱొక పంజాబీస్త్రీకి ఇంకొకపంజాబీ పురుషునితోను వివాహములు ఒకేసమయమున జరిగెను. హుజూరువారు పెండ్లికాకముందీవిధముగ వచనము సెలవిచ్చిరి:—

భూతమునకు నోరు సూదిబెజ్జమంత చిన్నదిగ నుండుననియు, పొట్ట మాత్రము చాలపెద్దదిగనుండి అది చాలకోరికలతోనిండియుండుననియు చెప్పుదురు. దానికి ఎల్లపుడు చాల తినివేయుచు నుండవలయునని మనస్సున కోరిక యుండును. కాని తినుటకు సాధ్యముగాకుండ నుండును. ప్రాపంచికజీవులు అదేవిధముగ వాసనలతో పూరితులై యుందురు కాని, వారి మనస్సు సూక్ష్మమై యుండి ప్రాపంచికపదార్థములు స్థూలముగ నుండుటచే వారి మనస్సు ఆపదార్థములను స్పృశించనైన స్పృశించనేరదు. మనము ప్రాపంచికపదార్థములయొక్క ఆనందమును పొందజాలకున్నాము. ఎట్లనగా ఒకనికి బెత్తము కావలెనని కోరికయున్నదనుకొనుడు, ఆబెత్తము దొరికినపు డతడు దానిని చేతితో పట్టుకొనును లేదా గుండెమీద పెట్టుకొనును. కాని ఆబెత్తము స్థూలమును, అతని మనస్సు సూక్ష్మమును అగుటచే ఆబెత్తమును అతని మనస్సు స్పృశించనేరదు. అందుచే నతనిమనస్సు చివరకు దుఃఖితమైయే యుండిపోవును. వివాహములు ఇతర ప్రాపంచిక స్థూలభోగములు, వీనిఅన్నిటిపరిస్థితిగూడ నిట్టిదేయని తెలిసికొనవలెను. మనస్సు బెత్తముదొరకినపు డెట్లు సంతోషించి గుండెమీద పెట్టుకొనునో పెండ్లిలో పరిస్థితిగూడ నట్టిదే, మనస్సు సంతోషముతో ఆవస్తువు నెట్లైన తనలోనికి తీసికొనవలయునని కోరుచుండును. కాని అసలైనవివాహమనగ నెట్టిదో అసలైన ఆనందమనగ నెట్టిదో మనోబుద్ధులకు గోచరముగాదు. స్థూలదేహముతో పోల్చగా మనస్సెట్లుసూక్ష్మమైనదో అటులనే మనస్సుతోపోల్చినపుడు ఆత్మకూడ నంతకన్న బహుసూక్ష్మమైనది. ఈఆత్మ తన నిజభండారముతో కలిసి యేకమై పోయినపుడునిజమైన వివాహముజరిగినట్లు చెప్పవచ్చును. వివాహ మనగా రెండు వస్తువులుకలిసి యేకమగుటయే. ఈవిధముగ ఆత్మ తనభండారముతో వెళ్ళి కలిసిపోయినపుడుగలిగెడి ఆనందము వర్ణనాతీతము. ఆఆనందముతో పోల్చగా ఈలా

కికసామగ్రియు, లౌకికానందము లన్నియుగూడ మహాతుచ్ఛములుగ కన్పట్టును. అదే అసలైన వివాహము అదే అసలైన ఆనందము. దానితో పోల్చినపుడు ఈలోకములోని విషయములన్నియు పసిపిల్లల ఆటలవలె నుండును.

శుభముహూర్తములు చూచి పెండ్లిచేసెడి బ్రాహ్మణులయిండ్లలోనే తఱుచుగ పిల్లలు వైధవ్యమును పొందుచుందురు. వారణాసిలో సుధాకరుడను పేరుగల ప్రసిద్ధబ్రాహ్మణుడొకడు చాలమంచిముహూర్తము చూచి తనకుమార్తెకు పెండ్లిచేసెను. ఆకుమార్తెకు వైధవ్యము గలిగెను. ఆబ్రాహ్మణు డపుడు తనపుస్తకములన్నిటిని తీసి కాల్చివేసెను. సత్సంగములో పెండ్లిచేసినపుడు, వధూవరులకు ఆయుర్దాయ మెక్కువకావలెననికాని అందువలన మొగపిల్లలే కలుగవలెననికాని కోరికతో చేయరు. ఇవన్నియు తుచ్ఛమైన లౌకికవాంఛలు. వీనితో సత్సంగమున కేమియు పనిలేదు. ఇవన్నియు వారివారి కర్మానుసారముగ జరిగిపోవును. ప్రపంచములో సామాన్యముగ పెండ్లిండ్లలోగలుగునట్టి తగాయిదాలు రాకుండనుండు నిమిత్తమును, వ్యర్థవ్యయభారమునుండి తప్పించుకొనునిమిత్తమునుమాత్రమే సత్సంగములో పెండ్లిండ్లు చేసుకొనుట యుక్తము కాని మఱొకవిధమైన ఆశలు పెట్టుకొని చేయుట అయుక్తము. పెండ్లికొడుకు పెండ్లికూతురును యింటికి తిరిగివచ్చినరోజున ఆవీధినిగాని, ఆయింటిముందునుండిగాని వెళ్లెడి మొట్టమొదటివ్యక్తిని యింటికిపిలిచి, శుభకార్యము చేసినట్లుగా అతనికి నాలుగులడ్డుల నివ్వవలయునని పంజాబుదేశములో రివాజుఉన్నది. ఆ ప్రకారము, నేనొకసారి అంబాలాలో స్కూలునుండి యింటికి పోవుచుండగా మాయింటియెదుటకు వచ్చినపుడు ఒకపెండ్లివారు నన్నుపిలిచి నాలుగులడ్లు ఇచ్చిరి. నేను మొట్టమొదటలో నది ఏదో ఇంద్రజాలముచేసిరని యనుకొంటిని. కాని యింటికి వెళ్ళి చెప్పగా అది ఒకవిధమైనరివాజని నాకు తెలిసెను. కాని ఆయింటివారు ఆతరువాత మూడునాలుగుసంవత్సరములలోపుననే అందఱు చనిపోయిరి. కావున నిట్టి ఆలోచనలన్నియు వ్యర్థమైనవి. వానివలన నేమియు ప్రయోజనములేదు.

## 82

### సత్సంగులలో తప్పుడభిప్రాయములు.

17 జూలై 1917 :— సత్సంగియొక్క పరిస్థితి చాలచెడిపోయినదని సెలవిచ్చిరి. వీరు ఉభయవిధముల భ్రష్టులయిపోయిరి. అభ్యాసముచేసికొనుడని

యెవరైనచెప్పినచో, "మెహర్ దయా కరనీ కరవాయీ, కరనీ కర్ బహు మెహర్ బఢాయీ" అని సమాధానము చెప్పెదరు. (అనగా భగవంతుడు దయాకటాక్షములు చూపి అభ్యాసముచేయించును. అభ్యాసము చేసినందు వలన దయాకటాక్షములు అభివృద్ధియగును అనిఅర్థము). సరే పోనిండు, సత్సంగము చేసికొనుడని ఎవరైనచెప్పినచో "సత్సంగ్ కరత్ బహుత్ దిన్ బీతే, అబ్ తో ఛోడ్ పురానీ బాన్" అని సమాధానము చెప్పెదరు. (అనగా సత్సంగము చాలరోజులనుండి చేసుకొనుచునే యున్నావు. ఈపురాణాచారములను నింక విడిచిపెట్టుము అని యర్థము) మనస్సున నీవిధమైన బోధను ధరించుకొని, వీరు "అబ్ మై సోఊం బిఛాయే ఖాట్" (ఇక నిప్పుడు నేను మంచము వాల్చుకొని సుఖముగ పరుండును) అని వక్కాణించుదురు. ఈ పవిత్రశబ్దముల లోని చరణములకు ఫలితము ఒకమహావిపత్తుగా తయారయ్యెను. ఈవిధముగ వీరు పరమార్థములో మందకొడిగనుండి ప్రాపంచికకృత్యములుగూడ సరిగ నెరవేర్పలేకున్నారు. దానివలన వీరికి ఏమియు లేకుండ పోవుచున్నది. నిజమునకు వీరికి రాధాస్వామీమతమన్న నేమిటో తెలియనే తెలియదని చెప్పవలెను. ఇట్టి జీవులనుకూడ సత్సంగములో జేర్చుకొని వారిచేత సేవచేయించుకొనుట ఒక్క రాధాస్వామీదయాళునికే సాధ్యమైనపని. రాత్రింబవళ్లు వీలైనపుడెల్ల నభ్యాసము చక్కగ చేసికొనుచు, తన కార్యసాఫల్యము చేకూరువరకు నిరంతరము నట్లే యభ్యాసము చేసికొనవలయుననెడి నిశ్చయముతోనున్నవానికి ఆంతర్యమున శాంతియు, చల్లదనము గలుగుచుండును. ప్రాపంచికవిషయములకొఱకై యితరులవలె నతడు వ్యాకులపడడు. అతనిపనులన్నియు భగవత్కృపచే వానంతటనవియే సాగిపోవుచుండును. అతనికి స్వతస్సిద్ధముగనే స్వార్థపరమార్థములు రెండును సిద్ధించిపోవుచుండును.

## 83

సత్సంగియొక్క బాధ్యత.

18 జూలై 1917 :—సత్సంగులు దీనులమనియు, అధీనులమనియు తామొక సర్వసమర్థపురుషుని శరణు జొచ్చితిమనియు ననుకొనుట యుక్తమే. అట్టి భావము అత్యుత్తమమైనదే అయినను దానితోపాటు వారు ఇతరులకు సుఖములు కలుగజేయుట తమకర్తవ్యమనువిషయముగూడ తెలుసుకొనవలయును.

అట్లుకానిచో చైనాదేశస్థులు కన్ఫ్యూషియస్ (Confucius) అను వేదాంతిపైనను, క్రైస్తవులు ఏసుక్రీస్తుపైనను, మఱికొందఱు బుద్ధునిపైనను, విశ్వాసము గలిగియుండియుకూడ వారందఱును ఇతరులను అణగద్రొక్కుటయే తమకర్తవ్యమని యెట్లుభావించుకొనుచున్నారో, అట్లే సత్సంగులుకూడ పైన చెప్పినట్టి బాధ్యతను జ్ఞాపకముంచుకొననిచో పై మతములవారి పరిస్థితివంటి పరిస్థితిలోనే పడిపోవుదురు. ఆర్యసామాజికులు హిందూదేశములో నంతటను గొప్ప దురన్యాయము జరిగిపోవుచున్నదని చెప్పుచున్నారు. కాని వారాలోచించుకొనవలసిన విషయ మేమనగా, వారు భగవంతుడని విశ్వసించుచున్న బ్రహ్మయే దేశమందంతటను అన్యాయము వ్యాపించుట కిష్టపడ నేరడు. పదిపదునైదుగురికి అన్యాయము జరిగినను జరుగవచ్చును. కాని, దేశమంతటను అన్యాయము చెల రేగునట్లు భగవంతు డెట్లు చేయును? భగవంతుని దివ్యేచ్ఛయనగా నెట్టిదో వీరికి అనుభవజ్ఞానము లేదు. వీరు భగవంతుని నిజముగ భగవంతునిగ నెంచుచున్నారా? ఎవరైన నొక మామిడిటెంకను పాతిపెట్టినపు డచ్చట మామిడిచెట్టుకు బదులుగ నొకతుమ్మచెట్టు బయలుదేరినచో నతడు దాని పుడకలను దంతధావనమున కుపయోగించి ఆకులను మందుచేయుట కుపయోగించి దానిబెరడును రంగుతయారుచేయుట కుపయోగించవలయునుగాని తుమ్మచెట్లేల బయలు దేరెనని బాధపడకూడదు. అదేవిధముగ భగవంతుడు, ఇచ్చట భక్తిబీజములు జల్లినపుడు అవి బాగుగనాటుకొని మొక్కలులేవవలయునను తలంపుతో నీదేశమునంతను బాగుగదున్ని కాటుకవలె మెత్తగాచేసెను. కాటుకమీద కొద్దిగ నీటిబొట్టుపడినపుడు అది ఉండకట్టుకొనిపోయినట్లే మనముకూడ ఉండగట్టుకొని పోకుండ జాగ్రత్తపడవలెను, అనగా అహంకారమునకు లోనుగాకుండ చూచుకొనవలెను. మనబాధ్యతను మఱచిపోకూడదు. అప్పుడే మనము భగవద్భక్తిని చేయుటకు తగియుందుము.

## 84

### భక్తుడు, సత్యాన్వేషి.

19 జూలై 1917 :— ఇంద్రసింగు సాయంకాలము వచ్చెను. ప్రేమీ (భక్తుడు) యొక్కయు, ఖోజీ (అనగా సత్యాన్వేషి) యొక్కయు పరిస్థితులను గుఱించి హుజూరువారు ఆయనతో చాలసేపు చర్చించిరి. ఎవరైనను ప్రేమిగ

నైన నుండవలయును, లేనిచో సత్యాన్వేషిగనైన నుండవలయును, కాని ఏక కాలమందు ఈరెండవస్థలును ఒకేమనిషికి ఉండనేరవని సెలవిచ్చిరి.

## 85

"పియా బిన ప్యారీ కైసే హోయ నిబాహ" అను చరణముమీాద వ్యాఖ్య.

20 జూలై 1917 :—"పియా బిన ప్యారీ కైసే హోయ నిబాహ"

అర్థము :—ప్రియమైన సద్గురువు లేనిదే జీవునికి నిర్వాహమెట్లగును ?

సంతుల మతములో ననేకస్థలములలో గురువు నన్వేషించుకొనుము, గురువునకు పూజచేయుము, గురువును ధ్యానముచేయుము అని వ్రాసియున్నది. ఇందులో నేదైన గొప్పమహదుద్దేశ్యమున్నదా, లేక గురువు డప్పుతీసికొని తనను పూజచేయుమనియు, తానే సర్వస్వమనియు, తననుగుఱించి తానే సాటించుకొనుచు, నోటితో బిగ్గఱగ నఱచుచున్నారా, అనువిషయమును కొద్దిగా శ్రద్ధవహించి ఆలోచించవలసియున్నది. ఇప్పుడు చూడుడు, నిన్నునీవు ముందు తెలిసికొనుము, పిమ్మట భగవంతుని తెలిసికొనగలవని చెప్పిరికదా. అటులనే నిన్ను నీవు చూచుకొన్నయెడల మనదృష్టి అంతయు మనచేతిమీాదనే పెట్టు కొన్నపుడు మనము పూర్తిగ నాచేతితో నేకమైపోవుదుమని తెలియగలదు. ఆతర్వాత నాయాలోచన విడిచిపెట్టిననుకూడ ఆచేతికి సంబంధించినవిషయము లనుగుఱించిన ఆలోచనలే వచ్చుచుండును. ఉదాహరణకు చేతిమీాద ఒకపుండు ఉన్నయెడల దానికి డాక్టరుచేత వైద్యముచేయించవలయు ననెడి ఆలోచనలు వచ్చుచుండును లేక దృష్టి మఱొక వేఱువిషయముమీాదికి మళ్ళిపోయినచో, పూర్తిగ నావైపునకేపోయి, చేతిమాటయే పూర్తిగా మఱచిపోవచ్చును. అటులనే యెవరైన నొకమహావిద్వాంసు డుండినచో అతడు గొప్ప ఉన్నతాలోచనలు కలిగియుండును. భూమి దున్నుకొనెడి ఒకకూలివాడైనయెడల నతడు స్థూలవిషయములకు సంబంధించిన యాలోచనలు గలిగియుండును. కాని వీరిరువురునుగూడ, పనిపాటలన్నియు చేసికొన్నపిమ్మట నిద్రపోవుటదప్ప మఱొక పనియెద్దియు లేదని తోచి నిద్రపోయినపుడు వారిరువురిపరిస్థితియు నొకేవిధముగ నుండును. అపుడు నిద్రపట్టనియెడల పేకఆట వగైరాఆటలు ఆడుకొని

చివరకు నిద్రవచ్చినపుడు ఒకపశువుమాదిరిగనే నిద్రపోవుదురు. లేదా ఒక మిలిటరీ అధికారికి ఎవరైన నొకయుత్తరము వ్రాయవలసివచ్చినచో ఆవిషయమును గుఱించి ఆలోచించుకొనునపు డతనికి మహాగూరకృత్యములకు సంబంధించిన ఆలోచనలు గలుగుచుండును. కాని అప్పుడుగూడ నతనికి నిద్రవచ్చినచో నతడు మైమఱచి నిద్రపోవును. మానవుడైతే దోమలు, ఈగలును రాకుండ తప్పించుకొనుటకై ఒకదోమతెఱ వేసికొనును. చేతకానిపశువైతే రాత్రింబవళ్లు దోమలను, ఈగలను తనతోకతో తోలివేసికొనుచుండును. ఈవ్యత్యాసము మనుష్యులకు, పశువులకు నుండెడి జ్ఞానభేదముమూలముననమాత్రమే కలుగుచున్నది. శీతోష్ణములనుండిగూడ మానవుడు కాపుదలచేసికొనగలుగుచున్నాడు. కాని జంతువులు అట్లు కాపుదలచేసికొనలేక బాధపడుచునేయున్నవి. వానికి నిజమైనసుఖము కావలెనన్నచో వానిజ్ఞానగ్రహణఘట్టము (plan of conscionsness) మాఱువఱకు నిజమైన సుఖము, ఆనందమును లభ్యము కానేరవు. అందువలననే సంతులు స్మరణ, ధ్యానభజనాభ్యాసములను నిర్దేశించిరి.

నిజమైనట్టియు, పరిపూర్ణమైనట్టియు సంతుమహాత్ములు లభించవలెను. కేవలము నిజాయితీ యొకటేయుండి పరిపూర్ణుడు కాకపోయినచో అతనివలన కార్యసాఫల్యము కానేరదు. త్రికుటివఱకు మాత్రమే జీవుని జేర్పించెడివారిని గురువనియు, సత్యలోకమువఱకు జేర్పించెడివారిని సద్గురువనియు, పరమపురుషుని ధామమందు జేర్పించెడివారిని పరమగురువనియు చెప్పుదురు. జీవుడు ఉన్నతలోకములవిషయములో నిద్రావస్థవంటి అజ్ఞానావస్థలోనే పడియున్నాడు. అతడు సంత్ మహాత్ములవద్దకు వెళ్ళినపుడు వారు అతనిని మొట్టమొదట ఆనిద్రలోనుండి మేల్కొల్పుదురు. నిద్రపోవువానిని మేల్కొలుపుటకై మొట్టమొదట అతనిపాదములలో తేలికగా గోకుచు ఆపిమ్మట అతనిశరీరమును పట్టుకొని ఆడించుచు అప్పటికిగూడ నతడు లేవనిచో ఇంజక్షన్ (Injection) వగైరాలు ఇచ్చుచున్నట్లే సంతులు జీవుని మేల్కొల్పుటకై మొట్టమొదట పట్టుకొని మెల్లగా నొక్కుదురు. అనగా కొద్దిశ్రమ కలుగజేసి మేల్కొలుపుచు, పిమ్మట మఱికొంచెము బాధ కలుగజేయుచు, చిట్టచివర కతడు ప్రపంచములో తనకు దుఃఖము తప్ప మఱేదియు లేనట్లు తెలిసికొనునట్లు చేసి, అతడు ప్రపంచమునుండి విరక్తి చెంది దీనత్వముతో అంతర్ముఖుడైనపుడు అతనిని సద్గు

రువు ఊర్ధ్వముగ నారోహింపజేయుచు అతని ఆత్మను శబ్దముతో నైక్యము చేయుదురు. ఈవిధముగ నతనిజ్ఞానగ్రహణఘట్టము మాఱిపోవుచున్నకొలది (plane of conscionsness) అతని కాంతర్యమున మహానందము లభించును. అందువలననే

"పియా బిన ప్యారీ కైసే హోయ నిబాహ"

అనగా, సద్గురువు లభించనిదే జననమరణాదులకు సంబంధించిన దుఃఖములు, ఆపత్తులనుండియు విముక్తి యెన్నటికిని కానేరదని సెలవిచ్చిరి. కష్టములు నాపత్తులు నెల్లపుడు బాధించుచునేయుండును. సద్గురువు ఒక్కరుండినను ఉండుగాక, లేదా పదివేలమంది సద్గురువులుండినను ఉందురుగాక, కాని జీవునియొక్క జ్ఞానగ్రహణస్థానము నెవరు మార్పించగలరో అట్టి సద్గురువువలననే కార్యము నెఱవేరును. అప్పుడే స్మరణధ్యానభజనలు పూర్తిగ సరియైనపద్ధతిని చేయుటకు సాధ్యమగును. జ్ఞానగ్రహణఘట్టమును మార్చుచు, జాగ్రత్ స్వప్నావస్థలనుదాటించి పైకిపోవునట్లు చేయలేనిగురువువలన జీవునికార్య మెన్నటికి నెఱవేరజాలదు.

## 86

ఇంద్రసింగుగారి విషయము.

20 జూలై 1917 :— ఇంద్రసింగుగారితో భిన్నభిన్నవిషయములమీద మాటలు జరిగెను. ఆయన పరమానందుగారిమీద తనకు భావమున్నట్లు చెప్పుచుండెను. హుజూరువారు ఆయనకు బోధచేసిరికాని ఆయన ఇంక నట్లే చెప్పుచుండెను. అప్పుడు దివ్యేచ్ఛచే (మౌజ్) నొకశబ్దము తీయగా ఈక్రింది శబ్దము వచ్చెను.

"కుమతియా బైరిన్ పీఛే పడీ, మైం కైసే హటాఊం జాన్."

అర్థము :—మనస్సనెడి దుర్బుద్ధిగల శత్రువు నన్ను వెంటాడించుచున్నది. నేను నాప్రాణముల నెట్లు కాపాడుకొందును.

## 87

ఇంద్రసింగుగారి విషయము.

21 జూలై 1917 :—హుజూరువారు తిరిగి ఇంద్రసింగుగారికి బోధపఱచిరి. రెండుగంటలసేపు బోధించగా ఆయన గురువుగారికి సాష్టాంగపడి క్షేం

టిచ్చి ప్రసాదము పంచిపెట్టుటకుగూడ భేంటిచ్చెను. ఇంత మొండిమనిషి గురువు గారి శరణులోనికి వచ్చినందుకు సంతోషమును ప్రకటించుచు మఱికొందఱు సత్సంగులుగూడ భేంట్లిచ్చిరి. "మౌజ్" కు శబ్దము తీయగా ఈక్రిందిశబ్దము వచ్చెను.

"గురు ఆరత మై కరనే ఆయీ, దుఃఖ భరమ్ సబ్ దూర్ నసాఈ"

అర్థము :— నేను గురువుగారి ఆరతి చేసికొనుటకై వచ్చితిని. నాకు సమస్త భ్రమలు, దుఃఖములును తొలగిపోయినవి.

# 88

## క్రోధభావము, అహంకారమును గలుగు విధము.

22 జూలై 1917 :— ప్రతిమానవుడును యౌవనములోనికి వచ్చినపుడు నేను ఫలానాపనిని నెఱవేర్చవలెను అను నొక జీవితాదర్శము నేర్పాటు చేసుకొని అందునుగుఱించి ప్రయత్నము సేయుచుండును. అతనికి విఘ్నములు కలిగించువారు మూడురకములుగ నుందురు. మొదటిరకమువారు ఆపని జరిగినను జరుగకపోయినను లెక్క చేయనట్టి నిర్లక్ష్యభావముగలవారు. రెండవరకము ఆపని కాకుండ జేయుటకై శత్రుత్వము వహించువారు. మూడవరకము అతని కాపనిలో సహాయముచేయకుండ నుండువారు. ఆమనిషి అయితే తనపని పూర్తి చేసికొనుటకై ప్రయత్నము చేయుచుండును. నీచతరగతికిచెందినట్టి ప్రాపంచికవాంఛలు నెఱవేరనపుడు క్రోధభావముగూడ పుట్టుచుండును. ఆపని పూర్తియైనపుడు తానీముర్విధములైన ప్రతిబంధకారకులను జయించితినని అతనికి అహంకారము గలుగుచుండును.

# 89

స్వామీబాగువారు దయాల్బాగు సత్సంగము విషయములో చేసెడి కొన్ని ఆక్షేపణలకు సమాధానములు. కృత్రిమగురువులను గుఱించియు, లోకములోని బంధుమిత్రుల నిజాయితీనిగుఱించియు, సత్సంగులకుండవలసిన విశాల భావములను గుఱించియు-సద్గురు వొక్కరే జీవులయొక్క శ్రేయోభివృద్ధులను నిస్స్వార్థముగా కోరుచుందురు.

24 జూలై 1917 :— సాయంకాలము స్కూలువిషయములో నెవరికైన నాక్షేపణలున్నవా యని సబ్ రిజిష్ట్రారుగారి నడుగగా ఆయన పరమార్థమునకు స్కూలుతో సంబంధమేమున్నదని కొందఱు ప్రశ్నించుచున్నారని చెప్పెను. అందుమీాద హుజూర్ వారు నిజమున కేమియు సంబంధము లేదని సెలవిచ్చిరి. ఎవరైనను కలకత్తా వెళ్ళవలెనన్నచో కలకత్తాకు రైలుకును సంబంధమేమున్న దనియు లేక గ్రంథములకును గ్రంథములమ్ముటకును, భండారాలు చేయుటకును పరమార్థముతో సంబంధ మేమున్నదనియు అడుగవచ్చును. కాని ఇవన్నియు సాధనములు. రైలు కలకత్తా తీసుకొని వెళ్లుట కొకసాధనము. పవిత్రగ్రంథ ములు, పవిత్రగ్రంథపాఠము వగైరాలన్నియుగూడ నట్లే సాధనములు. అటు లనే స్కూలుగూడ నొకసాధనము. సత్సంగులవద్ద అద్దె పుచ్చుకొని వారి నివా సమునకై ఇండ్లనిచ్చుటయు, భోజనముపెట్టుటయు చేయుచున్నారు. నిజమునకు పరమార్థమున కీపనులతో సంబంధమేమున్నది? కాని ఇవన్నియు పరమార్థము చేసికొనుట కెట్లు సహాయకరములో స్కూలుగూడ నట్లే సహాయకరమైనది. అనగా నలుగురుపిల్లలు గలవానికి ఆపిల్లలమూలమున పరమార్థము చేసికొను టకు వీలుకాదు. ఆపిల్లలకు సెలవులు ఉన్నపుడు తండ్రికి సెలవుదొరకదు. రాత్రింబవళ్ళు పిల్లలనుగుఱించి పాట్లుపడుచుండుటవలన నతడు పారమార్థిక కృత్యములను చేయలేకుండును. స్కూలు ఉండినచో నతడు పిల్లలను స్కూలుకు పంపి తాను పిల్లలను తగినచోటికి పంపితినను విశ్వాసముతో నిశ్చింతగ నుండ వచ్చును. అప్పుడు అతడు నిశ్చింతగ స్మరణధ్యానభజనలు చేసికొనుట కవకా శము గలుగదా? అసలైన పరమార్థ మనగనేమి? ఆత్మను శబ్దముతో నైక్యము చేయుట. ఈపని సమస్తేంద్రియములను, మనస్సును తృతీయనేత్రము వద్ద నేకాగ్రముచేసినపుడే సాగును. ఇంద్రియములను, మనస్సును ఏకాగ్రము చేయుట, మానవునికి ప్రాపంచికవ్యాకులతలు తగ్గిపోయినపుడే సాధ్యమగును. ఇంతియగాక సత్సంగవాతావరణములో పాలనపోషణలు పొంది చదువుకొను చున్న ఈపిల్లలు ముందుముందు పరమార్థులు కానేరరా? మఱియు ఎంత తెలివి తక్కువ సత్సంగియైనను, తాను చనిపోయినపిదప సత్సంగేతరులయింట పుట్టి సద్గురుని అన్వేషణనిమిత్తమై మఱొక ఇరువది ఇరువదియైదు సంవత్సరములు శ్రమపడ నక్కరలేకుండగ నెవరైన ఒకసత్సంగి ఇంటనే తిరిగి జన్మించవలయు నని కోరికతో నుండడా? కావున చిన్నప్పటినుండియు సత్సంగములో వచ్చి

యుండుటకు సావకాశము కలుగజేసినచో నది అంతయు పరమార్థమునకు సహాయకరమైన సాధన యెట్లు కాకుండును ?

అపుడు సబ్ రిజిష్ట్రారుగారు లాలారాజ్ నారాయణ్ గారు ఇచ్చటివారందఱు భక్తి చేయుట లేదని ఆక్షేపించుచున్నారని చెప్పెను. సబ్ రిజిష్ట్రారుగారు, "లేను, వారు భక్తి చేయుచున్నారని నేను చెప్పితినిగాని ఆయనమాత్రము 'భక్తి కాదు మట్టిచేయుచున్నా'రని అనుచున్నారు" అని చెప్పిరి. సమాధివద్ద భేంటుగూడ నిచ్చుట లేదని అనుచుండెననికూడ సబ్ రిజిష్ట్రారుగారు చెప్పిరి. హుజూర్ వారు అందుకు సమాధాన మివ్విధముగ చెప్పవలయునని సెలవిచ్చిరి. సమాధివద్ద ఒకడబ్బీపెట్టి దానిలో రూపాయలు ఎట్లు వేయుచున్నారో అట్లనే మేము దయాల్బాగుఅనెడి డబ్బీలో రూపాయలు వేయుచు, ఇచ్చటనే సాష్టాంగప్రణామము చేయుచున్నాము. సమాధిడబ్బాలోనే రూపాయలు వేసినచో ఆరూపాయలు రాధాస్వామీదయాళునికి చేరునని పవిత్రగ్రంథములలో వ్రాసియుండినయెడల, నట్లే తప్పనిసరిగ చేయవలసియుండెడిది.

సబురిజిష్ట్రారుగారు తిరిగి "ఇది భక్తిమార్గముగాని భగవంతునిమార్గము గాదని వారు ఆక్షేపించుచున్నారు" అని చెప్పెను. దానిమీద హుజూర్ వారిట్లు సెలవిచ్చిరి : చూడుడు. హుజూర్ మహారాజ్ వారిభక్తి అంతసుప్రసిద్ధికెక్కుటకు కారణమేమనగా వారు చేతనపురుషునికి భక్తి చేసిరి. చేతనపురుషునికి భక్తి చేయుట చాలకష్టము. చేతనపురుషుడు తన ఆరతిచేయుడని చెప్పినపుడు భక్తుడు పది ఇరువదిరోజు లట్లు వరుసగ ఆరతిచేసె ననుకొనుడు. ఒకరోజున వారు చాలకోపముతో రోజురోజు ఆరతిచేయుటయేనా అని బెదరించెననుకొనుడు. అట్టిసమయములో వారిమాటలను ఆక్షేపణచేయకుండ వారెప్పు డెట్లు చెప్పిన దానినే మనస్ఫూర్తిగ మన్నించుచునుండవలెనేకాని, యెట్టిఅభావమును లేకుండనుండవలెను. అప్పుడే అది భక్తి యనిపించుకొనును. లోకములోని వారు చాలమంది ఏదోవిధముగ భక్తి చేయుచునే యున్నారు. హుజూర్ మహారాజ్ వారికంటెకూడ నెన్నియోరెట్లెక్కువ శ్రమపడికూడ చేయుచున్నారు. కొందఱు ప్రాపంచికజీవులు, హుజూర్ మహారాజ్ వారి భక్తికి మించిపోవునంత కఠినవిధమునగూడ పనిచేయుచున్నారు. ఉదాహరణకై మనబాబాగారి సోదరుని చూడుడు. ఆయన రోజుకు పండ్రెండుఘంటలసేపు పవిత్రగ్రంథపఠనము చేయుచుందురు. కొందఱు ప్రదక్షిణములు చేయుచు ప్రాణములు కోల్పో

యిరి. పాశ్చాత్యఖండములో ఒక స్త్రీ తనకుక్కలు రెండిటికిని రెండులక్షలవిలువైన ఆస్తిని మరణశాసనము (will) వ్రాసియిచ్చి, చనిపోగా వార్తాపత్రికలలో ఆ ఆస్తులను పొందునిమిత్తమై కొందఱు ఆకుక్కలను పెండ్లియాడుటకుగూడ సిద్ధముగ నుండిరని హాస్యాస్పదముగ వ్రాసిరి. పాశ్చాత్యదేశములలో మఱొక స్త్రీ తనపిల్లి పరుండుటకై 4000 పౌనులు ఖర్చుపెట్టి ప్రక్క తయారుచేయించెను. ఇవన్నియుగూడ భక్తియేగాని అవి మనస్సుయొక్క భక్తి. ఆభక్తిలో వారిని పైనుండి అణచెడివారెవరును ఉండరు. అందుచే వీరందఱు చేయుభక్తి శ్లాఘనీయముగాదు, హుజూర్ మహారాజ్ వారిభక్తితో పోల్పదగినదియుగాదు. ఏలననగా, హుజూర్ మహారాజువారు చేతనపురుషునికి భక్తిచేయుచుండెడివారు.

నిజమునకు భక్తిచేయుట ఒక్క గురుముఖునికేగాని మఱొకజీవునికి సాధ్యముగాదు. కాని భగవంతునికి సంపూర్ణముగ సేవచేయవలెనని మనసార కోరుచు, అట్లు సాగనపుడు హృదయపూర్వకముగ పశ్చాత్తాపపడి విచారించుచు నుండవలెను. అంతమాత్రముచేతనే జీవునికి కార్యము సఫలమగును. ఒకప్పుడు చేతనపురుషునికి భక్తి చేసియుండినప్పుడు అది విడిచిపెట్టి సమాధి వద్దరాలను పూజించువారికన్న, సేవజేయవలయునని నిజమైనవాంఛ గలిగియుండి అట్లు చేయలేనందుకు పశ్చాత్తాపము, విచారము పడుచుండెడి జీవుడు ఉత్తమశ్రేణికి చెందును. అయితే, కొందఱు కేవలము అంధవిశ్వాసముతో నుండి, తమ్ముతాము కృతార్థులనియు, సంతులనియు భావించుకొనువారు గూడ నున్నారు. అట్టివారు లోకులందఱు తమ్మును నిస్సంశయముగ సిద్ధపురుషులని నమ్మవలయునను తలంపుతో నుండుటచే సంతుల సహవాసములోనుండినపుడు, వారు సంతుల బాహ్యప్రవర్తనను అనుకరించుటయొక్కటే నేర్చుకొందురు. ఉదాహరణార్థము, ఎవరైనను చాలకష్టములోనుండి యేడ్చుచు సద్గురుని చరణములవద్ద మొఱపెట్టుకొన్నపుడు, సద్గురువు ధ్యానములో ప్రవేశించి అంతర్యమున నేకాగ్రత పొందును. కాని వారచ్చట నేప్రార్థనగాని వినతిగాని చేయకనే "వెళ్లుము అతనిపని నెఱవేరిపోవు" నని తమకు పైనుండి ఆజ్ఞవచ్చును. తిరిగి వారాదుఃఖితునితో, "అబ్బాయీ నీమీద భగవంతునికి దయగలిగినది, నీపని నెఱవేరుటకు అవకాశము లేకపోలేదు." అని చెప్పుదురు. కాని, "నీకార్యము తప్పక నెఱవేరును. భగవంతుడావిధముగ మాకు సెలవిచ్చె"నని స్పష్టముగా చెప్పరు. కృత్రిమసంతువద్ద కెవడైనదుఃఖితుడు వెళ్ళి తనబంధువుడైన

ఫలానామనిషికి జబ్బుగనున్నదని చెప్పుకొనినపుడు ఆయన ధ్యానముచేసి, "అబ్బాయీ, భగవంతునియందు విశ్వాసము పెట్టుకొనుము. వారేమిచేసినను నీకు మంచిదేయని నమ్ముకొనుము" అని చెప్పుదురు. ఆబంధువు చనిపోయినట్లైతే "మంచిదే భగవంతుడు బంధనమునుండి తొలగించిరి" అని చెప్పును. ఒకవేళ అతనికి జబ్బుకుదిరి ఆరోగ్యము గల్గినచో, "మేము ప్రార్థనచేసితిమి కదా, మరేమి?" అనియందురు కన్నములోనున్న యెలుకవలెనే వీరును గప్పాలు కొట్టుచుందురు. వారామనిషియెదుటికివెళ్ళి పూర్తిగా అన్నివివరములనుగుఱించి చర్చజరిపించినయెడల తమకృత్రిమమంతయు వారికపుడు బయల్పడును. భగవంతుడు స్వయముగనే ఆధ్యాత్మికరహస్యములను విశదపరచి జీవులనందఱిని ఆకర్షించునట్లే ప్రకృతినియమమున్నయెడల వారు దేహస్వరూపములో ప్రకటము కావలసినయవసర మేమున్నది? ఈసృష్టిని మొదట రచించవలసిన అవసర మేల కలిగెను? "కాల రచా హమ సమఝు బూఝుకే" (అనగా మేము బాగుగ నాలోచించియే కాలుని సృజింతిచిమి)అని భగవంతుడు చెప్పినవచనమున కర్థము, జీవు డీలోకములో దుఃఖ మనుభవించి ఆవిధముగా తన చైతన్యలోపమును పూర్తిచేసుకొని, సంతసద్గురు సహాయముతో తిరిగి నిజధామమును చేరుకొనవలయుననియే.

ఈ లోకములో నీకు సేవచేయుచున్నట్టియు, నీయెడల ప్రేమతో మసలుకొనుచున్నట్టియు బంధుమిత్రులందఱును కేవలము స్వలాభమును కోరువారే. ఉదాహరణార్థ మొకమనిషి తన పశువునకు పరిచర్యచేసి దానిని మేపి బలమైన దానిగ చేయును, కాని ఆపాటంతయు నతడుపడినది, ఆపశువులాభముకొఱకు గాదు, తన కది పాలు అధికముగ నీయవలయుననియే. అది పాలిచ్చుట మాని వేసినప్పుడు దానినే కసాయివాని కమ్మివేయు ప్రయత్నములో నుండును. లోకములో నందఱిప్రేమయు నిట్టిదే, తండ్రికూడ పిల్లవానికి సేవచేయుట ఆపిల్లవాడు పెరిగి పెద్దవాడైనపుడు తనకు ముసలితనములో సహాయకరముగ నుండునను నాసచేతనే. ఇదంతయు నీప్రపంచముయొక్క తమాషా. లోకములో దుఃఖములనుభవించి గాబరాచెందినపుడే జీవుడు సత్సంగముకొఱకై అన్వేషణ మొదలుపెట్టును.

జీవునియొక్కలాభమును నిస్స్వార్థముగ కోరువారును, జీవునిక్షేమము నిస్స్వార్థముగ నాలోచించుచువారును సద్గురువొక్కరే. అయినను సత్సంగము

లోని కెవరువచ్చినను, సద్గురువు సకలజీవులకును లాభకరముగనుండునట్టి నియమముల ప్రకారమే వారిని నడచుకొనునట్లు చేయుదురు. అట్లుచేయుటవలన నొకరిద్దఱికి లేక నలుగురైదుగురికైనను కొంతకష్టము గలిగినను సద్గురువు లెక్కసేయరు. మనకు కొద్దిగ శ్రమ గలిగినను పదిమందికి అందువలన లాభము గలిగినచో నది చాలమంచిదేయనుభావము నిజముగ నందఱికి నుండవలయును. అట్టిభావ మున్నయెడల, మొదటిసంగతి, ఆకష్టమువలన నతని కెట్టిశ్రమయు మనస్సునకు తోచదు; రెండవవిషయము, ఇతరులుగూడ నితడు తమ కొఱకై అట్టి కష్టము ననుభవించుచుండెనని తెలిసికొని, ఇతనికి ప్రత్యుపకారము చేయ జూచుచుందురు. ఈవిధముగా పరస్పరైకమత్యమువలన పని నెఱవేరిపోవుచుండును. "వీరు మన నెవరిఅధికారముక్రిందనో పెట్టి పనిచేయించబూనుకొన్నారు, కావున మన మిచ్చటినుండి మఱొకచోటికి పోయి పనిచూచుకొందము, ఇకముందు సత్సంగమునకు రాకపోకలు లేకుండగనే యుండిపోవుద"మని తలంచువారిగతి యెట్లుండునా ? వారికి గలిగెడి గతి నడిరోడ్డుమీద చచ్చిపడిపోయినవాని శవము నెత్తుకొనిపోవువా రెవరును లేకుండిన నెట్లుండునో అట్లే అయిపోవును. చూడుడు, బాబూస్వామీచరణుగారు చనిపోవునిమిత్తమై సత్సంగమునకు వచ్చిరి. సత్సంగులందఱు నతనికి సానుభూతిచూపి సేవసేసినందున నతడు చాలసుఖశాంతులతో దేహమును విడిచిచేసెను. ఆయన శవము నందఱును మోసుకొనిపోయి, అంతిమ సంస్కారము చేసిరి. ఇదేవిధముగ నెవరైన సత్సంగముతో కలిసిమెలిసి యున్నయెడల నతనికి బ్రతికియున్నంతకాలమును, మరణించిన పిమ్మటనుగూడ నెల్లప్పుడును సుఖశాంతు లుండును.

## 90

### సత్సంగులు కష్టపరిస్థితిగల్గినపుడు అవలంబించవలసిన పద్ధతి.

26 జూలై 1917:—స్మరణధ్యానభజనలును, పవిత్రనామముయొక్క అర్థమును, అభ్యాసవిధానమును, మీకు బాగుగ బోధపడినవా అని సత్సంగులను కొందఱిని ప్రశ్నించినచో, వారు అవన్నియు తమకు బాగుగ బోధపడినవనియు, నావిషయములో వారి కెట్టిసందేహములు లేవనియు చెప్పుదురు. అరే, అయితే యేమైన నభ్యాసముకూడా వారు చేయుచుండిరా యని అడిగినచో," ఆ, చేతనైనంతమట్టుకు చేయుచునే యున్నా" మని సమాధానము చెప్పుదురు. ఇంక

నేమి చెప్పవలయును ? కాని వారిపరిస్థితి యెట్లుండుననగా, చిన్న చిన్న విషయ ములమూలముననే వారికి అభావము, అవిశ్వాసమును సులువుగా గల్గుచుండును. అందువలన వారు మఱెవరికి నపకారము చేయుటలేదుకాని తమకు తామే నష్ట పోవుచున్నారు. దీనినే స్వాత్మద్రోహము (self-deception) అని చెప్పుదురు. అనగా అట్టి వారు తాము స్వయముగనే మోసపోయి యితరులను చాల సులు వుగ మోసపుచ్చగలరు. దీనికి కారణమేమనగ, నతడు శబ్దస్వరూపమైన తన ఆత్మను ఉపదేశ మిచ్చినపద్ధతిని చైతన్యశబ్దముతో నైక్యము చేసుకొనలే కున్నాడు, అంతర్యమున ప్రవేశించలేకున్నాడు. ఎవ్వరైనను తనకన్న కొద్దిగ మంచిపరిస్థితిలో నున్నట్లు కనపడినపుడు తనకుగూడ నట్టిపరిస్థితి గలుగలేదని యీర్ష్యతో బాధపడుచుండును. ఆ మంచిపరిస్థితిగలవానిని వెళ్ళి కొంచెం మడి గినచో వానియవస్థ యెట్లున్నదో బోధపడును. ఈప్రపంచములో చక్రవర్తి కైనను సుఖములేదు. కనుక చక్రవర్తియైన నేమిలాభము ? కాని మఱొక మనిషినిచూచి, "ఒక వెయ్యి రెండు వేల మంది ఆయనను చూచుసరికి మహాదర గౌరవభావములతో నిలబడుచుందు"రని అచ్చెరువు పడుచుండును, కాని యీ విషయమువలన నేమనిషికిని అసలైన సుఖశాంతులు గలుగనేరవనువిషయము జ్ఞాపకముంచుకొనవలెను.

సత్సంగములో నేమనిష్కైన నొక అప్రియపరిస్థితి కలిగినట్లు తెలిసినపుడు ఒక్కొకరు, "ప్రపంచమునుండియు, ప్రాపంచిక తాపమునుండియు తప్పించుకొను నిమిత్తమై మేము సత్సంగములోనికి వచ్చితిమి కాని యిచ్చటకూడనట్టి పరిస్థితియే యుండినచో సత్సంగమువలన లాభ మేమియున్నది ?" అని అడుగుదురు. కొద్దిగా శ్రద్ధ వహించి ఆలోచించినయెడల, నతని కట్టియాలోచనలు పుట్టుటకు కారణము అతని అప్రతీతియు, అతని నీచస్వభావము, భక్తిశూన్యతయే అని తేటపడగలదు. చూడుడు, సత్సంగులెవరును సంత్ సద్గురువు కారు. సత్సంగ ములోని పదార్థములెవ్వియునుగూడ సంత్ సద్గురువు కాదుకదా. అతడు సంత్ సద్గురుని మనస్సేమియు మాఱిపోలేదుగదాయని చూచుకొనవలయును. వారు అందఱి నొకేభావముతో చూచుచు, నందఱియెడల సమానమైన ఆదరప్రేమ లను చూపుచుందురు. కావున వారిచిత్తములో మార్పు లేనపుడు మఱి విచా రించవలసిన పనియే లేదు. అట్టివాని కివ్విధముగ సలహా చెప్పవలయును; "నీకు సంబంధించినంతవఱకు నీవు నిజాయితీగా నడుచుకొనుము. నీమనస్సుయొక్క ద్రోహములో పడిపోకుము. అట్టి తారుమారు పరిస్థితిలో నిశ్చింతగా నుండి

పోకుము. హృదయపూర్వకముగా స్మరణ, ధ్యానములు చేయుము. అట్టిపరిస్థితి గలిగినందుకు పశ్చాత్తాపపడి విచారించుచు ఆవిపత్తునుండి త్వరగా తప్పించుమని భగవచ్చరణములందు ప్రార్థించుము. నీవట్లు చేసినయెడల నీబాధ్యతను తీర్చు కొన్నవాడ వగుదువు, కొద్దిరోజులు కనిపెట్టుకొని యుండుము. అప్పుడు నీపరి స్థితి మారి నీకు మనశ్శాంతి గలుగునో లేదో చూచుకొనుము. అట్లు చేయు టచే తప్పక నీకు మనశ్శాంతి చేకూరును. నీపరిస్థితి మారిపోవును. అట్లుగాక మనస్సు చెప్పిన ట్లాటలాడుచు దానిని పరిశీలించుకొనకుండ నుండిపోయిన యెడల, మహాదుఃఖపరిస్థితిలో పడిపోవలసి వచ్చుననియు, ఎప్పుడైనను పరిస్థితి మారినపుడు మహాపశ్చాత్తాపము పడవలసి ఉండుననియు జ్ఞాపకముంచు కొనుము. నీకు భగవంతునియందు కొద్దిగా ప్రతీతి కలిగినపుడు దానిని నీవు ప్రీతిసహితముగ నభివృద్ధిచేసికొనవలసి యున్నది. అట్లుచేయుటచే నీప్రీతి ప్రతీ తులు రెండును వృద్ధియగుచుండును. అందువలననే మనస్సు నెల్లపుడు పరికించు చుండవలయునని బోధించబడుచున్నది. అట్లుచేయుటచే నీకన్నిదోషములు నశించిపోగలవు. ఇది చాల నాజూకైన విషయము. అనుక్షణము మనస్సును పరిశీలించుచుండవలయును. చెడుఆలోచనలు పుట్టిపుట్టగనే మనస్సును ధిక్క రించుచుండవలయును. ప్రాపంచిక పదార్థములకై మనస్సున కోరికలు పుట్టి పుట్టగనే వానిని కట్టిపెట్టుచుండవలయును. ఇట్లు చేయుచుండినందువలన నేదైన కఠినపరిస్థితి కలిగినపుడు, ఇతడు హృదయపూర్వకముగ కొద్దిగా స్మరణధ్యాన ములు చేసినచో నాపరిస్థితి వెంటనే మారిపోయి మనశ్శాంతి చేకూరగలదు. కామ, క్రోధ, లోభ, మోహాహంకారములు మున్నగు వికారలక్షణములు అన్నియు వానంతటనవియే అణిగిపోవుచున్నట్లు తెలియగలదు. ఇట్టిపరిస్థితి గలిగినప్పుడు అందఱును "నీ విదివఱకు మంచి పెంకితనముగా నుండెడివాడవు. ఇప్పుడు నీ కేమైనది, ఇట్లైపోయితివి" అని నిన్ను తప్పక ఎగతాళి చేయుదురు. నీకప్పుడు కొంతసిగ్గు కలుగవచ్చును. కాని నీవు ఆసమయములో నీకు గలిగిన మనశ్శాంతిని చూచుకొని తృప్తిపడి చాల సంతోషముగా నుందువు. కొందఱు ప్రపంచసంబంధమైనకోరిక లేవైనను పూర్తియైనపుడు చాలా ఆనందపడి భగ వంతునికి ధన్యవాదము లర్పించుచుందురు. వారు చాల సంతోషముగానుండుట చూచి ఇతరులు అతనిపైన భగవంతుడు చాల దయ చూపెనని అనుకొందురు. కాని సత్సంగికి అట్టిపరిస్థితి చాలప్రమాదకరమని జ్ఞాపకముంచుకొనవలెను. ప్రాపంచికవాంఛలు పూర్తియైనప్పుడు, ఎక్కువగ నానందించుటవలన అతనికె

ప్రాపంచికవిషయములం దింకను ఆసక్తి మెండుగ నున్నట్లు తేటపడును. అట్టి వానికి ఏ కారణముచేతనైనను ఆకోరిక తీరకపోయినను లేదా ఆకలిగిన లాభమున కేదైనహాని కలిగినను అతడు అంతులేని దుఃఖమునుకూడ పొందగలడు. అందుచేత లౌకికవిషయములలో లాభముగల్గినపు డెక్కువ ఆనందపరవశత్వము పొందకుండునట్లు, నష్టము గలిగినపుడు దుఃఖమునకు పరవశమైపోకుండగ నుండులాగునను మనస్సును పరిశీలించుకొనుచుండవలయును. ఏదైన విరుద్ధపరిస్థితి వచ్చిపడినపుడు వెంటనే స్మరణధ్యానములు చేసుకొని ఆపరిస్థితినుండి కాపాడబడునిమిత్తమై భగవంతుని ప్రార్థించుకొనవలయును. తనపరిస్థితి చూచుకొని పశ్చాత్తాపపడి విచారించవలయును. అట్లుచేసినచో మనశ్శాంతి చేకూరగలదు, ఆకష్టపరిస్థితిగూడ మాఱిపోవును.

## 91

### సత్సంగులు రాజకీయాందోళనలలో ప్రవేశించకూడదు.

---

27 జూలై 1917:—హిందూదేశచరిత్ర చదివినచో, నీదేశములో గతించిన రాజులు, మహారాజులు, చక్రవర్తులు, ఋషులు, మునులు, మహాత్ములు వగైరాలందఱును ప్రజలను తమతమ పద్ధతులప్రకారమే ప్రవర్తింపజేయుచు సన్మార్గబోధ వగైరాలు చేయుచుండెడివారని తెలియగలదు. కాని వీరెవరికిని గూడ నాయుద్దేశ్యము పూర్తిగా సిద్ధించలేదు. నిజమునకు భగవంతుని దివ్యేచ్ఛ యెట్లుండెనో అవ్విధముగనే ఇంతవఱకు జరుగుచుండెను. లోకములో దుఃఖములు రెండువిధములని చెప్పుదురు. ఒకటి సామాన్యదుఃఖము, రెండవది మహాదుఃఖము. సామాన్యదుఃఖము దారిద్ర్యము. దారిద్ర్యమున్నపుడెట్లుండునో ఉదాహరణ నిచ్చెదను చూడుడు. ఒకవడ్రంగి మొదటలో చక్కగా పనిపాటలు చేసుకొనుచుండెను. కాని ఇపుడతడు దరిద్రుడగుటచే కుర్చీలు, మేజాబల్లలు, పట్టిమంచములు వగైరా శ్రేష్ఠమైనసామానులను తయారుచేసిపెట్టలేకుండె ననుకొనుడు. అట్లైనచో మనము పట్టిమంచమునకు బదులు నేలమీదనే పరుండవచ్చును. అంతకన్న మఱేమియు దారిద్ర్యమువలన కష్టము గలుగనేరదు. రెండవదైన మహాదుఃఖ మెద్దియనగా, ధనాఢ్యత. ఆవడ్రంగి యొక్క కుమారుడు బాగా చదువుకొని డిప్యూటీకలెక్టరు అయ్యెననుకొనుడు. అప్పుడు ఆమంచములు వగైరాలు చేసెడివారెవరు? ఆవడ్రంగి ఇపుడు లేడు

కదా. ఇంక చక్రవర్తుల విషయముకూడ నొకసారి పరికించి చూడుడు. వారొం డొరులను జయించునిమిత్తమై లక్షలకొలంది మనుష్యులకు రక్తపాతము కలిగించుచున్నారు. కావున ధనాఢ్యతకన్న మఱొకగొప్ప మహాదుఃఖము లేదు. పేదతనమువలన చివరకు చావొక్కటేకదా కలిగెడి మహాపత్తు. ఇట్లైనను చావు తప్పదు, అట్లైనను చావు తప్పదుకదా. కనుక నదొక మహాదుఃఖము కానేరదు. ఇపుడింక చూడుడు, లోకములో దుఃఖములతో బాధపడువారే భగవంతునికి భక్తి చేయుచున్నారు. కావున దీనినిబట్టి, హిందూదేశప్రజలకు ఇంతబహుపురాతన శిక్షానాగరికతలుండియున్నను భగవంతుడు వారిని దరిద్రతలో నుంచుటలో వారట్లుండిననే భగవద్ధ్యానము చేసికొనగలరనెడి యుద్దేశ్యముతో మహాదయయే చూపించెనని తేటపడుచున్నది.

లోకములోని మతములన్నిటిని చూడుడు. వానిలో నెద్దానికిని ప్రాణములేదు. అవన్నియు రాజకీయాందోళనసంఘములుగ నైపోవుచున్నవి. థియోసాఫికల్ సొసయిటీవారు (Theosophical society) భక్తిమార్గములో పోవువారని ప్రసిద్ధికెక్కియుగూడ, నిప్పుడు వారు హోమ్‌రూల్ (Home Rule) స్వరాజ్యము (Self Government) కొఱకై బిగ్గఱగ నఱచుచు నాందోళన చేయుచున్నారు. ఇప్పుడు భగవంతుని రహస్యమును, భక్తివిధానమును తెలిపెడిది ఒక్కరాధాస్వామీమతమే. అందుచే మనము అందఱము భగవంతుడు మనప్రబంధమును భక్తిచేయుట కర్హమైయుండునట్లుగనే మొదటినుండియు నేర్పాటుచేసినందుకు భగవంతునికి కృతజ్ఞతాధన్యవాదముల నర్పించవలసియున్నది. ఇప్పుడెవరైనను హోమ్‌రూల్ ఆందోళనలో (Home Rule Movement) పాల్గొనుమనికాని. స్వరాజ్యమునకై ప్రయత్నముచేయుమనికాని అడిగినచో, వారిని మనమతములో చేరుమని సమాధానము చెప్పవలయును. మీరు హోమ్‌రూల్ చేయుచు, చివరికి చనిపోవుదురుకాని, మీకు దొరుకునదేమియు నుండదు. మేమైతే శాంతముగా భగవంతుని ధ్యానము చేయుచు 1, 2, 3 జన్మలలో జన్మరాహిత్యమును పొందగలము. మాకు చక్రవర్తిపదవియు, ఫకీరుపదవియు నీరెండును సమానమే. చక్రవర్తియైననేమి, ఫకీరైననేమి ? వీనిలో నేపరిస్థితి గలిగినను, చివరకు మనమందఱము మరణించి ఈదేశమును విడిచిపెట్టవలసినదేకదా. ప్రస్తుతకాలములో నీయాందోళనలు హెచ్చుతీవ్రముగా జరుగుచున్నవి. అందుచే సత్సంగులెవరు నీయాందోళనలలో

నెంతమాత్రము పాల్గొనకూడదని సలహా యిచ్చుచున్నాము. భగవంతునికి తిరిగి తిరిగి ధన్యవాదము లర్పించుచు, మీరు ఆభగవంతుడు కల్పించిన పరిస్థితితో తృప్తినొందుచుండవలెను. భగవంతు డేది చేసినను సకలజీవుల క్షేమముకొఱకై చేయుననెడి విషయము నెల్లపుడు జ్ఞాపకముంచుకొనవలెను. భగవంతుడు సమస్తదేశములలోని జనులకు అన్యాయముచేయుటగాని, అందఱిని బెదిరించుటకు ఫ్లానుకొనుటకాని అసంభవము.

## 92

### కంసాలి రామచంద్రుని వ్యర్థసంభాషణ.

28 జూలై 1917 :—మహారాజసాహెబ్ వారి కాలమునాటి సత్సంగియైన రామచంద్రుడనుపేరుగల కంసాలి యొకడు వచ్చెను. అతనితో ననేకవిషయములనుగుఱించి సంభాషణ చాలసేపు జరిగెను. అతడు తాను సద్గురువుకొఱకై చాల అన్వేషించుచుంటినని చెప్పుకొనెను. సద్గురువింకను చిన్నవయస్సులో నుండి కోర్టాఫ్‌వార్డ్సు (Court of wards) సంరక్షణలోనున్న మైనరు (Minor) వారసునివలె నడచుకొనుచున్నారని అతడు అనెను. సారవచనము గద్యలో 250 వ వచనములో సద్గురువు తన ఉత్తరాధికారిగ నొకముఖ్యశిష్యుని నేర్పాటైనచేయుదురు లేదా నిజధామమునకైనను తిరిగి వెడలిపోయి దానిలో కలిసిపోవుదురని చెప్పినచోట ఉత్తరాధికారి (జానశీన్) అనగా "గౌణాంగముగా" అనుభావము దానిలో ఇమిడియున్నదని చెప్పెను. ఇవ్విధమైన వ్యర్థ సంభాషణ చేసెను.

## 93

### ఐహికపదవులకన్న ఆధ్యాత్మికశక్తిని మేల్కొల్పుకొనుట యెక్కువ ఆవశ్యకము.

29 జూలై 1917 :—ఉదయము 10 గంటలకు పిల్లల మీటింగు (Boy's meeting) అయ్యెను. అందులో హుజూర్‌వారు పిల్లల నీవిధముగ ప్రశ్నించిరి. "ఒకపిల్లవాడు బి. ఏ. (B. A.) ప్యాసగును, మఱొకడు డిప్యూటీకలెక్టరు అగును, మూడవవాడు వర్తకుడు కావచ్చును, వీరిలో నట్టి బి. ఏ. ప్యాసయి

నట్టి వస్తువుకాని, లేక డిప్యూటీకలెక్టరు అయిన వస్తువుకాని లేక వర్తకుడుగ తయారైనవస్తువుకాని యెద్ది ? వారి ముగ్గురికిని శరీరము అట్లే యుండిపోయెను, మనస్సుకూడ నట్లేయుండిపోయెనుకదా." ఈప్రశ్నకు ఒక్కపిల్లవాడుకూడా సరియైనసమాధానము చెప్పలేదు. చివరికి హుజూరువారే సమాధానము చెప్పిరి. నీవు బి. ఏ. పరీక్ష యిచ్చినపుడు యూనివర్సిటీవారు నీకు బి. ఏ. డిగ్రీకి తగిన అర్హతయున్నదని యొప్పుకొన్నారు. అటులనే డిప్యూటీకలెక్టరీహోదా సంపాదించినపుడుకూడా శరీరమును మనస్సును వేఱువేఱు పనులెవ్వియు చేయలేదు. డిప్యూటీకలెక్టరు చనిపోయినపుడు అతనిశరీరము అదేవిధముగ నుండిపోవును కాని డిప్యూటీకలెక్టరీకృత్యము నెఱవేర్చజాలదు. ఈలోకములో చక్రవర్తి పదవి లభించినను అదికూడ నాలుగురోజులుమాత్రమే యుండునట్టి దనువిషయము జ్ఞాపకముంచుకొనవలయును. కావున నిజమైన ఆనందము దానిమూలముున కలుగనేరదు. ఒకడు చక్రవర్తి అయ్యెననుకొనుడు. మఱొకడు శరీరమనస్సుల కతీతమైన ఆత్మశక్తిని మేల్కొల్పుకొని, తద్ద్వారా ఈజీవితములో సుఖముగనుండి మరణానంతరముకూడ ఆనందముగనుండు సావకాశమును పొందెననుకొనుడు. ఇప్పుడు 10, 20 50 సంవత్సరములకాలముమాత్రమే చక్రవర్తిగనుండి రాజ్యముచేసి ఆనందముపొందిన మొదటివానిని, ఆత్మశక్తిని మేల్కొల్పుకొని ఈజీవితములోను మరణానంతరముగూడా శాశ్వతముగ సుఖము సంపాదించుకొన్న రెండవవానిని సరిపోల్చగా, వీరిరువురిలో నెక్కువ ఆనంద మెవనికి గలిగినది, మొదటివానికా లేక ఆచక్రవర్తికా అనెడి విషయము నాలోచించుకొనవలయును. అందుచేత మీరు చదువుకొనుచున్న కాలములోనే ఆచదువుతోపాటు మీ ఆత్మశక్తిని మేల్కొల్పుకొనునిమిత్తముకూడ ప్రయత్నముచేయుడు. మఱియు ప్రాపంచికభోగములిచ్చు సంపత్తు లభించినపుడు మీరు ఆనందమగ్నులు కాకూడదు. వానివలన మీ ఆత్మ కేమియు లాభము లేదనియు, వానివలన గలిగెడిసుఖము నిలకడగలదికాదనియు తెలిసికొనవలయును.

## 94

సత్సంగికి ఉపదేశమిచ్చినపుడే రాధాస్వామిదయాళురు సర్వస్వము నిచ్చివేసిరి. కన్ను తెఱచుటయే ఆలస్యము.

29 జూలై 1917 :—జ్ఞానబాబుగారు "రాధాస్వామీ మిల గయే భారీ సేఠ్" అనగా "రాధాస్వామీ అనెడి గొప్పసాహుకారు మాకు దొరికిరి"

అనేడి చరణమును సారబచన్ పద్యభాగములోనుండి చదివి, "అట్టి సేఠ్‌గారు మాకు దొరికినపుడు, వారు మాకన్నికష్టములు పోగొట్టి సర్వార్థసంపన్నులను చేయవలసినదేకదా?" యని ప్రశ్నించిరి.

దానిమీాద హుజూరువారు రాధాస్వామిదయాళురు మనకందఱకు సర్వార్థములనిచ్చివేయుట, ఇంతకుముందే అయిపోయినది. ఉద్ధారముకూడా అయిపోయినది. వారు ఉపదేశమిచ్చినపుడే మనకు సర్వస్వమునిచ్చుట అయిపోయెను, ఇప్పుడిక మీారు కన్నులు తెఱచుటయే తరువాయి. అయితే ఈ ఉద్ధారమునకు జనులు తప్పుటర్థము తీయుచుందురు. మనకెల్లైన నుద్ధారమైపోయినది కనుక నిక సత్సంగము వగైరాలు చేసికొనవలసినపని లేదని వారు అభిప్రాయపడుచున్నారు. అది పూర్తిగ తప్పు. సత్సంగము చాల అవసరము. సత్సంగముమూలముననే కన్ను తెఱచుకొనగలదు. ఒకడాక్టరు గ్రుడ్డివాని కండ్లు బాగుచేసినపుడు, ముందుకంటిపైనపొరను తీసివేయును. దానివలన నతడు తనకు దగ్గఱగనున్నవస్తువులను చూడగలుగును. అంతటితోనే అతడు డాక్టరువద్దకు వెళ్లుట మానివేసినయెడల, అతనికి దూరపుదృష్టి కలుగనేరదు. అదంతయు నతనికి డాక్టరుగారి సహాయమువలననే గలుగవలసియున్నది. హుమాయూన్ చక్రవర్తి నదిలో మునిగిపోయినపుడు ఆయన నొకపల్లెవాడు కాపాడగా, ఆయన నీరుకారుచున్న తడిబట్టలతోనే పల్లెటూరులోనికి వచ్చెను. ఆపల్లెటూరివా రాయన కత్యాదరగౌరవములు చూపిరి. వెళ్ళిపోవునపుడు హుమాయూన్‌గారు తనవద్దనున్న 12 పెద్దకాసుల నాయూరివారికి బహుమతిగ నివ్వబోగా, వారందఱును "మా కీగుండ్రని మెఱిసెడి చక్రము లిచ్చెదవేమి? మాకు ధాన్యము కావలెను. ఈచక్రముల నేమిచేతుము?" అని యెదురు చెప్పిరి. అవు డాయన తన ఉంగరము నిచ్చి "దీనిని తీసికొని హుమాయూన్ చక్రవర్తి దర్బారుకు వెళ్ళినచో మీాకు ఆయన చాలబహుమానము లిచ్చెదరు. మేము హుమాయూన్‌గారి సర్దార్లము. ఆయనకు మాయందు చాల గౌరవమున్నది. మేము మీావిషయములో సిఫారసు చేయుదుము" అని చెప్పెను. కాని ఆయూరివారందఱును, "మమ్ముల నీతంటా లెందుకు పెట్టెదవు? మాకేమియు నక్కఱలేదు. ఈ గుండ్రముగనున్న ఉంగరము తీసికొని యేమిచేయుదుము?" అని తిరిగి చెప్పిరి. సరిగ నదేవిధముగా మనకందఱకును రాధాస్వామీాదయాళురు వజ్రములను, మాణిక్యముల నిచ్చివేసిరి. కాని మనము కండ్లు తెఱ

వకపోవుటచే వానిని ఉత్తరాళ్ళని యనుకొనుచున్నాము. కన్ను తెఱచిననాడు వానివిలువ బోధపడగలదు. పల్లెటూరివాండ్రు పెద్దకాసులకును, ఉంగరమునకును విలువ తెలిసికొనలేకపోయిరని చెప్పవలెను కాని, అందులో హుమాయూన్‌గారిదోష మేమున్నది? కన్నుయితే మెల్లమెల్లగ తెఱచుకొనును. మొట్టమొదట సహస్రదళకమలము కన్ను తర్వాత నదేవిధముగ నాపై కండ్లును తెఱచుకొనును. ఆత్మకు పైనున్న కోశములన్నియు పూర్తిగ పోయినపిదపనే అది రాధాస్వామీదయాళుని చరణములను పొందగలదు.

## 95

### స్త్రీల భూషణములను గుఱించి.

3 సెప్టెంబరు 1917 :—స్త్రీల భూషణములనుగుఱించి యిట్లు సెలవిచ్చిరి. స్త్రీలు వస్తువులు చాలతక్కువగ నుంచుకొనవలయును. ముఖ్యావసర మెంత యుండునో అంతవఱకే యుంచుకొనవలయును. అట్లు చేసినచో నవి పోయి నప్పుడు బాధ చాల తక్కువ గలుగును, వానియందు లోభమోహములుకూడ తగ్గిపోవును.

## 96

### భగవంతుడు రాజును ఫకీరుగను, ఫకీరును రాజుగను చేయగలడను నీతిని దెల్పుకథ – మరణసమయమున గలిగెడి పరిస్థితులు – ఈర్ష్యాభావము యొక్క మోసము.

3 సెప్టెంబరు 1917 :—ఒకగొప్ప బలవంతుడైనరాజు ఒకదేశములోను, దాని ప్రక్కదేశములో మఱొకచిన్నరాజును ఉండెడివారు. బలవంతుడగురాజు చిన్నరాజునకు రాజ్యమువదలి వెళ్ళిపొమ్మనియు, లేనిచో యుద్ధమునకు సిద్ధముగనుండుమనియు కబురుపంపెను. చిన్నరాజు తనప్రజలకు అనవసరమైన కష్టము వాటిల్లకూడదనియెంచి పట్టణము విడచివేసి అడవులలోనికి వెళ్ళిపోయి అక్కడ ఫలపుష్పములను తినుచు కాలక్షేపము చేయుచుండెను. బలవంతుడైనరాజు తనయుద్యోగి నౌకరిని చిన్నరాజుగారిదేశమునకు రాజుగ చేసెను. కొంతకాలమైనతర్వాత ఆచిన్నరాజుగారి యుత్తమగుణములను తలచుకొని ఆ

చిన్న రాజ్యములోని ప్రజలందఱు నాదేశమును విడిచివేసి, అడవులలోనున్న రాజువద్దకుపోయి, ఆయన అధికారముక్రింద నొకయూరు కట్టించి అందులో నివసించసాగిరి. ఒకసారి ఆబలవంతుడైన రాజు ఒకమతగ్రంథములో, భగవంతునిమహిమను చెప్పుచు భగవంతుడు ఒకబలహీనుని రాజుగచేసి రాజును ఫకీరుగా చేయగలసమర్థుడని, వ్రాసియున్నవిషయమును చదివెను. అతని కప్పుడు తాను చిన్నరాజునకు చేసిన పరాభవము జ్ఞాపకమువచ్చి, తానుకూడ దైవము చేసినట్లే చేయగలననియు. నట్లు నిజముగకూడ చేసితిననియు, నట్లైనచో దేవునికి తనకన్నవిశేష మేమున్నదనియు నాలోచించుకొని, చివరకు తానే దేవుడనని నిశ్చయించుకొనెను. అతడొకరోజున గుఱ్ఱముNెక్కి వేటకు బయలుదేరెను. అతడు గుఱ్ఱముపైన స్వారిచేయుచు నొకలేడిని తరుముకొని వెళ్ళగా మిగిలినవారి గుఱ్ఱములకన్న నతనిగుఱ్ఱము చాలచుఱుకైనదగుటచే, నతడందఱికన్న ముందుకు వెళ్ళిపోయెను. త్రోవలో నాలేడి తప్పించుకొని వెళ్ళిపోయెను. సాయంకాల మైపోయెను. రాజుగారు వెనుకకువెళ్లునట్టిత్రోవ కనుగొనలేకపోయినందున కొంత గాబరాపడెను. కాని వెంటనే "నేనుకూడ దేవుడనే కదా దేవునికంటె తక్కువవాడనుకా"నని జ్ఞాపకమువచ్చి ధైర్యము తెచ్చుకొనెను. ఒకవైపునుండి వెలుతురువచ్చుచున్నట్లు చూచి, ఆవైపునకు వెళ్ళగా, నచ్చట భూమిక్రింద నొకగది కనుపడెను. దానికి రెండు తాళములు వేసియున్నవి. అతనికి తానే దేవుడని అహంకారముండుటచే నా తాళముల నతడు బ్రద్దలుకొట్టి లోనికి ప్రవేశించెను. అట్లు ప్రవేశించినపిమ్మట నతడు అచ్చట పదునైదు ముఖమల్ నుప్పట్లు పఱచిన ప్రక్కలను, అనేక విధములైన సామాన్లను, తినుబండారములను, వెండి బంగారు సామగ్రినిచూచి చాల సంతోషభరితుడయ్యెను. మంచినీళ్ళుత్రాగి అచ్చటి తినుబండారముల నెక్కువగతిని ఒకప్రక్కమీద పరుండి నిద్రపోయెను. చిన్న రాజుగారి యూరిలో కొందఱుదొంగలుపడి, అంతయు దోచుకొనిపోయిరి. ఆరాజుగారి ఆజ్ఞప్రకారము వారిసిపాయిలు కొందఱు దొంగలను పట్టుకొనుటకై తిరుగుచుండగా, ఈభూమిక్రింద గదివద్దకు వచ్చి, దానితలుపులు తెఱచియుండుటచే లోపలప్రవేశించి, ఆరాజునే దొంగయని అనుకొని, ఆయనను పట్టుకొని, ఆయన గుఱ్ఱముపైనున్న త్రాళ్ళతో నాయనచేతులు వెనుకకువిఱిచి గట్టిగా బిగించికట్టి తమరాజుగారివద్దకు తీసుకొనివెళ్ళిరి. అయితే, అక్కడ ఆయనను వెంటనే ఆరాజుగారియెదుటపెట్టుటకు అవకాశము చిక్కనందున జెయిలులోపెట్టి

యుంచిరి. అతడట్లు మూడురోజులు ఆహారపానీయములు లేకుండగనే యుండి పోయెను. మూడవరోజున దోపిడియైనధనము, వస్తువులన్నియును దొరికిపోయి నందున, చిన్నరాజుగారి పట్టణములో ఒకపెద్దయుత్సవముజరిగి గొప్పవిందు చేయబడెను. విందైనతర్వాత పాకీవాండ్లు పారవేసిన యెంగిలిపదార్థములనన్నిటి నెత్తుకొని తమయిండ్లకు తీసికొనిపోవుచుండగా, ఈరాజు తన జెయిలు గది కిటికీలోనుంచి ఒక పాకీవానిని బిగ్గఱగపిలచి నాకు తిండిలేక ప్రాణముపోవు చున్నది, కొద్దిగా ఆ యెంగిలిమెతుకులు నాకు పెట్టుమని అడిగెను. కాని పాకీ వాడు ఆరాజును "నీవు దొంగవు. మాపట్టణమంతయు దోపిడిచేసితివి. ఇప్పుడు నన్నే నీవు మెతుకులు పెట్టమనుచున్నావా?" అని అతనిని చాల దుర్భాష లాడెను. ఆబలిష్ఠరాజు ఒకప్రక్కన కోపముతోను మఱొకప్రక్కనుండి విచా రముతోను నిండినవాడై క్రిందపడి నిద్రిపోయెను. అపుడు స్వప్నములో నొక మహాత్ముడు కనపడుటయు, ఇంతకుమునుపు ఆరాజుచూచిన మతగ్రంథములో "భగవంతుడుఒక్కపెట్టున రాజును ఫకీరుగను, ఫకీరును రాజుగను చేయగల"డని వ్రాసినభాగము కంటికగుపడుటయుజరిగెను. అప్పుడారాజునకు తనకును దేవునికిని గలతారతమ్యము బోధపడెను. రాజు దొంగ కాకపోయినను, పట్టణములో దోపిడి చేయకపోయిననుకూడ పాకీమనిషి ఆరాజును అన్యాయముగ నెట్లు దుర్భాష లాడెనో అట్టిపరిస్థితియే మానవునకు మరణసమయములో గలుగును.

జీవుని మరణసమయములో యమదూతలువచ్చి, అతని ననేకదుర్భాష లాడి తీసికొనిపోవుదురు. అంతటి దుర్భాషలుకాని, దుష్ప్రవర్తనకాని ఆజీవుని యెడల ప్రకటించవలసినంతతప్పు నిజముగ నాజీవునిలో లేకపోయినను ఆయమ భటుల కావిషయముతో నిమిత్తములేదు. ఏలననగా, ఆస్థలములో నిబంధనలు ప్రతి జీవునియెడలను న్యాయప్రకారమే ప్రవర్తించవలసినట్లుగ లేవు. అచ్చట వాసన లేక ఇచ్ఛ యనెడి కొల్తబద్దయొక్కటే యున్నది. జీవుని మనస్సులో నాటుకొనిపోయియున్న వాసన లేక ఇచ్ఛయే అతనిని దానికి తగినస్థానమునకు తీసికొనిపోయి అచ్చటనే అతనికి నివాస మేర్పాటుచేయును. ఉదాహరణా ర్థము, ఏజీవునికైనను ఆటపాటలలో నెక్కువ అభిరుచి యుండి, మరణసమయ మందుకూడ నాఅభిరుచి ప్రబలముగనున్నచో, నతడొక తొన్నేనువంటి జన్మయే యెత్తవలయునను నియమము లేదు. ఆజీవుడు జ్యోతిర్నిరంజనులయెదుటికి వెళ్ళినపుడు, ఈ ప్రబలవాసన అతనిలో ప్రజ్వరిల్లి అతడొక రామచిలుకగాని,

పిగిలిపిట్టగాని, బుల్బుల్ పిట్టగాని అయి పుట్టవచ్చును. ఇట్టివాసనలే జీవుని తఱుచుగ నిట్టి జంతుశరీరములలోనికి తీసికొనిపోయి ప్రవేశపెట్టుచుండును.

అభ్యాసము చేసికొనుటకు ఇంతకన్న మంచి సావకాశము ముందు ముందు వచ్చుననియు, నపుడభ్యాసము చేసికొనవచ్చుననియు, భ్రమపడకుడు. ఆసమయమున నభ్యాసము చేయవచ్చును. అయినను ప్రస్తుతసమయముకంటె మంచి సమయము మఱొకటి లేదు. రాబోవు జన్మలో సత్సంగ అభ్యాసములను చేసుకొనుటకు ఎక్కువ అవకాశము లభించగలదని చెప్పెడిమాట నిజమే. కాని అవకాశము గలుగుటయనగ నొకవిషయము, సౌకర్యముండుట వేఱువిషయమును. ఈజన్మకంటె మఱొకజన్మలో సత్సంగాభ్యాసములు చేసికొనుటకెక్కువ అవకాశము లభించినను లభించవచ్చును, కాని సౌకర్యము ఈమాత్రము లభ్యము కాకపోవచ్చును. అంతియగాక ఈజన్మయొక్క అమూల్యసమయము అవిధముగా వ్యర్థమైపోవుచున్నది.

"నాకు ఫలానావస్తువు ఉండియుండినచో చాలసంతోషముగనుండియుండెడిది. అట్లైనచో నేను పరమార్థసాధనకూడా బాగుగ చేసికొనగలుగుదు"నని యనుకొనుట చాల మోసపుటాలోచన. ఆడవాండ్రు తమ ఫలానా స్నేహితురాలివద్ద నున్న వస్తువులవంటి వస్తువులు తమకున్నచో నెంతో సంతోషముగ నుందుమని యనుకొనుచుందురు. మగవాండ్రు మనకు ఫలానామనిషికున్న దుస్తులవంటి దుస్తులుకాని, ధనముకాని యుండినచో బాగుండునని యూహించుకొనుచుందురు. సత్సంగి తానుకూడా ఫలానా మఱొకసత్సంగికి సాగుచున్నంతబాగుగా అభ్యాసము చేయగలిగినచో బాగుండునని యనుకొనుచుండును. ఈ ఆలోచనలన్నియు అజ్ఞానముయొక్క పరిణామములు. ఈమతముయొక్క సిద్ధాంతములు వీరికెంతమాత్రము బోధపడలేదని యీఆలోచనలవలన సూచితమగుచున్నది. ఫకీర్లు మొదలుకొని చక్రవర్తులవఱకు నందఱు నీఅగ్నిహోత్రములోపడి మండిపోవుచున్నారు. ప్రతిమనిషియు ఫలానావస్తువేదో యొక్కటిమాత్రమే తనకు పూర్ణమైనసంతోషము లేకుండచేయుచున్నదని భ్రమపడుచుండును. ఏసత్సంగికైనను, తనకు నిజమైన ఆనందము ఆంతర్యమున లీనమైపోవుటలోనే యున్నదను విషయము పూర్తిగా హృదయాంకితము కానంతకాలము, అతడింకను అపక్వదశలోనున్నట్లే తెలుసుకొనవలయును. ఇదంతయు నీర్ష్యాదివికారభావములవలన గలుగునట్టి ద్రోహము.

# 97

ప్రేమను గుఱించి.

6 సెప్టెంబరు 1917 :— స్వామీజీమహారాజ్ వారి కాలములో ప్రేమ వర్షము కురిసిపోవుచుండెడిది, అనికాని లేదా, మేము ఫలానాకాలములో గొప్ప భక్తిపూరితులమై యుండెడివారము; ఇప్పుడే మాకీవిధమైన వైమనస్యము గలిగినదనికాని సత్సంగులు తఱచుగ ననుచుందురు. అసలువిషయమేమనగా జనులకు ప్రేమఅనునది తెలియనే తెలియదని చెప్పవలెను. ఆభగవంతుడే ప్రేమ. జీవుడు మనోఘట్టముమీాదను, ఇచ్ఛాఘట్టముమీాదను కూర్చుండి, వాసనాగ్నిహోత్రములో రాత్రింబవళ్లు దహించుకొనిపోవుచు నుండి, భగవంతునినే తెలిసికొనలేకుండ నున్నపుడు ప్రేమ నెట్లుతెలిసికొనగలడు ? ఏదేశమునకు చెందిన జీవుని కాదేశపుపదార్థము తెలియగలదు కాని ప్రేమయు, భగవంతుడు నతని కెట్లవగాహనకాగలరు ? అయిదుగురుస్నేహితు లొకచోట కలిసి ఒకరికొకరు మంచి ఆదరగౌరవములుచేసి, మంచిమంచి తినుబండములనుపెట్టి, ఒకరిని "హాఫిజ్ జీ" అనియు, ఒకరిని "ముల్లాజీ" అనియు, మఱొకరిని "ప్రేమీజన్" అనియు, నాల్గవవానిని "హంస" అనియు పిల్చుకొనుచు, వారిలోవారు బాగుగ తిని త్రాగి సంతోషముగ నుండినట్లుగనే, కొందఱు సత్సంగులు వారిలోవారు పరస్పరము సంతోషపెట్టుకొనుచు ప్రవర్తించుదురు. కాని అవన్నియు ప్రేమకృత్యము లనిపించుకొనవు. అవిఅయితే ఉత్తఉత్సాహసంతోషములతో కూడిన పనులే. ఉత్సాహసంతోషములకును, ప్రేమకును మధ్యగల వ్యత్యాసమును గమనించవలసి యున్నది. అయితే మనము భగవంతునికాని ప్రేమనుకాని తెలిసికొనలేకపోయినను, భగవంతునితో నైక్యముపొందిన పురుషుడు మనకు లభించినపుడు, ఆయన భగవంతునితో నెట్లు ఐక్యమైయుందురో, మనము అదే విధముగ ఆయనయొక్క ఆజ్ఞలకు బద్ధులమై ప్రవర్తించినయెడల నదికూడా మనమట్టుకు ప్రేమయే అగును.

గురు ఆజ్ఞాసే జోశివ కరఈ
వహ కరతూత భక్తి ఫల దేఈ॥

అర్థము :—సద్గురుని ఆజ్ఞ ననుసరించి చేసినకార్యములన్నియు భక్తిఫలితము నిచ్చును.

అట్టిపురుషుని ఆజ్ఞ ననుసరించి యేపనిచేసిన నది భక్తిఫలితమును అనగా ప్రేమ నుత్పన్నము చేయగలుగును. అనగా, మొదట మనము గుర్వాజ్ఞప్రకారము నడుచుకొనవలయును. ఆతర్వాతనే మనకు భక్తిఫలితము దక్కును. అదియ ప్రేమ. మనము స్వార్థలాభముకొఱకై భగవంతుని నేదేనిసమయములో ప్రార్థించుటయు, ఆకార్యము నెఱవేరినపుడు మనస్సులో నానందించుటయు ప్రేమయని అనుకొనుచుందురు. కాని ఇదికూడా పొరపాటు. ఇది కృతజ్ఞతాప్రకటనము. గుర్వాజ్ఞప్రకారము నడచుకొనుటవలననే ప్రేమ కలుగును. స్వార్థకార్యము నెఱవేరుటవలన మనలోగలిగెడి పైనచెప్పిన పరిస్థితి మనఆజ్ఞను గురువుగారు నెఱవేర్చుటచేత గలిగినది. అనగా పూర్తిగా తలక్రిందువిషయము. కావున దీనిని ప్రేమఅని అనుకొనకూడదు.

ఇట్లే కొందఱు సత్సంగులు హుజూరుమహారాజ్, స్వామీజీమహారాజ్ వార్ల కాలములలో తమకు కలిగినదనుకొనెడిది ప్రేమకాదు. ప్రేమ పరమపురుషుని ధామమునుండి యివ్వబడునట్టి మహావరదానము, కాని కొద్దిరోజులు సత్సంగము చెయ్యగనే అందఱును ప్రేమీజనులయిపోవునంత సులభముగ లభించునట్టి పదార్థముకాదు. ఈపైనచెప్పిన విషయములన్నియు ఉత్తఉత్సాహావేశవిషయములు. వీరందఱికిని ప్రేమ అనునది అప్పుడునులేదు, ఇప్పుడు కూడ నట్లే లేదు. అయితే అప్పటిలో వీరికి కనుగప్పివేసినట్టి, తమకు ప్రేమ లభించెననెడి అసత్యభావన (false consolation) ఇప్పుడు పోయి తమయథార్థస్థితి వారికి బోధపడినది. అదొక్కటే వ్యత్యాసము. కావున భగవంతు డట్లు చేసినయెడల వీరందఱు నందులకై భగవంతునికి కృతజ్ఞత ప్రకటించవలసియున్నది కాని ఆయనపైన ఫిర్యాదుచేయుట యుక్తముకాదు. వారి కప్పట్లో ఉత్సాహావేశములుమాత్రమేగాక నిజముగ ప్రేమయే గల్గియుండినచో, నా ప్రేమ యిపుడెచ్చటికి పోయినదో చెప్పుడు. ప్రేమను దొంగలు దోచుకొనిపోలేరు. రాజు పట్టుకొనిపోలేడు. పవిత్రగ్రంథములలో ప్రేమనుగుఱించి, ప్రేమకణము సముద్రమును చెక్కలుచేయగలదనియు, పర్వతములను గుండచేయగలదనియు వర్ణించిరి. వీరికప్పుడే ప్రేమదానము లభించియుండినయెడల నిపుడు దాని నెలుకలు ఎత్తుకొనిపోయియుండునా ? ఒక్కచిన్నకణమంత ప్రేమయైన నెవరికైనను వరదాన మేక్షణమున లభించునో, ఆతక్షణముననే అతనియావత్పరిస్థితియు పూర్తిగా మాఱిపోవుటయేగాక, ఆమార్పు శాశ్వతముగ నట్లే

యుండిపోవును. సత్సంగములో కొన్నిదశకములకొలది యేండ్లుగడిపినవారికి గూడ ప్రేమ లభించుటలేదు. సత్సంగములో కూర్చుండుటకు మొట్టమొదట అధికారము గలుగవలయును. ఆపిమ్మట సత్సంగవచనములను వినుటకును, అటు తరువాత ఆవచనముల నాచరణలో పెట్టుటకును అధికారము సంపాదించుకొన వలయును. ప్రేమదానము ఇవన్నియు గలిగినపిమ్మటనే యెప్పుడైన లభ్యముకావ లసియున్నది. గురుమహారాజ్ వారు అందఱికిని స్మరణధ్యానములు చేయుడని చెప్పిన దాచరించుటయే, గుర్వాజ్ఞప్రకార మాచరించుట యనగా. స్మరణ ధ్యానభజనలు అందఱును గుర్వాజ్ఞ యను భావముతో చేయుచున్నయెడల నది యుక్తమే. కాని అది యొకమ్రొక్కు తీర్చినట్లు చేసినచో ప్రయోజన మేమియుండును? మనస్సున ప్రస్తుతము వైరాగ్యమున్నది. విరహభావముగల శబ్దములను పాఠముచేయుట ఆవశ్యకము. కాని మీరు పవిత్రగ్రంథమునుండి మ్రొక్కుతీర్చినట్లు ఒకవరుసగా పాడుకొనిపోవుచుందురు. ఎట్లనగా

"వంఝూ నే బాలక జాయీ" లేక "అబ్ ఈసాఈ కా భాఖూం బృతంతా" అనియు నేదోఒకటి పాడుచుందురు. అది బొత్తిగ తప్పుపద్ధతి. శబ్దపాఠ మొకమ్రొక్కు తీర్చుకొన్నట్లుగా చేయకుడు. సమయమునుబట్టియు, మనస్సుయొక్క ఉన్ముఖతనుబట్టియు అందుకు తగినశబ్దములను తీసి పాడుచుండ వలయును.

## 98

సత్సంగములోని సామాన్యప్రవర్తనానియమములను సత్సంగులు పాలించవలయును. సత్సంగములో కూర్చుండు స్థలముకొఱకు పోట్లాడుటవలన గలుగు నష్టములు.

7 సెప్టెంబరు 1917 :— సత్సంగములో సామాన్యప్రవర్తనవిషయమై చేసిన నియమములను పాలించుట ప్రతిసత్సంగియొక్క కర్తవ్యమైయున్నది. ఈ విషయములో నెవరును తమకితరులకన్న విద్యాధిక్యత మున్నగువిశేషము లుండుటచే నానియమములు తమకు వర్తించవని అభిమానపడకూడదు. అది పొరపాటు. లోకములో నొక్కసత్సంగముతప్ప మఱెచ్చటను సుఖశాంతులుగల స్థలములేదు. త్రిలోకీలోను, ఈసృష్టిలోను అంతట వెదుకుకొనుచు తిరిగినను

కూడా జీవుని కొక్కసత్సంగములో తప్ప మఱెచ్చటను సుఖశాంతులు లభించు స్థలము లభించదు. అట్టిపరిస్థితిలో జనులు సత్సంగముయొక్క నియమములను పాలించకుండ నిచ్చటకూడా గడబిడ చేసినయెడల నది సమంజసముకాదు. ఈ విధముగా బోధించిననుకూడ నెవరైనను దిద్దుకొననిచో వారిని సత్సంగము నుండి బయటకు పంపించివేయవలసి వచ్చును. అందఱుకూడ నట్లు గడబిడ చేసినయెడల, మేము దూరముగా వెళ్ళిపోయెదము. దీనివలన బూటఃకులగుంపు పెరిగిపోవుటయు, యథార్థభక్తులకు నష్టము వాటిల్లుటయు జరుగును. సంతులు కేవలము బోధచేయుటతప్ప మఱొకపద్ధతి నవలంబించరు. కబీరుసాహబ్ వారు వేలకొలఁది బహుమధురసంగీతయుక్తములైన శబ్దములను వ్రాసి దేశదేశాంతరములు సంచారముకూడ చేసిరి. ప్రజలు వారిబోధలను మన్నించనందువలన నష్టము గలిగినది ప్రజలకే కాని వారికేమియు నష్టము గలుగలేదు. స్వామీజీ మహారాజువారుకూడ నొకచోట నిట్లు సెలవిచ్చిరి.

"కహ కహ కర్ అబ్ హమ భీ హారే।
హార జీత కుఛ హమరే నాహీఁ।
మూరఖపర్ ఇక తాన చలాఈ॥

అర్థము:—మేముకూడా చెప్పిచెప్పి విసిగిపోయితిమి. అయితే ఇందులో జయాపజయములు మాకేమియు లేవు. జనులలోగల మూర్ఖతను బయల్పరచు నిమిత్తమై కావలసినది తెల్పితిమి,

ఇట్లే మాకుకూడ నట్టిపరిస్థితియె గల్గినయెడల, నందులో క్రొత్తవిషయము లేదు, దానివలన మాకేమియు నష్టమును లేదు.

సత్సంగములోని ఉద్యోగికాని, మఱొక సత్సంగికాని మఱొకరితో నేదైన మాటచెప్పినపుడావలవానికి ఇతనితో చర్చచేసి, ఇతనినోరు నొక్కివేయవలెననెడి ఆవేశము వెంటనే కలుగును, ఆప్రకారము అతనితో వాగ్వాదముచేసి మాట్లాడకుండగకూడ చేయును. కాని ఇది చాల తగని స్వభావము. అప్పటికప్పుడైతే అట్టివాడు జయించినట్లే కనిపించును. కాని చివరకు అందువలన నష్టమేకలుగును. అట్టి నికృష్టస్వభావముగలవాడు పరమార్థ మేమిచేయగలడు? అట్టివాడెపుడును పరమార్థశూన్యముగనే యుండును. లోకములోనైతే

అతడు సందేహములేకుండా గెలుచుకొనిపోవచ్చునుకాని చివరకుమాత్ర మతడు రిక్తహస్తుడుగనే వెడలిపోవును. ఏమనిషి, ఇతరులచేత సకారణముగగాని, అకారణముగగాని అణగద్రొక్కబడినపుడు అది ఓరిమితో సహించుకొని, తన హృదయమును కామక్రోధాదివికారములచే మలినముగాకుండ నుంచుకొనగలడో అట్టివాడే ఈదర్బారులో లాభము పొందగలడు. అందుకు వ్యతిరేకమైన స్వభావముగలవారు శూన్యముగనే యుండిపోవుదురు. కాంతి యను స్త్రీ అందరితోను పోట్లాడుచుండెడిది. ఆమె అట్లుచేసి సత్యలోకమున కెక్కిపోయినదా? సత్సంగములో కూర్చుండు స్థలముకొఱకీవిధముగా పోరాడువారును, ఇతరులయొడిలో వెళ్ళి కూర్చుండెడివారును, సత్సంగములో నీవిధముగ పోట్లాటలు పెంచువారును సత్సంగముయొక్క మాధుర్యము నెట్లుగ్రోలగలరు? తన స్థలములో కూర్చుండెనని యొకరి హృదయములో కోపమును, రెండవ వాని హృదయములో మొదటివాడాస్థలమును ఖరీదిచ్చి కొనుక్కొనెనా యను ద్వేషమును వేధించుచుండును. ఈవిధముగ నిరువురకును నష్టమేజరుగును. తనకు కొద్దికష్టము కలిగినను సహించుకొనుచు నితరులకుమాత్రము కష్టమనిపించకుండులాగున ప్రవర్తించుటయే సర్వోత్తమమైనపద్ధతి.

## 99

### శ్రమపడి అభ్యాససేవాసత్సంగములు చేయువానికి గల్గులాభములు,

8 సెప్టెంబరు 1917:—ప్రస్తుతకాలము చాల ఒడుదొడుకుగ నున్నది. ఒకప్రక్కనుండి నాగరికత పెరిగిపోవుచున్నదికాని, మఱొకప్రక్కనుండి దానితోపాటే చింతలు లెక్కలేకుండా పెరిగిపోవుచున్నవి. మొదట్లో ఎద్దుబండ్లమీద ప్రయాణముచేయుచుండెడివారు. ఇప్పుడు రైలుమీద ప్రయాణముచేయుచున్నారు. ఇకముందు గాలివిమానములలో ప్రయాణముచేయగలరు. ఈవిధముగ నన్నిప్రక్కల నభివృద్ధియైపోవుచున్నది. కాని ఈఅభివృద్ధివలన లోకమంతయు దుఃఖములపాలైపోయెను. ఇంగ్లాండుదేశములో పెద్దపెద్ద ధనికులు మంత్రులును కొంతకాలము చాల పాటుపడి పనిచేసి తిరిగి విశ్రాంతినిమిత్తమై తమతమ పల్లెలకు వెళ్ళి అక్కడ కొంతకాలముండిపోవుచున్నారు. ఆసమయములో వారెవరితోను కలిసికొనరు, ఉత్తరప్రత్యుత్తరములుకూడ నెవరితోను జరుపరు. అచ్చట 2, 3, మాసములు ఈవిధముగా విశ్రాంతితీసికొన్నపిదప

తిరిగి మొదటివలెనే తమతమ ప్రాపంచికకర్తవ్యములను దీక్షగా నెరవేర్చుదురు. ఇట్టి ఒడుదొడుకులేకుండ తప్పించుకొనవలెనన్నచో, మన అవసరములను తగ్గించుకొన్నయెడలనే అది సాధ్యమగును. చివరకొక ప్రాచీనకాలపు అడవి మనుష్యులవలెనే చెట్లఆకులు, వ్రేళ్లునుతినియు, వస్త్రములకుబదులు పెద్దపెద్దఆకులతోశరీరమును కప్పుకొనియు కాలక్షేపముచేసినట్లైతే, నిస్సంశయముగ ప్రస్తుతకాలపు క్లేశములనుండి తప్పించుకొనగలము. కాని దానితోపాటు సోమరితనము వృద్ధియైపోవును. ఈపరిస్థితికి కొంతవఱకు సరిపోవునట్టి పరిస్థితియే సత్సంగములో కూడ గలుగుచున్నది. ఉపదేశమును తీసికొన్నతరువాత, అభ్యాసముచేయుట అవసరములేదని యనుకొనుచు నెవరు దయమీాదనే ఆధారపడియుండిపోవుటకు నిశ్చయించుకొని అశ్రద్ధగ నుండిపోవుదురో, వారు ప్రాచీనకాలపు అడివిమనుష్యులవంటివారే. పనిఅయితే వారికికూడ అయిపోవునుకాని, సోమరితనమువలన వారికి చాలనష్టము వాటిల్లును, చాల ఆలస్యముకూడ నగును. అట్లుగాక, నెవరైన ప్రస్తుత సమయమునకు అనుగుణమగు శ్రమకు కష్టములకును ఓర్చుకొనుచు, నభ్యాసముసేవయు చేయుటలో తత్పరులైయుండినయెడల నీకాలములో సభ్యజను లెట్లు నవీనమైన ఆవిష్కరణాది విశేషములవలన వివిధలాభముల నొందుచు నెద్దుబండ్లకు బదులుగా గాలివిమానములలో ప్రయాణము చేయుచున్నారో, అట్లే కష్టపరిశ్రమచేయుచు నభ్యాసముసేవయు చేయుచున్న సత్సంగులు సోమరులైన సత్సంగులకన్న చాల అభివృద్ధినొందుచు, త్వరలో కార్యసాఫల్యమును పొందగలరు.

మఱొక పెద్దలాభముకూడ నిట్టిసత్సంగికి గలుగును. సోమరిసత్సంగి కేవలము శరణుమీాదనే భారమువేసి, అట్లేయుండిపోవుటచే, సమకాలికసద్గురువు గుప్తమైనపుడు మహావ్యాకులత్వములో పడిపోవును. కాని, కష్టపరిశ్రమచేయు సత్సంగి, అట్లుగాక, తన అభ్యాససేవల మూలమునను, భగవత్కృపయుండుటచేతను, అంతర్యమున గురుస్వరూపమును ప్రకటముచేసుకొని, వ్యాకులత్వమునుండి తప్పించుకొనగల్గును. సోమరిసత్సంగి కెప్పటికైన నగ్నిహోత్రములోపడి మండి అభ్యాసముచేయకుండిన లోపమును పూర్తిచేసుకొనవలసియుండును. పాటుపడి పనిచేయువాడు ప్రీతిసహితముగ నభ్యాసముచేసి పరమధామమును పొందును. అభ్యాసమైతే యిరువురకును చేయుట తప్పనిసరియే. ఒకడైతే ప్రీతిపూర్వకముగచేసి మంచిఫలితమును త్వరలో పొందును, రెండవ

వాడు అగ్నిహోత్రిసంతాపమును అనుభవించి చాలఆలస్యముగ ఫలితమును పొందును. అందుచే పరిశ్రమచేసి అభ్యాససేవాదుల మహాలాభమును తీసికొనువారే మహాదృష్టవంతులు.

# 100

బంధుమిత్రులు, పుత్త్రకళత్త్రాదులును బందిపోటుదొంగలవంటివారు. సద్గురువొక్కరే నిజమైన మిత్రులు.

9 సెప్టెంబరు 1917 :—కాన్పూరువాస్తవ్యులైన మిశ్రగారీరోజున వచ్చిరి. ఆయన మఱొకమాట లేవేవో మాటలాడుచు నీవిధముగా మొదలుపెట్టుకొనిరి. ఆయన పినతండ్రికొడుకు లిరువురు బి. ఏ. వరకు చదువుకొనిరి. కాని తల్లిదండ్రులను పట్టుకొని కొట్టుచుందురట. మిశ్రగారి కుమారుఁడుకూడా బి. యస్. సి. (B. Sc.) ప్యాసయి ఎమ్. ఎస్. సి. (M. Sc.) లో ప్రవేశించినాడు. అతనికొకపిల్లవాడుకూడా కలిగెను. మిశ్రగారు మనుమడు పుట్టినందుకు ధన్యవాదములు చెప్పుకొన్నపిమ్మట హుజూరువారిని తనకొడుకుకూడా తనపినతండ్రిపిల్లలవలె తల్లితండ్రులను కొట్టెడివాఁడు కాకుండగచేయుడని ప్రార్థించెను. ఆ సందర్భములో నీక్రిందివచనము సెలవిచ్చిరి.

సారబచన్ (పద్యభాగము)లో నీక్రింది శబ్దము,
"ముసాఫిర్ రహనా తుమ్ హుషియార్,
ఠగోం నే ఆన్ బిఛాయా జాల్ ॥

ఆశుకవిత్వముకొఱకై వ్రాసినశబ్దము కాదు. ఆపంక్తులు అర్థశూన్యమైనవి కావు. లోకములో నెవరినైన సగముత్రోవలో నొకదొంగ కలిసికొన్న యెడల నాదొంగ తనకు కావలసినవస్తువు ఈయాత్రికునివద్ద నున్నదో లేదో కబుర్లలలోపెట్టి తెలిసికొనును. ఎట్లనగా నొకదొంగకు రూపాయిలు కావలసియున్నచో నతఁడు యాత్రికునివద్ద రూపాయిలున్నవో లేవో చూచుకొనును బట్టలు కావలసియుండినచో బట్టలున్నవో లేవో చూచుకొనును; లేక ఆదొంగకు యాత్రికుని చంపుటయొక్కటే కావలసివచ్చినచో మఱొకవస్తువున్నదా లేదా యని ఆలోచించడు. దొంగ కెప్పుడును తనకు కావలసిన పదార్థముపైననే దృష్టియుండును. ఆవస్తువు యాత్రికునివద్దలేనిచో, నావిషయమును

మాటలద్వారా తెలిసికొని, కొంతసేపయినతర్వాత వెంటాడించుట మాని వేయును. లేదా, అతనివద్ద వానికి కావలసిన వస్తువుండినయెడల, అతడు వెళ్లెడి స్థలమునకే తానుకూడ వెళ్ళవలసియున్నదని నటించి, అతనిని దగ్గఱత్రోవను తీసికొనిపోయెదనని నమ్మించి త్రోవతప్పించి, అతడు ఒంటరిననున్నపుడు తన యుద్దేశ్యమును సాధించుకొనును. అట్లే బెంగాలులో కాళీపూజలు జరిగెడి రోజులలో కాళికాదేవికి మనుష్యులను బలియిచ్చుట ముఖ్యమని తలచెడివారు, వారు తమజేబునుండి వందలకొలది రూపాయిలు ఖర్చుపెట్టి, ఒకమనిషిని ఆదర గౌరవములుచేసి, అతనిని బళ్ళలోను, పడవలమీదను సంతోషముతీరునట్లుగా త్రిప్పి, చివరకతడు బాగుగ బలిసినపిమ్మట అతనిని మోసగించి చంపెడివారు. మఱొకవిధమగు దొంగలుకూడా వారికికావలసివస్తువు ఏమనిషివద్దనైన నుండి నపు డతనిని అదేవిధముగా మోసము కృత్రిమముచేసి, ఆవస్తువును లాగుకొని పోవుదురు.

ప్రపంచముకూడ నిట్లే యున్నది. తల్లి, తండ్రి, స్త్రీ పిల్లలును, ఇంటి లోపల నున్నదొంగలు. తల్లి పిల్లవానిని పుట్టిననాటినుండియు పెంచి పోషించును. అతనికి పెండ్లియైనపుడు, అంతవఱకు అతనిప్రేమయు ధనము తన యొక్కర్తెకే చెందియుండగా, నికముందవన్నియు నతనిభార్య పాలయిపోవునని ఆమె కీర్ష్య గలుగును, అవి అతనిభార్యకు చేరగనే ఇతనితల్లి వీధినిపడి మొత్తుకొని యేడ్వనారంభించును. సంతానమువిషయములోగూడ నిదేపరిస్థితి. చంటి పిల్లవాడు ఈవస్తువులు ఆవస్తువులు చూచి నవ్వుచున్నపుడు తల్లితండ్రు లతని యందు వ్యామోహ మెక్కువైపోవుటచే మరణకాలము వచ్చుసరికి వారికావ్యామోహము విడిపించుకొనుట అతి దుష్కర మైపోవును. ఇదేవిధముగా మనము బజారుకు వెళ్ళినపు డచ్చట నొక మిఠాయిదుకాణములో ననేకరకములైన మిఠాయిలు పళ్లెములో పఱచియుండుట చూతుము. వానిమీద వెండి రేకులుగూడ అద్దియుండును. అట్లు చేయుటచే నవి జనులమనస్సును బలవంతముగ నాకర్షించవలయుననియు, జనులు అందుమూలమున నాకర్షితులై వానిని విరివిగ కొనవలయుననియే ఆదుకాణదారుని యుద్దేశ్యముగూడ. మిగిలినవారందఱు నిట్లె యున్నారు. లోకములో నందఱును చేయుచున్నపని యిట్టి దోపిడియే. దోపిడి యనుపదము లోకములో సామాన్యముగ చెడ్డస్వభావము తెల్పు అర్థములో నుపయోగించబడుచుండుటచే, బంధువులు దుకాణదారుల

విషయములో ఆపదము నుపయోగించుట వింతగా కనిపించవచ్చును. కాని వీ రందఱును ఆదోపిడిచేయుదొంగలు చేసెడికార్యమునే చేయుచున్నారు. దొంగ తనకుకావలసిన పదార్థము యాత్రికునివద్ద నున్నట్లు గూచుకొని, అతనిని వంచ నచేసి ఆపదార్థమును లాగివేయుట కెట్లు యోచించునో, అట్లే వీరుకూడా చాటున దాఁగుకొని అతనిమనస్సును తమమోహాబంధనములోపెట్టి యతని మరణసమయమున నది యీవలికి వదల్చుకొనిరాలేనంత గాఢముగా కట్టిపెట్టు చున్నారు. కాబట్టి యెవరికైనను, వారి ముసలితనములో వారినిపట్టుకొని కొట్టునట్టి సంతానము కలిగినయెడల, వారు తమచిన్నతనములోనే నేర్చుకొన వలసిన నిజమైనమిత్ర మీప్రపంచములో నొక్కసద్గురువుతప్ప మఱెవ్వరు లేర నెడి ఉత్తమపాఠమును తమసంతానము తమకు వార్ధక్యములోనైనను నేర్పు చున్నందుకు భగవంతునికి ఒకవిధమున కృతజ్ఞతాపూర్వక ధన్యవాదముల నర్పించవలసినవిషయమే. సద్గురువే నిజమైనమిత్రము, వారే పరిపూర్ణసహా యముచేయువారును. వారిసహాయమే మరణానంతరమునకూడ సహాయము గను నుండును.

సంత్ సద్గురువునందు భక్తివిశ్వాసములను వృద్ధిచేసికొనుము. వారు నిన్ను ప్రపంచమునుండియు, ప్రాపంచికజగడములనుండియు తప్పించి, నీకు పర మానందమును చేకూర్చగలప్రేమను తమచరణములందు ఉత్పన్నముచేయుదురు. నీవు ప్రపంచసంబంధమైన దొంగలతో ప్రేమ చేసినయెడల, వారు నిన్ను మరణ సమయములో నీజీవుడు వారిజాలములోనుండి తప్పించుకొని బయటపడుట మహా కఠినమైపోవునంత గాఢముగ కట్టివేయుదురు. మహారాజ్ సాహబ్ వారును సర్కార్ సాహబ్ వారును అనేకపర్యాయములు రెట్టించి చెప్పినట్లు, గొప్ప ఉత్సాహము ప్రేమావేశమును గలిగియుండి, నాట్యములు, గానములుచేయుట మున్నగు బాహ్యాడంబరములు చేయకుండ, నిరంతరము నొకేతీరున నొప్పారు నట్టి నిర్మలప్రేమభావముతో నిండియుండు సత్సంగులే మహాదృష్టవంతులు. అట్టి ప్రేమభావము క్రమక్రమముగా పరిపక్వమై కొంతకాలమునకు జీవుని హృదయమున మఱొకవిషయము అడుగిడుటకు తావులేకుండునంతప్రచండత నొందగలదు. ఎట్లనగ ప్రపంచములో నొకదొంగవాడు ఒకబంగరుజరీటోపీ ధరించిన యాత్రికునివెంట నతనిధనమును దోచుకొనవలెనను ఆశతో పోవు చుండగ, నతనికి రత్నములు, మాణిక్యములునుగల టోపీతోనున్న మఱొక

యాత్రికుడు చిక్కినయెడల నతడు మొదటియాత్రికుని విడిచిపెట్టి అరత్నములు, మాణిక్యములతోపి గల యాత్రికుడు వెంట పోవునుకదా. అవిధముగనే మొదట బంధువులు, కుటుంబస్థులు ననెడిదొంగలు జీవుని పట్టుకొన్నను సంత్ సద్గురు వనెడి చోరశ్రేష్ఠులు తర్వాతవచ్చినపుడు వారు మిగతబంధుమిత్రాదుల బంధనములనన్నిటిని త్రుంచివైచి, ఆజీవుని మరేవైపునకైన పోవుటకు మనస్సే ఒప్పకుండునంత గట్టిగ త్రాడుతో తమచరణములకు కట్టివేసుకొందురు.

అప్పుడు మరల మిశ్రిజీగారివైపునకుతిరిగి యిట్లు సెలవిచ్చిరి, "మిశ్రిజీ మీకు మరణముయొక్క పిలుపు వచ్చి, ఎవరో మీకాళ్ళకు త్రాడుకట్టి మిమ్ములను పైకిలాగివేయుచున్నట్లు అనుభవము గలిగినమీదట, మీకు చనిపోవుచున్నట్లు గోచరమైనపుడు మీలోపల అనేకవిధములైన ఆలోచనలు బయల్దేరును. ఒకసారి మీమనుమడు జ్ఞాపకమువచ్చును, ఒకసారి మీకుమారుడు, మఱొకసారి మీ జమీందారీయును, ఇంకొకసారి మీ నూనెకార్ఖానాయును జ్ఞాపకము వచ్చుచుండును. అపుడు మీరు "నేనింకను చావునకు సిద్ధముగా లేను, అంతగా తప్పదన్నయెడల, కొంచెము నూనె పట్టుకొనిరమ్ము, నాతో కూడా తీసికొనివెళ్ళెద"నని అందురు. అప్పుడు మీబంధువులు మీచేతిలో నూనెపిడత పెట్టెదరు. కాని మీరు అవన్నియు వదిలిపెట్టియే చనిపోవుదురు. మీతోకూడ వచ్చునట్టికాని, మీకు సహాయముచేయునట్టికాని పదార్థమెద్దియు నుండదు. అట్టిసమయములో మీకు సహాయకు లొక్క సద్గురువుతప్ప మఱెవ్వరు నుండరు. అందుచేత మీరు సంత్ సద్గురువును దృఢముగ పట్టుకొని మిగిలిన సమస్తబంధనములను త్రెంచుకొనుడు సంత్ సద్గురువును పట్టుకొనవలెనన్నచో బాగుగ స్మరణ చేయుడు. ఈవిధముగనే మీ హృదయమున వారి చరణములందు ప్రీతి వృద్ధికావలయును. అప్పుడే మీకు మిగిలినవిషయములందుగల ప్రీతి నశించిపోవును. మీపిల్లలు, మనుమలు, మీభార్య, మీజమీందారీ, కార్ఖానా వగైరా లెవ్వియు మీకు నిజముగ నుపయోగించునవి కావని అప్పుడే మీకు విస్పష్టముగ కన్పట్టును.

## 101

ప్రయత్నము చేయుటమాత్రమే జీవుని బాధ్యత. ఫలితమును భగవదిచ్ఛకు విడిచిపెట్టవలయును. భక్తియొక్క స్వరూపము-సద్గురువును గుర్తుపట్టుటలో జాగరూకత ఆవశ్యకము.

10 సెప్టెంబరు 1917 :— సాహెబ్జీమహరాజ్ వారు సాయంకాలము ఫతే చంద్ సింధీసోదరునికి క్రితమురాత్రి వచ్చినట్టి మెఱుపులు, ఉఱుముల మూలమున నెక్కువభయము వేసెనా అని ఆసోదరుని అడిగిరి. ఆయన "లేద"ని సమాధానము చెప్పెను. రాత్రి ఒకసారి మూత్రవిసర్జనకే లేచితిని, కాని మెఱుపు లెక్కువగుటచూచి, తలుపులు గడియలుపెట్టుకొని, బట్ట ముసుగు వేసుకొని పరుండితినని చెప్పెను. అప్పుడు హుజూరువారు ఇట్లు సెలవిచ్చిరి. రాత్రివేళ యెక్కడ చచ్చిపోవుదుమో అని వీరు భయపడుచుందురు. దాని వలన ప్రయోజన మేమున్నది ? ఒకానొకరోజున మరణించుట తప్పనిసరియే కదా. ఫలానాపని పూర్తి అయిపోయినచో, నిఁక మేము చనిపోవుటకు సిద్ధమే యని జనులు అనుకొనుచుందురు. కాని అది పొరపాటు. ప్రాపంచికకార్యముల కెన్నడు సమాప్తి యనునది లేదు.

ఒకపని పూర్తి అయినవెంటనే, మఱొకపని సిద్ధముగనుండును, అది అయిపోయినవెంటనే మూడవపని మఱొకటి చేయవలెనని కోరికపుట్టును. "ఫలానాపని నేనే చేసి వెళ్ళిపోయినచో బాగుండును, నాతర్వాత నాపని నెవరుచేయుదురు" అనెడి ఆలోచనకూడా చాలపొరపాటు. ఈ సృష్టిలో శుద్ధ శూన్యస్థల (Vacuum) మెద్దియు లేదు. చెరువులోనుండి ఒక్కనీటిబిందువును తీసివేసినపుడు వెంటనే ఆశూన్యస్థలమును తిరిగి నింపుటకై నాలుగుప్రక్కల నుండియు నీరు అచ్చటికి పరుగిడును. గాలి అన్నిచోట్ల నిండియున్నది. ఎచ్చోట నైన కొద్దిగ గాలిని తీసివేసినచో నలుప్రక్కలనుండియు నా శూన్యస్థలమును నింపుటకై గాలి పరుగిడును. అటులనే ఒకమనిషి చనిపోయినచో, వెంటనే అన్నివైపులనుండియు, అతని బంధువులు అతనిస్థానే ప్రబంధముచేయుటకై వచ్చి చేరుకొందురు. ఒకజీవునిస్థానము ఖాళీ అయినవెంటనే 10,000 మంది ఆఖాళీ నింపుటకై సిద్ధముగ నుందురు. కావున ఫలానాపని పూర్తిచేసినతర్వాతనైతే నేను చనిపోవుట కభ్యంతరముండదనెడి ఆలోచన మనస్సునుండి తొలగించు కొనవలెను. సత్సంగి మరణమునకై యెప్పుడు సిద్ధముగనే ఉండవలయును. ఎనిమిదిరోజులు ముందుగా తెలిసినచో చాలదా ? ఎనిమిదిరోజులు ముందుగా మీకు తెలియఁజేసినయెడల, మరణమునకై తగినంతగా సిద్ధముకాలేరు ? చేయవలసిన దంతయు త్వరలో పూర్తిచేసుకొనుడు. కొద్దికాలములోనే కుటుంబ మందఱు నొక్కసారిగా చనిపోవుటకన్న గొప్పమరణ మెక్కడున్నది.

## 102

భక్తియొక్క స్వరూపము - నిజమైన సద్గురువు నన్వేషించుకొనుట ఆవశ్యకము.

11 సెప్టెంబరు 1917 —పాటుపడుటయు, ప్రయత్నించుటయుమాత్రమే జీవునికృత్యము. ఫలితమును నిర్ణయించుకొనుట జీవునిపనికాదు. మానవుడు తనకు ఒప్పగించినకృత్యమును తనశక్తికొలది నెఱవేర్చుటకు ప్రయత్నముచేసి పర్యవసానము భగవంతునిపైననే విడిచిపెట్టవలయును. అంతటితో మానవుని బాధ్యత ఆఖరు. అట్లుగాక మానవుడు దానిఫలితమునుకూడ తనయిష్టప్రకారమే కావలెనని నిశ్చయించుకొన్నచో, ఆసర్వశక్తిమంతుడైన భగవంతుని అధికారములో నతడు జోక్యము కలుగజేసికొన్నట్లగును. అట్లు చేయుట అన్ని విధముల అయుక్తమే. పర్యవసానముకూడా తనబాధ్యతయే అని యెంచుకొన్నందువలన నీర్ష్యాభావము ఇతరులతో వైరవిరోధములును జనించగలవు. అందుకు ఉదాహరణ యేమనగా, లోతుగా త్రవ్వి అందులో దృఢముగ పాతి పెట్టిన యొకరాటకి ఒకదున్నపోతును ఇనుపగొలుసులతో కట్టిపెట్టిరనుకొనుడు. అది తనశక్తికొలది ఆరాటను లాగి విరిచివేయుటకు ప్రయత్నించుట దాని ధర్మము. అయినను, అది ఆరాట విరుగుటలేదను విషయమునుగురించి ఆలోచించదు. దానిధర్మ మేమనగా ప్రయత్నించుటయేకాని, ఆఫలితమును సంపాదించుటకాదు. సమస్త లౌకికకార్యములలోను సేవ, అభ్యాసముల సందర్భములోగూడ ఇదేవిషయమని తెలుసుకొనవలయును. పరమార్థమార్గములో సాఫల్యమునిమిత్తమై గురుభక్తి నొకజన్మఅంతయు చేయవలసియుండునని చెప్పబడినది. కాని భక్తిచేయుట అనెడి మొదటిమెట్టు చాల కఠినమైనది. సాఫల్యమగుట కెన్నియో విఘ్నములు, ఆటంకములును కలుగుచుండును. మొట్టమొదట సంత్ సద్గురువు దొరకుటయే కష్టసాధ్యమైన విషయము. దొరికినను సద్గురువునందు భావము గలుగుట కష్టము. భావ మొకప్పుడు కలిగినను, అది నిలబడుట కష్టము. భావము కేవలము నిలబడియుండిన చాలదు. అది మెల్ల మెల్లగా వృద్ధిచెందు చుండవలయును. భావము క్రమక్రమముగ నభివృద్ధిచెందుట పరమార్థాభివృద్ధికి అత్యావశ్యకము.

కొందఱు ఇక్కడకు వచ్చి తలవంచి నమస్కరించి, భేంటు సమర్పించి, రెండుచేతులు జోడించి, చేయవలసినదంతయు నంతటితో పూర్తియైపోయినది, ఇంక చాలునని వెళ్ళిపోవుచుందురు. వీరికిని, లోకములో నొక జాతివిగ్రహము నకుకాని, లోహవిగ్రహమునకుగాని, అట్లు తలవంచి, భేంటునిచ్చి, చేతులు జోడించి నమస్కరించెడి ప్రాపంచికజీవులకును ఎక్కడు వ్యత్యాసములేదు. అయితే, ప్రాపంచికజీవులు నిర్జీవవిగ్రహములయెదుట నేకార్యక్రమము జరుపు చున్నారో, దానిని వీరొక సజీవపురుషుని సమక్షమందు చేయుచున్నారనున దొక్కటే వ్యత్యాసము. అభివృద్ధి కావలెనన్నచో, ప్రీతి లేక తీవ్రమైనప్రేమ క్రమక్రమముగా అభివృద్ధినొందుచుండుట ఆవశ్యకము. ప్రాపంచికాభివృద్ధి పైన నాధారపడినట్టి ప్రీతిని నమ్ముటకు వీలులేదు. ఏలననగా, లౌకికవిషయము లలో కార్యభంగము గలిగినపుడాప్రీతి శూన్యమైపోవును. అయస్కాంతము యొక్క సహజాకర్షణవంటి ప్రేమయుండవలెను. అట్టిప్రీతి గలిగియుండుటయే యుక్తము. మఱొకరకమైన ప్రేమవలన లాభములేదు. మీహృదయఘట్ట మీ విధముగా మాఱినపుడే మీకు భక్తియున్నట్లు చెప్పవచ్చునుకాని లేనిచో నది భక్తికానేరదు, ఉత్త కృతజ్ఞతయే యగును. మానవుని మానసికవృత్తి అనగా శ్రద్ధ లేక వాంఛ ప్రీతిచేయునిమిత్తమై యుండినచో దానిని భక్తి అని చెప్ప వచ్చును. మమకారము, ఆదరభావము, ప్రేమయు అను నీమూడిటికిని పరస్పర వ్యత్యాసమును తెలిసికొనుడు. ప్రేమబీజ మేక్షేత్రములో నాటబడునో అచ్చట వైరవిరోధభావములు పేరునకైన నుండనేరవు. హృదయములో నే సమయమందైనను వైరవిరోధభావము లడుగిడినచో ప్రేమలో లోపమున్నదని గ్రహించుకొనుడు. యథార్థమైన సంత్ సద్గురువును తెలుసుకొని, వారి నాశ్ర యించి, వారి చరణములందు ప్రేమ నభివృద్ధిచేసుకొన్నయెడల జనులు సామా న్యముగ మామనస్సు అభ్యాసములో లగ్నమగుటలేదనియు, మనస్సు విరస ముగ నున్నదనియు, ఫలానా ప్రాపంచికవ్యవహారములో అడ్డు వచ్చుచున్నవని యు, ఫలానావిషయములో మాకపజయము కలిగినదనియు రాత్రింబవళ్లు చేయు చుండెడి ఫిర్యాదుల కవకాశముండనేరదు. జీవులు విచక్షణలేకుండగ చేయు చుండు ప్రేమయే ఈవిధమైన ఫిర్యాదులన్నిటికిని మూలకారణము. జనులు చక్కగా విమర్శచేసుకొన్నమీదట, సద్గురువు నెన్నుకొనవలయునని తెలుసు కొనుటలేదు. వారు ఒకసారిపట్టిన గురువునుగుఱించి వ్యతిరేకమైన విషయము

లను విననొల్లరు. పైగా యెట్టిఆలోచనకాని విమర్శకాని చేయకుండగనే యెవరినో ఒకరిని సంత్ సద్గురువుగ స్వీకరించుచున్నారు.

సత్సంగి గాంభీర్యమును, ఔదార్యమును గలిగియుండవలయును. సంత్ సద్గురువును స్వీకరించుటలోగాని. ఇతర లౌకికవిషయములలోగాని యెన్నడు నీచత్వముతో ప్రవర్తించకూడదు. అటులనే అభావపరిస్థితిలోనికిగూడ నంతతొందరగా పడిపోకూడదు. పరమపురుషుడు మహాగంభీరోదారుడు. ఆయన కొద్ది కృతజ్ఞతాప్రకటనముచేతనే సంతోషించరు, కొద్ది అభావప్రకటనముచే విముఖులును కానేరరు.

## 103

### మానవుని ప్రతీతిలోని లోపములు, సత్సంగముయొక్క ఆవశ్యకత.

12 సెప్టెంబరు 1917 :— భగవచ్చరణములందు మనకుగల ప్రతీతి ప్రాపంచిక విషయములన్నియు మన కనుకూలముగా జరుగుచున్నంతవఱకే స్థిరముగ నుండి కొంచెము తేడా వచ్చుసరికి చలించిపోవునట్టిస్థితిలో నున్నది. కొద్దివిషయములు మనయిష్టమునకు వ్యతిరేకముగ నైనచో, నది పూర్తిగా మాయము కాకపోయినను, తప్పనిసరిగ చలించిపోవును. అట్లే కొంతకాలము వరుసగ 10, 15 విషయములలో మనయిష్టమునకు వ్యతిరేకముగా పనులు జరిగినట్లైతే మన ప్రతీతి అయిపుమచ్చయు కూడలేకుండ మాయమైపోవును. కొద్దివిషయములు మనకు ప్రతికూలమగుటయేగాక మనశత్రువుల కనుకూలముగకూడ జరిగినచో నిక రాధాస్వామిదయాళురున్నారా లేదా యను సందేహములో పడిపోవు పరిస్థితి గలుగును, మనము నిజాయితీగా నుండినపుడు, మఱొకడు మోసము చేసి తనకార్యము నెఱవేర్చుకొనిపోయినచో, నపుడు రాధాస్వామిదయాళురితో విరోధించుదురవస్థకూడ గలుగవచ్చును. మన ప్రతీతియొక్క పరిస్థితి యిట్లున్నది. ప్రతీతి ఈవిధముగనున్నపుడు ప్రీతియెట్లుగలుగును? ప్రీతి లేనపుడు ప్రేమయెట్లు గలుగును? కాబట్టి మన మావశ్యకముగ, ప్రాపంచిక వ్యవహారములలో గల్గు జయాపజయమునకు పరమార్థముతో నేంతమాత్రము సంబంధము లేకుండ చేసికొనవలెను. ఈరెండిటికిని పరస్పరవిరోధము గలదు. ప్రాపంచిక పద్ధతుల ప్రకారము ప్రేమ నిలబడవలెనన్నచో సకలవ్యవహారములును మన యిష్టప్రకారమే జరుగుచుండవలెను. కాని పారమార్థికసిద్ధాంతప్రకారము మన

నీప్రపంచమునుండి దూరము చేయవలసియున్నది. ఈ కార్యము, మనకు ఐహిక విషయములలో దెబ్బలుతగిలి మనపనులన్నియు విఫలమైపోగా మనమీప్రపంచమునుండి విముఖులమైనపుడే కాని, సాధ్యముకాదు.

శ్రద్ధగా విమర్శించినయెడల నీలోకములో నంతటను ఘోరాన్యాయము లే జరిగిపోవుచున్నవని బోధపడును. ప్రతిదినము వేలకొలంది నిష్పాపజీవులకు హింస జరిగిపోవుచున్నది. రోజు లెక్కలేనన్ని పక్షులను ఇతరపక్షులు చంపి తినివేయుచున్నవి. వందలు వేలు నిర్దోషులైన జంతువులు రోజు చంపబడిపోవుచున్నవి. వేలకొలంది మనుష్యులు తప్పుచేయకనే జెయిళ్ళలో పెట్టబడుచున్నారు. వందలకొలంది నిష్పాపులైన మానవులు ఉరితీయబడుచున్నారు. దుర్మార్గులు తప్పించుకొనిపోవుచున్నారు. ఇదంతయు చూడగా లోకములో ఘోరాన్యాయము చెలరేగుచున్నట్లే తోచును. ఒకరికష్టములను బాధలను కనిపెట్టెడివారు మఱెవ్వరునున్నట్లే కానవచ్చుటలేదు. ఈవిషయములనన్నిటినిబట్టి చూడగా ఈలోకములో మనము సాఫల్యముకొఱకై ఆశించుటయే పొరపాటని బోధపడగలదు. పరమార్థములో సాఫల్యము సంపాదించుకొనగోరువారు ఈవిషయములనుగుఱించి ఆలోచించకుండా నిరంతరము భగవంతుని జ్ఞాపకముంచుకొనుటయే ప్రధాన కృత్యముగ చేసికొనవలయును. ఇట్లు నిరంతరము జ్ఞాపకముంచుకొనుట స్మరణధ్యానభజనలమూలమున సాధ్యమగును. ఈవిధానమును భగవంతుడే యేర్పాటుచేసెను. అయితే, అది సాగించుకొనుటకుమిత్తమై ప్రతిదినము సత్సంగము చేసికొనుట ఆవశ్యకము. తనఇంటివద్దనే తాను కూర్చుండి స్మరణ, ధ్యాన భజనాభ్యాసములనుచేసికొందునని ఎవరైన ననుకొన్న యెడల నదిసాధ్యముకాదు. లోకములో పైన చెప్పినవిధముగ జరుగుచుండెడి ఘోరాన్యాయములను జూచినపుడు, తనమనస్సున కప్రియమైనవిషయము లేవైన జరిగినయెడల, మనస్సు తప్పకుండా నిరుత్సాహమైపోవును. సత్సంగమునకు ప్రతిదినము వచ్చి చేసుకొనుచుండుటచే గల్గు మొట్టమొదటిఫలితమేమనగా జగత్తునుండి వైరాగ్యము గలుగుటయే అనగా ఇచ్చటిసుఖములయం దాసక్తి నశించుటయే. రెండవది, మనస్సుయొక్క దుష్ప్రవర్తన అంతయు సత్సంగములో ప్రకటమైపోవును. మఱియు అభ్యాసికి పరమార్థసాధనల నభ్యసించుటలో విఘ్నములు గలిగినందున మనస్సున నిరాశపరిస్థితి గలిగినపుడు, తనచుట్టునున్న ఆనందోత్సాహ

ములతో నిండిన చాలమంది సత్సంగులను చూచినందున తన కానిరాశాభావము కలుగుటకు తనలోపములే కారణమనియు సద్గురువు తన కేమియు లోపము చేయలేదనియు వెంటనే బోధపడును. ఆవిధముగా సత్సంగము చేసికొనుచుండుటవలన నతనివిశ్వాసము దృఢవత్తరముగ నుండిపోవును. ప్రీతిగలుగుటకు మహావిఘ్నకారకమైనది విశ్వాసముయొక్క చాంచల్యమే. కావున దానికి యేర్పాటిచ్చుట తృప్తికరముగ నున్నవి. ఇంటివద్దనే ఉండి భక్తివిశ్వాసములను వృద్ధిచేసికొనవలెనన్నయెడల, కేవలము భగవదిచ్ఛమీదనే నిలబడియుండగల పరిస్థితి గలిగినపుడే అది సాధ్యమగును. సత్సంగములో నందుకుతగిన యేర్పాట్లు అన్నియునుండును కావున, సత్సంగము చేసికొనువారికి ఆలాభము చేకూరును. సత్సంగములోనికి వెళ్ళనిదే ఆ యేర్పాట్లలాభము చేకూరజాలదు. దృఢప్రతీతి స్థిరముగనుండగల యేర్పాటు అయినపుడు ప్రీతి స్థిరమగును. ప్రీతి స్థాపితమైనపుడు ప్రేమ గలుగును. నిన్నటిరోజున చెప్పినట్లు భగవంతునికిని ప్రేమకును భేదమేమియు లేదు.

## 104

అభ్యాసమునుగుఱించిన ఆక్షేపణలకు సమాధానములు. అభ్యాసము జయప్రదముగ సాగుటకు సలహాలు.

13 సెప్టెంబరు 1917:- జనులు అభ్యాసముచేయుటచే తలనొప్పి వచ్చుచున్నదనియు. అభ్యాసములో మనస్సు లగ్నమగుటలేదనియు, వగైరా, వగైరా ఫిర్యాదులు సామాన్యముగాచేయుచుందురు. వారి తలనొప్పి వగైరాబాధల కభ్యాసమే కారణమని వారి యభిప్రాయము. కాని అది పొరపాటు, వారు అభ్యాసమును తప్పుడుపద్ధతిని చేసినందువలన అట్లయితే అయియుండవచ్చును. కాని సవ్యమైనపద్ధతిని అభ్యాసముచేసినచో, అభ్యాసి శరీరమనస్సులకు అందుమూలమున ప్రాపంచికకృత్యములను నెఱవేర్చుటకుకూడ సామర్థ్య మెక్కువగ గల్గును. ఖడ్గము శత్రువును చంపుటకు చాల మంచిసాధనమే కాని, దానిని పిడివద్ద పట్టుకొనక చివరపట్టుకొన్నను, లేదా దానిని ఒరలోపెట్టకుండగ, తన భుజమునకు వ్రేలాడునట్లు వేసికొని నడచినను శరీరమునకు గాయములుపడును. అట్టివాడు ఖడ్గమునుగుఱించి, దాని నందఱును మంచి సాధనమని చెప్పుదురు కాని, అది చాల ప్రమాదకరమైన వస్తువు అని నెపములెన్నును. అసలువిష

యము, ఖడ్గము స్వతహాగా చెడ్డవస్తువు కాదనియు, కష్టము బాధయు గల్గుటకు దాని దురుపయోగమే కారణమనియు. తేటపడుచున్నది. అట్లే అభ్యాసములో స్వతహాగా చెడు యేమియు లేదు. కాని అభ్యాసమును తప్పుపద్ధతిగ చేసినచో మీకట్టి బాధలు కలుగవచ్చును.

అభ్యాసములో మనస్సు లగ్నమగుట లేదనియు, అభ్యాసము జయప్రదముగ సాగుట లేదనియు జనులు చేసెడి ఫిర్యాదులకు కారణము లీక్రిందివిధముగ నుండును.

1. లోకములో గొప్పగొప్ప కార్యములను సాధించినవారి చరిత్రలు శ్రద్ధగ పరిశీలించినచో, వారు సామాన్యముగ నట్టి కార్యముల కొక ప్రత్యేక సమయము నేర్పాటుచేయుటయేగాక ఆపని సాధించుటకై తదేకదీక్షగ శ్రద్ధ వహించి రాత్రింబవళ్లు ఆపనులవిషయమైయే పాటుపడుచుండిరని బోధపడగలదు. మనము రోజంతయు ప్రాపంచికకృత్యములు చేయుచు నుండి, మన మనస్సులో ప్రాపంచికాలోచనలే నిండియున్నపుడు, అనగా మనము ప్రపంచ సంబంధమైన పనులలోనే రోజంతయు తదేకదీక్షగా శ్రద్ధపెట్టి పనిచేయుచుండినపుడు, ఒక అరగంటకాని ముప్పావుగంటకాని అభ్యాసముచేయునిమిత్తమై మనము కూర్చుండినపుడుగూడ మన ఆలోచనలు అలౌకికకృత్యములమీదకే పరుగిడుచుండునని మన కనుభవములో తెలిసినవిషయమే. అదేవిధముగ రోజంతయు మనము, ఇతరకృత్యములు చేసుకొనుచుండునపుడుగూడ భగవద్దర్శనముకొఱకు తదేకదీక్షగల ఆసక్తితోనుండి, ఈనాడుదయము మనకు దర్శనము కాలేదు. సాయంకాలము అభ్యాసములోనైనను భగవంతుడు కటాక్షించి, సాఫల్యము దయచేయుగాక అనెడి తీవ్రమైన బాధ ఆరోజంతయు నట్లే మనస్సున నిలకడగ నుండినయెడల- దీనినే పవిత్రగ్రంథశబ్దములలో "ఖాతే పీతే చల్తే ఫిర్ తే సోవత జాగత బిసర న జాత్" అని వర్ణించిరి- సాయంకాలము అభ్యాసము జయప్రదముగ నుండకపోవుటెట్లుసాధ్యము? ప్రాపంచిక వ్యవహారములలోగూడ, రోజంతయు నిట్టి తదేకదీక్షగనున్నపుడు, చెప్పనలవికానంత సహాయము గల్గుచుండుట మన మనుభవములో చూచుచున్నాము. కోర్టువ్యాజ్యెములలో కొన్ని బహు క్లిష్టసమస్యలకు సమాధానములు, ఆరికార్డు చదివి తయారుచేయుచున్న సమయములోగూడ తట్టనట్టి అంశములును, ఒక్కొక్కప్పుడు, బహిర్దేశమునకు కూర్చుండినపుడును, విశ్రాంతికై పరుండినపుడును మనస్సునకు తట్టు

చుండును. ఈవిధముగ రోజంతయు భగవంతుని ధ్యానములో తదేకదీక్ష వహించియుండినచో, మనస్సుయొక్క ప్రవృత్తిగూడ తత్సంబంధమైన పరిసరములలోనే తిరుగుచుండును. కావున అభ్యాససమయము వచ్చినపుడు కొద్ది ప్రయత్నముచేయగనే అది నిశ్చలమైపోవును. కాని, రోజంతయు మనస్సు మహోద్రేకముతో ప్రాపంచికవ్యవహారములలోనే చిక్కుపడి చుట్టుకొనిపోవుచునుండి, యెల్లపుడు ప్రాపంచికవిషయములను గురించియే అదేపనిగ నాలోచించుచున్నపు డది అట్లు నిశ్చలము కానేరదు. అట్టి పరిస్థితిలో మనముచేసెడి అరగంట లేక ముప్పావుగంటసేపు అభ్యాససమయములో మనమనస్సు సంపూర్ణైకాగ్రతతో అభ్యాసముచేయగల్గునని యాశించుటకు అవకాశ మెక్కడున్నది? అట్లుగాక, భగవద్దర్శనార్థమై రోజంతయు తదేకధ్యాసతో నుండినయెడల, అతనికి అభ్యాససమయములో ప్రపంచము యెదుటికి రానేరదు. అందువలననే అభ్యాసము జయప్రదముగ సాగవలెనని కోరువారు భగవంతుని మీదనే రాత్రింబవళ్ళు ధ్యాసపెట్టుకొని యుండుట యత్యావశ్యకము.

(2) అభ్యాసము కష్టదాయకమని యనుకొనుటగూడ చాలపొరపాటు. క్రొత్తగా నేపనినైనను నేర్చుకొనునపుడు, ఉదాహరణకు సంగీతము నేర్చుకొనునపుడు, ఉపాధ్యాయుడు ప్రారంభములో నేర్పెడి వివిధస్వరముల ఆరోహణావరోహణ క్రమములు చాలకష్టముగ నున్నట్లు అనిపించును. కాని పాట బాగాపాడగల్గినపరిస్థితి వచ్చినపుడు ఈశిష్యుడే ఉపాధ్యాయుడైపోయి, మొదటలో కష్టముగతోచిన స్వరారోహణఅవరోహణ క్రమములే చాలయోగ్యమైనవిగను, మధురముగను అనిపించుచు. అపుడు శిష్యుడే క్రొత్తక్రొత్తరాగములనుగూడ తయారుచేయును. ఈవిధముగ ప్రారంభములో నభ్యాసము కష్టసాధ్యమైనట్లే కనిపించును. దినమంతయు తదేకదీక్షగ శ్రద్ధవహించి, అభ్యాసము చేసినప్పుడు—— రోజంతయు స్వార్థచింతలతోనుండువానికి అభ్యాససమయములోనెట్లు స్వార్థసంబంధమైన ఆలోచనలే వచ్చుచుండునో, అట్లే రోజంతయు పారమార్థికచింతయుండుటచే స్వార్థకార్యములు చేయునపుడుగూడ పారమార్థికాలోచనలే వచ్చుచుండును కావున... అభ్యాసము చికాకుగనుండుటకు బదులు, మహాసౌకర్యముగ సాగిపోవును. ఇంతియగాక నెవ్వరైనను రోజంతయు పనిచేసి అలసిపోయినపుడు, ఏకాంతస్థలములో కొద్దిసేపు కండ్లుమూసుకొని పరుండి విశ్రాంతి తీసికొన్నచో, తిరిగినవనవలాడుచు పనిచేయుటకు తగినట్లైపోవును

కదా. కావున అభ్యాసములో అట్టిపనినే చేయుచున్నపుడు, అభ్యాసి అలసిపోవుటకుగాని అభ్యాసమువలన బాధలుగల్గుటకుగాని అవకాశమెట్లుండును ? నిర్జీవ యంత్రములుగూడ (Machines) రోజంతయు పనిచేసినపుడు వేడెక్కిపోయి కొంతసేపు విశ్రాంతియిచ్చినపుడు తిరిగి చల్లబడి, యెక్కువపనిచేయుటకు తగినవై పోవుచున్నవి కదా. అట్టిస్థితిలో మానవుని మస్తిష్కము అభ్యాసము ద్వారా విశ్రాంతినిపొందినపుడు లౌకికకృత్యములను నెఱవేర్చుట కసర్థమెట్లగును ? కావున అసలు విషయమేమనగా, అతనిమనస్సు రోజంతయు ప్రాపంచిక విషయములలో తదేకదృష్టితో నుండిపోవుటచే నతనికి అభ్యాససమయములో కష్టముగ తోచుచున్నది. సామాన్యముగ సత్సంగుల కాంతర్యవికాస మేమియు గలుగలేదు. ఎవన్నికైనను ఆంతర్యమున కొంతవికాసగలిగి సంత్ సద్గురుస్వరూపము ప్రకటమైనయెడల అతనికి అంతయెక్కువ కష్టముండదు. కాని ఆంతర్యమున సామాన్యముగ నేమియు వికసించనప్పుడు సమకాలికసంత్ సద్గురువునందు ప్రీతియుండుట ఆవశ్యకము. ఆప్రీతి కలుగవలెనన్నచో నిరంతరదీక్ష లేనిచో లభ్యమగుట కష్టసాధ్యము. అభ్యాసములో చికాకుగనుండుటకు కారణము రోజంతయు మనస్సు చెదిరిపోయి యుండుటయే.

అభ్యాసమనగా మనస్సు పూర్తిగా నిష్క్రియావస్థలోనికి మారిపోవుటయే. అనగా ప్రీతితో నిండినవాడై సంత్ సద్గురువుయొక్క నామమును రూపమును చిత్తమునందు తల్చుకొనుటయే, దీనిలో నేమియు కష్టముండజాలదు. యథార్థవిషయ మేమనగా, ఇచ్చట ఉపదేశించిన విషయము అత్యంతసరళమైనదియు, అభ్యాసముయొక్క మాధుర్యమును సంపాదించుటకు పద్ధతికూడ పరిపూర్ణమైనదియును. అయితే, అంతయెక్కువ సరళముగ నుండుటవలననే, దానివిలువను సత్సంగులు తెలిసికొనలేకున్నారు. ఉదాహరణ మెట్లనగా, దెబ్బలకు పసుపుకట్టినచో నొప్పి తగ్గి సుఖముకలుగును. అయితే పసుపు చవుకగను సులువుగను దొరికెడివస్తువు కావున జనులు దానిని విడిచిపెట్టి, తులము ఒక లక్షరూపాయలు ఖరీదుచేయునట్టి "నోశ్ దారూ" అనెడిమందుకొఱకై పరుగులిడుచుందురు. మరొక దృష్టాంతము, ఒకచిన్నసూది క్రిందపడిపోయిన దనుకొనుడు, దానిని పైకెత్తునిమిత్తమై వందలాదిజనులు పెద్దపెద్దతాళ్ళు పట్టుకొని పరుగెత్తుచున్నా రనుకొనుడు, అయినను వారెవరికి నదిదొరకనే దొరకదు. అట్లుగాక నొకసూదంటుఱాయితో దానిని వెతుకుట ప్రారంభించినయెడల నది

వెంటనే దొరికిపోవును. అటులనే మీరు తెలుసుకొన వలసినదేమనగా, మనస్సు అభ్యాసములో లగ్నము కావలెనన్నయెడల నది ప్రేమప్రీతులవలన సాధ్యమగును. కాని దేవుడు స్వయముగావచ్చి మీమనస్సు నాకర్షించినచో సాధ్యమగుననియు లేదా మీమీద దయచూపినచో కాగలదనియు మీరు సామాన్యముగ అభిప్రాయపడుచున్నట్లు అయ్యేడిపనికాదు. దయగల్గుట అంతసులువైన పనికాదు. నియమవిరుద్ధముగ నెన్నడు దయగలుగనేరదు. భగవంతుడు మీకుచెప్పిన సరళసాధనను అభ్యాసముచేయుడు. అటుపిమ్మట మీకు దయ పొందగల్ల అధికారము గల్గును. ఉత్తదయ ఒక్కటే సహాయము చేయవలెనన్నచో, మీకేమియు లభించనేరదు. మీరు ప్రారంభించికాలోచనలు మనస్సున పెట్టుకొనియుండి మనస్సును అరికట్టచూచుకొనుట, పెద్దపెద్దత్రాళ్ళతో చిన్న సూదిని పట్టుకొనుటకై ప్రయత్నించిరని పైనచెప్పిన దృష్టాంతమువలె నుండును.

(3) నీకు రోజంతయు ధ్యాస అభ్యాసము విషయమైయే యుండి, అభ్యాసమయములో నీచిత్తము నామరూపములందు లగ్నమైయున్నచో, మనస్సు, ఆత్మయు లోలోపలికాకర్షించబడి, నీకు మత్తుపరిస్థితి గలుగకుండా, నిన్ను ఒకగట్టిత్రోపు త్రోసినట్లుగ కాని లేదా, ఆంతర్యమున నీగొంతుక నెవరో విరిచివేయుచున్నట్లుగ కాని, నీకు అనుభవముగల్గును. అప్పుడు నీవు భయపడిపోకుము, నీకు అభ్యాసముచేయుటకర్హత గల్గుచున్నదని తెలిసికొనుము. ఈపరిస్థితి యెంతసేపు ఉండుననువిషయము వారివారి అదృష్టమునుబట్టి యుండును. అయితే అది ఉన్నంతసేపు, నీవాపరిస్థితి నుపయోగించుకొని అభ్యాసము చేయుచుండుము. ఇట్టిఅభ్యాసముయొక్క ఫలితము చూచుకొనుము. ఐహికాముష్మిక కృత్యములన్నిటిలో నెల్లపుడు నీకు జయమేచేకూరుచుండును. ఇంకొకవిషయముకూడ కొద్దిగ ఆలోచించుకొనుడు. స్వామీజీ మహారాజువారు, హుజూర్ మహారాజువారు, మహారాజ సాహబ్ వారును అసత్యమైన అభ్యాసమును నీకు ఉపదేశించిరనియు, ఈఅభ్యాసమువలన నిజముగ నాంతర్యస్థానములు పొందశక్యము కాకపోయినను, అవిపొందవచ్చుననియు, నీలో వెవ్వేరుధ్వనులు లేకపోయినను ఉన్నవనియు మోసముచేసిరనియు నీకనుమానముండుటకు వారెవరికైనను నీతోకాని నీకుటుంబముతోగాని శత్రుత్వమేమైన నుండెనా? లేదా అట్టిమోసముచేసి వారేమైన భాగ్యమును సంపాదించుకొన్నయెడల నప్పుడైనను వారి సదుద్దేశ్యమును గుఱించి

సందియపడుటకు కారణముండును. కాని వారట్లు తమలాభముకొఱకై యెట్టి సంపత్తును పోగుచేసుకొనలేదని మనకు తెలుసును కదా. అంతియగాక ప్రాచీన కాలపు సాధుసంత్ మహాత్ములందరునుకూడా ఈఅభ్యాసముయొక్క శ్రేష్ఠతను గుఱించి చెప్పిరనికూడ మనకు తెలుసును. కావున నభ్యాసములో మనకు జయముకలుగనిచో నది మనము తప్పువిధముగ నభ్యాసము చేయుటవలననే కావలెను, కాని అభ్యాసములోని లోపమువలన కానేరదు. ఈవిషయముల నన్నిటిని మీరు బాగుగ నాలోచించుకొని, మఱియు నేను మీకిప్పుడు చెప్పిన సహజమైన సలహాలుగూడ పూర్తిగ సమంజసమైనవనియు, స్వామిజీమహారాజ్ వారినిగుఱించి పైనచెప్పిన హేతువాదము ప్రస్తుతకాలమునకుకూడ పూర్తిగ, వర్తించుననియుకూడ తెలిసికొని, మొట్టమొదట సత్సంగములో తప్పక వచ్చి కూర్చుండుట అభ్యాసముచేసుకొని, దానివలన ప్రతీతిని, అటుపిమ్మట ప్రీతిని అటుపిమ్మట ఇరువదినాల్గు ఘంటలసేపును అభ్యాసమునుగుఱించిన తదేకదీక్షగల చింతను సంపాదించుకొనవలయును. అప్పుడే మీకు అభ్యాసము జయప్రదముగ సాగగలదు.

## 105

### పునర్జన్మ సిద్ధాంతమునకు సమర్థనము

14 సెప్టెంబరు 1917: డ్రాయింగ్ మాష్టరుగా ఉన్నట్టియు, ఫ్యాక్టరీలో పనిచేయుచున్నట్టియు, ఒకమహమ్మదీయుడు సారబచన్‌లో 56 వ నెంబరు వచనమున కర్థము చెప్పుడని యడిగెను. పిమ్మట తిరిగి అది కాదనియు 156 వ వచనమున కర్థము కావలెననియు కోరెను. అందుచే నారెండు వచనములపైనను వ్యాఖ్యానముచేయుచు నొకవచనమును సెలవిచ్చిరి. పునర్జన్మ సిద్ధాంతమును సమర్థించుచు మౌలానారూమ్‌గారి క్రిందిచరణమును అనువదించిరి.

"హమ్‌చో సబ్జా బారహా రోఈదః ఏమ్,
హ ప్త దో హఫ్తద్ కాలిబ్ దీదః ఏమ్"॥

అనగా, మేము తిరిగి తిరిగి పచ్చగడ్డి మొలిచినట్లుగనే పుట్టుచు, నీవిధముగా 84 విధముల జీవయోనులలోను పుట్టితిమి.

# 106

## రాధాస్వామీ మతములో గురుపరంపరను గురించి

15 సెప్టెంబరు 1917 :—ప్రస్తుతము లోకములోనున్న సకలమతస్థాపకులును కొంతకాలముతర్వాత నీసృష్టిలోనికి తాము తిరిగివచ్చి తమతమ మతానుయాయుల నందఱిని సంరక్షించెదమని గట్టిగా చెప్పిరి. ఈవిషయము ఆయా మతగ్రంథములలోకూడ వ్రాయబడి యున్నది. అందులో కొందఱు మతస్థాపకులు అట్లు చెప్పుటయేగాక ప్రతిజ్ఞకూడచేసి పూంచీపడిరి. హిందూమతములో శ్రీరాముడు కృష్ణుడును తిరిగి కల్కి అవతారములో వచ్చెదమని చెప్పిరి. ఏసుక్రీస్తుకూడ తాను తిరిగివత్తునని వాగ్దానము చేసెను. మహమ్మదీయులుకూడ నిట్లేరెండవసారి అవతారము రావచ్చునని బహుశా నమ్ముచుండవచ్చును. లేదా వారిప్రవక్తయగు మహమ్మదువారు ఈవిషయమును గురించి యేమియుచెప్పక పోవుటచే నామతస్థులు మహమ్మదునే అఖరుప్రవక్తయనియు నింకమఱొకప్రవక్త తిరిగి యుండనేరడనియు నమ్ముచుండవచ్చును. కాని వారిలోకూడా "కాదియానీ" మొదలగు తెగలవారు కొందఱు ప్రవక్త తిరిగి అవతారమెత్తి రాగలరని నమ్ముచున్నారు థియాసఫీ (Theosophy) సంఘమువారు భగవంతుడు తిరిగిఅవతారమెత్తి వత్తురనియు, నప్పుడు మహాఘోరహత్యలు జరుగగలవనియు తీవ్రముగ ఘోషించుచున్నారు. వగైరా వగైరా.

సరే, అవతారపురుషుడు వచ్చెననుకొనుడు. అయితే, ఆయన జనులకు తనవిషయము తెలియునట్లు ఏరీతిని చేయగలడో మీరిపుడు కొద్దిగా ఆలోచించి చూడుడు. ఇప్పుడు ఏసుక్రీస్తు తిరిగి వచ్చినయెడల వారు మొట్టమొదట బిషప్పులు వగైరా పాదరీలచెవులు తప్పక నులుపుదురు. ఏలననగా వారిమతమే అన్నిటి కన్న నెక్కువ పతితావస్థలో నున్నది. అందఱికన్న నెక్కువగా ఈబిషప్పులు వగైరాలే మతగ్రంథములను సంపూర్ణముగ తెలిసినవారై ఆమతమును నడిపించుబాధ్యత సంపూర్ణముగ వహించియున్నందున, వారే యీపరిస్థితి కంతకును అందఱికన్న నెక్కువబాధ్యులు. ఇదేవిధముగ నితరమతముల పరిస్థితిగూడనున్నది. గురునానక్ వారు ఇప్పుడు వచ్చినయెడల వారు వెంటనే అమృతసర్ గ్రామము వెళ్ళి "మేము గురువునకు భక్తిచేయుట ముఖ్యమని చెప్పియుండగా, మీరు ఒక ఆలయము కట్టించి, దానిలో అనేకరకములైన విగ్రహములను పెట్టి విచారణ

విమర్శ లెవ్వియు లేకుండా రాత్రింబవళ్లు పవిత్రగ్రంథములను చదువుచుండుటయే మతము అనెడి దురభిప్రాయములో నున్నారే" అని అడుగుదురు.

అసలు విషయమేమనగా, ఒకలోకాధిపతిగాని, ప్రవక్తగాని, అవతార మెత్తినపుడు, వారియందు విశ్వాసము పెట్టుకొన్న మొట్టమొదటిభక్తులు వారికి తమశరీరమనోధనముల నర్పణచేయుచుందురు. అందుకుబదులుగా ఆయవతార పురుషుడు వీరికి భగవచ్ఛరణములయందు ప్రేమదానమును అనుగ్రహించుచుందురు, తరువాత వారు గుప్తమైపోయినప్పుడు వీరందఱికి భగవంతునితో సంబంధము అంతరించిపోయి కేవలము ఆపీఠాధిపతి సంతానమువారే పీఠాధిపతులను అంధవిశ్వాసమొక్కటి మాత్రము ఉండిపోవును. మొదటిశిష్యుల సంతానము అప్పటికి బాగాసంఖ్యపెరిగిపోయి యుండును. కావున వారందఱును ఈ పీఠాధిపతి సంతానమువద్దకువచ్చి శిష్యులుగను భక్తులుగను చేరుదురు. వీరు భగవత్ప్రేమచేయుటకు బదులుగా కృతజ్ఞతాపూర్వక ధన్యవాదములు మాత్రమే చేయుచుందురు. అటుపిమ్మట నాకృతజ్ఞత పద్ధతికూడా పోయి బజానా లిచ్చెడి పద్ధతిలోనికి దిగిపోవును. వారికి (అనగా, ఆ అనుయాయులకు) పారమార్థికాసక్తియునుండదు. వీరికి పారమార్థికవరదాన మిచ్చెడిశక్తిసామర్థ్యములు నుండవు. వారు తమతల్లిదండ్రులు ముందు అచ్చటికి వెళ్లుచుండెడివారనెడి కారణమొక్క-దానివలననే వీరివద్దకు వెళ్లుచుందురు. ఇప్పుడు వారచ్చటికి కేవలము ధనసంతానాభివృద్ధులకొఱకు మాత్రమే పోవుచుందురు. దైవవశాత్తు యెవనికైనను కోరిక తీరినచో నతడు తనధనములో కొంతభాగము కృతజ్ఞతను తెల్పుటకై యచ్చట సమర్పించును. కొంతకాలమైన పిమ్మట నీపద్ధతికూడ పోయి పిల్లలులేనివారు, ధనములేనివారును అచ్చటకువెళ్ళి ముందుబజానాక్రింద కొంతసొమ్మిచ్చి' అనగా ఒకకక్షిదారుడు తనవకీలునకు తనకేసు గెల్పించుటకై ఫీజు యిచ్చినట్లుగా ఇచ్చి, కోరికతీరినతరువాత తమ కృతజ్ఞతను ప్రదర్శించగలమని వాగ్దానము చేయుచుందురు.

ఇదేవిధముగా నన్నిమతములు నంతకంత కెక్కువగా దిగపడిపోవుచు నిట్టి హీనపరిస్థితిలోనికే వచ్చినవి. ఎట్లనగా, మొదట ప్రవక్తగారు వగైరా పరమార్థులుండెడికాలములో జనులు వారివద్దకు పోయి పారమార్థికలాభము నొందుచుండెడివారు. కాని ఇప్పుడు వారందఱును కేవలము ఐహికవాంఛలు మాత్రమే

కలిగియున్నారు. ఉదాహరణకై యెవ్వరైనను వేటయందాసక్తి గల్గియున్నచో సతనివద్దకు వేటఆడుటొక్క దానియందే నిజముగ నాసక్తిగల కపటపర మార్థులు మాత్రమేవచ్చి గుమిగూడుచుందురు.

ఇప్పుడొక నిజమైన సంత్ మహాత్మ యెవ్వరైన నవతారమెత్తినచో, నాయన యెట్టిస్థితిలో నుందురు, వారిని అన్వేషించవలసినస్థల మెద్ది యనుప్రశ్న లను మనము తెల్సుకొనవలసియున్నది. అందునిమిత్తమై మనము ముందు మన పరిస్థితిని పరిశీలించు కొనవలయును. ఈలోకములో చూడుడు, చాలమంది ఆపత్తులలోనే చిక్కుకొనిపోయి యున్నారు. గృహస్థులలో చూడుడు, ప్రతి వ్యక్తియు చిన్నవయస్సులోనే పెండ్లిచేసుకొని 15, 16 యేండ్లప్రాయము వచ్చి నది మొదలుకొని పిల్లలనుకనుట మొదలిడుచున్నారు. అట్లు 6, 7 గురు పిల్లలు పుట్టుచుందురు. వానికి మఱొకవైపున తల్లితండ్రులు సోదరీ సోదరులుకూడ నుందురు. ఇద్దఱు ముగ్గుఱు వితంతువులుగూడ నింట నుందురు. వానికి జీతము అయితే నెలకు 15, 20 రూపాయలు మాత్రమే యుండును. వానికి కుటుంబ పోషణ యెట్లుకాగలదో ఆలోచించుడు. మన మిట్టిపరిస్థితిలో చిక్కువడి యుండి నపుడు, సంత్ సద్గురువు సన్యాసి వేషములో నవతరించినచో, మనము వారివలన లాభమెట్లు పొందగలమో చెప్పుడు. వారీజగత్తులోని జీవులను ఈఆపత్తుల జాలమునుండియు, ప్రాపంచికజాలమునుండియు విడిపించునిమిత్తమై వచ్చినపుడు వారు సన్యాసిరూపములో నొకకొండ గుహలోనికి పోయి కూర్చుండినయెడల వారివలన ప్రాపంచికజీవులకెల్లు ఉపకారముగల్గును ? లేదా వారు ప్రాణా యామసాధనలను నేర్పి అభ్యసింపజేయుచున్నా రనుకొనుడు. ఈకాలములో నట్టి అభ్యాసము చేయగల శక్తిసామర్థ్యము లెవన్నికైన గలవా ? కృతయుగ ములోనైతే అప్పటివారు వృద్ధావస్థలో సామాన్యముగ వనవాసము చేయుచుం డెడివారు కావున, వారికైతేసన్యాసాశ్రమములోనున్న సంతులు కొంతలాభము కలిగించెడివారు. త్రేతాద్వాపర యుగములలోనైతే జనులు బలిష్ఠమైన శరీర ములు గలవారగుటచే సంత్ సద్గురువు వారిచేత ప్రాణాయామాభ్యాసము చేయించగలిగెడివారు. కాని యీకాలములోనైతే సన్యాసమువలన పనిసాగదు, ప్రాణాయామము చేయుటయు సాధ్యముకాదు. అందుచేత నీకాలములో సంత్ సద్గురువుకూడా మనవలెనే గృహస్థాశ్రమములో నుండి, మనవంటి పరిస్థితిలోనే యుండి, ఆపరిస్థితిలో నుండగనే అభ్యాసముచేసి చూపవలెను. అట్లుచేసినయెడల మనము, "అయ్యా మీరైతే యే బెడదలు లేకుండ సన్యాసాశ్రమములో

నుండుటచే సర్వస్వతంత్రులు, మహాదృష్టవంతులును. మాకష్టములు మీకెట్లు తెలియగలవు ?" అని చెప్పుటకు వీలుండదు.

కావున సంత్ సద్గురువు కేవలము గృహస్థులుగనే యుండి, మనవలెనే జీవికోపార్జన చేసికొనునట్టివారే అయియుండుట ముఖ్యావసరము. అందుచే పరిస్థితులీక్రింది విధముగనే యుండుట యత్యావశ్యకము :

1. సాధుసంతుమహాత్ములు గృహస్థులెట్టిస్థితిలో నుందురో వారుగూడ నించుమించు అట్టిపరిస్థితులలోనే ఉండవలయును.

2. పూర్వకాలములో ప్రజల కాయుర్దాయములు చాలదీర్ఘముగ నుండెడివి. అప్పటివారు ఆచార వ్యవహారములలోను ఆధ్యాత్మిక సంపదలోను కూడ నిప్పటిజీవులకన్న పెద్దతరహా గలిగియుండెడివారు. అందుచే వారికి ఒక్క జన్మలోనే జీవకళ్యాణము సాధ్యమగుచుండెను. కాని ప్రస్తుతకాలములో జీవులు ప్రపంచములో బహు కఠినవిధమున బంధింపబడి యున్నారు. అట్టి పరిస్థితిలో వీరికి జీవకల్యాణము కలుగగలదని ఆశించుటెట్లు? మానవుని సామాన్యాయుష్కాలములో మనుష్యులకు పరమపదము పొందగల్గుట అసాధ్యమని మనకు తెలిసియుండగా మనవలెనే సాధుసంతు మహాత్ములుకూడ సర్వసాధారణమైన 50, 60 యేండ్ల వయస్సులోనే గతించిపోయిన యెడల, మనము వారిమతము నవలంబించి నందువలన పరమపదమును పొందగలమని నమ్ముకొనుట యెట్లు? వారిమతమును మనము స్వీకరించిననుగూడ వారు మనను తప్పకుండ మధ్యలో విడిచిపెట్టి గుప్తమైపోవుదురు. కావున నిపుడు వచ్చెడి సాధుసంతు మహాత్ములు తమ అనంతరముగూడ వారిమతము జారీయగుటకు తగినయేర్పాట్లు చేయుటకై ప్రతిజ్ఞచేయుట ఆవశ్యకమయ్యెను.

ఈరెండు విషయములును రాధాస్వామీ మతములో సమగ్రముగ సమకూరియున్నవి. స్వామీజీ మహరాజ్ వారు గృహస్థాశ్రమములో నుండిరి. ఆ యాశ్రమము నందుండియే సత్సంగమును జరిపించిరి. మఱియు, వారి గురుముఖుడెప్పుడు నీలోకములోనుండి, యీమతమును నడిపించుచుండునని వారెల్ల కాలమునకు సరిపడ వాగ్దానముచేసిరి. ఈవాగ్దానమే హుజూర్ మహారాజ్ వారు, మహరాజ్ సాహబ్ వారు, సర్కార్ సాహబ్ వారునుగూడ వారు రచించిన పవిత్రగ్రంథములలో నిరాఘాటముగ రెట్టించి చెప్పిరి. ఇంతియగాక నిది సాక్షా

త్పరమపురుషుని వాగ్దానము కాని, సామాన్యమానవ మాత్రుని మాట కాదని గూడ మనకు అనుభవరూపముగా తెలుసును. కావున నీపరిస్థితిలో — మిగిలిన మతాచార్యులు మేము తిరిగి యీప్రపంచమున నవతరించెదమను వాగ్దానమున కట్లుమెట్లున్నను — రాధాస్వామీ మతములోమాత్రి మావాగ్దానముపూర్తిగా నెఱవేర్పబడినదని స్పష్టముగ గన్పించుచున్నది. లోకులు క్రొత్త అవతారపురుషునుగూడ, ప్రాచీనకాలపు స్థలములవంటి స్థలములలోనే లభ్యముకావలయునని యనుకొనుటయు అట్టిస్థలములలోనే వారికొఱకై అన్వేషణలు సల్పుచుండుటయు గొప్పపొరపాటు.

## 107

### సేవకభావము యొక్క నిజలక్షణము.

18 సెప్టెంబరు 1917 :—ఈ మతములోనివారు సేవకత్వముయొక్క నిజలక్షణముగూడ ఉత్పన్నము చేసికొనవలయును. అలక్షణము లేకపోవుట గొప్పలోటు. కొద్దిసుఖము కలిగినంతలో సంతోషపూరితుడై పోవుటయు కొద్ది కష్టము వచ్చినంతలో మహాదుఃఖపూరితుడై పోవుటయు, చాల నీచలక్షణము. ఏపనివిషయములో నైనను సత్సంగి యెప్పుడు నొకకొలతబద్ద పెట్టుకొని పరిశీలించు కొనవలయును. అదేదనగా, ఈపని జరిగినయెడల కాని, లేదా జరుగక పోయినయెడల కాని తనకు భగవచ్చరణములందు భక్తివిశ్వాసములకు అభివృద్ధి గలుగునా లేక లోపమువచ్చునా యను నొకే దృష్టికోణము నుంచుకొనవలయును. ఇదే కొలతబద్ద. ఏవిషయములోనైన కలిగెడి సుఖముకాని, దుఃఖము కాని సత్సంగియొక్క మనఃపరిస్థితిని ఈకొల్తబద్దకన్న పైకి తీసుకొనిపోవుటకాని లేదా దానికన్న క్రిందికి పడవేయుటగాని జరిగినయెడల, నది వ్యర్థమనియే చెప్పవలెను. ఎట్లనగా, సత్సంగి కేదైననొక ఆశతీరినచో, నతడు దానివలన తనకు భగవంతుని చరణములందు భక్తితగ్గకుండ నిలబడుట మాత్రిమేగాక అభివృద్ధి కూడ కావలయును. ఒకకృత్యము సఫలమైనందువలన సత్సంగికి గల్గెడి ఉత్సాహము నిష్ఫలవిషయము. అట్లే ఒకకార్యము విఫలమైనందువలన సత్సంగికి కల్గెడి దుఃఖముకూడా వ్యర్థవిషయమే. ఆసందర్భములో నతడు అసఫలతవలన తనకు భగవచ్చరణములయందు భక్తివిశ్వాసములు తగ్గిపోకుండునట్లు జాగ్రత్తపడుటయే ప్రధానవిషయము. ఈరెండింటినుండియు తప్పించుకొనవలయును. అనగా

అసాఫల్యమువలన గల్గు దుఃఖముమూలమున కాని, సాఫల్యముమూలమున గల్గెడి అత్యుత్సాహము వలనకాని భగవచ్చరణములందు ప్రేమకు లోపము గలుగ కూడదు. ఇదియే సేవకభావము యొక్క నిజలక్షణము. ఈలక్షణముండిన యెడ లనే సత్సంగి హృదయమునందు భగవంతునియెడల భయము కొద్దిగొప్ప నిలబడ గలదు. ఎట్లనగా చక్రవర్తి దర్బారులో నున్నపుడు నవ్వులాటమాటలు వచ్చినను కూడ నెవరైన నవ్వినయెడల నది అపరాధమే యగును. అట్లే చక్రవర్తి యెదుటనున్నపుడు ఎవరైనను తన కుమారుడు చనిపోయిననుకూడ దుఃఖమును లోలోపల నణచిపెట్టుకొనవలెను కాని ఆదుఃఖమును వెలిబుచ్చినయెడల నది యపరాధమే యగును. అదేవిధముగా హుజూర్ రాధాస్వామీ దయాళుని సమ క్షమందు సుఖపరిస్థితిలో ఆనందమగ్నత ప్రకటించినను దుఃఖపరిస్థితిలో దుఃఖో ద్వేగమును కనపర్చినను, యీరెండునుకూడ అపరాధమే. అసలు రహస్యమే మనగా లోకములో జనులకు ఐశ్వర్యముండుట వలనగల్గు సంతోషము వారికి లోకమందఱు వారి ఐశ్వర్యమును గుఱించి చెప్పుకొనుచున్నందు వలన గలిగెడి ఆనందమంత యధికముగ నుండదు.

అట్టివానిని రెండు లెంపకాయలు ఈదవుడమీదను, మఱిరెండు ఆదవుడ మీదను కొట్టవలయునని హుజూరువారు సెలవిచ్చిరి. అది చాలమూర్ఖత్వలక్ష ణము. తెల్పవైనపని యేమనగా, ప్రతివిషయములోను సత్సంగి తనభక్తివిశ్వాస ములకు నష్టముగలుగకుండు లాగున, సుఖపరిస్థితియొక్క అమితోత్సాహము నుండియు, కష్టావస్థయొక్క దుఃఖోద్వేగము నుండియు తప్పించుకొనుచుండ వలయును. సేవకభావమువలన చక్రవర్తి యందుండవలసిన భయమువంటి భయము సద్గురువునందు స్థిరపడును. ఏలననగా, మనభక్తివిశ్వాసము లట్లే యుండిపోకుండ, దినదినాభివృద్ధి నొందుచుండ వలయుననియే, సద్గురుని ఆశ యము కావున నేసత్సంగి ఇట్టి లక్షణమును తన హృదయమున నుత్పన్నము చేసికొనునో అతడే బుద్ధిశాలి, అతడే సత్సంగమువలన లాభము నొందగలడు, అతనికే భగవంతుని దయాకటాక్షముల సూచనలుగూడ లభించగలవు. ఈభావ మెవనిలో మేల్కాంచునో, అతనికి, ప్రతికార్యముగూడ తానుచేయుచుంటినను భావమునకు బదులుగ, నొకసేవకుడు చేయుచుండెనను భావమే హృదయమున నొప్పారుచుండును. దీనత, దాసత్వము, నిర్బలత్వభావమును అతనిలో స్థిరపడి పోవును. అతడు మొదటినుండియు నొక్కభగవత్కృప నిమిత్తమైయే ప్రార్థన

చేయుచుండును. అహంభావముతో పనిచేయుటవలననే మన మాయాపనులలో లిప్తమైపోవుచున్నాము. స్వార్థపరమార్థముల రెండిటిలోను దాసభావముతోనే పనిచేయుచుండిన యెడల, మనకు భగవంతుని దయయు కలుగును, అభ్యాసము గూడా జయప్రదముగ సాగిపోవుచుండును. ఫలము లభించినపుడు సహజముగ సంతోషమైతే గలుగును కాని, ఒకపిల్లవాని కుద్యోగము దొరికినపుడు మొదటి నెలజీతము లభించిన వెంటనే, అతడు ఆజీతము తన తల్లికిచ్చుటకై చాల సంతోషముతో వడిగ పరుగెత్తును కదా. అప్పు డతనికి ఆసంతోషమంతయు తల్లికి ఆనందముగా నుండునని కాని, తల్లి ఆడబ్బుకొఱకై యెదురు చూచుచున్నదని యెట్లుకాదో, అట్లే పరమార్థికూడ తనకు ఆధ్యాత్మికఫలము లభించినపుడు భగవచ్చరణముల వైపునకు పరుగిడును, కాని, అతనిసంతోషము, తనకు అభ్యాసములో జయముసేకూరినదను హేతువుచేగాక, తనకు భగవంతునియందు భక్తి విశ్వాసములు వృద్ధియై, భగవత్ప్రసన్నత సంపాదించుకొనుటకు అవకాశము చిక్కినదను హేతువుచేతనే గల్గును. ఇట్టి ప్రవర్తనవలన మొదటలో "అహం" ఉండదు చివరను మమకారము నుండదు. ఎవనికైన నీలక్షణములు బయల్వెడలనియెడల, సత్సంగ రిజష్టరులో 10, 15 యేండ్లనుండి తనపేరు వ్రాయబడి యున్నంతమాత్రముచే లాభించున దేమియులేదు.

ఈలక్షణము ముఖ్యముగ పరమార్థలాభమునకై ఆవశ్యకము. సత్సంగములోని యేర్పాట్లు చేయునట్టి యుద్యోగస్తులకు ఈలక్షణము మఱింత యెక్కువ ఆవశ్యకము. చిన్నచిన్న పారమార్థిక సహాయములు లభించినందులకే కృతజ్ఞతాప్రకటనము చేయుచు, ప్రతిస్థలములోను తనకు స్వార్థవిషయములలో భగవత్సహాయము లభ్యమగుచున్నట్లు ప్రకటన చేయగోరు వానిపరిస్థితి చాలనీచమైనది. భగవంతునికి మీకృతజ్ఞతను పొందవలెనను ఆసలేదు. భగవంతుడు ప్రధానముగ కనిపెట్టునదేమగా, జీవునికి ఐహికసాఫల్యము మూలమున భక్తి విశ్వాసము లెంతవఱకు వృద్ధియైన వనువిషయ మొక్కటే. ఇట్లు ప్రకటనచేయు వారికిని,కొద్దికొద్ది ప్రాపంచిక నష్టములకై దుఃఖాక్రాంతులగు వారికిని ఇరువురికినిగూడ గట్టిగ రెండేసి చెంపకాయలు తగల్చవలయును. పిమ్మట దివ్యేచ్ఛచే శబ్దముతీసి చదువుమని సెలవిచ్చిరి. ఈక్రిందిశబ్దము తీసి చదువబడినది.

సద్గురు సరన గహో మేరే ప్యారే.

పిమ్మట హుజూరువారీశబ్దము కంఠస్థముచేసికొనతగినదని సెలవిచ్చుచునందులో ముఖ్యముగా చివరనుండి మూడవద్విపదకు చాలప్రాధాన్యమునిచ్చిరి.

## 108

### సత్సంగులలో తప్పుడాశలు, తప్పటభిప్రాయములును—పరమపురుషుని సమర్థతా లక్షణము.

17 సెప్టెంబరు 1917 :— తమకు సద్గురువులభించిరి కాబట్టి, మఱి తమ కింక చేయవలసిన దేమియు లేదనియు, తమ కెట్టిలోపము నింక లేదనియు, తమపని అంతయు నెఱవేరిపోయిన దనియు సత్సంగు లభిప్రాయపడుచుందురు. సద్గురువు లభించుటయనగా, వెళ్ళి ఉపదేశము తీసికొని, భేంటుఇచ్చి దండప్రణామము లాచరించుటమాత్రమే యని వారి యభిప్రాయము. తమకు అభ్యాసము చేయ వలసినయవసరము లేదనియు, స్మరణ, ధ్యాన భజనాభ్యాసములును, రిత్సంగము, సేవయు చేయవలసినదని చెప్పినసలహా ప్రకారము అభ్యసించుట యవసరము లేదనియు వారనుకొనుచుందురు. వారు, "అయ్యా అభ్యాసము చేయించిన మీదటనే ఉద్ధారమిచ్చినయెడల వారిచ్చిన దేమున్నది? అభ్యాసమే చేయ వలసివచ్చినయెడల నీమతములోనే చేరుట దేనికి? ఈమతములోచేరి అభ్యాసము చేసినపిమ్మటనే ఉద్ధారము నిచ్చినయెడల, వారుచేసిన యుద్ధారమేమున్నది," అని చెప్పుచుందురు. ఏదైన నొక ప్రాపంచిక కష్టము వచ్చినపుడు, ఒకయుత్తరము వ్రాసిపంపుదురు, అంతకన్న నెక్కువ కావలెనన్నచో, ఒక ఇంటర్వ్యూ (Interview) తీసికొందురు. అభ్యాసము చేయవలయు నన్నచో సర్వసమర్థ పురుషుని సమర్థతకు అమర్యాద చేసినట్లగుననియే నిజముగ వారి అభిప్రాయము. ఇంక నెక్కువ మాట్లాడినచో నీక్రిందిరకము శబ్దములను ప్రమాణముగ చదువు చుందురు :

"సరన్ పడే కీ లాజ్ ప్రభు రాఖో రాఖన్‌హార్"

ఇంకను పైగా తమ్మును ఒడిలో కూర్చుండబెట్టుకొని తినిపించవలసిన హక్కు తమకున్న దెంచుకొనుచుందురు. నే నొక పసిపిల్లవాడ ననుచుందురు. ఏదైన నాపత్తు వచ్చినపుడే పసిపిల్లవానివలె నైపోవుదురు కాని అభ్యాసమును గుఱించి ప్రశ్నవచ్చినపుడు లోకములో నొకసేనానాయకునివలెనే ప్రవర్తింతురు. నిల కడలేకుండా నెప్పుడెట్లుతోచిన నట్లు పరిగిడుచుందురు. ఏదైనకష్టము వచ్చినపు డొకయుత్తరము వ్రాయుచుందురు. ఈవిధముగ అభ్యాసమునుండి పూర్తిగా విముఖులైపోయి, ఏదైనకష్టము వచ్చినపుడు మాత్రము సద్గురువునందు దోషా

రోపణము చేయుచుందురు. పైగా ఈక్రిందివిధమైన శబ్దములను చదువుట ప్రారంభించుదురు.

"సంతమతే కో లజ్జా ఆవే జో నహి మేరా పూరన కామ్"

"మో కో దుఖీ ఆప కస దేఖో"

మరియు, "భగవంతుడు సర్వసమర్థుడుకదా, నాకీఆపత్తు ఏల వచ్చిపడినది ? ఇపుడు నాకు, ప్రార్థించినచో సహాయ మెందుకురాదు," అని యడుగుచుందురు.

జీవులందఱును లోపభూయిష్ఠులు. అందఱును అనేక విధములైన దోషములు లోపములతోను నిండియున్నారు. ఆదోషలోపములకు తగిన చికిత్సచేసి, వానిని పోగొట్టుట ఆసమర్థపురుషుని సమర్థతవలననే కావలసియున్నది. మన కా లోపములను పోగొట్టుకొనుటకై నేర్పిన అభ్యాసమును సంపూర్ణమైన కర్తవ్య నిర్వాహక భావముతో చేసికొనుట ధర్మము. తనకుమారునితో నొకసేరు కట్టె పుల్లలు పట్టుకొనిరమ్మని తండ్రి చెప్పినపు డతడు రెండుసేర్లు తెచ్చి తండ్రికప్ప చెప్పినట్లైతే అది కర్తవ్యపరాయణత యని అనిపించుకొనును. అవ్విధముగనే భగవంతుడు మన లోపనివారణ నిమిత్తమై యొకసాధనను చెప్పి దానిని రోజు నొక అరగంటసేపు అభ్యాసము చేయవలయునని ఆజ్ఞాపించినపుడు మనము అర గంటకు బదులు గంటన్నర అభ్యాసముచేసినట్లైతే అదియే కర్తవ్యపరాయణత. ఆసర్వసమర్థ పురుషుడు చంచలచిత్తులుకారు, సంపూర్ణమైన పరిజ్ఞానము కలవారు. ప్రతిజీవుని పరిస్థితిని, లాభనష్టములను పూర్తిగ నెరుగుదురు. లోకములో నెవ రైనను వైస్రాయ్ (Viceroy) కావలెనన్నచో నతడు మధ్య శ్రేణులెన్నియో దాటి వెళ్ళవలసి యుండునుకదా. మొట్టమొదట పాఠశాలోవద్ద చేరి చదువుకొన వలయును. తరువాత పండితునివద్ద, పిమ్మట మాష్టరుగారివద్ద, అటుపిమ్మట నొక ప్రొఫెసరువద్దను చేరి చదువుకొనవలెను. ఆతర్వాత సామాన్యమైన నౌఖరీతో మొదలుపెట్టి, మెట్టుపై మెట్టుగా పైకెక్కుచు చిట్టచివరకు ఉన్నతోన్నత పదవికి చేరుకొనవలయును. ఇది యెంతకష్టమో, దీనిని పొందుటకై మధ్య నెన్ని మెట్లు దాటవలసియున్నదో చూడుడు. ఈలోకములోని సామాన్యపదవిని సంపాదించుటకే ఇన్ని మధ్యమెట్లు దాటవలసి యున్నపుడు పారమార్థిక పదవిని సంపాదించుట కెన్ని మెట్లు దాటవలసియుండునో చెప్పుటకే సాధ్యముకాదు. మనము పరిపూర్ణపదవిని పొందుటకై ఆశపెట్టుకొన్నాము. అది పొందులోపున వేలకొలది

మెర్గిన్నవి. జీవుని బంధరహితునిగ చేయవలయును. నిద్రపోవుచున్న మనస్సును మేల్కొల్పవలయును. మరల దానిని నిద్రపోవునట్లు చేయవలయును– ఇత్యాది.

మన మేపనిచేయుచున్నను కూడ, దాని మూలముగనే సంత్ సద్గురువు మన కీప్రపంచమునందు విరక్తిపుట్టునట్లుచేసి, ఆవిధముగ క్రొత్త పారమార్థికాభివృద్ధిగల్గించు మహాసమర్థత గలవారు. అందుమూలముగనే మనను పరమార్థములో నొకమెట్టు పైకిఆరోహింప చేయుచుందురు. ఉదాహరణకై ఒకమనిషికి మిఠాయితినుట యందాసక్తి యున్నదనుకొనుడు. ఈవాంఛతో ప్రవర్తించుట పరమార్థహాని అనివారికి తెలుసును. కాని భగవంతు డతనిని ఈవాంఛలోనే ప్రవర్తించనిచ్చి, అతనికి దుర్గంతమూలమున గాని, మఱొకవిధానముద్వారా కాని, మళ్ళీయెప్పుడు నతనికావాంఛలో ప్రవర్తించుటకు భయము వేయు నంతగా మిఠాయియందు విరక్తిపుట్టునట్లు చేయగలడు. ఆసమర్థప్రభుని సమర్థత అవ్విధముగ నుండును, కాని ఒకఅసమర్థజీవుని హృదయమున పుట్టిన ప్రతివాంఛయు పూర్తిచేయుటయే వారిసమర్థతయని అనుకొనరాదు. ఈవిధముగ నొకఅసమర్థజీవునికి దాస్యముచేయుట వారి అసమర్థతను సూచించును కాని సమర్థత నెన్నడును ప్రకటించదు. ఒక అసమర్థునికి దాసుడు మఱొక అసమర్థుడే యగును, కాని సమర్థుడు అట్లు కానేరడు. ఇది వారి సర్వసామాన్యమైన సమర్థతా లక్షణము.

## 109

సత్సంగములో నున్నవారికి సద్గురువుచెప్పిన సాధనలను అభ్యాసము చేసినపుడే లాభముకల్గును.

18 సెప్టెంబరు 1917 : ఈమనస్సు బహు దుష్టస్వభావము గలది. ఇది ప్రాపంచిక కార్యములు చేయునపుడు, వానిలో సంపూర్ణముగ మగ్నమైపోవుచునే యుండును, అయితే దానికెప్పుడైన సత్సంగములో నుండుటకు సావకాశము లభించినప్పుడుగూడ, అది అలౌకికవిషయములను గుఱించియే అనగా యేదోసైకిలు, 2 చక్రములు గలదో, 3 చక్రములు, లేక నాల్గుచక్రములు గలదో తయారు చేయవలయునని కాని లేదా ఇత్యాది మఱొక ఆలోచనలను కాని చేయుచునే యుండును. రాత్రింబవళ్ళు అవేఆలోచనలలో కొట్టుకొని పోవుచుండును. దీనివలన నేమిలాభముండునో ఆలోచించుకొనుడు. భగ

వంటుకు ఇతనికి సత్సంగములో భోజనమునకు, బట్టలకు, వసతికిని సామాన్య విధమైన ఏర్పాట్లుచేసి యుండెను. అయినను కూడా, ఈమనస్సు సత్సంగములో నుండుచు, ప్రాపంచిక చింతలనే పెంచుకొను చుండినయెడల, నది స్మరణ, ధ్యాన భజనలను అసలే చేయలేదు. ఈవిధముగనైతే దానికి ఇహము పోవుటయేగాక, పరముకూడా నష్టమైపోవు చున్నదనియే చెప్పవలయును. అట్టిమనిషి ప్రపంచమును విడిచిపెట్టినందువలన లాభమేమి? అతనికి ఐహికమైన ఆనందమూలభించలేదు, ఆధ్యాత్మికలాభమూ అసలే చేకూరలేదు. మీరు లోకములోనే ఉండిపోయి, గొప్పఐశ్వర్యమును, పేరు ప్రఖ్యాతులను సంపాదించుకొన్నందు వలనను వేలాదిజనులు మిమ్ములను శ్లాఘచేయుచుండి నందువలనను మీకేమిలాభము గల్గునో కొద్దిగా ఆలోచించుకొనుడు. దానివలన మీకేమైనను ఆధ్యాత్మిక లాభము చేకూరుచున్నదా? ఏదైన నొకస్థలములో ఘోరాంధకారముగనుండి, అచటికి ఒకకాంతి ప్రసరించినచో, అచ్చట రెండు ఆవరణలేర్పడును, ఒకటి ఆకాంతిగల ఆవరణము, రెండవది దానినంటి చుట్టుప్రక్కలనున్న చీకటిగల ఆవరణమును. అట్లే సంత్ సద్గురువు ప్రకటమైనపుడు గూడ రెండు వాతావరణములు తయారగును, ఒకటి ఘోరాంధకార మయమైనది. అనగా సంత్ సద్గురువునిగురించిన వార్తగూడ తెలియని స్థానము. రెండవది తేజోమయ మైనదియు అనగా వారిసత్సంగ వాతావరణము గలస్థలము. ఎవరైనను అట్టి తేజోమయ వాతావరణములోనికి వచ్చి నిర్లక్ష్యముగ నిద్రపోయినయెడల, అనగా సద్గురువు చెప్పిన అభ్యాసము చేయకుండ నుండినయెడల, నతనికిని చీకటికోణములో నుండిపోయినవారికిని భేదమేముండును? కావున తేజోమయ వాతావరణములో నుండుచు సంత్ సద్గురువు చెప్పిన అభ్యాసములను చేయుచుండినవాడే మహాదృష్టశాలి.

## 110

### సంత్ సద్గురువు దుర్లభరత్నము.

18 సెప్టెంబరు 1917 :—"గురు ప్యారే కా సంగ బడభాగీ పాయ్[1]" వగైరా శబ్దములనుబట్టి సద్గురువును గురించి రెండు ముఖ్యవిషయములు

1 ఎవరో మహాదృష్టశాలికే ప్రియమైన సద్గురువుని సాంగత్యలాభము గల్గును, అని దీని అర్థము. ఇది ప్రేమబానిలో నొక శబ్దముయొక్క పల్లవి.

బోధపడుచున్నవి. మొదటిది, వారు బహుదుర్లభ పురుషులనియు, రెండవది, వారివలన మహాలాభము గలుగగలదనియు. ఈ రెండు విషయములును లభించుట కష్టము. ఒకప్రిమాద మేమనగా జీవుడు విమర్శ చేయకుండగనే ఎవరినో ఒకరిని గురువుగ స్వీకరించవచ్చును. రెండవది సరియైన గురువే లభించినను. వారివలన జీవుడు పొందతగినలాభమును తీసికొనలేకపోవచ్చును. ఈవిధముగ రెండురకములుగా పొరపాట్లు చేయవచ్చును. అట్టి పురుషుడు లభించుట వారి అనుగ్రహముమీదనే ఆధారపడియుండును. ప్రయత్నమయు పడనక్కరలేకుండగనే సద్గురువు హఠాత్తుగా దొరికినను దొరకవచ్చును. లేదా ఆజీవితాంతము వారికొఱకై అన్వేషించుచునే యుండినను వారు లభించకపోవచ్చును. జీవునికి తన అశక్తత అనేకవిధములుగ బోధపడుచుండును కావున తనవంటి చేతకాని నిర్బలజీవులకు అట్టి మహాపురుషుడు లభించుటెట్లు అనియు, లభించినను గూడ వారిని తెలిసికొనగల సామర్థ్యము తన కెక్కడిదనియు జీవుడు నిరుత్సాహపడిపోవచ్చును. మధురపానీయము, చేదుపానీయముగూడ మన మెఱుంగుదుము. కాని ఒకకుండెడు మధురపానీయమును, ఒకకుండెడు చేదుపానీయమును వేర్వేఱుకుండలలో నుండినపుడు వానిని కేవలము కంటితో మాత్రమే చూచి యేది చేదో యేది మధురమో తెలిసికొనుట సాధ్యముకాదు. వానిని రుచిచూడనిదే చెప్పలేము. అసలుబంగారము గిల్టుబంగారముకూడా మనకు తెలుసును. కాని గిల్టుబంగార మేదో, అసలుబంగార మేదో తెలిసికొనవలెనన్నచో గీటురాయితో పరిశీలించియే చెప్పవలెను కాని కంటితో చూచినంతమాత్రమున తెలియదు. ఎవనికైనను, ఈవిషయము లన్నియు నాలోచించుకొన్నమీదట, జీవునికి, సద్గురువు లభ్యమగుటయే మహాకష్టమనియు, ఒకవేళ లభించినను వారిని ఆనవాలుపట్టుట, అనగా నిజమైనగురు వెవరో, దొంగగురు వెవరో తెలిసికొనుట అసాధ్యమనియు ననిపించును. తీపినీ రెద్దియో, చేదునీ రెద్దియో, రెండిటిని రుచిచూచిన పిమ్మటనే యెవరైనను చెప్పగలరు. అటులనే అసలు బంగారమును, గిల్టుబంగారమును, రెండిటిని చూచినవాడే యేదేదో చెప్పగలడు. కావున నిజమైన సంత్ సద్గురువునే యెన్నడు చూడనట్టి జీవుడు నిజమైనసద్గురు వెవరో అబద్ధపు సద్గురు వెవరో యెట్లు ఆనవాలు పట్టగలడు? అయితే, సంత్ సద్గురు వొక్కదుర్లభవస్తువుమాత్రమేగాక, అద్భుతలాభమును నిచ్చువారునుగూడ. ఏదైన పదార్థము కేవలము దుర్లభమేఅయి, లాభప్రదముకానియెడల, మానవుడు దాని నన్వేషణచేయకుండ విడిచిపెట్టవచ్చును. మంచుగడ్డలలో తిరుగునట్టి మైనా

పిట్ట చాల అరుదైనదే. కాని, దానివలన లాభమేమియు లేనందున దాని నన్వేషించుటకొఱకై యెవరును శ్రమతీసికొనరు. కాని సద్గురువు మహాశ్రేయస్కరవస్తువుకాబట్టి జీవుడు వారివిషయములో అశ్రద్ధగ నుండిపోజాలడు. అందుచే సంత్ సద్గురు వెచ్చటనైన నున్నజాడ తెలిసినపుడచ్చటికి జిజ్ఞాసు భావముతో వెళ్ళి యథావిధిగా సత్సంగము నాలుగైదు మాసములపాటు చేసికొని, తనకు ప్రాపంచిక బంధనములు తగ్గుచున్నవో లేదో పరిశీలించుకొనవలెను. తన కేమియు వ్యత్యాసము కనిపించనియెడల, వారితో మొఱపెట్టుకొని, తిరిగి వారు చెప్పిన సాధనలను శ్రద్ధాపూర్వకముగ విని తెలిసికొని, ఆప్రకారము పరిపూర్ణ శ్రద్ధతో ఆచరించుటకు ప్రయత్నించవలెను అప్పుడుకూడా తన కేమియు లాభము కనపడనియెడల, ఆస్థలమును విడిచి మఱొకచోటికి పోయి అన్వేషణ సాగించుకొనవచ్చును. ఆ నిజమైన ప్రభువు, తనజీవు డివ్విధముగ నిజమైన ఆతురతతో నిరంతరాన్వేషణ చేయుచుండినట్లు కనిపెట్టి చూచి, అతనిని తమంతట తామేవచ్చి రక్షింపకుండ నుండజాలరు. 3, 4 సంవత్సరముల కాలము జీవుడు మోసపోయినను మోసపోవచ్చును కాని అంతకన్న నెక్కువ కాలము మోసము జరుగనేరదు. రెండవస్థలమునకు వెళ్ళి అచ్చట చిత్తశుద్ధి, భగవచ్చరణములవైపు ఆసక్తి, తదేకదీక్షతో భగవద్ధ్యానము, సంత్ సద్గురువు నందు ప్రేమయు, ప్రపంచమునుండి వైరాగ్యమును (ఇవన్నియు సంత్ సద్గురువునకు చిహ్నాలు) ఇవన్నియు చేకుఱుచున్నవో లేదో చూచుకొనవలయును. మనము న్యాయబుద్ధితో నిట్టి అన్వేషణ చేయుచున్నపుడు పొరపాట్లు చేసినను ప్రమాదము లేదు.

సంత్ సద్గురువు దుర్లభపురుషుడైనందువలన భయపడనక్కఱలేదు. రత్నములు, మాణిక్యములు, బంగారముకూడా చాలలాభము కల్గించువస్తువులే. లక్షలకొలది మనుష్యులు వాని నన్వేషించునిమిత్తమై తుపాకులు తీసుకొని బయల్వెడలుచున్నారు. మంచుపర్వతప్రాంతములలోను, గనులలోను చాలమంది వానికొఱకై ప్రాణములను కోల్పోవుచున్నారు. లాభప్రదమైన కృత్యములన్నిటిలోను ఈవిధముగ ప్రమాదములుకూడ నుండుచునే యుండును. లౌకిక విషయముల నిమిత్తమైన అన్వేషణయే ఇంతప్రమాదభూయిష్టముగ నున్నపుడు సంత్ సద్గురువు అంతటి అలభ్యపురుషుని అన్వేషణవిషయములోనైతే మనము ప్రమాదములను కోరుకొని సహించవలసినవిధముగనే ప్రవర్తించవలసియున్నది.

వారు లభించినచో. వారేమి చెప్పిన నదియే చేయుచుండవలయును. వారు కూర్చుండుము అని చెప్పినచో, కూర్చుండవలెను, నిలుచుండుమన్న యెడల నిలుచుండవలసినదే. వారు నీరు పట్టుము అన్న యెడల నీరుపట్టవలయును. వారు స్మరణధ్యానములను చేయుమనినయెడల నట్లే చేయవలయును. వారు భజన చేయుము అన్నచో, భజనాభ్యాసము చేయవలయును. సేవ చేయుమన్నచో సేవ చేయవలయును. అనగా వారేమి చెప్పినను, ఆపని చేయుటలో నెంత మాత్రము లోపము చేయకూడదు. వారి యందుగాఢమైన భక్తివిశ్వాసములు పుట్టించుకొనవలయును.

మనమొకవేళ తప్పుడు మనిషినే సంత్ సద్గురువుగ స్వీకరించి, ఆయన వలననే పైనవ్రాసిన విషయములన్నియు మనకు తటస్థించినవి. అని అనుకొన్నను కూడ, మన కంతటిలో నేమియు హానియుండదు ఇకముందు ఆతప్పుడు సద్గురువునకును, నిజమైన సంత్ సద్గురువునకును వ్యత్యాసము ప్రకటించగల అనుభవ మెద్దియైనను మనకు తప్పక కలిగెడిపరిస్థితిగూడ రావచ్చును. అయినను, అట్టి సందర్భములను గురించి భగవంతుడే స్వయముగ కనిపెట్టగలడు. జీవునికృత్యము జిజ్ఞాసుభావముతో తన శక్తివంచన లేకుండ ప్రయత్నము చేయుచుండుట మాత్రమే. నిజమైన సంత్ సద్గురువు లభించినపిదప, సేవకుని కడుగడుగునకు చమత్కారములపై చమత్కారములు కనపడుచునే యుండునని, మాలానారామ్ గారొక కవితలో సెలవిచ్చియున్నారు. తప్పుడుమనిషిని సంత్ సద్గురువుగ స్వీకరించి చివరవరకు మోసపోవుట మిక్కిలి అసంభవ విషయము. అట్టి అన్వేషణచేయుచు నొకవేళ చనిపోయినను అది మహాశౌర్యముతో కూడిన మరణమగును. భగవంతు డట్టివాస్తవమైన సత్యాన్వేషికి లభ్యముకాని యెడల మరెవ్వరికి లభ్యముకాగలడు ? సత్సంగియొక్క ప్రవర్తన యెప్పుడు నివ్విధముగనే యుండవలయును.

## 111

లోకమునకు సంతులకును బద్ధవైరము.

20 సెప్టెంబరు 1917:— సారబచన్ గద్యభాగములో 216 వ వచనములో, బ్రాహ్మణులకును, సంతులకు నింతవఱకు నెన్నడు కలియలేదు, ముందు కూడ నెన్నటికిని కలియనేరదు, అని వ్రాయబడియున్నది. దీనికర్థము సంతులకును బ్రాహ్మణులకును నేదైన సహజశత్రుత్వ మున్నదని కాదు. దీనిఅర్థమేమనగా,

బ్రాహ్మణులు జీవులను కర్మకాండలోను, బాహ్య విషయములలోను తగిల్చిరనియు, సంతులందుకు వ్యతిరేకముగా, జీవులను బాహ్య విషయములనుండి మళ్ళించి ఆంతర్యసాధనయందు లగ్నముచేసిరనియు మాత్రమే. ఈవిధముగా వారిరువురికిని శిక్షావిధానములోను సిద్ధాంతములలోనే ప్రాతికూల్యమున్నది. సంతులకు బ్రాహ్మణజాతితో విరోధములేదు. బ్రాహ్మణుల శిక్షావిధానమును మాత్రము వారంగీకరించలేదు. కాని బ్రాహ్మణులైతే యెప్పుడును సంతుల విషయములో వ్యక్తిగత విరోధము పెట్టుకొనిరి కాని సంతుల శిక్షావిధానము నెన్నడు వారు విమర్శించలేదు. ఉదాహరణయేమనగా, కబీర్‌సాహబ్ వారిని యమునానది మున్నగువానిలో త్రోయించిరి. సంతులకును, బ్రాహ్మణులకును మధ్య గల యీవిరోధపద్ధతి ఒక్క బ్రాహ్మణులతోనే ఆగిపోకుండ నింక చాల దూరము వ్యాపించెను. ప్రపంచమునకు సంబంధించిన యేయేపదార్థములు, బంధు వర్గములయందును జీవునికి ప్రీతియుండునో అట్టివాని యన్నిటియందు ప్రీతినివిడిచి పెట్టుమని సంతులు జీవులకు బోధించిరి. అందుచే నాయాపదార్థములు, బంధువులుగూడ బ్రాహ్మణులవలెనే సంత్ సద్గురుని శిక్షావిధానముతోనేగాక సంత్ సద్గురువుతో వ్యక్తిగతముగ కూడ విరోధమువహించిరి. సంతులీక్రిందివిధముగ శబ్దములను రచించిరి :—

పహలే బంధన దేహ కా, దూసర తిరియా జాన్ ।
నాతీ కే కహిం నాతీ హోవే, ఫిర్ కహో కౌన్ ఠికాన్॥

అర్థము:—జీవునికి శరీరమే మొదటిబంధనము, రెండవబంధనము భార్య, ఆతరువాత నతనిబంధువులును, ఆబంధువుల బంధువులును. ఈవిధముగా బంధనములు లెక్కలేకుండా పెరిగిపోవుచున్నవి.

ఈవిధముగా జీవుని కేయే సాంసారిక విషయముల యందును, జీవులయందును ప్రీతియున్నందువలన హానికల్గుచున్నదో, ఆయావిషయముల నుండియు, జీవుల నుండియు, ప్రేమను విచ్ఛిత్తిచేయుటకై సంతులు బోధించిరి. సంతు లేజీవుని యందైనను, అతనికర్మభారము నశించినందువలన నైతేనేమి, మఱొకకారణము చేతనైతేనేమి, అనుగ్రహముగల్గి, వాని నీజననమరణ జాలమునుండి తప్పించదల్చుకొని ఆసందర్భములో నతని మనస్సునకు నచ్చునట్లుగా, ఈసంసార మొక భ్రమజాలమనియు, నిందుండి దూరముగ పోవలయుననియు బోధలుచేసినవుడెల్ల

నాజీవుని బంధువులును, సాంసారిక విషయములును సంత్ సద్గురువు పైన ద్వేష మువహించి యెదురుతిరిగి పారమార్థిక కార్యక్రమమే అంతయు బహుశః ఒక భ్రమ జాలమేమో యను విధముగ నాజీవుని మనస్సున ననేక భ్రమలను పుట్టించుచుందురు. మొదటలో "నీత డెవరికో ప్రేమభక్తులు చేయుట మొదలు పెట్టె"ననియు తరువాత "ఆయన సంత్ సద్గురువు అగునో కాదో" యనియు, అనుచు నితని మనస్సున సందేహములు పుట్టించు చుందురు. సంతు లీజగత్తం తయు నొక భ్రమజాలమని యన్నందున, నీప్రపంచము సంతులే యొకభ్రమ జాలమనెడి భ్రాంతిని సంతులవిషయములో జీవుని మనస్సులో గట్టిగకల్పించును. ఈవిధముగా బ్రాహ్మణులవలెనే జీవునియొక్క సమస్త బంధువర్గము, ప్రాపంచిక పదార్థములుగూడ సంతులమీద వ్యక్తిగతముగ విరోధించుచున్నవి. కావున నీవిరోధము ఒక్క బ్రాహ్మణులతోనే ఆగిపోలేదు.

## 112

### అభ్యాసముయొక్క ఆవశ్యకత.

21 సెప్టెంబరు 1917:— "కబీర్ సాహబ్ వారు జీవులకు సారశబ్దమును ఉపదేశించినతోడనే వారికి ముక్తికూడ కలుగజేయుచుండెడి వారని కబీరువారి "బీజకసార్" అనెడి గ్రంథములో వ్రాసియున్నదికదా. మఱి మాకీయభ్యాసము చేయవలసిన యిబ్బందికూడ నేలకల్పించ బడిన"దని ఒకరు విన్నవించుకొనిరి. అంతటహుజూర్ వారు "కబీర్ సాహబ్ వారు నిజముగ నట్లు వ్రాసినచో తప్పక నా మాట మన్నించవలసినదే కాని ఇది బీజకసారములో నున్నదని చెప్పబడు చున్నను, అది కబీర్ సాహబ్ వారిచే వ్రాయబడలేదు. ముక్తిపదమునకు అర్థము కూడా తెలియనట్టియు, ముక్తిని స్వయముగా పొందనట్టియు, కేవలము పుస్తక విక్రయముచేసి డబ్బుప్రోగుచేసి కొనుటయే ప్రధానోద్దేశము గల్గినట్టియు, నొక ప్రాపంచిక జీవునిచే నిది వ్రాయబడినది" అని సెలవిచ్చిరి.

కబీరువారు సారశబ్ద మెవనికిలభించెనో అతడు ముక్తిపొందెనని సెలవి చ్చిరి కాని సారశబ్దము ఉపదేశింపబడినవాడు ముక్తిపొందెనని సెలవియ్యలేదు. రాధాస్వామీ దయాళునికన్న శ్రేష్ఠమైనగురు వింతవఱకు జగత్తులో ప్రకటము కాలేదు, ఇప్పుడులేడు, ఇకముందు కాబోడను విషయమును జ్ఞాపకముంచు కొనుడు. వారు సెలవిచ్చిన అభ్యాసముకన్న పరిపూర్ణమైనట్టి గాని సుకరమైనట్టి

గాని అభ్యాస మింతవఱకెవరు నుపదేశమియ్యలేదు. ఇచ్చటకు శక్యమును కాదు. ఇకముందెవరు నియ్యనులేరు. ఎవనికైనను పరమార్థవిషయములో ఎప్పుడేదిలభించినను ఈ అభ్యాసము మూలముననే లభించవలయును. ఆధ్యాత్మిక సాఫల్యము సంపాదించుకొనుట కిది తప్ప మఱొక పారమార్థిక మార్గమే లేదు. తులసీసాహబ్ వారు, "దూధ్ ఛటీ కా నికసే భాఈ" అనగా పుట్టినతర్వాత ఆఱవరోజున త్రాగిన తల్లిస్తన్యమును వెళ్ళగ్రక్కవలసి యుండునని సెలవిచ్చిరి. దీనినిబట్టి ఊరక సారశబ్దము నుపదేశముచేసిన వెంటనే ముక్తిలభించునంత సులువైన పని కానేరదు. కావున అభ్యాసము ముఖ్యావసరము. ఈయభ్యాసము చేయుటవలన తులసీసాహబ్ వారు చెప్పినట్లుగా చంటిపిల్ల పుట్టిన ఆఱవరోజున త్రాగిన పాలతాలూకు దానిప్రేగులలో నుండిపోయి చిట్టచివర మరణసమయములోనే శరీరమునుండి బహిర్గతము కావలసినట్టి మూలమలముకూడ పైకి త్రోయబడిపోవును. "కబీర్ బీజకసార్" యొక్క గ్రంధకర్తకన్న నీసంతుమహాత్మునివాక్యము ఎక్కువ విశ్వాసయోగ్యమైనది.

లోకములో నన్నిటికన్న తక్కువసృష్టి ధాతువులని మనకు తెలుసును. అవి లెక్కకు చాలతక్కువగనే యున్నవి. వానిలో జ్ఞానగ్రహణశక్తియేమియు లేదు. చలనమునులేదు. అయినను కూడా వానిలోవానికి పరస్పరభేదములు చాలగలవు. ఎట్లనగా, ఇనుము, బంగారము, వగైరాలను చూడుడు. వానిపై తరగతియగు వనస్పతులలో నెన్నియో తెగలున్నవి. ఒకేతెగలోకూడా వ్యత్యాసము లెన్నియో గలవు. ఫలపుష్పము లిందులో చేరును. వీనిలో ప్రాణము స్పష్టముగ కనబడుచున్నది. అయిన నివి చలనశీలములు కావు. వీనివలన గల్గు లాభములలోగూడ చెప్పనలవిగానన్ని భేదములున్నవి. ఒకచిన్న మొక్కపైన బయల్దేరునట్టి గులాబిపువ్వువలన నెన్నిలాభము లున్నవో చూడుడు. తుమ్మచెట్టునకును దీనికిని పోలికయేలేదు. ఆచెట్టువిషయమే వేఱు. వనస్పతులకన్న పైకి వెళ్ళినచో, జంతువులు వచ్చును. రొచ్చుకాల్వలోని పురుగుమొదలుకొని మానవునివఱకుగల ప్రాణులన్నియు నందులోచేరును. వానివలనగూడ చాల లాభములు గల్గుచున్నవి. మానవుడు అందరికన్న శ్రేష్ఠుడు. మానవునిలోగూడ లెక్కలేనన్ని తెగలున్నవి. ఈమానవులలో పరమార్థముకొఱకై ఆసక్తిగల మానవుడు తిరిగి సర్వశ్రేష్ఠుడు. అయితే అట్టిమానవులలో తమఆసక్తికి తగిన ప్రయత్నము చేయువారు చాల తక్కువమంది యుందురు. తిరిగి వారిలో సంతో

సద్గురువు లభించి, అట్టి గురువువద్ద ఉపదేశముపొందినవారింకను తక్కువమంది యుందురు. సంత్ సద్గురువువలన లాభముపొందుపద్ధతి తెలిసినట్టియు, అట్లు వారివలన లాభముపొందుచున్నట్టియు మానవులు అంతకన్నను చాలతక్కువ మంది యుందురు. కావున నెవన్నికైన నతని మహాదృష్టమువలన నుపదేశము లభించినయెడల నతని కీసృష్టిలో నెన్నిజంతువుల నతిక్రమించిన మహోత్తమగతి లభించెనో ఆలోచించుకొనుడు. అట్టిపరిస్థితిలో నెవరైన నాయుపదేశమువల నను, సద్గురునివలనను లాభమును పొందకుండినచో, అదియెంత మహాదుర దృష్టము. కావున మీరు ఈ యభ్యాససాధనమీకు లభించుటయు, సంత్ సద్గురువుతో సంయోగముగూడ గల్గుటయు, నొక మహాభాగ్యమని తెలిసి కొనుడు. ఈయభ్యాసమును నిరర్థకమైనదని అనుకొనకుడు, సంత్ సద్గురువు వలన లాభమును పొంది మీజన్మలను సఫలముచేసికొనుడు. దీనిపైన నొక శబ్దమును దివ్యేచ్ఛకు తీయించగా, నీక్రిందిశబ్దము వచ్చెను.

జీవ చితాయ రహే రాధాస్వామీ

ఈశబ్దము సారవచనములో ఆరతిశబ్దములలో మొట్ట మొదటిది. ఈశబ్దముమధ్య నీక్రిందిచరణ మున్నది.

అన ధన ఔర్ సంతాన భోగ రస, జగత భోగ ఔర్ మిలా జోగ రస॥

## 113

సద్గురువును గుఱించియు, మతమును గుఱించియు యథార్థజ్ఞానము కల్గుటకు బాహ్యావిషయములను విడిచి ఆంతర్యమున ప్రవేశించవలయును — నిజమైన మతము — సత్సంగియొక్క ప్రవర్తన — సత్సంగవచనములను ప్రతి వ్యక్తియు తనకే వర్తింపచేసుకొనవలెను.

22 సెప్టెంబరు 1917:—మనమందఱము చాల సంకుచితమైన దృష్టి గల వారము. పారమార్థికవిషయముల నవగాహనచేసికొనుటలో మనకు త్రికమక లెక్కువ గల్గుటకు కారణ మేమనగా, ఈమతములో క్రొత్తగ చేరినపుడే ప్రతి వ్యక్తియు తాను తెలివైనవాడనియు, తనకు గోచరమైనవస్తువులే సమస్తము ననియు, అనగా, తన ఇంద్రియములమూలమున లభించునట్టి జ్ఞానమును మించి

మఱెద్దియు లేదనియును అనుకొనుచుందురు. ఇది చాలపొరపాటు. పైకి చూడగా సూర్యకిరణములు తెల్లగనో, బంగరురంగుగనో కనిపించును. కాని వాని నొకపట్టకము (prism) ద్వారా ప్రసరింప జేసినపుడు అవి ఏడు వేర్వేఱు రంగులు కలిసిన ప్రోగుకాని, కేవలము తెలుపుకాని, బంగరురంగుకాని ఒక్కటే కాదని తేటపడును. ఇటీవల విజ్ఞానశాస్త్రజ్ఞులు వీనిలో నీయేడురంగుల కిరణములేగాక ఎక్స్-రే (X-Ray) అను మఱొకకిరణముగూడ నున్నదనియు, నా కిరణమువలన చాలరకములైన లాభములు పొందవచ్చుననియు కనుగొనిరి. అటులనే యీ భూమినిగుఱించికూడ సామాన్యముగ నందఱును దీనిని సమమట్టముగనుండి, కదలకుండ స్థిరముగనున్న ట్లనుకొనుచుందురు. కాని యీ కాలములో సామాన్యవిద్యాభ్యాసము గలవానికిగూడ భూమి గుండ్రముగనున్నదనియు, నది మహావేగముగ చుట్టుతిరుగుచున్నదనియుకూడ తెలియును. అయితే, దానితోపాటు మనముకూడ తిరిగి పోవుచుంటిమి కాన, దాని తిరుగుడు మనకు తెలియుటలేదు. మనశరీరము అనుక్షణము మాఱిపోవుచునే యున్నది. ఈవిషయము ఒకరాజునకు గలిగిన యీక్రింద చెప్పబోవు ఘటనను బట్టి ఋజువగుచున్నది. ఒకానొక రాజుగారు శరీరమున కంతకును అంటియుండునట్లుగ, నొక అంగుళముదళసరిగల బంగారుకవచమును చేయించుకొని ఒక పండుగురోజున ధరించెను. అది వేసికొన్న పదినిముషములలోనే, అతడు చనిపోయెను. ఏలననగా, అనుక్షణమునతని శరీరములోనుండి బయటకుపోవుచున్నట్టి సూక్ష్మాణువులు బయటకుపోకుండ కట్టుపడిపోవుటచే నతడు చనిపోయెను. మానవుని శరీరము ఏడేండ్లకాలము గతించుసరికి పూర్తిగా మాఱిపోవుచుండునను విషయము డాక్టర్లకు అనుభవసిద్ధమైనదే. వీనినన్నిటినిబట్టి యే పదార్థమైనను, మన కది పై కెట్లగుపడునో నిజమునకు అది సరిగ నట్లే యుండక మఱొకలాగుననే యుండవచ్చునని తేలుచున్నది. అటులనే సంత్ సద్గురువుకూడ మనకు పైకి అగుపడెడి ఎముకలు మాంసము చర్మముల పంజరముమాత్రమేగాక, అభ్యాసిపురుషులు వారిని గుఱించి వర్ణించువిధముగనే నిజముగ నుండవచ్చును. కావున ప్రారంభికుడు తన కార్యము సాధించుకొనుటకై పరిశ్రమచేయుచున్నపుడు, తన యింద్రియముల కగుపడునట్టి విషయములే అంతయునని తృప్తిపడకుండ, అంతకన్న నత్యద్భుతవిషయములనుగుఱించి వినుటకును తెలిసికొనుటకును తగినట్లుగ తన హృదయమును, ఇంద్రియములను వికసింపచేసికొనవలసియుండునని జ్ఞాపకముంచుకొనవలెను. అటులనే మనమనస్సునుగుఱించి, అది పైనుంచి

చూడగ బహుశాంతముగను నిశ్శబ్దముగను ఉన్నట్లే కనపడుచున్నను, దానిని చాలదుర్మార్గమైనట్లుగను, చంచలమైనదిగను సంతసద్గురువు సెలవిచ్చెడి విషయము పూర్తిగ యథార్థమే యగును.

అందుచే సత్యవస్తువుయొక్క జ్ఞానము సంపాదించునిమిత్తము రెండు విషయములు ముఖ్యావసరము.

1. ఓరిమి ధైర్యములను వహించి బాహ్యారూపములను. రంగులను విడిచిపెట్టి, అంతర్యమున ప్రవేశించవలయును. సాధుసంతుల బాహ్యావేషము వర్ణములలోనే చిక్కువడిపోకుండ, వారినిగుఱించి తెలిసికొనుటకై నెమ్మది నెమ్మదిగ నాంతర్యమున ప్రవేశించుము.

2. ఒకతటాకములోని నీరు పైకెంతయు స్వచ్ఛముగను, పరిశుభ్రముగను ఉన్నట్లు కనపడుచున్నను, దానిని బాగుగ పరిశీలించగా, దానిలో చాల మురికి యున్నట్లును, దానిలో తరంగము లెక్కువగవచ్చి దానిని మఱింత కలిపి వేయుచున్నట్లును తెలియగలదు. అట్లే మనమనస్సుగూడ ననేక కామక్రోధాది వికారములమైలతో పూర్తిగనిండిపోయినది. ఇచ్ఛయొక్క మహాప్రవాహము మూలమున తరంగములు బయల్దేరి, మన అసలైన జ్ఞానమును అల్లకల్లోలము చేయుచున్నవి. మన మివ్విధముగ ద్విగుణమైన వికారముచే కలుషితమై యుంటిమి. కావున నిట్లు కలుషితమైయున్న మనజీవుని నిర్మలము చేసికొనుటయే మనకర్తవ్యము. బహుసరళపద్ధతిని, శీఘ్రాతిశీఘ్రముగ మనస్సును ప్రశాంతముగ చేయునట్టి అభ్యాస మేమతమున నుపదేశించబడునో అదియే యథార్థమైన మతము. దాని కుండవలసిన ప్రధాన లక్షణములలో రెండవదేమనగా, ఆమతము గురువును నిరాకరించకూడదు. మఱియు గురువు పరమదయాళువుగను, పరమసహాయకుడుగనుండి, కేవలము వారి సాంగత్యము చేతనే వారియందు భక్తివిశ్వాసము లుత్పన్నమై మనస్సు నిశ్చలమైపోవలయును.

ప్రశ్న:—సత్సంగి ప్రాపంచికజీవులతో నెట్లు ప్రవర్తించవలయును ?

సమాధానము:—వారిని పూర్తిగా దూరముగ నుంచ (Boycot) నక్కఱలేదు, వారికాళ్లును పట్టుకొననక్కఱలేదు. మీకేదైన వ్యావహారికవిషయములలో నట్టివారితో పనివచ్చినపుడు, ఆత్మగౌరవముతో ప్రవర్తించవలయును. తన

ఆత్మగౌరవము తెలిసినవాడు ఇతరులకుగూడ ఆదరగౌరవములను చూపగలడు. ఆత్మగౌరవము తెలియనివాడు, ఆదర గౌరవములకు బదులు, ఉత్త ముఖస్తుతి మాత్రమే చేయుచుండును.

సత్సంగములో సద్గురువు సెలవిచ్చెడి మహావచనములలో నొక్కొక్క ప్రత్యేకవచనము మఱొక ఫలానా సత్సంగి నిమిత్తమై చెప్పబడినదని యెన్నడును భావించకూడదు. ప్రతివ్యక్తియు నావచనము తనకొఱకే చెప్పబడినదని తల్చుకొనుచుండవలయును. కొందఱుపెద్దలు మహరాజ్ సాహబ్ వారి కాలములో ప్రతివచనమునుండియు మంచి శ్లాఘగల భాగములను తీసి, అవి తమను గుఱించియే సెలవియ్యబడినవనియు, తమదోషములను, లోపములను తెల్పునట్టి భాగములుమాత్రము తమరిని గుఱించి కాక మఱెవరో ప్రత్యేకవ్యక్తికి సంబంధించినవనియు చెప్పుచుండెడివారు. అట్టివారిని సవ్యమార్గమునకు తీసికొనివచ్చుటకై యుపాయము వారిని ఆఖరికి రోగగ్రస్తులుగ చేయుట యొక్కటే మిగులు. ఇందునిమిత్తమెయే వారిని భట్టిలో (అనగా, ఆవము) పాఱవేయవలసివచ్చెను. అనగా వారు రోగములచే పీడితులైరి. వచనములతోనే యెవరైనను తమతప్పులను దిద్దుకొనినయెడల నీవిధమైన ప్రమాదావస్థ యేల గల్గును ?

## 114

### ప్రకృతిసిద్ధమతమే సర్వోత్తమమైనది.

23 సెప్టెంబరు 1917:—ప్రకృతిసిద్ధమైన (Natural) మతమే సర్వోత్తమమైనది. అదియే ఆచరించుటకుకూడ చాల సులభముగ నుండును. మానవుని బుద్ధికుశలతవలన ఆవిష్కృతమైన లౌకిక విషయములలోనే, వానిని గుఱించి అభివృద్ధిచేయునిమిత్తమై వందలాది సంవత్సరములు అధికపరిశ్రమచేసిన పిమ్మటనే, స్వల్పమాత్రము అభివృద్ధి చేయగల్గుచున్నట్లు మనము చూచుచునేయున్నాము. మానవుడు ధరించు వస్త్రములు ఎన్నివర్ష శతములు పాట్లుపడిన మీదట నీప్రస్తుతపరిస్థితికి వచ్చినవో చూడుడు. కొంతకాలము క్రితము ఆకులను, చర్మములను మాత్రమే మానవుడు కట్టుకొని కాలక్షేపము చేయుచుండెను. వానిని ఇన్నిశతాబ్దులు క్రొత్త క్రొత్తమార్పులు చేయుచురాగ నవి వాని ప్రస్తుతదశలోనికి అభివృద్ధినొందినవి. ప్రస్తరయుగములోను (stone age)

కేన్ (Cain)[1] అనువాని కాలములోను గల పరిస్థితులనుబట్టి, పూర్వకాలములో రాళ్లు, కట్టలతోచేసిన ఆయుధములతో యుద్ధము చేసెడివారని తెలియుచున్నది. ఇంతకాలము అభివృద్ధియగుచురాగా, ఇప్పు డీప్రస్తుతదశ గల్గినది. అటులనే, చూడుడు, కాక్స్టన్ (Caxton) ద్వార యెంతకాలమైన తర్వాత ముద్రిణయంత్రము కనిపెట్టగలిగెనో, ఎడిసన్ (Edison) ద్వార విద్యుచ్ఛక్తిని, స్టీఫెన్సన్ (Stephenson) ద్వార పొగ ఇంజనును (engine) కనిపెట్టిరో, ఇవన్నియు నిన్నిశతాబ్దులకాలము ఇన్నికష్టములు, బాధలు పడగ కనిపెట్టుట సాగెను. అవికూడ చెప్పుటకు వీలుకానంత అసంపూర్ణ దశలో నున్నవి. బట్ట మాసిపోయినపుడు దానిని ఉతుకుట కొక ప్రత్యేకపద్ధతి నవలంబించి శుభ్రము చేయవలయును. లేనిచో, మఱొక సామాన్యపద్ధతిని బాగుచేసినయెడల నవి శుభ్రపడుటకుబదులు మఱింత మలినమైపోవును. కావున మానవుని కృత్రిమ కార్యములన్నియు, ననేక మహాకష్టములు, పరిశ్రమయు పడినమీదటగూడ నిప్పటికిని అసంపూర్ణదశలోనే యున్నవని తేటపడుచున్నది. ఇందుకు ప్రతికూలముగా ప్రకృతిలో చూడుడు. ఒక్కమఱ్ఱికాయలో నెన్నివిత్తు లుండునో, అందులో నొక్కవిత్తును నేలలోపాతినచో, నది కొద్దిగ మట్టిని, నీటిని తీసికొని మొలిచి, ఒక మహాసైన్యమంతయు దానిఛాయలో విశ్రాంతి తీసుకొనుటకు తగినంత మహావిశాలవృక్షముగ కొద్దికాలములోనే తయారగును. దాని ఆకులు, మానవుడు యెన్నియేండ్లు పాటుపడినను తయారుచేయలేనంత రమ్యముగను, మృదువుగను ఉండును. కావున పర్యవసాన మేమనగా ప్రకృతిపద్ధతులు అత్యంత పరిపూర్ణములు, బహుసునాయాసమైన వనియు, మానవుని కార్యములన్నియు, నతనిలోపములతో నిండియుండుననియు తేలుచున్నది. మతవిషయములోగూడ పరిస్థితి యిట్టిదే. ప్రకృతిపదార్థములతో పోల్చగా మానవకృతములైన కృత్రిమ పదార్థము లెట్లో, ప్రకృతిసిద్ధమైన మతమునెదుట మానవుడు తన పురుషార్థము ప్రధానముగ చేసికొనికాని, బుద్ధిబలము నుపయోగించికాని, తయారు చేసిన మతములన్నియు నట్లే లోపభూయిష్ఠములై అసంపూర్ణముగ నుండును. కావున ప్రకృతినియమానుసారముగ నున్న మతముయొక్క మహిమాతిశయము ఊహింపశక్యముగాదు.

---

1 క్రైస్తవుల బైబిలులో చెప్పిన యొకవ్యక్తియొక్క నామము.

మానవుడు మోహజాలములో చిక్కుబడియున్నాడు. ఒకనికి తనభార్య యందు ప్రేమ, మఱొకని కతనిధనమందు, మూడవవానికి గ్రంథములయందు, మఱొకనికి తనగుఱ్ఱముచందు ప్రేమ. మఱొకనికి సమస్తపదార్థములందును మోహమే యుండును. జీవుడు మోహావశమై యీజాలములో చిక్కుబడెనని చూచి మానవునికి ప్రేమప్రీతులు చేయుట సహజలక్షణముకావున, భగవంతు నితో ప్రేమచేయవలయునను నియమము నేర్పాటుచేసి భగవంతు డీమత మును జారీచేసెను. ఈఅభ్యాసమే మానవునకు స్వభావసిద్ధమైనది. జీవుడెన్న డును చూచియెరుగనట్టి నిరాకారరూపమును ప్రేమించుట సాధ్యమైన విషయము కాదు. లోకులు తామెన్నడు చూచియెరుగనట్టి ఈశ్వరుని పరమేశ్వరుని స్మరించుచుందురు. వారాయనతో నేమి ప్రేమచేయగలరు? కాని పరమపురుషుడు సంత్ సద్గురురూపము ధరించివచ్చినచో, మాన వుడు తనబంధువులైన మానవులకు బదులుగ మఱొకమానవునియందు ప్రేమ స్థిరముచేసికొనవలయునను నొకటే మార్పు ఇందులోనుండును. ఇంక ఫలానా మనిషి సంత్ సద్గురువగునా కాదా యనువిషయ మొక్కటే మిగిలినది. అయితే ఆప్రశ్న వేఱు. నిజమైన సంత్ సద్గురువు లభించినయెడల నాయనతో ప్రేమ చేసెడిమతను చాల ప్రకృతిసిద్ధమైనదనిమాత్రము ఒప్పుకొనవలసియున్నది.

జీవుడు చనిపోయినపిమ్మట జోతిర్నిరంజనులవద్దకు వెళ్ళినపుడు, నీకేమి కావలయునో చెప్పుమని అతడు ప్రశ్నింపబడును. అప్పుడు తనకు తనగుఱ్ఱము కావలయునని యొకడును, మఱొకడు పుస్తకములు కావలయుననియు, ఒకడు తనపెండ్లామును, మఱొకడు తనపిల్లవాడును కావలెననియు నడుగుచుందురు. ఎవని కేకోరిక యుండునో, ఏయేకోరికలను పూర్తిచేసుకొనవలయునను తాప త్రయములో నతడు జన్మఅంతయు గడిపెనో, ఆకోరికయే అతనియెదుటికి వచ్చి అందుకు తగినజన్మనే అతడు పొందుచుండును. జీవితకాలములో నెవడు సంత్ సద్గురువునందు ప్రేమచేయుచుండెనో అతడాప్రశ్న వచ్చినవెంటనే నాకు మఱే మియు నక్కఱలేదు సంతసద్గురువొక్కరే నాకు కావలెనని సమాధానము చెప్పును. అప్పుడు అతని సంత్ సద్గురువు వెంటనే ప్రకటమై ఆజీవుని తనదేశము నకు తీసికొనిపోవుదురు, అయితే ఇందులో నొక క్లిష్టవిషయముగలదు. అది పై రెండవప్రశ్నతో సంబంధించియున్నది. ఈజీవుడు శరణుపొందిన

గురువు నిజమైన సంత్ సద్గురువే అయినయెడల పైనచెప్పినయుత్తమగతి తప్పకుండ పట్టవచ్చునుకాని, ఈజీవుడు నిజమైనసంత్ సద్గురువునుకాకుండా, ఒక హరిప్రసాదుఅనెడి కల్పితసంతును మూర్ఖత్వముగా ప్రేమించినచో నతనికి హరిప్రసాదు నరకములోనున్నాడు, అచ్చటికే పొమ్ము అని సమాధానము లభించగలదు. అయినను, సంత్ సద్గురువు జారీచేయించిన యీ ప్రీతిమార్గముమాత్రము అత్యంత ప్రకృతిసిద్ధమును, సునాయాసమును అన్నిటికన్న నెక్కువయథార్థమునైన మతముకాదని యెవరికిని నిరాకరించశక్యముకాదు. సంత్ సద్గురువుయొక్క మహాత్మ్యమును, వారి ప్రాధాన్యమును ఆవశ్యకతయు నేమానవునికైన నొకసారి బోధపడినచో నతడు ప్రేమపూరితుడై వారిసేవలో నిమగ్నుడు కాకపోవుటగాని, అతనికి జీవితోద్దేశ్యము ఫలించకపోవుటకాని అసంభవము.

## 115

వివిధవిషయములు.

మనస్సు నేకాగ్రముచేయుటలో గలుగునట్టి ఆనందము పరిశీలనార్హము. ఈలోకములోగల భోగములన్నియు నేదేని ఒక ఇంద్రియస్థానముపైన కొద్దిగా శ్రద్ధ నేకాగ్రముచేయుటవలననే గల్గుచున్నవి. ఆత్మస్థానమువద్ద తనశ్రద్ధ నేకాగ్రము చేయఁగల్గినయెడల, నందువలన నెంత అధికానందముగలుగగలదో యూహించుకొనుడు. ఆత్మ అనేకధారలయొక్క భండారము. ఒక్కొక్కధారలోనే ఇంత ఆనంద మున్నపుడు, ఈధారలన్నిటియొక్క భండారములో నానందమెంత యధికముగ నుండవలయును ?

2. దర్ కూయే నేకనామీ మా రా గుజర్ నదాదంద్ ।
గర్ తో నమీ పసందీ తగఈర్ కున్ కజా రా ॥

భగవంతుని రాజదర్బారుకు పోయెడి మార్గమునకు అప్సరసలు అడ్డముగ నిలబడి, "ఓ భగవంతుడా, మే మీవిధముగా మార్గమున కడ్డుపడుట మీకు ఇష్టము లేనిచో మీరు మా భాగ్యములను పెంపొందించుడు" అని ప్రార్థించిరి.

సత్సంగికెల్లపుడు సంత్ సద్గురుసాంగత్యమునందుండినచో సరియైన విచక్షణజ్ఞానముండును. అట్లుండవలెనన్నయెడల కొంత నిరాదరము సహించవలసియుండును; ప్రయాణములు వగైరా శ్రమలును పడవలసివచ్చును. అయినను,

వీనినన్నిటిని సహించుటకు మానవుడు తయారైయే యుండవలయును. అట్లుగాక దూరముగ నుండిపోయినచో నీలో నిర్మలత్వము కలిగించునిమిత్తమై భగవంతుడు మఱొకపద్ధతి అవలంబించవలసి వచ్చును.

3. పైకి చూడగా మనమనస్సు చాలస్థిరముగనే యున్నట్లు అనిపించును. కాని మీచిత్తము నొకస్థానమున పదినిముషములు నిలబెట్టుటకు యత్నించినపుడు దాని చాంచల్యలక్షణము బయటపడి అది పరుగులు గంతులు పెట్టుచున్నట్లు తెలియవచ్చును. స్మరణధ్యానసమయములోగూడ నిదే చాంచల్యము గోచరమగుచుండును.

## 116

సమకాలిక సంత్ సద్గురువునకు భక్తిచేయుటవలన చిత్తశుద్ధియు, వైరాగ్యమును అతిశీఘ్రముగ లభించగలవు.

24 సెప్టెంబరు 1917 :—ప్రతివిషయమును మానవుడు తనబుద్ధియను సాధనముతో పరిశీలించుకొనుచుండును. మానవుడిట్లు బుద్ధియను కొల్తబద్దతో సరిచూచుచుండుటవలననే లోకము చాల గడబిడ అయిపోవుచున్నది. ఎంతగొప్పమహాత్ముడైనను చెప్పినవిషయమునైననుసరే ఎంతశ్రేయస్కరవిషయమును బోధించిననుగూడ అది సరిగనున్నట్లు తనబుద్ధికి నచ్చిననేగాని, మానవుడు దానిని అంగీకరించడు. కాని, నిజమున కీబుద్ధి ఉత్తపేరునకుమాత్రమే బుద్ధియని చెప్పవలసియున్నది. ఇది తనపేరున కపఖ్యాతియే తెచ్చుకొనుచున్నది. బుద్ధికి సంబంధము మెదడుతోనే యున్నది. కాని వాస్తవములో మానవుడు దీనిని ప్రతివిషయములోను తనమనస్సుయొక్క రాగద్వేషములను సాధించుకొనుట కొకసాధనముగనే ఉపయోగించుచున్నాడు. అందుచే దీనికి సంబంధము మెదడుతో లేకుండా హృదయముతో నేర్పడినది. ఉదాహరణకై చూడుడు, ఒకమనిషి విషము చాల మంచిపదార్థమని అన్నాడనుకొనుడు. మఱొకడు వెంటనే విషము చెడ్డపదార్థమని యెదురుచెప్పును. డాక్టర్ల అనుభవరీత్యా ఒకమనిషిశరీరములో విషము ప్రవేశించినచో దానిమూలమున నతని శ్వాసనాళము (wind pipe) నరములును శుష్కించిపోవుననియు, ప్రేగులన్నియు శుష్కించి ముకుళితమైపోవుననియు, కొద్దిసేపటిలోనే మానవుడు చని

పోవుననియు తెలియుచున్నది. విషము తినుటవలన వందలకొలఁది మనుష్యులు చనిపోయిరనియు, ప్రత్యేకించి ఒకమనిషి పేరుచెప్పి ఫలానామనిషి కొద్దిరోజుల క్రితమే ఆవిషముతిని చనిపోయెను అని ఉదాహరణపూర్వకముగను, తర్కశాస్త్రపద్ధతుల నుపయోగించియు నతడు తనమాటను, అనగా విషము దుష్ట పదార్థమను విషయమును స్థిరపఱచును. అయితే కొద్దిలోతుగ నాలోచించిన చో, ఈ హేతువాదమంతయు జీవితము మంచిదను నొక సంభావనమీఁద నాధారపడియున్నది. ఈ సంభావనపైన వెళ్ళినపుడే విషము చెడ్డదను నిర్ణయము తేలును. ఈ భావనయే సరికానిచో విషము చెడ్డదని చెప్పుటకు హేతువేది ? ఇదేవిధముగా ప్రతి హేతువాదము వెనుకను ఒక ప్రియవిషయమో, అప్రియ విషయమో, లేదా మఱొకభావనయో ప్రధానమైయుండి, ఈ హేతువాదమంతయు దానిని దిట్టపఱచుచుండును. హేతువాదము ప్రత్యేకముగ నేమియు పనిచేయదు. హేతువాద మొక రెండువైపుల పదునైన కత్తివంటిది అది ఇఱువైపులను కోయగలదు కావున మానవుడు ఆధ్యాత్మికసాధనలవిషయములో తన తెలివితేటలమీఁదను హేతువాదములమీఁదను ఎక్కువగ నాధారపడకూడదని తేటపడుచున్నది.

జీవునకు పారమార్థికాభివృద్ధి కావలెనన్నచో తనహృదయదర్పణమును స్వచ్ఛముగ నుంచుకొనుట యత్యావశ్యకము. అయితే, ఇపుడాదర్పణము స్వచ్ఛముగనున్నదో లేదో తెలిసికొనుట యెట్లు అనెడి ప్రశ్న రావచ్చును. ఆవిషయములో సత్సంగికి పరిశీలించుకొనువిధ మెద్దియనగా, అతనిదృష్టికి సంత్ సద్గురువునం దెట్టిదోషము కానరాకుండుటయే నిదర్శనమని చెప్పవచ్చును. అనగా సత్సంగికి సద్గురుని లీలావిలాసలలోగాని, కృత్యములలోగాని మఱేవిషయము లోగాని యెట్టిదోషలోపములు కనపడకూడదు. ఇతర ప్రాపంచికజీవునికి తన హృదయముయొక్క నిర్మలత్వము తెలుసుకొనుటకైతే, ఈప్రపంచ మతని కెల్లపుడు దుఃఖక్లేశములతో కూడినదిగ కన్పట్టుచు నతని చిత్తమును, మనస్సును ప్రాపంచికవిషయములవైపునకు ప్రసరించకుండ నుండుటయే నిదర్శనము.

మనమనస్సు చాలకఠినమైనది. సికందరు మహాచక్రవర్తి ఒక ఉక్కుఅద్దమును చేయించి దానికి మెఱుగుపెట్టించుటకై మహాప్రయత్నములుచేసి చాల శ్రమపడెను. ఒకఉక్కుఅద్దమునకు మెఱుగుపెట్టించుటకై యెన్నిపాట్లు పడవలసి వచ్చునో దీనినిబట్టి తెలియుచున్నది. హృదయదర్పణమును స్వచ్ఛముచేసి

కొనుట కింతకన్న నింకను చాల యెక్కువకష్టపడి కఠినప్రయత్నము చేయవలసి యుండును. హృదయదర్పణము అనేకరకములుగ దెబ్బలుతగిలినపిమ్మటనే పరిశుభ్రమగును. ఈదెబ్బలు తగిలెడివిధ మెట్లుండుననగా, ఒకసత్సంగి యున్నాడనుకొనుడు. అతని యింట్లో నేదో జబ్బు వచ్చెననుకొనుడు. ఆజబ్బును పోగొట్టుమని అతడు గురువుగారికి ఉత్తరములు వ్రాసికొనియో, మఱొకవిధముగనో మొఱపెట్టుకొనును కాని ఆజబ్బు పోలేదు. దానితో నతనికి కోపము వచ్చి యీమాత్రముసహాయమైతే పురాతన దేవీదేవతలవలననే మాకు లభించునని చెప్పుచు నతడు సంత్ సద్గురువును విడిచి ఆ దేవీదేవతలను పూజించుట మొదలుపెట్టును. కాని అట్లుచేసినను లాభము లేకుండ నుండినపుడు సంత్ సద్గురువును విడిచిపెట్టుటలో తాను చాల గొప్పపొరపాటు చేసితినని అతడు తెలిసికొని తిరిగి యీవైపునకు వచ్చును. తనజబ్బుమాత్రము ఏమియు మార్పులేకుండ నట్లే యుండును. కాని అతడు కొంచెముకూడ విముఖతలేకుండా, సంత్ సద్గురు చరణములందు పూర్ణవిశ్వాసము గలిగి యుండును. ఈవిధముగా పదిపదునైదు సార్లు మనస్సునకు దెబ్బలు తగిలినతర్వాతనే హృదయదర్పణము పరిశుభ్రమగును.

సమకాలికసజీవులైన గురువునందు భక్తిచేయుటవలన గలిగెడి యీ క్రింద చెప్పబోయెడి ప్రత్యేకఫలితమును పరికించిచూడుడు. ఒకసత్సంగి ఒకప్పుడు సంత్ సద్గురువునందు భక్తిప్రేమలు చేయుచుండును. అతనికి ఆంతర్యముగను, బాహ్యముగను దర్శనము లభించుచుండును. ఈపరిస్థితిలో నత డేదోయొక తప్పు చేయుట తటస్థించును. దానితో అతనికి ఆంతర్యదర్శనము కట్టడిపోవును, లేదా అతడు గురువుగారిదర్బారునకు వచ్చినపుడు సద్గురువు అతనివైపు చూడకుండ నుండిపోవుదురు. దానితో అతడు ఏడ్చుట ప్రారంభించును. తిండితిప్పలేమియు సయించవు. అతనిమనస్సు గొప్పదుఃఖపరిస్థితిలోనికి మాఱిపోవును. సంత్ సద్గురువుయొక్క స్వల్పనిరాదరణవలన నతనికి వేలకొలఁదిసంవత్సరములు తపస్సు చేయుటచే లభ్యముకాదగినట్టి వైరాగ్యదశ లభించినది. పూర్వకాలములో ఋషులు, మునులు నొక కల్పితపురుషునియందు భక్తిపెట్టుకొని వందలకొలఁదియేండ్లు ఘోరతపస్సు చేసినమీదట వారికి లభించెడి వైరాగ్యమును; ఈకాలములో ఒకసత్సంగి సమకాలికజీవితసంత్ సద్గురువును ప్రేమించుటవలన నతిశీఘ్రకాలములోనే సంపాదించుకొనుచున్నాడు.

## 117

### సద్గురువుయొక్క మహిమాసామర్థ్యములు.

24 సెప్టెంబరు 1917 :— ప్రశ్న :—సంత్ సద్గురు వనగనేమి? వారి (Consciousness) చేతనశక్తి అనగనేమి?

సమాధానము :—ఇంతకుముందు చెప్పినట్లు మానవునిశరీర మెల్లప్పుడు మాఱిపోవుచునే యుండును. ఏడేండ్లగుసరికి అతని పూర్వశరీరముయొక్క ఒక పరమాణువుకూడ మిగులకుండునంత పూర్తిగ నది మార్పుచెందును. మానవుని మనస్సుకూడ నెప్పుడును మారుచునేయుండును. ఒకప్పుడు సంతోషముగనుండును, మఱొకప్పుడు విచారముగ నుండును. ఒకసమయములో అజ్ఞానముగ నుండును. మఱొకసమయములో పుస్తకములను చదివి జ్ఞానమును సంపాదించుకొనును. సంత్ సద్గురువు శరీరమనస్సులరెండిటిని అతిక్రమించియున్నారు. శరీరమనస్సులు రెండును వికారముచెందెడి పదార్థములు కావున, వానికి వికారరహితపదార్థమునుగుఱించి జ్ఞానమెట్లు గలుగగలదు? అందునిమిత్తమై మనస్సును కూడా ముందు మేల్కొల్పి తిరిగి దానిని నిద్రపోగొట్టి ఆతరువాత దానిని చంపివేయవలసియున్నది. సద్గురువునుగుఱించిన జ్ఞానమును ఆత్మయే సంపాదించగలదు. ఖస్‌ఖస్‌తడికను చూడుడు, అది నలువైపుల నెట్లు సువాసన గలుగ చేయునో, ముక్కు సరిగనున్నవాడు ఆసువాసన తనమెదడున కందజేసి ఒకవిధమైన నవత్వమును పొందును. ఘ్రాణేంద్రియము సరిగలేనివాడుకూడ కొంత నవత్వమును తనచర్మమునందలి రోమకూపములు, రోమములద్వారా అనుభవించగలడు. ఇట్లే శరీరమనస్సులుకూడా పరమాత్మయొక్క ప్రభావలాభమును కొంతవఱకు పొందుచుండును. కాని ఆత్మయొక్కటే ఆలాభమును పరిపూర్ణరూపమున పొందగలదు. విద్యాజ్ఞానము చాలదు. అసలైనసహాయము సంత్ సద్గురువువద్దనుండియే పొందవలెను. అట్లు చేసికొన్నవాడే శరీరమనస్సులవిఘ్నములను తొలగించుకొనగలడు. సద్గురువనగ నొకశరీరము కానేరదు, మనస్సును కానేరదు. ఆరెండును ఎల్లపుడు మాఱిపోవుచుండును. శరీరము పర్వతము నెత్తలేదు. మనస్సు లోకములో నన్నివిషయములు జ్ఞాపకముంచుకొనలేదు. శరీరమనస్సులు తమశక్తిపరిమాణమునకు లోబడియే పనులు జరిగించగలవు. సద్గురువుయొక్క ఆత్మ మేల్కొంచియున్నది. శరీరమనస్సులు ఈలోకమునకు

సంబంధించిన సాధనములు. వారీసాధనముల నీలోకమునుండియే తీసికొన్నారు. వారా సాధనములను ఇచ్చట వానిశక్తులకు లోబడియే ఉపయోగించుకొని తిరిగి వెళ్ళిపోవునపు డిచ్చటనే వదిలి వెడలిపోవుదురు. శీల సంతోష పరిహా ప్రేమలు వారి యాంతర్యమున నెల్లపుడు విరాజమానముగ నున్నట్లు జీవునికి బోధపడ గలదు. కాని ఈ విషయమంతయు మనలోనున్న ఆత్మయే తెలిసికొనగలదు. జీవునిపైన మనస్సనెడి ఒకసల్లని అద్దమును, దానిపైన తిరిగి శరీరమను నొక మోటఅద్దమును కప్పియున్నపుడు జీవు డేమి చూడగలడు ? శరీరమనస్సుల యొక్క లోపలక్షణములు వారిలోగూడ (అనగ సద్గురువులో) తప్పకుండ నుండును. కాని వారు తమదివ్యశక్తి నుపయోగించినపు డేమిచేసినను చెయ్య గలరు.

## 118

### పిల్లలకు సలహా.

23 డిసెంబరు 1917 :—పిల్లల సత్సంగములో హుజూరువారు స్వార్థపర మార్థములు రెండును సంపాదించుకొనవలసియున్నదని సెలవిచ్చిరి. వానిని పాలు చక్కెర కలిపినట్లుగనే కలపవలయును. పాలలో చక్కెర యెక్కువ వేసిన యెడల పాల కమ్మదనము అగుపడకుండపోవును. అట్లే లోకములో స్వార్థపర మార్థములలోకూడ మోతాదు మించకుండ పరస్పరమేళనము చేయవలెను. మీరందఱును చదువుకొనవలసిన సమయములో చదువుకొనుడు, తినవలసిన సమయములో భుజించుడు, సంభాషణసమయములో సంభాషించుకొనుడు, ఆటలసమయములో ఆడుకొనుడు. అట్లు చేసినయెడల ఈలోకములో మీతో నెవరును పోటీచేయలేరు.

## 119

### పరమార్థము బుద్ధిచాతుర్యమున కతీతము.

24 డిసెంబరు 1917 :— తన యుద్దేశ్యము సునాయాసముగ నీడేరునట్టి పరమార్థసాధన కావలయునని ప్రతిసత్సంగికిని సహజముగ కోరికయుండును. కాని, "ఫహమ్ ఇదరాక కుఛ్ తేరే ముఅవిన్ హో నహీం సక్తే" అనగా,

"నీవివేకము బుద్ధిచాతుర్యమును ఈవిషయములో నెందుకు పనికిరావ"ని కూడ చెప్పబడినందున నాసాధన యెట్టిదో అవగాహన యగుటెట్లు? బుద్ధిచాతుర్యము నకును, వివేకమునకును అందరానట్టి ఆయవస్థ, అహంకారశూన్యమైన ఉన్మత్తా వస్థయని మహాత్ములవచనములవలన తెలియుచున్నది. అందువలన జనులు ఇక్కాలమున నల్లమందును, మద్యమును ఉపయోగించి ఆనిరహంకారమైన ఉన్మత్తావస్థను పుట్టించుకొనగోరుచున్నారు. దానివలన జరుగుచున్న దేమనగా బుద్ధిచాతుర్యము, వివేకమును ఉన్నంతమట్టుకుగూడ నశించిపోవుచున్నవి. అసలు కావలసిన దేమనగా బుద్ధిచాతుర్యము వివేకమును చేతులుమోడ్చి గుమ్మము వద్ద నిలబడవలసియున్నది. అట్టిపరిస్థితి, ఉన్నతలోకముల చైతన్యము మేల్కాం చిననేకాని లభ్యముకాదు. బుద్ధిచాతుర్యమును, వివేకమును అచ్చట పని చెయ్యలేవు. ప్రేమభావముొక్కటే అచ్చట పనికివచ్చును. పాకీవానికి మురికి గలస్థలములోమాత్రమే శుభ్రముచేయవలసినపని యుండును కాని శుభ్రమైనస్థల ములో పనిచేయవలసినపని యుండదుకదా. అట్లే బాహ్యవిషయముల నవగా హనచేసికొనుటలో బుద్ధిచాతుర్యవివేకములకు పనియుండునుకాని, ఆంతర్యవిష యములలో వానికేమియు ప్రసక్తిలేదు. రక్తములో కీటాణువులున్నవి. రక్త ములోనైతే నవి స్వేచ్ఛగాతిరిగి పరుగులిడుచుండును కాని, యెముకలవద్దకు వెళ్ళగనే, పెద్దకొండ లేవో అడ్డుగవచ్చినట్లుగ నవి నిర్ఘాంతపడిపోవును. అటు లనే రాధాస్వామిదయాళుని శరీరములో మనమందఱము కీటాణువులవలె నున్నాము. వారి యద్భుతమహిమ నవగాహనచేసికొనగలశక్తి మనకేమియు లేదు.

## 120

### రాధాస్వామినామము.

24 డిసెంబరు 1917 :—సత్సంగులు అడిగిన అనేకప్రశ్నలకు సమాధాన ములు చెప్పిరి. రాధాస్వామినామమున కర్థముగూడ వివరించిరి. రాధా స్వామినామమును ఉన్నదున్నట్లుగా వర్ణించుట కిచ్చట సాధ్యముగాదు. ఒక ఫొటోను చూపించి ఇదియ రాధాస్వామిఅని చెప్పినట్లుగా సూచనగా చెప్పిన నదియ చాలును. ఘడియారమనగ నేమియని యెవరైన నడిగినయెడల ఘడి యారమును చూపించుటయే దానికి జవాబుకదా వగైరా వగైరా.

# 121

## అభ్యాసము ఆవశ్యకము.

25 డిసెంబరు 1917 :—తఱుచుగా సత్సంగులు తమమీాద దయ లేదనియు, సందుచేతనే తామభ్యాసము చేయలేకున్నామనియు, చెప్పుచుందురు. అసలు విషయ మేమనగా వారు అన్నిపనులును తమమనస్సునకు నచ్చినట్లుగ జరుగు చుండుటయే దయయని అభిప్రాయములోనుండి అట్లుకానపుడు మే మభ్యాస మెట్లుచెయ్యగలమని యనుచున్నారు. ధనముకొఱకై యొకనికి కోరికయున్న దనుకొనుడు. అతనికి భగవంతుడు అత్యధికముగ ధనమునిచ్చినచో, నతడు రాత్రిళ్లు దొంగలభయముచే నిద్రపోడు. అప్పుడు అతడు మళ్ళీ భగవంతునికి తనమీాద దయలేదు దయయున్నచో నాయున దొంగలను తోలివేయవలయు నని చెప్పును. ఇట్టిపనులన్నిటిలో భగవంతుడు దయ చూప ప్రారంభించినచో, పనియెట్లు సాగును. ఒకేసమయములో నొకభక్తుడు వర్షముకావలెనని కోరి మఱొకడు వర్షము కురియవద్దని ప్రార్థించినచో భగవంతు డేమి చేయవల యును? రాధాస్వామీమతముయొక్క ఆదర్శము ఏమనగా జీవునికి సమస్త బంధనములను శిథిలముచేసి, జడచైతన్యముల గ్రంధిని భేదించి ఆత్మ నూర్ధ్వముగ దీసికొనిపోయి అచ్చట భగవ తుని సాక్షాద్దర్శనము లభింపచేయవలయుననియే. మనస్సుయొక్క ప్రాపంచికవాంఛలన్నియు పూర్తిచేయుచుండినచో, రాధా స్వామీమతముయొక్క ఆదర్శము లభ్యమెట్లగును? మనశ్శరీరములు, అభ్యా సము చేసినయెడలనే, వశములోనుండి పనిచేయగలవు. లోకములో సుఖములు గలిగినపుడు సంతోషించుచు, కష్టములు వచ్చినపుడు దుఃఖించుచు నుండిపోయి నచో పనిసాగదు. భగవంతు డెప్పుడేదిసాగించిన నదియే సరి యనుభావముతో నుండవలెను. ఎల్లపుడును భగవంతుని దివ్యేచ్ఛతో సహకరించుట సత్సంగి యొక్క కర్తవ్యముగాని, మనోవికారములలో పడిపోయి క్రిందికి జారిపోకూడదు.

రాధాస్వామీమతములో బాగుగ నభ్యాసముచేయవలయునని నొక్కి చెప్పబడుచున్నది. ఉదాహరణకై ఒకరోగి డాక్టరుగారివద్దకు వెళ్ళి తనకు జబ్బుగనున్నదని చెప్పుకొనగా, ఆయన మందిచ్చి దానిని రోజు త్రాగుమని చెప్పి నచో, రోగి "నేను మందు త్రాగలేన"ని చెప్పియు, డాక్టరు "కండ్లు తెఱచు కొని యుండు" మన్నచో, "కండ్లెట్లు తెఱచియుంచగలన"ని చెప్పియు, డాక్టరు

"కండ్లు మూసికొను"మన్నప్పుడు, "అదికూడ నేనుచేయలేన"ని చెప్పుచుండిన యెడల, డాక్టరు అతనిజబ్బు నెట్లు పోగొట్టగలడో ఆలోచించుకొనుడు. అదే విధముగా రాధాస్వామీదయాళురు అభ్యాసముచేయు మన్నపు డితడభ్యాసము చేయలేనని చెప్పినయెడల నతడు ఈసజీవజాగ్రన్మతమువలన పొందవలసిన లాభము నెట్లు పొందగలడు ?

## 122

25 డిసెంబరు 1917 :— కొందఱు పార్సీ స్త్రీపురుషులు మహారాజబహదూరుగారితోను, మిశ్రీలాలుగారితోను కలిసి వచ్చిరి. అపుడు "రాధాస్వామీ మతములో నెప్పుడు నొకేపుస్తకములోనుండి చదువుచుందురుకదా, ఇంతమంది శ్రమపడి ఇచ్చట కూర్చొనుచుందురు, వారికేమి తృప్తికరముగనుండు"నని జనులు తఱుచుగ చేయునట్టి ఆక్షేపణను గుఱించి వచనము సెలవిచ్చిరి. మన మిపుడు మిగిలినమతములలో నేమిచెప్పుచున్నారు. జీవునికి అందువలన జీవితోద్దేశ్యమేమైనను సిద్ధించుచున్నదా అనువిషయమును గమనించవలసియున్నది. ఉదాహరణకై ఉపవాసములు, మహమ్మదీయుల నమాజులు, తీర్థయాత్రలు, హోమములు, యజ్ఞములు మొదలైనవన్నియు బాహ్యకృత్యములు. రాధాస్వామీమతములో శరీరమును మనస్సుతోను, మనస్సును ఆత్మతోను ఏకము చేసి, మనస్సు ఆత్మలయొక్క శక్తులు మేల్కొల్పబడును. ఏశక్తియైనను దాని కేంద్రమునుండి ఉద్గమించునపుడు దానినుండి శబ్దము గలుగుచుండును. కావున ఆపరమశక్తి తనకేంద్రమునుండి బయటికి ప్రవహించియుండినపుడుగూడ తప్పక శబ్దము ప్రకటమై యుండితీరవలెను. ఆంతర్యమున నాశబ్దమును ప్రకటముచేసికొనుటయే ఈమతములో బోధింపబడుచున్నది. ఈశబ్దసూత్రము పట్టుకొని ఊర్ధ్వలోకములతో సంబంధమేర్పఱచుకొను నభ్యాసమును చేయించి తద్వారా క్రమక్రమముగ నాపరమానందదాయకమైన పరమచేతనశక్తివద్దకు జేరుకొను విధానమునే ఈమతములో నేర్పుదురు.

తన యాధ్యాత్మికశక్తులను మేల్కొల్పుకొని, ఆపరమశక్తితో నైక్యము పొందిన పురుషుడే అందఱినిగూడా ఆపరమశక్తితో నైక్యము పొందగలుగునట్లు చేయగలరు. అట్టిపురుషునినే మనము సద్గురువని పేర్కొనుచున్నాము. రాధాస్వామీమతములో మానవపూజ బోధించబడునని నెపమెన్నుట పొర

పాటు. ఏలననగా, మనము అస్థిమాంసచర్మములతోను, పంచతత్త్వములతోను తయారైన శరీరమును భగవంతుడు లేక ఖుదా యని మన్నించుటలేదు. అట్టి శరీరములో విరాజమానమైయున్న ఆపరమచేతనశక్తినే సంత్ సద్గురువని చెప్పుచున్నాము.

శబ్దప్రభావమునుగుఱించి చెప్పుచు హుజూరువారిట్లు సెలవిచ్చిరి :— ఒక మానవుడెట్లు చీకటిగ ఉన్నపుడు ధ్వనినే సహాయముగ చేసికొని పట్టణము చేఱగలడో అట్లే శబ్దముద్వారా మానవుడు ఆపరమచేతనశక్తివద్దకు చేరుకొనగలడు. మఱొక బాహ్యాచారములుకాని, పద్ధతులుకాని ఆభగవంతునితో సంబంధము నెంతమాత్రము కలపలేవు. అవన్నియు మనస్సుయొక్క భండారము వఱకుమాత్రమే జీవుని చేర్చగలవు.

## 123

### అభ్యాసములో జయము అపజయము.

26 డిసెంబరు 1917 :—అభ్యాసములో సాఫల్యమేమియు నసలే సేకూరలేదనికాని, పూర్తిగా సేకూరలేదనికాని చెప్పెడివారు ఇరువురునుకూడా పొరపాటులోనున్నారు. అభ్యాసముచేయుటవలన మార్గమేర్పడుచుండును. ఎపుడైనను విరహభావముతో నభ్యాసములో కూర్చుండినపుడు లోపలకన్ను విడినయెడల అప్పుడే అభ్యాసములో నభివృద్ధిగలుగుచున్నట్లు ఎంచుకొనవలెను. అట్లు జరుగనియెడల నాపరిస్థితి గలుగువఱకు ప్రయత్నము చేయుచుండవలెను.

## 124

### లాలాజీగారి ఉత్తరప్రత్యుత్తరములు.

ప్రొఫెసర్ బాబూజ్యోతిప్రసాదుగారు వచ్చిరి. అప్పుడు లాలాజీసాహబ్ గారిని గుఱించి సంభాషణజరిగెను. రాధాస్వామిదయాళుని యుద్దేశ్య మేమిటి, దివ్యేచ్ఛ కార్యక్రమ మెట్లుసాగించుచున్నది, అనెడి విషయములపైన సంభాషణ జరిగెను. సూర్యచంద్రుల చలనము నెవరును అడ్డగించలేనపుడు రాధాస్వామిదయాళుని దివ్యేచ్ఛ నెవరు ఆపగలరు. "సంత్ మౌజ కో కోఈ న టారే, ఈశ్వర పరమేశ్వర సబ్ హారే", అనగా సంతుల దివ్యేచ్ఛ కెవరును

అడ్డు కలుగ జేయ లేరు. ఈశ్వరుడు, పరమేశ్వరుడు మున్నగువారందఱునుకూడ నావిషయములో చేతకానివారే", అని పవిత్రగ్రంథములో సెలవిచ్చిరికదా ఇచ్చట ప్రేమనగర్ తయారైనపుడు, తగాయిదాలన్నిటికి మూలహేతువైన వైయక్తికస్వామ్యము నిలబడజాలదని తేటపడును. స్థలముకొని ఇల్లుకట్టవలసినదని మాసోదరుడు చెప్పెను కాని నేను ఒప్పుకొనలేదు.

స్కూలును మూసివేయుమనియు, సర్కార్‌సాహబ్‌వారికౌన్సిల్‌ను దాని నియమనిబంధనలతో సహితముగ కొట్టివేయుడనియు, నీరెండు షరతులకు వప్పన్నమైనచో రాజీ కాగలమనియు, లాలాజీగారివద్దనుండి ఉత్తరము వచ్చినది. దానికి మేము స్కూలును కావలసినచో వెంటనే మూసివేయగలము కాని, సర్కార్‌సాహబ్‌వారి నియమనిబంధనలనుమాత్ర మెంతమాత్రము భంగపరచజాలమని సమాధానము చెప్పితిమి. పులి, పిల్లి కథను ఉదాహరణగా సెలవిచ్చిరి. పులి పిల్లితో "పిన్నీ" "పిన్నీ" అని పిల్చుచు మచ్చికచేసికొని పిల్లి వద్ద అన్నివిద్యలు నేర్చుకొన్నది. కాని, పిల్లి దానికి చెట్టెక్కుటమాత్రము నేర్పలేదు.

## 125

మనస్సును వశముచేసికొనవలయును.

27 డిసెంబరు 1917 :—లైలాను కలుసుకొనునిమిత్తమై మజునూ ఒక ఆడుఒంటెపై నెక్కి వెళ్లుచుండెనట. మజునూకి ఆఒంటె త్వరగా పోవలయునని కోరికగ నున్నది. కాని ఆఒంటె ఒకజిత్తులమారి. దాని కొకపిల్ల యుండెను. ఆపిల్లయందు మోహముచే నది అప్పుడపుడు ఆగిపోవుచుండెడిది. మజునూ అప్పుడు ఆఒంటెతో "అయ్యో! ఓఒంటె, నీహృదయముకూడా నాహృదయమువలెనే యుండియున్నట్లైతే చాలతొందరగా వెళ్ళియుందువుకదా!" అని అనెను. ఆయొంటె "నీకుకూడ నాగుండెవంటి గుండె ఉండియున్నయెడల నీకు తెలిసియుండునుకదా!" అని యజమానికి బదులుచెప్పెను. అటులనే మనస్సుపైన సవారుచేయుచున్నట్టి ఆత్మకు నిజగృహ మెప్పుడు చేరుకుందునాయని తొందరగనుండును. కాని మనస్సునకు వేనవేలు పిల్లలు గలరు, దానికి వానియందు ప్రేమయు బంధనమును ఉండుటచే నది త్రోవలో ఆగిఆగి పోవుచుండును. నీచమనస్సునకును, ఉత్తమమనస్సునకును ఈవిధముగ నెల్లపుడు పోరా

టము జరుగుచు నే యుండును. ఆమనస్సు ఆత్మకు తోడ్పడినచో నాత్మ కెంతియు నానందము కలుగును. ఆయొంటె తనపిల్లయందు మోహమును విడిచి మజనూ యిష్టప్రకారము వేగముగా నడచినయెడల మజనూ కెంత సంతోషముగ నుండెడిది వగైరా వగైరా.

సత్సంగి తనమనస్సు నీవిధముగా లోంగదీసికొనవలెను. లేనిచో ఉపదేశము తీసికొన్నందువలన నుద్ధారమైపోవునని తలంచుకొనుట ఒకవిషయమును, నిజముగ నుద్ధారమైపోవుట వేఱువిషయమునని జ్ఞాపకముంచుకొనుడు. సత్యలోకముయొక్క మాహాత్మ్యమును వినుట యొకవిషయమును, సత్యలోకములో వెళ్ళిచేరుకొనుట మఱొకవిషయమును. ఈపని తప్పకుండ నెప్పటికైన చేయవలసినదే. కాని యీలోకములో చాల ఆపత్తుల పాలైపోయి జీవితమంతియు, మహావ్యాకులత్వముతో గడపవలసివచ్చును, అట్లుగాక మనస్సును లోంగదీసికొనియున్న యెడల ఈలోకములోను సుఖముగ నుండవచ్చును, మరణానంతరముగూడ శాంతియుతమై యుండవచ్చును.

## 126

### సంత్ సద్గురువు నిజమైన తల్లియు, తండ్రియు.

31 డిసెంబరు 1917 :—ఒకమనిషికి 8, 9 గురు పిల్లలుండి, వారందఱును చనిపోయి, అతనికుక్కకు పిల్లలై పుట్టిరనుకొనుడు ఆకుక్కపిల్లలన్నియు తన చచ్చిపోయిన పుత్రులే యని ఇతనికి పూర్తిగా నమ్మక మెట్లైనను గలిగినచో నతడు అతనిభార్యయుగూడ నాపిల్లలను ఆయాడుకుక్క దగ్గఱనుండి తీసికొనిపోయి వానికి చాల జాగరూకతతో పాలనపోషణలు చేసుకొనవలయునని కోరుటయేగాక నిజముగకూడ నట్లుచేయగలరు. కాని ఆ ఆడుకుక్క అయితే తనపిల్లలను లాగుకొనిపోయి తనకు తనపిల్లలకునుకూడ వీరిరువురును ఘోరాన్యాయము చేయుచున్నారని భావించుకొనును. అది తనవలెనే వానినిగూడ నేలలో గొంయ్యత్రవ్వి ఆగోతిలో వెచ్చగ పరుండబెట్టవలెననియు తనపాలు ఇవ్వవలెననియు, ఇత్యాదివిధముగ కోరుచుండును. సంత్ సద్గురువునకును, విద్యార్థుల తల్లిదండ్రులకును మధ్యన పరిస్థితిగూడ నీరోజులలో నీరకముగనే యున్నది.

# 127

## వివిధ హితోపదేశములు.

31 డిసెంబరు 1917 :—1) ధనము భూములకొఱకును కోరికను చాల వఱకు దివ్యేచ్ఛ కే విడిచిపెట్టుడు.

2) అభ్యాసములో తేజఃప్రకాశములుకాని, స్వరూపముకాని, ప్రకట మైనచో అంతమాత్రముచేతనే అభ్యాసము సఫలమైనదని యెంచుకొనకుడు. పసిపిల్లలకు ఈలోకములో మొట్టమొదట జ్ఞానము గలుగుట ప్రారంభమైనపుడు "ధుడధుడి" అన్నట్లుగ నొక చప్పుడు గోచరమగుచుండును. తృతీయనేత్రము వద్ద చైతన్య మేకత్రితమైనపుడుకూడ నదేవిధమైన పరిస్థితి గలుగును. ఇది అసలైన పరీక్షసుమీ.

3) అభ్యాసమువలన సఫలత గలిగినను లేదా పశ్చాత్తాపము దుఃఖ మును గలిగిననుగూడ యుక్తమేకాని నిర్లక్ష్యభావము గలిగినచో నది దుర్లక్షణము.

4) ఒక విషయముపైన హుజూరువారీరోజున చాల నొక్కి చెప్పిరి. అదేమనగా నూటికి 95 గురు సత్సంగులకు అభ్యాసములో సాఫల్యము లేకపోవు టకు కారణము, వారు తమ మెదడును తెలివితేటలను ఉపయోగించి అభ్యా సము చేయుటకై యత్నించుటయే. తమమెదడునకు బదులుగా హృదయము నుపయోగించినచో ఫలితము చాల బాగుగనుండెడిది. దీని భావమేమనగా, సత్సంగి హృదయములో రాధాస్వామిదయాళునియందును, సద్గురువునందును భక్తివిశ్వాసములుండి ఆ భక్తివిశ్వాసములమూలమున నభ్యాసముచేయవల యును కాని యేదో యొక కర్తవ్యపాలనముకొఱకై అన్నట్లుగను లేదా ఒక నియమమును పాలించుటకొరకై అన్నట్లుగను అభ్యాసము చేసినచో లాభముం డదు. ప్రప్రథమములో నిట్టినియమము పెట్టుకొన్నందువలన, స్మరణ, ధ్యాన భజనలు పద్ధతిప్రకారము సాగిపోవును. అట్లు స్మరణ, ధ్యాన, భజనలు చేయు టచే ప్రేమయు, విశ్వాసమును బయల్దేరును. అయితే, అప్పుడు ఆనియమమును వదిలిపెట్టవలెను. అయినను, మొదటలో ఆనియమము లేనిచో పనిసాగదు.

5) నిజమునకు భాషాభాగము (part of speech) ఒక్కటే, అనగా సంజ్ఞావాచకము (Noun) ఒక్కటే యున్నది. మనము హృదయమున ననేక సంజ్ఞావాచకములను (Nouns) స్మరించుచు, ధ్యానించుచు నుండుటచే నీప్రపంచములో చిక్కుపడిపోయితిమి. తిరిగి ఆస్థానమువద్ద నొకే సంజ్ఞావాచకమును స్మరణధ్యానములు చేసినచో నీలోకమునుండి దాటిపోగలము.

6) ఈ భండారాలో మూడువిషయములు సెలవిచ్చిరి. ప్రతిసత్సంగియు తానీవిషయములను ఆచరణలో నెంతవఱకు పెట్టుకొనగల్గెనో రాబోవు భండారానాటికి పరీక్షించుకొనవలయును.

మొదటిది పై రెండవపేరాలో చెప్పిన ప్రజ్ఞను (consciousness) సంపాదించుకొంటిమా లేదా అనియు లేక మహారాజసాహెబ్ వారు మొదటి ఆఱు మాసములు సెలవుపెట్టి అభ్యాసముచేసి తమమనస్సును లొంగదీసికొన్నవిధముగా మనస్సును స్థిరముచేసికొంటిమా లేదా అనియు లేక స్మరణధ్యానములు చేసి భక్తివిశ్వాసములను వృద్ధిచేసికొంటిమా లేదా అనియు మీరు పరీక్షించుకొనవలెను. ఉద్ధారమైతే స్మరణధ్యానములు చేయుటవలననే గలుగనేరదు. అయినను స్మరణధ్యానములు చేసికొనుచుండినందున మీలోపాలోపములు మీకు బోధపడి, మీ భక్తివిశ్వాసములు వృద్ధియగుచుండును. అటుపిమ్మటనే మీకుద్ధారము లభించును.

రెండవవిషయ మేమనగా, మీరు స్మరణ ధ్యానభజనలు, సత్సంగము, సేవయు బుద్ధిబలముతోగాకుండ హృదయపూర్వకముగ చేయుచున్నారో లేదో గమనించుకొనవలెను.

మూడవది ప్రాపంచికవిషయములలో జయము గల్గుట మీ పారమార్థికాభ్యాసమునకు ఫలితముగ నెంచుకొనకుడు. మీ భక్తివిశ్వాసములను దృఢపఱచునిమిత్తమైమాత్రమే మీకు ఆ లౌకికజయము కలుగజేయబడుచుండును.

7) సంత్ సద్గురుని సత్సంగములో కూర్చుండినపుడు నీహృదయమును, కండ్లను తెఱచి యుంచుకొనుము. అనగా అర్థము కండ్లు మూసికొనవద్దనియే, కాని అంతమాత్రము చాలదు. మీశ్రద్ధను తృతీయనేత్రమువద్ద నేకాగ్రము చేసి యుంచుకొనుటకూడ ముఖ్యావసరము. ఉత్తకన్నులుమాత్రము మీరు

తెలియజేసుకొనియున్నను, మీ మనస్సు నలుదిక్కులకు నదేపనిగ పరుగులెత్తుచున్న యెడల, వారు తమ దయాదృష్టిని మీపైపునకు త్రిప్పినపుడు మీరక్కడ నుండ కపోవుటచే మీరాలాభమును పొందలేకుండ పోవుదురు. సత్సంగసమయము లోనే కాని మరొకప్పుడు ఆ దయాదృష్టి పడదనుకొనుటకూడా పొరపాటు. మహారాజసాహబ్ వారి దయాదృష్టి, వారు కచ్చేరికివెళ్ళెడి సమయములో చాల యెక్కువగా పడుచుండెడిది.

## 128

### అంధవిశ్వాసమును విడిచిపెట్టి సద్గురువు నన్వేషించవలయును.

1918 :—అంధవిశ్వాసమును కుదుర్చుటకు దేహపతనమేగాని మరొక ఉపాయములేదు. పూర్వపు సద్గురువునందే విశ్వాసము పెట్టుకొని, సారబచన్ (గద్య) లోని 250 వచనములో సమకాలిక సజీవసద్గురువును వెదకుకొనుడని చెప్పిన హితోపదేశమును నిర్లక్ష్యము చేసినవారు రాధాస్వామిదయాళుని సంపూర్ణవిస్పష్టశిక్షణకు విరుద్ధముగ ప్రవర్తించుచున్నారు. అట్టి అంధవిశ్వాస మును కుదుర్చుటకు ఆశరీరమునుండి తప్పించుటతప్ప మరొక చికిత్సలేదు. ఏదైన నొకవిషయమును గురించి కాని, మనిషినిగురించికాని యధార్థవిచా రణ చేయునిమిత్తమై మనము మన ఇంద్రియములు, బుద్ధియు, ఈరెండిటిపైననే ఆధారపడుచుందుము. బుద్ధికూడా ఇంద్రియములమీదనే ఆధారపడియున్నది. ఇంద్రియములు పంచతత్త్వములతో సంబంధము కలుపుకొనకుండగనే పనిచెయ్య నేరవు. ఉదాహరణకు కన్నుచూడవలెనన్నయెడల, కంటిగ్రుడ్డులో అగ్ని తత్త్వము ఉండకపోయినను, ఆ అగ్నితత్త్వము బయటనుండిపడిన ఛాయల కంప నములను లోనికి పంపకుండినను, చూచుటకు శక్యముకాదు. కావున సద్గురు వును గుర్తుపట్టుట కెవరైన తల్చుకొన్నపు డత డాధారపడు సాధనము లీరెండే. కాని ఈసాధనములు పృథివి, జలము, వాయువు, అగ్ని, ఆకాశమున నెడి పంచ తత్త్వముల నతిక్రమించ నేరవు. కాబట్టి సంతిసద్గురువు పంచతత్త్వములతో తయారైనవారు అయినపుడే, వారిని మానవుడు తెలిసికొనుటకు వీలుండును. అయితే వారు ఈ పంచతత్త్వములతో తయారైన పదార్థము కారు కావున మానవునకు వారిని తెలిసికొనగల సామర్థ్యము లేదు. అయినను ఎవరైన తన అశక్తతను అసమర్థతను గ్రహించుకొని జిజ్ఞాసుభావముతో నన్వేషణచేసినచో,

250 వచనము రెండవ భాగములో చెప్పినప్రకారము అట్టివానికి ఆపరమపురుషుడే స్వయముగ తనజాడ తెలిసికొనులాగున సహాయము చేయును. ఆవిధముగా నతనికార్యము చక్కబడిపోవును. భగవంతు డతనికి తనజాడను ఈ ఘట్టములోనే తెలియులాగున చేయును. కాని అతడిట్టి భావములేకుండా కేవలము అహంకారియైనను లేదా ఒక ప్రత్యేకస్థానములో జరుగుచుండెడి కార్యక్రమమును తారుమారుచేయవలయునను భావముతో నున్నను, అదికూడ అంధవిశ్వాసముక్రిందనే వచ్చును. అట్టి అంధవిశ్వాసమును తొలగించుటకు చికిత్స ఆశరీరమునుండి తప్పించుట యొక్కటే.

# 129

## సద్గురువు చూపెడి దయను లోలోపల జీర్ణము చేసికొనుచుండవలయును

4 సెప్టెంబరు 1918 :—యుద్ధజ్వరము ఈ ఆగ్రాపట్టణములో చాల తీవ్రముగ వ్యాపించిపోయినది. దయాల్బాగులోకూడ కొందరు ఈజ్వరబాధచే పీడితులై యున్నారు. దీనికి ఉపయోగించునట్టి చవుకైన మం దేమున్నదని మొన్నసాయంకాలము హుజూరువారు విమర్శించిరి చర్చచేయుచు చిట్టచివరకు దీనికి మందు తమలపాకులే అని వారు సెలవిచ్చిరి. ఆప్రకారము ఈ జ్వరముతో బాధపడుచున్నవారికి మాత్రమే తమలపాకుల నిమ్మని వారు మొదట సెలవిచ్చి, పిమ్మట నందరును ప్రార్థనచేసినందున వారు అందరికికూడ నిమ్మని ఆజ్ఞయిచ్చిరి. ఆప్రకారము తమలపాకులు తెచ్చి అక్కడనున్న యావత్తు సత్సంగులకును పంచిపెట్టిరి. మధ్యలో నొక స్కూలుమాష్టరు తాను తమలపాకులు తీసికొన్నపిమ్మట, తన స్కూలులో పదిమందిపిల్లలకుకూడ జ్వరముగ నున్నదని చెప్పి వారికొఱకై తనబట్టజాచి తమలపాకు లిమ్మనికోరెను. అంతట హుజూరువారు ఇప్పుడిక ఉత్తతమలపాకులే మిగిలినవి కాని, వాని ప్రత్యేక మహిమ వెనుకకు తీసికొనిపోబడినదని సెలవిచ్చిరి. రెండురోజులతర్వాత నెవరికైన నింకను జ్వరములు వచ్చుచున్నవా అని వారు వాకబుచేసిరి. చాలమందికి జ్వరములు తగ్గిపోయినవని తెలిసినది. కొద్దిమందికి క్రొత్తగా జ్వరములు ప్రారంభించినవనికూడ చెప్పిరి. ఆసందర్భములో హుజూరువారు సత్సంగి దయను జీర్ణముచేసికొను స్వభావము నలవర్చుకొనవలయునని వచనము సెలవిచ్చిరి. 1896 వ సం॥రములో హిందూదేశములో ప్లేగు వచ్చినది. 1897 వ సం॥రము

వఱకు నేసత్సంగియు నా ప్లేగుమూలమున చనిపోలేదు. మహారాజసాహెబ్ వారు ఒకగుప్తసదుద్దేశ్యముతో సత్సంగులకు ప్లేగు రానేరదని సెలవిచ్చిరి. అంతట నొక పంజాబుదేశపు సత్సంగి ఆరోజుననే తనయూరికి తొందరగ వెళ్ళిపోయి తన యింటికప్పుమీదకెక్కి, ఒక డోలు తీసుకొని వాయించుచు, ప్లేగు జాడ్యము రాకుండ నుండగోరినచో రాధాస్వామీమతములో చేరండి యనుచు బిగ్గఱగ నఱచుచు సాటించెను. దానికి ఫలిత మేమనగా అందఱికన్నముందు అతనికే ప్లేగుజాడ్యము వచ్చెను. ఆదయ పొందెడి అధికారము (privilege) అతనికి లేకుండపోయెను. ఈవిధముగా ఎవనికైనను దయ జీర్ణించుకొనగల శక్తి లేనియెడల అతని కంతకుముందు అనుగ్రహింపబడిన దయకూడ తప్పించబడిపోవుచుండును.

# 130

## సత్సంగములోనికి ఇతరులను రానివ్వకపోవుటకు కారణములు.

7 సెప్టెంబరు 1918 :— హుజూరువారు సబ్ రిజిష్ట్రారు ఆఫీసు కాంపౌండులో కూర్చుండియుండగా, ఇద్దరు మెడికల్ కాలేజీ విద్యార్థులు వచ్చి వారిని కలుసుకొనిరి. అందులో ఒకరు అదివఱలో తాను చదువుకొనుటకై తీసికొని వెళ్ళిన జిజ్ఞాసాగ్రంథమును వాపసుచేసి వారితో మాటలాడునిమిత్తమె వచ్చెను. రెండవమనిషి అతనితోకూడా వచ్చెను. సత్సంగేతరులను సత్సంగము జరుగుచున్నపుడు లోని కెందుకు రానివ్వరనుప్రశ్న వచ్చెను. ఎవనికైనను ముక్కుయొక్క ఆఘ్రాణశక్తి నశించిపోకుండ నున్నయెడల అతనికి సువాసనలు, దుర్వాసనలు అన్నియు తెలియుచుండును. ఎచ్చటనైన దుర్వాసన ఉన్నచో నచ్చట కూర్చుండుటయే కష్టమైపోవును. సామాన్యమైన దుర్వాసనలకే ముక్కుకు రొంపపట్టినట్లైపోవును. అటులనే సత్సంగములో ఒకసత్సంగి కాని, ఒక సత్సంగేతరుడుకాని కూర్చుండి చిత్తవృత్తులను కట్టిపెట్టకుండా అనేకవిధములైన ఆలోచనలు చేయుచు నుండినయెడల సాధుసంతుల కచ్చట కూర్చుండుటయే కష్టమైపోవును. వారు చిత్తవృత్తుల నేకాగ్రముచేయు నభ్యాసము చేయింతురు. వారి సత్సంగములోని కెవరైనను వచ్చి అందులో ముఖ్యముగా ముందుకూర్చుండి, యేవేవో ఆలోచనలు చేయుచుకాని లేక గడ్డిగోసుకొనుచు, నేల త్రవ్వుచుకాని లేక జంబుఖానా దారములు పీకుచుకాని యుండినచో, వారికి

ఏదో చండాలపుపదార్థ మక్కడపెట్టినంత అసహ్యముగ నైపోవును అట్టిపరి స్థితిలో సాధుసంతులు సత్సంగమును త్వరగా ముగించవలసివచ్చును.

## 131

సత్సంగి తన అనుభవములను పైకి చెప్పకూడదు. సత్సంగుల ప్రీతి ప్రతీతులయొక్క శోచనీయపరిస్థితి. స్మరణ, ధ్యాన, భజనాభ్యాసముల మూలమున మనస్సుయొక్క పరిస్థితి మారవలయునుకాని లేనిచో కేవలము అభ్యాస మొక్కటి యెంతకాలముచేసినను ఉద్ధారము కానేరదు. భగవంతుని నుద్ధార మిమ్మని తీవ్రముగ ప్రార్థించుచుండవలయును.

7 సెప్టెంబరు 1918 :—ఉత్తరములువ్రాయు సమయములో హుజూరు సాహబ్జీమహరాజువారు మదరాసు సత్సంగియగు సత్యనారాయణగారితో, "నీవు ఈమతములో చేరితివి, ఇప్పుడు మీదేశమునకు వెళ్లుచున్నావుకదా అక్కడ నీ మతము నాక్షేపించెడివారి ఆక్షేపణలకు సరియైన సమాధానములు చెప్పి ఈమతము మిగిలిన మతములకన్న నెవ్విధముగ శ్రేష్ఠమో నచ్చచెప్ప గలుగునంత చక్కగా నీకీమత మవగాహన మైనదా" అని ప్రశ్నించిరి. తిరిగి ఆయనతో మీరట్ పట్టణపు సత్సంగియైన రామచంద్రుడుగారు వేసెడి ప్రశ్నలకు సమాధానముచెప్పి ఆయనతో చర్చ జరిగించుమని చెప్పిరి. ఆసందర్భములో సత్యనారాయణగారు తనకు ఈక్రింది అనుభవము గల్గెనని చెప్పెను. ఆయన 1908 సం॥రమునుండియు ఆధ్యాత్మికముగ చాల అన్వేషణ చేయుచుండెను, కాని యేమియు నుపయోగించలేదు. చిట్టచివరకు ఆయనకు హుజూర్ సాహబ్జీమహరాజ్ వారు స్వప్నములో దర్శనమిచ్చిరి. సత్యనారాయణగారు ఆతర్వాత స్వప్నములో కనపడిన పురుషుని రూపముగల మహాత్ముని కలిసికొనుటకై పకీర్లు, మహాత్ములు ననేకమందిని చూచెను. చివరకు సాహబ్జీమహరాజు వారు మద్రాసుప్రాంతములో సంచారము నిమిత్తమై మద్రాసు వచ్చినపుడు అతడు వారి నానవాలు పట్టెను. అంతటితో సత్సంగమైపోయినది కాని చాల మంది సత్సంగులు అందులో ముఖ్యముగ సేఠ్ నిహాల్ చందు సత్యనారాయణ గారిని ఆయన అనుభవమునుగురించిన వివరములను వాకబుచేయునిమిత్తమై వెంబడించుచుండిరి. సేఠ్ జీగారు సాయంకాలము సత్సంగములో తిరిగి ఈవిష

యమును లేవదీసి, సత్యనారాయణగారు తన అనుభవమును సాహబ్జీమహారాజు వారి యెదుటనే చెప్పుదునుకాని మఱొకలాగున చెప్పనంటున్నారని విన్నవించుకొనెను. సాహబ్జీమహారాజువారు సత్యనారాయణగారివైపు తిరిగి, అట్లు తన స్వప్నానుభవము వివరములు ప్రకటముచేసి చెప్పినందువలన నాయనకు చాల నష్టము గలుగుననియు, తన పారమార్థికానుభవముల నివ్విధముగ స్వల్పస్తుతికై ఆశపడి అమ్ముకొనకూడదనియు సలహా యిచ్చిరి. అంతట సేఠ్ జీ అనుభవముల నావిధముగా చెప్పుకొన్నందువలన నేమియు హాని లేదనెను.

సాహబ్జీమహారాజువారు అందులో చాలనష్టమున్నదని సెలవిచ్చిరి. అదియునుగాక ఆవిషయము చెప్పెడివానికి తనగొప్ప శ్రోతలకు తెలియవలెనని కొంతవఱకును, చెప్పెడివిషయమునకు స్వారస్యము కలుగవలెనని కొంతవఱకును ఉద్దేశ్యముగల్గి అతడు అందులో కొంతకల్పనకూడ చేయుట ఆవశ్యకమని ఆలోచించుకొనును. దానివలన చెప్పెడివానికి వినెడివానికినికూడ నష్టముగల్గును. అప్పుడు సాహబ్జీమహారాజువారు మీరు ఇతరుల అనుభవములను వినవలెనని విపరీతాసక్తిగల్గి, అట్లు ఇతరుల అనుభవములను విన్నందువలన భక్తివిశ్వాసములు వృద్ధిపొందగలవని తలచుచున్నారు కావున, మీ కందఱికిని, నాకు గతించిన అయిదుసంవత్సరములలో సమస్తసత్సంగులను గుఱించి గల్గిన అనుభవము చెప్పెదను, వినుడని సెలవిచ్చిరి. సమస్తసత్సంగులును చాల ఉత్తమశ్రేణిలోని భక్తులనియు, నిజముగ సత్సంగమందు ఆసక్తిచేతనే వీరందఱు నిచ్చటికి వచ్చిరనియు, మేము మొదటలో ననుకొనుచుంటిమి. వీరందఱికిని సత్సంగములోనికి వచ్చినందువలన వసతివిషయములోను, ఆహారపానీయముల విషయములోను చాల యిబ్బందికలుగుచున్నదని ఆలోచించి, అట్టిశ్రమలు వీరికి లేకుండా తప్పించిన యెడల వీరు సంపూర్ణశ్రద్ధతో భగవంతుని భక్తిసాధన చేసికొందురని నాకు తోచినందున, నేను ఆవిధమైన యేర్పాట్లు చేయించితిని కాని యిప్పుడు చూడగా అదంతయు పైపై ఆడంబరమేనని తెలియుచున్నది. ఇంటర్వ్యూ (Interview) సమయములో పరమార్థము కావలెనని చెప్పుకొని వెక్కి-వెక్కి-యేడ్చినవారి మనస్సులో కొద్దిగ చెయ్యివేసి అటునుండి యిటు త్రిప్పి చూచినంతనే వారిలోనుండి కేవలము స్వార్థధారలు కారిపోవుచున్న పరిస్థితి గలవిగ కనబడుచున్నవి. నూటికి 99గురు సత్సంగు లెట్లున్నారనగా, పైపైకి పరమార్థమను నెపము పెట్టుకొన్నారేకాని లోపల స్వార్థమే ప్రధానముగనుండి, వారికి

స్వార్థవిషయములలో నీనాడు సౌకర్యములు కొద్దిగ తగ్గిపోయినయెడల, మఱు నాడే వారి విశ్వాసము పూర్తిగ నశించిపోవునట్టిపరిస్థితిలో నున్నారు. ఇక వీరి విశ్వాసము (ప్రీతి) యెట్లున్నదనగా, వీరిలో నూరుగురిలో 95 మంది కీ మతసిద్ధాంతము లెట్లున్నవోకూడ తెలియకుండగనుండి, కేవలము స్వార్థకార్యములలో కార్యసిద్ధి యగుచున్న హేతువుమూలముననే వారు రాధాస్వామీ దయాళురియందు ప్రతీతి పెట్టుకొనియున్నారు. ఇందులో తిరిగి నూటికి 80 మందికి మతము నవగాహన చేసుకొనవలయుననెడి యుద్దేశ్యముకూడ లేదు. అట్లు కేవలము నంధవిశ్వాసముతోనే యుండిపోయిన చాలునని వారియభిప్రాయము. ఇక సత్సంగుల ప్రీతి యేపరిస్థితిలో నున్నదనగా లౌకికకార్యసిద్ధియొక్క హెచ్చుతగ్గులపైననే ఆధారపడియున్నది. ఈమనస్సు పరిస్థితి మొదటినుండియు నట్టిదే. దాని సరుకే ఆవిధమైనది. పరమార్థమున కధికారమే దానికి లేదు సరికదా, పైగా దానికెప్పుడును పరమార్థముతో విరోధమే.

కబీరుసాహబ్ వారు కృతయుగములో వచ్చిరి. కాని వారిమాట నప్పుడెవరును లెక్కసేయలేదు; పైగా వారిని కట్టపుచ్చుకొని కొట్టబోయిరి. తిరిగి వారు త్రేతాయుగములో రాగా, ఒక్కమనిషిమాత్రమే వారిమాట వినెను. తర్వాత వారు తిరిగి ద్వాపరయుగములో వచ్చినపుడు వారికుటుంబమువారు ఆఱుగురు లేక ఏడుగురుమాత్రమే వారిమాటను విశ్వసించిరి. తిరిగి వారు కలియుగములో రాగా, పదునారుగురు, పదునేడుగురుమాత్రమే వారి బోధలను వినిరి. హుజూర్ మహారాజ్ వారు ఇంకను కొన్నిసంవత్సరములపాటు సత్సంగము చేయుచు నుండిపోయెడివారేకాని వారి కెదురుగ మునుముందు చోట్లలో కూర్చుండెడి గొప్ప గొప్ప ప్రముఖసత్సంగుల పరిస్థితినిబట్టి వారు త్వరగా వెడలిపోవలసివచ్చెను. మేముకూడా సత్సంగులకు అన్ని సౌకర్యములను ఏర్పాటుచేసిన యెడల వారు బంధనరహితులై భగవద్భక్తి చేసికొనుచుందురనియు, అట్లైనచో 1000, 2000 మంది సత్సంగుల నీజన్మలోనే ఉద్ధారమునకు అధికారముగలవారిని మాతోకూడ తీసికొనిపోగల సావకాశము గల్గుననియు మేముకూడ భావించుకొనుచుంటిమి. కాని ఒహో మానవుడా! నీకే యెల్లప్పుడును గెలుపు! కృతయుగము లగాయితు ఇంతవఱకు నెప్పుడు నీయాటలే సాగినవి. సాధుసంతు లందఱు పరాజితులైపోయిరి కాని, నీ కేమియు చింతలేదు. ఒక సహస్రము, లేక రెండుసహస్రముల మంది సత్సంగులైనను ఈజన్మలో మాతోకూడ పైకి రాగ

ల్గుట కష్టమైె యున్న యెడల మేము ఒక ఘనకార్యము చేసినట్లుగ భగవంతునికి సూచింపవచ్చునని ఆలోచించితిమి. కాని అయ్యో! అట్టి సూచన లేమియు కానరాకున్నవి!

మీరందఱు నేవో స్మరణ, ధ్యాన, భజనలు, సేవాసత్సంగములును చాల అధికముగ చేయుచున్నామనియు, పరమార్థము సంపాదించుకొనుచున్నామనియు ననుకొనుచున్నారు. కాని, అదంతయు పొరపాటు. ఈప్రకారము మీరు మీజీవితమంతయు చేసికొనుచునే యుండుడు, కాని యీషణ్మాత్రము గూడ ఫలితముండదు. అందుకొరకు నుండవలసిన మానసికవ్యవస్థయే పూర్తిగా వేఱు. ఆమానసిక వ్యవస్థయే యుండినచో, స్వల్పమాత్రము అభ్యాసము చేసినందువలననే మీపడవలు ఒడ్డునకు చేరుకొనగలవు. ఇప్పుడు మీకున్న మానసికవ్యవస్థతో, అనగా frame of mind తో, మీరు యావజ్జీవము పాటుపడినను మీకేమియు ఫలించదు. స్మరణధ్యానములవలన గల్గునది ఉద్ధారము కాదు, వానిమూలమున మీమనస్సున కొక ప్రత్యేకవిధమైన క్రొత్తవ్యవస్థ గల్గును. తద్వారా మీఆత్మకు కొద్దిగ జాగృతి గల్గును. ఆ జాగృతిమూలముగ మీకు కార్యసిద్ధి గల్గును. మాకార్యము సఫలముకానిచో అవమానము భగవంతునికే గలుగగలదని సామాన్యముగ చెప్పుకొనునట్టి మాట చాల పొరపాటుఅభిప్రాయము. మొదటివిషయ మేమనగా నిర్గుణావస్థలో స్వధామమున విరాజమానమగునట్టి పరమపురుషునికి మానావమానములతో సంబంధ మేమున్నది! రెండు, మొదటినుండియు కబీరుసాహెబ్ మున్నగు మహాపురుషు లందఱకుగూడ నిట్లే జరుగుచున్నపుడు మాకుమాత్ర మట్టి అనుభవమే గల్గినచో అందులో క్రొత్తయేమున్నది? మూడవవిషయము, ఈవిధముగ భగవంతుని కవమానము నెన్నుటకు తయారైనవా రందఱును కలిసి ఈ యావత్సృష్టిలో నెన్నవవంతు అగుదురో ఆలోచించుకొనుడు. నాల్గవది, భగవంతునికి దేశము, కాలమును అనునవి లేనేలేవు కదా. ఈయావత్సృష్టికి నుద్ధారము ఒకానొకనాడైనను కావలసియేయున్నది. అనగా, భగవంతుడు తల్చుకొన్నయుద్దేశ్యము పూర్తిగ నెఱవేరియే తీరునుకదా. అయితే అట్లగుటకు నీపని పిప్పిపిప్పి యైపోవును. కావున నష్టము మీకు కలుగుచున్నదో లేక భగవంతునికో మీరే ఆలోచించుకొనుడు.

విషయ మెంతకఠినముగ నున్నది! మొట్టమొదట నాపరమపురుషుడు శరీరధారియైవచ్చిరి. రెండవది. మిమ్ములను పిల్చి తీసికొనివెళ్ళి సత్సంగములో జేర్చుకొనిరి. మూడవది, తిరిగి మిమ్ములను సత్సంగములో స్థాయిగనుండిపోవు లాగున చేసిరి. ఇంతచేసిననుగూడ పని యగుటలేదు. మీయుద్ధారము కాగల దను నాశ లేకున్నది. చూడగా చివరకా భగవంతుడే స్వయముగ మిమ్ముల నెత్తుకొనిపోయి, ఆమూలధామములో జేర్పించవలసియున్నట్లుగ కన్పించు చున్నది, సరే! అయితే ఇక మీరు గట్టిగ నేడ్చుడు, భగవంతుడు పైమూడు కార్యములను స్వయముగ తానే భారమువహించి నెఱవేర్చిరి కావున నాల్గవపని కూడా వారినే నెఱవేర్చిపెట్టుడనియు, మీపైన విడిచిపెట్టవద్దనియు భగవంతుని ప్రార్థనచేయుడు. క్రితము నాలుగుఅయిదేండ్లలో సత్సంగుల విషయములో మాకు గలిగిన యీపైఅనుభవమునుబట్టి నీతిపాఠము నేర్చుకొనుడు. కాని సత్యనారాయణయొక్క అనుభవవివరములను వాకబుచేయునిమిత్తమై ఆయన వెంట పడకుడు. అత్యంతగర్వితావస్థలో తిరుగుచున్న సత్సంగులందఱును తమ గర్వమును పరిత్యజించి యీ సునిశితవిషయమును అవగాహనచేసికొనుడు. నిరాశాభావములో పడియున్నవారు భగవంతుడెట్లైను మూడు పనులు స్వయ ముగనే చేసివైచిరి కావున, నాల్గవకార్యమునుగూడ వారినే స్వయముగ నెఱ వేర్చిపెట్టుడని ప్రార్థనచేయుడు.

మహారాజ్ కు శబ్దమును తీసి చదువుడని ఆజ్ఞ ఇచ్చిరి. సారబచన్ (పద్య భాగము) నుండి యీక్రింది శబ్దము వచ్చెను.

"గురూ మైం గునహగార అతిభారీ"

ఈశబ్దము రాగానే హుజూరువారు తాము సెలవిచ్చిన వచనమునకు ఇంక నధిక ముగ సమర్ధనమును కాని, దాని లోపములకు పూరణము కాని కావలెనన్నచో నీశబ్దమునుండి తీసికొనవచ్చునని సెలవిచ్చిరి.

ఈమధ్యలో పారమార్థికాభ్యాసము చేయుచుండినచో ఆత్మకు ఉత్ప్లవన శక్తి (అనగా పైకితేలిపోవు లక్షణము) బయల్దేరు ననెడివిషయమును గుఱించి కూడ సెలవిచ్చిరి. ఒకపాత్రను నీటిఅడుగున బోరగిల నొక్కి విడిచిపెట్టినచో నది వెంటనే పైకెగిరి యెట్లువచ్చునో, అట్లే నీకు అభ్యాసముచేయగా యోగ్యతగల్గి నపుడు నీకిచ్చట నాగియుండిపోవుటయే అసాధ్యమగును. ఈసృష్టి నిన్ను లేవ

నెత్తి, పైకెగురవేయును. నీ కేధామమున జేరుకొనగల అధికారముండునో ఆ ధామములోనికి నీవు వెళ్ళి చేరుకొందువు. కాని మీరింకను ఈలోకమునకు గట్టిగ బద్ధులైయుండిరేకాని మీకు కొద్దిగనైన ఉల్లిపనశక్తి జనించలేదు. పైగా ఇంకను క్రిందికి జారిపోవుచున్నారు.

## 132

మంగళాచరణములో ప్రథమద్విపద.

8 సెప్టెంబరు 1918:—మంగళాచరణములో నీక్రింది ద్విపద వచ్చును.

రాధాస్వామీ నామ్ జో గావే సోఈ తరే,
కల్ కలేశ సబ్ నాశ సుఖ పావే సబ్ దుఖ హరే॥

కొందరు దీనినిబట్టి "మనకుపదేశము లభించినది కనుక నికమీదట నెట్టి కష్టములు ఆపత్తులునుగూడ మనకు సంభవించగూడదు. మన కష్టములన్నియు నశించిపోయినవి", అని భావించుకొనుచుందురు. ఇంకను ఆంగ్లగ్రంథములో నీమతముయొక్క యుద్దేశ్యమే దుఃఖనివృత్తి యని వ్రాయబడి యున్నదికదా. అందుచే మన కింతటినుండి యెట్టి కష్టములును, బాధలును గలుగనేకూడదని వారెంచుకొనుచుందురు. ఇది పూర్తిగా తప్పుటభిప్రాయము. ఈద్విపద కర్థ మిది కానేరదు. సూడుడు, హిమాలయపర్వతశిఖరముపైనున్న ఆవుయికి కూడా దుఃఖనివృత్తి యైపోయినది. చక్రవర్తిగారి శునకములకు, ఉంచుటకై మంచిమంచి గదులుండును, వాని సంరక్షణోపచారములు జరిగించునిమిత్తము డజన్లకొలది నౌకర్లు ఉందురు. యుక్తసమయములందు వానికి రకరకములైన ఆహారములు పెట్టుచుందురు. కావున వానికిగూడ దుఃఖనివృత్తి లభించినది. కావున రాధాస్వామీ మతముయొక్క ఆదర్శ మింతమాత్రమేయైనచో దాని సిద్ధాంతము చాల నీచమైనదని నిర్ణయించవలసివచ్చును. ఈమతముయొక్క అసలు ఆదర్శము దుఃఖమునుండి నివృత్తియు, పరమానందప్రాప్తియునే. దుఃఖమునుండి నివృత్తియనగా సామాన్యముగ ననుకొనుచున్నట్లుగా మన మీమతములో చేరితిమి, కావున మన కింక కష్టము లేమియు రానేకూడదని యభిప్రాయముకాదు. దీని అభిప్రాయ మేమనగా ఆత్మస్థానమువద్ద ఆత్మజిహ్వతో స్మరణచేసెడిశక్తిని సంపాదించుకొనుటయే. అట్టి సమర్థతగల్గినపుడు మనకేదైన

కష్టము గల్గినచో, వెంటనే మన మామఃఖముగలిగెడి ఘట్టమునుండి తప్పించుకొని దూరముగ లోనికి పోగలుగుదుము. ఈవిధముగా మనము దుఃఖనివృత్తిని పొందగల్గుదుము.

కొందఱు మొదట సత్సంగములో శాశ్వతముగ నుండిపోవలయు నని ప్రార్థనచేసికొనగా, ఆకోరిక యీడేరిన పిదప నేదోయొక మిష కల్పించి, 6 మాసములు లేక ఏడాది అయిన పిమ్మట తిరిగి వెళ్ళిపోవుటకు ప్రయత్నించుచుందురు. అది మంచిపద్ధతికాదు. నామప్యారాగారి భార్యనుగుఱించి హుజూరువారు ఆమె పెండ్లికాకముందు సత్సంగములో శాశ్వతముగ నివాస మిప్పించుమని యేడ్చుచు ప్రార్థించి, నామప్యారాగారితో వివాహమై ఆమె కోరిక తీరిపోయిన పిమ్మట సత్సంగము చేసికొనకుండ నిటునటు తిరుగుచున్నదనియు, ఏకారణము లేకుండానే మాటిమాటికి ఝుంగువెళ్ళిపోవలెనని విన్నవించుకొనుచున్నదనియు సెలవిచ్చిరి.

## 133

బంధనముల విచ్ఛిత్తిని గుఱించి.

9 సెప్టెంబరు 1918:—క్రితము వచనముపైననే తిరిగి చర్చించుచు, నీ లోకములో జీవునికి గొప్ప కఠినమైన బంధనము లున్నవని సెలవిచ్చిరి. శారీరక దుఃఖములు, మానసికదుఃఖములు, సంతానముయొక్క దుఃఖములు, బంధువర్గము యొక్క దుఃఖములు, తనకు సంబంధించినవారు, తనను ఆశ్రయించుకొన్నవారి దుఃఖములును, ఈవిధముగ నెన్నియో దుఃఖములనుండి నివృత్తి కావలసియున్నది. పైనచెప్పినట్లుగా బంధనములు తెగిపోవుచునుండుటకూడా దీని కొక పద్ధతియే. ఎట్లనగా. మనకు మన సంతానముతోను, బంధువులతోను సంబంధము విచ్ఛిత్తియైనచో వారి దుఃఖము మన నెట్లు బాధించగలదు. ఎవరైన నీవిధముగా చాల బంధనములు త్రెంచుకొన్నపిమ్మట, నతని కొకటి రెండు విషయములతోమాత్రమే బంధనములు మిగిలిపోయినచో, భగవంతుడు తప్పకుండగ నతని కార్యమును పూర్తిచేయును. ఏలననగా, అట్లు పూర్తిచేయనియెడల తనభక్తునికి ఆవిషయములో ఆశ యుండిపోవునని భగవంతునికి తెలుసును. కావున నాభక్తునికొఱకై ఆ పరమపిత అతని బంధువులనుకూడ సంరక్షణ చేయు

చుంగురు లేదా ఆబంధువుల కేదైనను ఆపత్తు తప్పక రావలసియుండిన పక్షములో నా ఆపత్తునుండి వారిని అద్భుతవిధముగ కాపాడెదరు.

## 134

దివ్యేచ్ఛతో పూర్తిగా సహకరించుట పరమార్థియొక్క ధర్మము. సేవయొక్క ప్రాధాన్యము.

10 సెప్టెంబరు 1918 :— గుమాన్ అను పేరుగల ఒక సాధువు తనకు చాల బాధగా నున్నదనియు, తనకుద్ధార మెప్పుడగుననియు చాల తఱచుగా అడుగుచున్నందున నీ క్రిందివచనము సెలవియ్యబడెను.

ఇట్లు తఱుచుగా ప్రశ్నించుటచే, భగవంతుని చరణములయందు ప్రేమ లేనట్లు తేటపడును. పరమార్థమందు అసలెట్టి ఆసక్తియు లేనివానికన్న నిట్టివాడు మెఱుగే అయినను ఇతని పరిస్థితి భగవంతుని యేర్పాటెట్లుండిన నట్లే సంతృప్తి నొందువానికన్న చాల హీనమైనది. తనప్రభువు దుఃఖముగాని సుఖముగాని యేపరిస్థితి కల్పించినను దానితోనే తృప్తిపొంది యుండుట సేవకుని ధర్మము. అట్టివాడే దాసుడనిపించుకొనును. భగవంతుని ఇచ్ఛ యెట్లున్నను అతడు సంతోషించవలసినవాడే.

సుల్తాన్ ఇబ్రహీమ్‌గారిదగ్గఱ కొకబానిస వచ్చెనట. సుల్తాను అతనిని నీవెవరవు అని అడిగెను. నేను దాసుడనని అతడు సమాధానము చెప్పెను. నీకు తిండి కేమి కావలెనని ప్రశ్నించెను. తా మేమి పెట్టిన నదియే తిందునని చెప్పెను. నీకు కట్టుకొనుట కేమికావలయును ? హుజూరువా రేమిచ్చిన నదియు చాలును. నీవేమిపని చేయుదువు ? హుజూరువా రేమిచెప్పిన నాపనియే. దాసు డెప్పుడు దాసుడేకదా. దాసునికి తన ఇష్టము అనునది ఉండనేరదు. తన యజమాని యేపరిస్థితిలో నుంచినను దాసుడు సంతోషించుచునే యుండవలెనని అతడు సమాధానము చెప్పెను. దానిపైన నాసుల్తానుకు తానుకూడ నితడున్న విధముగ నాభగవంతునికి దాసుడై యుండినచో తనకెంత యుత్తమగతి గల్గునోయని ఆలోచన గలిగెను. ఇంతకు పర్యవసాన మేమనగా, పరమార్థములో పూర్తిగా పతితమైపోయిన పరిస్థితికన్న నీపరిస్థితి మెఱుగే అయినను కూడ పారమార్థికశ్రేణిలో (scale) నిట్టివాని తరహా చాల హీనతరముగ నెంచబడును

సారబచన్ (పద్యభాగము) లో నుండి దివ్యేచ్ఛకు తీయగా నీక్రింది శబ్దము వచ్చెను :—

"గురు బచన కహేఁ సో సున రే;

హుజూర్ మహారాజ్ వారు భజనాభ్యాసము చేయవలసినదని చాలనొక్కి చెప్పెడివారు. సత్సంగులు చాల అహంకారపూరితులై పోయిరి. సృష్టివిధానముయొక్క వివరణమును గురించి మహారాజసాహబ్ వా రెక్కువగా నొక్కి చెప్పెడివారు. అందఱు నదే ప్రధానవిషయముగ నెంచుకొని దానిలోనే చిక్కుకొనిపోయిరి. సర్కార్ సాహబ్ వారు నిజధార యెల్లకాల మిచ్చట నల్లే యుండిపోవునని చాల తీవ్రముగ ప్రచారముచేసిరి. కాని ముందుండెడి ప్రముఖసత్సంగుల కార్యక్రమము మూలమున వారు పూర్తిగా జీవించలేదు. మేము సేవయొక్క ప్రాధాన్య మెక్కువ పట్టుదలగా చెప్పుచున్నాము. ఇచ్చట ప్రస్తుతములో మనము స్థాపించునిమిత్తమై గట్టిగ ఆలోచనసేయుచున్న విద్యావ్యాసంగము, ఇటికె ఆవములు, ప్రసవస్త్రీల ఆసుపత్రి భవననిర్మాణము, జనాభా లెక్కలు మున్నగు విషయములన్నియు పైపైకి చూడగా ప్రాపంచికవిషయములుగనే కన్పించును. కాని ఒక వ్యత్యాసమున్నది. ఈపనులన్నియు కేవలము మా లాభముకొఱకే చేసినయెడల నవి నిస్సంశయముగ స్వార్థవిషయములే యగును కాని సత్సంగుల క్షేమముకొఱకై చేయుచున్నపుడు అవన్నియు పూర్తిగా భగవత్సేవయే అగును, వాని ఫలితముగూడ శ్రేష్ఠముగనే యుండును.

పవిత్రగ్రంథములలో నట్లు వ్రాసియున్నదనికాని లేక అది తాము చేయవలసిన విధియనిగాని, అట్లు చేయుటచే నుత్తమలోకములు తెఱచుకొనిపోవునని కాని ఈవిధమైన ఆలోచనలు పెట్టుకొని, చెవులు మూసికొని అభ్యాసములో కూర్చుండువారును, గ్రంథపాఠమును చేయుచు భేంట్లనిచ్చుచు, సేవచేసెడివారందఱును, రిక్తహస్తములతో నుండిపోవుదురు. అట్లుగాక ఈపనిని భగవంతునిసేవ యనెడి భావముతో నెవరు చేయుదురో వారికి దానివలన జయము లాభముగూడ గల్గును.

సారాంశము :—ఈ పనులలో మానసికమైన భావముగూడ నుండవలెను. శరీరముతో మాత్ర మీపనులను చేయుచు, మానసికముగ వానియందు శ్రద్ధా

భావము లేనిచో నది నిష్ప్రయోజనమైపోవును. ఇకముందు మీరు సత్సంగ ములోని కేవ్పుకు వచ్చినను, పగటిపూట నిద్రపోవుట కాక పహరాపని కాని, ఖానా వగైరాలలో నేదోయొకపని కాని పూచీపెట్టుకొని చేయవలసియుండు నని జ్ఞాపకముంచుకొనుడు.

సాహబ్జీమహారాజువారీనాడు ఖజాంచీగారిని ఖానాకు వెళ్ళి యే యే సత్సంగు లక్కడ పనిచేయుచున్నారో చూచిరమ్మని పంపించిరి. సేవచేయని దే పనిసాగదని సెలవిచ్చిరి. మేము యేదైన సొంతపని చేయించుకొన్న యెడల. నౌకర్ల ఖర్చు తగ్గించుకొనుచున్నామని నెపమన్నవచ్చునుకాని ఈపనులన్నియు సత్సంగమునకును, భగవంతునికిని చేయుసేవాకృత్యములు. ఇకముందు తప్ప కుండ శ్రద్ధవహించి యీపనులలో పాల్గొనుచుండుడు. ఖానాలో చాల తక్కువమంది పనిచేయుచున్నారని తెలియగా ఇకముందొక జమాదారుని నియోగించి సేవ బలాత్కారముగ చేయించవలసియుండునని సెలవిచ్చిరి. స్వేచ్ఛాపూర్వకమైన పద్ధతిని సేవ సాగుటలేదు.

ప్రతి సత్సంగియు రోజునకు తప్పకుండ మూడుగంటలసేపు పనిచేయవల యును. ఇటునటు తిర్గాడుటలోను, నిద్రపోవుటలోను లాభమేమున్నది. మహా రాజసాహబ్ వారు గుప్తమైనపిదప సర్కార్ సాహబ్ వారు గురుపదవి నలంక రించిరి. ప్రేమప్రసాదు మున్నగువారందఱును భజనాభ్యాసము తాము చాల యెక్కువగా చేయుచుండెడివారనియు, సర్కార్ సాహబ్ భజనచేయుటలో తమరి నెన్నడు మించలేరనియు చెప్పుచుండెడివారు. ఖేమచంద్రుగారు తాను గురువచనములను చాల శ్రద్ధగా విని వ్రాయుచుండెడివాడనియు, తనకన్న సర్కార్ సాహబ్ వా రెట్లెక్కువకాగలరనియు వాగుచు నట్లే యుండిపోయెను అయినను, సర్కార్ సాహబ్ వారిసేవయే వీరందఱికన్న మించిపోయెను.

## 135

సద్గురువు నిజమైన పరమార్థభాగ్యము కోరినవారివిషయములో చూపెడి పరివర్తన. సత్సంగకార్యకర్తల ఆజ్ఞలను, ఆక్షేపణలు, మందలింపులను, నమ్రి తతో మన్నించవలయును.

11 సెప్టెంబరు 1918:— నాజరుగారు వగైరాల సిఫారస్ మూలమున సర్కార్ సాహబ్ వా రొకవిద్యార్థికి విద్యార్థివేతనము (scholarship) నిచ్చ

చుండెడివారు. సర్కార్ సాహబ్ వారు గుప్తమైనపిదప సాహబ్జీమహారాజువారు అతనికి వేతనమునిచ్చుట ఆపుచేయదలచిరి. కాని అమరనాథచక్రవర్తిగారు సిఫారసుచేయుటచే ఆవేతనము నట్లే యిచ్చుచుండిరి. ఆపిల్లవాడు 10వ క్లాసు వఱకు వచ్చెను కాని ఆక్లాసులో మూడుసార్లు పరీక్షయిచ్చినను కూడ నుత్తీర్ణుడు కాకపోయెను. ఆపిల్లవాడొకఅర్జీపెట్టుకొనగా అందుపైన హుజూర్ సాహబ్జీ మహారాజువారు సెక్రెటరీచేత నాపిల్లవానికి ఇకమీదట విద్యార్థివేతనము పొందుట కర్హత లేదని సమాధానము వ్రాయించి, ఆవేతనము నిచ్చుట ఆపుచే యించిరి. దాని కాపిల్లవాడు బహుదురాగ్రహముతో "నావిద్యార్థివేతనము ఆపుటకు సెక్రెటరీయెవరు ? మీరు ధనాఢ్యులవద్దనుండి ధనమును మాబోటి బీదల కిచ్చుటకేగదా వసూలుచేయుచున్నారు. అట్టిపరిస్థితిలో నా వేతనమును ఆపివేయుటకు మీకేమి హక్కున్నది వగైరా" అని సమాధానము వ్రాసి పంపెను. ఈపిల్లవాడు బరేలీలో నున్నాడు. ఈసందర్భములో హుజూరువారు, సుమతిదానము మహావరప్రసాదమనియు. నది లేనియెడల స్మరణ, ధ్యాన, భజనలు. సత్సంగము, సేవయు, బొత్తిగ వ్యర్థమే అనియు సెలవిచ్చిరి. అది లేనిచో మనిషి సరిగా ప్రవర్తించలేడు. ఏమనిషికైనను ఈసుమతి లేనట్లు నిదర్శన మేమనగా సత్సంగకార్యకర్త లెవరైనను తమ ప్రబంధవిషయములో నేమైన మాట చెప్పినపుడు, అది అతనికి అప్రియముగ నున్నచో నతనిలో నొకవేడి బయల్దేరి అతడు దెబ్బలాడుటకు, చంపి చచ్చుటకును కూడ తయారై పోవును. అతనికి సుమతిదానమున్నయెడల, నెట్టివేడియు బయల్దేరదు. కోపమును రాదు, పైగా నా ప్రబంధకర్త చెప్పినమాటను భగవదాజ్ఞక్రింద నెంచుకొని, ఆప్రకారము నడచుకొనుటకు ప్రయత్నము చేయును. తనమనసున నతడు "దీనిలోని సదుద్దేశ్య మిప్పుడు మనకు తెలియుటలేదు కాని దీనిలో భగవంతునికి తప్పకుండ నేదో సదుద్దేశ్య ముండియే తీరును. అది యుక్తసమయములో మనకు తెలియగల"దని యూహించుకొనును. ఈ ప్రబంధకర్తల ఆజ్ఞలను తిరస్కరించుట వలన గలిగెడి నష్ట మిప్పుడు మనకు తెలియదు. దానివలన మహాపత్తులను సహించవలసివచ్చును. హుజూర్ మహారాజువారు, మహరాజ్ సాహబ్ వారు, సర్కార్ సాహబ్ వారును కొందఱి సత్సంగులతో నవ్వుచు మాట్లాడుచుండెడి వారు. ఆసత్సంగులు తమప్రవర్తన చాల బాగున్నదనియు, బాగులేనిచో వారు తమతో నట్లు నవ్వుచు నేల మాట్లాడెదరనియు, వారికి తమయందు చాల

ప్రీతియున్నదనియు ననుకొనుచుండెడివారు. కాని వారు చాల పెద్దపొరపాటు పడిపోయిరి. ఎవరునుగూడ సంతు లట్లునవ్వు మాటలాటవలన కాని, లేక మఱొక సరసవిధమున ప్రవర్తించుటవలన కాని వారికి తమ్ముగుఱించి గొప్ప అభిప్రాయ మున్నట్లు అనుకొనకూడదని సత్సంగులకు మేము చాలసార్లు చెప్పితిమి. మనలో నెవరైనను భగవంతుని నాంతర్యమున కాని బాహ్యముగా కాని, "ఓ పరమపురుషా, మా కిప్పటికైనను మనస్సును స్వార్థమునుండి మఱలించుము. మాకు పరమార్థదాన మిప్పించు"డని హృదయపూర్వకముగా ప్రార్థించినయెడల వారు మీవైపునకు కన్నెత్తి చూడనైన చూడరనియు, అదివఱలో మీతో జరుపుచుండిన నవ్వులు, సల్లాపములన్నియుకూడ కట్టిపెట్టివేయుదురనియు, మీ విషయములో నొకవిధమైన వైముఖ్యముతోగూడ ప్రవర్తింతురనియు మీకందఱకు అనుభవరూపముగ నీపాటికి తెలిసియేయుండును. దీనికి కారణమేమనగా, మొదటలో మీతో ప్రవర్తన సామాన్యమానవుడు ప్రవర్తించువిధముగ నుండెడిది. మానవత్వముతో ప్రవర్తించినపుడు వారి హృదయము మహాకోమలముగను, దయార్ద్రముగను ఉండును కాని పరమార్థదాన మీయవలసివచ్చినపుడు వారి ప్రవర్తన చైతన్యస్థానముతో సంబంధించినదై పోవుటచే పూర్తిగా కఠినముగ నుండును. ఆత్మ చాల నిర్దయగ నుండును. ఆత్మ మోమోటమిని లెక్కసేయదు. జీవితములోని దుఃఖసుఖములును, మృత్యుబాధయు హృదయస్థానములో అనుభవించబడును కాని ఆత్మస్థానమువద్ద మృత్యు వనగ నొకరూపాంతరప్రాప్తిక్రిందనే గణింపబడును. కాని అందులో నీషణ్మాత్రముగూడ వ్యత్యాసమేమియు కానరాదు. లోకములో లక్షలాది నిష్పాపజీవులు రోజు చంపబడిపోవుచున్నవి. వేనవేలు దారుణములు జరిగిపోవుచున్నవి కాని, అవేవియు నాత్మస్థానమువఱకు వ్యాపించవు. పైగా నచ్చట నీసమస్తకార్యకలాపమును యుక్తముగనే యున్నట్లు కనిపించును. సంతుల ప్రవర్తననుగుఱించి తెలిసికొనవలెనన్నచో కామిని యనునామె కేమైనదో చూడుడు. ఆమె సర్కార్ సాహబ్ వారికి సేవ యెంత మొండితనముగ చేసెడిది! ఆమె సిందూరము (బొట్టు) వగైరాలు పెట్టుకొని సర్కార్ సాహబ్ వారితో పెండ్లి అయినట్లుగ చేయించుకొన్నది. ఆమె మొండితనము చూచి సర్కార్ సాహబ్ వారు కొద్దిగ చిరునవ్వునవ్వి ఆమె మొండిపట్టును చెల్లించిరి. ఆమె ఈ మొండిపట్టుతోనే తుదువులసేవ చేయవలెనని నిశ్చయించుకొన్నపుడు, ఆతుమువులుకూడ సత్సంగులు భజనాభ్యాస మెచ్చట చేయుచుందురో అచ్చటనే చేయుచుండె

డిది. అట్లు చేసినందువలన నామె కేమి జరిగినదో చూడుడు. ఆమె చనిపోయి నపు డామెప్రాణము లెంత కఠినకష్టము గలిగినపిమ్మట పోయినవో, ఆమె యెంత మహాబాధ పడినదో చూడుడు. అయితే ఆమెబాధ అంతయు, నింకను పూర్తికాలేదు. ఆమె ఇంకను పాట్లు ముందు ముందు అనుభవించవలసియే యున్నది. ఆమె సత్సంగినికూడా అయియుండెను. అందుచే జననమరణచక్ర ములోపకైతే ఆమె పోనేరదు. కాని భగవంతు డామెకు మరొకవిధముగా బుద్ధిచెప్పగలరు.

స్వామీజీ మహారాజువారు,

"ఏక్ జన్మ గురు భక్తి కర, జన్మ దూసరే నామ్"

అనగా, "ఒకజన్మ గురుభక్తి చేసి, రెండవజన్మలో నామభక్తి చేయు"డని వ్రాసిరి. అయితే మొదటిజన్మకు, రెండవజన్మకును మధ్యన భగవంతుడు పందలు వేలు సంవత్సరములకాలము వ్యవధి పెట్టవచ్చును. సత్సంగములో కొందరిగ ఆజ్ఞోల్లఘనను చేసినందువలన నెంతదురదృష్టము సహించవలసివచ్చునో చూడుడు. ప్రేమపత్రివర్గైరాలలో మొదటిజన్మకంటె రెండవజన్మ శ్రేష్ఠముగ నుండునని వ్రాసినందువలన తెలివితక్కువలశలు పెట్టుకొని మోసపోకుడు. ఒక సత్సంగి చనిపోయినపిమ్మట నతడు ఒకఅరణ్యములో పుట్టుకతోనే కుష్ఠురోగము గలవాడై రాధాస్వామీ రాధాస్వామీ అని అడివిలోనుండి నిరంతరస్మరణ చేయుచుండును కాని, అతని యొడలంతయు కుష్ఠుతో ప్రుళ్ళి ముక్కలు ముక్కలుగా రాలిపోవుచుండు ననుకొనుడు. అప్పుడతనికి క్రితముజన్మకన్న నీజన్మలో గురుభక్తికి సావకాశ మెక్కువగ గలిగినందువలన నీరెండవజన్మ శ్రేష్ఠ మేకాని, అట్టిజన్మ నెవ్వరైన కోరుకొందురా? ఉపదేశముమాత్రము తీసికొని ఆరోజు మొదలుకొని హుజూర్ మహారాజువారినిగాని, మహరాజ్ సాహబ్ వారినిగాని తిరిగిచూడని సత్సంగులుకూడా వేనవేలున్నారు. కాబట్టి వారిపరిస్థితి యెట్లు న్నదో ఆలోచించుకొని సుమతిలేనిదే ఆధ్యాత్మికకార్యక్రమ మెట్లు వ్యర్థమై పోవునో తెలిసికొనుడు.

## 136

మహాపురుషు లవతరించకముందే తమకార్యమును పూర్తిచేసికొని వత్తురు. ఇతరుల భక్ష్యపదార్థములను తినుటలో జాగరూకత-సత్సంగులు జబ్బుగ నున్నపుడు ఏవిధముగ ప్రవర్తించవలయును.

12 సెప్టెంబరు 1918:—కొన్నిరోజుల క్రితము సాహబ్జీమహారాజువారు సబ్ రిజిష్ట్రారుగారితో తోటలో కూర్చుండిరి. సాహబ్జీమహారాజ్ వారి కుడికి కెదురుగ నొక పెద్ద రావిచెట్టున్నది. అందుపైన సాహబ్జీమహారాజువారు, బుద్ధుడొక రావిచెట్టుక్రింద కూర్చుండి సమస్తజ్ఞానమును, ఆధ్యాత్మికాభివృద్ధిని సంపాదించె నని చెప్పుచుందురు. ఇది సరియేనా, అని సెలవిచ్చిరి. అసలుసంగతి యేమనగా అట్టిమహాపురుషులు వారి కార్యమంతయును పూర్తిచేసుకొన్నపిమ్మటనే పైలో కమునుండి దిగివత్తురు. కావుననే వారికిచ్చట నొక్కపెట్టున సమస్తకార్యము నెఱవేరిపోవును. అట్లు కానిచో అభివృద్ధి గలిగించుశక్తి రావిచెట్టున కేము న్నది. మహారాజసాహబ్ వారి సమయములో మేము ప్రేమప్రసాదుగారితో గాఢప్రేమభావముతో ప్రవర్తించుచుండెడివార మని సెలవిచ్చిరి. ఆయన చాలగొప్ప ప్రేమీభక్తుడని యెంచుకొని తఱచు ఆయనయొద్దకు వెళ్ళి వచ్చు చుండెడివారము. ఆయన యెన్నియోసార్లు తనయింట భోజనముచేయుమని నన్ను బలవంతపెట్టెడివాడు. కాని భగవదిచ్ఛవలన నట్లు చేయుట పడలేదు. మాకు భోజనము పెట్టవలెనని మీరు తాపత్రయపడవద్దు, మాకు పారమార్థిక సహాయముమాత్రము చేయుమని మేము చెప్పుచుండెడివారము. ఒకసారి ఆయన ఒక డాక్టరుగారికి విందుచేసిరి. ఆరోజున నేను ఆవిందునకు వెళ్ళవలసివచ్చెను. భక్ష్యపదార్థములను తీసికొనివచ్చి అచ్చట పెట్టిరి. ఒక చిన్నగ్లాసులో పాయ సముకూడ నున్నది. ఆ పాయసమును గుఱించి బాబూ ప్రేమప్రసాదుగారు “చూడండి అయ్యా, ఈ పాయసమును మీరు తిన్నయెడల మీరు చాల ఆనం దించెదరు. నేను ప్రొద్దున పెందలకడనే లేచి, దీనికొఱకై స్వయముగ వెళ్ళి నాయెదుటనే పాలు పితికించి ప్రత్యేకముగ నీవిందుకొఱకై తెచ్చితిని. నా భార్య వారాణాసిరాజుగారి రాణులవద్ద నీపాయసము తయారుచేసెడి విధమును నేర్చుకొన్నది” అని సెలవిచ్చిరి. నేను ఆపాయసముమీద నొక అప్పడము కప్పివేసి దానిని అసలు ముట్టుకొనకుండా, పాయసము నిజముగ చాలమధుర ముగనే యున్నదనిమాత్రము పైకి అంటిని. అతనికి, అతనిభార్యకును ఆపాయ సమునందు అంత గాఢబంధన మున్నపుడు అది తినుటవలన నెంతనష్టము గలు గునో మీకు తెలుసునా! సత్సంగికి ఆహారములో రుచికావలెనని కోరెడి స్వభా వము ఉండకూడదు. పైగా, అయ్యో! ఈతిండి నేనెందుకు తినవలసివచ్చినది? అని మనస్సున నాలోచించుకొనుచుండవలయును. పొట్టనిండకపోయినచో పని

సాగదను తలంపుతో. కొద్దిగొప్ప చాల రుచిహీనమైన ఆహారమును తిని కాల క్షేపము చేయవలయును. రుచికొఱకై ఆహారము నెన్నడు తీసికొనకూడదు.

బాబానామప్రసాదుకి ప్రస్తుతము జబ్బుగనున్నది. సత్సంగములో సాహబ్జీమహారాజువారు ఆయన ఆరోగ్యమునుగుఱించి వాకబుచేసిరి. ఆయన మందు అసలే పుచ్చుకొనుటలేదనియు, తిండికూడా యేమియు తినుటలేదనియు నౌకరు చెప్పిరి. దానిమీద హుజూరువారు "సత్సంగి యెన్నడును తనప్రాణము నెట్లైనను నిలబెట్టుకొనవలయుననికాని, తనకు అప్పటిమట్టుకు చావులేకుండునట్లు ఎవరైనను మందివ్వవలయుననికాని మితిమీరినట్లుగ బాధపడనుకూడదు, తానెట్లైనను చనిపోవలయునని కోరుచు, పట్టుదలపట్టి తిండి తినకుండగను, మందుమ్రింగకుండగనుకూడ ఉండిపోకూడద"ని సెలవిచ్చిరి. సహజముగ నేదైనమందు లభించి వైద్యము జరుగుచుండినయెడల, నాప్రకారము జరుగనీయవలసినదే.

## 137

పరమార్థములో పోటాపోటీలుకాని ఈర్ష్యాభావముకాని ఉండకూడదు.

13 సెప్టెంబరు 1918 :— ఈరోజులలో దేశములో కరువు వ్యాపించి యున్నందున ఇరుగుపొరుగువారు ఆకలితో మలమల మాడిపోయినచో, వారు దయాల్బాగులో దోపిడిచేసినను చేయవచ్చుననియు, అందుచే వారలను తృప్తి పఱచుట యవసరమనియు తలంచి, జగన్పూరువారు మన కార్ఖానాలోను, దయాల్బాగులోను కూలిపని చేయుచుండిరి కావున సాహబ్జీమహారాజువారు బజారులో రూపాయికి 10 శేర్లచొప్పున అమ్ముచున్న బేర్షురుధాన్యమును రూపాయికి 16 శేర్లచొప్పున జగన్పూరు గ్రామస్థులకు ఒక్కొక్కరికి వారివారి కుటుంబమునకు సరిపోవునంతమట్టుకు ప్రతిలక్ష్మివారమునాడును దయాల్బాగునుంచి అమ్ముటకై యేర్పాటుచేసిరి. లాలాజీగారు ఇది చూచి దయాల్బాగుతో పోటీ చేయుటకై, చుట్టుప్రక్కలనున్న మూడుగ్రామములవారికి గోధుమలు రు. 1 కి బజారులో 6 సేర్లచొప్పున అమ్ముచుండగా రూపాయికి 12 సేర్లచొప్పునను, బియ్యము రూపాయికి 10 సేర్లచొప్పునను, బేర్షురు రూపాయికి 20 సేర్లచొప్పునను అమ్ముట కేర్పాటుచేసి జగన్పురమువారు దయాల్బాగునుండి కొనుగొనుచున్నారు కావున, వారికిమాత్రము ఏధాన్యముకూడ ఆధరల కివ్వకూడదని

యేర్పాటుచేసిరి. సాహెబ్ జీమహారాజువారు అందుపై చర్చించుచు నీక్రింది వచనమును సెలవిచ్చిరి. మనము ఇట్టి పోటాపోటీలు కాని, ఈర్ష్యాభావమును కాని యెన్నడు పెట్టుకొనకూడదు. మనము ఈబేర్షురు అమ్మకము ఈర్ష్యచేత గాని, మనగొప్ప చూపించుకొనుటకై గాని మొదలుపెట్టలేదు. లోకములో మనుష్యులహృదయములు రకరకములుగ నుండును. ఒకరిహృదయము మఱొకరు సుఖముగ నున్నచో సుఖముగను, ఇతరులు దుఃఖముతో నున్నపుడు దుఃఖించుచును ఉండును. మఱొకనికి ఇతరులు బాధపడుచున్నపుడు సుఖముగను, ఇతరులు సుఖముగనున్నపుడు బాధగను ఉండును. మూడవరకమువారు ఇతరుల విషయములనుగుఱించి జోక్యమే కలుగచేసికొనరు. మనసత్సంగుల హృదయము ఇతరులు దుఃఖముగనున్నపుడు సుఖముగను, ఇతరులు సుఖముగ నున్నపుడు దుఃఖముగను ఉండకూడదు. మనము ఇతరులను అనుకరణచేసెడి పద్ధతియు అవలంబించకూడదు.

ఒకసారి ఒకజాటుజాతిమనిషి ఒక కంచుపాత్రను కొనుగొనెను. సాధారణముగ ధనాఢ్యులే కంచుపాత్రలను కొనుగొనెడివారు. ఒక జాటుజాతివాని యింట కంచుపాత్ర యున్నయెడల నాకాలములో నతని గొప్పధనాఢ్యతను తెల్పెడిది. అట్టి పాత్రలను చాల అరుదుగ మాత్రమే పైకి తీసి వాడెడివారు. వానిని నెయ్యి, వెన్న, పాలు వగైరా మంచిమంచి పదార్థములను పెట్టుకొనుటకు మాత్రమే ఉపయోగించెడివారు. ఒకసారి మఱొకజాటు ఇతనియింటికి పెరుగు తీసికొని వెళ్లుటకై వచ్చెను. ఇతడు తన ధనాఢ్యత చూపించుకొనునిమిత్తమై కంచుపాత్రలో పెరుగుపోసి యిచ్చెను. అతడు ఆపాత్రను ఇంటికి తీసికొనివెళ్ళి తిరిగి యిచ్చుట మఱచిపోయెను. అతని భార్య ఆపాత్రలో ఆకుకూరలు వగైరాలు పెట్టుచు వాడుచుండెను. 3, 4 రోజులైనపిమ్మట మొదటి జాటుమనిషి రెండవవానితో "నీవు మా కంచుపాత్రను తీసుకొనివెళ్ళితివి, ఇంకను ఇచ్చితివి కావేమి ?" అని అడిగెను. "ఇదిగో తెచ్చి యిచ్చివేయుదు"నని చెప్పి, వెళ్ళి పట్టుకొనివచ్చి అతనికి తిరిగి యిచ్చివేసెను. దాని అంచున కొంచెము ఆకుకూర పట్టుకొని యుండిపోయెను. మొదటి జాటు యింటికివెళ్లిన పిదప నా అంటుకొనియున్న కూరను చూచి తన కంచుపాత్రలో ఆకుకూరవంటి తుచ్ఛపుసరకులు పెట్టిరని చాల కోపపూరితుడయ్యెను. అందువలన నతడు వెంటనే రెండవజాటు యింటినుండి ఒక చిన్నగిన్నెను ఏదో నెపముపెట్టి తీసికొని,

ఒక్క పరుగునవచ్చి అందులో అశుద్ధమును నింపి తన యింటిచూరులో పెట్టు కొనెను. అట్లు 2, 3 రోజులు ఉండగా ఇంటినిండా దుర్వాసన వ్యాపించెను. రెండవజాటు వచ్చి తనగిన్నెను అడుగగా "నేను నీగిన్నెను అలాగే యిచ్చువా డనుకాను. నీవు నా కంచుపాత్రిలో ఆకుకూరలు పెట్టి ఉపయోగించితివి, బహుశః నీవు దానిలో తినికూడనుందువు. నేను నీగిన్నెలో అశుద్ధమునుపెట్టి యుంచితిని, నీవు నాగిన్నెలో కూరతిన్నయెడల, నేను నీగిన్నెలో అశుద్ధమును తినకుండగ నీ కిచ్చినయెడల నాతండ్రికి నేను పుట్టలేదన్నమాటే!" అని సమా ధానము చెప్పెను. రెండవజాటు న్యాయమైనమనిషియగుటచే మొదటివానితో, "సోదరా, నేను తప్పు చేసితిని, నేను నీగిన్నెలో ఒకసారి కూరతినుటకూడ జరిగెను" అని యనెను. వెంటనే ఈజాటు "సరే చూడుము, నీగిన్నెలో అశు ద్ధము తిని దానిని చెఱచివేతును", అని చెప్పుచు ఒక్కపెట్టున పరుగెత్తుకొని పోయెను. ఆతరువాత నతడు అట్లే చేసెనని కథచెప్పుదురు. కనుక నిపుడు చూడుడు, ఈవిధముగ ననుకరణచేసియు, ఈర్ష్యాభావముతో ప్రవర్తించియు నతడు తనకే అనిష్టము చేసికొనెను. సత్సంగు లీవిధమైన పనులు చేయకూడదు. మన మేపనిచేసినను, భగవంతు డాసమయములో ప్రత్యక్షముగ వచ్చి మనను ప్రశ్నించినచో మనకు సిగ్గుపడవలసిన పరిస్థితి గలుగకుండ నుండులాగుననే మన మెల్లపుడు ప్రవర్తించవలయును. సత్సంగియొక్క ప్రవర్తన అవ్విధముగ నుండ వలెను. నీవు సత్సంగహాలులో నున్నపుడు తాజ్‌మహల్‌ను వర్ణించుచున్న యెడల నాసమయములో భగవంతుడు నీయెదుటకు స్వయముగ వచ్చినచో నీకు లజ్జ కలుగదా? ఈవిధముగ సత్సంగి తనవిషయములన్నియు పరిశీలించుకొన వలయును. ఈర్ష్యవిషయముగూడ నట్టిదే. కొందఱు సత్సంగులు తమ స్నేహి తులలో నెవరైనను ఒకరోజున రెండుగంటలసేపు అభ్యాసముచేసినట్లు తెలియ గనే, ఈర్ష్యాభావమునకు లోనైపోయి తాముకూడా మూడుగంటలసేపు అభ్యా సముచేయవలయునను పట్టుదల వహించి అభ్యాసమునకు కూర్చుందురు. కాని అట్లుచేయుటచే వారికి అభ్యాసము జయప్రదముగ సాగదు. అభ్యాసములో నానందముకూడ నెంతమాత్రము గలుగదు. అపుడు హుజూరువారు మహాజుకు శబ్దమును తీసి చదువుమని ఆజ్ఞయివ్వగా, నీక్రింది శబ్దము వచ్చెను.

"జగత భావ భయ లజ్జా ఛోడో,
సున ప్యారే తూ కర భక్తీ"

అర్థము:—నాయనా, నీవు జగత్తునందు ప్రేమభావమును, జగత్తులోని విషయములయెడల భయమును, సిగ్గును పూర్తిగా విడిచిపెట్టి, అనగా వాని నెంతమాత్రము లెక్కసేయకుండగనే, భక్తిచేయుచుండుము.

# 138

నిష్కామప్రేమతో నభ్యాసముచేసిననే ఉత్తమలాభము గల్గును. అట్టి ప్రేమ లేకపోయినను అభ్యాసము మానకుండ చేయుచునే యుండవలయును.

14 సెప్టెంబరు 1918:—హుజూరువారు మాష్టరు చేతనదత్తుగారిప్రశ్నకు సమాధానము చెప్పుచు తమకు ప్రప్రథమములో గల్గిన యీక్రింది అనుభవ విషయము సెలవిచ్చిరి. మేము లాహోరులో నుండగ ఉపదేశము తీసికొంటిమి. అప్పుడు మహారాజసాహబ్ వారికాలము. ఒకటి రెండుసార్లు సత్సంగము నకు వచ్చి వెళ్ళుటచే మా మనస్సున మహారాజసాహబ్ వారి అనుగ్రహము నెట్లైన సంపాదించుకొనవలయు ననెడి కోరిక పుట్టెను. కొందఱిని అడిగితిని కాని వారు "మాకేమియు తెలియదు. ఒకప్పుడు పెద్ద ధనికునితో మాటలాడె దరు. మఱొకప్పుడు కడుబీదవానితో మాటలాడుదురు. ఒకప్పుడు క్రొత్త సత్సంగితో మాటలాడవచ్చును. మఱొకప్పుడు పురాణ సత్సంగితో మాటలాడు దురు. వారి ప్రసన్నత సంపాదించుకొనుట యెట్లో యెవరికిని తెలియద"ని జవాబుచెప్పిరి. కాని మాకీపని సాధించుట కుపాయము తెలిసికొనవలయునని మనస్సు చాల పీకుచుండెను. ఈరోజులలో మేము లాహోరులో గుమటిబజా రులో నివసించుచుంటిమి. ఆపట్టణభాగములో నారోజులలో ప్లేగుజాడ్యము చాల యెక్కువగ నుండెను. మాకు కచ్చేరీపని రెండుపూటల కొక్కసారి యైనను అభ్యాసముచేయుటకు తీరికలేనంత యధికముగ నుండెను. సాయంకా లము ఆఱుగంటలు మొదలు ఉదయము 8 గంటలవఱకు ఆఫీసుడ్యూటీ ఉండె డిది. అందుచే పగలు అపరాహ్ణసమయమున నభ్యాసముచేసికొనుట కేర్పాటు చేసికొంటిమి. ఒకరోజున నభ్యాసము చేయుచుండగా, శరీరమునుండి ప్రాణము పోవుచున్నట్లుగ అనుభవము గలిగి, నేను శరీరమునువిడిచి వెళ్ళిపోతిని. అట్లు వెళ్ళగా వెళ్ళగా, ఇతఃపూర్వ మెన్నడుచూడని ఒకస్థలమును చేరుకొంటిని. అక్కడ భూమి ఇచ్చటనున్నట్లుగ లేదు. అయిన నేదోభూమిమాత్రము నిల బడుటకు ఆధారముగ నున్నది. అక్కడ నొకమైదానములో నేను కూర్చున్నట్లు

నా కనిపించెను. ఎదురుగ నిద్దఱుస్త్రీలు ఒక తంబూరా పట్టుకొనివచ్చిరి. వారి చ్చటనుండు ఆడవాండ్లవలె లేరు కాని కొంత ఆడవైఖరి వారిలో కనపడుచుం డెను. వారు దూరమునుండి "రాధాస్వామీ" అని చెప్పిరి. నేనుకూడా "రాధాస్వామీ" అంటిని. కాని మాయిఱువురిలో నెవరికికూడ నాలుక కదప కుండగనే ఒకరకమైన సంజ్ఞలమాదిరిగ సంభాషణ జరుగుచుండెను. అప్పుడు వారు కొద్దిదూరములో మర్యాదగ వచ్చి కూర్చుండి, అనుజ్ఞ అయినయెడల పాట పాడెదమని మనవిచేసికొనిరి. నేను "సరే తప్పకుండా పాడు"డని చెప్పి తిని. ఆ ఆడవాండ్రు పాట మొదలుపెట్టి నాలుగుచరణములుగల శబ్దమొకటి పాడిరి. అందులో చివరిచరణ మీక్రిందివిధముగ నున్నది. దానిని రెట్టించి పాడిరి.

"గురు సే జో మిలనా చాహో, కూడా హోయ మిల లే రీ."

అర్థము :—సద్గురువును కలిసికొనగోరినచో ధూళిరూపముగ వెళ్ళి కలుసు కొనుము.

రెండవసారి పాడినపుడు "గురూ" పదమునకు బదులుగా "పియా" పద మును పెట్టి పాడిరి.

ఆతంబూరామీద పాడుచున్నపుడు, నాకు ప్రాణ మంతకుముందు పో లేదుకాని, అప్పుడే పోవుచున్నట్లుగను, మరల పూర్తిగ వెడలిపోయినట్లు గను అనిపించెను. ఆఖరుచరణము పాట అయిపోవుచుండగనే మరల ప్రాణము వచ్చినట్లనిపించి ఆదేశము, ఆలీలలు అన్నియు మాయమైపోయి నాయొడలు వణకుచున్నట్లు తెలిసికొంటిని. తిరిగి 3 గంటలకు కచ్చేరీకి వెళ్ళవలెను కాబట్టి చాల గాబరాపడి లేచి గడియారము చూడగా 3 గంటలకు 5 నిమిషములు తక్కువగ నుండెను. వెంటనే లేచి బట్టలు వేసికొని పరుగెత్తుకొనివెళ్ళి కచ్చే రీకి సరియైనసమయములో చేరుకొన్నాను. ఇకను ఆసలహాప్రకారము మహా రాజసాహబ్‌వారి పాదములవద్దకు వెళ్ళి పడవలసినదే అని నిశ్చయించుకొంటిని. ఆమఱునాడే అలహాబాదు ట్రాన్సఫరుకోరుచు నొకదరఖాస్తు పంపగా ట్రాన్స ఫరు అయినట్లు ఉత్తరువు వచ్చెను. అప్పుడు నాకు మనసున మఱొకకోరిక యేమియు లేదు. సంపత్తు కావలెననికాని, ఒకశక్తి కావలెననికాని ప్లేగు రాకుండ కాపాడమనికాని, యేమియు కోరికలేదు. నా హృదయములో నేకో

రిక తీవ్రముగనుండెనో, దానికే భగవంతు డీవిధముగా సమాధానము నిచ్చించెను భగవంతుని చరణములయందు నిష్కామభక్తి లేనిచో అభ్యాసము వగైరాలుకూడా జయప్రదముగా సాగవు. నిష్కామప్రేమతో అభ్యాసము చేయనియెడల నాయభ్యాసము కేవలము నిరర్థకమే. కాని దానివలన నొక లాభ ముండగలదు. ఏమనగా, అట్లు నిష్కామప్రేమ లేకపోయినను 1, 2 సంవత్సరములు అభ్యాసము చేయగా, అభ్యాసికి తనకభ్యాసములో జయ మెందుకు కలుగుటలేదని లోలోపల ఆలోచన తప్పకుండా బయల్దేరును. అప్పుడు నిష్కామమైన ప్రేమతో అభ్యాసము చేసెడి ముక్తమార్గమునకు మానవుడు రావచ్చును. అట్లు నిష్కామమైనప్రేమ లేకుండా చేసెడి అభ్యాసము, అసలే అభ్యాసము చేయకుండ నుండిపోవుటకన్న చాల మెఱుగే. నిష్కామప్రేమ యొక్క పరిస్థితిని “గమేఇష్క” (అనగా ప్రేమయొక్క దుఃఖము) అని అందురు.

## 139

అవతారపురుషులకు తమ లోకాధిపతితోగల నిరంతరసంబంధమును గుఱించియు-పరమార్థములో ప్రాపంచిక ప్రజ్ఞల నిరుపయోగమును గుఱించియు.

14 సెప్టెంబరు 1918 :— సాయంకాలము – ఈరోజు ఉదయముప్రాత సత్సంగసూపరింటెండెంటుస్థానములో ఖాలీ పూర్తిచేయు సమయములో హుజూరువారు లాలాసుందరదాస్, దయారామసింహ, గౌరీశంకర్ గార్లు చాల యోగ్యులని సెలవిచ్చిరి. వీరలకు సేవాభావము చాల ప్రబలముగ నున్నది. బాబూదయారామసింహగారు హుజూరువారితో కూడా వాల్తేరు వెళ్లెను. అచ్చట స్టేషనులో రాత్రివేళ గాలిదుమారము వచ్చి మహావర్షము కురిసెను. స్టేషనులో దీపములు లేవు. బాబూదయారామసింహగారు బట్టను మోకాలుపై కెత్తికట్టుకొని, తలకొకబట్ట కట్టుకొని నిస్సంకోచముగ సామానులు మోయుచు తిరుగుచుండెను. ఒకసత్సంగి, అతనిని “ఓకూలీ, ముందు ఈసామాను ఎత్తుము” అని కూడా కేకవేసెను. ఇప్పుడు దయారామసింహ యేమనునో అని నేను చూచుచుంటిని. వెంటనే దయారామసింహగారు “ఆ, యే సామాను” అని యనుచు, సామానును వెంటనే నెత్తిని పెట్టుకొనెను. లాలా గౌరీశంకరుగారు

వారాణాసిస్టేషనులో 100, 150 మణుగుల సామాను మోసిరి. వీరిద్దఱును సోలన్‌లోకూడ నిట్లే మోసిరి. కొందఱు "మునసబుగారు, ఊట్రంకు ఎత్తెండి" అని అనుచుండెడివారు. వగైరా. వీరికి ఉత్తమమైన సేవాభావమున్నది.

మాష్టరు చేతనదత్తుగారు, మహమ్మదు ప్రవక్త వగైరాలు జనన మరణసిద్ధాంతము నేల చెప్పలేదనికూడా ప్రశ్నించిరి. జననమరణములు కన పడెడి ధామమునుండి వారు రాలేదు కావున ఆసిద్ధాంతమును వారు ప్రకటించ లేదు. వారి కావిషయము తెలియదు. పైనుంచి వచ్చిన పైగంబర్లు, రసూ లులు, సంతులు వగైరాలు అందఱును తమప్రభువు లేక నాయకునిచే నెట్లు కావలెనన్న నట్లే నడిపించబడునట్టి పరిస్థితిలో నుందురు. వారి కాంతర్యమున ఆకాశవాణి యుండును. వారెప్పుడును తిమయధిపతినుండి వచ్చిన హితోపదేశ ములనే వివరించుచుందురు. అట్లు హితోపదేశములు వచ్చుట ఆగిపోయినప్పుడు, వారు తిరిగి ఆమొదటి పరిస్థితినుండి దిగిపోవుదురు. హజరత్ మహమ్మదుగారు, నేను మీవొక బంటుగ నున్నానని సెలవిచ్చుటకు కారణమిదియే. ఆ పురుషో త్తముడు నన్ను ఒక సాధనముక్రింద చేసుకొని నాకేదైన అనుజ్ఞ యిచ్చినచో దానినే నేను పైకి ప్రకటించుచుందును. భగవంతు డిచ్చిన హితోపదేశమును నేను ప్రకటించుట పూర్తియైనపిమ్మట, తిరిగి నేనొక పాదద్వయముతోనున్న మానవుడనే. అందువలననే యేసుక్రీస్తును సిలువమీాద పెట్టి చంపుసమయ ములో నాయన "ఓతండ్రీ, నీవు నన్ను ఈసమయములో విడిచిపెట్టితి వేల ?" అని అఱచెను. సంతుమహాత్ము లెన్నడు తాము సంతులని చెప్పకొనరను విషయమునకు కారణముగూడ దీనివలననే విశదమగును. కాని దీనినిబట్టి పైన చెప్పిన సమయములలోనేకాని ఇతరసమయములలో వారికిని మామూలు మానవులకును వ్యత్యాసము అసలే లేదని అనుకొనరాదు. సాక్షాత్పరమపురు షుడుకాని లేక మఱొక లోకాధిపతిగాని తన సందేశమును లోకములో ప్రక టనచేయునిమిత్తమై వీరిని దూతగ నెన్నుకొనుటయే వారి మహాభాగ్యపరిస్థితిని ప్రకటించుచున్నది. అది కాకుండ నిట్టిపురుషులకు భగవంతునితో కొంతసంబంధ మెల్లపుడు నుండుచునే యుండును. వీరిలో భగవంతు డెల్లపుడు నెందుకు ఉండడనుప్రశ్న వచ్చినయెడల, దాని కీవిధముగ సమాధానము నూహించుకొన వచ్చును. మానవునికిగాని, జంతువునకుగాని, పిల్లపుట్టినప్పు డాశిశువు యెప్పు డును చాల అందముగనే యుండును. జీవచైతన్యము శరీరములోనికి దిగిపోవు

చున్నకొలంది ఆశరీరము పుష్టినొంది బలిష్ఠమగుచు యౌవనావస్థవచ్చుసరికి చాల బలవత్తరమైపోవును. తిరిగి వార్థక్యము వచ్చుసరికి శరీరము బలహీనమై పోయి ముడతలుపడ నారంభించును. మొదటిలో నేచైతన్యధార శరీరమును పుష్టిగచేసెనో, ఆచైతన్యధారయే ఆశరీరములో నాత్మ చాలకాలమున్న హేతువుచేత, నాశరీరమునకు నాశనముచేయు సాధన మైపోవును. ఇదేప్రకారము సృష్టిలోగూడ చూడుడు, ఈ కలియుగము సృష్టికి వార్థక్యసమయము. మొదట ధారప్రకటమైన క్రొత్తలో కృతయుగముండెను తర్వాత త్రేతా ద్వాపర యుగములలో మహాప్రభావవైభవములతో జీవితము గడిచిపోయెను. ఇప్పుడదే చైతన్యధారఅయితే ఈసృష్టిని మొదటనిర్మించెనో, ఆచైతన్యధారయే యీ సృష్టికి నాశమును అనగా మహాప్రళయమును కలుగచేయనై యున్నది. దీనిని బట్టి ఆత్మ యీశరీరములో చాలకాలము నిలబడనేరదనియు, ఆత్మాధారమూలముగనే శరీరమునకు నాశము కలుగుననియు, సిద్ధమగుచున్నది. ఏశరీరమందు ఆపరమపురుషుడు ప్రకటమయ్యెనో, ఆశరీరమునందు ఆపరమఆత్మ, అనగా పరమపురుషుడు యెల్లపుడు విరాజమానమై యున్నచో, నాశరీరముయొక్క హృదయము మస్తిష్కము మున్నగు ప్రధానాంగములు కొద్దికాలములోనే ధ్వంసమైపోయి ఆశరీరము నశించిపోవును. అందుచే పరమపురుషుడుకాని, మఱొక లోకాధిపతిగాని తనకళ నీసృష్టిలోనికి పంపినపుడు, ఆకళ ఆశరీరములో నిరంతరముగ క్రియాశీలమై యుండకుండునట్లే యేర్పాటుచేయబడును. అయినను విశేషచైతన్యముయొక్క ధార యెల్లపుడు నాశరీరములో మామూలు జీవులలోకన్న నెక్కువ ప్రభావముతో విరాజిల్లుచుండును.

మానవునిలో ప్రశ్నించులక్షణము (inquisitiveness) హృదయస్థానమున జనించుననికూడ సెలవిచ్చిరి. ఆస్థానముకన్న కొద్దిగా పైకివెళ్ళినను (అనగా స్వప్నావస్థలోగాని, అభ్యాససమయములోగాని) లేదా కొద్దిగ క్రిందికి దిగిపోయినను (అనగా జంతుకోశములలోగాని) ఈ ప్రశ్నించు ప్రకృతి (inquisitiveness) పూర్తిగా నశించిపోవును. అందుచేతనే జననమరణముల సిద్ధాంతమునుగుఱించి యీదేవదూతల నడిగినపుడు వారు తమలోకాధిపతితో సంభాషణ చేసికొనియుందురు. ఆయధిపతి అంతకన్న క్రిందిలోకమునకు చెందిన వాడగుటచే సమాధానమేమియు చెప్పలేదు ఈ దేవదూతలుకూడ హృదయస్థానమునకు పైవారగుటచేతను, తమయధిపతి యిచ్చుడు పూర్తిగా వశవర్తులై

యుండుటచేతను, ఆపరిశ్నకు సమాధానము చెప్పలేను. మొదటినుండియు నిట్లే యుండెననిమాత్రము చెప్పి యూరకుండిరి. వీరు హృదయస్థానము పైస్థానమునకు చెందినవారగుటచే వీరికి పరిప్రశ్నాతురస్వభావము (inquisitiveness) ఉండనేరదు. ఈసిద్ధపురుషులకు తమమతము ప్రచలితమైనను, కాకపోయినను గూడ లెక్కలేదు. చివరకు పరిణామమెట్లైననౌగాక, వారికిమాత్రము తమ అధిపతి ఆజ్ఞాపాలన మొక్కటే ముఖ్యము. వారికి పైనుండి ఆజ్ఞ యేవిధముగ వచ్చెనో సరిగ నదేప్రకారము పైకిచెప్పుటయే వారికృత్యమై యుండెను. ఇకముందుకూడ నెప్పుడు నట్లేయుండును. కావున మానవుని ప్రజ్ఞకును ప్రయోజకత్వమునకును, ఏమిగణ్యతయున్నదో కొంచె మాలోచించుకొనుడు. హృదయస్థానమునుండి కొంచెము క్రిందికిగాని లేక పైకిగాని పోయినతోడనే మానవుని ప్రజ్ఞలన్నియు మాయమైపోవుచున్నవి. విద్యార్థిగనున్నపుడు తాను గొప్ప తెలివితేటలు చూపించెడివాడనియు, ఇప్పుడింత చాకచక్యముగల వకీ ననియు, తన గొప్పగోటులు చెప్పకొనుటకేతప్ప ఆధ్యాత్మికప్రపంచములో నీ విషయముల కేమియు లెక్కలేదు. ఈవిషయములు ఒకప్పుడు నిజమేఅయినను, ఆధ్యాత్మికప్రపంచములో వీని కెట్టి ప్రసక్తియు లేదు. ఒక ఆజానుబాహువుగ యౌవనములోనున్న సిపాయి తనచేతిలో బల్లెముగ్రహించి గుఱ్ఱముపైన స్వారిచేయుచు, తా నీలోకమునంతను జయించివేతు ననెడి గర్వముతో విఱ్ఱవీగుచుండును. ఆగుఱ్ఱము ఒక గొప్పతగిలి క్రిందపడిపోవును. అంతట నాసిపాయి కూడ తలక్రిందుగ క్రిందికిపడగా కొంచెము గాయముతగిలి రక్తము స్రవించిపోవుచుండును. అప్పుడు అతని ఆత్మ హృదయస్థానమునుండితప్పి పైస్థానమునకు పోవును. అతని బలము, గర్వమును అంతయు నపుడు పూర్తిగ నశించిపోవుటచే ఆసిపాయియే, మంచినీటికొఱకై త్రాహిత్రాహియని యఱచుచు చనిపోవును. కావున ఆలోచించుకొనుడు; శారీరకబలము, మానసికప్రజ్ఞ, ప్లీడరీలో ప్రజ్ఞయు హానికరములైతే కాకపోవచ్చును, కాని సత్సంగములో వానికి గణ్యత లేదు.

## 140

నిష్కామప్రేమ లేక ప్రేమావేదన గలుగుటెట్లు? స్వార్థవిషయములు లభించినందువలన గలిగెడి ప్రేమ విశ్వసనీయముగాదు.

15 సెప్టెంబరు 1918 :—సాహబ్జీమహారాజవారు నిన్నటిరోజున నిష్కామ ప్రేమ అనగా ప్రేమయొక్క ఆవేదన ఉత్పన్నముకానియెడల అభ్యాసము జయ ప్రదముగ సాగనేరదని చెప్పియుండిరి. ఇట్టి ప్రేమావేదన లభించుటెట్లు అనెడి విషయమును రేపు జ్ఞాపకము చేసినయెడల చెప్పెదమనికూడ నిన్న సెలవిచ్చిరి. కావున మాస్టరు చేతనదత్తుగారు జ్ఞాపకముచేసిరి. సేఠ్ నిహాల్‌చందుగారు మొదటలో కొద్దిగ హాస్యాస్పదముగ మాట్లాడినందున హుజూరువారు ఇచ్చటి వారికి సరియైనభావము లేనపుడు వ్యాఖ్యానముచేసిన నేమిలాభ మున్నదని సెలవిచ్చిరి. సరే అయినను మాస్టరుగారి ప్రశ్నకు సమాధానము కొంతవఱకు చెప్పవచ్చును.

ఈరోజు ఉదయము ప్రేమవిలాస్ 2వ భాగములో 52వ శబ్దము "బిరహా కో మత ఛేడియే బురీ బిరహా కీ ఛేడ్" పాఠము చేసిరి. మనస్సున విరహా ముత్పత్తియగుట యావశ్యకము. విరహామువలన ప్రేమ యుత్పన్న మగును. ప్రేమయే పరమపురుషుడు. ఇక నిపుడు విరహ మెవ్విధముగ జనించుననెడి ప్రశ్న మిగిలినది. అసలు రహస్య మేమనగా సత్సంగి కాంతర్యమునదర్శనమిచ్చి, అతనితో "ఓజీవుడా, నీయెడల నేను ప్రసన్నుడనైతి" నని చెప్పిననేగాని విర హాముకాని, నిష్కామప్రేమకాని యుత్పన్నము కానేరదు. ఇపుడు భగవంతు డీవిధముగ నెట్లు చెప్పు నను ప్రశ్న పొడముచున్నది. అందుకు సమాధాన మేమనగా, ప్రతిసత్సంగియు మొట్టమొదట సత్సంగములో చేరినపుడు ప్రాపంచిక వాంఛలను పెట్టుకొని వచ్చును. ఆకోరికలు నెఱవేరినపుడు భగవంతునికి కృత జ్ఞతాపూర్ణు డగును. కొంతకాల మైనపిదప భగవంతు డా సత్సంగి మనోరథ మును దీర్చుటకై ఇచ్చిన ఐహికపదార్థమే అతనికి దుఃఖదాయకముగ పరిణ మించును, లేదా అతనివద్దనుండి వెనుకకు లాగికొనబడును. అపు డతనికి గొప్ప దెబ్బ తగిలి ప్రపంచమునుండి నిరాశపరిస్థితి గలుగును. అప్పుడతనికి ఒక్క రాధాస్వామిదయాళురు, సంత్‌సద్గురువునుదప్ప మఱెవ్వరు సహాయముచేయు వారు లేరని స్పష్టముగ కనపడి, అతడు తనదృష్టిని సంపూర్ణముగా భగవంతుని మీదనే పెట్టుకొన మొదలిడును. అట్టిసమయములో భగవంతు డతనికి దర్శన మిచ్చి ఆమాట చెప్పును. అట్లైనచో నతనికి ప్రేమయొక్క ఆవేదన లభ్యమగు సమయము వచ్చినదని తెలిసికొనదగును. ఈరోజు ఉదయము, ప్రసాదము, చరణామృతమును అంతులేకుండ తిని త్రాగినట్టి బాబు ప్రేమప్రసాదు వగైరాల

వంటి సత్సంగులే సత్సంగమునుండి దూరమై సంత్ సద్గురువును విడిచిపెట్టిపోయి నప్పుడు మనబోటివారికి భగవంతునితో సంబంధము సదాస్థాయిగా నుండగలదను ధైర్య మెట్లుండగలదను విషయముపైన కొంత సంభాషణ జరిగెను. సాహబ్జీ మహారాజువారు "అది నిస్సందేహముగ నిజమే. మీరుకూడ నింకను ప్రమాద పరిస్థితినుండి దాటిపోలేదు. భగవంతుడు సత్సంగికి అంతర్యామున దర్శనమిచ్చి, నిన్నసాయంకాలము చెప్పినట్లుగా చెవిలో చెప్పునంతకాలము పూర్తిగా నమ్ముకొనుటకు వీలులేదు. జీవుడు భగవంతుని విడిచి పారిపోవుట కవకాశమున్నది." అని సెలవిచ్చిరి. దానిమీదట సత్సంగులు "హుజూర్. అపరీక్షకు (test) మామూలు సత్సంగులు నిలబడుట దుర్ఘట"మని చెప్పుకొనిరి. దానిమీదట హుజూరువారు, "ఇంజను బండినైనను పట్టుకొనవలయును, లేదా బండి ఇంజ న్నైనను పట్టుకొనవలసియున్నది. అప్పుడే ఇంజనుతో కూడా బండి చివరవఱకు వెళ్లుట సాధ్యమగును." అని సెలవిచ్చిరి. భగవంతు డాంతర్యదర్శన మిచ్చి పైన చెప్పినమాటలను చెప్పినయెడల ఇంజను బండిని పట్టుకొన్నట్లు. కాని రెండవపద్ధతికూడా యించుమించు ఇంత బలవత్తరమైనదే. అదేమనగా, ఇంజనును బండి పట్టుకొనియుండుట, అనగా సత్సంగి సద్గురువును దృఢముగ పట్టుకొని వదలకుండుట. అది యెట్లనగా సత్సంగికి ప్రాపంచిక విషయములలో చాల తబ్బిబ్బులు గలిగినమీదట వాస్తవముగ నీప్రపంచము దుఃఖదాయకమనియు, సంత్ సద్గురువొక్కరే తన జీవునికి పరిపూర్ణహితకారియనియు, అతడు అనుభవపూర్వకముగ తెలిసికొన్నపుడుకూడా అతడు భగవంతుని విడిచిపోజాలడు. అయితే, పైనుదహరించినవారందఱిలో నీరెండుపరిస్థితులలో నొక్కటిగూడ పట్టలేదు. మహారాజ్ సాహబ్ వారు వీరిని పట్టుకొనలేదు. వీరు మహారాజ్ సాహబ్ వారిని దృఢముగ పట్టుకొనలేకపోయిరి. వీరందఱును తమబుద్ధికౌశలము, తమ ఐశ్వర్యము, గౌరవప్రతిష్ఠలు, హోదాలు, భక్తివిశేషము వగైరాలమీదనే ఆధారపడిరి కాని మహారాజసాహబ్ వారిమీద విశ్వాసము పెట్టుకొనలేదు. ఆకారణముచే వారు వంచితులైరి. వీరికి ప్రీతికూడ మహారాజ సాహబ్ వారు వీరిని ప్రత్యుత్థానము చేయుచుండిన హేతువుచేతనే యుండెడిది. ఆయెరువు వేయకుండ నాపుజేసినతోడనే వారి భక్తివిశ్వాసములుకూడ నంతరించిపోయినవి. అందుచే స్వార్థాభిలాషలు తీరుటవలన నేర్పడిన భక్తివిశ్వాసములు పైన చెప్పిన రెండుపరిస్థితులలో నేదైన నొకటి సిద్ధించనిచో, అనగా భగవంతుడు జీవునినైన పట్టుకొనుటకాని లేదా జీవుడు భగవంతునినైన పట్టు

కొనుటకాని జరుగనంతవఱకు విశ్వసనీయము కావని చెప్పుట అసమంజసము కా నేరదు.

## 141

### ఆత్మపైన కోశము లేర్పడువిధము.

22 సెప్టెంబరు 1918:—సారబచన్ (గద్యభాగము)లో నుండి కొన్నివచనములను పఠనము చేసిరి. అందులో ఒకవచనములో ప్రాపంచిక భోగములన్నియు జననమరణ చక్రములోనికి గొనిపోవునట్టివనియు, ఆభోగములనే సంతసద్గురువుని కెదురుగ పెట్టి అనుభవించినచో అమృతతుల్యమైన ప్రభావము గలుగజేయుననియు వ్రాసియున్నది. ఆసందర్భములో హుజూరువారిట్లు సెలవిచ్చిరి:—ఆత్మమీద కోశములు ఒకదానిపైన మఱొకటి చొప్పున పడిపోయినవని చెప్పబడు విషయము నీవిధముగ నూహించుకొనవచ్చును. ఒక బలిష్ఠమైన యువకుడు క్రిందపరుండెననుకొనుడు. బాగుగ దళసరిగనున్న నల్లని గలీబు ఒకటి అతనికి పైనను క్రిందనుకూడ చుట్టబెట్టినట్లుగ తొడిగినయెడల నతని చలనమునకు కొంతవఱకు—అయితే చాలతక్కువగనే కావచ్చును—అడ్డుగలుగును. దానిపైన మఱొక గలీబు తొడిగినచో నతనికి చలించుట కింక నెక్కువగ అడ్డువచ్చును. ఈప్రకార మతనిపైన నొక వెయ్యిగలీబులు తొడిగినయెడల నతనికి ఊపిరి పీల్చుకొనుటయే కష్టమైపోయి, ఇటునటు కదులుటకు అసలే వీలుండదు. అప్పు డతనికి పూర్తిగా చావకపోయినను చచ్చినంతపని అయిపోవును. అట్లే మఱికొంతకాలము ఆగలీబులలో కప్పబడి యుండిపోయినచో నతని పరిస్థితి యింకను చాల దుస్థితిలోనికి మాఱును. ఇదంతయు శరీరముపైన గలీబులు తొడిగినప్పుడుండెడి అవస్థ. మనస్సుపైన తొడుగులు ఎక్కినప్పు డెట్లుండుననగా, ఒక పట్టణములో నొక నియమనిష్ఠాపరుడైన అభ్యాసిపురుషు డున్నాడనుకొనుడు. అతడు రోజంతయు భగవత్పూజలో గడుపుచు, నెవనితోను సంబంధము పెట్టుకొనకుండగ నుండును. ఆపట్టణపు రాజుగారు చనిపోవునపుడు ఆపట్టణ పరిసరములలోనున్న యీ నిష్ఠాగరిష్ఠుని తనస్థానేరాజుగ చేయవలసినదని మరణశాసనమొకటి వ్రాసి చనిపోయెను. ఆరాజు చని పోయినతర్వాత ఆపట్టణప్రజలు ఈనిష్ఠాపరుని తీసికొని వెళ్ళి రాజసింహాసనము పైన కూర్చుండబెట్టిరి. ఆనిష్ఠాపరు డొక్కరోజుమాత్రమే తనమామూలు పద్ధతిని నడచుకొనెను. కాని తర్వాత నితని మంత్రులును,

ఇతరధనాఢ్యులును కట్నములు కానుకలను చెల్లించుటకై అనుమతినికోరఁగ, అట్లు ఇచ్చుటయు పుచ్చుకొనుటయు రాజరికముయొక్క ధర్మమనెడి భావముతో నతఁడు అందుకంగీకరించెను. వారిచ్చిన కానుకలన్నియు వివిధవిధములుగనుండి అతనికి అత్యంతాహ్లాదము గల్గించుటచే నతఁడు వానినన్నిటిని ఒక్కొక్కటిగ పైకితీసి పరిశీలించి చూచుచు నానందించుచుండెను. ఒకరిచ్చినట్టి "కలమ్‌దాన్" మఱొకరిచ్చిన పాత్రలును ఈవిధముఁగ నన్నియు నతనికి ప్రియముగ కనబడుచుండెను. ఒక్కొక్కరినే, వారిచ్చినకానుకలనుగుఱించి విశేషములను వాకబుచేయుచు, ఆకానుకలను మెచ్చుకొనుచు నుండెను. ఈవిధముఁగ జరుగుచురాగా కొంత కాలమున కాకానుకలసఖ్య మిక్కుటముగ పెరిగిపోవుటచే వానిని సురక్షితముగ నుంచుటకై రాజభవనములో నొకపెద్దగది యేర్పాటుచేయబడెను. ఈరాజు గారుకూడ తన పూర్వప్రవర్తనపద్ధతుల నన్నిటిని మఱచిపోయి, అహోరాత్రములు ఆకానుకలను చూచుటలోనే కాలక్షేపముచేయుచు, నంటమనిషి భోజనమునకు రమ్మని పిలచిననుగూడ, నిప్పుడుకాదు కొంతసేపు ఇంకనాగుమని చెప్పు పరిస్థితిలో నుండెను. ఇఁక నతఁడు నిద్రపోయినదో నాకానుకలనుగుఱించియే కలలుగనుచు, మెలుకువగనున్నపుడు వానినిచూచి తన్మయమైపోవుచు నుండెను. ఎవనితో నెవుడు మాట్లాడినను, ఈకానుకలనుగుఱించియే సంభాషించుచుండెడి వాఁడు. బాహ్యముగ నతనికి తానెవరిసొమ్ముల నపహరించలేదు. ఎవరిని దోపిడి చెయ్యలేదు, ఎవరిని యాచించనులేదు, వారే స్వయముగవచ్చి యిచ్చిరికాని, నేనేమియు నధర్మపుకృత్యము చేయలేదుకదా, అని తోచుచుండెను. అయినను, ఆకట్నకానుకలన్నియును అతని మనస్సును తమ ఆకర్షణావలయములోనుండి దాటి పైకి వెడలిపోలేకుండునంత గాఢముగ మోహితపఱచినవి. ఆబలవంతుఁడు గలీబులబరువుమూలమున నిటునటు కొంచెముకూడ కదలలేకుండ నెట్లయ్యెనో, అట్లే యీఅభ్యాసికూడ నిపుడాకట్నకానుకల వ్యామోహావలయములోనుండి ఈవలకురాలేకుండ నైపోయెను. న్యాయప్రకారమాలోచించగ నతనిప్రవర్తలో నెవరును నిజముగ దోషముకూడ పట్టలేరు. అయినను, ఆగలీబులబరువుమూలమున నాబలిష్ఠునకు కదులుటకు శక్యముగాకుండ నుండిపోవుటచే నతడెట్లు దుర్బలమైపోవుచు వచ్చెనో, అట్లే యీ యభ్యాసి పరిస్థితిగూడ నతని మనస్సును దుర్బలము చేయుచుండెను. ఇదిగాక నింకొక గమనించవలసిన విషయమేమనగా. కానుకలు మనోహరముగనుండి మీమనస్సు నాకర్షించినపుడు అవి మీ హస్తగతమైనపుడే గాక, మీకు చేతిలో పడినను పడకపోయిననుగూడ,

మీ మనస్సు నాకర్షించినతోడనే వానికోశములు మీమనస్సుపైన తయారగుట ప్రారంభించును. నీకు నిజముగ రమ్యముగ నున్నట్లే యేవస్తువులపైన నీమనస్సు ఆకర్షించబడునో అవి నీకు హస్తగతమైనను కాకపోయినను, అవి ఏదో యొక దుకాణములోనో. బజారులోనో ఉండిపోయిననుగూడ, వానికోశములు నీమనస్సుపైన నెక్కిపోవుచునే యుండును. ఆత్మమీద కోశము లేర్పడు పరిస్థితిగూడ నిట్టిదే. ఆ బలిష్ఠుడు కొంతప్రయత్నించి తనమెడ పైకెత్తి గలీబులలోనుండి తప్పించుకొని బయటగాలిని పీల్చినయెడల నతనికిశక్తి వచ్చును. అప్పు డతనికి గలీబులలోనుండి పైకివెళ్ళిపోగల ధైర్యమును బయల్దేరును. అదేవిధముగ నెవరైన హృదయస్థానముదాటి కంఠచక్రము వద్దగాని లేక తృతీయనేత్రము వద్దకాని ఆధ్యాత్మికాభ్యాసము చేసినయెడల, అనగా ఆయున్నతస్థానములగాలిని పీల్చినయెడల, నతనిమీద నాయున్నతదేశముయొక్క గాలి, ఆబలిష్ఠమానవుని మీద గలీబుల బయటిగాలి యెట్టిప్రభావము గల్గించెనో, అట్టిప్రభావమునే గల్గించునని విశ్వసించవచ్చును. గలీబుల కావల నీబలిష్ఠమానవునికి సహాయము చేయునట్టి పురుషు డెవరైన నుండినయెడల, అనగా, ఈహృదయస్థానమునుండి పైకి లేచిపోదల్చినవానికి ఒక మహాత్ముని సహాయమున్నయెడల, నిఁక చెప్పవలసిన దేమున్నది? అపు డితడు సకలకోశములను దాఁటిపోయి పారంగతుడై పోగలడు.

## 142

సత్సంగికి స్వార్థపరమార్థముల రెండిటివిషయములోను సంపూర్ణమైన అభయదాన మియ్యబడినది.

12 అక్టోబరు 1918 :—ఒకరోజున హుజూరువారిట్లు సెలవిచ్చిరి. సమస్త జీవులకును, తమకు ఉపదేశములభించిన క్షణమునుండియు స్వార్థపరమార్థముల రెండిటిలోను గ్యారంటీ (guarantee) అనగా సంపూర్ణాభయదాన మివ్వబడి పోయిన దనెడి విశ్వాసము గల్గులాగున భగవంతు డనుగ్రహించవలయునని నా హృదయమున ఆసక్తి గల్గుచుండును. సారబచన్ పద్యభాగములో నీక్రింది శబ్దమున్నది.

"భర్మీ మన కో లాఁట ఠికానే, ప్రీతి లగే తుమ చరన సమానే।"

ఈశబ్దమున కొకపూర్వగాథ యున్నది. అది తెలియనిదే ఈశబ్దములోని భావము పూర్తిగా అవగాహనకానేరదు. ఆగాథ యేమనగా, స్వామీజీమహా

చేయు తలంపులో పడి సకలవిధముల నష్టము గలిగించుటకై చూచుచుండును. ఇవన్నియు గలుగుటకు కారణము, అతని మనస్సున స్వార్థసంబంధమైన వాంఛ లుండుటయు, సంత్ సద్గురువును ఆకోర్కెలు తీర్చునిమిత్తమై ప్రార్థనచేయుట యునే. కాబట్టి కోరికలను కోరుకొనుటవలన నెంత చెడుపరిస్థితులు గలుగునో చూడుడు. కావున నీవచనములో భగవంతునివద్దనుండి యేమియు కోరవద్దని చెప్పిన హితోపదేశము సామాన్యవిషయముగ నెంచుకొనకుడు. ఈ కోరికలు కోరెడి స్వభావము పూర్తిగా పోయినపుడే నిర్మలప్రేమతోకూడిన భక్తి గలిగి వెట్టిభక్తియు, ఆడంబరభక్తియు నశించిపోవును. సంతానముకొఱకును, ధనము కొఱకును చేసెడిభక్తి భగవంతునియొక్కభక్తి కానేరదు. అట్టి వాంఛలు పూర్తియైనపుడు అవి మహాదుఃఖము కలిగించకపోయినను, సుఖదాయకము మాత్ర మెంతమాత్రము కానేరవు. ధన దారాపుత్రాదివాంఛలను కొంత వఱకు భగవంతుని దివ్యేచ్ఛకు వదలిపెట్టవలయుననియే ఈమతములో చేసెడి మొట్టమొదటి హితోపదేశము. కావున నీహితబోధ నర్థముచేసికొని ఆప్రకార మాచరించుటకు ప్రయత్నించుడు.

## 144

స్మరణధ్యానములవిషయములో హితోపదేశము – సత్సంగి సుఖదుఃఖావస్థలలో నెట్లు ప్రవర్తించవలెను.

27 అక్టోబరు 1918 :—ఈనాటితో సెలవలు ఆఖరైపోవుచున్నవి కాబట్టి ఈనాటి ఉదయము చాలమంది తిరిగి వెళ్ళిపోవుచున్నారు. అందఱు సెలవు తీసికొనుటకై దండప్రణామము లర్పించినపిదప, హుజూరువారు చిరునవ్వుతో, "ఈనాడందఱును తిరుగుప్రయాణపు తొందరలో నున్నారు. మీ మనోభావము ఆవిధముగ నున్నపుడు నేనేమి వచనము మీకు చెప్పగలను ?" అని సెలవిచ్చిరి. తిరిగి కొంచెముసేపు ఆగి, వచనము సెలవిచ్చుట ప్రారంభించిరి. దాని సారాంశ మీక్రింద సంక్షేపముగా వ్రాయబడుచున్నది: మీకందఱికిని స్మరణధ్యానములు రోజుకు రెండుపర్యాయములు ఉదయమునను, అస్తమయకాలముననుమాత్రమే కాకుండ రోజు అంతయు ననేకపర్యాయములు, ఒక్కొకసారి 1, 2 నిముషముల చొప్పున చేయుచుండవలెనని సలహా చెప్పుచుంటిమి. ఎందుకనగ ఆహితోపదేశప్రకారము ఆచరించనిదే కార్యసాఫల్యము సిద్ధించదు. ఏమనిషికైనను

రోజంతయు కొంచెముకూడ స్మరణధ్యానములు చేయకుండగనే యుండినచో ఉదయము, సాయంకాలముమాత్రమే కూర్చుండి అభ్యాసము చేయగలుగుట అసంభవము. ఈవిషయమును చాల నొక్కి చెప్పి, మరల యిట్లు సెలవిచ్చిరి, "మీరందఱు నీనాడు వెడలిపోవుసమయములో మీకు నేనుచేసెడి ఆఖరి ఉత్తమహితబోధ యిదియే. దీనిప్రకారము మీరు నడుచుకొనుడు. లేనిచో మీకేమియు లభ్యముకాదు".

2) ఈ యేడాది అంతయు, హిందూదేశము యావత్తునకేకాకుండ ప్రపంచము అంతకుగూడ మహాపత్సమయమని నేను కొంతకాలము క్రితమే హెచ్చరిక చేసియుంటినని హుజూరువారు తిరిగి సెలవిచ్చిరి. ఇంతకన్న నీపైన రాబోవుసంవత్సర మెక్కువ మెఱుగుగ నుండును. ఆపై సంవత్సరముకూడ మెఱుగుగనే యుండును.

3) ప్రాపంచిక సుఖములలోపడి ఆనందించకూడదు. ఇచ్చటి కష్టముల కెక్కువ దుఃఖపూరితుడును కాకూడదు. తిరిగి తిరిగి మనస్సున భగవచ్చరణములందు నివాసమునిమిత్తమై కోరిక పుట్టించుకొనుచునుండవలెను. ఇదియే సంతుమతముయొక్క మహోపదేశము.

## 145

స్మరణధ్యానములవలన లాభముపొందుట—వస్తువుల మంచిచెడ్డలు తేల్చుకొనుటకు ప్రమాణములు — సౌందర్యమునకు రెండంగములు.

18 అక్టోబరు 1918:— రోగములు వగైరా బాధలు గల్గినపుడు మీరు ఆత్మస్థానమువద్ద మనస్సు నేకాగ్రము చేసికొని స్మరణధ్యానములు 8, 10 నిమిషములసేపు చేసికొనవలసియున్నదను విషయము మీకందఱకు హృదయాంకితమగునట్లు చేయవలయునని నాకు చాల కోరిక యుండినది. అట్లు చేసినందువలన మీకుగల బాధ పూర్తిగ పోయినను పోవచ్చును, లేదా కొంతవఱకైనను తగ్గిపోవచ్చును. పుట్టుకతోనున్న రోగమైనచో దాని విషయము వేఱు అయినను జనులు సామాన్యముగ డాక్టర్లు, హకీములు, వైద్యులమీదనే అధికాధిక విశ్వాసము పెట్టుకొనుచున్నారు. కాని ఆత్మబలమునందు విశ్వాసము చాల తక్కువగల్గియున్నారు.

ఏవస్తువు మంచిదో, ఏది చెడ్డదో తెల్పుకొనుట చాలకష్టమైనపని. మొట్టమొదట నొకప్రమాణము నేర్పఱచుకొనవలయును. అప్పుడు దానినిబట్టి యేవస్తువైనను మంచిదో చెడ్డదో నిర్ణయించుకొనుట సాధ్యమగును. మానవునికి రెండే పద్ధతులు లున్నవి. ఒకటి ఇతరుల అనుభవ మెట్లున్నదో దానినిబట్టి నడచుకొనుట. బుద్ధిమంతులకు దీనికన్న గొప్పవిధానము లేదు. ఇఁక బుద్ధికి మించిన విషయములలో విధాన మేమనగా, పరోక్షజ్ఞానులు, లేక సిద్ధపురుషుల (seers) హితబోధ ప్రకార మాచరించుట.

ఏమనిషిలో నొకవస్తువు అనురూపస్వరములు గల కంపనములను (Harmonious Vibrations) పుట్టించునో, ఆవస్తువు ఆమనిషికి సుందరముగ నుండును. సౌందర్యమునకు పునరావృత్తియు (తిరిగి తిరిగి జరుగుట- Repetition) పరస్పరానురూపతయు (Symmetry) ననెడి రెండు అంగములు ఉండును. అయితే యెల్లపుడు నారెండంగములుకూడ కలిసియుండనక్కఱలేదు. ఉదాహరణకు అరణ్యములో అందము ఉన్నది. కాని అది పరస్పరానురూపలక్షణమువలన గాక పునరావృత్తిలక్షణమువలన గల్గుచున్నది. అనగా అడవిలో నొకక్రమ పద్ధతి ననుసరించి మొక్కలు పాతరు, కాని ఒకేరకమైన వృక్షములు వేలకొలఁది మొలచియుండుటచే దానికి అందము వచ్చును.

## 146

సత్సంగి తనమనస్సునేకాని, ఇతరులమనస్సుల పరిస్థితినిగుఱించి తలఁచకూడదు.—సత్సంగి త్యాగముచేయుటకు సిద్ధముగ నుండవలెను.

12 జూన్ 1919:— ఒకసత్సంగి హుజూరువారితో విజయనగరమునుండి తిరిగివచ్చినపుడు ప్రయాణములో తనకు సత్సంగుల ఆంతర్యపరిస్థితి (Inner life) తెలిసికొనగల సావకాశము గలిగినదని మనవిచేసికొనెను. ఆసత్సంగి అట్లు చెప్పుటకు కారణమేమనగా, కొందఱు సత్సంగులు రైలులో చాల స్థలము నాక్రమించుకొని సుఖముగ పండుకొనియుండిపోయిరేకాని ఇతరులకు కూర్చుండుటకు కూడ స్థలమిచ్చుటకు వెనుకాడిరి. అది చూచి అతనికి అచ్చెరువయ్యెను. అతడు ఇదిగాక నింక నెన్నియో విషయములనుకూడ పరికించినపిమ్మట నతనికి సత్సంగులలో సోదరభావము, సహకారభావమును శూన్యముగనున్నట్లు అనిపించెను.

దానినిగురించి ఈరోజున హుజూరువారు "ఆనాడు ఆ సత్సంగి చెప్పినమాటకు (remark) నేనప్పుడు సమాధానము చెప్పలేదు. అందుకు తగినసమయమునకై యెదురు చూచుచుంటిని" అనిచెప్పి క్రిందివిధముగ వచనమును సెలవిచ్చిరి. సత్సంగములో చేరకముం దెవ్వరైన నితరుల మనస్సులను పరిశీలించ యత్నించి నచో నది యుక్తమేకాని, సత్సంగములో చేరినపిమ్మట నేసత్సంగియు నితరుల మనస్సుల పరిస్థితినిగురించి బొత్తిగ తలపెట్టకూడదు. సత్సంగి యెప్పుడు తన మనస్సును, సద్గురువుయొక్క మనస్సునుమాత్రమే గమనించుకొనుచుండవల యును. అట్లుచేయుటవలననే అతనికి లాభమున్నది. ముందుకు రాదల్చుకొన్న సత్సంగులు స్వార్థత్యాగముకూడా చేయవలసియుండును. లేనిచో వెనుకపడి పోవుదురు.

సత్సంగులు త్యాగము చేయవలయుననియే రాధాస్వామీవారి ఇచ్ఛయై యున్నది. కాని అత్యధికముగ త్యాగము చేయనియ్యరు. ఎంతకాలము అవ సరముండునో దానికి మించి చాలకాలము త్యాగము చేయనవసరమును లేదు. ప్రతిసత్సంగియు రాత్రి నిద్రపోవుటకుముందు, తాను ఆనాడంతయు నొక్కపని యైన నట్టిది చేసితినా లేదా అని పరీక్షించుకొనుచుండవలయును. అట్టిపని చేయ నిచో పశ్చాత్తాపపడి విచారించవలయును. ఏ సత్సంగియైన నీవిధముగ 2, 3 మాసములు ప్రవర్తించినచో నతడు తప్పకుండ నున్నతి పొందగలడు.

ఒకసత్సంగి మామనస్సులను పూర్తిగా తాఱుమాఱుచేయనియెడల, మాకు సత్సంగశిక్ష యుపదేశములప్రకారము నడుచుకొనుట శక్యముకాదని మనవిచేసెను. అంతట హుజూరువారు "సలహాలు, యుక్తులు, ఉపదేశముల మూలముననూ, ఉదాహరణలను చూపెట్టియునే మనస్సున మార్పుగలుగచేయు కార్యక్రమము జరిగించబడును. దానివలననే మీరు లాభముపొందవలెను. చింపులు, కత్తిరింపులు చేయవలసిన యగత్యము రానియ్యనే కూడదని సెల విచ్చిరి.

## 147

పాపమునకు నిర్వచనము – స్మరణ ధ్యానాద్యభ్యాసముల వాస్తవ స్వరూపము.

13 జూన్ 1919 కూర్తాలము :—పాపము (Sin) అనగానేమి ?

ఒకహిందువు నీవిధముగ ప్రశ్నించినయెడల నతను వేదములు స్మృతుల లోను చెప్పినవిధులకు వ్యతిరేకముగ ప్రవర్తించుటయే పాపమని చెప్పును. ఉదాహరణకు మనుస్మృతిలో దొంగతనముచేయుట పాపమని వ్రాసియున్నది. అయితే అసలుప్రశ్న యేమనగా, చౌర్య మెందువలన పాపకృత్యమైన దను విషయము. బాగుగ నాలోచించగా చౌర్యములవలన సాంఘికజీవనములో శాంతికి భంగము గలుగుచున్నదని తేటపడును. అందుచే చౌర్యము చెడ్డపని అని చెప్పవలసియున్నది. మంచిపని చెడ్డపని అనునవి ప్రవర్తనతో సంబంధించి యున్నవి. మానవునకు సంబంధించియే పనులన్నియు మంచివిగను, చెడ్డవిగను విభజించబడుచున్నవి. కాని ఏదైన నొకకృత్యము పాపము కలుగజేయునా అను విషయము భగవంతునికి సంబంధించియే చెప్పవలసియున్నది. ఏపనిచేసిన భగవంతుడు సంతోషించునో అది పుణ్యకృత్యమును, ఏదిచేసిన భగవంతునికి అప్రసన్నత గలుగునో అది పాపకృత్యము నైయుండును. కాని యెవరైనను భగవంతునికి ఏ యే పనులవలన ప్రసన్నతకాని అప్రసన్నతకాని గలుగునో ఆయనను అడిగి తెలుసుకొనిరా ? దేవులు, దేవతలు అని యెంచబడునవన్నియు ఉత్తరాతివిగ్రహములే కదా ! అవి మాట చెప్పలేవు వినలేవు. పండితులను, పూజారులను కనుగొనినయెడల వారుకూడా దేవుళ్ళను, దేవతలను అడిగి తెలిసికొనజాలరు. వారు తమ భార్యాపుత్రాదులకు లాభము ఏవిధముగ చేసిన గలుగునో చూచుకొని, అందుకు సరిపోవువిధముగ చేయుడని సలహాచెప్పుదురు. సత్సంగులకు తమ సంతసద్గురువు నడిగి భగవంతుని కేది యిష్టమో తెలిసికొన గల ఉత్తమసౌకర్యమున్నది. కావున నా ప్రకారము పనులు చేసుకొనవల యును. సారబచన్ (పద్యములు) లో నిట్లున్నది :—

"గురు ఆజ్ఞా సే జో శిష కరఈ వహ కరతూత భక్తి ఫల దేఈ

అర్థము :—సద్గురుని ఆజ్ఞప్రకారము శిష్యు డేపనినైన చేసినచో నది భక్తిఫలితము నిచ్చును.

స్మరణ, ధ్యాన, భజన, సేవాసత్సంగములు అను నీ అయిదుపనులును చేయవలసినదని బోధించబడినది. వాస్తవములో నీ అయిదు కృత్యములు నొక టియే. స్మరణధ్యానములు చేయుటలో మనస్సును, శరీరమును నిశ్చలముచేయ వలసియున్నది. భజనయనగా సద్గురునితో కలసియుండుట (living with the Satguru). సేవలో శరీరమనస్సులు చలనములోనుండి, సద్గురునిచుట్టు

తిరుగుచుండును. సత్సంగములో శరీరమును నిశ్చలముగ నుంచుకొనవలసి యున్నది. కాని, మనస్సు మాత్రము చలనములోనుండి సద్గురునిచుట్టు తిరుగుచు, హితోపదేశములను వినుటలో లగ్నమై యుండును.

## 148

### అభ్యాసము చేయుటలో పొరపాటుభావములు — కష్టములు, దుఃఖముల యొక్కయు, తీవ్రబాధనుంచి తప్పించుకొను నుపాయము

18 లగాయితు 21 సెప్టెంబరు 1919:—1. జనులు అహంకారము నాధారము చేసికొనియైన నభ్యాసము చేయుచుండిరి, లేదా నిరాశాభావముతోనైన చేయుచుందురు. అందువలన నేమియు ఫలితము లభించ నేరదు. అభ్యాసమును భగవత్కృపనే ఆధారముగ చేసికొని చేయవలయును భగవంతుని దయమీద నాధారపడి అభ్యాసము చేయుట యెట్లు అనెడిప్రశ్నకు అహంకారబలమును నిరాశాభావమును పెట్టుకొనుచున్నట్లే భగవత్కృపనుగూడ ఆధారము చేసికొనవలయునని సమాధానము చెప్పవలయును.

2. గతించిన దినములలో చాల జబ్బుచేసినవారందఱికిని జబ్బు నిమ్మళించినపిమ్మట వారి శరీరములు తేలికయై అభ్యాసమునకు అర్హమై యున్నట్లుగా అనుభవము గల్గియుండును. అనగా వారిలోనున్న విషపదార్థము బయటకు పోవుటచే వారి శరీరమును మనస్సును అభ్యాసముచేయుట కెక్కువ యుక్తముగ నుండును. ఆతరువాత వీరు తిరిగి భోజనము పొట్టనిండుగ రోజున కనేకపర్యాయములు చేయుచున్నకొలఁది ఆ విషపదార్థములు పెరిగిపోయి మరల మొదటిలోవలెనే వీరు అభ్యాసముచేయుటకు అర్హతలేకుండ నైపోయిరి. కాబట్టి యీమధ్యవచ్చిన రోగములవలన రెండువిషయములు నేర్చుకొనవచ్చును. మొదటిది, యీ రోగమువలన గలిగిన లాఘవమును, మిక్కిలి నేతిపదార్థములు మధురపదార్థములను పొట్టనిండుగతిని నష్టపోనివ్వకూడదనియు; రెండవవిషయము నేర్చుకొనతగిన దేమనగా కష్టములయొక్కయు, దుఃఖములయొక్కయు తీవ్రబాధనుండి తప్పించుకొనుట యెట్లు అను విషయము. ఈక్రిందిపద్ధతి ననుసరించినయెడల నట్లు తప్పించుకొనుటకు వీలగును. సత్సంగులైనట్టి మీకు మీ శరీరములో నేదైన పెద్దబాధ గలిగినపుడును, ప్రపంచములోని జీవులకు సామా

న్యముగ నెల్లసమయములందునుగూడ శ్వాస నాభివద్దనుండి బయల్వెడలు చున్నట్లు అనిపించుచుండును. శ్వాస లోనికిపోవునపుడును పైకి విడిచినపుడును గూడ దీర్ఘముగను చాల తీవ్రవేగముతోను వచ్చిపోవుచుండినయెడల, దాని వలన లోపల చాల విషపదార్థమున్నట్లు సూచించబడును. ఏలననగా, ఆవిష పదార్థమును దహింపజేయుటకై చాల యెక్కువ ప్రాణవాయువు (Oxygen) కావలసియున్నందున నది లోపలకు పోవుటకును, విషపదార్థమును దహించిన పిమ్మట నాగాలి తిరిగి బయటకుపోవుటకునుగూడ చాల దీర్ఘమైనశ్వాసలు తీసి కొనవలసి యుండును. అట్టిపరిస్థితిలో శ్వాసలు నాభివద్దనుండికాని, హృదయ మునుండికాని బయల్దేరి వచ్చుచుండును. కావున, ఆకష్టము లేక దుఃఖము యొక్క బాధకూడ నాసమయములో నధికతీవ్రముగ నున్నట్లు కన్పించుచుం డును. అందుకు బదులుగా మీరు ప్రయత్నముచేసికాని, అభ్యాసముద్వారా కాని శ్వాసలను ఆత్మస్థానమువద్దనే తీసికొన్నను లేదా అట్లు తీసికొనుటకై ప్రయత్నించినను మీ శ్వాసలు మొదట హృదయస్థానమువద్దనుండియు, తిరిగి కంఠస్థానమువద్దనుండియు, చిట్టచివరకు ఆత్మస్థానమువద్దనుండియు బయల్వెడల నారంభించుచున్నట్లుగ మీ కనుభవము గలుగును. ఆత్మస్థానమువద్దనుండి వచ్చుచున్నపుడు ఒక్కొక్కప్పుడు శ్వాస ఒక్కొక్కనిమిషముసేపటివఱకు ఆగి పోయి, ఆకష్టముయొక్క తీవ్రబాధకూడ పూర్తిగ తొలగిపోయినట్లుకూడ అని పించును. ఈవిధముగ నభ్యాసము చేసినయెడల కఠినాతికఠిన బాధలుగూడ మాయమైపోవును. 5, 6 నిమిషము లిట్లు స్మరణధ్యానములు చేసినయెడల 5, 6 గంటలసేపు ఆబాధ లేకుండ తొలగిపోవుచుండును. తిరిగి ఆబాధ ఉద్రే కముగ వచ్చినపుడు మరల అట్లే కొంచెముసేపు స్మరణధ్యానములు చేసినచో నెన్నియోగంటలవఱకు శాంతముగ నుండిపోవును. ప్రాచీనకాలపు యోగు లీ యభ్యాసమునే చేసెడివారు. వారు మృత్యువునుండి తప్పించుకొనగల రనెడి ప్రతీతి గలదు. దానిలో నసలువిషయ మీ యభ్యాసమే.

## 149

జగత్తునకు రాబోవు కష్టములను గుఱించియు, భగవంతుని దయానుగ్ర హములను గుఱించియు.

22 సెప్టెంబరు 1919:—నిన్న సాయంకాలము లాహోరువాస్తవ్యులైన లాలా లాల్‌చందుగారు వచ్చి దండప్రణామములు ఒనరించినపిదప మాటలాడు

సందర్భములో క్రితము భండారాకు చాలయుగ్రతరముగా మార్షల్‌లా (Martial law) యుండుటచే తాము రాలేకపోయితిమనియు ఆసందర్భములో ప్రజలకు చాల దారుణహింసలు గల్గెననియు చెప్ప నారంభించిరి. సాహబ్జీమహా రాజువా రిదియొక దారుణహింసయా ఇదేమియు లెక్కసేయదగిన విషయమే కాదని సెలవిచ్చిరి. ఇదే మహమ్మదీయుల రాజరికమయితే యేమైయుండునో! ఇటువంటి సమయములో మొగలు రాజరికమే యున్నయెడల, ప్రజలనందఱిని చంపివేయకుందురా? ఇప్పటికంటె బహు కఠినతరమైనపరిస్థితి కలుగకుండెడిదా? అట్లు మాటలాడుచు నాసందర్భములోనే ఇంకొకమాటకూడ సెలవిచ్చిరి. ఆరోజులలోనే నన్ను అందఱును కాశ్మీరు వెళ్ళవలయుననియు, సర్కార్ సాహబ్ వారి భండారా అంబాలాలో జరిగించి, లాహోరు వగైరా స్థలముల మీఁదుగా కాశ్మీరు చేరుకొన్నయెడల చాల బాగుండుననియు చాల ప్రోత్స హించిరి. కాని మాకీ ఆపన్మేఘములు బయల్దేరుచున్నట్లు ప్రత్యక్షముగ కన్పడు చుండెను. కావున మేమెట్లు వెళ్ళగలము? అప్పుడు మేము వెళ్ళి యుండినచో తప్పకుండ మనసంఘమున కపఖ్యాతి వచ్చియుండును. మనమైతే మాకార్య కలాపమునకు రాజనీతి కార్యములతో సంబంధము లేదని చెప్పుకొనగలము. కాని ఆమాటలు వినువారెవరు? మీరీవైపున కీసమయములో వచ్చుటయే మీపై అనుమానము పుట్టించుచున్నదని యెదురుచెప్పుదురు.

పిమ్మట నింకొకవిషయముకూడా చెప్పిరి. నేను మిమ్ములను ఇప్పుడు వెంటనే ఈ కంపెనీ పెట్టుడనికాని, మఱొకప్పుడు ఈపని చేయుడనియు, ఇంకొకప్పుడు మఱొకపనిచేయుడనియు సలహా చెప్పినపుడు ఆమాటలన్నియు నిరర్థకముగా చెప్పుచున్నానని యనుకొనకుఁడు. మాకిప్పుడుకూడ మేఘములు క్రమ్ముచున్నట్లు కన్పించుచున్నవి. అయితే హిందూదేశములో జనులందఱికి సర్వసాధారణమైన వధలు ఇకముందు జరుగుట అసంభవమనుకొనుచుంటిరా? లేదు అసంభవమేమియు కాదు. మీరు మేము నింకను 10, 15 యేండ్లు బ్రతికియుండినచో హిందూదేశములో సర్వసాధారణవధలు జరుగుటయు చూపించగలను. జనులు ఒక్కొక్క కబళముకొఱకై తిరుగులాడుచు నెక్కడను వారికి ఒక ముద్దకూడ దొరకకుండుటయు చూపించగలను. మేము స్కూలుపెట్టునపుడో లేక అంతకుముందోకాని, హిందూదేశములో ధాన్యపుగింజ రూపునకుకూడ లేకుండనుండెడి రోజులు రాగలవని తెల్పుచు, నిట్లే మఱికొన్ని నిష్ఠురోక్తులతో

కూడిన ప్రకటనపత్రము నొకదానిని వ్రాయించితిమి. కాని, కొందఱు సత్సంగులు వద్దని పట్టుపట్టుటచే సదలి పదములను కొంతవఱకు మృదుపదములలోనికి మార్చితిమి. ఆమాటలు పూర్తిగా సరియైనవే. ఆపరిస్థితియే రానైయున్నది. భగవంతుని ప్రార్థనచేయుటవలన తప్పకుండా కొంతకాఠిన్యము తగ్గిపోవచ్చును కాని పూర్తిగామాత్రము పోనేరదు. కాబట్టి ఆసమయముకూడా తప్పక మీరు చూడగలరు. అప్పుడు మేము చేసెడి యీపనులయొక్క లాభము మీకు బోధపడును. ప్రస్తుతము అన్నముకరువు, బట్టలకరువు, యుద్ధము, రోగములు వగైరా ఆపత్తులన్నియు నున్నను దయాల్బాగులో సూర్యుడేవిధముగ నీప్రక్కన ఉదయించి ఆవైపున నిరాటంకముగ అస్తమించుచున్నాడో, అట్లే ఆసమయములో నిచ్చట నిస్సంశయముగ సుఖశాంతులు ఉండి, ఇచ్చటనున్నవారి కే కష్టములును లేకుండా తప్పిపోవును. అట్టి పరిస్థితులలో సత్సంగులకు ఈ స్వగృహము ప్రియముగ కన్పట్టగలదు. ఈ ఆపత్తులవర్షము కురిసి తగ్గిపోయినతర్వాత సత్సంగులు తమరి నీయాపత్తులనుండి రక్షించునట్టి యేర్పాట్లు ముందుగనే చేసిన దయాల్బాగు ప్రబంధకర్తల దూరదర్శిత్వమును కొనియాడగలరు. స్వామీజీమహారాజువారిని హుజూరుమహారాజువారు ప్రార్థించిన ఈ క్రింది ప్రార్థన ననుసరించియే యీ కార్యక్రమమంతయు నడిపించబడుచున్నది—

"సతగురు సే కరూఁ పుకారీ
సంతన్ మత కీజే జారీ".

ఈ యుద్దేశ్యసాఫల్యమునిమిత్తమై యేబాధలు ఆపద్వ్యాసములును రావలసియున్నవో అవన్నియు తప్పక వచ్చితీరును. ఆప్రార్థనను భగవంతుడు అంగీకరించినందున, అది పూర్తిగ నెఱవేరితీరును. ఆ ఆపత్తుల గాలివాన తగ్గిపోయిన తర్వాత ప్రజలు ఈమతముయొక్క ప్రశస్త్యమును తెలిసికొని లోకములోని వివిధభాగములనుండియు ప్రజలు ఈమతములో చేరుదురు. ఎవరికైన భగవంతుడు ఉపదేశమిచ్చి అతనిని తిన్నగ తన ఆత్మీయునిగ చేసికొన్నపుడు అతనితో వారు తనయందు ప్రీతి చేయుమనియు, ప్రతిదినము రెండుసార్లు తప్పకుండగ నభ్యాసముచేయుటయేగాక మఱికొన్నిసార్లుకూడ కొంచెము కొంచెము సేపు అభ్యాసము చేయుమనియు ఇంతమాత్రమైనను చెప్పకుందురా ? అట్లు చేయలేనియెడల, రెండుసార్లే చాలుననియు అదికూడ వీలుగానిచో ఒక్కసారియే చాలుననియు, అదికూడ సాగనియెడల అధమపక్షము ఏదైన కష్టము

కాని, బాధగాని గలిగినప్పుడైనను భగవద్ధ్యానము చేయుచుండుమనియు సెలవిత్తును. ఇట్లు చేయుట యేమియు కష్టమైనపని కానేరదు. అందుకు ఫలితముగా ఆపత్తులు కష్టములు ప్రమాదములు వగైరా అనిష్టముల వృపాతము నుండి ఇతనికి సంరక్షణగూడ గల్గుచుండును.

## 150

### అభ్యాసముయొక్క ఆవశ్యకత.

22 సెప్టెంబరు 1919:—మొన్నటిరోజున సర్కార్ సాహబ్ వారి ప్రార్థనా శబ్దములో "సద్గురుని దయ కలిగినపు డభ్యాసము సాగును. అభ్యాసము చేసినయెడల దయాకటాక్షము లింకను ఎక్కువగ వృద్ధి యగును" అనెడి చరణముమీద వ్యాఖ్యానముచేయుచు, సాహబ్జీ మహారాజువారు సద్గురునివద్ద నుండి మీ కేనాడు ఉపదేశము లభించెనో, ఆనాడే మీయందు దయాకటాక్షములు వర్షించుట అయిపోయినదని సెలవిచ్చిరి. దయాకటాక్షములు చేయనియెడల ఉపదేశము లభించనే లభించదు. ఇప్పుడు మీమీద నిట్టి దయాకటాక్షములు పడినవిగాన నిక అభ్యాసము చేయుట మీ కావశ్యకమని తేలుచున్నది. అభ్యాసము చేయువఱకు మీకు ఆతరువాతిపంక్తియొక్క ఫలితము లభ్యము కానేరదు. ఈమతములో అభ్యాసము చేయనిచో త్రోవ తప్పిపోవుదురను విషయముగూడ తెలుసుకొనవలయునని సెలవిచ్చిరి. దీనికి ఉదాహరణ యేమనగా, మేము చిన్నతనములో అంబాలాలో చదువుకొనుచున్నపుడు మాతల్లిదండ్రులు మమ్ములను గదిమి కోపపడియు, అప్పుడప్పుడు దెబ్బలుకూడా కొట్టి మాకిష్టము లేకపోయినను బలవంతపెట్టి స్కూలుకి పంపెడివారు అప్పుడు మమ్ముల నట్లు కోపపడుటయే ఉపయోగించినది. మాతోకూడ ఇంకను ఏడు, ఎనమండుగురు పిల్ల లుండెడివారు. వారితల్లిదండ్రులు వారిని అప్పుడు గారాబముచేసి బుజముమీద ముద్దుగ తట్టుచు ఏమైన నౌగాక యని చెప్పుచు నింట కూర్చుండబెట్టెడివారు. ఇప్పుడు దానిఫలిత మేమనగా, వారిలో 3, 4 గురు చనిపోయినట్లున్న. మిగిలినవారికి తినుటకు రొట్టెకూడా దొరకక బాధపడుచున్నారనియు, తమ తల్లిదండ్రులు ఆసమయములో తమ్మును కొట్టి తిట్టి స్కూలుకు పంపించకపోవుటచే వారు తమకు మహాపకారము చేసిరని తల్లిదండ్రులను దూషించుచు, వారి ప్రాణమునకు జీవితమే భారమైపోయినట్లు బాధపడుచున్నారనియు తెలియు

చున్నది. అదేవిధముగా, ఏదైనను మీదకు వచ్చినపుడే చూచుకొనవచ్చునని నిర్లక్ష్యము చేసినచో సత్సంగికూడ పైన చెప్పిన 3, 4 గురు పిల్లలకును గల్గిన ఆపత్తువంటి ఆపత్తులలో పడిపోవలసివచ్చునని తెలిసికొనవలెను. ప్రాపంచిక జీవులుకూడ నిట్లే అనుకొనుచుందురు. జీవితమంతయు ఆహారపానీయములు మెండుగ మెక్కుచు తీర్థయాత్రలు చేయుచు కాలక్షేపము చేయుచు ఏదైనను మీదికి వచ్చినప్పుడు చూచుకొనవచ్చునని తలంచుచుందురు. ఈమానవశరీరము మహాకష్టముమీద గొప్పఅదృష్టవశాత్తు లభ్యమగుచుండును. పిచ్చికలు, కాకులు వగైరా జంతువులకు చాలపిల్లలు పుట్టుచున్నవి. పైన చెప్పినట్లుగా మానవయోనిలో బుట్టినపుడు ఏమైనను జరిగినపుడే చూచుకొందమని, యోచించుకొనుచు జీవితము వ్యర్థముగా పోగొట్టుకొన్నవారే ఇపుడానీచయోనులలో బుట్టియుండరా? ఇప్పుడు వారేమి చూచుకొనగలరో ఆలోచించుడు; ఆసమయము చాల సున్నితమైనది. ఆత్మ లాసమయములో నిరాధారపరిస్థితిలోనుండి, మహావేగముతో క్రిందికి త్రోసివేయబడుచుండును అప్పు డెవరు నేమియు చేయజాలరు. కాబట్టి ఇప్పుడే జాగ్రత్తగ నాలోచించుకొని నడచుకొనవలెను.

## 151

స్వప్నములను గుఱించి.

23 సెప్టెంబరు 1919:—నిన్న సాయంకాలము కలలనుగుఱించి కొద్దిగ చర్చ జరిగెను. హుజూరువారు మొదట నొక లాహోరులో చనిపోయిన సత్సంగివిషయము చెప్పిరి. అతడు చనిపోయినపిమ్మట కొంతకాలమునకు తన భార్యకు స్వప్నములో అగుపించి, నీ వెందు కేడ్చుచుంటివి, నేను చాలసుఖముగ నున్నానని చెప్పినట్లు ఆమెకు కలవచ్చినదట. అసలువిషయ మేమనగా, ఎవనికైనను నిదురపోయినపుడు మెదడుమీద తనస్వాతంత్ర్యము కొంతవఱకు తగ్గిపోయి ఆలోచనలు భావములలోను క్రమశూన్యతకూడ పోయి అస్వతంత్రత యేర్పడును. ఆవిధముగా మనస్సున నిల్చిపోయిన భావములు ఆలోచనలును పైకి వచ్చుచున్నపుడు, జనులు వానిని స్వప్నములని యనుకొనుచుందురు. స్వప్నములు నాభిస్థానమునుండిగాని, హృదయస్థానమునుండికాని, కంఠస్థానమునుండికాని వచ్చుచుండును. కావున నవి యెప్పుడు నిజమే కావలసినపని లేదు. ఒకప్పుడు నిజమైనను కావచ్చును, మఱొకప్పుడు అబద్ధముకూడా కావచ్చును.

ఎట్లనగా, పైన చెప్పిన లాహోరు సత్సంగి విషయములో ఆ స్త్రీపురుషు లిద్దఱికి పరస్పరము చాల అనురాగ ముండుటచేతను. సత్సంగు లందఱును మరణానంతరము ఉత్తమలోకమునకు పోయి యెక్కువ సుఖముగ నుందురనెడి భావము ప్రతిసత్సంగి హృదయమందును నాటుకొని యుండుటవలనను అట్టిస్వప్నము వచ్చియుండవచ్చును అటులనే, మహారాజసాహబ్ వారి అనంతరమందు, సత్సంగమునుండి విడిపోయినవారిలోగూడ కొందఱికి స్వప్నములు హుజూరు మహారాజువారిని, మహారాజసాహబ్ వారిని చూచినట్లుగ నప్పుడప్పుడు కనిపించవచ్చును. ఆస్వప్నముల మూలమున తమకు దర్శనమైనదని వారనుకొనుచుందురు. వాస్తవములో వారిజన్మలు వ్యర్థమైపోవుటకు ఇట్టిస్వప్నములే కారణము. సంతులు గుప్తమైనపుడు వారు తమగురుముఖశిష్యుని లోనైనను ప్రవేశింతురు లేదా ఆధార తిరిగి తనధామమునకు పూర్తిగా వెడలిపోయినను వెడలిపోవునని స్వామీజీమహారాజ్ వారి వచనము స్పష్టముగ చెప్పుచున్నపుడు, మహారాజ్ సాహబ్ వా రింతవఱకు ప్రకటము కాకుండగనే యుండిపోవుదురా, లేక హుజూర్ మహారాజువారు తమధామమునకు వెడలిపోయినను కూడా నింతవఱకు నీలోకముయొక్క కార్యములలో కలుగజేసికొనుచు నుందురా, అనెడి విషయమును మీరాలోచించుకొనుడు. ఆ రెండు విషయములుకూడ బొత్తిగ నసంభవములు. మీరు కల అనవచ్చును, మత్తైన నవచ్చునుకాని ఆఱవ చక్రమువద్దకు వెడలినపిమ్మట మీకుగలిగెడి స్వానుభవమొక్కటే అసలైన నిదర్శనము. అదియే పూర్తిగా యథార్థమైన స్వప్నము. ఆస్వప్నములో సత్సంగులుకాని కుర్చీకాని, సింహాసనముకాని, ఇట్టివెవ్వియు కనిపించవు. ఒక్కప్రభువును సేవకుడుతప్ప మఱెవ్వరు నుండరు. సేవకునికి అట్టిఅనుభవము గలిగిన తర్వాత కండ్లు తెఱవగా మెలకువవచ్చినపుడు, శరీరములోనికి ఆత్మ తిరిగివచ్చి ప్రవేశించినట్లుగ అనుభవము గలుగును. కావున సత్సంగులు మామూలు స్వప్నములను నమ్ముకొనుట పూర్తిగా విడచిపెట్టి, జాగ్రదవస్థలోని అనుభవములపైననే ఆధారపడి నడచుకొనుట మంచిది.

## 152

అభ్యాసములో గలుగు పరిస్థితులనుగుఱించియు, అభ్యాసము చేయవలసిన పద్ధతిని గుఱించియు.

24 సెప్టెంబరు 1919 :—అభ్యాసముయొక్క వివరములనుగుఱించి కొంత చర్చ జరిగినది. చిత్తముయొక్క వృత్తి యేకాగ్రమైనపుడే అభ్యాసములో సాఫల్యము సేకూరునని సెలవిచ్చిరి. పగలు చేసెడి కార్యములలో మనిషి నిర్లిప్తముగ నున్నయెడలనే మనస్సు సావధానముగ నుండుట సాధ్యమగును. సత్సంగి ఆసీథముగ ప్రవర్తించుచు నభ్యాసము చేసుకొనవలెను. సంపూర్ణముగ నిశ్శబ్దమైనస్థలములో కూర్చుండవలయును. అచ్చోట నెట్టి భయోత్పాతములకును సావకాశముండకూడదు. ఎవరైనను విఘ్నము కలుగజేయుదురనెడి అనుమానముకూడ ఉండకూడదు. అప్పుడు ఇతరమైన ఆలోచనలను భావములను అన్నిటిని పూర్తిగ త్రోసిపుచ్చి, ఆత్మస్థానమువద్ద, ఆత్మజిహ్వతో స్మరణచేయుట ప్రారంభించుము. అభ్యాసము ఒక అరగంట లేక ముప్పావుగంటసేపు చేయవలయునని మనస్సున నిశ్చయించుకొనుము. ఆ స్వల్పకాలములోనే ఆనాటి వ్యవహారకృత్యములకు సంబంధించిన ఆలోచనలు పెట్టుకొన్నందువలన నేమైనను లాభము గల్గునా? ఈ రవ్వంతిసమయములోగూడ నీ ఇతరాలోచనలను దూరముగ పెట్టుకొనలేవా? కూర్చుండునపుడు నీనడుమును తిన్నగనుంచుకొనుము. నీశరీరము నెక్కువగా బిగిపెట్టను కూడదు. ఎక్కువ జారిపోనీయను కూడదు. మెడనుకాని, ఇతర శరీరభాగములనుకాని వంగిపోనీయకూడదు. ప్రారంభములోనే భజనాభ్యాసములో కూర్చుండకుము. స్మరణాభ్యాసముమీద చాల నొక్కి చెప్పుచు, స్మరణ సరిగా చేసినయెడల దానిలోనే భజనాభ్యాసముయొక్క అనుభవములన్నియు లభ్యముకాగలవని సెలవిచ్చిరి. ఆయభ్యాసము చేయునపుడు పెదవులకుకూడ మాధుర్యముయొక్క అనుభవము గలుగును. జనులు స్మరణధ్యానముల మహిమ నెఱుగరు. మీరు పైనచెప్పిన పద్ధతిని స్మరణధ్యానములు కొద్దిసేపు చేసినయెడల, నిన్నటిరోజున నేను తెలియజేసిన స్వప్నావస్థవంటి పరిస్థితి మీకు మొట్టమొదట గలుగును. అనగా మీకు మీ మెదడుమీద స్వాతంత్ర్యము నశించి, ఆరోజునకు సంబంధించిన యే ఆలోచనలు మీ మెదడులో సర్వోపరి యుండునో, అవియే మహావేగముతో ప్రకటము కాగలవు. ఆ ఆలోచనల నణచివైచి మీ రభ్యాసము సాగించుకొన్నయెడల కొద్దిసేపటికే మీపొట్ట గుమ్మడికాయవలె పొంగనారంభించుచున్నట్లనిపించి. మీలో భయంకరమైన ఆలోచనలు బయల్దేరి, మిమ్ములను వ్యాకులపెట్టును. అదికూడ దాటి మీరు అభ్యాసము చేసినయెడల నొకటి, రెండు నిముషముల

సేపటిలో మీపొట్ట తిరిగి మామూలుప్రకారమై మీ శ్వాసకూడ తేలిక అయి పోవును. అప్పుడు మీకు, జగన్నాథక్షేత్రములో ఒకచిన్నపెట్టె పట్టుకొని దానిలో, ఢిల్లీబజార్లు, ఆగ్రాలో తాజ్ మహల్ వగైరాలను పైజనులకు చూపించెడి స్త్రీలవలెనే మీఆత్మయున్నట్లు అనిపించుచుండును. మీఆత్మ మీశరీరమును ఆచిన్నపెట్టెవలెనే ఉపయోగించుచున్నట్లును, మీరు యీశరీరముకంటె వేరైయున్నట్లును, మీకు తెలియుచుండును. ఆపరిస్థితి వచ్చినపిమ్మట భజనాభ్యాసము చేసినయెడల నిక చెప్పవలసిన దేమున్నది. ప్రతి సత్సంగియు నీవిధముగా రోజు తెల్లవారగట్ట 4 గంటలకు, లేదా 4-30 నిమిషములకు, లేదా 5 గంటలకు లేచి తప్పక అభ్యాసము అరగంట లేక ముప్పావుగంట చేసి దానిఫలితమెట్లుండునో చూచుకొనుడు. ఈవిధముగా రెండుమాసములు అభ్యాసము చేసినయెడల నాంతర్యమున దర్శనము లభించకుండుట అసంభవము. అట్లు ఆఱు మాసములు అభ్యాసము చేసినయెడల నిక చెప్పెడిదేమి ? ఇప్పుడు మీలో ప్రతివ్యక్తికిని మాసలహా యేమనగా ఈరోజునుండియు నిట్లు చేయుట ప్రారంభించుడు. ఇంతకుముందు చేసితిమా లేదా అనువిషయము మఱచిపొండు. ఇక్కడనుంచి యీ సలహాప్రకారము నడుచుకొనుడు. ఇకముందిట్లు నడుచుకొనునిమిత్తమే మేము మీకీసలహా చెప్పుచున్నది. "భగవంతుడు ముందుగ దయచూపవలెను. అపుడే మే మేమైనను చేయగలము" అని తఱుచుగ మీరు అనుకొనుచుందురు. ఇట్లెంతకాల మనెదరు ? భగవంతుడు ఇప్పుడే మీమీద అనుగ్రహముచేసిరనియు దయచేయుటవలననే ఆయన యీ మాటల నొకరి ముఖముద్వారా మీకు చెప్పించుచున్నారనియు విశ్వసించుటకు మీకు సాధ్యము కాదా ? మీరు ప్రతిదినము తెల్లవాఱుజామున నివ్విధముగ స్మరణధ్యానములు చేయుచుండినయెడల ఆదినమంతయు మీపరిస్థితి, మీ మనస్సుశరీరముల నెడి గుఱ్ఱములమీద మీరు సంపూర్ణ స్వాతంత్ర్యముతో స్వారిచేయుచున్నట్లుగనే యుండును. మీరు వానిచేత నేపనికావలెనన్న దానినే చేయించగలుగుదురు; కాని వానికి మీరు స్వాధీనములో నుండరు. అట్టి అభ్యాసియొక్క పరిస్థితియే వేఱుగనుండును. అతని కంఠధ్వని వేఱుగనుండును. అట్టి సత్సంగి రాత్రివేళ పహరా యిచ్చినపుడుకూడ అతని కంఠధ్వనిలో నొక అతీతలక్షణము కనబట్టును. కావున నేమైనను మీరు చేయదలచుకొన్నయెడల మీకు చేయుటకిదియే సమయము. ఈసమయమును దాటబెట్టి ఇకనెపుడో మీ ముసలితన

ములో విరిగిపోయిన కలమును, పగిలిపోయిన సిరాబుడ్డిని, సిరాతో పూర్తిగా అలుకుకొనిపోయిన కాగితమును తీసికొనివచ్చి, నాయెదుట పెట్టినను దాని మీద అందమైనవ్రాత చూపమన్నచో నేనేమి చూపగలను ?

ఈమధ్యన గతించిన దినములలో హుజూరువారు సెలవిచ్చిన మఱికొన్ని వచనము లీక్రింద వ్రాయబడినవి: —

1. పైనచెప్పినవిధముగ స్మరణధ్యానములు చేయుటవలన గలిగెడి ప్రీతిప్రతీతులే దృఢతరముగను విశ్వాసయోగ్యమైనవిగను ఉండగలవు. మీ పిల్లవాని కేదైన పెద్దజబ్బుచేసి తగ్గినందువలన గలిగెడి భక్తి నిలబడనేరదు. అప్పటికప్పుడుమాత్రము భగవంతుడే యీ జబ్బు కుదిర్చిరని చెప్పి భగవంతుని యందు కృతజ్ఞతాభావ మేర్పడును. కాని కొద్దిరోజులలోనే మరల ఫలానా వైద్యుడు ఫలానా మందిచ్చి వైద్యముచేయుటచే జబ్బు తగ్గినదనెడి ఆలోచన మనస్సున బయల్దేరును.

2. నీవు భగవంతుడవే అయిననుకూడ, గురువు తోడులేనిదే యీ మార్గమున ప్రయాణము చేయరాదు.

3. అసలుసంగతి యేమనగా, యెవనికిని భగవంతునియందు ప్రేమ లేదు; ప్రేమభావముతో నెవరు నభ్యాసము చేయుటయు లేదు. భగవంతుని రూప మెట్లుండునో ఒకసారి చూడవలయుననెడి మానసికకౌతూహల మొక్కటే (curiosity) పెట్టుకొని సత్సంగులు అభ్యాసము చేయుచున్నారు. అందువలననే వారికి అభ్యాసము జయప్రదముగా సాగుటలేదు.

## 153

### అంతర్యదర్శనము, బాహ్యదర్శనము.

27 సెప్టెంబరు 1919:—దర్శనము దొరుకుటలేదని జనులు ఫిర్యాదు చేయుచుందురు. అసలైన దర్శనము ఆత్మస్థానమువద్దనే లభించును. కాని అంతకన్న ముందుకూడా, అనగా సత్సంగి హృదయస్థానమువద్దనే యుండిపోయి నను, తనచిత్తము నిటునటు ప్రవహించిపోకుండ నేకాగ్రముచేసి యుంచుకొన్న యెడల, అంతర్యదర్శనానందము కొంతవఱకు లభ్యముకాగలదు. పగలంత

యును, చాలమట్టుకు రాత్రివేళకూడా హృదయములో తరంగములు కొట్టు చునేయుండి ఒక్కక్షణముకూడ చిత్తము అంతరంగమున నేకాంతమునకు పోనిచో, దర్శనముకొఱకు ఆశపడుట వ్యర్థము. మహారాజసాహెబ్ వారు ఉదయము 9 గం॥ 30 ని॥లకు కార్యాలయమునకు (office) వెళ్లుచుండెడివేళ జనులు వారిదర్శనముకొఱకై నిలబడి చూచుచుండెడివారు. ఆసమయములో వారెవరిని నిషేధించలేరు. పైగా, దర్శనముచేసుకొనువారిలో చాలమందిని దయాదృష్టితో పరికించి చూచెడివారు. కాని సాయంకాలము వేళ వారు ఆఫీసు నుండి యింటికిపోవునప్పు డెవరైన దర్శనముకొఱకై నిలబడినచో వారిని కోప పడెడివారు. పరమార్థవిషయములలో పద్ధతి అట్లే యుండును. ఎవనిమీద దయాదృష్టి పడెనో వానికే ఆవిషయము స్పష్టముగా తెలిసిపోవును కాని, వాని చుట్టుప్రక్కలవారికికూడ నేమియు తెలియదు. ఆవిషయము తెలిసికొను టకై అతడు మఱొకరి నడగవలసిన పనికూడ లేదు. కడుపునిండుగ భోజనము చేసినవాడు తాను భోజనముచేసెనో లేదో ఇతరులను వాకబుచేసికొనుచు తిరుగడుకదా. తాను భోజనముచేసినట్లును, తనకడుపు నిండినట్లును తనంతట తనకే తెలియుచుండును.

# 154

## మతమునకు ప్రధానవిషయము సజీవసద్గురువు.

27 సెప్టెంబరు 1919 :— ఈరోజు ఉదయముపూట హుజూరువా రొక సారి మున్శీమత్తూలాల్ గారిని "నీకు విశ్వాసమున్నది మామీదనా, రాధాస్వామీమతముమీదనా" యని ప్రశ్నించిరి.

జవాబు :—మీామీద నున్నది. మీారును, రాధాస్వామివారును ఒకరే కాని వేఱుకారు.

ప్రశ్న :—రేపు నేను ముసల్మాన్ అయిపోయినచో, నీవు ఏమి చేయుదువు ? ఈమతములోనే యుండిపోవుదువా లేదా ?

జవాబు :—నేను మీాతోనే వచ్చెదను.

ప్రశ్న :—అయితే నీకు రాధాస్వామీమతమందు విశ్వాసము లేనట్లే.

దీనికి సమాధానము చెప్పలేక మత్తూలాల్ గారు వ్యాకులపడెను. చివరకు హుజూరువారే సమాధానము సెలవిచ్చిరి. మతమనునది లోకములో వ్యావహారిక విషయము. దానిలో నేమియు ప్రభావములేదు. అది యిక్కడనే యుండిపోవువిషయము. ఆమతమును నడిపెడివానితోనే అసలు సంబంధము. కబీరు సాహబ్ వారిదనియు, గురునానక్ వారిదనియు, హిందువులదనియు, మహమ్మదీయులదనియు మతములు చాలయున్నవి. కాని అవన్నియు మృతప్రాయమైపోయినవి. ఏమతమునకైనను నడిపెడిపురుషుడు లేనిచో నామతములో చేరి యుండుట వ్యర్థము. అందుచే రాధాస్వామీమతములో మహిమ అంతయు నా మతశిక్షకునిది కాని మతమునది కాదు. మహారాజసాహబ్ వారు జనులను సాయంకాలము తమదర్శనముచేసికొనుటకు రావద్దని నిషేధించుచుండిరి. అయిననుకూడ ఎవనికైనను మేలుకువగనున్నట్టి శత్రువువద్దనుండి అతనిదర్శనము చేసికొనుటకన్న తనతండ్రి నిద్రపోవుచున్ననుకూడ నతనివద్దనేయుండి, అతని దర్శనము చేసికొనుటయే యెట్లుత్తమముగనుండునో, అట్లే ప్రాపంచికజీవులతో సహవాసముచేయుటకన్న సంత్ సద్గురుని దర్శనముచేసికొనుట యెప్పుడు నుత్తమము.

## 155

### భండారాలను గురించి.

27 సెప్టెంబరు 1919:— సాయంకాలము హుజూరువారు ఎవరెవరికి జబ్బులుచేసినవని అడిగి తెలుసుకొనిరి. జబ్బులు వచ్చినవారిసంఖ్య యెక్కువగ నుండుటచే హుజూరువారు యీ ఋతువులో భండారాచేయుటయే సరికాదని సెలవిచ్చిరి. ఈ ఋతువులో యెప్పుడు జబ్బులు వచ్చుచుండుటచే, వచ్చిపోయెడివారికిని, ఇక్కడ యేర్పాట్లు చేసెడివారికినిగూడ కష్టప్రదముగనున్నది. ఎంతచేసిననుకూడ సంఖ్య చాల పెరిగిపోవుచుండుటచే నేర్పాట్లుచేయుట చాల కష్టముగనున్నది. కావున నికముందు భండారాలకి పేర్లు తీసివేసి, ఒకభండారా ఈస్టరు సెలవులలోను, రెండవది క్రిష్టమస్ సెలవులలోను, మొత్తము రెండే భండారాల నేర్పాటుచేయలవయును. తిరిగి యిట్లు సెలవిచ్చిరి. ఒకడు అరణ్యములో నొంటరిగ నుండెడివాడు. అతడు "ఓ భగవంతుడా! నేను ఒంటరిగ నుండిపోయితిని ఒంటరిగ నుండలేకున్నాను" అని భగవంతునికి ప్రార్థనచేసెను.

అంతట భగవంతుడతని కొక ఆడుదానిని యిచ్చెను. కొంతకాలమునకు వారి కొక కుమార్తె పుట్టెను. అప్పుడతడు "ఓ భగవంతుడా నీవు కుమార్తె నిచ్చితివి. సంతోషమే కాని, ఆడపిల్ల నావంశముపేరు నిలబెట్టలేదు. నాపేరు నిలబడునట్టి యేర్పాటుకూడా చేయుటకు అనుగ్రహించుడ"ని ప్రార్థించెను. భగవంతుడతనికి ఒకకుమారుని నిచ్చెను. వారిద్దఱికిని మరణమునకై పిలుపు వచ్చినపుడు, స్త్రీపురుషులు ఇరువురునుకూడ "మాపిల్లలింకను పసిపిల్లలు కదా. ఇప్పుడప్పుడే మేమెట్లురాగలము ? మాపిల్లలు పెద్దవారయి తమసంరక్షణ చేసికొనుటకు తగినవారైనపుడు తప్పకవచ్చి మమ్ములను తీసికొనిపొండు" అని మొఱపెట్టుకొనిరి. భగవంతుడు అందు కంగీకరించెను. కుమారుడు, కుమార్తెయు పెరిగి పెద్దవారైరి. వారికి పెండ్లిండ్లుకూడా నైపోయెను. తిరిగి మరణమున కాజ్ఞ రాగా స్త్రీ పురుషు లిరువురును, మాపిల్లలకు పిల్లలు కలుగుటకూడ చూడవలయునని కోరిరి. సరే ఆసమయముకూడా భగవంతుడు దాటిపోనిచ్చెను. ఆపిల్లలకు పిల్లలుకూడా పుట్టిరి. అప్పుడు మరల మృత్యువు వచ్చెను. అప్పుడు వారు "మాపిల్లలకు సంతానము కలిగినమాట వాస్తవమే. కాని వారికి సంతానమును పెంచగల వివేక మింకనులేదు. వారిపిల్లలను మేము పాలనచేయవలసియున్నద"ని చెప్పి తప్పించుకొనగోరిరి. ఈవిధముగా వారి కుటుంబములో నూఱునూటయేబదిమంది వఱకు సంఖ్య పెరిగిపోయి, ఆకుటుంబముయొక్క పరిస్థితి నరకసమానమైపోయెను. ఇచ్చట పరిస్థితికూడ నట్లే అయిపోయినది. సత్సంగములో కొద్దిమందిమాత్రమే యున్నతేపుడై, యెన్నిభండారాలు చేసికొన్నను చేసికొనవచ్చును. అప్పుడు పరిస్థితి వేఱు. ఇప్పుడన్ననో సంఖ్య బాగా పెరిగిపోయినది, ఇంకను పెరిగిపోవుచున్నది. ఈ పరిసితులలో నింత యెక్కువమంది ప్రోగగుచుండుటవలన రోగములు పెరిగిపోవుప్రమాదము గలుగుచున్నది. కావున పూర్వపు రివాజులను ఆపుచేసి క్రొత్తపద్ధతుల నేర్పాటుచేయుట యుక్తము. భండారాలు చేయుటలో ముఖ్యోద్దేశ్యము సత్సంగులందఱు నొకసారి కలుసుకొనవలయుననియే. ఆయుద్దేశ్యము సాలుకి రెండు భండారాలు చేసినందువలన పూర్తియగును. ఈవిధముగ నధికసమూహాములుగ జనులు వచ్చినపుడు అందులో చాలమంది "సరే ఒకసారి యీ వాతావరణము మాఱితే మంచిదే చూచివత్త"మని మాత్రమే భావముపెట్టుకొని వచ్చుచుందురు. అందువలన కపటపుమనుష్యులగుంపు పెరిగిపోవును. వాస్తవ

పరమార్థులకు నష్టమును సంభవించును. వాతావరణము మార్పుమాత్రమే కోరువారికి ఇచ్చటకే రానక్కఱలేదు, ఇతరస్థలములుకూడ నున్నవికదా. మీరు కపటభావముతో నిచ్చటకువచ్చి సంఖ్యపెంచి, న్యాయమైన పరమార్థులకు పరమార్థభంగము కలిగించి, ఇచ్చటి ప్రబంధకర్తలకు పనులెక్కువజేసి శ్రమగల్గించినయెడల ఈ అకార్యకరణమునకై భగవంతుడు మీకు ఒక మహా శిక్ష విధించగలడనువిషయము బాగుగ తెలుసుకొనుడు. మీకు సత్సంగమునకు వెళ్ళవలెనని న్యాయమైన భావమును, నిజమైన విరహమును గలిగిననే రావలెను కాని లేనిచో మీరిచ్చటికివచ్చుట తప్పే యగును.

## 156

సత్సంగి నీచమనస్సు నెప్పుడు నణచిపెట్టి యుంచవలెను.

28 సెప్టెంబరు 1919 :—ఫరౌన్ పాదుషా తనదాసీమనిషిచే బలాత్కారముగ తాను భగవంతుడని యొప్పుకొనునట్లు చేయగోరెను. కాని ఆదాసీమనిషి అందుకు ఒప్పుకొనలేదట. ఈదృష్టాంతమును చెప్పి హుజూరువారు మనపిండదేశపు మనస్సుకూడా (పిండీమన్) ఫరౌన్ చక్రవర్తికి పినతండ్రివంటిదే. ఫరౌన్ పాదుషా ఆదాసీమనిషిని జీవితములో నొకసారిమాత్రమే ఆవిధముగా బలాత్కారము చేయబోయెనుకాని మనమనస్సు ప్రతిదినము నెన్నియోసార్లు వివిధరకములైన ఇచ్ఛాతరంగములను లేవదీయుచు మనయుత్తమప్రజ్ఞను నాశనముచేయుటకై చూచుచుండును. కావున నేసత్సంగి యీ నీచస్థానములోనిమనస్సుతో ఆ జీవితాంతము నెల్లపుడు పోరాడుచు ఉత్తమస్థానపుప్రజ్ఞను మేల్కొల్పుకొనుచు, నీచపుమనస్సును అణచిపెట్టు ప్రయత్నములో లగ్నమై యుండునో అతడే యథార్థమైన సత్సంగి.

## 157

నీచమనస్సుతో పోరాటము – స్మరణధ్యానాభ్యాసముయొక్క మహా మహిమ – దానివలన ఉత్తమమనస్సున ఉత్తమసంస్కారములు స్థాయిగ నేర్పడుట.

29 సెప్టెంబరు 1919 :—సత్సంగియగుట సులభమా, కష్టమా ? సత్సంగి యని అనిపించుకొనుటకు అర్హులెవరు ? ఫరౌన్ మహాప్రభావముతోనున్న రోజు

లలో నతనికి తనకన్న గొప్పవాడు మఱొకడు కనపడలేదు. తాను ఎవరిని కావలెనన్న వారినే ఒక్కక్షణములో నాశనము చేయగలిగి యుండుటవలన నతడు తానే దేవుడనియు, తనకన్న గొప్ప దేవు డెవడును లేడనియు తలంప సాగెను. ముఖస్తుతి చేయునట్టి మంత్రులును ధనాఢ్యులును అతనికి ఇంకను పురియెక్కించినందువలన నతడు తనరాజ్యములో నెవరును దేవుని పూజించవద్దనియు, ఫరౌన్ గారే దేవుడనియు, మఱొక దేవుని నెవరు నంగీకరించవద్దనియు చాటింపు చేయించెను. ఆప్రకారము రాజ్యమునందంతట నదియే రివాజు అయిపోయెను. ఎక్కడనో దోపిడిచేసినపుడు ఆయన రాజగృహమున కొక దాసీమనిషి వచ్చి చేరెను. ఆరాజుగారికుమార్తెకు ఈ దాసీమనిషి ఒకరోజున తల దువ్వుచుండగా దానిచేతనుండి దువ్వెన జారి క్రిందపడెను. క్రిందనుండి ఆ దువ్వెనను పైకెత్తుచున్నపుడు ఆమెనోటనుండి దయాస్వరూపుడైన భగవంతుని నామము వగైరా పదములు వచ్చెను. వెంటనే ఆరాజకుమార్తె "నీవు దేవుని పూజించుచున్నావా, ఫరౌన్‌ని కాదా?" అని యడిగెను. ఆదాసీది "దేవుడే పూజనీయుడు. మీనాన్న మనిషి, తాను దేవుడని యెట్లు చెప్పుకొనగలడు?" అని జవాబుచెప్పెను. ఆపిల్లకు చాలకోపమువచ్చి తిన్నగా వెళ్ళి తండ్రికి ఫిర్యాదుచేసెను. తండ్రికూడ కోపముతో మండిపడుచు నాదాసీదానిని పిలిపించి ప్రశ్న వేయగా ఆమె తానన్నమాటపైననే నిలబడెను. అతడు తన మంత్రులను, ధనాఢ్యులను పిలిపించి వారి నడుగగా, వారు ముఖస్తుతిచేయువారు కాబట్టి "మేము గెడ్డములు. మీసములు పెరిగిపోయిన వయోవృద్ధులము. మేమును మీరును పొరపాటు పడుటయెట్లు? ఈ దాసీదే నాస్తికురాలు" అని ఫరౌన్‌గారితో అనిరి. అంతట ఫరౌన్ ఆదాసీమనిషి తనను దేవునిగ మన్నించనైన మన్నించవలయుననియు లేదా దానిని దానిపిల్లవానినికూడా చంపించెదననియు ఆజ్ఞాపించెను. కాని ఆ దాసీమనిషి అట్లు చేయుట కంగీకరించలేదు. అంతట నొకనూనెతోనింపిన గంగాళమును తెప్పించి పొయ్యిమీదపెట్టి నూనె మరుగునట్లుగా కాపించి, ఆదాసీదాని పెద్దకొడుకును పట్టుకొని, వాడేడ్చి మొత్తుకొని అఱచుచుండగనే ఆనూనెలో త్రోయించెను. అతడు మఱుగుచున్న నూనెలో పడి సమోసా వేగినట్లు వేగిపోయెను. అప్పుడు తిరిగి ఫరౌన్ దాసీదానితో "చూడుము నేను సజీవుని నిర్జీవునిగ చేసితిని, కావున నిపుడైన నన్ను దేవునిగ నమ్ము" మనెను. ఆదాసీమనిషి "బ్రతికియున్నవానిని చంపుట ప్రతి

మానవుడును చేయగలడు, చచ్చినవానిని బ్రతికించినప్పుడే మీరు నిజముగ దేవుడవగుదురు" అని బదులుచెప్పెను. "ఫరౌన్‌కి మఱింత యెక్కువకోపము వచ్చెను. అతని స్తోత్రపాఠకులు అతనికి మఱింత యుద్రేకము కల్గించిరి. అంతట ఫరౌన్ ఆదాసీమనిషి సంతానమందఱిని, పాలుత్రాగెడి పసిపిల్లలనుకూడచేర్చి, ఆమఱుగునూనెలో వేసి చంపించెను. చిట్టచివరకు ఆదాసీమనిషివంతు వచ్చెను. తిరిగి ఆమెకు అంగీకరించుమని బోధించిరి. ఆమె అంగీకరించనందున నామెను కూడ నూనెలోవేసి చంపించిరి. ఈఘటనలో నాదాసీమనిషి ధైర్యసాహసములు మానవులకు శ్లాఘనీయముగనే యుండును. కాని సత్సంగి యింతకన్న నెక్కువ ఘోరబాధ సహించవలసి యున్నది. ఆదాసీమనిషి తన విశ్వాసమును నిలబెట్టు కొనునిమిత్తమై పోరాడినది ఇతరమానవునిమనస్సుతోనే. ఇతరులమనస్సుతో పోరాటలలో ధైర్యముకనపరచుట సులభమే. సత్సంగికి అట్లుగాక తనమనస్సు తోనే అహోరాత్రములు పోరాటము సల్పవలసియున్నది. ఈపని ఆదాసీమనిషి పరిస్థితికన్న నెన్నియోరెట్లెక్కువ కష్టమైనది. తన నీచమనస్సుతో నీవిధముగా రాత్రింబవళ్లు పోరాడుట ప్రతిసత్సంగియు నావశ్యకముగ నేర్చుకొనవలసిన శుభలక్షణము.

2) హజరత్ మూసాగారు యీలోకములో బ్రతికియున్నపుడు భగవంతు నికి ప్రియమైన మంజూరిగారిదర్శనము తనకు ఒకసారి యిప్పించవలసినదని భగ వంతుని ప్రార్థనచేసెను. ఆయనకు స్వప్నములోనో లేక మఱొకవిధముగనో భగవంతునివద్దనుండి "ఫలానాచోట నొకపెద్దగొయ్యి యున్నది. అచ్చటకు పొమ్ము. అచ్చట నాప్రియభక్తుడైన మంజూరుదర్శనము నీకు లభించు"నని వార్తవచ్చెను. హజరత్ మూసాగారు చాల వెతుకుకొనుచు ఆగోతివద్దకు (లోనికి) వెళ్లెను. అచ్చట నొక నిర్జనభీకరారణ్యములో జననివాసములకు దూర తరముగ నొక లోతైన కొండలలోయలో చేతులు, కాళ్ళును పూర్తిగా గాయముపడియున్న మనిషి అతనికి కనబడెను. అతని శరీరమంతయు పూర్తిగా కృశించిపోయి యుండెను, కండ్లు మూసికొనిపోయి యున్నవి, చెవులు చెవుడు పడి యున్నవి. అతని పెదవులుమాత్రము కదులుచున్నట్లగుపడుచుండెను. దగ్గ ఱగావెళ్ళి కనిపెట్టగా అతడు "దైవమా నీకు నాకృతజ్ఞతాధన్యవాదములు" అని తిరిగి తిరిగి అనుచున్నట్లు వినబడెను. అది చూచి హజరత్‌గారు "ఓ భగ వంతుడా నీదయాదృష్టి పడినవారు యిట్లుకూడ నుందురా ?" అనుచు ఆశ్చర్య

చకితుడయ్యెను. హాజరత్ గారు ఆయనకు ఏమికావలయునని అడిగిరి. కాని, ఆయనకు చెప్పుటకుగనుండుటచే వినబడలేదు. ఆయన "ఓ భగవంతుడా! ధన్యవాదములు" అని అట్లే నిరంతరము అనుచుండెను. తిరిగి రెండవసారి నీవు ఎందుకొఱకై భగవంతునికి ధన్యవాదములర్పించుచుంటివని బిగ్గరగ అడుగగా, అతడు "నేను భగవంతుని, తన దేవదూతయైన హాజరత్ మూసాగారిదర్శన మిప్పించమని ప్రార్థించితిని. నాప్రార్థనను భగవంతుడంగీకరించిరి. ఈనాడు హాజరత్ మూసాగారి దర్శనము లభించినందుకుగాను నేను భగవంతునికి ధన్యవాదములిచ్చుచున్నాను. అయితే, నామనస్సులో నింకొకస్థూవాంఛ యిప్పుడే కలిగినది. నాకు దప్పికగానున్నది. కొంచెము చల్లని మంచి నీటిని త్రాగవలెనని యున్నది." అని బదులు చెప్పెను. అంతట నీరెండవకోరిక నిప్పుడే నేను పూర్తి చేసెదనని చెప్పుచు హాజరత్ మూసాగారు ఆమనిషిప్రక్కన పడియున్న ఒకపగిలిపోయిన గిన్నెను తీసుకొని వెళ్లెను. మంచినీళ్లకొఱకై వెతుకుకొనుచు పోగా ఒక చోటనీరు దొరికినందున, ఆనీటిని గిన్నెలోనింపి మంజూరుగారికి యిచ్చుటకై తిరిగి వచ్చెను. ఇంతలో ఘాతకమృగము లామంజూర్ను చీల్చిముక్కలుముక్కలుగా చేసి వేసెను. హాజరత్ మూసా వచ్చి యీవిషయమును చూడగనే అతనికి మహా కోపము వచ్చి "ఓ భగవంతుడా, యింతటి భక్తజనునియెడల నీవీప్రవర్తన చూపెదవా! ఇతడు నీభజనధ్యానములకొఱకై యిల్లువాకిలి విడిచిపెట్టి వెళ్లిపోయెను. శరీరము గాయపడెనుకాని అతడు లెక్కచేయలేదు. ఈగోతిలో నుండి పోయి నీకుధన్యవాదములు అర్పించుటతప్పమఱొకపని చేయుటలేదు. ఈ దాహార్తుని నీవు ఘాతుకజంతువులచేచీల్పించి ముక్కలుచేయించి మహాదారుణ మరణమునుకలిగించితివి కదా!" అనిఅడిగెను. వెంటనే, అతనికిట్లుజవాబువచ్చెను: 'మాదయాదృష్టిలోనున్నవానికి మమ్ములనుకోరుటతప్ప మఱొకకోరిక యేదైనను కొంచెము చల్లనిమంచినీటికొఱకైననుకూడ ఉండినచో నది మాకెంతమాత్రము సహనీయము కానేరదు. ఇతనిమనస్సున నీచిన్నకోరిక పుట్టినతోడనే ఇతడు పతితుడైపోయెను. అందుచే నితడు శిక్షాపాత్రుడయ్యెను.' అంతట హాజరత్ మూసాగారు చాలబాధపడుచు 'ఇది చాలకఠినమైనపరీక్ష, నేను తమసందేశమును నాదాసుల కెవ్విధముగ నచ్చచెప్పగలను? ఈమంజూరుపరిస్థితిని వారికి తెలియజేసినచో, వారు నాసందేశము నెన్నడు విననొల్లరు, పైగా, 'మేమీవిధముగ వాంఛారహితముగ నుండ నేరము. మీసందేశము వినుటకు మేము తయారుగలేము' అనికూడా

చెప్పుదురు." అని భగవంతునితో మొఱ్ఱపెట్టుకొనెను. సత్సంగి కూడా సంపూర్ణముగా వాంఛలులేకుండగనే యుండవలెను. ఒక్క భగవంతునికొఱకుదప్ప మఱొకకోరిక యేమియు నతనిమనస్సున నుండకూడదు. ఏమనిషియైనను సత్సంగి యగుటకుగాని, సత్సంగిఅని అనిపించుకొనుటకుగాని ముందు యీలక్షణము అతనికి ఉండవలెను.

3. ఇచ్చటినుండి తాజ్‌గంజ్‌వఱకు మనము కాలినడకను వెళ్ళినచో నచ్చటికి పోవుసరికి అలసిపోయి యెచ్చటనైన పరుండగోరుదుము. అట్లుగాక మనమిచ్చటనే సుఖముగ కూర్చుండి యున్నయెడల బోర్డింగ్‌హౌస్‌లో దొంగలు పడిరని కబురువచ్చినచో వెంటనే అచ్చటకు పరుగెత్తికొని వెళ్ళుటకు సిద్ధమగుదుము. కావున దీనినిబట్టి మన శరీరపరిస్థితి ననుసరించి మనభావములుకూడ మారుచుండునని తెలుచున్నది. అలసిపోయినపుడు శరీరము విశ్రాంతికోరును. చక్కగ బలిసి దృఢముగ నున్నపుడు పరిశ్రమ చేయగోరును. అట్లే నవనవలాడుచున్న మెదడు పనిచేయగోరును. మఱేమియు పని లేనిచో నొక ప్రాత వార్తాపత్రికనైన దీసికొని చదువుచుండును. పాలు మీగడలు తిని బలిసిన శరీరము మానవుని ప్రాపంచిక వ్యవహారములలో పూర్తిగా పాల్గొని పాటుపడి పనిచేయుటకు ప్రోత్సహించును. ఇంతియగాక, మన స్త్రీపుత్రాదులయొక్కయు బాంధవులయొక్కయు శరీరమనస్సుల పరిస్థితులుగూడ మనలో నిట్టి ఆలోచనలను పుట్టించుచుండును. ఇట్లుగాక మనము పాలుమీగడలును, మామూలు భోజనమునుకూడా వదిలిపెట్టి పైనచెప్పినగోతిలోనున్న భక్తునిపద్ధతిని అవలంబించవలయునన్నచో అదికూడా చాల కష్టమైనవిషయమే. ఆ పరిస్థితిలో మన మీప్రపంచమునకు నిరుపయోగమైపోవుదుము. కుటుంబపోషణ వగైరాలు కూడ నెఱవేర్చలేము. కావున నీరెండు పరిస్థితులలోను సత్సంగికి కష్టము గల్గుచున్నది. మంచి బలవర్ధకాహారము భుజించినను పరమార్థభంగము గల్గుచున్నది. పూర్తిగా ఆహారవిసర్జనము చేసినను పరమార్థభంగము గల్గవచ్చును. అయితే మఱి సత్సంగి ఆహారవిషయములో చేయవలసిన దేమి అని ప్రశ్నించవచ్చును. ముఖ్యముగాపళ్లెరములో ఆహారము నింపి నీయెదుట పెట్టినపుడు 3,4నిముషములు సంపూర్ణశ్రద్ధతో భగవద్ధ్యానము చేసికొని, ఆయాహారమును భగవదర్పణము చేయవలయును. ఆతర్వాతనే ఆహారము తీసికొనవలయును. అదికూడా కావలసినదానికన్న తక్కువ తినవలెను. అట్లైనచో భగవంతుడా

ఆహారదోషమును నశింపుచేసి దాని దుష్ప్రభావము తిన్నవానిమీద కలుగ కుండ చేయును.

పైనజెప్పిన విషయములన్నియు సత్సంగి కొక భీకరదృశ్యముగ కన్పడ వచ్చును. అందువలన నతని కొక మహాకఠినపరిస్థితి నెదుర్కొనవలసియున్నట్లు అనిపించవచ్చును. కాని అసలువిషయ మెట్లుండుననగా, ఒక ఆంగ్లభాషా విద్యార్థి ఆడవాండ్రవద్దకు వచ్చి ఆంగ్లము మాటలాడినను లేదా ఒక బీజగణి తపులెక్కను చెప్పినను వారి కెవ్విధముగ నాశ్చర్యము గలుగునో అదేవిధ ముగ సత్సంగుల కీవిషయములు విన్నపుడుకూడ ఆశ్చర్యము గలుగుచుండును. కాని క్రమక్రమముగ నేర్చుకొన్నందున విద్యార్థి ఆంగ్లభాష మాట్లాడి, ఆల్జీబ్రా లెక్కల నెట్లు చేయగల్గుచున్నాడో అట్లే తిరిగి తిరిగి ఆత్మస్థానమువద్ద నాత్మ జిహ్వతో స్మరణధ్యానములు చేయుచుండినచో నీమూడు విషయములును తమంతటతామే తెలియకుండగనే సమకూరిపోవును. అనగా, నీచమనస్సును త్రొక్కివేయగల దార్ఢ్యము దానంతటనదియే ఉత్తమమనస్సునకు చేకూరును. సత్సంగి స్వతహాగనే పూర్తిగా నిష్కాముడైపోవును. ఆహారపానీయముల నన్నిటిని తన స్వాధీనములో నుంచుకొనగలుగును. అసలువిషయ మేమనగా, యీ స్మరణ ధ్యానాభ్యాసముల యుపదేశము సులువుగనే లభించుచుండుటచే వాని మహత్తు జనులకు అవగాహన అగుటలేదు. కాని, లేనిచో నీయభ్యాసము అమూల్యమైనది. పైనచెప్పిన పరిస్థితులన్నియు నీయభ్యాసమువలన లభ్యమై పోగలవు. ఈ అభ్యాసము మీరు చేసిచూడుడు. మీరెట్లు ముందంజవేసి కొనుచు పోవుదురో మీకే తెలియగలదు. స్మరణధ్యానాభ్యాసమువలన మన స్సున నొక్కకోరికగూడ నుండకుండపోవును. అనగా నేదైన భయము గల్గి నందువలన కోరికలు కట్టడిపోవుట కాదు. స్వతహాగనే అభ్యాసికి భోగవిలాసల యందు అసహ్యము బయల్దేరును. ఉదాహరణ కెట్లనగా ఒకసత్సంగికి తీవ్రమైన రుగ్మత గల్గును. అపుడతడు చాల విచారించి పశ్చాత్తాపపడుచు "ఓ భగవం తుడా, నాకీసారి జబ్బు కుదిర్చివేయుము. నేను ఇకముందునుంచి సత్ప్రవర్త నగా నడుచుకొందును. సత్సంగి నడుచుకొనవలసిన పద్ధతిగనే ప్రవర్తించుదు" నని ప్రార్థన చేయును. అయితే జబ్బుతగ్గి 4, 5 మాసములు గతించినపిమ్మట నా మాటలన్నియు నతడు మఱచిపోవచ్చును. కాని స్మరణధ్యానములవలన గల్గిన నిర్మలత్వము ఉత్తమమనస్సులో స్థాయిగ నట్లే యుండిపోవును. కావున

నీ యభ్యాసము మీరు చేయుడు. దీనివలన మీ హార్ది కాభిలాష సిద్ధించనిచో నాకు చెప్పుడు. సత్సంగి సత్సంగిలక్షణములను కోల్పోయినచో నది నిజముగ చాల శోచనీయమే, కాని అట్లు జరిగినపుడు అతడు పశ్చాత్తాపముతో విచార పడి, ఆతర్వాత సరిగా ప్రవర్తించుటకు నిశ్చయించుకొన్నచో యుక్తముగ నుండును. అట్లైనచో గాబరా పడనక్కఱలేదు. రౌతు క్రింద పడిపోయినను తిరిగి లేచి గుఱ్ఱము నెక్కి సవారిచేసినయెడల నష్టమేమియు లేదుకదా. మీరు కూడ తిరిగి మనస్సుపైన సవారుచేసి లోపమంతయు పూర్తిచేసుకొన్నయెడల నేమియు నష్టములేదు.

## 158

## సంతులుజరిగించెడి చిన్నచిన్న ఆటలవంటి కృత్యములు.

అక్టోబరు 1919:— సంతులెప్పుడైనను పసిపిల్లలఆటలవంటిపనులు చేసి నను అందులోకూడ నొకమహాసదుద్దేశ్య మిమిడియుండుచుండునని సారబచన్ (గద్య) లో నొకచోట వ్రాసియున్నది. మత్తూలాల్ గారివిషయములో జరిగిన పనియే దీనికి పూర్తియైన నిదర్శనము. కొన్నిసంవత్సరములక్రితము మత్తూ లాల్ గారు సాహబ్జీమహారాజువారికి నచ్చినబట్టలు యివ్వవలెననియున్నదని చెప్పకొని ఆప్రకారము వారికొల్లలువస్త్రరాలను వాకబుచేసెను. అంతట సాహబ్జీమహారాజువారు "మేమేదోసాధారణమైన నూటు తొడుగుకొనువారము కాము. మాకు ఒక్కొకగజము రూ. 100/-లు ఖరీదుచేయునట్టి సూటు కావ లయును. ఇన్నిగజములబట్ట కావలయును" అనుచు నింకను చాల తబిసీళ్లు సెలవిచ్చిరి. ఆతబిసీళ్ళు అన్నియు హుజూరువారు చెప్పినప్రకారము మత్తూ లాలుగారు వ్రాసి కూడగా రూ. 2500/-లు మొత్తము అయినది. అప్పుడు మత్తూలాలుగా రింతమొత్త మిప్పుడు తనదగ్గఱలేదని మనవిచేసుకొనెను. "సర దారుగారు మీకు రు. 2500/-లు అప్పుయిచ్చెదరు. మీరు ఆయనకు ప్రోనోటు వ్రాసియిచ్చి పుచ్చుకొను"డని సెలవిచ్చిరి. ఆప్రకార మొక చిత్తుకాగితము మీద ప్రోనోటు వ్రాసి, ఒక ఉత్తరముమీదనున్న పోస్టుముద్రవేసిన అణాబిళ్ళ తీసి దాని కంటించి, రు. 2500/-ల ప్రోనోటు ఒకటి తయారుచేసి సరదారు గారికి యిప్పించి, అప్పటికప్పుడు లాలా హుకుమ్‌చందుగారిచే రు. 2500/-లు కరన్సీనోట్లు మత్తూలాల్ గారిచేతి కిప్పించిరి. అప్పుడే మత్తూలాలుగారి పేరుతో

వారియింటికి రు. 2500/-లు పంపమని కోరుచు నొక టెలిగ్రాముఫారముమీద టెల్లెగ్రామ్ వ్రాయించి మత్తూలాలుగారిచే సంతకముకూడ పెట్టించి, ఆ టెలిగ్రామును నసేహిదాసుగారిని తీసుకొనిపెళ్ళి ఇంటికి టెల్లిగ్రాము వెంటనే యిమ్మని చెప్పిరి. కాని అదంతయు నొకతమాషాక్రిందను, వేళాకోళము క్రిందను జరిగిపోయినది.

ఆతరువాత నొక యేడాదికి మత్తూలాల్‌గారి ఆస్తినిగురించి ఆయనమీద నొక వ్యాజ్యేము వచ్చెను. ఆవ్యాజ్యేములో నాయన ఆస్తి అంతయు పూర్తిగా పోవునేమో యను భయము గల్గుటచే మత్తూలాలుగారు రు. 3000/-లు ఇచ్చుకొని పరిష్కారము చేసికొనిరి. అప్పుడు సాహబ్జీమహారాజువారు "చూడుము, నీవారోజున జరిగినదంతయు నొక పరిహాసమని తలంచితివి. అప్పుడు నీవు రు. 2500/-భేంటు ఇచ్చియుండినచో నీ కీతగాదాయే రాకుండెడిది. మాకపుడే యీ జగడము రానైయున్నదని కనపడినది. నీకు సూచన చేసితిమి కాని నీవు లెక్కచేయలేదు. ఆ వ్యాజ్యేముక్రింద నీకు రు. 3000/-లు యిచ్చుకొనవలసి వచ్చిన"దని సెలవిచ్చిరి.

## 159

### ఉత్తమసత్సంగి.

అక్టోబరు 1919:— ఈ లోకములో జీవులు పడుచున్న మహాదుఃఖములకు అంతుపొంతులు లేకున్నవి. అనేకవిధములైన కష్టములతోను, ఆపత్తులతోను జీవులు బాధపడుచున్నారు. అయినను ఇన్ని బాధలలో పడియుండియూ కూడ రొట్టెముక్క కడుపులో పడి, పంకాగాలి వంటికి చల్లగా తగిలినంత మాత్రమునకే ప్రతి మానవుడును చక్రవర్తులనుకూడ సరకుచేయకుండునంత అహంభావముతో నిండినవాడై పశుప్రాయముగ ప్రవర్తించుచుండును. అసలైన సత్సంగి యనగా, రోజున కొకసారియైనను తన నిజపరిస్థితియందు ప్రవర్తించువాడే. ఆ అసలు పరిస్థితి యనగ నేమి? కొంతసేపైనను, యీ ప్రపంచముయొక్క స్మృతి లేకుండగను, ఏవిధమైన చింతలు, విచారములుకాని, హర్షసంతోషములుగాని లేకుండగను ఒక్క భగవచ్చరణముల స్మరణదప్ప మతెద్దియు జ్ఞాపకము ఉండకుండను ఉండిపోవుటయే ఆ అసలుపరిస్థితి.

రోజున కొక్కసారియైన నిట్టిపరిస్థితిలో ప్రవర్తించనట్టి సత్సంగి, సత్సంగి యనిపించుకొనజాలడు. సామాన్యముగ మనము రోజంతయు నిద్రపోవుచుందుము. నడుచుచున్నను, తిరుగుచున్నను, జాగ్రదవస్థలోనున్నను మనమెల్లపుడు నిద్రలోనే యున్నాము; పనులుమాత్రము యంత్రచోదితమైనట్లుగ నైపోవుచున్నవి. అనగా, మన మేపనిచేయుచున్నను మనచిత్తమును ఆపని చేయుచున్నంతసేపును దానియందే లగ్నము చేయలేకున్నాము. అప్పటికప్పుడు కొద్దిసేపుమాత్రమే మనశ్రద్ధను దానిమీదపెట్టుచు, మిగతసమయమంతయు నేవేవో ఆలోచనలలోనే వెళ్ళబుచ్చుచుందుము. చోరులును, బందిపోటుదొంగలు నెల్లపుడు మన చిత్తము నపహరించి తీసికొనిపోవుచున్నారు. సత్సంగికి అట్లుప్రవర్తించుట అయుక్తము. మనశ్రద్ధ యెల్లప్పుడును మనఇంద్రియములద్వారా పనిపాటలలోనే సంపూర్ణముగ లగ్నమైయుండవలయును. దినములో నధికాధికసమయము నెవడు తన శ్రద్ధను దొంగలు, దోపిడిగాండ్రును దోచుకొనిపోకుండ జాగ్రత్త పెట్టుకొనునో అతడే ఉత్తమసత్సంగియగును. మనము మహారాజసాహెబ్ వారి కాలములో సత్సంగములో వారిదర్శనము చేసుకొనుచుంటిమా ? లేదు. యెంత మాత్రము లేదు. ఒకటిరెండు సెకండ్లుసేపుమాత్రమే దర్శనముపైన శ్రద్ధవహించెడివారము కాని మిగతకాలమంతయు వ్యర్థాలోచనలోనే గడుపుచుండెడివారము. ఒకగంట లేక అరగంటసేపు దర్శనము చేయుమని సారబచన్‌లో వ్రాసినది ఈవిధముగ దర్శనము చేసికొనుమని కాదు. అచ్చట చెప్పినదేమనగా, ఒకగంట లేక అరగంటసేపు ఒక్కగురుమహారాజువారుతప్ప మఱొక విషయమును గుఱించి స్మృతియే యుండకుండ నుండవలయుననియే. మనశ్రద్ధ మననేత్రములద్వారా నిరంతరము వారి చరణములమీదికే ప్రసరించుచుండవలెను.

ఇట్టిప్రవర్తన నలవరచుకొనుటకై చాల ఉత్తమసహవాసము ఉండవలెను. ఒకనాడు సాయంకాలము లాహోరులో మేము ఆఫీసునుండి యింటికి వెళ్ళిపోవుచుండగా, మాహృదయములో నొకతీవ్రమైన విరహ ముత్పన్నమైనందున, ఇంటికి వెళ్ళగనే అధమము రెండుగంటలసేపు భజనాభ్యాసము చేయవలెనని నిశ్చయించుకొంటిమి. ఇంటికి వెళ్ళగనే, ఒకమనిషి (ఆమనిషిపేరు ఇచ్చట చెప్పనవసరములేదు) వచ్చి ఫలానామనిషి మిమ్ములనుగూర్చి యిట్లనుచున్నాడని నాతో చెప్పెను. అట్లుచెప్పి అతడు వెళ్ళిపోయెను కాని నామనస్సున

నతడు నన్నెందు కట్లనుకొనవలెనను ఆలోచన యొకటి బయల్దేరెను. "వెళ్ళ దము, అట్లెందు కామనిపి నన్నుగురించి తలంచవలయునో తెలుసుకొందము, ఆతర్వాత భజనాభ్యాసము చేసుకొనవచ్చు" నని తలంచితిని. ఇంతటిలో నొక అరగంటకాలము గడచిపోయెను. ఆపిమ్మట భజనాభ్యాసమునకు కూర్చుంటిని కాని యీ ఆలోచనలే బాధపెట్టుచుండెను. ఒకగంట, అరగంట సేపావిధముగ కూర్చుండి లేచితిమికాని ఆవిరహము వగైరాలన్నియు మాయమైపోయెను. చెప్పదల్చిన దేమనగా, మనము సత్సంగేతరులతో సహవాస మెంతమాత్రము చేయకూడదు. ముఖ్యముగా మనము సత్సంగమునకు వెళ్ళునపుడు, ఏసత్సం గితోకూడా మాటలాడకూడదు. ఎప్పుడును స్మరణధ్యానములు చేసుకొను చునే యుండవలెను.

## 160

సత్సంగ కార్యక్రమముయొక్క భారము వహించినవాని కాయుర్దా యము వృద్ధియగుట.

అక్టోబరు 1919 :—ఈ రోజు ఉత్తరప్రత్యుత్తరములు వ్రాయుసమయ ములో ఖగేంద్రబాబుగారు చిన్న రైల్వేమార్గము విషయమై తయారుచేసిన అంచనాను చదివి వినిపించిరి. ఒక్కొక్క షేరు నూరురూపాయిలు చొప్పున మొత్తము పదునైదులక్షలరూపాయిల విలువగల షేర్లతో నొకకంపెనీ తయారుచేయుదురట. దానిలో హుజూరువారు బహుశా ఒక వెయ్యిరూపా యిల షేర్లు పుచ్చుకొనవచ్చును. నూటికి నెలకొక రూపాయిచొప్పున లాభము తప్పక రాగలదని యుహించుచున్నారు. ఈ సందర్భములో హుజూరువా రొకచిత్రమైనమాట సెలవిచ్చిరి. ఈవిధముగ నేదైనను చాలకాలమువఱకు పూర్తిచేయజాలని కార్యక్రమము జరిగించు భారమును సత్సంగి వహించిన యెడల నతని జీవితము వృద్ధికాగలదని సెలవిచ్చిరి. మాకు మొదటలో, అనగా 1913 సం॥ మొదల్కొని మూడేండ్లుమాత్రమే ఆయుర్దాయము మిగిలియుండె నని బాగుగ జ్ఞాపకమున్నది. తిరిగి అయిదేండ్లును, ఆతర్వాత నింకొక 15 యేండ్లును వృద్ధిఅయినది. ఇప్పుడు ఈ రైల్వేకంపెనీ ప్రారంభించినయెడల నేమగునో చెప్పలేము. ఏమైనను చేపట్టినపని తప్పకుండా పూర్తిచేయవలసియే యుండును.

## 161

సత్సంగములో వచ్చియుండునప్పుడు ప్రవర్తించవలసిన విధము.

8 ఫిబ్రవరి 1920 :— ఈరోజున మొట్టమొదట విజయబాబుగారితో ఆయన యింటివిషయములనుగుఱించి కొంతవఱకు మాటలు జరిగెను. పిమ్మట హుజూరువారు యిట్లు సెలవిచ్చిరి. సత్సంగములో వచ్చియుండవలెనని కోరిక యుండుట మంచిదే. కాని తమ కర్తవ్యములను, బాధ్యతలనుకూడ నెఱవేర్చుకొనుచుండవలయును. సత్సంగములో చాలతత్పరతతో నుండవలయును. బద్ధక మెంతమాత్రము నుండకూడదు. సేవాసత్సంగములు, అభ్యాసమును మెలకువగ చేసుకొనుచుండవలయును.

## 162

జీవునికి ఉద్ధారము అభ్యాసమువలన గలుగదు. కేవలము భగవదాజ్ఞవలననే గల్గును.

ఏప్రియల్ 1920 :— జీవుని కుద్ధారము భగవంతుని ఆజ్ఞవలననే గలుగును. వారు, యీ జీవుని కుద్ధారమగుగాక యని ఆజ్ఞాపించవలయును. అప్పుడు అతని కుద్ధారమగుట నిశ్చయమే, స్మరణ ధ్యానము లేమియు నవసరములేదు. భజనకూడ నేమియు నక్కఱలేదు. ప్రతివిషయములోను ఇదెందుకు, ఇదెట్లు అని ప్రశ్నించువారికే స్మరణధ్యానభజనలు కావలసియున్నది. ఏలనన నట్టివారికి అభ్యాసముచేయకుండ ఉద్ధారమైపోగలదను విశ్వాసము ఉండదు. అందుచే నట్టివారి సంతృప్తికొఱకై స్మరణధ్యానభజనలు చేయుమని చెప్పిరి. లేనిచో ఉద్ధారము కేవలము భగవదాజ్ఞవలననే కాగలదు. సంత్‌సద్గురువు లేనపుడు స్మరణ, ధ్యానభజనాభ్యాసములు చేయుట అవసరము. అప్పుడైతే, వారికి అభ్యాసము సాగుటకూడ కష్టమే. వారు విద్యమానమైయున్నయెడల నింక నేమికావలయును ? అయితే దీనివలన సత్సంగులు, స్మరణధ్యానభజనలు అసలే చేయకుండ విడిచిపెట్టవచ్చునని మా అభిప్రాయముకాదు.

## 163

### నిరాశ, నిరుత్సాహమును గల్గుసమయములలో సలహా

5 ఏప్రియల్ 1920:— సత్సంగి యెప్పుడైన మనస్సులో నిరుత్సాహముగనున్నపుడుకాని, లేక అసంతృప్తిగనున్నపుడుకాని, లేదా యేదైనకోరిక తీరక నిరాశగనున్నపుడుకాని, భగవంతుడు తనకు ప్రత్యేకదయచూపి సహాయము చేసిన విషయములను జ్ఞాపకముచేసికొనవలయును. అట్లు చేసికొన్న యెడల నతడు పరాఙ్ముఖుడై ఇటునటు తిరుగులాడడు.

## 164

### నిజమైన గురువును తెలుసుకొనుటలోగల్గు మోసములు.

1 జూన్ 1920:— బ్యాస్ సత్సంగములో గురువుగనున్న సర్దార్ సావన్‌సింగుగారి సమక్షములో హుజూర్ వారు ఈమతములో పరిపూర్ణగురువును వెతకికొనుట చాలముఖ్యమే కాని వాస్తవమైన సత్యాన్వేషి యేదో మోస్తరు గురువును పట్టుకొని ఆయననే నిజమైన గురువు అని నమ్ముకొని మోసపడి పోవుటకు అవకాశమున్నదని సెలవిచ్చిరి. వాస్తవసత్యాన్వేషి తప్పుడు గురువునే పట్టుకొని యుండిపోయినను తననిజాయితీమూలమున నతనికి తప్పకుండ కొంతఫలితము లభించును. నిజముగ నతనికి తనచిత్తశుద్ధిమూలముననే ఆఫలితము గలిగినను, అతడు మాత్రము ఆఫలితము తనకు సరియైనగురువు, సరియైనమతమును లభ్యమగుటవలననే గలిగినదని యనుకొని సంతోషించుచుండును. ఉదాహరణకు ఒకకుక్క ఒకకమ్మరి దుకాణములో నొకఆకురాతిని నాలికతో నాకుచుండగ తననాలుక ఱాచుకొని రక్తము కారగా, ఆరక్తమును రుచి చూచి, తన కొక గొప్ప భక్ష్యపదార్థము దొరకినదని సంతోషించుచుండును అట్లే వాస్తవసత్యాన్వేషికూడ తన శుద్ధహృదయముమూలముననే తన కానందముకలుగుచుండినను, అదంతయు తనచిత్తశుద్ధిఫలితమే యనువిషయము నతడు తెలిసికొనజాలడు. వాస్తవసత్యాన్వేషికి గూడ మోసము నాల్గువిధములుగా గలుగవచ్చును.

1. తప్పుడు గురువును నిజమైన గురువుగా నమ్మి దగా పడిపోవచ్చును.
2. గురువనగా ధ్యానాభ్యాసమును. భజనాభ్యాసమును ఉపదేశమిచ్చు

వారనియు, నట్లినరు ఉపదేశమిత్తురో వారే నిజమైన గురువనియు భావించు కొనవచ్చును. అయితే ఈకాలములో కేవలవేషధారులైన అసత్యపుగురువులు గూడ నట్టి యుపదేశముల నిచ్చుచున్నారు.

3. అనేకస్వప్నములును, ఇతరానుభవములును, లోకములో రోజుచూచుచుండెడి విషయములనుబట్టియు గలుగుచుండును, సద్గురునిదయాసహాయములమూలముననుగూడ గలుగవచ్చును. కావున స్వప్నాద్యనుభవములుగల్గినవి కనుక నిజమైన గురువు తనకు లభించెనని భావించుకొనుటలో గూడ మోసముగలుగవచ్చును.

4. ప్రాపంచిక విషయములలో లాభము, వ్యాజ్యెములలో గెలుపు, ఐహికాభివృద్ధి మున్నగునవి మామూలుగ నేదోవిధముగను గలుగవచ్చును, సద్గురుసహాయమువలనగూడ గలుగగలవు. కాబట్టి కేవలము నట్టిజయముల మూలముననే యెవరినైనను గురువుగ మన్నించినచోగూడ మోసము గలుగును అసలువిషయమేమనగా సద్గురువనగా అంతర్యమున దర్శనమీయవలయును. లక్షకొక్కడు మాత్రమే అట్టిచిహ్నను అనుభవము పొందగలడు. అట్టి అనుభవముచే తెలిసికొన్నవాడే అసలైన గుర్రు నుపట్టుకొన్నట్లు చెప్పవచ్చును. అట్లు కాక సామాన్యముగనైతే జనులు ఏదోపొరపాటుననైన గురువును స్వీకరించుచుందురు. లేదా భగవంతుడు స్వయముగ కటాక్షించి జీవుని తన చరణములయందు లగ్నముచేసికొనుటయైన జరుగుచున్నది. తన శక్తిసామర్థ్యములను గుఱించి జీవునికిగల అహంకారము తత్తమూలమున నతడు సరియైన తోవకేన్న టికిని రాజాలకున్నాడు. ఈనాల్గుమోసములను క్లుప్తముగ నీక్రింద చెప్పబడినవి:— 1) ఇతడు మతమును చక్కగ వివరించుచున్నాడు. కావున ఇతడే గురువని అభిప్రాయపడుట.

2) ఒకమనిషి సురతశబ్దాభ్యాసము నుపదేశించుచున్నాడు కనుక నతడే గురువని భావించుట.

3) ఫలానారోజున ఇతడు నాకు స్వప్నములో కనపడెను కావున నతడే గురువని అనుకొనుట.

4) ఇతడు ఫలానా లౌకికవ్యవహారములలో సహాయము చేసెను కావున నతడే గురువని అభిప్రాయపడుట.

గమనించవలసిన అసలు చిహ్నయేమనగా, నిద్రావస్థలో నున్న తన ఆత్మను మేల్కొల్పిరా లేదా అనియే చూచుకొనవలెను.

# 165

## ముందుకి కలహాలు

సద్గురువు నిరసనగను, ఉపేక్షాభావములోను చూచుటలో చాల మహిమ యున్నది. సేవయొక్క మహాఫలితము.

ఇక ముందునుంచి మీరందఱును సేవ కొంత మట్టుకు తప్పక చేయు చుండవలెను. ఉదాహరణకు వేసవికాలములో పంకాతో విసరుచుండుడు. కూర్చుండెడిస్థలము కొఱకై బంధన మంతయెక్కువ పెట్టుకొని పరుగులెత్తుట యుక్తముకాదు. పంకా విసరవలయునను నియమముండినచో చోటుకొఱకై జనులంతగా పరుగులెత్తుట జరగదు.

మహారాజ్ సాహబ్ వారీ క్రింది కథను చెప్పుచుండెడివారని హుజూర్ వారొకనాడు సెలవిచ్చిరి. బలఖ యను గ్రామములో నొకపరిపూర్ణ సద్గురువు ఉండెడివారు. వారియింట సత్సంగము జరుగుచుండెడిది. వారు గతించినపిదప వారిగురు ముఖశిష్యుడు నివసించుచున్న బుఖారా గ్రామములోనికి సత్సంగము మారిపోయెను బలఖగ్రామములోని గురువుగారు పరమపదించునాటికి ఆయన కొక చిన్నికొమరు డుండెను. ఆపిల్లవానితో ఆయన భార్య, "అబ్బాయీ, నీవు నీతండ్రిగారికి తగిన పుత్రుడవని అనిపించుకొనగోరినయెడల మీతండ్రిగారి యింటనుండి భ్రష్టమైపోయిన మహాభాగ్యమును తిరిగి తెచ్చుకొనవలెను." అని యెప్పుడు చెప్పుచుండెడిది. అతడు పెద్దవాడై యౌవనములోనికివచ్చిన పిమ్మట కూడ అతనితల్లి మరల యీమాటలనే చెప్పుచువచ్చెను. ఒకరోజున నతడు "అమ్మా యేమిటి నీవనెడిమాట? నాతండ్రి వీర్యమునుండి నేను పుట్టితినో లేదో నీకే లోకములోనందరికన్న ముందు నిజము తెలియవలయునుగదా." అనిప్రశ్నించెను. అంతట నామె "మీతండ్రిగారి యింట్లో భక్తులసత్సంగము ఈవిధముగ జరుగుచుండెడిది. మన కింతమొత్తము ఆదాయము వచ్చుచుండె డిది. ఇంతమంది భక్తులెప్పుడును వచ్చుచుండెడివారు. ఇప్పుడు ఆరూపా యల ఆదాయమంతయు బుఖారాకు పోయినది. మన యింటికి కొద్దిమంది మాత్రమే వచ్చుచున్నారు. మనకు కొద్దిద్రవ్యము మాత్రమే మిగిలియున్నది. మిగిలిన ద్రవ్యమంతయు బుఖారాగ్రామస్థుడు పట్టుకొనిపోయినా" డని విషయ మంతయు సవిస్తరముగ తెలియజెప్పెను. అంతట నా పిల్లవాడు ఆవేశపూరితుడై "నే నా దుర్మార్గుని వద్దనుండి నా తండ్రి సంపత్తంతయు బలాత్కారముగ

లాగుకొని వచ్చెద"నని బదులు చెప్పెను. ఆ ప్రకారము అంతవరకు బుఖారా వెళ్ళిపోకుండ, బలఖుగురువునందే విశ్వాసము పెట్టుకొని ఆయనకే యింతవఱకు గురుదక్షిణ లర్పించుచున్నట్టి తన తండ్రిగారి ప్రాతశిష్యులకు అతడు రండని కబురు పంపెను. ఆ ప్రకారము వారందఱు కత్తులు, కటారులతోను సన్నద్ధులై వచ్చి ఇతనితో కలిసి, చాల అట్టహాసముగ బుఖారా వెళ్ళిరి. ఆ బుఖారా గురువున కీకబురు తెలియగనే ఆయన ఆయూరి పొలిమేరవద్దకు స్వాగతము పంపించుటయే గాక తానుకూడ స్వయముగ వెళ్ళి "మీరు ఇంత సైన్యము తీసికొని రావలసిన పని యేమున్నది? మీరు దయచేసి రండు, ఇంట్లో యేమున్న నది అంతయు తీసికొనిపొండు" అని వారికి చెప్పెను. దానిమీద నాయువకుడు తన తండ్రి భాగ్యము నంతను అంత సులువుగ తీసికొన గల్గితి ననియు, నదంతయు తన బలమువలననే జరిగినదనియు సంతోషించుచు, తన బలగమంతను తీసికొని బుఖారా వెళ్ళి, ఆ బుఖారా గురుని యిల్లు అంతయు పూర్తిగా సోదాచేసి, ఆ ఇంటిలో దొరికిన బట్టలు, నగలు, డబ్బు, దస్కమును అంతను తీసుకొని ఒక మంచము, ఒక ప్రక్క, కొన్ని కట్టుకొను బట్టలు, వంట పాత్రలను మాత్రమే అట్టేయుంచి మిగిలిన సొత్తంతయు పట్టుకొని వెడలిపోయెను. అతడవన్నియు తీసికొని మహా సంతోషముతో వెళ్ళి, జరిగిన విషయమంతయు తన తల్లితో చెప్పెను. తల్లి నిట్టూర్చుచు "ఆ బుఖారా మనిషి చాల టక్కరికాడు. నిన్ను దగాచేసినాడు, నీకు సొత్తంతయు నివ్వలేదు. నిన్ను మఱిపించి తప్పించుకొన్నాడు" అని చెప్పెను. దానిమీద నాపిల్లవానికి చాల కోపమువచ్చి, అతడు తిరిగి తనసైన్యమునుతీసికొని బుఖారాకు ప్రయాణమయ్యెను. బుఖారాగురువున కీవిషయము తెలియగనే, ఆయన, యీ పిల్లవానికి మరల స్వాగతమిచ్చెను. కాని యీ పిల్లవాడు ఆయనను బూతులు, తిట్లును ఆడుట మొదలుపెట్టి క్రితముసారి మీరు మా సంపత్తునంతను దాచిపెట్టిరి, ఈసారి నేను మీ యిల్లు నాశనముచేసి మఱియు వెళ్ళెదను: మీ బట్టలదగ్గఱనుంచి అన్నియు నూడ్చి పట్టుకొనిపోయెద"నని చెప్పెను. అతడు సరిగ నదేప్రకారము చేసి యింటి మట్టికూడా త్రవ్వి బలఖుకు పట్టుకొనిపోయెను. అతని తల్లి అతనితో "ఈసారికూడ నట్లె మోసపోయితివి. ఆ సొత్తు ఆయన యిష్టముమీద స్వయముగ నీ కిచ్చిన నివ్వవలయునే కాని, నీవు బలాత్కారముచేసి ఈషణ్మాత్రము గూడ తెచ్చుకొన జాల"వని తిరిగి చెప్పెను.

అప్పుడు ఆయువకుడు చాల సిగ్గుపడి, తిరిగి మఱొకసారి వెళ్ళుటకై నిశ్చయించుకొనెను. ఈసారి తనతో మఱెవరిని తీసికొనకనే ఒంటరిగ వెళ్ళి, ఆగురువువద్ద శిష్యునిగ చేరియుండి, ఆసంపత్తు నాగురువు స్వేచ్ఛతో తనంతట తాను ఇచ్చువఱకును, ఒక ఆఱుమాసములుకాని, యేడాదికాని యెంతకాల మవసరమైన నంతకాలము ఆయనగుమ్మమును వదలకుండ నుండిపోవలయు ననెడి దృఢనిశ్చయముచేసికొనెను. ఆవిధముగ తీర్మానించుకొని, అతడు బుఖారాకు పయనమై వెళ్ళెను. మొదటి రెండుసార్లును ఇతనకి స్వాగతమిచ్చు టకై బుఖారాగురువు ఊరిపొలిమేరవఱకు వచ్చుచుండిరి. కాని, యీసారి స్వాగతమే యివ్వలేదు. ఈసారి తనకసలేమియు ఆదరమే చూపలేదని ఆ యువకునికి చింత గలిగెను. ఇతడు వారింటికి వెళ్ళుసరికి, అచ్చట సత్సంగము జరుగుచుండెను. ఇంతకుముందైతే ఆగురువుగారు ఇతనిని ఆహ్వానించి ఒకబాలీసు మీద కూర్చుండబెట్టెడివారు. ఈసారి ఇతడువచ్చుట చూచిరి. కాని, వెంటనే మఱొకవైపునకు దృష్టిమఱల్చి యథాప్రకారము చర్చను సాగించుచుండిరి. ఇతడు వెళ్ళి అందఱు చెప్పులు విడిచినచోట ఖాళీయుండగ నచ్చటనే కూర్చుం డెను. చివరకు పిల్లవాడు తానే వెళ్ళి తాను వచ్చినట్లు మనవిచేసికొనగా, ఆగురువుగారు ఇతడువచ్చినట్లే తమకు తెలియలేదని సమాధానము చెప్పిరి. అంతమాత్రమే అతనితో మాట్లాడి యూరకుండిరి. అటుపిమ్మట తిరిగి ఆఱు మాసము లితనివంక కన్నెత్తిచూడనైన చూడలేదు. అతడు అచ్చటనేఉండి పోయి ఆఱుమాసములు శిష్యరికము చేసెను. తిరిగి ఆయువకుడు ధైర్యము చేసి వారియెదుటకు వెళ్ళెను. అప్పుడు ఆఱుమాసములైనతర్వాత గురుమహా రాజువారు "ఓహో నీవింకను ఇచ్చటనే ఉన్నావా"? అని అడుగగా, అతడు "చిత్తము స్వామీ, నేనింతవఱకు తిమచరణములనే ఆశ్రయించుకొనియున్నాను. మాతండ్రిగారి సంపత్తి నాకు అనుగ్రహించు నిమిత్తమై ప్రార్థించుచున్నాను." అని మనవిచేసుకొనెను. (ఆయువకుడు తాను మొదట నచ్చటికి వచ్చిననాడే గురువుగారితో తనతండ్రిగారిసొత్తు తనకు తిరిగి యిప్పించుడని మనవిచేసుకొని యుండెను. కాని, అప్పుడు గురువుగారు "సరేలే, ఆగుము" అని మాత్రమేచెప్పి యీగతించిన ఆఱుమాసములుకూడ నతనివైపు తిరిగి చూడనైనను లేదు) ఆఱుమాసములైనపిదప గురువుగారు ఒకసారి యితనివైపునకు తిరిగి చూచినప్పు డతడు తనకేదైన సేవననుగ్రహించవలయునని ప్రార్థించగా గురువు మాకుక్కల

కాపరిగ పనిచేయుమని సెలవిచ్చిరి. ఆప్రకారము అతడు ఆపని తనమీద పెట్టుకొని కుక్కలపాలన, పోషణకార్యము గొప్ప తదేకదీక్షతో చేయుచుండెను. వానిని బాగుగ స్నానముచేయించుచు, ఆటలాడించుచు మంచి బలిష్ఠముగ తయారుచేసెను. కొన్నియేండ్లు ఈవిధముగ ధ్యానతలో గడిచినపిమ్మట నొక రోజున గురువుగారు ఇతనివైపు తిరిగి "మాకుక్క లెట్లున్నవి? నీవు వాని నేమియు పాడుచేయలేదుకదా?" అని ప్రశ్నించిరి. ఇతడు చేతులుజోడించి, "లేదు స్వామీ నేను వీనికి చాల బాగుగ పాలనపోషణసేవచేసితి"నని చెప్పెను. గురువుగారు "మంచిదే, అయితే, రేపు మేము వేటాడుటకు వెళ్లెదము. నీవు వీనిని తీసికొని మాతోకూడ అడవికి రమ్ము. అక్కడ మేము నీవు వీనిని బాగుగ తయారుచేసితివో లేదో పరీక్షచేసెదము" అని సెలవిచ్చిరి. గురువుగారును, వారి స్నేహితులును గుఱ్ఱములనెక్కి ముందు వెళ్ళిరి. ఇతడు కుక్కలను తీసికొని వెళ్ళవలసియుండెను కావున కాలినడకను నడుచు కొనుచు వెళ్ళెను. ఈకుక్కలు ఇటునటు పరుగులెత్తుచుండుటచే వానిని అన్నిటిని లొంగుబాటులో పెట్టుకొనుట కష్టమైనందున, నతడు వాని కన్నిటికిని, గొలుసులు తగిల్చి, ఆగొలుసులన్నిటిని తన నడుమునకు కట్టుకొని నడచుచుండెను. అట్లు పోవుచుండగ, నాకుక్కల కాయడవిలో నొక కుందేలు కనపడగ నవి యొడలుమఱచి పఱుగెత్తుట మొదలుపెట్టెను. ఇత డాకుక్కలను వెనుకకు లాగుచునే యుండెను కాని, కొంతసేపటి కాకుక్కలే ఇతనిని లాగివేసి, ఇతని నడుమునకు వాని గొలుసులు కట్టియుండుటచే, నితనిని క్రిందపడవేసి యీడ్చుకొనిపోయినవి. ఇతనికి చెట్లవేళ్ళు, ముళ్ళు గుచ్చుకొని శరీరమందంతటను గాయములుపడి చాల దెబ్బలు తగిలెను. చివర కొకపొదలో నితడు చిక్కుపడి పోగా ఆగొలుసుల కొక్కెములు ఊడిపోయినందున, కుక్కలన్నియు నటునిటు పారిపోయెను. ఇతడుమట్టుకు స్మృతితప్పిపోయి ఆపొదలోనే పడియుండెను. అతడట్లు స్మృతితప్పి గాయములు తగిలి పడియుండగా, తన తండ్రిగారైన పూర్వపుగురువుగా రతనికి దర్శనమిచ్చి, "మేము, యీరోజున నీపనికి చాల సంతోషించితిమి. నీవు మీగురువుగారికి నిజమైన భక్తిచూపి చాలసేవ సేసితివి. ఆయనకుగూడ నీయందు దయగల్గినది. ఆయన ఇపుడు మీయింటనుండి కోల్పోయిన సొత్తును నీకిచ్చివేయుదురు," అని చెప్పెను. గురువుగారును, వారి స్నేహితులును, ఈకుక్కల నడవిలో నిటునటు పరుగులిడుచుండగ చూచి.

గురువుగారు ఆపిల్లవాడేమయ్యెనో వెదకిచూడుడని తనతోకూడనున్నవారిని పంపించెను. వారు అట్లు వెదకగా, వెదకగా చివరకు ఇతనిని ఆపొదలో స్మృతి తప్పిపోయి పడియుండగా చూచి, అతనికి మట్టి వాసనచూపించి నీళ్ళు వస్త్రాలు నెత్తిమీదపోసి తిరిగి స్మృతి తెప్పించిరి. పిదప, గురువుగారు అతనికి చాల కష్టముగల్గినదనుచు గొప్ప సానుభూతి చూపిరి. ఆపిల్లవా డప్పుడు వారి పాదములపైబడి, "స్వామీ మానాయనగారి నష్టమైపోయిన సంపత్తు నాకీ రోజున లభ్యమయ్యెను. నా పితృధనమును మీవద్దనుండి తీసుకొనుటకై నేను మొదట అవలంబించిన పద్ధతులకు చాల సిగ్గుచెందుచున్నాను," అని మొఱ పెట్టుకొనెను.

ఈసందర్భములో లాలాజయమల్ సింగుగారి శిష్యుడొకడు గురుఅమరదాసుగారిని గుఱించికూడ ఒక కథ చెప్పెను. అమరదాసుగారి గురువుగారు మొట్టమొదట ఏడేండ్లవఱకు నాయన ప్రక్కకు తిరిగి చూడనేలేదట. అయినను, వారా సంఘస్థుల కందఱకును, అంట్లుతోమిపెట్టుట మున్నగు సేవలను చేయుచు నట్లే యుండెనుకాని గురువుగారాయనవైపే యెన్నడు చూడలేదట. ఆ యేడేండ్లయినతర్వాత నొక్కసారి ఆయనతో నొక చిన్నమాట మాత్రమే మాటలాడి, మఱి పండ్రెండేండ్లవఱకు తిరిగి అసలే మాట్లాడలేదు. ఆ పండ్రెండేండ్ల తరువాత తిరిగి ఒక చిన్నమాట మాటలాడిరి. చిట్టచివర కాయనకే గురుపదవిని ప్రసాదించిరి.

## 166

### సంతులు అవతారమెత్తు సమయము వచ్చినది

జూలై 1920 :— మానవుని జీవితమునకు మూడు భాగములున్నట్లే భూమియొక్క ఆయుర్దాయమునకు గూడ బాల్యము, యౌవనము, వార్ధక్యము నని మూడు భాగములున్నవి. ఈ భూమి బాల్యములో నున్నపుడు, దీనిలో నేదోకొద్దిగ పంట పండుచుండెడిది. దీనికి యౌవనము వచ్చినపుడు దీనిలో పంటలు చాలమెండుగ పండుచుండెడివి. ప్రస్తుతము దీనికి వార్ధక్య దశ వచ్చినది. కావున నిపుడు పంటలు పడిపోవుచున్నవి. మానవు డీభూమిమీద నెప్పుడు పుట్టి చనిపోవుచున్నాడు. ఈ భూమికికూడ నట్లే అంత్యకాలము రానైయున్నది, అనగా ప్రళయకాలము వచ్చుచున్నది. ఈ ప్రపంచమున కిది నివృత్తిసమయము ఇంతవఱకు వచ్చిన రామకృష్ణాద్యవతారములన్నియు, ప్రపంచమునకు సంబం

ధించిన కార్యములకొఱకై వచ్చిరి. ఇపుడు వారివలన పని నెఱవేరజాలదు. అందుచే నిపుడు సంతులు అవతారమెత్తవలసిన సమయము వచ్చెను.

## 167

### భవిష్యములో రాబోవు ఆపత్కాలమునుగుఱించి హెచ్చరిక

4 సెప్టెంబరు 1920 :— ఇంతకన్న నింకనుయెక్కువ సేవ మాజీవితములో చేయవలెనని మాకున్నది. కాని దివ్యేచ్ఛ ఆ విధముగ లేనిచో మేమేమి చేయ గలము! అయితే, కష్టముల రోజులు ప్రారంభమైనవనియు, రాధాస్వామిదయా ళుని వద్దనుండి సమస్త దేవతలకు, దేవులకును, అగ్ని వాయువుమున్నగువానికిని తమతమ శక్తులను యావత్తు వినియోగించి పని సాగించుట ప్రారంభించవలయు నని ఆజ్ఞాపత్రములు జారీ అయినవనిమాత్రము మేము నిస్సంశయముగ చెప్ప గలము. రమారమి 30,35 సంవత్సరముల తర్వాతను దీని ప్రభావము పూర్తిగా ప్రకటము కాగలదు. అపుడు హిందూదేశమునందంతటను, సత్సంగులైనవారును కానివారును యావత్తు జనుల నోళ్ళనుండియు హుజూర్ రాధాస్వామిదయా ళురు మఱొకగంటసేపు మమ్ము కాపాడకుండగ జాగుచేసినచో మేమందఱము నశించిపోవుదుమని యఱుపు లొక్కసారిగ బయల్వెడలెడి పరిస్థితి గలుగును. ఆ సమయమున రాధాస్వామీ దయాళురు సంపూర్ణదయ చూపెదరు. సంత్ సద్గురువుయొక్క అద్భుత మహిమ జనులకప్పుడు పూర్తిగ నవగాహన కాగలదు. అంతకుముందునుండియు సత్సంగులై యున్నవారుగూడ నాయాపత్ప్రవాహ ములో తప్పక కొంత తడిసెదరుకాని దానిలో పైపైననే తేలియుందురు. ఈ క్రింది మూడు విషయముల నాసమయములో సత్సంగులు జ్ఞాపకముంచుకున్న యెడల వారికి గొప్ప సహాయము గలుగును. మొట్టమొదటిది, యథాశక్తిగ స్మరణ ధ్యానభజనాభ్యాసములను చేసుకొనుచునుండవలయును. రెండవది పర స్పర సహకారము. ఐకమత్యముతోను ప్రవర్తించుకొనవలయును. మూడవది ఆ సమయమున సంత్ సద్గురువు ప్రకటమై దగ్గఱనున్నయెడల సత్సంగులు వారి ఆజ్ఞల ప్రకారమును, అట్లులేనిచో, వారిలో పెక్కుమందియొక్క అభిప్రాయము సలహాలను అనుసరించియు నడచుకొనవలెను కాని, యెవరికి తోచినట్లు వారు చేయుచు నుండకూడదు.

## 168

### భవిష్యవాణి

5 సెప్టెంబరు 1920 :— దయల్బాగులో స్కూలు, కార్ఖానా స్థాపితమై నట్లుగనే ముందుముందు మొట్టమొదట ప్రతిరాష్ట్రములోను, తరువాత ప్రతి కమీషనరీ1లోను, అటుపిమ్మట ప్రతి జిల్లాలోను, చివర కొక్కొక్క గ్రామము లోను గూడ, ఇదే నమూనా ప్రకారము ఒక్కొక్క సత్సంగుల బస్తీ గ్రామ మునకు బయట తయారుకాగలదు.

## 169

### చనిపోయినపిమ్మట భూతములుగ నెట్లగుదురు. మన యిష్టము నకు వ్యతిరేకముగ జరిగిన విషయములో శ్రేయస్కర మైన రహస్యోద్దేశ్యము లుండును

6 సెప్టెంబరు 1920 :— మృత్యువునుగుఱించి వచనము సెలవిచ్చుచుం డిరి. ఇంద్రియ వాసనలు నశించకముందే యెవరైనను మరణించినచో వతడు భూతముగ నైపోవును. ఆంగ్లేయులు, మహమ్మదీయులును చాలమంది భూతము లుగ నైపోయి తమతమ గోరీలపైన నుండుచుందురు. పిమ్మట జపానులో భూకంపమునుగుఱించి చెప్పిరి. పిమ్మట హుజూరువారు దీనినిబట్టి సత్సంగులు, స్వార్థమునకుకాని పరమార్థమునకుకాని సంబంధించినపని యేదైనను కొద్దిగ తమ యిష్టమునకు వ్యతిరేకముగ జరిగినతోడనే భగవంతునికి తమమీద దయపోయిన దనియు అప్రసన్నత గల్గినదనియు ననుకొనుట చాలపొరపాటనెడి నీతిని తెలుసు కొనవలయును. అసలువిషయమేమనగా, అందులో నంతర్గర్భితమైన మహోద్దేశ్య మతనికి బోధపడనేరదు. పిమ్మట నొకఉదాహరణ సెలవిచ్చిరి. ఒక వయోవృద్ధు డైన పోలీసు కానిస్టేబులు ఒక పిల్లవానిని వీధిలో పెట్టికొట్టుచుండెను. చాల మంది అచ్చట ప్రోగై అతనిని, "నీకు గడ్డము నెఱిసిపోయినదికదా ఈపిల్లవాని నెందుకు అంతయెక్కువగా కొట్టుచున్నావు. నీకు జాలిలేదా?" యని ప్రశ్నించు చుండిరి. వీడు నా పిల్లవాడే అని అతడు బదులుచెప్పెను. దానిమీద వారం దఱు నతనిని మఱింతయెక్కువ తూలనాడనారంభించిరి. అంతట నతడు మీకు

1. కొన్ని జిల్లాలు కలిపి ఒక కమీషనరు పాలనకు లోబడియుండును. ఆ జిల్లాలన్నియు కలిపి "కమీషనరీ" యని పేర్కొనబడును.

వీడేమి చేయఁబోయెనో తెలుసునా యని యెదురుప్రశ్న వేసెను. వారు మాకు తెలియదని చెప్పగా, "వీడు తన తల్లితో దెబ్బలాడి వచ్చి యిపుడు నూతిలో దిగుటకు వెళ్ళుచున్నా"డని అతడు వారికి తెలియజెప్పెను. అంతట వారందఱు "సల్లైతే నీవు చేయునది సరియే"అని చెప్పదొడగిరి. ఈ క్రింది చరణమును చదివిరి.

"తాడ్ ఔర్ మార్ కరేఁ సాఇ ప్యార్"

సత్సంగులుఁ అంతర్గర్భిత మహోద్దేశ్యమును తెలిసికొనజాలరు.

# 170

## మనస్సు చేయు మోసము

7 సెప్టెంబరు 1920 :– కొందఱు సత్సంగులు సత్సంగమును, అభ్యాసమును చేయుటకై తమశక్తికొలఁది ప్రయత్నించుచుంటిమి కాని, వారి శక్తికి మించిన ఆటంకములు కలుగుచుండుటచే వారభ్యాసమును, సత్సంగమును చేసుకొనజాలకపోవుచున్నామనియు చెప్పి, తమకు భగవంతుడేల సహాయముచేయుట లేదని ప్రశ్నించుచుందురు. దీనిలో మా తప్పేమున్నదని యడుగుచుందురు. ఇది నిజమునకు మనస్సుచేయునట్టి ద్రోహము. ఈ విషయములో తమ తప్పేమియును లేదనుకొనుట పొరపాటు. ఏలననగా, ఎవనికైనను తనవాసన లెట్లుండునో, అందుకు తగినట్లుగనే జన్మ గలుగుచుండునను మాట నిరర్గళమైన విషయము. ఇప్పుడు నీ పరమార్థమునకు ఆటంకము కలుగజేసెడి పరిస్థితులలోను బంధువర్గములోను పుట్టుటకు హేతుభూతమైన వాసనలను నీవు నీ పూర్వజన్మలో నుత్పన్నము చేసికొనకుండ నుండవలసియుండెను. ఇప్పుడిఁక జరిగినదేదో జరిగి పోయినది. కావున, దాని కుపాయమేమియు లేదు. కాని ఇఁకముందునుండి సత్సంగి తనకు రాధాస్వామిచరణముల సన్నిధానమున నివాసముండవలయు ననెడి అభిలాష నెల్లపుడు తనలో పెంపొందించుకొనుటకు ప్రయత్నించవలయును.

# 171

## హుజూర్ వారి స్వప్న విషయము.

8 సెప్టెంబరు 1920 :– సత్సంగులు బయటి సభలలో వేనిలోను సభ్యులుగ జేరకూడదు. ఎవరైనను బలవంతముచేసినచో, "దయాల్బాగులో స్వార్థ

పరమార్థములకు కావలసిన అన్నివిధములైన సౌకర్యములు నున్నవి. కావున మాకు అచ్చటనుండి అనుజ్ఞయుండిననేదప్ప మేమీసభలోను సభ్యులుగ జేర" మని సమాధానముచెప్పవలెను. హుజూరువారు తమకు వచ్చిన ఒక స్వప్నమును గురించి వివరించిరి. మహారాజసాహెబ్ వారి కాలములో ఒకనాడు స్వప్నములో వారికి స్వామీజీ మహరాజువారు, హుజూర్ మహరాజ్ వారు, మహరాజ సాహబ్ వారు, ముగ్గురును దర్శనమిచ్చిరి. వారు ఆస్వప్నములో తమగదిని చాల పరిశుభ్రముచేసి కుర్చీలు, మేజాబల్లలు వగైరాలు అన్నియు అమర్చిరి. అప్పుడు స్వామీజీ మహరాజ్ వారు. హుజూర్ మహరాజ్ వారితో చెప్పగా. హుజూర్ మహరాజ్ వారు మహరాజ్ సాహబ్ వారితో చెప్పి. ఆతరువాత మహరాజ్ సాహబ్ వారు నాతో "మా కాకలి వేయుచున్నది, తినుట కేదైనను పట్టుకొనిరమ్మ"ని సెలవిచ్చిరి. మేము వెంటనే మూడు పళ్ళెరములలో మంచి మంచి భోజ్యపదార్థములను అమర్చి తీసికొనివెళ్ళి వారియెదుట పెట్టితిమి. వారు భోజనము చేసినపిమ్మట పళ్లెరములలో మిగిలిన భుక్తశేషమును నన్ను తినవద్దనియు, నాకింకను యుక్తసమయము రాలేదనియు, దానిని బయట పారవేయుమనియు ఆజ్ఞాపించిరి. మేము అట్లే చేసితిమి. ఇంకను ఒకటి, రెండు తమ అనుభవములను చెప్పి, "సత్సంగి యెప్పుడు తన పారమార్థికాభివృద్ధినిగురించి దృఢవిశ్వాసము గలిగియుండవలయును. సద్గురు వేమిచెప్పినను, బాహ్యముగ నది తన కప్రియముగనే యున్ననుగూడ దానిని సంపూర్ణముగ నెఱవేర్చవలయు"నని సెలవిచ్చిరి.

## 172

### జీవుని బంధనముల విషయము.

11 సెప్టెంబరు 1920 :- కర్మసిద్ధాంతమునుగురించి వివరించుచు, నింద్రియములు తన్మాత్రలతో సంబంధముగల్గియున్నవనియు తన్మాత్రలు మనోఆకాశముమీదను, మనోఆకాశము మనస్సుమీదను, మనస్సు నిజమనస్సుమీదను ప్రభావము గల్గించుచున్నవనియు సెలవిచ్చిరి. ఇట్లే ప్రతి స్థానములోను మనస్సు నిజమనస్సును వేఱువేఱుగ నున్నవి. వీనిలో వరుసగ నొకదానిపైన మఱొక దానికి ప్రభావము ఉండుచుండునని సెలవిచ్చిరి. దీనినిబట్టి, ఆత్మ భంవరగుఫ దాంటి సత్యలోకములో ప్రవేశించువఱకు కర్మ నశించదని తేలుచున్నది. పిమ్మట నీక్రిందిచరణములో చెప్పినవిషయమును,

"మోాకే బంధన జగతకే గురు భక్తీసే కాట్
ఘనే బంధన చిత్త కే కశేం నామ పరతాప్!"

అర్థము:-అనగా, "జగత్తుతో జీవుని కేర్పడిన స్థూలబంధనములన్నియు గురుభక్తి మూలమున తెగిపోవును. చిత్తమునందు గల సూక్ష్మబంధనములన్నియు నామముయొక్క ప్రభావమువలన తెగిపోవును." అనెడి విషయమును, సంత్ సద్గురువుయొక్క పరిపూర్ణదయ అనగ నెట్టిదో ఆవిషయమును, సత్యలోకమున కాత్మవెళ్ళినపుడే పూర్తిగ అవగాహనకాగలదని సెలవిచ్చిరి.

## 173

### నిజమైన ముక్తిఅవస్థ యెట్లుండును.

11 సెప్టెంబరు 1920 :- నిజమైనముక్త్యవస్థ యెట్లుండును?

ప్రతి మతస్థునికి తన మతగ్రంథములయందు గొప్ప గౌరవ విశ్వాసములు ఉండుననుటలో సందేహములేదు. అట్లుండుట యుక్తమేకూడ. కాని ఒక పుస్తకమందు హృదయమున నెక్కువ గౌరవవిశ్వాసములుండుట యొక విషయమును, దానిలోని గూఢవిషయములను, అనగా, దాని రహస్యము, నవగాహనచేసికొని సాక్షాత్ జ్ఞానముగలిగియుండుట అనగా, దానిని అనుభవరూపముగ తెలిసికొనుట మఱొకవిషయమును. ఈవ్యత్యాసము నెఱుంగక పోవుటచే ప్రస్తుతకాలములో సామాన్యముగ జనులు ప్రాచీనకాలపు మహాత్ముల బోధనలలోని సారమును గ్రహించకుండగనే పరస్పరము ఖండనచేసికొనుచున్నారు. తీపివస్తువు నెన్నడు తినియెరుగకను, తీపియనగ నెట్లుండునో యెఱుగకను, ఉండిన మానవుడు మాధుర్యమునుగుఱించి యేమిసంభాషణ చేయగలడో, అట్టివాని సంభాషణలో అందునుగుఱించి జ్ఞానముకాని వాస్తవముకాని యేముండునో ఆలోచించుకొనుడు. అట్లుగాక, నెవరైననొక తియ్యని గడ్డిపరకనైన రుచి చూచియుండినచో, నతనికి అతుచ్ఛమాధుర్యమైనను అనుభవమున్నందువలన నతడు మాధుర్యము విషయములో కొంతవఱకైనను నిజమును ప్రకటించగలడు. కావున ముక్తివిషయములో చర్చించుటకుగాని ముక్త్యవస్థనుగుఱించిన చర్చను అవగాహనచేసుకొనుటకుగాని ముక్త్యవస్థ యొక్క అనుభవము అధమాధమము స్థూలరూపములోనైన గల్గినవానికే సాధ్యమగును. ఈమార్గమునందు ప్రయోగాత్మకముగ నడుగిడి యథార్థమైన మోక్షమునుగుఱించి కొద్దిగనైన నాంతర్యానుభవముగల అభ్యాసిపురుషులు సత్సంగ

ములో చాలమంది యుందురు కావున, ఈవిషయము నిజముగా సత్సంగము లోనే వివరించవలసియుండును. దీనికి శీర్షిక "సరియైనముక్తి యనగనేమి?" అని పెట్టుటకుబదులు "నిజమైన ముక్త్యవస్థయనగ నెట్లుండును" అని చెప్పినచో సరిగ నుండును. శీర్షికను పైనచెప్పినట్లు పెట్టుటలో, మాయుద్దేశ్యము ఒకమతశిక్షతో గాని, ఒక గ్రంధవివరణముతోగాని నిమిత్తములేకుండా ముక్తినిగూర్చి నిష్పక్షపాతబుద్ధితో అనగా స్వేచ్ఛగా న్యాయమైన విచక్షణ చేసినయెడల ముక్త్యవస్థయనగ నెట్లుండునని తేలునో చూడవలయుననియే. ఉత్తమవిధమైన గాజుగ్లోబుల దీపస్తంభములతో నమర్చియున్నట్టియు. బహుశ్రేష్ఠమైన రత్న కంబళీలు, తివాసీలును పఱచియున్నట్టియు నొక అద్దములమేడలో, నొక అడివి మృగమును విడిచిపెట్టినయెడల, నచ్చటి సామగ్రిమూలమున దాని కేమియు సుఖము గలుగనేరదని జగద్విదితమేకదా, పైగా దానికి అట్టిస్థలములో చాల బాధగ నుండును. అటులనే ఒక అద్దములమేడలో నివసించుచున్న వానిని అడవిలో విడిచిపెట్టినయెడల, నచ్చట నతడుగూడ పైనచెప్పిన అడవిమృగము బాధపడినట్లే బాధపడును. కావున దీనినిబట్టి జీవాత్మకు తననిజలక్షణములలో ప్రవర్తించుటకు సంపూర్ణ సావకాశ మేపరిస్థితిలో సమకూరునో అదియే జీవునకు నిజమైన ముక్త్యవస్థ యను పర్యవసానము తేలుచున్నది. ఇప్పుడు జీవాత్మ సత్, చిత్ ఆనందప్రేమల స్వరూపమైనచో, దాని కెట్టిపరిస్థితి గల్గినపుడెద యెట్టిధమైన ఆటంకములు అడ్డును లేకుండగనే తన నిజలక్షణములలో ప్రవర్తించగల్గునో, అదియే దానికి నిజమైన ముక్త్యవస్థ యగును. ఈపైలక్షణ ములుగాక జీవాత్మలక్షణములు వేఱుగనున్నవని మఱొకరు అభిప్రాయపడినచో, ఆయనగారి అభిప్రాయము ననుసరించి ఆవేఱులక్షణములలో నిరాటంకముగ ప్రవర్తించగల సావకాశము గల్గిన పరిస్థితియే ముక్త్యవస్థ యగును. కావున నిజమైన ముక్త్యవస్థ యెట్లుండునో నిర్ణయించుటకుముందు ముక్తిపొందునట్టి జీవాత్మయొక్క లక్షణములును, అధికారార్హతలు నెట్టివో తేల్చుకొనవలసి యున్నది. కాబట్టి ఆత్మను ఎఱింగినవానికొక్కనికే ముక్త్యవస్థయనగ నెట్టిదో బోధపడగలదు. ఆత్మను సచ్చిదానందస్వరూపమైనట్లే అందఱును ఒప్పుకొను చున్నారు. కావున, ఆలక్షణములనే దృష్టిపథమునందుంచుకొన్నయెడల ఆత్మకా లక్షణములలో ప్రవర్తించుటకు సంపూర్ణసావకాశము లభ్యమైనపుడే దానికి నిజమైనముక్తి ప్రాప్తించినట్లు తెలిసికొనదగునని స్థిరపడును.

మన ఈ అస్థిచర్మమాంసపంజరమైన శరీరమును, మన మనస్సును, ఆత్మకు పైనకప్పిన కోశములవంటివనియు, ఈ మనుష్య శరీరముద్వారా పైకి ప్రకటించబడుచున్న ఆత్మయొక్క లక్షణములన్నియు, శరీరమనస్సులనెడి పొరలగుండా పైకివచ్చుచున్నందున నాకోశములకు సంబంధించిన లోపములతో కూడియే ప్రకటమగుచున్నవనియు, మనకు మన అనుభవమునుబట్టి స్పష్టమగుచున్నది. ఈకోశములు ప్రబలమైన ఆటంకము గలుగజేయుచుండుటచే, ఆత్మయొక్క నిజలక్షణము లీలోకములో నిర్మలరూపములో ప్రకటము కాజాలకున్నవి. అందువలన నిజమైనముక్తి పొందునిమిత్తమై ఆత్మపైనున్న యీశరీమనస్సులనెడి కోశములను తొలగించుట యవసరము. ఏశక్తియైనను, ఏలోకములో నది యుండిన నాలోకముయొక్క పదార్థమును తనచుట్టు నొకయాచ్ఛాదనగ ధరించియే యుండితీరవలయును. కావున నాత్మకు శరీరమనస్సులయాచ్ఛాదన లేకుండ తప్పించుకొనవలెనన్న యెడల, అది శరీరమనస్సులకు సంబంధించిన దేశము నతిక్రమించివెళ్ళి తనతో సమానలక్షణములుగల నిర్మలచైతన్యదేశమునందు చేరుకొనవలెను. అట్టి నిర్మలచైతన్యదేశములో చేరుకొన్నపుడు ఆత్మపైనుండి శరీరమనస్సుల ఆచ్ఛాదన తప్పిపోవుటయొక్కటే గాక దాని నిజలక్షణములయిన సత్ చిత్ ఆనందాదిలక్షణములుగూడ, అచ్చటనున్న సమానధర్మములుగల సామగ్రితో కలిసియుండుటచే వెయ్యిరెట్లెక్కువ నిర్మలముగను, శోభాయమానముగను ప్రకాశించును. ఎట్లనగా మట్టిపూత పూయబడిన ఒక ముత్యమును శుభ్రముచేసి ముత్యములతోనిండిన పళ్లెరములో వేసినపుడు, ఆముత్యమును మట్టిలేకుండ కడిగి శుభ్రముచేయుటచే దాని మెఱుగును శోభయు దానికి తిరిగివచ్చుటయేగాక, దానితో సమానమైన ప్రకాశాది లక్షణములుగల ముత్యములమధ్యన నది పెట్టబడియుండుటచే దానిమెఱుగును శోభయు నెన్నియోరెట్లెక్కువ యైపోవునుకదా. కాబట్టి జీవాత్మ శరీరమనస్సులను విడిచిపెట్టి మనస్సు మాయయు ఉండునట్టి దేశములను దాటివెళ్ళి, ఆత్మతో సమానధర్మములుగల నిర్మలచైతన్యదేశమునందు నివాసముచేసినపుడు, దానికి ఆవిధముగ తన నిజలక్షణములలో నిరాటంకముగ ప్రవర్తించుటకు సంపూర్ణసావకాశము లభించును కావున, అపుడే దానికి ముక్తి లభించునను పర్యవసానము తేలుచున్నది. ఈయవస్థాప్రాప్తినే రాధాస్వామీ మతములో ముక్త్యవస్థయని పేర్కొందురు.

ఈయవస్థను పొందవలెనన్నచో. ఈయుత్తమగతిని పొందిన సిద్ధపురుషుని సహాయము ఉండిననే అది సాధ్యముకాగలదని ప్రకటమగుచున్నది. అట్టి పరిపూర్ణసిద్ధపురుషునినే సంతుమతములో నిజమైనగురువుగ మన్నింతురు. అట్టి సద్గురువు లభ్యమైనపుడు వారు చెప్పిన సాధనల నభ్యాసముచేసినచో, జీవుని మనోరథ మెప్పటికైన సిద్ధేరగలదు. అయితే పైన తెల్పినట్లుగా విద్యావంతులు గురువు సహాయమేమియు లేకుండగనే, తమంతట తాము, ఈవిషయమును సాధించగోరుచుండుటచే కష్టము గలుగుచున్నది.

తిన సే సంత్ మౌన హోయ బైఠే, సో జివ కరతే అప్నీ హాన్।

అర్థము:- సంతు లట్టివారితో మాటలాడకుండ మౌనముగ నుందురు. వారు తమకే హాని గల్గించుకొనుచున్నారు.

బహుప్రాచీనకాలములో బోధించబడుచుండెడి వేదాంతములోని యీ పరమగూఢరహస్యము నిపుడు నేను మీకు వివరించిచెప్పితిని. దీనిని మీరు ముఖ్యముగా శాంతపురుషునకానివానికిని, మీపుత్రులు లేక శిష్యులుకాని వారికిని ఉపదేశించకుడు.

## 174

### ఒకసారి ఉపదేశము లభించినవానిని నిజధామమునందె ప్పటికైన జేర్చితీరుదురు.

12 సెప్టెంబరు 1920 :- ఉత్తమలోకమేదైన నొకటి ప్రకటమైనపిదప, దాని పైస్థానము ప్రకటమగుటకుముందు, అభ్యాసి క్రిందిస్థానముయొక్క విషయము అంతయు పూర్తిగా మఱచిపోవుట ఆవశ్యకము. సంత్ సద్గురువును తనపైన ప్రసన్నులగునట్లు చేసికొనుట కష్టసాధ్యమైనపనియే కాని, వారి యందు ప్రీతిగల్గించుకొనుట సులభమే అని సెలవిచ్చిరి. ఒక్క గురుభక్తి మాత్రము దృఢముగ నుండవలెను. మిగతవిషయములన్నియు దానినుండియే క్రమక్రమముగ నెప్పటికైనను లభించగలవు. ఎవనికైన నొకసారి ఉపదేశము ఇవ్వబడినచో, నతనికి జననమరణ చక్రమునుండి విముక్తి యైపోయెను. అతనిని నిజధామమునందు చేర్పించితీరవలసినదే.

## 175

### సత్సంగులకు గలుగబోయెడి క్లిష్టపరిస్థితి.

13 సెప్టెంబరు 1920 :- సోమనాథదేవాలయముపైన మహమ్మద్ గజనవీ దండెత్తినపుడు పండాలకువచ్చిన పరిస్థితివంటి క్లిష్టపరిస్థితి సత్సంగులకుగూడ

నొకప్పుడు రాగలదు. అయితే, ఒక్కవ్యత్యాసముమాత్రి ముండును. పండాలు చాల అన్యాయముగ ప్రివర్తించెడివారుగనుక వారు నాశనమైపోయిరి. సత్సాంగుల కట్లుగాక భగవత్సహాయముండును. వారికెట్టినష్టమును గలుగదు.

ప్రస్తుతము రాధాస్వామీదయాళురు సత్సంగులసంఖ్యను వృద్ధిచేసి, వారి నాసమయము నెదుర్కొనుటకు తగినట్లుగా సంసిద్ధులుగ చేయ ప్రయత్నములో నున్నారు. సత్సంగులసంఖ్య బాగుగా పెరిగి, వారందఱును పూర్తిగా తయారైనపిదప నిక్లిష్టపరిస్థితి రాగలదు. కాని అంతకుముందు రానేరదు.

# 176

## లాలా ఫతేచందుగారి ఈర్ష్యనుగురించి

13 సెప్టెంబరు 1920 :- లాలా నవనిధిరాయ్‌గారికి జీతము హెచ్చించబడినది. ఫిబ్రివరి నెలనుండి నెలకు రమారమి రు 150/- లు చొ॥న హెచ్చు జీతము లభించును అందుచేత నాయన హుజూరువారికి దండప్రిణామములుచేసిరి. అంతట లాలాఫతేచందు సింధుదేశస్థుడు, "ఈరోజులలో జీతములు పెరిగిపోయినవి. నాక్రిందవానికి యిప్పుడు రు 550/- లు జీతమిచ్చుచున్నారు." అని చెప్పెను. అప్పుడు సాహబ్జీమహారాజువా రతనిని నీకు రిటైరగుసరికి జీతమెంత యని అడుగగా, అతడు రు 150/- లు అని చెప్పెను. అపుడు వారు, "నీవైతే రు 150/- లు మీదనే రిటైరైనను, రు 550/- లు నెలజీతముగలవాడు నీక్రిందవాడైనట్లు అనుచున్నావు. ఈసందర్భములోనే వారు, "నీకు నవనిధిరాయ్‌గారివృద్ధి చూచి అసహనము గల్గుచున్నది కాబోలు, ఇతడెందఱికి జోళ్ళు తుడుచుచున్నాడో, ఎందఱకు జోహారులు చేయుచున్నాడో. ఎన్నిపాట్లు పడుచున్నాడో నీకేమి తెలుసును?" అని తిరిగి, సెలవిచ్చిరి. ఒక కూలివానికి నెత్తిమీద బరువు ఉండినట్లే ఇతనికి మెదడులో చింతాభార మున్నది. ఈ రెంటిలో నేమియు తేడా లేదు. నీకింటిలోనుండి బయటకువచ్చి పైకికావలెనన్న పైకిని లేదా, మరేప్రక్కకు పోవలెనన్న నాప్రక్కకును వెళ్ళుటకడ్డులేదు. మనసున నొకచింత లేదు, ఒకబెంగలేదు, ఇతనికన్న నీవెక్కువస్వేచ్ఛగను, సుఖముగను లేవా? నీతర్వాతవచ్చినవారందఱును నీకన్న కనిష్ఠులుగను, నీకన్న చేతకానివారుగనే యుందురని తప్పుడభిప్రాయము పడకుము. అట్లుకాక నీతర్వాత ప్రతివిషయములోను నీకన్న నెక్కువనేర్పరులే వత్తురు. నీకన్న నెక్కువజీతములుకూడా వారికి దొరకును. అయిననుకూడ నీజీవితసంగ్రామము

జయప్రదముగ సాగిపోయినందుకు భగవంతునికి నీవు ధన్యవాదములనే అర్పించుచుండవలయును. ఎవరెవరికి అభివృద్ధియైపోవుచున్నది, యెవరెవరు పైకి వెళ్ళుచున్నారు అనెడి ఆలోచనల నిక కట్టిపెట్టుము.

తిరిగి యిట్లు సెలవిచ్చిరి. లాలా నిధిరాయ్ గారికిమాత్రము అభివృద్ధి యెక్కువగ నేమైనది? ఈయన 15 యేండ్లు నౌకరీచేయగా ఇప్పటికి నెలకు రు. 1500/- లు జీతమువచ్చుచున్నది. ఈయనకును, హంసకుమారునకును లభించినసర్టిఫికెట్లు ఒకేతరగతికి చెందినవి. ఇద్దఱును పనికూడ చాలబాగుగనే చేయుదురు. అయినను హంసకుమారు రెండుసంవత్సరములే నౌకరీచేసి, అప్పుడే ఎగ్జిక్యూటివ్ ఇంజనియర్ హోదాకి వృద్ధియైపోయెను ఈవిధముగా లోకములో నౌకరినిమించి మఱొకరెప్పుడును ఉండుచునేయుందురు. పరమార్థి యిట్టివిషయములనుతిలపెట్టకూడదు.

## 177

### బీదసాదలకు ధర్మముచేయుట, హుజూరు వారు చిన్నతనములో చేసిన సాధుసేవ

సాధువులకు, బీదవారికిని ఏమైన నిచ్చుటవలన ఆదానమునకు బదులుతీసికొనుటకై తిరిగిపుట్టవలసియుండుననియు, అందుచే బీదలకు.సాధువులకు నేమియు నీయకూడదనియు నేను (అనగాయీలేఖకుడు) ఇదివఱలో అనుకొనెడిఅభిప్రాయము పొరపాటు. నిష్కామసేవ చేయుటవలన నష్ట మేమియు నుండజాలదు. అనగా బీదలకుసాధువులకు నేమియిచ్చినను దానికి ఫలితము పొందవలెనను ఆసపెట్టుకొనకూడదు. కాని,భగవంతునిపిల్లవాని కవసరముగల్గినపుడు సహాయముచేయుదమనెడి దయాభావముతో నివ్వవలసినదే. హుజూర్ వారీసందర్భములో తమరిని గుఱించి యీవిధముగ సెలవిచ్చిరి. తమనిమిత్తమై యింటిలో ఆఱురొట్టెలు చేసియిచ్చెడివారట. వానిలోనుండి తీసి వెంటనే యేఫకీరు నకైన నిచ్చినయెడల నందఱికి తెలిసిపోవునని, వానిని పైకి మేడమీదకు తీసికొనివెళ్ళి అందుండి రెండు రొట్టెలు కుక్కలకుగాని, కాకులకుగాని వేసెడివారమని సెలవిచ్చిరి. అట్లే సాధు సేవనుగుఱించి కూడ జింద్ మహాన్‌లో నున్నట్టి ఒకఫకీరునకు హుజూరువారును, వారితాతగారును ఖర్జూరపుపండ్లను తీసికొనివెళ్ళి యిచ్చి, సాష్టాంగముచేయుచు 15 నిముషముల సేపు వీరిని ఆసాధువుగారు లెమ్మని చెప్పువఱకు నట్లే నేలపైన పడియుండెడివారమనియు, ఆసాధువు పరుండియుండగా, విసనకఱ్ఱతో, ఆసాధువు

నిద్రపూర్తి అయి లేచెడివఱకు నతె మూడుగంటలసేపు విసురుచు నుండిపోయెడి వా మనియు సెలవిచ్చిరి.

## 178

తనమనస్సును, ఇచ్ఛలను అంతర్ముఖముగ నుంచుకొనుటయే సత్సంగి యొక్క కర్తవ్యము. తక్కిన యేర్పాట్లన్నియు రాధాస్వామీ దయాళురే చేయుదురు.

---

14 సెప్టెంబరు 1920:— మనస్సు, ఇచ్ఛయు నెల్లపుడు బహిర్ముఖముగనే ప్రవహించుచుండును. ఎవనికైనను ఆధ్యాత్మికానందముయొక్క రుచి తగిలినపుడే అవి వానిలో అంతర్ముఖమైపోవును. ఆరుచి రెండువిధములుగా లభించగలదు ఒకటి ఆంతర్యానుభవములమూలమునను, రెండు. బాహ్యానుభవములమూలము నను ఆంతర్యానుభవములు బహుకష్టసాధ్యములే కాని బాహ్యానుభవములు మాత్రము చాలసులభముగ పొందవచ్చును. అందునిమిత్తమై కొద్దిగా తత్పరత యవసరము. శరీరముతో సేవయు కొద్దిగా చేయవలసియుండును. ఇది అధమాధ మమైన ఆవశ్యకవిషయము. (Workable minimum) అనగా అట్లుచేసినయెడల నే పని సాగగలదు. ఈమాత్రముకూడా చేయలేనియెడల నేమియు పనిసాగదు. ఎట్లనగా, ఈలోకములో నెంతమహాదరిద్రునికైనను అధమాధమము మూడవ క్లాసుటిక్కెటు కొనుగొనకతప్పదుకదా. ~యితే ఎనిమిదిఅణాలటిక్కెట్టు మాత్రముకొనుగోలుచేసినయెడల బండిలో నిశ్చింతగ కూర్చుండిపోవచ్చును. ఆ తరువాత నితనిని తనగమ్యస్థానమువద్దకు సుఖముగా జేర్చవలసినబాధ్యత అంతయు రైల్వేవిభాగమువారిదే. ఇంజన్లకొఱకును ఇనుపపట్టీలకొఱకును వేలకొలది రూపాయిలు వెచ్చించబడుచున్నవి. గవర్నమెంటును రైల్వేవిభాగమువారును అతనిని సుఖముగ తనగమ్యస్థానమును జేర్పించుటకై కావలసినయేర్పాట్లన్నియు చేయుబాధ్యతను వహించుదురు. అట్లే సత్సంగికూడా తనఅధమాధమబాధ్యతను నెఱవేర్చినచో, మార్గములో చేయవలసినబందోబస్తుఅంతయు రాధాస్వామీ దయాళురే స్వయముగ చేయుదురు. త్రోవలోనున్న ధ్వనులన్నియుకూడా సత్సంగికి ఈ కార్యములో సహాయకరముగ నుండును.

సత్సంగి తనసంతానమునుతనవారని భావించుకొనక, హుజూరువారిచ్చిన దయాప్రసాదములుగ భావించుకొనుచు, మఱియు, తాను వారి కేపనిచేసినను

తన మోహమును కారమూలమున నే చేయక, హుజూరి వారిఆజ్ఞకు కట్టుపడిచేయు చుంటె ననుభామముతో నుండవలెను. ముండ్లును, తియ్యనిపండ్లును, కూడ బయ ల్వెడలునట్టి రేగుచెట్టు ఒకేగింజనుండి పుట్టినట్లుగనే, సుఖదుఃఖములు రెండును గూడ భగవత్కృపవలన గల్గుపరిణామములే. ఇవ్విధమగుదృష్టికోణము ఉన్న యెడల కాలక్లేశములు ఉండజాలవు. మేము సత్సంగులందరికి నిట్టిదృష్టికోణము గల్గునట్లు సుమతిదానమిప్పించుడని భగవంతునికి ప్రార్థనచేయుచున్నాము.

గురుముఖునికుండవలసిన ముఖ్యలక్షణము లెవ్వి?

అతనిజ్ఞానేంద్రియములు సంపూర్ణముగ మేల్కాంచియుండవలయును. సత్సంగమునకు కావలసిన యేర్పాట్లన్నియు సాగించుటకు అతడు సంపూర్ణమైన సమర్థత గలిగియుండవలయును. అతినికి భగవతునితో సాలోక్యగతియు, సారూప్యగతియు పొందవలయుననుకోరికతప్ప మఱొకకోరిక యుండకూడదు.

## 179

ఖేమచందుగారికి హెచ్చరిక.

15 సెప్టెంబరు 1920:— హుజూరువారు ఖేమచందుగారితో నిట్లుసెల విచ్చిరి. రాధాస్వామీమతములో నెన్నడుచేరనివారు తమకు భగవంతు డగు పడుట లేదనుటకు సావకాశమున్నది కానిమహారాజ్ సాహబ్ వారిసత్సంగములో చేరి, ఆంతర్యమునందు బాహ్యమునందు వారిదయాచిహ్నములను పొందినవాడు భగవంతునిప్రస్తుతనరస్వరూపమును కాదనినిరాకరించినచో అతడు చనిపోయి ననుకూడ మఱువలేనంతటి మహాబాధపడ వలసినవచ్చునని మఱొకసారి జ్ఞాప కము చేయుచున్నాను.

## 180

నిజమైనసంతసద్గురుని శరణ్యము పొందిన వానికి చింతయేమియు నుండదు.

17 సెప్టెంబరు1920:—హుజూరువారు ఒకసత్సంగేతరుడు తమరిని వేఱుగ నడిగినప్రశ్న నీక్రిందివిధముగ సత్సంగములో చెప్పిరి. ఎవనికైనను కలకత్తావఱకు వెళ్ళవలసియున్నచో నతడు తనకు త్రోవలో తినుటకును, ఇతరసౌకర్యములకును కావలసినపదార్థములనుగుఱించి 2,3రోజులుముందునుండియు చాలతాపత్రయ పడుచుండునుకదా, సత్సంగులు నిజధామమునకు ప్రయాణముచేయుచున్నామని చెప్పుచు, దానికిపోవుమార్గము అతిదుర్గమము,దూరతరముగూడ నైయున్నను,

దయాల్బాగులో సత్సంగు లెచ్చటచూచినను కులాసాగా ఆడుచుపాడుచునే కనపడుచుందురు దీనికి కారణమేమి?

హుజూరువారీవిధముగ సెలవిచ్చిరి. పైన చెప్పిన ప్రయాణికునిఆందోళన అంతయు రైలుఎక్కెడినటకేకాని, ఎక్కినపిమ్మట నేఆందోళనయు నుండనేరదు. ఇక రైలెక్కినపిదప నతడు జాగ్రత్తపడవలసినవి మూడేవిషయములు: ఒకటి, యేదైనజంక్షనుస్టేషనులో దప్పికతీర్చుకొనునిమిత్తమై మంచినీటికొఱకు బండిలో నుండిదిగినచో, నతడు రైలుదాటిపోకుండ తిరిగి దానిలోనెక్కవలెను. రెండు, ఏజంక్షనులోనైనను రైలుమాఱవలసివచ్చినప్పుడు తప్పురైలులోని కెక్కకుండ చూచుకొనవలయును. మూడు, రైలులోనుండి శిరస్సు మొదలైనవి బయట పెట్టకుండా నుండుట, లేనిచో నతడు రైలునుండి పడిపోవును. అదేవిధముగా, సత్సంగి రాధాస్వామిదయాళుని శరణుజొచ్చినపుడు అతడు రైలు ఎక్కిపోయినట్లే. ఇప్పుడతడింతమాత్రము జాగ్రత్తపడిన చాలును. ఏసంత్ సద్గురుని దేహస్వరూపమైనను గుప్తమైనపుడు అతడు తప్పుత్రోవను పోకుండ చూచుకొనవలెను. కావున సత్సంగికి యథార్థసద్గురుని శరణ్యము, సత్సంగమును లభించినంతకాలము ఆతనికి విచారపడవలసిన యవసరమే ఉండనేరదు.

## 181

### సత్సంగముయొక్క భవిష్యము.

18 సెప్టెంబరు 1920:—సత్సంగసంఘము చాలయధికముగా పెరిగిపోవును. పాతికయేండ్లలో పెద్దవృక్షమైపోవును. కాని పదునైదేండ్లు ఆగుసరికే దాని ప్రభావము కనపడనారంభించును ముందుముందుజరుగబోయెడి కార్యక్రమమును గుఱించి కొద్దివివరములుచెప్పిననుకూడ మీకు తలలు తిరిగిపోవును.

లోకములోనున్న సమస్తశారీరికశక్తులు,మానసికశక్తులను తమ యునికికై చైతన్యశక్తిమీదనే ఆధారపడియున్నవి. చైతన్యధార వెనుకకుపోయినచో నీసృష్టిఅంతయు నొక్కక్షణములో నశించిపోవును. అందుచే సత్సంగ సంఘముయొక్కనాయకుడు ఒకపరమచేతనశక్తియో లేక ఆశక్తియొక్క కేవల ధారయో మాత్రమేగాకుండ చేతనశక్తియొక్క సాక్షాత్తుభండారమే అయియున్నపుడు సత్సంగికి సమస్తవిధసౌకర్యములును లభించకుండుట సాధ్యమేకాదు. అయితే అందుకుతగినసమయము వచ్చువఱకు వేచియుండవలయును.

## 182

### సత్సంగికిని సత్సంగేతరునికిని వ్యత్యాసము.

19 సెప్టెంబరు 1920:—సత్సంగేతరులకన్న సత్సంగి కేమైనయుత్కృష్టత గలదా? ఒకసత్సంగియు, మఱియొకసత్సంగేతరుడును, ఇఱువురునుకూడా పాపభీతి లేకుండా ప్రాపంచికలక్షణములలో విచ్చలవిడిగా ప్రవర్తించుచుండినను, సత్సంగేతరుడు పూర్తిగా365రోజులు నట్లే ప్రవర్తించును కాని, సత్సంగి సాలుకి అధమాధమయొక్కరోజునకైనను తాను క్రితము364రోజులలో చాలతప్పుడుమార్గమున ప్రవర్తించితినని పశ్చాత్తాపపడి చాలవిచారపూరితుడై హృదయపూర్వకముగా భగవంతునిక్షమాపణ కోరుకొనును. అపరిమితదయాళులైన భగవంతుడు అతడు క్షమార్పణకొఱకై చేసుకొన్న వేడుకోలును అంగీకరించి యతనితప్పుల నన్నిటిని క్షమించివేయును. 'సారబచన్(గద్య)లో నిజమైనసద్గురునిశరణ్యము గ్రహించినవాడు పాపియేఅయిననుకూడా క్షమించబడునని చెప్పినవచనమున కిదియే అర్థము. సత్సంగి యీ శ్రద్ధాళుభావమును వదిలిపెట్టకుండ నున్నంత కాల మతనికి కార్యభంగము కానేరదు. గాబరా పడ నవసరములేదు.

## 183

### రాజబరారీలో జరిగినఘటన, దానికి కారణములును. సద్గురువు సత్సంగుల కొఱకై నియమోల్లంఘనము చేయుటలో నియమములు.

క్రిస్టమస్ 1920 :— (1) నవంబరునెల ఆఖరుభాగములో సాహబ్జీమహారాజువారు రాజబరారీ విచ్చేసిరి. శాస్త్రిగారు వారితోకూడ వచ్చెదనని కోరినపుడు సాహబ్జీమహారాజువారు ఆయనను రావద్దని చెప్పిరి. కాని ఆయన పట్టుపట్టి వారితోకూడా వెళ్లెను. రాజబరారీనుండి తిరిగివచ్చునపు డాయన త్రోవలో చనిపోయిరి.

(2) హర్దా వచ్చినతర్వాత సాహబ్జీమహారాజువారి ఆరోగ్యము చెడిపోయెను. ఒకరోజున వారు "సర్కార్‌సాహబ్ వారు గుప్తమై ఈనాటికి (7వ డిసెంబరు 1920 తేదీ నాటికి) ఏడేండ్లయినది, మేము యేడేండ్లు పనిచేసితిమి, ఇప్పు డిక మేము వెళ్లుటకు దివ్యేచ్ఛ కలిగిన"దని సెలవిచ్చిరి. కూడనున్నవారందఱును చాలయేడ్చుట, నెత్తి బాదుకొనుట ప్రారంభించిరి. కాని హుజూరువారు ఒప్పుకొనలేదు. పైగా "చూడుడు, ప్రాపంచికజీవులు. మరణసమయమువచ్చి

నపు డెంత క్షుభితులై పోయి యేడ్చి మొత్తుకొనుచుందురో, ఇప్పుడు చూడుడు మే మెట్లు వెడలిపోవుదుమో" అని సెలవిచ్చి తిరిగి, "చూడుడు మా చేతులు, పాదములలోనుండియు ప్రాణము వెనుకకు లాగికొనిపోయినది." అని సెలవిచ్చిరి. తిరిగి "ఇప్పుడు మా గుదాచక్రము తెఱచుకొన్నది, ఇంద్రియద్వారము వికసించినది. ఇదిగో నాభివఱకు ప్రాణము లాగివేసినది. ఇదిగో హృదయమువఱకు, ఇదిగో కంఠమువఱకు లాగివేసినది" అని సెలవిచ్చిరి తిరిగి "ఇప్పుడు తృతీయనేత్రము—" అని అంతవఱకు మాట్లాడినతోడనే వారికంటినల్లగ్రుడ్లు వెనుకకు తిరిగిపోయినవి. అప్పుడందరును యేడ్చి మొత్తుకొనుట ప్రారంభించిరి. రమారమి రెండుగంటల సేపట్లు అంతర్ధానమై, అప్పుడు మళ్లి వెనుకకు తిరిగివచ్చి "మీరుయేడ్చిమొత్తుకొనుచుండుటవలన మాకు శ్రమ కల్గుచున్నది. సరే, భగవంతుడు దివ్యేచ్ఛను మార్చిరి. ఇప్పుడు మఱికొంతపని నేను చేయవలసినదివ్యేచ్ఛ కలిగెను," అని సెలవిచ్చిరి. అపుడందఱును ఆనందపరవశులైరి.

(౩) మఱునాడు రాత్రి 10 గంటలకు క్రితమురోజు జరిగిన విషయములే తిరిగిజరుగుట ప్రారంభించెను. అప్పుడు బాబుజ్యోతిస్వరూపుగారు, బాబుహంసకుమారుగారును చాలయేడ్చిరి. హుజూరువారు "నీవెందు కేడ్చెదవు? నీకు మేము నెలకు రు. 1000/- జీతము వచ్చెడి ఉద్యోగము ఇప్పించితిమి మన దేశస్థులకింత జీతము లభించుట దుర్లభము." అని సెలవిచ్చిరి. భాఈసాహెబ్ గారు, "తమరే వెడలిపోవులాగున దివ్యేచ్ఛ ధరించినచో, నే నీజీతము నేమిచేసికొందును?" అని చెప్పిరి. అప్పుడు భాఈసాహెబ్ గారు ఘునఘున్ ను (సాహబ్జీ మహారాజువారి కుమార్తెను) తీసికొనివచ్చి సాహబ్జీమహారాజ్ వారి యెదుట నిలబెట్టి—అప్పుడు ఘున్ ఘున్ కి చాలయెక్కువగా జ్వరము వచ్చుచుండెను.— "ఈచంటిపిల్ల మాట జ్ఞాపక ముంచుకొనుడు" అని చెప్పెను. చిన్న "కాకా" కూడా యేడ్చుచు వారియెదుట వచ్చినిలబడెను. అతనికికూడా జ్వరము వచ్చుచుండెను. ఆపిల్లవాడు "నాయనగారూ నన్నుకూడా జ్ఞాపకముంచుకొనుడు. నేనింకను చాలచిన్నవాడనే" అని అనెను.

"తమరు నిన్నను దివ్యేచ్ఛను మార్చివేసితిమని సెలవిచ్చిరి కదా. బ్రహ్మాండము తలక్రిందైననుగూడ సంతులమాటకు తిరుగుండదు, అని చెప్పుదురు కదా" అని భాఈసాహెబ్ గారు నుడివిరి. కాని ఈమాటలన్నియు పెడచెవిని బెట్టి, సాహబ్జీమహారాజువారు వెడలిపోవ నారంభించి, కొద్ది సేపట్లో నంతర్ధాన

మైరి. రాత్రి 10 గంటలు మొదలు మఱునాడు మధ్యాహ్నమువఱకు నందఱును తిరిగి నిన్నటివలెనే బహుశా దివ్యేచ్ఛ మాఱి వెనుకకు రావచ్చునను నేడి ఆశతో నిరీక్షించుచుండిరి. ఆప్రకారము మఱునాడు మధ్యాహ్నసమయములో హుజూర్ సాహబ్జీమహారాజ్ వారు "సంత్ చదరియా దీనీ కీన దీనీ,"[1] అనెడిచరణమును తమనోటితో పలుకనారంభించి, క్రమక్రమముగా శిఫర్లాంగులదూరమున నున్న వారికికూడ వినపడునంతగట్టిగా అఱచుట మొదలిడిరి. అందుచే చుట్టుప్రక్కలవా రందఱు నచటికి వచ్చిప్రోగైరి. హుజూరువారు అట్లనుట మాని ఊరక నున్న పుడు భాఈసాహబ్ గారు వారిని విషయమేమిటియని అడిగిరి. హుజూర్ వా రపుడు తాము 12గంటలసేపు శరీరమును విడిచిపెట్టి వెళ్ళిపోయినందున వెన్నె ముక పూర్తిగకరిగిపోయినదనియు, ఈచరణము పాడుటచే దానినిసరిచేసితిమనియు సెలవిచ్చి, తమప్రక్క మీాద మృతశరీరముయొక్క ధూళి రాలిపడియున్నదని చూపించిరి. అందుపైన వారిబట్టలునుప్రక్కయు దులిపి శుభ్రముచేయబడినవి. వెంటనే వారు దయాల్బాగ్ వెళ్ళుదమని సెలవిచ్చిరి. హెడ్ మాష్టర్ గారు మెయిలుబండికి సమయమైపోయినదనియు, బండి వచ్చి స్టేషనులోనున్నదనియు, నందుచే దొరకదనియు చెప్పిరి. కానిహుజూరువారు, "లేదు, నడవండి బండియొక్క డికి వెళ్ళగలము?" అని సెలవిచ్చిరి. తోడనే సామాన్లుఅన్నియు కట్టివేసి తయా రై వెళ్ళిరి. ఆరోజున బండి మామూలుకన్న చాలయెక్కువసేపు ఆగి. అందఱు నెక్కినపిదపనే బయల్దేరెను. ఆప్రయాణము చేయుటకుముందురోజుననే సాహబ్జీ మహారాజువారు. ముందుచేయవలసిన పనులన్నిటినిగుఱించియు, ఖాగానాలో నేమిచేయవలయునో, స్కూలులో నేమిచేయవలయునో వగైరాలన్నియు చెప్పి వ్రాయించిరి. సత్సంగమునకుసంబంధించిన విషయములను తెలిసికొనగోరినచో బాబుగురుచరనదాసుఇంజనీయరుగారిని అడిగి తెలిసికొనవలెననికూడ సెలవిచ్చిరి.

4. గాజిపురమునుండి మున్షిమహ్తాలాలుగారు వచ్చి, ఒకరోజున హుజూరు వారిని, "ఓప్రభో, ఇతపిన్నవయస్సులోనే తామిట్టిదివ్యేచ్ఛ నేలచేసితిరం"ని అడిగెను. హుజూరువారు "నీ కావిషయ మెందుకు? మేము నీజీవకళ్యాణము నీ జన్మలోనే నెరవేర్చిపెట్టెదమని వాగ్దానము చేసితిమికదా. అట్టిపరిస్థితిలో నీకీ ప్రశ్నయెందుకు? నీకా వాగ్దానమైపోయినందున రాబోపుసంత్ సద్గురుని చరణ

1. ఈచరణమునకు "సంతులవస్త్రము (దేహము) నిచ్చితివి కదా లేక ఇవ్వలేదా" అని అర్థము.

ములవద్ద నీవు నిస్సంశయముగ చేరుకొందువు." అని సెలవిచ్చిరి. దానిమీద మత్తూలాల్ గారు "ఓదాతా, తమవాగ్దానము తప్పక నెఱవేరితీరును. అయినను, ఎట్టిగురువు దొరకునో, ఏవిధముగనుండునో ఈశంగారు మాకుతప్పదనెడివిషయము కూడ అనురుగమనించుడు ప్రస్తుతమైతే, నాకు నిర్వాహము చక్కగ నై పోవుచున్నది. ఇకముందేపరిస్థితి పరిణమించునో యెవరికి తెలియును?" అనినుడివెను. అప్పుడు సాహబ్జీమహారాజువారు "నీకు ఈత బాగుగ వచ్చుననుకొనుము. నీవు గంగానదియొడ్డున పోవుచుంటివి. పిన్నవయస్సులోనున్న పిల్లలు కొందఱు ఆనదిసుడిగుండములో మునిగిపోవుచు నింకొకకొంచెముసేపు ఊరకుండినచో నిస్సంశయముగ మునిగిపోవుపరిస్థితిలో నుండగా వారిని చూచితివనుకొనుము. నీకు అప్పుడు సాయము చేయకుండ నుండిపోవుటకు మనసొప్పునా?" అని యడిగిరి. మత్తూలాలుగారు "తప్పక వారికిసహాయము చేయదలంతును" అని చెప్పెను. హుజూరువారు "సరే మాపరిస్థితికూడ సరిగ నట్లే యుండెను. మాయింట్లోపిన్న పెద్దలందఱును, రాజబరారీవారును జ్వరములపాలై బహురోగగ్రస్తులై క్లిష్టపరిస్థితిలోనుండిరి. అట్లుండగా వారికి సాయముచేయవలయునని ఆలోచన కలిగి అట్లు వారికి సాయముచేయ నిశ్చయించితిమి. ఆసహాయము చేయుటలో మాకీకష్టము సహించవలసివచ్చెను. ఒకరికి సహాయముచేయునిమిత్తమై యెవరైన నొకనదిసుడి గుండములోనికి ఉరికినయెడల నతఁడు నీటిఅడుగున నున్నంతసేపును, పైనున్నవారికి మునిపోయినట్లే కనిపించునుకదా. అట్లే మేము వీరికి రక్షణచేయుచున్నంతసేపును మాపరిస్థితికూడ పైవారికట్లే కనపడెను." అని సెలవిచ్చిరి.

(5) తిరిగి ఒకనాఁడు సత్సంగములో హుజూరువారు చాలమంది సత్సంగులకు హార్దాలోవచ్చిన రుగ్మతనుగుఱించి తెలుసుకొనవలెనని యున్నదికాని యెవరికి నావిషయము నాతో ప్రశంసించుటకు సాహసములేకపోయెనని సెలవిచ్చిరి. చూడుడు, అసలువిషయ మీవిధముగనున్నది.

సంత్ సద్గురువు ప్రకటమైనపుడు అనగా పరమపురుషుఁడు వారి నీప్రపంచమునకు ఉద్ధారకార్యము నెఱవేర్చునిమిత్తము పంపినపుడు వారికి సమస్తశక్తులును ప్రసాదించబడును. ప్రకృతినియమములనన్నిటిని తమసత్సంగుల లాభము నిమిత్తమై ఏనియమముకావలెనన్న దానినే ఉల్లంఘించగల సామర్థ్యముగూడ వారికుండును. సంత్ సద్గురువుగూడ అట్లు ప్రకృతినియమములను ఉల్లంఘించినందుకు సహించవలసినట్లుగ భగవంతుడేర్పఱచిన శిక్షను తాను సంతోషముగ

సహించుటకు అంగీకరింతురు. అంతట పరమపురుషుడు ప్రసన్నుడై "ఆహా మాకు చాలసంతోషమైనది. అట్లయితే నీవు వెళ్ళి, లోకములో నుద్ధారకార్యము నెఱవేర్చిరమ్ము. నీవు నీసత్సంగులకొరకై నిమిత్తమై ప్రకృతినియమముల నెంతయధికాధికముగ నుల్లంఘించి, అందువలన గల్గు శిక్షల నెంతయధికముగ సహించెదవో, అంత యుత్కృష్టమైన మహాశ్వూరుడ వసిపించుకొందువు." అని చెప్పుచు వారిని భుజముమీద తట్టును. అప్పుడు సద్గురువు ప్రపంచమునకు వచ్చి తన కార్యమును సాగించుట మొదలుపెట్టును. తమసత్సంగులనిమిత్తమై వారు ప్రకృతినియమముల నతిక్రమించుచుందురు. ఒక్కొక్కసమయములో వారికి సత్సంగేతరులతోగూడ సంబంధముగలిగి అట్టివారికిగూడ సహాయము చేయవలసివచ్చును. వారికి సహాయమొనర్చునిమిత్తమై నియమోల్లంఘనము చేసినందువలన సహించవలసిన శిక్ష సత్సంగులనిమిత్తమై చేసిన నియమోల్లంఘనమునకు గల్గెడి శిక్ష కన్న వేఱువిధముగ నుండును. అందుచేత నిపుడు చూడుడేమైనదో. ఆగ్రాలోనున్న జానకీప్రసాదు డాక్టరుగారికి చాలజబ్బుచేసి ఆయన చనిపోవుటకు కొద్దిగంటలసేపుమాత్రమే మిగిలియుండెను. అప్పుడు సర్దార్ జీవగ్రైరాలు మాతో "జానకీప్రసాదు సత్సంగమునకు చాలసేవ చేయుచున్నారు. తమకుకూడా వైద్యము చేసిరి. ఆయనకు సహాయముచేయవలయు" నని చెప్పిరి. మేము ఆయన సత్సంగికాడు కావున ఆయనవిషయము మాతో చెప్పవద్దని చాలబోధించితిమి. కాని మాయింటిలోనివారందఱు పట్టుపట్టిరి. తప్పనిసరియగుటచే మేము, "సరే బండిని తీసికొనిరండు" అని చెప్పి, అచ్చటకు వెళ్ళి, జానకీప్రసాదుగారిని చూచి, ఆయనకొఱకు ప్రకృతినియమము నుల్లంఘించి, ఆయనకు ఆయుర్దాయము నిచ్చితిమి. ఆవ్యక్తి సత్సంగేతరుడు. ఈ పరిస్థితిలో ప్రకృతినియమములను భగ్నము చేసినపుడు సంత్ సద్గురువు అనుభవించవలసిన శిక్ష, ఒకదేశములో హత్యగావించిన అపరాధికి విధించబడు శిక్షవంటిదే యగును. అదికాక నట్టివాని యింటిలోని వారినందఱినిగూడ గానుగలోవేసి పిండిగుండచేయుదురు. పైగా అతనియిల్లువాకిలి దోపుడుచేయబడును. జానకీప్రసాదుగారికివచ్చిన జబ్బే నాకును, మాకుటుంబములోనందఱికినిగూడ వచ్చెను. అందుచేత నేను టెలిగ్రాము యిచ్చి జానకీప్రసాదుగారిని హోర్దా రప్పించినపుడు ఆయనతో, "సరిగా మీకువచ్చిన జబ్బువంటి జబ్బే నాకును వచ్చిన"దని చెప్పితిని. ఆయన వైద్యముచేయుట ప్రారంభించిరి. కాని రుగ్మతపరిస్థితి మఱింత చెడి

పోవుచుండెను. ఈశిక్ష మూలమున మేము కాలునిస్థానము అనగా మృత్యుస్థానముకన్న పైకి వెళ్ళవలసివచ్చెను. హార్డాలో వచ్చిన రుగ్ణతఅంతయు నీ కారణముచే గలిగెను.

సత్సంగికి సహాయార్థమై ప్రకృతినియమములకు భంగము కలుగజేసినపుడు మఱొకవిధముగ లెక్క చెప్పవలసియుండును. సంతసద్గురువు తమచరణములందు జేర్చుకొనవలసియున్న జీవులందఱిముఖములును వారు ప్రకటనమైనపుడే వారికి ఒక ఛాయాపటములో మొట్టమొదటనే కనపర్చబడును. ఒకముఖాకృతి దగ్గఱగ నుండవచ్చును. మఱొకటి దూరముగ నుండవచ్చును. కాని ముఖాకృతులన్నియు నొక్కసారిగ నే కన్పించును అప్పుడు సంత్ సద్గురువు తనపనిని సాగించుకొన నారంభించును. ఎప్పుడైన నొకక్రొత్త సత్సంగి వారియెదుటకు వచ్చినపుడు తాము అతనిని ముందుగనే చూచియున్నట్లు వారు గుర్తుపట్టుకొందురు. ఏలనన వారు అతని ముఖాకృతిని అంతకుముందే చూచియున్నారు. అట్టివారి సహాయార్థమై ప్రకృతినియమోల్లంఘన చేసినందుకు శిక్ష ఆయుల్లంఘనసమయములో నేమియు గలుగదు. ఆసంత్ సద్గురువు గుప్తముకావలసిన సమయము వచ్చినపు డాశిక్ష యీతీరున అనుభవించవలసివచ్చును. సంత్ సద్గురువునకు జీవితములో నెల్లపుడు భగవద్దర్శనము లభించుచునే యుండును. లోకములో నేమనిషియైనను పనిలేకుండ ఖాళీగానున్నపుడు బయటకుపోవుచుండును. ఇంతియేగాక నితరసమయములలోగూడ సామాన్యమానవుల మనస్సు బాహ్యముగనే ప్రసరించుచుండును. అట్లే సంత్ సద్గురువు సామాన్యముగ నెల్లపుడును, ఏపనిలేకుండ ఖాళీగానున్నపుడు ప్రధానముగను, ఆంతర్యమున నేకాగ్రత చెంది యుండి సదా భగవద్దర్శనమును పొందుచుందురు. లోకములోని జీవులకు గాలి యెంత అవసరమో సంత్ సద్గురువునకు భగవద్దర్శనము అంతఅవసరము. గాలి లేనిచో జీవుడు బ్రతుకనే లేడుకదా. ఆఖరున శరీరము చాలించుసమయములో సంత్ సద్గురువు అంతరంగమున తృతీయనేత్రమువద్దకు వెళ్ళిపోయినపుడు వారికి ఒక్కపెట్టున భగవద్దర్శనము అగుట ఆగిపోవును. అందుచేనపుడు వారికి చెపనలవికానంత బాధగ నుండును. అప్పుడు వారికి భగవద్దర్శనమునకు బదులుగా, తాము జీవితకాలములో నేయేసత్సంగులకు ప్రకృతినియమభంగ మొనర్చి సహాయముచేసిరో వారిముఖములన్నియు వరుసగ కన్పించ మొదలిడును. ఆవిధముగ నాముఖములన్నియు వారిముందునుండి త్వరితముగ వెడలిపోవును. అందులో

కొందఱినిమిత్తమై వారు చాలసార్లు ప్రకృతినియమములను భంగపఱచి యుండినచో అట్టిముఖములు తిరిగి తిరిగి కనుపడుచుండును. ఈవిధముగా 2 గంటలు, లేదా 4 గంటలు, లేదా 10 గంటలు కూడ నుండిపోవచ్చును. ఈ పరంపర సమాప్తమైనతోడనే వారికి భగవంతుడొక్కపెట్టున ప్రకటమై దర్శనమిచ్చును. అంతట వారు నిజధామమునకు వెడలిపోవుదురు. ఇంకొక విషయముకూడా సెలవిచ్చిరి. సత్సంగులు తమప్రాపంచికవిషయములనుగుఱించి, ఉత్తరములు, తంతివార్తలు, ప్రార్థనాపత్రములను పంపినపుడు సంత్ సద్గురువు వారలకు ఫలానావైద్యము చేసికొనుడనియు ఫలానా మందుమాకులుపుచ్చుకొనుమనియు సమాధానములు పంపుచుండుసందర్భములో వారేమియు ప్రకృతివిరుద్ధముగ ప్రవర్తించరు కావున నాపరిస్థితిలో వారికేమియు శిక్షననుభవించవలసిన పని యుండదు. అయినను సత్సంగులకు అందువలన లాభముగలుగును.

ఏసత్సంగికైన సహాయముచేయునిమిత్తమై సంత్ సద్గురువు భగవంతునికి ప్రార్థనచేసినచో తత్క్షణమే వారికీవిధముగుశ్రమ పడవలసినపరిస్థితి యేర్పడును అని హుజూరువారు సెలవిచ్చిరి. అట్లు సంత్ సద్గురువు ప్రార్థించినపుడు సత్సంగి గతించిపోవును, అనగా సత్సంగికి తత్క్షణమే కష్టము తొలగిపోవును, లేదా అతని కాపుదలకై తగినబందోబస్తు జరిగి, అతనికి సంరక్షణగలుగును. సంత్ సద్గురువు ప్రార్థించినపుడు, పరిస్థితిలో మార్పు వెంటనే రాకుండనుండుట అసంభవము వారిదివ్యేచ్ఛ యెట్లుండిన నట్లే పరిస్థితి వెంటనేమాఱిపోవును. వారిదివ్యేచ్ఛ సత్సంగికి ఆరోగ్యమివ్వవలయునని యున్నచో, అతనికి రోగనివృత్తి యగుట ప్రారంభించును, లేక వారి కతనిని బ్రతికించులాగున దివ్యేచ్ఛలేనిచో అతనికి కష్టపరిస్థితి వెంటనే తొలగిపోయి ప్రపంచమునుండి వెడలిపోవుట కేర్పాట్లు జరిగి పోవును.

# 184

## హుజూరువారిసూక్ష్మశరీరమునకు శిక్ష గల్గుట.

14 జనవరి 1921:— పండితమణిరాముగారు, పార్టీలోనివారందరును కాలచక్రము ఎదురుగనున్నసమయములో ప్రయాణముచేసిరని శాస్త్రములు చూచి, నేను ముందుగనే చెప్పియుంటినని విన్నవించెను. డిసెంబరు 8వ తేదీ వఱకు పార్టీవారికి కఠినకష్టములు గలుగవలసియుండెను. అంతట హుజూరు

వారు తమస్వానుభవమును పైకి తెల్పకూడకపోయినను చెప్పివేయుదుమని సెలవిచ్చిరి. ఈసారి మాకుకూడా మరణకార్యక్రమమంతయు పూర్తిగా కంటబడెను హుజూర్ రాధాస్వామీదయాళురు నన్ను తిరిగి వెళ్ళుమని ఆజ్ఞ యిచ్చినపుడు, నేనుతిరిగివచ్చి చనిపోయియున్న నాసూక్ష్మశరీరమును చూడగా, నలుగురు మనుష్యులు, నాల్గుత్రాళ్లుపెట్టి దానిమెడ గట్టిగాబిగించి, ఉరిదీయుచున్నట్లు కనపడిరి. అంతట నేను వారిని మీరు ఉరివేయుచున్న దెవరికి అని అడిగితిని, వారు వారణాసిలోని ఫలానా తారబాబు అను నాయనకని చెప్పిరి. ఆయన శరీరమున కురివేయుమని మాకు మాపై అధికారివద్దనుండి ఉత్తరువు వచ్చినది. మేము ఆయనగారిసజీవశరీరమును పట్టుకొనలేకపోయినందున, ఆయన మృతశరీరమునే ఉరితీయుచుంటిమి అనిచెప్పిరి. ఇంతటిలో మఱొకమనిషి అచ్చటికి వచ్చెను. హుజూరువారు ఆమనిషిని ఈశరీర మెవరిది అని అడుగగా, అతడింక నెక్కువగ వివరములు చెప్పినందున అది తమశరీరమేయని తమకు దృఢపడెనని సెలవిచ్చిరి. మీరు ఎందుకు ఉరిదీయుచున్నారని మేమడుగగా, వారు, "మాకు ఉత్తరువు ఆవిధముగ నున్న"దని చెప్పిరి. కారణమేమి అని అడుగగా వారు "మాకు తెలియదు. కాని నియమములను తెలిసియుండి బుద్ధిపూర్వకముగా భంగపఱచినవారికే ఇంతకఠినమైనఉరిశిక్షవిధింపబడును". అని సమాధానము చెప్పిరి. "యమదూతలేమనిషినైన చంపి తీసికొనిపోవుటకై వెళ్ళినపుడు ఆమనిషిని అట్లు తీసికొనిపోకుండ నెవరైనను తప్పించివేసినచో నట్టిశిక్ష గలుగునా?" అనిమేము ప్రశ్నించితిమి. అతడు ఔనని సమాధానము చెప్పెను. అప్పుడు మేము ఆత్రాళ్లు విప్పివేయుమని చెప్పితిమి. కాని అట్లొంతమాత్రము చేయజాలమని వారందఱు నేకగ్రీవముగ జవాబుచెప్పిరి. ఈశరీరము మాది, దీనికి త్రాళ్లు విప్పివేయుడని తిరిగి చెప్పితిమి కాని అట్లొంతమాత్రము చేయమని వారనిరి. అప్పుడు మేము రాధాస్వామీదయాళునిధ్యానముచేసి వారికేసి తీక్ష్ణదృష్టితోచూచి, "వెంటనే విప్పివేయు"డని ధాటిగా చెప్పితిమి. అపుడిక మాఱుచెప్పకుండా వారు చేతులుజోడించి "స్వామీ. ఇదిగో విప్పివేయుచున్నాము"అని చెప్పుచు, వెంటనే విప్పివేసి పారిపోయిరి. అప్పుడు ఆశరీరమును చూడగా, వారు దాని నెందుకు పనికిరాకుండ పూర్తిగపాడుచేసిరి. అట్లు చినిగిపోయినశరీరములో నేను ప్రవేశించు టెట్లు? ఒకచెయ్యి పూర్తిగా కాలిపోయినది. విచిత్రమేమనగా, పైనున్నస్థూలశరీరముమీదకూడ నిట్లుదహించునట్టి మందునే జల్లిరి. ఇపుడాశరీరమును చాలశ్రమపడి నెమ్మదిమీద బాగు

చేసుకొని, వెంటనే స్థూలశరీరములో ప్రవేశించి, పాలు, నీరు త్రాగితిని. అప్పుడా రెండుశరీరములును మెల్లమెల్లగా తయారగుట మొదలుపెట్టెను. ఈస్థూలశరీరముయొక్క బలహీనతకూడ సూక్ష్మశరీరముయొక్క దుర్బలత్వమువలననే గలిగినది. సత్సంగేతరులనిగూర్చి మేమింత ఉరిశిక్షను సహించి, కష్టములు, బాధలును పడినపుడు సత్సంగులకు కష్టములుగల్గుచున్నవని తలచుట కేవలమునొక మిథ్యాభ్రాంతికాదా ?

## 185

### ఈర్ష్యయొక్క ప్రమాదము.

15 జనవరి 1921:— హుజూరువారు మణిరామశాస్త్రిగారికిని, ఆయన సోదరునకును, ఈర్ష పెట్టుకొనకూడదని, మొట్టమొదట చెప్పి "నేను చరణాధారుని రమ్మని పిలిపించితిని కాని, మీతండ్రిశాస్త్రిగారు చనిపోయిననుకూడ మిమ్ములను పిలిపించలేదని, మీరు ఈర్షకులోనైపోయి, నాయందు తప్పుపట్టితి"రని సెలవిచ్చిరి. అంతట మణిరామశాస్త్రిగారి చిన్నసోదరుడు వెంటనే, తాము నిజముగా తప్పుచేసితిమని క్షమార్పణ వేడుకొనెను. తరువాత భేంటు ఎంతయిచ్చితిరని హుజూరువారు అడుగగా, చిన్నసోదరు డేమియు నీయలేదని చెప్పెను. మేము వెళ్లినపుడే శాస్త్రిగారిని రావద్దని మువ్మాఱు చెప్పితిమి. కాని మీరు పట్టుపట్టి పంపించితిరి. సత్సంగికి ఒకటి, రెండుసార్లు వద్దని సలహా చెప్పుదుము. వినక పోయినచో యథాసంభవముగా నతనికోర్కెను తీర్చివేయుదుము. ఇకముందునుంచి మేమెక్కువజాగ్రత్త పడవలసియున్నది. నేను శాస్త్రిగారితో, "మీరు తిరిగిరాజాల"రని కూడా ముందే చెప్పితిని. "అయినను పరవాలే"దని ఆయన జవాబు చెప్పిరి. అపుడు హుజూరువారు "మేము వీలున్నంతవఱకు సత్సంగులందఱిమనోరథములను పూర్తిచేసితిమి, కాని వీరిమనస్సే అట్టిది"అని సెలవిచ్చిరి. అపుడు వారు రాజబరారీలో జరిగిన యొకవిషయము నుదాహరణగా వివరించిరి. రాజబరారీలో నొక స్త్రీయొక్క కుమార్తె జబ్బుగనుండుటచే నామె మావద్దకు వచ్చి చెప్పుకొనగా, మేము అప్పుడు 104 డిగ్రీలజ్వరముతో నున్ననుగూడ ఆమెయింటికివెళ్ళి ఆపిల్లనుచూచి ఫలానామందు తెచ్చి వేసికొనుమని చెప్పితిమి. కాని ఆమందు అచ్చటదొరకనందున మాకు జ్వరముగనున్న పరిస్థితిలోనే యింటిలోనే నీళ్లు వేడిచేసి పంపితిమి, కాని ఆస్త్రీకి అదేమియు నచ్చలేదు ఆపిల్లకు జ్వరము మఱునాడుఉదయమునకు తగ్గిపోయెను. అతర్వాత శాంతికి జ్వరమురాగా మందిచ్చితిమి. మూడు, నాల్గుగంటలసేపటిలో తగ్గ

పోయెను. ఆ స్త్రీ "తనకుమారునకై తే తొందరగా తగ్గించివేసికొన్నారు. కాని పైవారల..." అనుచు ఆక్షేపణరూపముగ మాటలనెను. సత్సంగులపరిస్థితి యెట్లుండెనో దీనినిబట్టి నాకు బోధపడెను. ఇంక నేమిచెప్పను! ఇక ముందు నుంచి, సత్సంగులవిషయములో నీవిధముగ కలుగజేసికొనకుండునట్లు జాగ్రత్త పడవలయును.

## 186

హుజూరువారు తిరిగివచ్చుటనుగుఱించి

ఇప్పటినుంచి మఱి 10, 15 యేండ్లలో సత్సంగము చాలవృద్ధియైపోవును అప్పటిఅభివృద్ధితో నిప్పటిసత్సంగము పరిస్థితి పోల్చిన నెట్లుండుననగా, ఇప్పటి పరిస్థితితో పోల్చినచో స్వామిజీమహారాజు వారి కాలమునాటిసత్సంగ మున్న ట్లుండును. సత్సంగము బాగుగా నాల్గుప్రక్కలకు వ్యాపించినపుడు మాకు తిరిగిమఱొకసారి రావలయునని యున్నది. అప్పుడు మాశరీరము ఇంతకన్న చాలదృఢముగ నుండును. ధనసంపదలుగూడ నింతకన్న నెక్కువగ నుండును. అపుడు మేము అమెరికా వెళ్లెదము. గతించినయేడేండ్లలో గల్గినంతఅభివృద్ధి అయితే యీమూడున్నరసంవత్సరముల జీవితముతోనే చేయవచ్చును. అయితే చాలశ్రమ పడవలసివచ్చును.

## 187

సత్సంగముయొక్క అభివృద్ధినిగుఱించి.

25 జనవరి 1921:- మేమువచ్చినతర్వాత మొదటిమూడు, నాల్గుసంవత్సరములలోనే, సత్సంగము చాలఅభివృద్ధియయ్యెనని వారు మొదట వచనమును సెలవిచ్చుచుండిరి. సత్సంగమింతయెక్కువగా అభివృద్ధిచెందుటకు అసలు కారణమేమనగా సత్సంగులకు నూటికి 99పాళ్లు కోరికలు పూర్తియగుచుండెను కాబట్టి వృద్ధియయ్యెను, అప్పుడు దివ్యేచ్ఛకు శబ్దమును తీయుమని సెలవిచ్చిరి. ఈక్రిందిశబ్దమువచ్చెను.

"సతగురు ప్యారె నే లజాయే.
మాయా బ్రహ్మ ఖిలాడీ హో"

## 188

ఆపత్తులఅగ్నిహోత్రములోనుండి సత్సంగులు కాపాడబడుదురు.

8 ఫిబ్రవరి 1921:- ఈరోజున మొట్టమొదట నీజగమున సత్యవస్తువు కావలసినవారే లేరనువిషయముపైన వచనము సెలవీయబడెను. ఇచ్చట

సత్యవాదులకెప్పుడు కష్టములు, ఆపత్తులునే సంభవించుచుండెను. హాజరత్ మహమ్మద్ సాహబ్, ఏసుక్రీస్తుప్రభువు, హాజరత్ మంసూరుగారు, హాజరత్ అలీ వగైరాలందరికిని కష్టములే గలిగెను. తరువాత వారు, రాధాస్వామీదయాళురిసంతానమైనవారికే విరోధము చేయపూనుకొన్నారనియే మాకు మనస్సున చాలవిచారముగ నున్నదని సెలవిచ్చిరి. వాస్తవముగ నిచ్చట సత్సంగము అగ్నిగుండములో జరుగవలసియున్నది. ప్రపంచములో కష్టములు, ఆపత్తులు వచ్చెడిసమయము ప్రారంభమైనది. కొంతసేవచేయవలయునని మాకు కోరిక యున్నది. సత్సంగులు వీరైనంతవఱకీ అగ్నిహోత్రమునుండి తప్పించబడిపోవు చునేయుందురు. ఈవిషయమై మాకు చాలదృఢవిశ్వాస మున్నది. కాని సత్సం గులు త్వరలో గాబరావడిపోవుచుందురు. వీరి నిట్టిపరిస్థితిలో చూచినపుడు మాకు ఒకొక్కసారి బాధ గల్గుచుండును. సారబచన్ (పద్యభాగము) నుండిదివ్యే చ్ఛకుతీయగా నీ క్రిందిశబ్దమువచ్చెను.

"సజో మన యహ దుఖ సుఖ కా థాన్,
లగో తుమ చఢ కర్ అబ్ సతనామ్"

## 189

సత్సంగులవిషయములో హుజూరువారిదయ.

---

4 ఫిబ్రవరి 1921:- సత్సంగులసౌకర్యమునిమిత్తమై మనకు భూమి కావలెనని మొదటసెలవిచ్చిరి. ఆతర్వాత జాలిపడుచు, సత్సంగులందఱు చాలకష్టపడుచున్నారని చెప్పిరి. ఆర్స్నకాల్ జీకన్న, ఒకలక్షరూపాయలు ఖర్చుపెట్టి స్కూలునే అభివృద్ధిచేయవలయునని మాయుద్దేశ్యమని సెలవిచ్చి, తిరిగి నిజముగ నారుగ్నెలమూలమున నే ఒకగంటలోపుననే కాలేజీకిచందాఅంతయు పూర్తిఅయిపోయెను. ఇదంతయు పూర్ణవిశ్వాసముండుటవలననే అట్లయ్యెనుకదా, యని ఆసమయములో నాహృదయము ఉత్కంఠాభరితమయ్యెనని సెలవిచ్చిరి. మేముకూడా రాధాస్వామీదయాళురికి, సత్సంగులందఱును దుఃఖితులై యున్నారని విన్నవించితిమి. వీరు రాధాస్వామీదయాళునిదయకు వాస్తవముగ పాత్రులైరి. అప్పుడు దివ్యేచ్ఛకు శబ్దమునుతీయగా సారబచన్ (పద్యభాగము) లో నీక్రిందిశబ్దమువచ్చెను.

సురత్ తూ దుఖీ రహే హమ జానీ"

# 190

## సత్సంగములో చేరుటకు షరతులు.

## టిక్కెట్లులేకుండ ప్రయాణము చేసిన సత్సంగికి సలహా.

31 మార్చి 1921:- మద్రాసునుండి క్రొత్తగావచ్చినవారితో రాధాస్వామీమతమునుగుఱించి ప్రొద్దున చర్చజరిగినందున వారికి రాధాస్వామీ మతము అవగాహనమైనదా యని, హుజూరువారు వారిని ప్రశ్నించిరి. తిరిగి వారిని మాధవరావునాయుడుగారిద్వారా యీమతములో జేరుటకు అవసరమైనషరతులు బోధపడినవా యని అడిగించిరి. అనగా రాధాస్వామీనామము పరమపురుషునినిజనామమని నమ్మవలెను. సద్గురువు పరమపురుషునితో నైక్యమైయుందురు కావున సద్గురువును భగవంతునిగా తెలుసుకొని వారిరూపమునే ధ్యానముచేయువలయును ఏలననగా, నీ వెవరిని ధ్యానముచేయుచుందువో, వారిననుసరించియే భావములు నీలో నుద్భవించుచుండును. సద్గురువొక్కరే యీప్రపంచములో ప్రవర్తించుచున్నను, ఇందలిసుఖదుఃఖములతో నిమిత్తము లేకుండగ నెల్లప్పుడు భగవంతునిదర్శనానందములో మగ్నులైయుండు పురుషులు. అందుచే వారిని ధ్యానముచేయుట అత్యావసరము. సంత్ సద్గురుని ధ్యానము చేసినచో సహాయము చేకూరును. మదరాసువారీషరతునుగూడ అంగీకరించిరి. పిమ్మట మద్యమాంసములనుగూడ విడిచిపెట్టుట కంగీకరించిరి.

దండప్రణామములు చేయుసమయములో బీహారుదేశపుసత్సంగి ఒకడు చాలబీదవాడు వచ్చి ఒకరూపాయి భేంటునివ్వబోయెను. అతడు 9 దినములై వచ్చి దయాల్బాగులో కనిపెట్టుకొనియుండెను. అతనిని అంబాలా యేందుకు రాలేదని అడిగిరి. అక్కడికి వచ్చుటకు టిక్కెట్టుఖర్చుకు డబ్బులేదనియు, నిచ్చటికికూడా టిక్కెట్టులేకుండగనే వచ్చితిననియు, నతడు చెప్పెను. హుజూరువారు అట్లుచేయుట తప్పనియు, నట్లెందుకు చేసితివనియు, ప్రశ్నించిరి. ఆసత్సంగి "బీదవాడనగుటచే నట్లుచేసితిని, నాదగ్గఱ డబ్బులేదు ఈజీవితములో నాకెట్లైనను డబ్బుఉండనే ఉండదు. కావున దర్శనము అసలే లేకుండ నుండిపోవుదునుకదా! ఏమైననౌగాక వారేదిక్కు నాకని నమ్ముకొని బయల్దేరి, రైలుబండియెక్కి వచ్చితిని. సద్గురునిసహాయముండుటచే త్రోవలో నెవరును నన్ను అడ్డుపెట్టలేదు. త్రోవలో ఎనిమిదిఅణాలు మాత్రమే నాకు ఖర్చుఅయినవి. ఇప్పుడిచ్చట వర్కుషాపు ( work shop)లో పనిచేయుచు కాలక్షేపము చేయుచుం

టెని" అని మనవిచేసుకొనెను. హుజూరువారు అతనిని ఇంకను కొన్నిరోజులు పనిచేసుకొని తిరుగుప్రయాణమునకు కావలసిన డబ్బు సంపాదించుకొన్న పిదప వెడలిపోవలెనని సెలవిచ్చిరి. టిక్కెట్టు లేకుండా రావద్దని చెప్పి తిరిగి రూపాయి భేంటుపద్దు ఒక్క అణామాత్రమే భేంటు యిమ్మని బిగ్గరగా సెలవిచ్చిరి. అతడు తన తల్లికి జబ్బుగ నున్నదనియు నామె తనకొఱకై యెదురు చూచుచుండున నియు నాలుగైదు రోజులే ఉండి వెడలిపోదుననియు చెప్పుకొనెను. అతడు చాలపట్టుపట్టినందున నతని వద్ద ఒక్కరూపాయి భేంటు పుచ్చుకొనుట కంగీకరించి వెడలిపోవునపు డతనికి సత్సంగమునుండి టిక్కెట్టుఖర్చు యిప్పించులాగున నుత్తరువుచేసిరి.

## 191

(బచన్)

తిరిగి రాజబరారీవిషయమునుగుఱించి చెప్పుచు, హుజూరువారు తమకు మహారాజసాహబ్ వారిదర్శనము ముమ్మారు లభించెనని సెలవిచ్చిరి. ఒకసారి రాజబరారీవెళ్ళినపుడు దర్శనమయ్యెను. మొట్టమొదట సర్కార్ సాహబ్ వారి దర్శనము లభించెను. సంతులలో నొక్కొక్కరికి ఒక్కొక్కమండలము వేలు వేలుగ నున్నది. అచ్చట, ఇచ్చటజరుగునట్లుగా సంభాషణలు జరుగవు. అచ్చట కాలము దేశము అనునవి లేవు. తన కొమారుడ్రైన ప్రియమైనకృత్యము చేసినపుడు తండ్రిసంతసించినట్లే, సర్కార్ సాహబ్ వారు నన్ను చూచి మహా ప్రసన్నులైరి. "మహారాజసాహబ్ వారివద్దకుకూడారమ్ము వెళ్లుదము."అని సెలవిచ్చిరి. వారుకూడ నాపైన మహాశోభాయమానము, మహోదయాభరితమ్మునైన దృష్టిని ప్రసరించి చాలసంతోషము చూపిరి. వారు నన్ను హుజూర్ మహారాజ్ వారిసన్నిధికి గొనిపోయిరి. పిమ్మట హుజూర్ మహారాజ్ వారు నన్ను స్వామీజీమహారాజ్ వారివద్దకు తీసికొనివెళ్లిరి. స్వామీజీ మహారాజ్ వారి దర్శనము చేసికొనవలయునని మాకు మహాభిలాషయుండుటచే వారిదర్శనము కూడ లభ్యమయ్యెను. వారుమహాసంతుష్టి కనపరచి "చాలచురుకుగా పనిపూర్తిచేసితివే వహావా" అని నుడివిరి. ఆతరువాత సాహబ్జీవారు తమకు గురునానక్ సాహబ్ వారి దర్శనము చేసుకొనవలెనని యున్నదనియు, వారిదర్శనము కూడ చేసికొంటిమనియు సెలవిచ్చిరి. వారితో కలసి మఱియిరువదిమంది కూడ వారి ధామములో కనపడిరి. ఆతరువాత సత్సంగులను గూడ చూచితిమని చెప్పుచు

చాలమంది సత్సంగులు సహస్రదళకమలములోను, కొద్దిమంది త్రికుటిలోను చాలతక్కువమంది అంతకుపైనను ఉన్నారని సెలవిచ్చిరి. శాస్త్రిగారిని కూడా చూచితిమని సెలవిచ్చిరి. సత్సంగులకు సద్గురువునందు ప్రీతియు, నిజధామమును చేరుకొనవలయుననెడి ఆసక్తియు లేకపోవుట చూడగా తమకు చాల విచారమగుచున్నదని సెలవిచ్చిరి. అట్టిప్రేమయు, ఆసక్తియు నున్నయెడల కష్టమేముండగలదని సెలవిచ్చిరి. హుజూర్ మహారాజు స్వామీజీ మహారాజువార్ల కాలములోని సత్సంగులు ప్రేమీభక్తులైనచో, నిరర్గళముగ నీపాటికి నిజధామమును పొందియుండెడివారు. హుజూరువారు సత్సంగులు ముఖ్యముగా ఒకజన్మలోను తప్పినచో రెండుజన్మలలోనైనను తప్పకుండ నీజీవితమునుండి విముక్తి పొందవలయునని తమకు మనస్సున తీవ్రమైన ఆసక్తి బయల్దేరుచుండునని సెలవిచ్చిరి ఎంతశోచనీయము! జనుల కేమియు తెలియుటయే లేదు! ఈజీవితమనగా నిజమునకు కారాగృహమే, మృత్యువనగనే స్వాతంత్ర్యము, జీవితములో నొకప్పుడు కడుపునొప్పియు, మఱొకప్పుడు నడుమునొప్పియు, అట్లే అనేకవిధములైన బాధలు గల్గుచునే యుండును. దీనినుండి విముక్తియే శ్రేష్ఠము. కాముకునికి కామినియందును. పిల్లకు తల్లియందును గల ప్రేమ వంటిప్రేమ యేసత్సంగి కైనను గలదా?

హుజూరువారు అసలైనమాట చెప్పుచుంటిమి వినుడని హెచ్చరించి సత్సంగి యేపనిచేయుచున్నను. ఆపని యెంతగొప్పపనియైనను, ఒకపెద్దగవర్నర్ జనరల్‌గారి వద్ద సావధానముగ కనిపెట్టుకొనియుండవలసినంత బాధ్యతగల పనియైనను గూడ అయిదేసినిమిషములతర్వాత నొక్కొక్కసారి 2, 3నిమిషముల, సేపు తప్పక స్మరణధ్యానములు చేయుచుండవలయునని బోధించిరి. సద్గురుధ్యానముచేయుటచే చిత్తమునకు నిర్మలత్వము గల్గును. ప్రాపంచికకార్యములలోనవి యెంతశ్రేయస్కరమని తోచినను గూడ, నెక్కువగా లిప్తమైపోకుడదు. ఇది చాలముఖ్యముగ జ్ఞాపకముంచుకొనదగియున్నది. ఏదైన సేవచేయుచున్నను కేవలము అవసానకాల మాసన్నమైన రోగికే పరిచర్యచేయుచున్నను. లేదా మఱేమిచేయుచున్నను సరే సద్గురునిస్మరణ ధ్యానములు అత్యాతురతతో చేయుచుండవలయును. సత్సంగి ధైర్యోత్సాహములతో ప్రయత్నించినచో నిందేమియు కష్టములేదు. మొదటలో తనకుచేతనైనంత వఱకు ప్రయత్నము చేసిన చాలును, స్మరణధ్యానములు అత్యుత్సాహముతోను అప్రయత్నముగను.

వాటంతట నవియే సాగిపోవునంతటి మెలకువ, నిజమునకు, కొంతకాలమట్లు ప్రయత్నముచేసినపిమ్మటనే చేకూరగలదు. అయిదునిమిషములైన పిమ్మట వెంటనే స్మరణధ్యానములు చేయుటవరాకు పడినచో సత్సంగి ముఖమంతయు నొక్కపెట్టున నెత్తురు లేకుండపాలిపోయి, అతడు తల్లికొఱకై చంటిపిల్ల వెక్కివెక్కియేడ్చినట్లుగనే విలపించవలయును. భక్తుడట్లు చేసినచో భగవంతుడు నిస్సంశయముగ నతనిని కనిపెట్టిచూచును. అప్పుడు మహరాజ్ నకు శబ్దము దీయగా నీక్రింది శబ్దము వచ్చెను.

"గురూ కా ధ్యాన కర ప్యారే, బినా ఇస్కే నహీఁఛుటనా,
నామ కే రంగ మేఁ రంగ జా, మిలే తోహీఁ ధామ నిజ అపనా.

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

కహేఁ రాధాస్వామీ సమఝాఈ
గహో అబ్ నామ కీ సరనా ।"

 సమాప్తము 

